# లలితవిస్తరం

(బుద్ధభగవానుని భవ్య జీవిత చరితం)





అనువాదం :

తిరుమల రామచంద్ర

బులుసు వేంకటరమణయ్య

ప్రథమముద్రణ : 1969

సర్వస్వామ్యములు :
అనువాదకులవి

వెల : 100/80




ప్రాప్తిస్థానం :
శ్రీ బులుసు వేంకటరమణయ్య,
34, పురుషోత్తమనగర్,
క్రోమ్‌పేట, మద్రాసు-44.

ముద్రణ :
ఫ్రీడమ్ ప్రెస్,
138-A, టి. హెచ్. రోడ్,
మద్రాసు-21.

# మనవి మాటలు

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించిన సంచికలలో 'అక్షరము' అనే శీర్షికకింద లలిత విస్తరమనే ప్రాచీన బౌద్ధ గ్రంథంలో 64 లిపులు ఉల్లేఖించబడినవి. అది చదివినప్పుడే లలిత విస్తరాన్ని ఆంధ్రావనికి అందివ్వాలనే ఆశ పొటమరించింది, కాని, ఆ ఆశ దాదాపు నాలుగు దశాబ్దాలకు గాని తీరలేదు.

లలిత విస్తరాన్ని దాదాపు 70 సంవత్సరాల క్రితం జర్మనీలోని హిండెన్ బర్గ్ విశ్వవిద్యాలయం ఆచార్యుడు డాక్టర్ ఎస్. లేప్‌మాన్ పరిష్కరించి దేవనాగరి లిపిలో ముద్రించారు. ఇటీవల ఏడేళ్ల క్రితం పాట్నా విశ్వ విద్యాలయాచార్యులు డాక్టర్ ఎ ఎల్. వైద్య పరిష్కరించి ప్రచురించారు. కాని ఈ అనువాదం, ప్రాచీనమనే దృష్టితో డాక్టర్ లేప్‌మాన్ ప్రతినే అనుసరించింది.

ఈ లలిత విస్తరాన్ని అనుసరించే నాగార్జున కొండ, అమరావతి శిల్పాలు వెలిశాయి. ఇండోనీషియాలోని బోరో బుదూరు శిల్పాలు లలిత విస్తర లక్ష్యాలని డాక్టర్ సునీతి కుమార ఛటర్జీగారు మాతో అన్నారు.

ఈ అనువాదం 1962 మార్చినుంచి సంవత్సరం పైగా ఆంధ్ర ప్రభ ఆదివారం సంచికలలో ధారావాహికంగా ప్రచురితమయింది. ఆ పత్రిక సంపాదకులకు కృతజ్ఞత తెలుపుకొనడం మా విధి. మూల సంస్కృతంలో బౌద్ధేతర వాఙ్మయ నిఘంటువులలో కనిపించని అనేక పదాలు అర్థాలు తెలియనందున ప్రతారణ చేయడం పాపమని భావించి వాటిని యథామూలంగానే గ్రహించాము. సంప్రదాయజ్ఞులు అనువాదంలోని లోపాలు తెలిపితే రెండవ ముద్రణలో సగౌరవంగా దిద్దుకుంటాము. ఇది చీనాభాషలో యథామూలంగానూ,

కొన్ని విదేశభాషలలో సంగ్రహంగానూ అనూదితమయింది. దీని కథను శ్రీ రాజేంద్రలాల్ మైత్ర ఆంగ్లంలో సంగ్రహంగా వ్రాశారు. జపాన్ విద్వాంసుడు 'గౌరవార్హ' సుసోకీ దీనిని ఆంగ్లం లోకి పూర్తిగా అనువదించినట్లు శ్రీ ఎల్లావల నందీశ్వరమహాథేరో తెలిపారు. భారతదేశభాషలలో ఇది అనూదితం కాలేదు, మా అను వాదం భారతీయ భాషలలో తొలిది కావడం మాకు గర్వకారణం.

పూజ్యులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి మంగళా శాసనములు, మిత్రులు విద్వాన్ విశ్వం, వాకాటి పాండురంగరావు, గరిమెళ్ళ వెంకట సీతారాంగార్లవంటి వారి ప్రోత్సాహ ప్రేరణలు లేకపోతే ఇది అచ్చయ్యేదే కాదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు దీని ముద్రణకు వేయి రూపాయలు సహాయం చేశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురాతత్త్వ శాఖవారు నాగార్జున కొండ శిల్పాల ప్రతికృతులను ముద్రించుకొనడానికి అనుమ తించారు. వీరి కందరికీ కృతజ్ఞతాపూర్వక వందనాలు.

దీనిని గౌరవార్హులు శ్రీ ఎల్లావల నందీశ్వర మహాథేరో [బి. ఎ. (లండన్); ఎం. ఎ.; ఎం. లిట్] గారికి అంకితమిస్తు న్నందుకు చాల ఆనందిస్తున్నాము. వీరు భారతదేశంలో లంక మహాబోధి సొసైటీ డైరెక్టరు, మహావిద్వాంసులు.

ఫ్రీడం ప్రెస్ యజమానులు శ్రీ మన్నె బాలసుందరం, వారి సోదరులు మన్నె త్యాగరాజన్ మా మిత్రులు. ఈ పుస్తకం ముద్రణ వారికి అప్పగించి మేము నిశ్చింతగా ఉన్నాము. దానికి అనుగుణంగా పుస్తకం చక్కగా అచ్చయింది. వారికి ధన్యవాదాలు.

| | |
|---|---|
| మదరాసు<br>సౌమ్య-శ్రావణ-పూర్ణిమ, | భాషా సేవకులు :<br>తిరుమల రామచంద్ర,<br>బులుసు వేంకటరమణయ్య |

# అంకితం



'గౌరవార్హ'
శ్రీ ఎల్లావల నందీశ్వర మహాథేరో గారి
దివ్యసన్నిధికి

# విషయసూచిక

# ప్రవేశిక

[లలితవిస్తరం మహాయానబౌద్ధుల ప్రమాణగ్రంథం. దీని సంప్రదాయాలు తెలుసుకొనడానికి బౌద్ధమతం స్థూలంగా తెలియడం అవసరం గనుక 'పరిశోధన' బుద్ధజయంతి సంచికలోనూ, ఇతరత్రా పలువురు విద్వాంసులు వ్రాసిన వ్యాసాల సారాంశం క్రోడీకరించి ప్రవేశికగా అందజేస్తున్నాము.]

తెలుగుదేశంలో బౌద్ధం ఎప్పటినుండి పరివ్యాప్తమైనదో తెలియదు. కాని, బుద్ధుడు జీవించి యుండగనే ఆ మహామహుని బోధలు దక్షిణాపథ వాసుల హృదయాలను ఆకర్షించిన వనుటకు ఆధార మున్నది. దక్షిణాపథ నివాసియైన నటు డొకడు బుద్ధుని సమకాలికు డయిన బిందుసారమహీపతి సమక్షమున మహాసంబోధివరకు బుద్ధజీవితాన్ని నాటకంగా ప్రదర్శించెననీ, దక్షిణాపథంనుంచి వెళ్లిన మరికొందరు నటులు శోభావతీ నగరాధిపతి సమక్షమున బుద్ధనాటకాన్ని ప్రదర్శించినారనీ, అందులో సూత్రధారుడే బుద్ధవేషాన్నీ, తదితరులు బౌద్ధ భిక్షుల పాత్రలనూ ధరించారనీ టిబెట్టుదేశ బౌద్ధగ్రంథాలవల్ల తెలుస్తుంది. బుద్ధుని ప్రధాన శిష్యులలో ఒక డయిన మహాకాత్యాయనుడు ఒక అస్సకరాజుకు బౌద్ధదీక్ష యిచ్చినట్లు విమానవత్థు వ్యాఖ్యలో ఉంది. అస్సకమన్నది తెలంగాణాలోని యిప్పటి నిజామాబాదు జిల్లా ప్రాంతము. దీనికి పోతన రాజధాని. పోతన ఇప్పటి నిజామాబాదు జిల్లాలోని బోధన.

బుద్ధుని జీవితకాలంలో కాకపోయినా, బౌద్ధం ఆయన నిర్వాణం పొందిన కొద్ది కాలానికే తెలుగుదేశంలోని భాగమైన కళింగదేశంలో వ్యాపించింది. దహనమైన వెనుక చితినుండి బుద్ధుని ఎడమకోర పంటిని తీసి జాగ్రత్తపెట్టి ఖేమాధేరుడనే ముని కళింగదేశాధిపతి కిస్తే ఆ రాజు దాని కొక రత్నకరండం చేయించి దానిలో పెట్టి పూజిస్తూ వచ్చాడు. ఆ రాజు రాజధాని దంతపురం. బుద్ధదంత మహిమలవల్ల బౌద్ధ వాఙ్మయంలో చాలా ప్రసిద్ధి చెందింది. ఈ దంతధాతువుకోసం కళింగంమీదికి ఎందరు రాజులో దండెత్తి వచ్చారు, దానిని బలిమి నైనా తీసుకుపోవా లనే ఉద్దేశంతో. చివర కా దంతధాతువు సింహళద్వీపానికి వెళ్ళింది. ఇప్పటికీ అది అక్కడుం ధంటారు.

బుద్ధుడు తాను జీవించి ఉన్నంతకాలము సాంఘికులలో అభిప్రాయ భేదాలవల్ల చీలికలు రాకుండా ఆపు చేశాడు. ఆయన నిర్వాణం పొందిన తరువాత బౌద్ధసాంఘికులలో బుద్ధు డుపదేశించిన ధర్మాల విషయంలో అభిప్రాయభేదం కలిగింది. అప్పుడు సప్రమాణంగా బౌద్ధ ధర్మాన్ని గ్రంథస్థం చేయుటకు అజాతశత్రుని ఆదరణక్రింద రాజగృహంలో ఒక గొప్ప బౌద్ధ మహాసభ జరిగింది. దీనిలో బౌద్ధధర్మం నిర్వచింపబడి గ్రంథస్థం అయింది. అటుతరువాత బుద్ధుడు గతించిన వంద సంవత్సరాలకు వేసాలిలోని వజ్జి కులమువారు (దాశవత్థూని) దశవస్తువుల విషయంలో ప్రాచీనాచారం ఉల్లంఘిస్తూ వచ్చారు. ఈ దశవస్తువులలో బౌద్ధసాంఘికులు స్వర్ణరజతములను పరిగ్రహించకూడదు; మద్యపానం చేయకూడదు. ఈ విషయాన్ని విచారించి అచారనిర్ణయం చేయుటకు రెండవమారు బౌద్ధ మహాసభ వైశాలిలో సమావేశమయింది. ధేరులు ఈ దశవస్తువుల విషయమున ప్రాచీనాచారం ఉల్లంఘించిన సాంఘికులను బహిష్కరించారు; ధర్మం నిర్ణయించారు. పదివేలమంది భిక్కులు ధేర సంఘాన్ని విడిచిపెట్టి పోయినారు. వీరే అధిక సంఖ్యాకులుగా ఉండడంవల్ల ఈ వర్గంవారికి మహా పాంఘికు లని పేరు కలిగింది. అప్పటినుండి బౌద్ధసంఘం ధేరు లని, మహా సాంఘికులని రెండు పక్షా లయింది. ధేరులు శీలమునకు, నీతికి, ఆచారమునకు ప్రాధాన్య మిస్తే - మహాసాంఘికులు తత్వవిచారమునకు, లోకోపకార విషయములకు ప్రాముఖ్యం ఇచ్చారు. ధేర సంప్రదాయంలోని ఒక శాఖకు విభజ్య వాదమని పేరు. అశోకచక్రవర్తి ఈ సంప్రదాయంవారిని అధికంగా ఆదరించాడు. అశోకచక్రవర్తి కాలంలో పాటలీపుత్రనగరమూ, మగధదేశమూ భారతదేశంలో బౌద్ధానికి కేంద్రా లయినవి. మౌర్యులకు తరువాత మగధను పాలించిన శుంగవంశజులు, కాణ్వవంశజులు బౌద్ధులను హింసించడం వల్ల ధేరవాదులు సింహళ గాంధారములకూ, మహాసాంఘికులు తెలుగు దేశానికి వలస పోయినారు. మౌర్యసామ్రాజ్యం పతన మైనతరువాత హిందూదేశంలో బౌద్ధానికి ఆంధ్రదేశమే కేంద్రమయింది.



మహాదేవధేరు డనే ముని ఆంధ్రదేశానికి వచ్చి ఇచ్చట చైత్యక సంప్రదాయం స్థాపించాడు. మహాసాంఘికులలోని ఆరు సంప్రదాయములలో ఈ చైత్యక సంప్రదాయం ఒకటి. గోకులిక, ఏకవ్యవహారిక, ప్రజ్ఞప్తివాద, బహుశ్రుతీయ, లోకోత్తరవాద సంప్రదాయములు మిగిలినవి. మహావస్తులో ఉన్నట్టు మహాచైత్యపూజకు ఎక్కువ ప్రాముఖ్య మివ్వడంవల్లనేమో ఈ నంప్రదాయానికి చైత్యక సంప్రదాయ మని పేరు వచ్చింది. చైత్యక సంప్రదాయంవారికి ధనకటకం - అంటే అమరావతి కేంద్ర మయినది, ఈ చైత్యకులలో మరల పూర్వశైల, అపరశైల, రాజగిరిక, సిద్ధార్థకము లని మళ్ళీ నాలుగు సంప్రదాయము లేర్పడినవి. ఈ చైత్యకులు అంధకులు - ఆంధ్రదేశంలోని వారు. పూర్వశైల మన్నది ధనకటక మహాచైత్యమునకు తూర్పున, అపరశైలము ఆ మహాచైత్యమునకు పడమట నున్న బౌద్ధ సంఘములపేరు. పూర్వశైలము ఇప్పటి గంటసాల, అపరశైల మిప్పటి నాగార్జునునికొండ కావచ్చునేమో। నాగార్జునునికొండ శాసనములలో బహుశ్రుతీయులు, అపరశైలీయులు, పూర్వశైలీయులు, రాజగిరికులు, విభజ్యవాదులు మొదలైన వేరు వేరు సంప్రదాయాలవారు ఉదాహృతు లయినారు. వీరందరు అక్కడి విహారాలలో ఉండినట్లు ఊహింపవచ్చును. టిబెట్టుదేశ ఐతిహ్యమును అనుసరించి పూర్వశైల అపరశైల నికాయములవారు ప్రాకృతభాషలో రచించిన ప్రజ్ఞాపారమిత అనే గ్రంథం ఉండేదనీ, దీనిలోనే మహాయానమునకు సంబంధించిన భావాలు బీజ

ప్రాయంగా ఉండే వనీ, ఇవి మహాయాన సంప్రదాయం రూపొందడానికి చాలా తోడ్పడిన వనీ పరిశోధక పండితు లంటారు. కనిష్కచక్రవర్తి నాలుగవతడవ బౌద్ధసభను సమావేశపరిచే నాటికే మహాయానమునకు సంబంధించిన భావాలు దేశ మంతటా పొటమరించి ఉన్నవి. వాటి కొక రూప మిచ్చి ఒక గొప్ప సంప్రదాయం మహాయానంగా రూపొందించినఆయన నాగార్జునాచార్యులవారు.

మహాయానం రూపొందడంతో బౌద్ధం ప్రతివ్యక్తికీ, ప్రతి గృహస్థుకూ అందుబాటులోనికి వచ్చింది. బౌద్ధం బహువ్యాప్త మయింది. అంతటి నుంచి బౌద్ధంలో తత్వజిజ్ఞాస ఎక్కు వయింది. నాగార్జునాచార్యులవారు తత్వవిచారము కావించి శూన్యవాదం ప్రతిపాదించారు, కాని దీనితో సాంఘికులకు తృప్తి కలుగలేదు. అపుడు మైత్రేయనాథుడు విజ్ఞాన వాదము ను ప్రతిపాదించాడు. నిర్వాణం పొందిన తరువాత మిగిలేది శూన్యమని నాగార్జునాచార్యులవా రంటే విజ్ఞానమని మైత్రేయనాథు డన్నాడు. విజ్ఞాన వాదమునకే యోగాచారవాద మనిన్నీ పేరు. ఇంకను బౌద్ధంలో తత్వ విచారం ముదిరి విజ్ఞానానికి మహాసుఖం కూడా కలిపింది. ఈ మహాసుఖ వాదంలోనుంచే వజ్రయానం ఆవిర్భవించింది, బౌద్ధం పొందిన దశలలో ఇది కడపటిది. వజ్రయానం రావడంవల్ల బౌద్ధంలో సంఖ్యాతీతంగా దేవీ దేవతలు వెలిశారు. విగ్రహనిర్మాణం ప్రబలింది. అమరావతిలో దొరకిన సింహనాద, పద్మపాణి. బుద్ధసంభవరత్నము లనే విగ్రహాలు వజ్రయానానికి సంబంధించినవే! దీనిలో తాంత్రికపూజ, వామాచారం ప్రబలి బౌద్ధం ప్రజాదరం కోల్పోయింది, బౌద్ధం బాగా వర్ధిల్లిననాడు నాగార్జునునికొండ, ధనకటకాలు గొప్ప బౌద్ధ విద్యా పీఠాలుగా ఉండేవి. వీటికి దేశాంతరాల నుంచీ, ద్వీపాంతరాలనుంచీ కూడా విద్యా సముపార్జనం నిమిత్తం బౌద్ధ భిక్షులు వస్తూ వుండేవారు. దేశంలోని ధనకటకాది స్తూపాలలోని శిల్ప చిత్రాలు కావ్యశోభను సంతరించుకొన్నవి. తెలుగుదేశపు స్తూపాలు బౌద్ధాంధ్రులు బుద్ధ భగవానునికి భక్తి సంభరితులై ఎత్తిన శిల్ప కర్పూర దివ్య నీరాజనాలు!



మహాయానం మూలంగానే బౌద్ధంలో కళకు తా వేర్పడింది. నాగార్జునాచార్య శ్రీపాదులు ఎంతటి తాత్విక విచారశీలియో, ఎంతటి లోక హితైషియో అంతటి కళాప్రియుడు. ధనకటక మహాచైతన్యంచుట్టూ శిల్పచిత్ర రత్నాలతో పొదిగిన మహాప్రాకారం నిర్మించినది ఆయనే అని టిబెట్టు దేశ చరిత్రలు చెపుతవి. ఈ ప్రాకారంలోని ప్రతి శిల్పచిత్రమూ జీవం ఉట్టిపడుతూ, నిన్ననో మొన్ననో చెక్కినట్లు కలకలలాడుతూ ప్రాతఃకాలంలో విరిసిన నవమల్లికా కుసుమంలాగ అచ్ఛస్వచ్ఛంగా ఉంటవి. ధనకటక మహాచైత్య ప్రాకారంలోని శిల్పచిత్రాలే కాదు. నాగార్జునునికొండ, గుమ్మడి దుర్రు, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి ఈ మొదలైనచోట్ల ఉన్న స్తూపశిల్ప చిత్రాలు కూడా ధనకటక ప్రాకార శిల్పచిత్రాలకు తీసిపోయేవి కావు. తెలుగు దేశంలో బౌద్ధం అవతరించి తెలుగుజాతిని కళావంతము చేసింది; తెలుగు శిల్పి కృతులలో అమృతం చిలికింది. అందువల్లనే అంతకు పూర్వపు బౌద్ధ క్షేత్రాలలో స్తూపశిల్పచిత్రాలు వట్టి నీరసప్రతిమలైతే తెలుగు మహాయాన మవతరించి ఆదిమ బౌద్ధముస్వరూపభావములనే పూర్తిగా మార్చివేసింది. హీనయాన బౌద్ధుడు తన నిర్వాణమునకే - తన సంసార దుఃఖ విమోచనమునకే - తన అర్హతపదమునకే కృషి చేసే స్వార్థపరుడు. మహాయానవాది అట్లు కాదు. అతనికి అవలోకితేశ్వరుడు ఆదర్శము. అతడు బోధిసత్త్వుడు. మహాయానములో బోధిసత్త్వు లనేకులు ఉదయించారు. వేరువేరు మనఃపరిణతులు గల వేరువేరు వ్యక్తులకు నిర్వాణం సాధించడం కోసం తోడ్పడేటందుకు వచ్చినవారు బోధిసత్త్వులు. నిర్వాణం పొందుటకు సిద్ధంగా ఉండి కూడా లోకంలోని ప్రతివ్యక్తి నిర్వాణం పొందితే కాని తన కక్కర లేదని నిరాకరించి సర్వలోకహితైషియై ప్రవర్తించాడు బోధిసత్త్వుడు. ఇటువంటి బోధిసత్త్వులు జనులకు తోడ్పడుటకు సృజింపబడినవారు వందలూ వేలూను. అందుచేతనే మహాయానానికి బోధిసత్త్వయానమని కూడా పేరు వచ్చింది. బౌద్ధం విశ్వవ్యాప్తి పొందినది మన తెలుగు దేశంలో కృష్ణానదీతీరాన మహాయానం రూపొందిన తరువాతనే. అందువల్లనే నాగార్జునాచార్యులవారు బుద్ధుని తరువాత బుద్ధుడంతటివా డయినాడు.

మహాయానం వచ్చి బుద్ధుణ్ణి భగవంతుణ్ణి చేసి అతనికి లోకోత్తర శక్తులు ప్రసాదించింది. బుద్ధపురాణం వెలిసింది.

(పరిశోధన :
శ్రీ మల్లంపల్లి - సోమశేఖరశర్మగారి
వ్యాసంనుండి)

బౌద్ధతత్త్వం :- బౌద్ధమత ప్రవర్తకుడైన గౌతమ బుద్ధుడు ప్రదానంగా ధర్మోపదేశికుడే గాని, తత్త్వోపదేశికుడు కాడు. ఈ లోకంలో మానవుని బాధల నంతరింపజేయడానికి మార్గం సూచించాడే గాని పరలోకాన్నిగూర్చి, పరతత్త్వాన్నిగూర్చి విచారణ చెయ్యలేదు. అందుచేత ఆయన్ని ఆధునిక పరిభాష ప్రకారం తత్త్వశాస్త్రవేత్త అనడానికి వీలులేదు.

అయినప్పటికీ బౌద్ధమతం భారతదేశంలో చెల్లిన సుమారు వెయ్యి సంవత్సరాలలో మిగతా అన్ని మతాలకు లాగానే బౌద్ధమతానికి కూడా పరతత్త్వ విచారణకూడా అవసర మయింది. ఆ మతంచుట్టూ అనంతమైన తత్త్వశాస్త్రం, అనేక విశ్వాసాలు పెరిగాయి. ఈ తత్త్వశాస్త్రం, విశ్వాసాలు బౌద్ధం విస్తరించిన ఒక్కొక్క దేశంలో ఒక్కొక్కరీతిగా రూపుదాల్చాయి. ఆ మతస్థులు అనేక శాఖోపశాఖలుగా చీలిపోయారు. ఈ చారిత్రికపరిణామం ఎంత చిత్రంగా జరిగిందంటే - 2500 ఏళ్ళ క్రిందట బుద్ధుడుపదేశించిన నిర్వాణ మార్గానికీ, ఈ నాడు ఆసియా దేశాలలో అనుసరింపబడే మార్గానికీ, విశ్వాసాలకీ చాలవరకు పోలికే కనిపించదు. గౌతమ బుద్ధుడనే చారిత్రిక పురుషుణ్ణి కూడా ఆచ్ఛాదించివేసేటంత దట్టంగా మత విశ్వాసాలు పెరిగిపోయాయి.

ఈ పరిస్థితిలో అసలు గౌతముడు ఉపదేశించిన ధర్మం ఏమిటి? అది ఏ రకంగా తుదకు పరిణమించింది? అనే విషయాలు సంగ్రహంగా ఇవి :

సిద్ధార్థుడు యౌవనంలో సకల భోగభాగ్యాలు అనుభవిస్తున్న సమయంలోనే, ఆయనకు ప్రపంచంలో జరామరణవ్యాధియుతమైన దుఃఖం



గోచరించింది. స్త్రీ పురుషు లెవ్వరూ అయనకు కనబడలేదు. ఈ దుఃఖం ఏమిటి? దీనికి నివృత్తిమార్గం ఏమిటి? అనే ప్రశ్నలు ఆయనను జిజ్ఞాసువుగా చేశాయి. వజ్ర సంకల్పంతో ఆయన తదన్వేషణకు ఉపక్రమించాడు. తుదకాయన కనుగొన్న సత్యమే బౌద్ధమతానికి బీజప్రాయమై నిలిచింది.

బుద్ధుడు నాల్గు సత్యాలు కనుగొన్నాడు. వీటిని చతురార్యసత్యాలంటారు. వీటిలో మొదటిది 'జగత్తు దుఃఖమయం అని. దుఃఖమంటే జర, మరణం, వ్యాధి—ఇవే కాదు. మానవజీవితం యావత్తూ దుఃఖమయమే. తాత్కాలికంగా సుఖం అనుభవిస్తున్నామని భ్రమించినా, సుఖం కూడా కడకు దుఃఖమే కలిగిస్తుంది. ఎందుచేతనంటే సుఖం అశాశ్వతమయినది. దాని అశాశ్వతత్వాన్ని గూర్చిన ఆందోళన మానవునకు తప్పదు. కనుక దుఃఖం కాని దేదీ లేదు.

ఇక రెండో సత్యం ఈ దుఃఖానికి కారణం ఉన్నదని, ప్రతి సంఘటనకూ కారణం ఉంటుందనీ, కారణం లేనిదే ఏ కార్యమూ లేదని బుద్ధుడు కనుగొన్నాడు. ఈ సూత్రాన్ని అనుసరించి దుఃఖానికి కూడా కారణం ఉండి ఉండాలి. (1) జరామరణాదికములైన బాధలన్నిటికీ (2) జన్మమే కారణం; (3) జన్మకు కారణం జన్మించాలనే భావం. (4) ఈ భావానికి ఉపాదానం - అనగా ప్రాపంచిక వస్తువులను మానసికంగా అంటిపెట్టుకుని ఉండడం కారణం. (5) దీనికి కారణం ఇంద్రియ సుఖా లనుభవించాలనే తృష్ణ. తృష్ణ ఎక్కడినించి వస్తున్నది? ఇంద్రియ సుఖాల నదివరకే రుచిచూసి ఉండకపోతే తృష్ణ కలగదు. (6) కనుక ఇంద్రియానుభవం, లేక వేదన తృష్ణకు కారణం. (7) ఇంద్రియాలు, వస్తువులను స్పృశించకపోతే వేదన లేదు. కనుక ఈ 'స్పర్శ' వేదనకు కారణం. (8) స్పర్శకు కారణం పంచేంద్రియాలు, మనస్సు. (9) ఈ పంచేంద్రియాలకు, మనస్సుకు నామరూపాత్మకమైన మానవదేహం కారణం. (10) ఈ మానవదేహం ప్రాణరహితమైనా, చైతన్యరహితమైనా జన్మించదు. (11) ఈ చైతన్యం అనేది మన పూర్వజన్మ సంస్కారాలవలన కలుగుతోంది. (12) ఈ సంస్కారాలకు కారణం అవిద్య. కనుక అవిద్యయే దుఃఖానికి

మూలకారణం అవుతున్నది. ఇలాగ పన్నెండు అంచీలమీద బుద్ధుడు దుఃఖ మూలకారణాన్ని వ్యక్తం చేశాడు. దీన్నే బౌద్ధులు ద్వాదశ నిదానాలు అంటారు.

బుద్ధుడు కనుగొన్న మూడవ సత్యం దుఃఖాన్ని నిరోధించవచ్చునని. దుఃఖానికి కారణం ఉన్నదని ఎప్పుడైతే కనుక్కున్నామో, అప్పుడే ఆ కారణం తొలగిస్తే దుఃఖం నశిస్తుందని విదితమవుతున్నది. దుఃఖాన్ని ఈ జన్మలోనే నిరోధించవచ్చు నని బుద్ధుడు ప్రతిపాదించాడు. రాగద్వేషాలను జయించినవానికి ప్రాపంచిక బంధాలన్నీ నశిస్తాయి. అతడు బంధవిముక్తు డవుతాడు. అర్హాతు డవుతాడు. ఆ స్థితినే నిర్వాణం అంటారు.

ఇక నాలుగో సత్యం దుఃఖ నిరోధానికి మార్గం ఉన్నదని. బుద్ధ ప్రతిపాదితమైన ఈ మార్గం ఎనిమిది విధాలుగా ఉన్నది, దీనినే అష్టాంగిక మార్గం అంటారు.

బుద్ధుని అష్టవిధమార్గం ఇది: (1) సమ్యగ్దృష్టి:—దుఃఖాన్ని గూర్చి బుద్ధుడు చెప్పిన నాలుగు ఆర్య సత్యాలను గూర్చి సరియైన జ్ఞానం కలిగి ఉండడం.

(2) సమ్యక్ సంకల్పము :— సమ్యగ్ దృష్టి మాత్రమే ఉన్నందు వల్ల లాభం లేదు. ప్రాపంచిక వ్యామోహాన్ని విసర్జించాలి. ఇతరులపై ద్వేషం తొలగించుకుని, ఎవరికీ హాని కలుగకుండా ప్రవర్తించాలి.

(3) సమ్యగ్వాక్కు: అబద్ధమాడడం, అపనిందను వేయడం, పరుషంగా మాట్లాడడం, హేళనగా మాట్లాడడం మానివెయ్యడంవలన సమ్యగ్వాక్కు అలవడుతుంది.

(4) సమ్యక్ కర్మ :—ప్రాణిహింస, చౌర్యం, ఇంద్రియలౌల్యం విసర్జించడం సరియైన ప్రవర్తన అవుతుంది.

(5) సమ్యగాజీవము :—ఋజుమార్గంలోనే జీవనోపాధి గడించుకోవాలి గాని అక్రమ పద్ధతు లవలంబించరాదు.



(6) సమ్యగ్ వ్యాయామం:—మనస్సులో పాతుకుపోయిన దురాలోచనలను పెకలించి వేయడానికి, కొత్తగా దురాలోచనలు మనస్సులో ప్రవేశించకుండా చెయ్యడానికి ప్రతిక్షణమూ ప్రయత్నిస్తూ ఉండాలి. మనస్సును శూన్యంగా ఉంచడం సాధ్యం కాదు గనుక సదాలోచనలతో మనస్సును నింపడానికీ, అవి తొలగిపోకుండా ఉండడానికీ తీవ్రయత్నం చేస్తూ ఉండాలి.

(7) సమ్యక్ స్మృతి :—దేహము, ఇంద్రియాలు, మనస్సు మొదలైనవానియొక్క అశాశ్వతత్వాన్ని సదా జ్ఞాపకంలో ఉంచుకోవాలి; అలా జ్ఞాపకం ఉంచుకోకపోతే అవి శాశ్వతమని భావించడం, వాటిపై వ్యామోహం పెరగడం, తత్ఫలితంగా దుఃఖం సంభవించడం జరుగుతుంది.

(8) సమ్యక్ సమాధి :— పై ఏడు నియమాలను అనుసరించిన వ్యక్తి అన్ని కోరికలనుండి, చెడ్డ తలంపులనుండి విముక్తుడై సమ్యక్ సమాధిలో ప్రవేశించగలుగుతాడు. ఆ స్థితిలో అతడు సుఖదుఃఖాతీతము, నిర్వికారమూ, దుఃఖరహితమూ అయిన నిర్వాణపదం పొందుతాడు.

అనాత్మవాదం :-బుద్ధుని ఉపదేశాలలో కొన్ని తాత్త్విక సిద్ధాంతాలు మిళితం కాకపోలేదు. కారణం లేనిదే కార్యం లేదనే సిద్ధాంతం ఒకటి. దీనినే ప్రతీత్య సముత్పాదమని బుద్ధుడు నిర్వచించాడు. ఈ కార్య కారణ సూత్రంవల్లనే దుఃఖ కారణాన్ని, దుఃఖ నిరోధ మార్గాన్ని కూడా కనుగొనడానికి వీలైనది. బుద్ధుని సిద్ధాంతాల్లో మరొకటి కర్మసిద్ధాంతం. పూర్వజన్మ కర్మవల్లనే ప్రస్తుత జన్మ కలిగిందనీ, ప్రస్తుత జన్మ ఉత్తర జన్మకు కారణ మవుతుందనీ. ఈ సిద్ధాంతం పైని చెప్పిన ప్రతీత్య సముత్పాద సిద్ధాంతంమీద ఆధారపడినదే. ఈ సిద్ధాంతంమీద ఆధారపడినదే జగత్తు అనిత్యమూ, ప్రతిదానికీ ఆది ఉన్నట్లే అంతంకూడా ఉన్నది అనే సిద్ధాంతం! దీన్ని అనుసరించే బుద్ధుడు ఆత్మ అనేది లేదని కూడా ప్రతిపాదించాడు. ఆత్మ అంటే మార్పు లేనిది, ఆద్యంతాలు లేనిది. కనుక ఆద్యంతాలు లేని దేదీ లేదు. అందువల్ల ఆత్మలేదని ఈ సిద్ధాంతం. ఆత్మలేదని బుద్ధుడు చెప్పినప్పటికీ, జన్మ పరంపరను ఒప్పుకున్నాడు. ఇ దెలా సంభవమైంది? జీవితం అనేది అనంత భిన్న భిన్నస్థితుల సముదాయం. ఒక స్థితి

మరొకస్థితికి కారణ మవుతుంది. ఆ స్థితి ఇంకొక స్థితికి కారణమవుతుంది. ఈ రీతిగా అనేక స్థితుల ద్వారా జీవితం కొనసాగుతుంది. ఒక దివ్వెనుండి మరొక దివ్వె వెలిగినట్లుగా, ఒక జన్మయొక్క అంత్యస్థితినుండి తద్భిన్న మైన మరొక జన్మయొక్క ప్రారంభస్థితి సిద్ధిస్తుంది. అంటే బుద్ధుడు ఆత్మను తొలగించి దాని స్థానంలో అవిచ్ఛిన్నమైన చైతన్య ప్రవంతిని ప్రవేశపెట్టా డన్న మాట. ప్రస్తుత చైతన్యస్థితిలో పూర్వ చైతన్యస్థితి నిక్షిప్తమై ఉంటుంది గనుక గతంలోని కర్మఫలితా లన్నీ వర్తమానాన్ని కూడా బాధిస్తాయి. ఆత్మను బుద్ధుడు హేళనచేస్తూ, ఆత్మను ప్రేమించడం లోకంలో ఎవరికీ తెలియని - ఎవరూ చూడని సుందరిని ప్రేమించడంలాంటి దని అన్నాడు. ఆత్మనుగూర్చి ఆలోచించడం కూడా అవివేకం అన్నాడు. దుఃఖ నివారణం ఒక్కటే మానవుని కర్తవ్యం. విషబాణం తగిలి బాధ పడుతున్నవాడు బాణాన్ని లాగివేయడానికి ప్రయత్నించక బాణం ఎలా వచ్చింది? దాన్ని తయారుచేసిన దెవరు? ప్రయోగించిన దెవరు? మొదలైన ప్రశ్నలతో కాలాన్ని వృథా చేయడం ఎంత హాస్యాస్పదమో దుఃఖనివృత్తి మార్గం ఆలోచించకుండా ఆత్మను ధ్యానించడం అంత హాస్యాస్పదం అని బుద్ధు డన్నాడు.

''దుఃఖము, దుఃఖనిరోధము'' - ఇదే నే నిదివరలో చెప్పింది, ఇప్పుడు చెబుతున్నది'' అని బుద్ధుడు అన్నాడు. దుఃఖకారణం కనుక్కో వడం, ఆ కారణం తొలగించివేయడానికి అష్టాంగిక మార్గం అనుసరిం చడం అనే రెండింటిమీద ప్రాచీన బౌద్ధధర్మం ప్రవర్తిల్లింది.

బౌద్ధతత్త్వశాఖలు :- కాలక్రమేణా బౌద్ధమతం అనేక దేశా లకు విస్తరించింది. ఆ మతం అనేక ఇతర మతాలను, ఇతర మతతత్త్వ వేత్తల విమర్శలను ఎదుర్కొనవలసి వచ్చింది. బౌద్ధ ధర్మాన్ని ఆ విమ ర్శలనుండి రక్షించుకోవడంకోసం చాల సిద్ధాంత రాద్ధాంతాలు చేయవలసి వచ్చింది. ఈ సిద్ధాంతా లన్నిటికీ బుద్ధుని ఉపదేశాలలోనే బీజాలు కన బడడంచేత సులభంగా అవి వృద్ధిపొందడానికి తగిన ఆస్కారం లభిం



చింది. ఈ రీతిగా సుమారు 30 వేర్వేరు వాదాలు, ఇంకా ఎన్నో చిల్లర ఉపవాదాలు బౌద్ధంలోనే అంకురించి విస్తరించాయి. వీటిలో ముఖ్యమైనవి ఇవి-

మాధ్యమిక వాదం :- క్రీ. శ. రెండవ శతాబ్దంలో ఆంధ్ర దేశములో శాతవాహనుల పతాకచ్ఛాయను నివసించిన నాగార్జునాచార్యుడు మాధ్యమిక వాదానికి ఆరంభకుడని చరిత్రకారులు వాకొంటున్నారు. బుద్ధ చరిత్ర కావ్యం రచించిన అశ్వఘోషుడు ఈ వాదానికి బీజం నాటిన తత్త్వ వేత్త అని కొందరు చెబుతారు. ఏమైనా మాధ్యమికవాదం నాగార్జునుని రచనలలో, ముఖ్యంగా మాధ్యమిక కారికలనే గ్రంథంలో స్పష్టంగా రూపు దాల్చి ఉండడంచేత ఆయనే ప్రతిపాదించాడని చెప్పవచ్చును. ఈ వాదానికి శూన్యవాదం అనే నామాంతరం కూడా ఉన్నది. శూన్యవాదం అనే పేరు ఉండటంచేత ''అంతా శూన్యం'' అని ఈ వాదం చెబుతుందని పలువురు వ్యాఖ్యానించారు. అసలు సత్యం అనేదే లేదని ఈ వాదం చెప్పదు. ఇంద్రియగోచరమైన జగత్తు మాత్రమే శూన్యమని, ఈ జగత్తుకు అతీత మైన సత్యం ఉన్నదని, ఆ సత్యాన్ని విజ్ఞానమయమనిగాని, కాదనిగాని ఏ రీతిగాను వర్ణించడానికి వీలులేదని, ఆ అనిర్వచనీయ సత్యాన్ని ఇదమిత్థ మని చెప్పలేము గనుక దాన్ని శూన్యం అని అనవచ్చుననీ యీ వాదంలోని అంతరార్థం, సత్యపదార్థము కార్యకారణ సిద్ధాంత బాధితమైనది కాగూడదు. కాని కార్యకారణ బాధితం కాని దేదీ లేదు. కనుక అది సత్యము కానేరదు. అయితే అది అసత్య మనడానికి కూడా వీలు లేదు, అసత్యమైనది గాలిలో మేడవలె ఉండడమే సంభవించదు. అది సత్యమూ కాదు, అసత్యమూ కాదు, అయితే అది ఏమిటి? అనే ప్రశ్నకు సమాధానంగా శూన్యం అని చెప్పవలసి వస్తుంది. వస్తుజగత్తుయొక్క నిజస్వభావం వర్ణించడానికి వీలు లేనిది కనుక శూన్యత అని చెప్పి తృప్తిపడవలసి వస్తుంది. అంటే వస్తు స్వభావము 'సత్యము లేక అసత్యమని గాని'. 'సత్యమూ, అసత్యము కూడా అని గాని', 'సత్యమూ కాదు, అసత్యమూ కాదనిగాని' చెప్పడానికి వీలు లేదు.

సత్యం రెండు విధాలైనదని మాధ్యమికు లంటారు. ఒకటి సంస్కృతి సత్యం. ఇది సామాన్య ప్రజలకు ఉద్దేశించినది. జగత్తుయొక్క అశాశ్వ తత్వాన్ని గూర్చి. కార్యకారణ సిద్ధాంతాన్ని గూర్చి బుద్ధుడు చెప్పినది లౌకిక సత్యం మాత్రమే, కాని పరమార్థసత్యం వేరే ఉన్నది. జగత్తు యొక్క నిజస్వభావం తెలుసుకుని నిర్వాణపదం పొందిన అర్హతునికి ఈ సత్యం వర్తిస్తుంది. ఈ నిర్వాణం లౌకికంగా తెలియబడనిది, కొత్తగా ఆర్జించబడనిది, నాశనం లేనిది, నిత్యం కానిది. అణచివేయడానికి వీలు లేనిది, జననం లేనిది'' అని నాగార్జునుడు వర్ణించాడు.

ఈ మాధ్యమిక వాదానికీ, గౌడపాద, శంకరాచార్యుల అద్వైత వేదాంతానికీ దగ్గరి పోలికలు చాలా కనిపిస్తున్నాయి.

విజ్ఞానవాదం : మాధ్యమికులవలెనే, బాహ్యజగత్తు శూన్యం అని చెబుతూ మనస్సు లేక చిత్తము మాత్రం సత్యమైనదని విజ్ఞానవాదులు అంటారు. మనస్సుకూడా అసత్యమైతే మన ఆలోచన, వితర్కము కూడా అసత్య మైపోతాయి. అప్పుడు మాధ్యమిక వాదులు తమ వాదం సరియైనదో కాదో కూడా చెప్పలేని అవస్థలో పడతారు. కనుక అంతా అసత్యం అనే వాదం ప్రమాదకరమైనది. మనస్సు సత్యమేనని ఒప్పుకుంటే గాని మనం సిద్ధాంతీకరించినది సత్యమని చెప్పలేము.

మనస్సు ఒక్కటే సత్యమనే సిద్ధాంతాన్ని అనుసరించి, మనకు గోచరించినట్లు కనబడే బాహ్యజగత్తు యావత్తూ మన భావనే గాని నిజంగా లేదని విజ్ఞానవాదులు అంటారు. స్వప్నంలో మనం అనేక వస్తువులను మనకు వేరుగా చూసినట్లు భ్రమ పడతాము. అవన్నీ మన భావనలేగాని నిజంగా లేనట్లే బాహ్యజగత్తు కూడా మన భావనారూపమే. ఏ బాహ్య వస్తువూ నిజంగా ఉన్నదని మనం నిరూపించలేము. ఎందుకంటే బాహ్య వస్తువు, దాన్నిగూర్చిన మన జ్ఞానం వేరు కావు. ఆ రెండూ ఒకటే అయినా. దృష్టిదోషం ఉన్నవాడికి ఇద్దరు చంద్రులు కనిపించినట్లే సమ్యగ్ దృష్టి లేనివానికి వేరువేరుగా కనిపిస్తాయి.



అయితే బాహ్యవస్తువు లన్నిటినీ మనస్సే సృజిస్తున్నప్పుడు మనస్సు తనకు కావలసిన వాటినే ఇష్టం వచ్చినప్పుడల్లా ఎందుకు సృజించుకోలేదు? దీనికి విజ్ఞానవాదు లిలా అంటారు - మనస్సులోని చైతన్య స్రవంతిలో అనేక పూర్వకర్మ సంస్కారాలన్నీ నిక్షిప్తమై ఉంటాయి. ఒక్కొక్క క్షణంలో ఒక్కొక్క సంస్కారమే పైకి వచ్చి పరిపాకం పొంది విజ్ఞానంగా పరిణమిస్తుంది. అందుచేత ఆ క్షణంలో ఆ సంస్కారానికి అనుకూలమైన వస్తుజ్ఞానం మాత్రమే లభిస్తుంది. మనస్సులో అనేక గత విషయాలు నిక్షిప్తమై ఉన్నా ఒక్కొక్క క్షణంలో ఒక్కొక్క విషయం మాత్రమే జ్ఞాపకం వచ్చినట్లు, ఒక్కొక్క క్షణంలో ఒక్కొక్క సంస్కారం మాత్రమే వరిపాకం చెంది వస్తుజ్ఞానంగా భాసిస్తుంది. కాని ఏది పడితే అది కాదు. గత సంస్కారా లన్నిటినీ నిక్షిప్తం చేసుకున్న చిత్తాన్ని విజ్ఞానవాదులు 'ఆలయవిజ్ఞానం' అంటారు. సాధనం ద్వారా, నిగ్రహంద్వారా ఆలయ విజ్ఞానాన్ని స్వాధీనం చేసుకుని అవాంఛనీయ సంస్కారా లన్నిటినీ నశింపజేసి, నిర్వాణ సంధాయకమైన మానసస్థితిని పొందవచ్చునని విజ్ఞాపవాదుల మతం.

వీరు యోగసాధనద్వారా ఆలయ విజ్ఞాన సత్యం గుర్తింపవచ్చునని విశ్వసిస్తారు. కనుక వీరిని యోగాచారులని కూడా అంటారు.

సౌత్రాంతిక వాదం :- సౌంత్రాంతిక వాదులు మనస్సు ఒకటే కాక బాహ్యజగత్తు కూడా సత్యమేనని విశ్వసిస్తారు. బాహ్యవస్తు స్థితిని ఒప్పుకోకపోతే అది మిథ్యారూపంలోనైనా గోచర మవడానికి ఆస్కారం లేదని వీరి వాదం. మన మనోభావమే బాహ్యవస్తువుగా కనిపిస్తోందనడం వంధ్యా పుత్రవాదం వంటిదే! అదీగాక ఒక ఘటం (కుండ) చూసినప్పుడు ఘటం బాహ్యవస్తువుగాను, దానిని గూర్చిన జ్ఞానం అంతర మైనదిగాను కనిపిస్తుంది. అందుచేత వస్తువు వేరు, వస్తుజ్ఞానము వేరు. రెండూ ఒకటే అయితే 'నేనే ఘటాన్ని' అనాల్సి వస్తుంది. అన్నీ మనోజన్యాలే అయితే ఘటాన్ని చూసినప్పుడు ఘటం అనీ, పటం (వస్త్రం) చూసినప్పుడు పటం అనీ వేరుగా చెప్పడానికి వీల్లేకపోతుంది.

బాహ్యజగత్తు నిజంగా ఉన్నప్పటికీ, మనకు గోచరమయ్యేది అది కాదనీ, దానియొక్క ప్రతిబింబం మన మనస్సులో పడి తద్వారా ఒక వస్తువుయొక్క ఉనికిని మనం తెలుసుకోగలుగుతున్నామనీ, అసలు వస్తువే లేకపోతే దాని ప్రతిబింబం ప్రశ్నే లేదనీ కూడా వీరు విశ్వసిస్తారు. అందుచేత వీరిని బాహ్యానుమేయవాదులని కూడా అంటారు. వీరి సిద్ధాంతాలకు సూత్రపిటకం ఆధారంగా తీసుకుంటారు. గనుక వీరికి సౌత్రాంతిక వాదులని పేరు వచ్చింది.

వైభాషిక వాదం :- కాత్యాయనపుత్రు డను ఆచార్యుడు వ్రాసిన అభిధర్మజ్ఞానప్రస్థాన శాస్త్రానికి కనిష్కుని కాలంలో వ్రాసిన విభాష అనే వ్యాఖ్యానం అనుసరించినందున వీరికి వైభాషికవాదులనే పేరు వచ్చింది. బాహ్యాంతర జగత్తులు రెండూ సత్యమే నని అంగీకరిస్తూ, బాహ్య జగత్తుయొక్క కేవల ప్రతిబింబాన్నే కాక ప్రత్యక్షంగా బాహ్య వస్తువులను కూడా మనం చూడగలుగుతున్నామని వైభాషికులు విశ్వసిస్తారు. వీరిది పూర్తిగా వాస్తవిక వాదం. బాహ్యవస్తువు లేకుండా బాహ్యానుమేయం సంభవించదని వీరి నమ్మకం. వీరి వాదాన్నే బాహ్య ప్రత్యక్షవాద మనికూడా అంటారు. వీరి సిద్ధాంతానికి ఆధారం అభిధమ్మ పిటకం.

హీనయానం, మహాయానం :- బోధిధర్మం మహావృక్షమై హీనయాన, మహాయాన శాఖలుగా చీలిపోయింది. ఒకే వృక్ష జన్యములైనా ఈ రెండు శాఖలు భిన్నదిశలు పట్టి విస్తరించాయి.

హీనయానులకు నిర్వాణమే గమ్యస్థానం. జైనులవలెనే వీరు నిరీశ్వరవాదులు. ఈశ్వరుని స్థానంలో జగచ్చక్రాన్ని పరివర్తింప జేసే కర్మను లేక ధర్మాన్ని వీరు నిలిపారు. ఈ కర్మ నియమాన్ని అనుసరించి ప్రతివాడు తన పూర్వకర్మ నియంత్రితమైన దేహం, మనస్సు, జీవితం పొందుతాడు. కర్మబంధాలనుండి మానవుడు విముక్తి పొందగల్గడానికి సాక్ష్యంగా బుద్ధుని జీవితాన్ని హీనయానులు ఆదర్శంగా భావిస్తారు. బుద్ధునిమార్గాన్నే అనుసరించి ఈ జీవితంలోనో, లేక మరో జీవితంలోనో అర్హతులు కాగలమని వారు భావిస్తారు. 'నీ ముక్తిని నీవే సంపాదించుకోవా' లనే బుద్ధుని సూక్తి ననుసరించి వీరు స్వయంకృషిద్వారానే నిర్వాణపదం చేరుకో ప్రయత్నిస్తారు. బుద్ధుని ఆదర్శాన్ని, బుద్ధధర్మాన్ని తప్ప వీరు మరి దేని సహాయమూ అపేక్షించరు కనుక, హీనయాన మతం వజ్రసంకల్పం గల దృఢచిత్తులకే తప్ప సామాన్యులకు అనుసరణసాధ్యం కాలేదు.



మహాయానం దీనికి భిన్నమైనది. మహాయానులు స్వీయవిముక్తిని నిరసించారు. వీరికి అవలోకితేశ్వరుడు ఆదర్శం. బుద్ధుడు తాను విముక్తి పొందడంతో తృప్తిపడక, తోటి మానవులను కూడా బంధవిముక్తులను చేయడానికి తన దీర్ఘ జీవితకాలాన్ని వినియోగించాడనీ, ఎవరికి వారు విముక్తిని కోరుకోవడం స్వార్థమనీ. సమస్త ప్రాణికోటిని తరింపజేయడమే బౌద్ధుల ఆదర్శమై ఉండాలనీ వీరు వాదిస్తారు. నిర్వాణసిద్ధి తరువాత ప్రపంచానికి దూరంగా ఉండక మానవులతో కలసిమెలసి తిరుగుతూ, వారిని కూడా తరింపజేయడానికి ప్రయత్నించాలి. ఈ విధమైన ప్రయత్నం చేసేవాడు బోధిసత్త్వు డవుతాడు. బోధిసత్త్వుడు మహా కరుణాపూరితమైన చిత్తం గలవాడై, మహా ప్రజ్ఞావంతుడై జీవకోటిని ఉద్ధరించడానికి అనేక జన్మ లెత్తుతూ ఉంటాడు. జననమరణబాధితు డైనప్పటికీ బోధిసత్త్వుడు నిస్సంగుడై ఉంటాడు. తన సత్కర్మ ఫలితాలను ప్రాణికోటికి ఇచ్చి, వారి దుష్కర్మ ఫలితాలను తాను స్వీకరిస్తాడు. కనుక ప్రతివాడూ బోధిసత్త్వుడు కావడానికే కృషి చేయాలి.

అయితే ప్రతివాడూ బోధిసత్త్వ స్థితికి ప్రయత్నించగలవాడై ఉండడు. అటువంటివారికి మహాయాన మతం మరొక మార్గం సూచించింది. ప్రాచీన బౌద్ధంలో ఈశ్వరునికి స్థానం లేదు. దుఃఖపీడితులు, బలహీనులు అయిన అశేషమానవులకు అది నిష్ప్రయోజనం. కనుక మహాయానులు కరుణాళువైన బుద్ధుని ఈశ్వరస్థానం అలంకరింపజేశారు. గౌతమబుద్ధుడు పరమార్థసత్యంయొక్క అవతారమనీ, ఆ పరమార్థసత్యం ధర్మకాయం ధరించి సర్వప్రాణుల ముక్తికై పాటుపడుతుందనీ వారి విశ్వాసం.

ఇలా ధర్మకాయం ధరించే పరమ సత్యాన్నే మహాయానులు అమితాభ బుద్ధుడని కూడా అన్నారు. ఈ అమితాభుడే వారికి ఈశ్వరుడైనాడు.

ఆ యీ పరిణామాలవలన మహాయాన మతం భారతదేశపు ఎల్లలు దాటి అనేక జాతులవారిని, అనేక దేశాలవారిని, అనేక మతాలవారిని తనలో చేర్చుకోగలిగింది. అసంఖ్యాకజనులు బౌద్ధమతం స్వీకరించారు. చైనా, జపాన్, కొరియా మొదలైన ఆసియా దేశాలలో ఈ మహాయాన మతం విశేషంగా వర్ధిల్లింది. ఆ యా దేశాలలో ప్రజల ఆచారాలను, విశ్వాసాలను, సంస్కృతిని తాను స్వీకరించి ఎన్నో మార్పులు పొందింది. ఈ మార్పులవలన బౌద్ధమతం భారతదేశంలో క్షీణించిపోయినప్పటికీ, ఆ మార్పులవలననే ఇతరదేశాలలో కాలూని నిలద్రొక్కుకోగలిగిందని చెప్పవచ్చును.

(ఆంధ్ర వారపత్రిక బుద్ధజయంతి సంచికలోని
'బౌద్ధతత్త్వ సిద్ధాంతాలు' అనే
వ్యాసంనుంచి)

పాలీలోక బౌద్ధవాఙ్మయము :- బుద్ధనిర్వాణానంతరము కొంతకాలము గడచిన పిదప అతని శిష్య పరంపరలో గలిగిన అభిప్రాయ భేదములనుబట్టి బౌద్ధమతము రెండు శాఖలుగా నేర్పడినది. అందొకటి మహాయాన మనునది. ఇది నేపాలు, టిబెత్తు, చైనా మొదలగు దేశములందు వ్యాప్తి గాంచినది. రెండవది హీనయానము. ఇది దక్షిణమున సింహళము, బర్మా, సయామ మొదలగు దేశముల వ్యాప్తి గాంచుటచే నిది దక్షిణబౌద్ధ మని పేరు గాంచినది. మహాయానమునకు చెందిన గ్రంథములు సంస్కృతములో వ్రాయబడగా ఈ దక్షిణ బౌద్ధమునకు చెందిన గ్రంథజాలమంతయు పాలీభాషలో వ్రాయబడుట తటస్థించినది.

పాలీవాఙ్మయములో ప్రాచీన భాగములు - బౌద్ధమత ధర్మములను తెలుపు గ్రంథములను తిపిటకము=(త్రిపిటకము) లందురు. వానిని బౌద్ధ



వేదము లనవచ్చును. త్రిపిటకము లనగా మూడు గంపలని యర్థము. అవి వినయ పిటకము, సుత్తపిటకము, అభిధమ్మ పిటకము అనునవి. బుద్ధుని తర్వాత రాజగృహములో జరిగిన మొదటి బౌద్ధమత సభలో ఈ బౌద్ధధర్మ గ్రంథముల రచన జరిగినదని చెప్పుదురు. మరల నూరు సంవత్సరములకు తరువాత వైశాలీ పట్టణములో జరిగిన రెండవసభలో ఇవి విస్తృతములయ్యెను. అశోకుని అధిపత్యమున జరిగిన మూడవ మతసభలో త్రిపిటకములు సరిగా దిద్దబడి వాని స్వరూపమునుగూర్చిన తుదినిర్ణయము చేయబడెను. ముఖ్యముగా నీ సభలో అభిధమ్మ పిటకముయొక్క స్వరూపము నిరూపింపబడినట్లు తెలియుచున్నది. ఇందులో బుద్ధుని బోధనలను గురించిన తప్పు అభిప్రాయములు కొన్ని తొలగింపబడినవి. మరియు విదేశములకు బౌద్ధప్రచారకులను పంపవలసిన దను తీర్మానము కూడ ఇందే చేయబడినది. ఈ తీర్మానము ననుసరించియే అశోకుని కుమారు డగు మిహిందు డను నాతడు బౌద్ధధర్మ ప్రచారమునకై సింహళ దేశమున కేగెను.

బుద్ధభగవానుని అభిభాషణములు, ఆతనిని గూర్చిన కథలు, ధర్మ నియమములు, వానిని గూర్చిన వ్యాఖ్యానములు-ఇవన్నియు త్రిపిటకములలో ప్రోగు చేయబడి యున్నవి. వినయ పిటకము బౌద్ధమత గురువుల నియమములనుగూర్చియు, సుత్తపిటకము బుద్ధుని యుపదేశములగూర్చియు, అభిధమ్మపిటకము బౌద్ధవేదాంతమునుగూర్చియు తెలుపును.

వినయపిటకము :- ఇది బౌద్ధసన్యాసుల ఆశ్రమ ధర్మములను, నియమములను వివరించును. సంఘములో క్రొత్తవారిని చేర్చుకొను విధానము, ఆ యా కాలములందు చేసిన పాపములను ఒప్పుకొనుట, వైద్య సహాయము చేయు పద్ధతులు, వారిలో వారికి వివాదములు, వైషమ్యములు గలిగినప్పుడు ఆచరింపవలసిన రీతులు మున్నగువానిని గురించియు ఇందు వివరింపబడి యున్నది.

సుత్తపిటకము :- బౌద్ధవేదములలో సుత్తపిటకము చాల ముఖ్యమైనది. బుద్ధ బోధనలను తెలిసికొనుట కీ గ్రంథము చాల ఉపకరించును.

ఇందు 5 భాగము లున్నవి. వీనికి దీఘనికాయము, మజ్ఝిమనికాయము, సంయుత్తనికాయము, అంగుత్తనికాయము, ఖుద్దకనికాయము అని పేళ్లు. నికాయము లనుటకు బదులు ఆగమము లను పేరులో (దీఘాగమము .... అని) కూడ వీనిని వ్యవహరింతురట! ఈ అలవాటు ఉత్తర బౌద్ధ వాఙ్మయ మున ఎక్కువగా కలదు. సుత్తపిటకము మొదటి నాలుగు భాగములు బుద్ధ ప్రవచనములతోను, అతని శిష్యుల అభిభాషణములతోను, వాదములతోను కూడి యున్నవి. రచన చాలవరకు గద్యములో నున్నది. అచ్చటచ్చట పద్యరచనయు గలదు. దీఘనికాయములోని 16-వ సూత్రమునకు మహా పరినిర్వాణ సూత్ర మని పేరు. ఇందు బుద్ధదేవుని అంత్యదినములలో జరిగిన విషయముల వర్ణన గలదు. సంయుత్తనికాయములో ముఖ్యమైనది ధర్మ చక్ర ప్రవర్తన సూత్రము. ఇందు బుద్ధుని ప్రథమ ధర్మోపన్యాసము గలదు. సుత్తపిటకముయొక్క 5-వ భాగ మగు ఖుద్దక నికాయములో ఈ గ్రంథములు ప్రధానమైనవి—

1. ఖుద్ధక పాఠము, ప్రతిదినము బౌద్ధులు చేయు ప్రార్థనలతో కూడినది.

2. ధమ్మపదము. ఇది 423 ధర్మోపదేశకము లగు పద్యముల సంకలన గ్రంథము. ఇందు సగము పైగా పద్యములు బౌద్ధవేదముల లోనివే. ఇవి గాక దేశమున వ్యాప్తిగాంచి యున్న మరికొన్ని పద్యములు కూడ నిందు చేర్పబడి యున్నవి.

3. ఉదానగ్రంథము. బుద్ధుని అభిభాషణము లిందు పద్య రూపమున నున్నవి.

4. ఇతివుత్తుక. బుద్ధుడుచెప్పిన నీతి సూక్తు లిందు గలవు.

5. సుత్తనిపాత. ఇందలి ఐదు భాగములలో పారాయణ వగ్గ మనునది ఒకటి. ఈ వగ్గములో బవేరి అను నాతని పదునారుగురు శిష్యులు బుద్ధుని అడిగిన ప్రశ్నలు, వాని కాతడు చెప్పిన ఉత్తరములు గలవు.



6. విమానవత్థు. జీవితమున నొనర్చిన సత్కార్యములయొక్క ఫలిత ముగా దేవతలు నివసించు స్వర్గప్రాసాదముల వైభవమును వర్ణించునది.

7. పేతవత్థు-జీవితమున నొనర్చిన పాపపరిహారార్థముగా ప్రేతములు అనుభవించు దుఃఖస్థితిని వర్ణించును.

8 - 9. థేరగాథలు. థేరీగాథలు - బౌద్ధసన్యాసులు, సన్యాసినులు చెప్పిన సంకలనగ్రంథములు.

10. జాతకములు. బుద్ధుని పూర్వజన్మ వృత్తాంతములను తెలుపు కథ లిందు గలవు. ఇవి గద్య పద్యాత్మకములు. వీనిలో పద్యభాగములు గద్య భాగములకంటె మత సంప్రదాయము కలవి.

ఇవి గాక ఖుద్దక నికాయములో బుద్ధుని పూర్వజన్మ కథలను వర్ణించు మరి కొన్ని భాగములు కలవు.

అభిధమ్మపిటకము :- ఇందు ధర్మవివరణమే గాని వేదాంత తత్త్వమేమియు గానరాదు. ఇందు నీతి, మనస్తత్త్వము, జ్ఞానస్వరూపము మొదలగు వివిధ విషయముల వివరణలు గలవు. రచన శాస్త్ర పద్ధతిని నడచినది. అభిధమ్మమునకు బర్మా దేశమున నెక్కువ గౌరవ పరిచార ములు కలవు.

బౌద్ధధర్మములను బోధించు గ్రంథములకు కాలక్రమమున ననేకము లగు వ్యాఖ్యానములు బయలుదేరినవి. మిహిందుడు క్రీస్తునకు ముందు 307-వ సంవత్సరములో సింహళమునకు బోయినప్పుడు పిటకములనే గాక వానికి వ్యాఖ్యాన మగు 'అర్థకథ' యను గ్రంథమును కూడ తీసికొని వచ్చెను. సింహళములో బుద్ధఘోషుడు రచించిన వ్యాఖ్యానములు, ద్వీప వంశము మొదలగు చారిత్రిక గ్రంథములు దీనిపైనే ఆధారపడి రచింపబడి నట్లు తెలియుచున్నది.

బుద్ధఘోషుడు క్రీ. శ. 5-వ శతాబ్దములో నుండిన ప్రసిద్ధ వ్యాఖ్యాన కర్త. అతనికి పూర్వము సింహళములో వ్యాప్తి గాంచి యుండిన పాలీ

గ్రంథములలో నెత్తిప్పకరణము, పెటకోపదేశము అనునవి ముఖ్యములు. బౌద్ధ ధర్మమును తెలిసికొనుట కివి మార్గోపదేశికలు. వీనిని బుద్ధుని శిష్యులలో నొకడగు మహాకచ్చాయనుడు రచించినట్లు చెప్పుదురు.

మిళిందపన్హా అనునది మరియొక ప్రాచీన గ్రంథము. ఇది మిళిందునకు థేర నాగసేనునకు బౌద్ధ ధర్మములనుగురించి జరిగిన సంభాషణ రూపముగా రచింపబడినది. ఈ మిళిందుడు క్రీస్తు పూర్వము రెండవ శతాబ్ద్యంతమున ఇండో-బాక్ట్రియన్ రాజగు మినాండ రని నిర్ణయింపబడినది. ఇతడు బౌద్ధ ధర్మమునం దాదరము కలవాడు.

బౌద్ధ వేదములకు వ్యాఖ్యానము వ్రాసినవారిలో బుద్ధఘోషుడు ప్రసిద్ధుడు. ఈతడు హిందూదేశమున బుద్ధగయ సమీపములో బ్రాహ్మణ వంశమున జనించెను. క్రీ. శ. 413 ప్రాంతమున సింహళమును పరిపాలించిన మహానాము డను రాజు కాలములో నీతడు సింహళమునకు వచ్చెను. అచ్చట బౌద్ధమతమును స్వీకరించి అనేక గ్రంథములను వ్రాసెను. అనూరాధపురములోని మహావిహారములో నివసించుచు అక్కడ నుండియే తన ప్రసిద్ధ గ్రంథమగు విసుద్ధి మగ్గము, జాతక కథలపై వ్యాఖ్యానములు రచించెను.

బుద్ధఘోషునితోపాటు చెప్పదగిన ప్రసిద్ధ వ్యాఖ్యాతలు బుద్ధదత్తుడు, ఆనందుడు, ధమ్మపాలుడు, వీరందరు ఇంచుమించు సమకాలికులు. ఇంకను వీరి శిష్యులలో వ్యాఖ్యానములను రచించిన వా రనేకులు కలరు.

(పరిశోధన :
శ్రీ కోరాడ మహాదేవశాస్త్రిగారి
వ్యాసంనుండి)

సంస్కృతంలో బౌద్ధగ్రంథాలు :-హీనయాన బౌద్ధులలో స్థవిరవాదుల గ్రంథాలు పాలీభాషలో రచితాలు. హీనయాన సంప్రదాయంలోని మరొక శాఖవారైన సర్వాస్తివాదులు తమ మతగ్రంథాలను సంస్కృతములోనే రచించారు. కొన్నిటిని పాలీనుండి సంస్కృతానికి అనువదించుకొన్నారు. ఈ సాహిత్యం చాలవరకు పూర్తిగా లుప్తమైనది. కాని కొంతమాత్రం చీనా, టిబెట్ భాషానువాదాలలో మిగిలింది. దశాబ్దం క్రితం మధ్య ఆసియాలో జరిపిన పరిశోధనలవల్ల మూల సంస్కృతగ్రంథాలు కొన్ని లభించాయి. ఈ సర్వాస్తి వాదులకు కూడా వినయ, సూత్ర, అభిదమ్మపిటకా లున్నాయి. మొదటి రెండు పిటకాలు పాలీ మూలానికి దగ్గరగా వున్నాయి. ఏడు అవాంతర భాగాలు గల అభిధమ్మపిటకం మాత్రం పాలీ అభిధమ్మపిటకంతో సంబంధం లేని స్వతంత్ర రచనగా కనిపిస్తుంది. దీనినిబట్టి అభిదమ్మపిటక మంతా తర్వాత బౌద్ధంలో శాఖోపశాఖా భేదాలు ఏర్పడిన తర్వాత సృష్టించబడిందనే అనుమానం కలుగుతున్నది.



ఇతర హీనయానశాఖల గ్రంథాలు 'మహావస్తు' వినా పూర్తిగా నశించాయి. ఈ 'మహావస్తు' మహా సాంఘిక వినయానికి పాఠాంతరమైన 'లోకుత్తరాని'కి పీఠిక కావచ్చు నని పండితు లంటారు. ఈ మహా సాంఘిక వినయం చీనాభాషలో అనూదితమైంది. చీనాభాషలోని సంయుక్తాగమం (సంయుక్తనికాయం) కూడా బహుశః మహాసాంఘిక మూలంనుండి రచితమైన దని పండితులు అభిప్రాయపడుతున్నారు. సత్యసిద్ధి శాస్త్ర మన్నది కేవలం చీనాభాషలోని అనువాద గ్రంథంనుంచి మాత్రమే తెలియవస్తున్నది.

మహాయాన గ్రంథాలు :- 1. మహాయానులు కూడా సిద్ధాంత రీత్యా వినయపిటకాన్ని అంగీకరించారు గనుక, బోధిసత్త్వస్థితికి ప్రాధాన్యమిస్తూ కొన్ని గ్రంథాలు వ్రాయబడినవే గాని, మొత్తంమీద వినయపిటకంపై సంస్కృతగ్రంథాలు అంతగా బయలుదేరలేదనే అనాలి. హీనయాన వినయపిటకంలోను బుద్ధుని గతజన్మకు, ప్రస్తుతజన్మకు సంబంధించిన పెక్కు కథలు, జాతకాలు, అవదానాలు ఉన్నవి. ఈ కథలను మహాయానులు చిలవలు పలవలుగా అల్లారు. ఇవి నిజానికి సూత్ర పిటకంలోవైనా మహాయానులు వీటిని వినయంలోనే చేర్చారు.

బుద్ధజీవిత చరిత్రలు : మహావస్తువు హీనయాన సంప్రదాయానికి చెందిన బుద్ధచరిత్ర. మహాయానానికి చెందినవి లలితవిస్తరం, అశ్వ

ఘోషుని బుద్ధచరిత్రమున్నూ. లలితవిస్తరం సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ వ్రాసిన 'లైట్ ఆఫ్ ఏషియా" అనే గ్రంథానికి ఆధారం. మొదట లలితవిస్తరం హీనయానంలో ఒక శాఖవారైన సర్వాస్తివాదులది. కాని దీనిని మహాయానులు తమ సంప్రదాయానుసారంగా దిద్దుకున్నారు. అశ్వఘోషుని బుద్ధచరితం సిద్ధాంతరీత్యాను, సాహిత్యదృష్టిలోను ఉత్తమమైంది.

(ఆ) జాతకకథలు, అవదానకథలు: జాతకమాలలో బుద్ధుని 35 పూర్వజన్మ కథ లున్నాయి. అవదానశతం, అశోకావదానం మున్నగునవి అవదాన సాహిత్యానికి చెందినవి.

2. సూత్రాలు: సూత్ర సారస్వతం విశేషంగా వుంది. దానిలో అవతంసక (గంధవ్యూహ) సూత్రం, సద్ధర్మ పుండరీకసూత్రం, సుఖావతీ వ్యూహం చాలా ముఖ్యమైనవి.

శాక్యముని అవతంసక సూత్రాన్నే మొదట ఉపదేశించా డని మహాయానుల విశ్వాసం. ఈ సూత్రం కొంత భూలోకంలో, కొంత దేవలోకంలో ఉపదిష్టమైందట. ఇది పూర్తిగా తాత్త్విక విషయాలను, సంపూర్ణ బుద్ధునియొక్క, త్రికాయ దశకాయ బుద్ధునియొక్క, బోధిసత్త్వులయొక్క మహత్వాన్ని, ధర్మధాతువు మున్నగువాటిని వివరిస్తుంది.

సద్ధర్మ పుండరీక సూత్రం బుద్ధుని అంతిమోపదేశ మట. ఇది మహాయాన బౌద్ధమత సారాంశం. ఇది అవతంసక సూత్రంకన్న ప్రాచీనం కావచ్చు. ఇది అంతగా తత్త్వవిషయభరితం కాదు. కాని భక్తి రస సంభరితం. శాక్యముని శాశ్వతపిత. ఈ త్రిలోకాలనే నిప్పంటుకొన్న ఇంట్లో బాధపడుతున్న తన సంతానాన్ని రక్షించడానికి యత్నిస్తాడు. నిజానికి అతని కెప్పుడూ జరామరణాలు లేవు. కాని ఈ మానవజాతి సముద్ధరణ నిమిత్తం లౌకికదృష్టికి అలా పుట్టినట్టు కనిపిస్తాడు.

సుఖావతీ వ్యూహంలో అమితాభ బుద్ధుని మహిమలు వర్ణితాలు.



ఇతర సూత్ర గ్రంథాలలో చాల ముఖ్యమైనవి ప్రజ్ఞాపారమిత సూత్రం. సురంగమసూత్రం, విమలకీర్తి నిర్దేశసూత్రం, లంకావతార సంధి నిర్మోచన సూత్రం, సువర్ణప్రతీహార సూత్రమున్నూ.

ప్రజ్ఞాపారమిత సూత్రం మాధ్యమికుల శూన్యవాదం తెలిపేది. సురంగమసూత్రం, విమలకీర్తి నిర్దేశసూత్రం అర్వాచీన మాధ్యమిక వాద గ్రంథాలు. కడపటిది యోగాచార్య సంప్రదాయానికి చెందినది.

3. అభిధర్మసూత్రం: దీనిలోని సంస్కృత మహాయాన సారస్వతాన్ని రెండు శాఖలుగా విభజించవచ్చు. (అ) మాధ్యమిక శాఖలు. (ఆ) యోగాచార్య శాఖలు.

(అ) నాగార్జునుడు, ఆర్యదేవుడు, ఆయన శిష్యులు రచించినవి వీటిలో ముఖ్య మైనవి. అవి—

1. ప్రజ్ఞాపారమితాసూత్రశాస్త్రం, - నాగార్జునుడు.
2. ద్వాదశనికాయశాస్త్రం – నాగార్జునుడు.
3. మాధ్యమికశాస్త్రం - నాగార్జునుడు.
4. శతశాస్త్రం – ఆర్యదేవుడు.
5. బోధికార్యావతారం – శాంతిదేవుడు.

(ఆ) యోగాచార్య సంప్రదాయ గ్రంథాలన్నీ చాలవరకూ అసంగ వసుబంధువు లనే సోదరులు వ్రాసినవి. ఈ సంప్రదాయానికి మూలపురుషుడు బోధిసత్త్వమైత్రేయు డని కూడా చెప్పుకొనడం కద్దు. ఈ మైత్రేయుని స్వరూపం కూడా అనుమానాస్పదం. మైత్రేయుడు తుషితస్వర్గంలో వుంటూ సత్య ధర్మ ప్రవర్తనకోసం భారతావనిలో అవతరించాడని యోగాచార్య ధర్మశాస్త్రం పేర్కొంటుంది. మైత్రేయుడు, అసంగుడు తన సిద్ధాంతానికి అనుగుణంగా కల్పించిన వ్యక్తే నని కొంద రంటారు. ఇతడుకూడా బోధిసత్త్వులలో ఒక్కడైన చరిత్రాత్మకవ్యక్తి అని మరికొందరి వాదం.

అసంగుడే యోగాచార్య సంప్రదాయానికి ప్రధానప్రవర్తకు డనాలి. ఇతని తమ్ముడు మొదట సర్వాస్తివాది సంప్రదాయంవాడు. అప్పుడు అభిధర్మ కోశ మనే ఉద్గ్రంథం వ్రాశాడు. తర్వాత అసంగుని ద్వారా యోగాచార్య మహాయాన కూటంలో చేరి పెక్కు తత్త్వగ్రంథాలు రచించాడు.

ఈ శాఖలో ముఖ్యమైన గ్రంథా లివి :—

1. యోగాచార్య భూమిశాస్త్రం - మైత్రేయుడు.
2. ప్రకరణార్యవాచాశాస్త్రం - అసంగుడు.
3. సూత్రాలంకార టీక - అసంగుడు.
4. మహాయాన సంపరిగ్రహశాస్త్రం - అసంగుడు.
5. దశభూమికాశాస్త్రం - వసుబంధువు.
6. ఆలంబనప్రత్యయ ధ్యానశాస్త్రం - జినదేవుడు.
7. విద్యామాత్ర సిద్ధిశాస్త్రం - వసుబంధువు.
8. మహాయాన అభిధర్మ సంగీతిశాస్త్రం - అసంగుడు.

అటు తర్వాత బౌద్ధతార్కికులు బయలుదేరారు. వీరిలో మొదటివాడు దిఙ్నాగాచార్యుడు. మరొక ప్రముఖుడు ధర్మకీర్తి. వీరు సంస్కృతంలో గ్రంథాలు రచించారు. మూలగ్రంథాలు లుప్తమై పోయాయి. కాని చీనాభాషలో అనువదించబడిన ఈ గ్రంథాలలో రెండు, టిబెట్టు భాషలో అనువదించబడినవాటిలో కొన్ని మిగిలాయి.

లలితవిస్తరం : రామాయణ భారత భాగవతాదీతిహాస పురాణాలు ఏ విధంగా బహుళప్రచారం పొందాయో, బౌద్ధవాఙ్మయంలో లలితవిస్తరం ఆ విధంగానే మహాపురాణంలాగ బహుళప్రచారం పొంది, ప్రజాదరం చూరగొన్నది. మన పురాణాలవలెనే ఇదీ సులభతర సంస్కృత రచన. పురాణాల కర్త లెవ్వరో నిర్ణయించ వీలుకానట్టు దీని కర్తపేరూ



తెలియదు. సామాన్యంగా పురాణాలు "నైమిశారణ్యంబున సూతుండు శౌనకాదులంగూర్చి" చెప్పినట్లు ఇదికూడా శ్రావస్తీనగర ప్రాంతంలోని జేతవనంలో బుద్ధభగవానుడు శిష్యుల కోరికపయి చెప్పినట్లు ఉన్నది.

ప్రాచీన బౌద్ధ గ్రంథాలన్నీ ప్రాకృత భేదమయిన పాలీభాషలోనే ఉన్నాయి. కాని బౌద్ధంలో హీనయాన మహాయాన సంప్రదాయాలు ఏర్పడిన తర్వాత, హీనయాన సంప్రదాయ గ్రంథాలన్నీ పాలీప్రాకృతంలోను, మహాయాన సంప్రదాయ గ్రంథాలన్నీ సంస్కృత భాషలోను రచితములైనట్టు పరిశీలించగా తెలుస్తున్నది. లలిత విస్తరం మహాయాన సంప్రదాయానికి చెందినది; గనుక సంస్కృత భాషలో రచితం కావడం సమంజసమే!

లలిత విస్తరంలోని మరొక విశేషం రచన గద్యమయం కావడం. పురాణాలు పద్యరూపాలే కాని, గద్యరూపాలు కావు. లలిత విస్తరం గద్యరూపం అయినా, దీనిలోని పరిచ్ఛేదాలయిన పరివర్త విస్తరాలు ప్రాకృతమిశ్ర గాథలతోను, సంగ్రహ శ్లోకాలతోను సమాప్త మవుతాయి. గద్య భాగంలోను ఎడనెడ శ్లోకాలూ లేకపోలేదు. కాని, ఆ పద్యాలు కేవలం పూర్వులు చెప్పిననాటి ఉద్ధరణాలు కనుక దీనిని గద్యపురాణ మనే అనాలి.

ఏ దేశమందైనా మత ప్రచారానికి వాఙ్మయమే ప్రధాన సాధనంగా గ్రహించబడడం నాటినుంచి నేటివరకు అలవాటులో ఉన్న సంగతి. వైదిక మతవ్యాప్తికి వేద వేదాంగాలు, శాస్త్రాలు, తదుపరి కావ్యాలు చాల తోడ్పడ్డాయి. క్రైస్తవమతం వివిధ దేశాలలో ప్రచారం పొందడానికి బైబిలు, దాని భాషాంతరీకరణాలు ఎంతో ఉపయోగించాయి. అ విధంగానే బౌద్ధ మతం ఆసియాఖండంలో వ్యాప్తి చెందడానికి బౌద్ధవాఙ్మయమే ప్రధాన సాధనమైంది. బౌద్ధమత గ్రంథాలలోని విశేషం కేవలం మతవిషయాలను మాత్రమే తెలుపక జనసామాన్యానికి అవసరమైన పెక్కు విషయాలను యథాలాపంగా తెలియచేయడం. లలితవిస్తరం కూడా ఇట్టి పద్ధతిలోనే రచితమయినట్టు "తత్సాధు భగవం స్తం లలిత విస్తరం నామ ధర్మపర్యాయం దేశయతు. తద్భవిష్యతి బహుజనసుఖాయ, బహుజన హితాయ,

లోకానుకంపాయై మహతో జనకాయ, స్వార్థాయ హితాయ, సుఖాయ దేవానాం చ మనుష్యాణాం చ'' అనేదానివల్ల స్పష్టమవుతున్నది.

మతగ్రంథాలు ఈ రీతిని బహుళజనహిత సాధకాలయిన విజ్ఞాన సర్వస్వాలవలె ఉపయోగించడం కొత్త కాదు. సుప్రసిద్ధమయిన అగ్నిపురాణం వివిధ విషయ ప్రతిపాదకం కావడం, మైసూరు ప్రాంతీయుడయిన బసవరాజు రచించిన శివతత్త్వ రత్నాకరం విజ్ఞాన సర్వస్వం కావడం గీర్వాణ భాషాభిజ్ఞులకు తెలుసు. బౌద్ధమత ప్రతిపాదకమైన ఈ లలిత విస్తరం కూడా విజ్ఞాన సర్వస్వం వంటిదే; అంతే కాదు. వివిధవిషయ ప్రతిపాదకాలయిన ఇలాటి గ్రంథాలలో కెల్లా ఇదే ప్రాచీనమతం. అశోకుని కాలానికే ఇది రచితమయి ఉండవచ్చునని పరిశోధకుల ఆశయం. క్రీస్తు పూర్వం 75 సంవత్సరాల నాడే ఇది చీనాభాషలో అనూదితం కావడం బట్టి దీని ప్రాచీనత స్పష్టమవుతున్నది.

భారత రామాయణాదుల పేళ్లనుబట్టి వాటిలోని విషయాలు కొంత సులభంగా ఊహించడానికి అవకాశం ఉంది. ఈ లలిత విస్తరమనే మహాపురాణంవిషయ మేమిటో పేరునుబట్టి తెలియదు. విస్తరమంటే వ్యాప్తికి తేవడం, లలితమైన తథాగతుని సిద్ధాంతాన్ని వ్యాప్తికి తేవడం, అదిన్నీ మృదువుగా, లలితంగా తేవడం అనే లక్షణంతో ఈ పేరు రూఢమయినదని కొందరు వూహిస్తున్నారు. దీనికి లలితవిస్తర మహాపురాణమని, లలితవిస్తర సూత్రమని పర్యాయనామా లున్నాయి.

భారత రామాయణాదులలో వలె లలితవిస్తరంలోను దేవ, మనుష్యాదుల ప్రశంస, దేవతలలో బ్రహ్మేంద్ర వైశ్రవణాదుల విశేష ప్రశంస ఉన్నది. రతి, అరతి, తృష అనేవారు బోధిసత్త్వుని శత్రువయిన మారుని దుహితలు అని అనడం వేదాంత విషయాలను స్ఫురింపజేస్తుంది. దీనిలో బుద్ధుని చరిత్ర-అతడు మృగదావంలో తొలిసారిగా ధర్మప్రబోధం చేసినంతవరకు విపులంగా తెలుపబడినవి. తక్కిన పురాణాలలో ఉన్నట్లే దీనిలోను, పునరుక్తులు, అతిశయోక్తులు చర్వితచర్వణాలు కానవస్తాయి.



తుషితభువనంలో దేవతా సేవితుడయిన బోధిసత్త్వుడు భూలోకంలో ధర్మప్రతిష్ఠాపనకై బుద్ధుడై అవతరిస్తాడు. తుషిత లోకంలో తన ప్రతినిధిగా మైత్రేయుణ్ణి నియమిస్తాడు. బోధిసత్త్వుడు భూలోకంలో శాక్యవంశ రాజయిన శుద్ధోదనునికి, మాయాదేవికి పుత్రుడుగా ఉద్భవిస్తాడు. బోధిసత్త్వుని దివ్యతేజం మాయాదేవి గర్భంలో ప్రవేశించగానే శుద్ధోదనుని రాణివాసంలో పెక్కు శుభసూచనలు కనిపిస్తాయి. దేవతాస్త్రీలు కొందరు మానుషరూపంలో వచ్చి, మాయాదేవికి ఆమె గర్భంలో లోకోద్ధారు డయిన పుత్రుడు ఉద్భవిస్తాడని చెబుతారు. గర్భవతి అయిన మాయాదేవి వన విహారం అపేక్షించి, లుంబినీ వనానికి విహారార్థం వెళ్లి ఒక ప్లక్షవృక్ష చ్ఛాయలో బుద్ధుని ప్రసవించింది. బుద్ధుడు జనించిన కొద్ది రోజులలోనే మాయాదేవి మరణించింది. శుద్ధోదనుడు భార్యావియోగంతో కుములుతూనే ఎంతో అప్యాయంగా పుత్రుని చూచుకొంటాడు. సవతితల్లి ఆ పుత్రుని పెంచే బాధ్యత వహిస్తుంది. చక్రవర్తి లక్షణ లక్షితుడయిన బుద్ధుని చూచి ప్రజలు ముగ్ధులవుతారు. ప్రతిభాశాలి అయిన బుద్ధుడు అప్రయత్నంగానే సమస్త విద్యలను, కళలను నేర్చి, అందరికీ ఆశ్చర్యం కలిగిస్తాడు. బుద్ధుడు విహారార్థం వివిధ స్థలాలకు వెళ్లుతాడు; అతని శరీర కాంతికి ప్రజలు ఆశ్చర్యపడుతారు. ఒకమారు బుద్ధుడు కృషి గ్రామానికి వెళ్లి అయిదుగురు మునులతో తత్త్వాన్ని గురించి వాదిస్తాడు. ఆయన సంచరిస్తుంటే నీడ కనిపించదు. దానికి ప్రజలు అబ్బురపడతారు.

ఇలా ఉండగా, శుద్ధోదనుడు తన పుత్రునికి వివాహం చేయడానికి, తగిన కన్యకోసం అన్వేషిస్తాడు. దండపాణిఅనే శాక్యక్షత్రియుని పుత్రిక గోప అనే కన్య సర్వవిధాలా గౌతమునికి అనురూప అని అభిజ్ఞులు తెలుపుతారు. తన పుత్రికను శిల్పజ్ఞునికి తప్ప ఇతరులకు ఇచ్చి వివాహం చేయడం సాధ్యపడదని దండపాణి కచ్చితంగా తెలుపుతాడు. బుద్ధుడు సమస్త కళలలోను తననేర్పు వెల్లడించి గోపను పరిణయ మాడతాడు.

బుద్ధునికి తత్త్వజిజ్ఞాసలోనే ఎక్కువ మక్కువ ఉండడం కనిపెట్టి శుద్ధోదనుడు కలతపడతాడు, తన పుత్రుడు సత్యాన్వేషణకై వెడలిపోయి

నట్లు అతడు కల గని, బెదరిపోయి, గౌతమునికి బహిః ప్రపంచంతో ఎలాటి సంబంధమూ లేకుండా చేయడానికి, ఉద్యానవనంతో పాటు ఒక విశాలభవనం నిర్మించి, దానిలో సమస్త సౌకర్యాలూ ఏర్పరచి, కుమారుణ్ణి దానిలో ఉంచుతాడు. కాని, రాజపుత్రుడు ఒకనాడు పట్టణం పర్యవేక్షించా లని కోరుతాడు. అతనికి దుఃఖచిహ్నాలేమీ కానరాకుండా వుండేటట్లు శుద్ధోదనుడు కట్టుదిట్టాలు ఎంతగా చేసినా, బుద్ధుడు పట్టణంలో తిరిగిన నాలుగునాళ్లలోను ఏ దుఃఖితుడో కంటబడక తప్పలేదు. వాడిని చూడగానే గౌతమునికి తులలేని దుఃఖం, కలవరపాటు కలిగాయి, మానవులను మృత్యురోగ దారిద్ర్యాలు కాలసర్పాలవలె కబళిస్తుంటగా, తానొక్కడూ ఆనందంలో ఓలలాడుతూవుండడం సరికాదని బుద్ధుడు భావించి దుఃఖకారణం కనుగొని, ప్రాణికోటిని దుఃఖార్ణవంనుంచి తరింపజేసే ఉపాయం కనుక్కోవాలని నిశ్చయించాడు. అర్ధరాత్రి భార్యాపుత్రుల్ని విడిచి ఎవ్వరికీ తెలీకుండా అంతఃపురం, నగరం వదలి వెళ్లిపోతాడు. రథసారథి అయిన ఛందకునికి మాత్రం ఈ విషయం తెలుసును. బుద్ధుడు మారుని జయించి అతని చుహితలయిన రతి, అరతి, తృష్ణలకు లొంగక మహాబోధివద్ద తత్త్వం తెలుసుకొని, తాను కనుగొన్న ధర్మ సూక్ష్మలను కాశీనగర సమీపంలోని మృగదావమనే ప్రదేశంలోను, ఇతర స్థలాలలోను వెల్లడించి, ధర్మచక్ర ప్రవర్తనం చేస్తాడు. అజ్ఞానాంధకారంలో పడి, కొట్టుమిట్టాడుతూ దారి తెన్ను తెలియక పరితపించే జనానికి ఈ రీతిగా తరణోపాయం లభించింది. ఈ అంశమే ఈ 'లలితవిస్తర' మహాపురాణంలో విపులీకరింపబడినది.

లలితవిస్తరం 27 అధ్యాయాల ఉద్గ్రంథం. ప్రతి అధ్యాయానికీ పరివర్తమని పేరు. ఆ యా అధ్యాయాలను. వాటిలోని ప్రధానాంశాలను ఇక్కడ సంగ్రహంగా తెలుపుతున్నాము!

మొదటిది నిదాన పరివర్తాధ్యాయం. లలితవిస్తర ప్రస్తావం. దీనిలో ప్రధానాంశం. రెండవది సముత్సాహ పరివర్తం. దీనిలో బోధిసత్త్వుని గుణగణాలు, అతడు కొలువుండిన విధం వర్ణితములయాయి.



మూడవది పరిశుద్ధి పరివర్తం. దీనిలో చక్రవర్తి ధర్మాలు, అతని లక్షణాలైన చక్ర, హస్తి, అశ్వ, మణి, స్త్రీ, గృహపతి, పరిణాయక రత్నాలు వివరించబడినవి: మధుర, హస్తినాపురి, మిథిల మొదలైన నగరాల వర్ణనలు వున్నవి. నాల్గవది ధర్మాలోకముఖ పరివర్తం. పరిషత్తులో బోధిసత్త్వుడు ధర్మబోధ చేయడం దీనిలోని విషయం. ఐదవది ప్రచల పరివర్తం. బోధిసత్త్వుడు తుషిత భవనంలో తనకు మారుగా మైత్రేయుడనే దేవపుత్రుని నియమించి భూలోకానికి అవతరించిన విషయం దీనిలో తెలుపబడింది. ఆరవది గర్భావక్రాంతి పరివర్తం. బోధిసత్త్వుడు శుద్ధోదనుడనే కపిలవస్తు ప్రభువునకు పుత్రుడుగా జన్మించదలచి మాయాదేవి గర్భంలో ప్రవేశిస్తాడు. ఏడవది జన్మపరివర్తం. దీనిలో బోధిసత్త్వుడు గౌతమ బుద్ధుడుగా జన్మించిన అంశం విపులంగా ఉన్నది. ఎనిమిదవది దేవకులోపనయన పరివర్తం. గౌతమ బుద్ధుడు దేవాలయానికి పంపబడిన వృత్తాంతం యిందులో ఉంది. తొమ్మిదవది అభరణ పరివర్తం. బుద్ధుడు ధరించిన అభరణాల వర్ణనం యిందులో వున్నది. పదవ అధ్యాయం లిపిశాలా సందర్శన పరివర్తం. దీనిలో లిపులనుగూర్చిన వివరా లున్నాయి. అచ్చులలోని ఋ, ౠ, ఌ, ౡ, ఎ, ఒ లు, హల్లులలోని శకారం దీనిలో లేవు. రేఫం రకారంగా గ్రహించబడింది. పదకొండవ అధ్యాయంలో బుద్ధుడు చూచిన కృషి గ్రామ వర్ణనం ఉంది. పండ్రెండవది శిల్పసందర్శన పరివర్తం; గౌతముడు వివాహమాడ దానికి తగిన కన్య దండపాణి అనే శాక్యుని పుత్రిక అయిన గోప అనే కన్య అని నిశ్చయమైన తర్వాత ఆమెను, ఆమెతండ్రిని మెప్పించడానికి గౌతముడు తన శిల్పనైపుణ్యం చూపిన ఘట్టం యీ అధ్యాయంలో ఉంది. పదమూడవది సంచోదన పరివర్తం. దీనిలో బుద్ధునికి అజ్ఞాతంగా దేవతలు ధర్మ సంచోదన చేసిన విషయం ఉంది. పధ్నాలుగవది స్వప్న పరివర్తం; దీనిలో బుద్ధుడు వన విహారానికి బయలుదేరడం, మనస్సు మారడం, దీనిని గ్రహించి శుద్ధోదనుడు తన కుమారుడు సన్యాసం తీసుకోకుండా తగు కట్టుదిట్టాలు చేయడంస్వప్నం ఉన్నాయి. పదిహేనవది అభినిష్క్రమణపరివర్తం. బుద్ధుడు నడిరేయి అంతఃపురాన్ని విడిచి వెళ్లిపోవడం ఇందువర్ణించబడింది. పదహారవది బింబిసారోపసంక్రమణ పరివర్తం. గౌతమబుద్ధుడు రాజగృహ

మనే నగరం ప్రవేశించి బింబిసార భూపాలుణ్ణి చూడడం ఇందు వివరించబడింది. పదిహేడవది దుష్కరచర్యా పరివర్తం. రామపుత్రుడైన రుద్రకునితో బుద్ధుడు వాదం చేయడం, దుష్కర చర్యావలంబనం దీనిలోని విషయాలు. పద్దెనిమిదవది నైరంజనా పరివర్తం. ఇందులో గౌతముడు బోధిమార్గ విజ్ఞానం పొందడం, అభిలషితవస్తు సిద్ధికై నైరంజనా నదీ స్నానం, సుజాత చేసిన పరిచర్య వర్ణితాలు. పందొమ్మిదవది బోధిమండగమన పరివర్తం. బుద్ధుడు ప్రయాణం చేసేటప్పటి గతిభేదాలు బోధిద్రుమం వద్దకు వెళ్ళడం మొదలైనవి ఉన్నాయి. ఇరవయ్యవది బోధిమండ వ్యూహ పరివర్తం. దశదిశలలోను బోధిమండ వ్యూహం ఎలా విస్తరించిందీ ఇందు వర్ణితం. ఇరవయి ఒక్కటవది మారధర్షణ పరివర్తం. మారుడు తన పుత్రుడైన సార్థవాహుని మాట వినక గౌతమ బుద్ధునిపై జైత్రయాత్రకు వెడలడం, బుద్ధుడు మారుణ్ణి బెదిరించి తరిమివేయడం యీ అధ్యాయంలోని విషయాలు. అభిసంబోధన పరివర్త మనేది ఇరవై రెండవ అధ్యాయం. బుద్ధునికి కలిగిన సందేహాలు, సమ్యక్సంబోధి వివరింపబడినాయి. ఇరవైమూడవది సంస్తవ పరివర్తం. శుద్ధావాసకాయికులయిన దేవపుత్రులు గౌతమబుద్ధుని స్తుతించడం దీనిలోని విషయం. ఇరవై నాల్గవది త్రపుష భల్లిక పరివర్తమనేది. దీనిలో బుద్ధుడు త్రపుష భల్లికులనే వణిజులవల్ల తేనె మున్నగు ఆహార పదార్థాలు స్వీకరించి శుభాలు ఆకాంక్షించడం వర్ణితం. ఇరవై అయిదవది అధ్యేషణా పరివర్తం. ధర్మచక్ర ప్రవర్తనకోసం మృగదావమనే ప్రదేశానికి వెళ్ళవలసిం దని ఇందులో దేవపుత్రులు గౌతముని ప్రార్థిస్తారు. ఇరవై ఆరవది ధర్మచక్ర ప్రవర్తన పరివర్తం. బుద్ధుడు మృగదావంలో ధర్మచక్ర ప్రవర్తనం ఒనర్చిన విషయం దీనిలో వర్ణితమయింది. గౌతమ బుద్ధుని మహాగుణాల వర్ణనకూడా ఇందులో విస్తృతంగా ఇవ్వబడి ఉన్నది. నిగమ పరివర్తమనేది కడపటి ఇరవై ఏడవ అధ్యాయం. దీనిలో లలిత విస్తర ఫలశ్రుతి చెప్పబడింది.

ఈ గ్రంథానికి లలితవిస్తర మనే పేరు ఏ కారణంవల్ల పచ్చినా, ఈ పరివర్తాలు - అధ్యాయాలు - లలిత లలితాలై విస్తరంగా ఉన్నవన్నది మాత్రం నిస్సందేహం.



ఈ గ్రంథాన్ని సావధానంగా పరిశీలిస్తే పెక్కు విషయాలలో ప్రాచీన కాలపు జనులు అభిప్రాయాలు తెలుసుకొనడానికి అవకాశం ఉంది. ప్రాచీనార్య సంస్కృతి, వాస్తుశిల్ప వివేకం, లిపివివేచనం, సమకాలీన సాంఘిక పరిస్థితులు, ప్రజాజీవనపద్ధతి తెలుస్తాయి. మధ్య మధ్యను ఇచ్చే ఉపమానాలు ఎంతో హృదయంగమంగా ఉంటాయి.

బౌద్ధయుగం నాటికి భారతదేశంలో వుండే నమ్మకాలు, ఆచారవ్యవహారాలు లలితవిస్తరంనుండి తెలుసుకోడానికి వీలవుతూ ఉన్నది.

సర్వార్థసిద్ధుడు పుట్టుటకు పూర్వం మాయాదేవికి కలిగిన స్వప్నాన్నిబట్టీ, అభినిష్క్రమణానికి ముందు శుద్ధోదనుడికీ, గోపాదేవికీ కలిగిన స్వప్నాలనుబట్టీ స్వప్నముల విషయంలో అప్పుడు నమ్మిక వున్నట్లు తెలుస్తున్నది. జోస్యుల మాటలను బట్టి, అసితమహాముని వృత్తాంతాన్ని బట్టి జ్యోతిషంలో ఆకాలంలో గాఢమైన విశ్వాసం వున్నట్లు స్పష్టపడుతున్నది. గర్భవతులు ఏమి కోరినా, ఆ కోరికలను నెరవేర్చే పద్ధతి అమలులో వుండేది. అందువల్లనే ఆసన్నప్రసవ అయినా మాయాదేవి, ఆమె కోరిక పయి లుంబినీవనానికి పంపబడినది. పుట్టగానే కుమారుడికి శుద్ధోదనుడు పేరు పెట్టినట్లున్నది. అప్పటి ఆచారం అదేనేమో? శిశువు కొంచెం పెరిగాక ఇల్లు బయలుదేరించడం ఒక సంప్రదాయం। మొదట దేవాలయానికి తీసుకువెళ్ళి దేవదర్శనం చేయించడం ఇప్పటికీ అనుసరించబడుతున్న ఆచారం। ఈ సంప్రదాయాన్ననుసరించే రాజకుమారుణ్ణి దేవాలయానికి తీసుకుని వెళ్లడం జరిగింది. బ్రహ్మ, విషు, మహేశ్వరులతోపాటు కుబేరుడు, కుమారస్వామి, సూర్యచంద్రులు, లోకపాలకులు కూడా పూజింపబడుతూ వుండేవారు. ఇప్పటి కాలంలో దక్షిణభారతదేశంలోనే ఆరాధ్య దేవతగా ఉన్న కుమారస్వామికి అప్పట్లో ఉత్తరదేశంలో కూడా పూజలు జరుగుతూ వుండినట్లు తెలుస్తూ వున్నది. చౌల సంస్కారాన్ని గురించి చెప్పలేదు కాని చౌలం జరపవలసిన కాలంలో ఆభరణాలను అలంకరించినట్లు ఇందు చెప్పబడింది.

తర్వాత జరగవలసినది అక్షరాభ్యాసం. అయిదేళ్లు పూర్తి అయాక అక్షరాభ్యాసం చెయ్యడం మనదేశంలో ఆచారంగా వుంటున్నది. ఇందులో వయోనిర్ణయంసంగతి లేదు కాని 'చదువచెయ్యడానికి తగిన వయస్సు' అనే విషయం సూచించబడింది. మహారాజుల కుమారులయినా సరే, ఆకాలంలో లిపిశాలకు అంటే-బడికివెళ్లి అక్షరాభ్యాసం చెయ్యవలసిందే। ప్రభు కుమారుడు గదా అని రాజభవనంలోనే జరిగించే ఆచారం లేదు.

రాజకుటుంబాలలో జరిగే వివాహాల విషయంలో యువతీ యువకులకు స్వేచ్ఛ వుండేది. పరస్పరం ప్రేమానురాగాలు ఉన్నవో లేవో పరిశీలించడం కోసం తగిన ఉపాయాలు పన్నడం జరిగేది. అశోకభాండాభరణాల ప్రదానం దీనికి సంబంధించినదే: పరస్పరానురాగం వున్నా తొందరపాటున పెళ్ళిళ్ళు జరిగేవి కావు. కులం కట్టుబాట్లకు లొంగి వుండినప్పుడే అవి జరిగేవి.

సీతా స్వయంవరంలో శివుని విల్లు ఎక్కుపెట్టడమూ. ద్రౌపదీస్వయంవరంలో మత్స్యయంత్రాన్ని పడగొట్టడమూ వధూశుల్కంగా ఏర్పడినట్లే సర్వార్థసిద్ధునికి గోపను ఇవ్వడం విషయంలో శిల్పజ్ఞత పణంగా నిర్ణయించబడింది.

ఆ కాలంలో ఘోషాపద్ధతి లేకపోలేదు. సర్వార్థసిద్ధుని దేవి గోప మాత్రం మేలిముసుగు లేకుండానే అంతఃపురంలో స్వేచ్ఛగా సంచరించేది. ఇది రాణివాసంలో వారికి వెగటుగా కనబడినా ఆమె లక్ష్యం చెయ్యలేదు. అత్తమామలు కూడా ఏమీ అనుకోలేదు. ఈ విషయాన్నిబట్టీ,కర్షక కన్యక అయిన సుజాత సిద్ధార్థుణి సేవించిన విధాన్నిబట్టీ చూడగా ఆ కాలంలో స్త్రీలకు స్వాతంత్ర్యం వుండినట్లు స్పష్టంగా తెలుస్తున్నది.

తత్త్వజ్ఞానంకోసం తపస్సు - కఠిన తపస్సుకూడా చెయ్యడం, అట్టి తపస్వులు అరణ్యాలలో నివసించడం పురాణ యుగంలోనే కాకుండా సర్వార్థసిద్ధుని కాలంలోనూ వున్నది. అభినిష్క్రమణం చేసిన తర్వాత సిద్ధార్థుడు వివిధమార్గాలలో తపస్సు చేస్తున్నవారిని చూచి, తానూ అపద్ధతులను కొంతకాలం అవలంబించిన సంగతీ, తపస్సువల్ల తమ సంకల్పం నెరవేరగలదనే నమ్మకం వుండినదన్న సంగతీ గమనించదగినది.



లలితవిస్తరంలోని గద్యభాగం కేవలం సంస్కృతంలోనే ఉండడం కాకుండా ఎంతో సరళంగానూ, సులభగ్రాహ్యంగానూ ఉంటున్నది. మచ్చునకు ప్రచల పరివర్తంలోని యీ క్రింది భాగాన్ని చూడవచ్చు—

''అథ బోధిసత్త్వో మైత్రేయం బోధిసత్త్వం తుషితభవనేఽభినిషద్య పునరపి తాం మహతీం దేవపర్షద మామన్త్రయతే స్మ. కీ దృశేనాహం మార్షా రూపేణ మాతుః కుక్షౌ వవక్రామేయమ్? తత్ర కేచి దాహుః- శక్రరూపేణ; కేచిదాహుః - బ్రహ్మరూపేణ;.....................తత్రోగ్రతేజో నామ బ్రహ్మకాయికో దేవపుత్రః పూర్వర్షి జన్మచ్యుతోఽవైవర్తికోఽనుత్తరాయాః సమ్యక్ సంబోధేః స ఏవ మాహ - యథా బ్రాహ్మణానాం మన్త్రివేదశాస్త్ర పాఠే ష్వాగచ్ఛతి, తాదృశేనైవ రూపేణ బోధిసత్త్వో మాతుః కుక్షౌ వవక్రామితవ్యః. తత్పునః కీ దృశమ్? గజవర మహాప్రమాణః షడ్దంతో హేమజాల సంకాశః, సురుచిర సురక్తశీర్షః స్ఫుటితగలిత రూపవాన్. ఎతచ్ఛ్రుత్వా రూపం బ్రాహ్మణ వేదశాస్త్ర తత్త్వజ్ఞో వ్యాకర్షిత శ్వేతో వైభాపీ ద్వాత్రింశల్లక్షణో పేతః.

ఇతి హి భిక్షవో బోధిసత్త్వో జన్మకాల మవలోక్య తుషితవరభవనస్థః ఏవం రాజ్ఞః శుద్ధోదనస్య గృహవరే అష్టౌ పూర్వ నిమిత్తాన్యుపదర్శయతిస్మ. కతమా న్యష్టౌ? తద్యథా - వ్యపగత తృణఖాణం కంటక శర్కర కడల్య నిర్మలం సుషిక్తం సుశోధిత మనాకులవాత తమో రజో విగతదంశక మక్షికా పతంగ సరీసృపాగత మవకీర్ణకుసుమం సమం పాణితలజాతం తద్గృహం సంస్థిత మభూత్. ఇదం ప్రథమం పూర్వ నిమిత్తం ప్రాదురభూత్.

యే చ హిమవత్పర్వతరాజ నివాసినః పత్రగుప్త శుక శారికా కోకిల హంస క్రౌఞ్చ మయూర చక్రవాక కుణాల కలవింక జీవంజీవకాదయో విచిత్ర రుచిరపక్షా మనోజ్ఞ ప్రియభాషిణః శకునిగణాస్తే ఆగత్య రాజ్ఞః శుదోదనస్య గృహవరే వితర్ది నిర్యూహ తోరణ గవాక్ష హర్మ్యకూటాగార

ప్రాసాదతలేషు స్థిత్వా సముదితాః ప్రీతిసౌమనస్య జాతాః స్వకస్వకాని రుతాన్యుదాహరన్తి స్మ. ఇతి ద్వితీయం పూర్వ నిమిత్తం ప్రాదురభూత్."

ఈ గ్రంథంవల్ల అప్పటి సంస్కృత భాషా సంప్రదాయాలు కూడా చాలవరకు తెలుస్తాయి. సాహిత్య శాస్త్రానికి సంబంధించిన అలంకారాలెన్నో దీనిలో సుస్పష్ట మవుతాయి. పాణినీయానికి లొంగనివి, వినడానికి వింతగా ఉండేవి ఐన ప్రయోగాలు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణకు: పున (పునః), చోదేన్తి (చోదయన్తి), కల్పసహస్ర (కల్పసహస్రం), మండే (మండలే). దర్శేష్యసి (ద్రక్ష్యసి), ప్రభ (ప్రభా), ప్రజ్ఞ (ప్రజ్ఞా), [illegible] (పరిషదం).

ఉపసర్గల చేర్పు, మార్పు చాల వింతగా ఉంటుంది. పద్యాలలో చాలా చోట్ల ఛందస్సు కుదరదు. ఆ కాలంలో ఇవన్నీ బౌద్ధ సమ్మతాలు—సర్వసమ్మతాలు—అయి ఉంటాయేమో!

ఇందులోని శ్లోకాలు గద్యభాగంవలె కాకుండా వ్యాకరణానికి చాలా విలక్షణంగా వుండే పదాలతో కూడి ఉన్నాయి. ఇతర గ్రంథాలలో బహుళంగా కానవచ్చే అనుష్టుప్ ఛందస్సు ఇందులో చాలా స్వల్పంగా కానవస్తుంది.

పశ్య దేవ కుమారోఽయం జమ్బుఛాయా హి ధ్యాయతి,
యథా శక్రోఽథవా బ్రహ్మా శ్రియా తేజేన శోభతే.'

[కృషిగ్రామ పరివర్తం, పుట. 193]

ఇక్కడ 'జమ్బూచ్ఛాయాయాం' అనడానికి 'జమ్బుఛాయా' అనీ 'తేజసా' అనడానికి 'తేజేన' అనీ ఉన్నవి. ఛందస్సు మాత్రం పోలేదు.

అనుష్టుప్పు సకృత్తుగా వున్నా తక్కిన ఛందస్సులు ధారాళంగా ఉపయోగించబడ్డాయి.

ఆర్యావృత్తాని కొక ఉదాహరణం.—

ధర్మశ్చ యశ్చ్యుతోఽయం మమాంతికే గౌరవ ముపజనిత్వా,
తత్ర ప్రతిపద్యథాః ప్రాప్స్యథ నియతం సుఖమనంతం. [పుట 85]



పంచచామర వృత్తం—

'శక్ర బ్రహ్మ లోకపాల పూజనాయ నాయకం
త్రీణి కాల అగమిత్వ బోధిసత్త్వ అంతికం,
వన్దయిత్వ పూజయిత్వ ధర్మ శ్రుణుతే వరం
ప్రదక్షిణం కరిత్వ సర్వ గచ్ఛిషూ యథాగతా.' [పుట 126]

ఈ వృత్తంలో వ్యాకరణానికి లొంగని ప్రయోగాలు ఎన్నోవున్నాయి. మూడోపాదంలో ఛందస్సుకూడా తప్పిపోయింది.

రథోద్ధతవృత్తం—

పూర్వి తుభ్య బహు కల్ప కోటియో
ధ్యాన ధ్యాయత కిలేశ ధ్వేషణాత్,
తస్య ధ్యాన చరితస్య తత్ఫలం
యేన క్లేశ జగతో న బాధతే. [పుట 104]

వసంతతిలకానికి ఉదాహృతి—

''జాతస్య తస్య గుణసాగర సాగరస్య
జ్ఞాత్వా సురేశ్వర మరుద్భువనే ఉదగ్రః.
యస్యా మృదు న్నభశ్రవో బహుకల్పకోట్యా
హంతే థ తం వ్రజమ పూజయితుం మునీంద్రం.''

ఇందులోనూ ఛందో వ్యాకరణాలు అతిక్రమించబడ్డాయి.

శార్దూల విక్రీడితం—

'ఆజ్ఞప్తో యువతీజనశ్చ సతతం సంగీతి మా ఛేత్స్యథాః
న స్థానం ప్రకరోథ క్రీడరతిభిః నిర్బంధథాః మానసం,
యే వా ఇస్త్రియ మాయ నేక వివిధా దర్శేథ చేష్టాం బహుం
ఆరక్షాం ప్రకరోథ విఘ్నకురుథా మా ఖు వ్రజేత్పురతః'' [పుట 262]

దీని పద్ధతి కూడా పైవాటి వంటిదే.

సంస్కృతంలో ఇరవైయారు ఛందస్సు లున్నాయి. అంటే—ప్రతీపాదంలోనూ అన్ని అక్షరా లుండవచ్చునన్న మాట: ఇందులో 26 కు మించిన అక్షరా లున్న పాదాలతోడి వృత్తాలూ కొద్దిగా ఉన్నవి. అన్ని పాదాలూ ఒకే రీతిని ఉండకుండానూ ఉన్నాయి.

'వయ మిహ మణి వజ్రకూటం గిరిం మేరు
మభ్యుద్గతం తిర్య గత్యర్థ వైస్తారికం
గజప్రసహకార శుభాకులం వృక్ష
బృందాం ప్రసాదిత్వ నిర్ధారితానేకశః,
వయ మిహ మరుణాం పురే చాప్యసక్తా గతా
యక్ష గంధర్వ వేశ్మాని చోర్ధ్వం నభే మిశ్రితా
ఇమ పున నవఖండ మాసాద్య సీదామ భోః
కస్య లక్ష్మి నివర్తేతి బుద్ధేర్బలం. [పుట 189]

దీనిలో అన్ని పాదాలూ ఒకమాదిరిగా లేవు.

ఇందులోని శ్లోకాలు చాలావరకూ ధమ్మపదంలోని శ్లోకాలవలెనే కానవస్తున్నవి. 'గాథా' శబ్దం ఆర్యావృత్తమనే అర్థంలోనే వాడుకలో ఉన్నది. ఇందులో మాత్రం అది శ్లోకసామాన్య పరంగా వాడబడింది. పరివర్తాల చివర, గద్యభాగంలోని విషయాన్ని సంగ్రహించి చెప్తున్నప్పుడు—'ఇక్కడ యీ గాథ లున్నా' యని ఆర్యావృత్తాలు కానటువంటి శ్లోకాల నివ్వడంవల్ల యీ సంగతి తెలుస్తున్నది.

ఆ యా రసాలకూ, సందర్భాలకూ అనుగుణంగా అ యా వృత్తాలు ఉండాలనేది సాహిత్యతత్త్వవేత్తల నిర్ణయం. అట్టి నియమం లలితవిస్తరంలోనూ కానవస్తున్నది. దేవతలు అభినిష్క్రిమణం చెయ్యవలెనని గౌతమ బుద్ధుణ్ణి కోరుతూ చెప్పిన శ్లోకాలు గమనప్రేరణకు అనుగుణమైన ఛందస్సులోనే నడిచాయి—వాటిలో కొన్నిటిని చూడవచ్చును.



"విచిత్రవస్త్ర రత్నహార గంధమాల్య భూషితా
ప్రసన్నచిత్త ప్రేమజాత నారియో ప్రహర్షితాః,
ప్రబోధయన్తి యేఽగ్రసత్త్వ తూర్య సంప్రవాదితైః
జినానుభావి ఏకరూప గాథ తూర్య నిశ్చరీ.

యద నారిగణః తుం వేణురవైః
వివిధైస్తురియై ప్రతిబోధయిషు,
సుఖశైన గతం మనుజాధిపతిం
తద తూర్యరవే అయు నిశ్చరతే." [సంచోదనా పరివర్తం]

పయి శ్లోకాలు మూలంలో ఉన్నవి. అనువాదంలో ఇవ్వబడలేదు. అనువాదంలో చేర్చిన యీ క్రింది శ్లోకాలను కూడా ఈ విషయంలో గమనించవచ్చు—

"యస్యార్థి తుభ్య కల్పనేక త్యక్త త్యాగ దుస్త్యజా
సుచీర్ణ శీలు క్షాంతి వీర్య ధ్యాన ప్రజ్ఞ భావితా,
జగద్ధితార్థ సో తికాలు సాంప్రతం ఉపస్థితో
నైష్క్రిమ్య బుద్ధి చింతయాశు మా విలంబ నాయక.

త్యక్తు పూర్వ రత్నకోశ స్వర్ణరూప్య భూషణా
యష్టాతి యజ్ఞ నైకరూప తాసు తాసు జాతిషు,
త్యక్తభార్య పుత్ర ధీత కాయు రాజ్యు జీవితం
బోధిహేతు రప్రమేయ త్యక్తు దుస్త్యజా త్వయా. [పుట 235]

తనకు కాదగిన భార్య ఏ విధంగా వుండాలో, సర్వార్థసిద్ధుడు తండ్రితో చెప్పిన శ్లోకాలు వధూవరణం చేసేవారు గమనించదగినవి. వాటిలో మూడిటిని మాత్రం ఉదాహరిస్తున్నాము.

"యా రూపయౌవనవరా న చ రూపమత్తా
మాతా స్వసావ యథ వర్తతి మైత్రచిత్తా,
త్యాగే రతా శ్రమణబ్రాహ్మణ దానశీలా
తాం తాదృశాం మమ వధూం వరయస్వ తాత.

యస్మా న మాను న ఖిలో న చ దోష మస్తి
న చ శాఠ్య ఈర్ష్య న చ మాయ న చ ఉజ్జు భ్రష్టా.
స్వప్నాంతరేఽపి పురుషే న పరే ఽభిరక్తా
తుష్టా స్వకేన పతినా శ్రయతే ఽప్రమత్తా.

.... .... ....

న స్థానమిద్ధ జహ్యలా న చ మానమూఢా
మీమాంసయుక్తి సుకృతా సద ధర్మచారీ.
శ్వశ్రౌ చ తస్య శ్వశురే యథ శాస్తృప్రేమా
దాసీ కలత్రజని యాదృశ మాతృప్రేమ."

[పుటలు 200, 201]

కొంత పరిశీలన దృష్టితో చూస్తే యీ గ్రంథంనుండి ఎన్నో విషయాలను ఈ విధంగానే గ్రహించవచ్చును.

---

# లలితవిస్తరం

# 1. నిదాన పరివర్తం

ఓం నమః సర్వబుద్ధ బోధిసత్త్వేభ్యః. ఓం నమో దశదిగనంతాపర్యంత లోకధాతు ప్రతిష్ఠిత సర్వబుద్ధ బోధిసత్త్వార్య శ్రావక ప్రత్యేక బుద్ధేభ్యః అతీతానాగత ప్రత్యుత్పన్నేభ్యః.

నేను ఈ విధంగా విన్నాను: ఒకానొకప్పుడు భగవానుడయిన తథాగతుడు శ్రావస్తిలోని అనాథపిండదుని ఆరామమయిన జేతవనంలో గొప్ప భిక్షు సంఘంతోపాటు విహరిస్తూ ఉండేవాడు. ఆ భిక్షుసంఘంలో ఆయుష్మంతులయిన జ్ఞానకౌండిన్యుడు, అశ్వజిత్తు, బాష్పుడు, మహానాముడు, భద్రికుడు, యశోదేవుడు, విమలుడు, సుబాహువు, పూర్ణుడు, గవాంపతి, ఉరుబిల్వాకాశ్యపుడు, నదీకాశ్యపుడు, గవాకాశ్యపుడు, శారిపుత్రుడు, మహామౌద్గల్యాయనుడు, మహాకాశ్యపుడు, మహాకాత్యాయనుడు, కపిలుడు, కౌండిన్యుడు, సునందుడు, పూర్ణమైత్రాయణీపుత్రుడు, అనిరుద్ధుడు, నందికుడు, కస్ఫిలుడు, సుభూతి, రేవతుడు, ఖదిరవనికుడు, అమోఘరాజు, మహాపారణికుడు, వక్కులుడు, నందుడు, రాహులుడు, స్వాగతుడు, ఆనందుడు మొదలయిన పన్నెండువేలమంది భిక్షువులు, ఏకజాతి ప్రతిబద్ధులు, సర్వబోధిసత్త్వ పారమితా నిర్జాతులు, సర్వబోధిసత్త్వాభిజ్ఞతా విక్రీడితులు, సర్వబోధిసత్త్వధారణీ ప్రతిభాన ప్రతిలబ్ధులు, సర్వబోధిసత్త్వ ప్రణిధాన సుపరిపూర్ణులు, సర్వబోధిసత్త్వ ప్రతిసమ్యజ్నతింగతులు, సర్వబోధిసత్త్వ సమాధివసితాప్రాప్తులు, సర్వబోధిసత్త్వ క్షాంత్యవకీర్ణులు, సర్వబోధిసత్త్వ భూమిపరిపూర్ణులు, మహాసత్త్వులు అయిన మైత్రేయుడు, ధరణీశ్వరరాజు, సింహకేతువు, సిద్ధార్థమతి, ప్రశాంత చారిత్రమతి, ప్రతిసంవిత్ప్రాప్తుడు, నిత్యోద్యుప్తుడు, మహావరుణాచంద్రి మొదలయిన ముప్పైరెండువేలమంది బోధిసత్త్వులు ఆయనను పరివేష్ఠించి ఉండేవారు.

ఆ సమయంలో భగవానుడు శ్రావస్తీ మహానగరంలో ప్రవేశించి విహరిస్తూ, తస్పృపరిషత్తులు, రాజులు, రాజకుమారులు, రాజమంత్రులు, రాజమహామాత్రులు, రాజపాదమూలికులు, క్షత్రియ బ్రాహ్మణ గృహపత్యమాత్యపార్షద్యులు, పౌరజానపదులు, ఇతర తీర్థికులు, శ్రమణులు, బ్రాహ్మణులు, చరకులు, పరివ్రాజకులు మొదలయినవారి సత్కారాలు, సమ్మానాలు, గౌరవాలు, పూజలు పొందుతూ ఎంతో విరాళంగా భక్ష్యభోజ్యఖాద్యాస్వాదనీయ పదార్థాలు, ఆ ప్రసాదన ద్రవ్యాలు, చీవరం, పిండపాత్ర (భిక్షాపాత్ర), శయనం, ఆసనం, గ్లానిని తొలగించే ఔషధాలు పొందుతూ, ఈ విధంగా విశేషలాభం, విశేష యశస్సు పొందినా నీటిలోని పద్మంవలె నిర్లిప్తుడుగా ఉంటూ ఉండగా, ఆయన అర్హంతుడని, సమ్యక్సంబుద్ధుడని, విద్యాచరణ సంపన్నుడని, సుగతుడని, లోకవేత్త అని, పరుడని, పురుషులను శిక్షించి సన్మార్గంలో ప్రవర్తింపజేసే సారథి అని, దేవతలకు, మనుష్యులకు శాస్త అని, పంచచక్షువయిన బుద్ధుడుగా అవతరించాడని లోకంలో కీర్తి వ్యాపించింది. ఆయన ఈ లోకాన్ని, దేవతలు మారుడు బ్రహ్మ మొదలయినవారున్న పరలోకాన్ని, శ్రమణులు, బ్రాహ్మణులు, దేవతలు, మనుష్యులు మొదలుగాగల ప్రజలను స్వయంగా తెలుసుకొని సాక్షాత్తుగా చూచి, వారివద్దకు ఏతెంచి, సద్ధర్మం ఉపదేశించేవాడు. ఆదిలోను, మధ్యలోను, పర్యవసానంలోను కల్యాణకరమూ, సమీచీనార్థమూ, సుపరికరమూ, పరిపూర్ణమూ, పరిశుద్ధమూ, స్వచ్ఛమూ అయిన బ్రహ్మచర్యం వెల్లడించేవాడు.

ఆ సమయంలోనే భగవానుడు ఒక రాత్రి మధ్యమయామంలో బుద్ధాలంకారవ్యూహమనే సమాధిలో నిమగ్నుడయ్యాడు. ఆయన ఆ బుద్ధాలంకార వ్యూహమనే సమాధిలో నిమగ్నుడైన తత్క్షణమే ఆయన శిరస్సంధిలో ఉష్ణీష వివరాంతరంనుంచి పూర్వబుద్ధానుస్మృత్యసంగాజ్ఞానాలోకాలంకారమనే రశ్మి ఆయన శిరస్సుపైని వ్యాపించింది. ఆ రశ్మి సకల శుద్ధావాసాలనే దేవభవనాలను ప్రకాశింపజేసి మహేశ్వర దేవపుత్రుడు మొదలయిన దేవపుత్రులను ప్రోత్సాహపరిచింది. అప్పుడు



తథాగతుని ఈ రశ్మిజాలాలను ప్రస్తుతిస్తూ ఈ సంచోదనా గాథలు వెలసినవి!

జ్ఞానప్రభం హత తమసం ప్రభాకరం
శుభ్రప్రభం శుభవిమలాగ్ర తేజసమ్,
ప్రశాంతకాయం శుభ శాంత మానసం
మునిం సమాశ్లిష్యత శాక్యసింహమ్.

జ్ఞానోదధిం శుద్ధ మహానుభావం
ధర్మేశ్వరం సర్వవిదం మునీశమ్,
దేవాతిదేవం నరదేవపూజ్యం
ధర్మే స్వయంభుం వశినం శ్రయధ్వమ్.

యో దుర్దమం చిత్తనువర్త యద్వశే
యో మారపాశై రవముక్త మానసః,
యస్యాప్యవంధ్యా విహ దర్శన శ్రవా
స్త్వ యాంతతః శాంతవిమోక్ష పారగః.

ఆలోకభూతం తమతుల్య ధర్మం
తమోనుదం సన్నయవేదితారమ్,
శాంతక్రియం బుద్ధ మమేయబుద్ధిం
భక్త్యా సమస్తా ఉపసంక్రమధ్వమ్.

స వైద్యరాజోఽమృతభైషజప్రదః
స వాదిశూరః శుగణి ప్రతాపకః,
స ధర్మబంధుః పరమార్థ కోవిదః
స నాయకోఽనుత్తర మార్గదేశకః.

ఈ గాథల తాత్పర్యమిది: "జ్ఞానప్రభలతో వెలుగొందేవాడు, చీకట్లను పారదోలే ప్రభాకరుడు, శుభ్రప్రభలు విరజిమ్మేవాడు, శుభ విమల శ్రేష్ఠ తేజస్సు కలవాడు, ప్రశాంతమైన కాయం కలవాడు, శుభ శాంత మనస్సు కలవాడు, మునీ అయిన శాక్యసింహుని ఆశ్రయించండి.

జ్ఞానసముద్రుడు, శుద్ధ మహత్త్వం కలవాడు, ధర్మేశ్వరుడు, సర్వవేత్త, మునీశ్వరుడు, దేవాతిదేవుడు, నరదేవపూజ్యుడు, ధర్మంలో స్వయంభువు, వశి అయిన బుద్ధుణ్ణి ఆశ్రయించండి.

ఆయన దుర్దమమయిన చిత్తాన్ని వశపరచుకొన్నవాడు. మారుని పాశాలకు మనసు కట్టుపడకుండా చేసినవాడు. ఆయన దర్శనం, ఆయన వాక్కుల శ్రవణం ఎన్నటికీ వ్యర్థం కావు. ఆయన కట్టకడపట శాంతి మోక్షపారగుడు.

శాంతిమయుడు, సాటిలేని ధర్మం కలవాడు, తమస్సును పోగొట్టే వాడు, సమీచీనమైన నీతిని తెలుసుకున్నవాడు, అన్ని క్రియలూ శాంతించినవాడు, అమేయమైన బుద్ధి గలవాడు అయిన బుద్ధభగవానుని సమస్త జనులూ భక్తితో సేవించండి.

ఆయన అమృతౌషధం ఒసగే వైద్యరాజు. వాదిశూరుడు. దుర్మార్గగణాలను తపింపజేసే పరాక్రమవంతుడు. పరమార్థకోవిదుడు. ధర్మబంధువు. అనుత్తర మార్గం ఉపదేశించే నాయకుడు.”

వెంటనే ఆ బుద్ధానుస్మృత్యసంగాజ్ఞానాలోకాలంకార రశ్మిస్పర్శవల్ల, ఈలాటి గాథలవల్ల సంచోదితులయిన శుద్ధావాసకాయిక దేవపుత్రులు పరిపూర్ణంగా ప్రశాంతులయి సమాధినుంచి లేచి, బుద్ధప్రభావంవల్ల అప్రమేయులు, అసంఖ్యేయులు, గణనా సమతిక్రాంతులు, కల్పాతిక్రాంతులు అయిన బుద్ధభగవానులను స్మరించారు. ఆ బుద్ధభగవానుల క్షేత్రాలను గుణవ్యూహోత్కర్షి మండలాలను, ధర్మోపదేశాలను – అన్నిటినీ స్మరించారు.

ఆ రాత్రి గడిచిన తర్వాత ఈశ్వరుడు, మహేశ్వరుడు, నందుడు, సునందుడు, చందనుడు, మహితుడు, ప్రశాంతుడు, ప్రశాంత వినీతేశ్వరుడు మొదలయిన పలువురు శుద్ధావాస కాయిక దేవపుత్రులు దూరదూరాలకు వ్యాపించే తమ వివిధవర్ణ దివ్యదేహ కాంతులతో అందరికీ ఆశ్రయమయిన జేతవనాన్ని భాసింపజేస్తూ, దివ్యకాంతులతో వెలిగిపోయే బుద్ధభగవానుని సన్నిధికి వచ్చి, భగవానుని పాదాలకు శిరస్సుతో నమస్కరించి, ఏకాం



తంలో నిలబడ్డారు. ఆ విధంగా, ఏకాంతంలో నిలబడ్డ శుద్ధావాసకాయిక దేవపుత్రులు భగవానునితో ఈ విధంగా విన్నవించారు:

“భగవన్, లలితవిస్తరమనే ధర్మపర్యాయం ఉన్నది. అది సూత్రాంతం. మహా విపులం అయింది. బోధిసత్త్వ కుశలమూల సముద్భావనం. శ్రేష్ఠమయిన తుషిత భవనాలలో బోధిసత్త్వుల వికరణ సంచిత్యావక్రమణ విక్రీడనాలు, గర్భస్థాన విశేషాలు తెలిపేది. అభిజాత జన్మభూమి ప్రభావం తెలియజేసేది. బుద్ధభగవానుని సర్వబాలచర్యా గుణవిశేషాలను, అపురూపమయిన సకల లౌకిక శిల్పస్థానాలను, కర్మస్థానాలను, లిపి సంఖ్యలను, ముద్రాగణనం, కత్తి ధనుస్సుల యుద్ధాల సకలశక్తినీ విశిష్టంగా తెలియబరచేది. అంతఃపుర విషయోపభోగాలకు దర్పణం. సర్వబోధిసత్త్వ చరిత నిష్పంద నిష్పత్తి ఫలాధిగమనాన్ని కీర్తించేది. బోధిసత్త్వ క్రీడలు వివరించేది. సర్వ మారమండలాలను ధ్వంసం చేసిన తథాగతుని బలవైశారద్యాన్ని తెలిపే అష్టాదశావేనిక సముచ్చయం. ప్రమాణాతీత బుద్ధధర్మ నిర్దేశమయిన దీనిని పూర్వులయిన తథాగతులూ చెప్పినవారే. ఇదివరకు దీనిని చెప్పిన సమ్యక్సంబుద్ధులు, అర్హతులు అయిన తథాగతులెవరంటే – భగవానులయిన పద్మోత్తరుడు, ధర్మకేతువు, దీపంకరుడు, గుణకేతువు, మహాకరుడు, ఋషిదేవుడు, శ్రీతేజుడు, సత్యకేతువు, వజ్రసంహతుడు, సర్వాభిభువు, హేమవర్ణుడు, అత్యుచ్చగామి, ప్రవాదసాగరుడు, పుష్పకేతువు, పరరూపుడు, సులోచనుడు, ఋషిగుప్తుడు, జినవక్త్రుడు, ఉన్నతుడు, పుష్పితుడు, పూర్ణతేజుడు, పుష్కరుడు, సురశ్మి, మంగళుడు, సుదర్శనుడు, మహాసింహతేజుడు, స్థితబుద్ధిదత్తుడు, వసంతగంధి, సత్యధర్మ విపులకీర్తి, తిష్యుడు. పుష్యుడు, లోకసుందరుడు, విస్తీర్ణభేదుడు, రత్నకీర్తి, ఉగ్రతేజుడు, బ్రహ్మతేజుడు, సుఘోషుడు, సుపుష్పుడు, సుమనోజ్ఞఘోషుడు, సుచేష్టరూపుడు, ప్రహసితనేత్రుడు, గుణరాశి, మేఘస్వరుడు, సుందరవర్ణుడు, ఆయుస్తేజుడు, సలీలగజగామి, లోకాభిలాషి, జితశత్రువు, సంపూజితుడు, విపశ్యి, శిఖి, విశ్వభువు, క్రకుచ్ఛందుడు, కనకముని, కాశ్యపుడు – వీరందరూ ఇంతకుముందే చెప్పినారు. దీనిని ఇప్పుడు భగవానుడు కూడా ప్రకాశింపజేయాలి.

ఈ విధంగా వారు విన్నవించి మిన్నకున్నారు.

పిదప భగవానుడు బహుజన హితంకోసం, బహుజన సుఖంకోసం, లోకానుగ్రహంకోసం, మహా జనసమూహ ప్రయోజనంకోసం, దేవతలకు మనుష్యులకు సుఖంకోసం, మహాయానమతం ఉద్భావన కోసం, సకల పరప్రవాదులను నిగ్రహించడంకోసం, సకల బోధిసత్త్వుల ఉద్భావన కోసం, సకల మారులను అవమానించడంకోసం, పుంగవులయిన సర్వ బోధిసత్త్వ యానికులకు వీర్యారంభ సంజననంకోసం, సద్ధర్మం పరిగ్రహించడంకోసం, చిరత్న వంశాన్ని అనుగ్రహించడంకోసం, చిరత్న వంశం అవిచ్ఛిన్నంగా ఉండడంకోసం, బుద్ధకార్యాలను ప్రపంచానికి చూపడంకోసం దేవమానవాదులయెడల అనుకంపతో తూష్ణీంభావంతోనే ఆ దేవపుత్రుల అధ్యేషణకు అధివాసనను – ఆమోదాన్ని తెలుపుతూ సమాధినిమగ్నుడయాడు.

తర్వాత దేవపుత్రులు భగవానుని తూష్ణీంభావమే అంగీకారంగా గ్రహించి, సంతుష్టులు, ఉదగ్రులు, స్థిరమానసులు, ప్రముదితులు, ప్రీతిసౌమనస్యపూర్ణులు అయి, భగవానుని పాదాలకు శిరస్సుతో అభివాదనం చేసి, మూడు సార్లు ప్రదక్షిణం చేసి, దివ్యమైన చందనాగరు చూర్ణాలు చల్లి, మందార పుష్పాలు సమర్పించి అంతర్ధానం చెందారు.

అంతట ఆ రాత్రి అతిక్రమించిన తర్వాత భగవానుడు బుద్ధాలంకార వ్యూహ సమాధినుంచి వెలువడి, కరీరుడు, మండలమాత్ర వ్యూహం కలవాడు అయి, ప్రజ్ఞప్తుడై, ఆసనంలో ఆసీనుడై భిక్షువులకు అనుజ్ఞ యిచ్చి పంపివేసి, బోధిసత్త్వగణాలు, శ్రావక సంఘం కొలుస్తూ ఉండగా విశ్రమించాడు.

భిక్షువుల్లారా, ఈ విధంగా రాత్రి గడిచిపోయిన తర్వాత దేవపుత్రుడు, మహేశ్వరుడు, నందుడు, సునందుడు, వందనుడు, మహితుడు, ప్రశాంతుడు, వినీతుడు, ఈశ్వరుడు మొదలయిన శుద్ధావాస కాయిక దేవపుత్రులు అక్కడే అంతర్ధానం చెందిన తర్వాత, భగవానుని సేవిస్తున్న బోధిసత్త్వులు, మహాశ్రావకులు అంజలి ఘటించి ప్రణామం చేసి,



ఈ విధంగా విన్నవించారు: ''భగవన్, తత్ సాధు. ఆ లలితవిస్తరమనే ధర్మపర్యాయం ఉపదేశించండి. అది బహుజన హితంకోసం, బహుజన సుఖంకోసం, లోకానుగ్రహంకోసం, మహాజనసమూహం ప్రయోజనానికీ, దేవతల, మనుష్యుల సుఖానికీ ఒనగూడుతుంది'' అని.

ఆ సమయంలో భగవానుడు ఆ వచ్చిన మహాసత్త్వులయిన బోధిసత్త్వుల విన్నపానికి, ఆ మహాశ్రావకుల విన్నపానికి తన తూష్ణీంభావంతోనే దేవమానుషాసుర లోకానుకంపనార్థం సమ్మతి తెలియజేశారు.

ఇది లలితవిస్తరంలో నిదాన పరివర్తమనే
ప్రథమాధ్యాయం.

# 2. సముత్సాహ పరివర్తం

భిక్షువులు అప్పుడు యిలా ప్రశ్నించారు : ''లలిత విస్తరమనే ధర్మ పర్యాయం సూత్రాంతం మహావైపుల్యం అని అన్నారుగదా! అది బౌద్ధ ధర్మాలలో ఏది?'' అని. ''భిక్షువులారా! ఆ లలితవిస్తర మనే ధర్మపర్యాయం శ్వేతకేతువనే దేవపుత్రోత్తముడు ప్రవచించినది. ఆ దేవ పుత్రోత్తముడు ఎలాంటివాడంటే - శ్రేష్ఠమైన తుషిత దేవలోకంలో ఉన్నట్టివాడు. పూజ్యపూజితుడు. అభిషేక ప్రాప్తుడు. దేవ శతసహస్ర స్తుతులచే స్తుతించబడినవాడు, వర్ణించబడినవాడు, ప్రశంసించబడిన వాడు. ధర్మసింహాసనంలో అభిషేచితుడు. ప్రణిధాన సముద్గతుడు. సర్వ బుద్ధ ధర్మాలను ఆకళించుకున్న బుద్ధి గలవాడు. సువిపులమూ, పరి శుద్ధమూ అయిన జ్ఞానమనే నేత్రం కలవాడు. స్మృతి మతి గతి ధృతులచే పరిపక్వమయి విపులమైన బుద్ధి గలవాడు. దానం, శీలం, క్షాంతి, వీర్యం, ధ్యానం, ప్రజ్ఞ, మహోపాయ కౌశలం - వీటితో పరమ పారమితను పొందినవాడు. మహామైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష, బ్రహ్మపథం- వీటిని ఎరిగిన కోవిదుడు. మహాభిజ్ఞ, అసంగణం, ఆవరణం జ్ఞాన సంద ర్శనం-వీటిని అభిముఖం చేసుకున్నవాడు. స్మృతి, ఉపస్థానం, సమ్యక్ప్రహాణం, ఋద్ధిపాదం, ఇంద్రియబలం, బోధ్యంగమార్గం, సర్వబోధి పక్షధర్మం- వీటిలో పరిపూర్ణ కోటిని పొందినవాడు. ఆయనశరీరం అపరిమిత పుణ్య సంభార లక్షణాలను సృజింపజేస్తూ వాటితో అలంకృత మయింది. ఆయన దీర్ఘానుపరివర్తి. ఎలా మాట్లాడుతాడో అలాగే చేసే వ్యర్థంకాని కర్మ సముదాయం కలవాడు. ఋజువు, అకుటిలము, అవం కము, అప్రతిహతము, అయిన మానసం కలవాడు. సకల మాన మద దర్ప భయ విషాదాలు లేనివాడు. సర్వసత్త్వాలయందూ సమచిత్తుడు. అసం ఖ్యాక కోటినయుత శత సహస్ర బుద్ధదేవులు కొలువగా, విరాజిల్లే వాడు. అసంఖ్యాక కోటినయుత శతసహస్ర బోధిసత్త్వాలు పరివేష్టించి, ఆయన జాజ్వల్యమానమయిన ముఖమండలాన్ని దర్శిస్తూ ఉంటారు.



ఆయన యశస్సును శక్రుడు, బ్రహ్మ, మహేశ్వరుడు, లోకపాలులు, దేవ నాగ యక్ష గంధర్వ గణాలు, అసుర, గరుడ, కిన్నర మహోరగ రాక్షస గణాలు అనవరతం అభినందిస్తూ వుంటాయి. ఆయన సర్వపద ప్రభేద నిర్దేశాసంగప్రతిసంవిద్ జ్ఞానంలోను, అవతార జ్ఞానంలోను కుశలుడు. సర్వబుద్ధ భాషిత ధారణస్మృతి భాజనా నిక్షేపానంతా పర్యంత ధారణి ప్రతిలబ్ధుడు. మహాధర్మం, నైస్మృత్యం, ఉపస్థానం సమ్యక్ప్రహాణం. ఋద్ధిపాదం, ఇంద్రియబలం. బోధ్యంగమార్గం, పారమిత, ఉపాయ కౌశల్యం, ధర్మరత్నం మొదలయిన అనర్ఘరత్నాలను పుణ్య సముదాయంతో పొందించే మహా సార్థవాహుడు. చతురోఘపారగా ములకు నాభిప్రాయుడు. మానమనే ప్రత్యర్థిని హతమార్చినవాడు. సకల పరప్రవాదులను నిగ్రహించినవాడు. సంగ్రామ శీర్షంలో సుప్రతిష్ఠితు డయినవాడు. క్లేశాలనే శత్రుగణాలను అణచివేసినవాడు. జ్ఞానమనే శ్రేష్ఠమయిన, దృఢమయిన వజ్రాయుధం కలవాడు.

ఆయన ఒక మహాపురుషపద్మం. ఆ పద్మం బోధిచిత్తమనునది మూలంగా, మహా కరుణ అనేదే నాళంగా, ఉపాయ కౌశలమనేదే కర్ణికగా, బోధ్యంగధ్యానమనేది కేసరాలుగా, సమాధి అనేది కింజ ల్కాంగా, గుణగణాలనే విమల సరస్సులో గంభీర వీర్య సలిలాలు పైని పడుతుండగా ప్రభవించింది. దాని పత్రాలేమో మదమాన పరివాహ నిరాసమనేవి. మదమానాది రజస్సు పోవడంవల్ల ఆ రేకులు శశిధవళంగా విస్తరించాయి. ఈ పద్మం శీలం, శ్రుతం, ప్రసాదం అనే సుగంధాలను పది దిక్కులకు అప్రతిహతంగా వ్యాపింపజేస్తూ, లోకంలో జ్ఞాన మకరందతుందిలం, అత్యంతజ్ఞానవృద్ధం అయినది. ఎనిమిది లోకధర్మాలూ అంటనిది. పుణ్యజ్ఞాన సంభారమనే సురభిగంధాన్ని వ్యాపింపజేసేది. ఆయన ప్రజ్ఞాజ్ఞాన కిరణాలతో లోకు లనే విశుద్ధ శతపత్ర పద్మాలను వికసింపచేసే తపనుడు.

ఆయన పురుషసింహుడు. ఆ సింహం ఎల్లప్పుడూ నాలుగు విధా లయిన ఋద్ధిపాదాలను (విభూతులను) నిరంతరం జపించేది. చతురార్య సత్యాలనే తీక్ష్ణ నఖాలు, దంష్ట్రిలు గలది. అది చతుర్బ్రహ్మ విహారం.

ఆశ్రయించి దర్శన మిచ్చేది. దానికి శిరస్సు చతుస్సంగ్రహ వస్తు సంగ్రహణమే. దాని దేహం ద్వాదశాంగ ప్రతీత్యసముత్పాదం, అనుబోధం, అనుపూర్వం - అనే వాటివల్ల సముద్భవించినది. ఆ సింహం సప్తత్రింశద్బోధిపక్ష ధర్మ సంప్రతిపూర్ణమనే ఉత్తమ జాతిది. దానికి కేసరాలు విద్య, జ్ఞానమూను. దానికి త్రివిమోక్షమనేదే ముఖవిజృంభితం. సమర్థ నిదర్శనం, ఆశు విరుద్ధ దర్శనం - అనేవి దాని నేత్రాలు. అది ధ్యాన విమోక్ష సమాధి సమాపత్తి అనే గిరిగుహాలో వసించేది. చతురార్యపథ వినయమనే ఉపవనంలో తరువుల నీడను విశ్రమించేది. దశబల వైశారద్యాభ్యాసంతో భావితమయిన బలం కలది. భవ విభవ భయం నశించడంవల్ల పులకించినది. అసంకుచితమయిన పరాక్రమం కలది. తీర్థ్యులనే కుందేళ్ళ, జింకల సమూహాలను సంహరించేది. నైరాత్మ్యఘోషమనే అత్యుదారమయిన గర్జనం చేసేది.

ఆయన మహాపురుష దినకరుడు. ఆ దినకరుడు తీర్థకరులనే మిణుగురు పురుగులను విముక్తి ధ్యానమండల ప్రజ్ఞాప్రభారశ్ములతో నిస్తేజులను చేసేవాడు. అవిద్య అనే అంధకార పటలాన్ని రూపుమాపేవాడు. ఉత్తప్తమయిన బలవీర్యాలు గలవాడు. దేవతలలోను, మనుష్యులలోను పుణ్యతేజస్సుతో తేజరిల్లేవాడు.

ఆయన మహాపురుష చంద్రుడు. ఆ చంద్రుడు కృష్ణపక్షం గడచి, శుక్లపక్షంలో పరిపూర్ణుడయినవాడు. మనాప (మనోహర) ప్రియదర్శనుడు. అప్రతిహతమయిన చక్షురింద్రియాలు కలవాడు. దేవ శత సహస్రముకే జ్యోతిర్గణంతో పరివేష్టితుడు. ధ్యాన విమోక్ష జ్ఞాన భూషితుడు. ఆ చంద్రునికి బోధ్యంగాలనేవే చల్లని కిరణాలు. బుద్ధులు, విబుధులు, మనుజులు అనే కుముదాలను ఆ చంద్రుడు వికసింపజేస్తాడు.

ఆయన సాగరం వంటివాడు. ఆ సాగరం సమానమైన నాలుగు పరషత్తులనే ద్వీపాలతో పరివృతమైనది. సప్తబోధ్యంగాలనే రత్నాలతో పరిపూర్ణమయినది. ఆ సాగరం సర్వచిత్తాలయెడల సముచిత్త ప్రయోగం గలది. అప్రతిహతమయిన బుద్ధి గలది.



ఆయన దశ కుశల కర్మపథ వ్రత తపస్సు గలవాడు. సుసమృద్ధ ప్రతిపూర్ణ విశేష గమనాభిప్రాయుడు. అప్రతిహత ధర్మరాజావర ప్రవర, ధర్మరత్న చక్రప్రవర్తకుడు. చక్రవర్తి వంశ కులోదితుడు. గంభీరము, దురవగాహము అయిన ప్రతీత్య సముత్పాదము మొదలైన సర్వ ధర్మరత్న పరిపూర్ణుడు. అతృప్త శ్రుత విపుల విస్తీర్ణారంభ జ్ఞాన శీల వేలలను అతిక్రమించనివాడు. మహాపద్మగర్భేక్షణుడు. సాగర వరధర విపులబుద్ధి కలవాడు. పృథివ్యస్తేజో వాయు సమాన చిత్తుడు. మేరుసమానమయిన దృఢబలంతో అప్రకంపమానుడై ఉన్నవాడు. అనునయం, ప్రతిఘ (కోపం) లేనివాడు. గగనతలంవలె విపులం, విమలం, సహించరాని విస్తీర్ణం అయిన బుద్ధి గలవాడు. ఆయన అధ్యాశయం సుపరిశుద్ధం. ఆయన మంచి దానాలు చేసినవాడు. సుకృత పూర్వయోగం కలవాడు. సుకృతాధికారం కలవాడు. సత్యశపథాలు చేసేవాడు. పర్యేషితమయిన సర్వ కుశల మూలాలు గలవాడు. వాసితమయిన వాసన గలవాడు. నిర్వాణం వలె సర్వ కుశలాలకు మూలమయినవాడు. సప్త కల్పాలలోను, సర్వ కుశల మూలప్రవాహం కలవాడు. సప్తవిధ దానాలు కలవాడు. పంచవిధ పుణ్యక్రియా వస్తువులచే సేవితుడు. త్రివిధ కాయిక సుచరితాలు, చతుర్విధ వాక్సుచరితాలు, త్రివిధ మనశ్చరితాలు చేసినవాడు. దశకుశల కర్మపథాన సేవితుడు. చత్వారింశదంగ సమన్వాగత సమ్యక్ప్రయోగం గలవాడు. చత్వారింశదంగ సమన్వాగత సమ్యక్ప్రణిధానం గలవాడు. చత్వారింశదంగ సమన్వాగత సమ్యగధ్యాశయ ప్రతిపన్నుడు. చత్వారింశదంగ సమన్వాగత సమ్యగ్విమోక్ష పరిపూరితుడు. చత్వారింశదంగ సమన్వాగత సమ్యగధిముక్తి పొందినవాడు. నలభై కోటి నియుత శత సహస్ర బుద్ధజన్మలలోను ప్రవ్రజ్య స్వీకరించినవాడు. ఏభై కోటి నియుత శత సహస్ర బుద్ధ జన్మలలో దానాలు చేసినవాడు. అర్ధ చతుర్థ కోటిశత ప్రత్యేక బుద్ధజన్మలలో అధికారం పొందినవాడు. అప్రమేయాసంఖ్యాక ప్రాణులను స్వర్గమోక్ష మార్గాన్ని పొందించినవాడు. ఏకజాతి ప్రతిబద్ధుడు.

అలాంటి దేవపుత్రోత్తముడయిన శ్వేతకేతువు ఇక్కడినుంచి జారి తుషితవర భవనంలో సర్వదేవ సంఘాలు కొలవగా విరాజిల్లుతూ,

అనుత్తర సమ్యక్సంబోధిని బోధించదలచాడు. ఆతని రశ్మినుంచి పరిచ్యుతమైె మర్త్యలోకంలో ఉత్పన్నమయిన ఈ లలిత విస్తరమనే అపరిమితమైన ధర్మపర్యాయం శీఘ్రకాలంలోనే అనుత్తర సమ్యక్సంబోధిని బోధిస్తుంది.''

ఆ బోధిసత్త్వుడు సుఖోపవిష్టుడై కొలువున్న ఆ మహా విమానం ద్వాత్రింశద్భూమి సహస్ర విస్తీర్ణం; పెక్కు అరుగులు, తోరణాలు, కూటాగారాలు, ప్రాసాదాలు, మొదలైన వాటితో ఎంతో అందంగా ఉంది. ఎత్తైన ఛత్రధ్వజ పతాకాలతో, రత్న కింకిణీ జాలం గల అందమైన చాందినీలతో, శోభాయమానంగా ఉంది. ఎటు చూచినా మాందార మహా మాందారవ పుష్పాలు సెజ్జలాగ పడి వున్నాయి. కోటీనియుత శతసహస్ర సంఖ్యాక లయిన అప్సరసలు మేళాలు జపుపుతున్నారు. అతిముక్తక చంపక పాటల కోవిదార ముచిలింద, మహా ముచిలింద అశోక న్యగ్రోధ తిందుక సన కర్ణికార కేసర సాల రత్నవృక్షాలతో ఉపశోభితమయినది. హేమజాల సంపన్న మైనది. పెద్ద పూర్ణకుంభంతో ఎంతో సుందరంగా వుంది. సమతల వ్యూహోపశోభితమయిన ఆ విమానం జ్యోతిర్మాలికలతో పూవులు పూచినట్లు ఉంది. కోటీనియుత శతసహస్ర దేవతలు ఆ విమానంలో బోధిసత్త్వుని కొలుస్తూ, బారులు తీరి పరస్పరాభిముఖంగా ఆసీనులయి ఉన్నారు. వారి నేత్రకాంతికి విమానం కూడా వెన్నెలతో మెరిసినట్లు కనిపించేది. మహావిపుల ధర్మ సంగీతితో సర్వ కామాలు, రతి, వేగము, క్లేశమూ తునాతునకలయినట్లు వున్నది. ఆ విమానంలో ఆసీనులయితే అఖిల క్రోధ కోప మాన మద దర్పాలు మటుమాయ మవుతాయి. ప్రీతి, ప్రసాద ప్రమోదాలు కలిగి వాటితో విపుల పూర్వస్మృతి కలుగుతుంది. అలాటి విపుల దివ్యవిమానంలో మహా ధర్మ సాంకథ్యం కొనసాగగా, చతురసీతిసహస్ర తూర్య సంగీతులు మ్రోగాయి. ఆ తూర్యారావాలవల్ల బోధిసత్త్వునికి పూర్వ శుభకర్మోపచయంతో ఈ సంచోదనాత్మకమయిన (ప్రేరకమైన) గాథలు వెలసినవి.



స్మర విపుల పుణ్యనిచయస్మృతి మతిగతి మనంత ప్రజ్ఞా ప్రభాకరిన్,
అతులబల విపుల విక్రమ వ్యాకరణం దీపసహాస్తి.

స్మర విపుల నిర్మల మనస్ త్రిమల మలప్రహీన శాంత మదదోషం,
శుభ విమల శుద్ధచిత్తా దామచరీ యాదృశాతిపురే.

స్మర కులకులీనా శమదం శీలవ్రతం క్షమాదమం చైవ,
వీర్యబలధ్యాన ప్రజ్ఞా నిషేవితా కల్ప (కోటీ) నియుతాని.

స్మర స్మర అనంతకీర్తే సంపూజితా యేతి బుద్ధనియుతాని,
సర్వాన్ కరుణాయమానః కాలోయం మా ఉపేక్షస్వ.

చ్యవ చ్యవ హి చ్యుతివిధిజ్ఞా జరామరణ క్లేశసూదనా విరజా,
సముదీక్షంతే బహవో దేవాసుర నాగ యక్ష గంధర్వాః.

కల్ప సహస్ర రమిత్వా తృప్తిర్నాస్త్యంభసీవ సముద్రే,
సాధు భవ ప్రజ్ఞాతృప్త తర్పయ జనతాం చిరతృషార్తాం.

కిం చాప్యనిందితి యశ (స్త్వం) ధర్మరతిరతో న చాసి కామరతః,
అథచ పున రమలనయనా అనుకంపా సదేవకం లోకం.

కిం చాపి దేవనయుతాః శ్రుత్వా ధర్మం న తే వితృప్యంతే,
అథచ పున రక్షణగతాన్ అపాయ సంస్థా నపేక్షస్వ.

కిం చాపి విమలచక్షో పశ్యసి బుద్ధాన్ దశాదిశి లోకే,
ధర్మం శృణోషిచ తతః తం ధర్మవరం విభజ లోకే.

కిం చాపి తుషిత భవనం తవ పుణ్యక్రియాభిశోభతే శ్రీమాన్,
అథచ వున కరుణమానస ప్రవర్ష జంబుధ్వజే వర్షమ్.

సమతీత్య కామధాతుం దేవా యే రూపధాతుకానేకే,
సర్వే త్వభినందంతే స్పృశేయ సిద్ధివ్రతో బోధి.

నిహతాతిమారకర్మా జితా స్త్వయాన్యే కుతీర్థికా నాథ,
కేన సకల గతతి బోధికాలోయం మా ఉపేక్షస్వ.

క్లేశాగ్నినా ప్రదీప్తే లోకే త్వం వీర మేఘవద్వ్యాప్య,
అభివర్షామృతవర్ష శమయ క్లేశాన్ నర మరూణాం.

త్వం వైద్యధాతు కుశల చిరాతురాన్ సత్యవైద్య సత్యవాన్,
త్రివిమోక్షా గదయోగైః నిర్వాణ సుఖే స్థపయ శీఘ్రం.

అశ్రుత్వ సింహనాదం క్రోష్టుక నాదం నదంత్యనుత్రస్టా,
నద బుద్ధ సింహనాదం త్రాసయ పరతీర్థికశృగాలాన్.
ప్రజ్ఞా ప్రదీపహస్తో బలవీర్యబలోదితో ధరణి మండే,
కరతలవరేణ ధరణీం పరా హనిత్వా జనహి మారం.

సముదీక్షంతే పాలాః చతురో యే తుభ్య దాస్యతే పాత్రం,
శక్రాశ్చ బ్రహ్మనియుతా యే జాతం త్వాం గ్రహిష్యంతి.
వ్యవలోకయాభియశా కులరత్న కులోదితా కులకులీనా,
యత్ర స్థిత్వా సుమతే దర్శేష్యతి బోధిసత్త్వచరిం.
యత్రైవ భాజనేస్మిన్ మణిరత్నం తిష్ఠతే భవతి శ్రీమాన్,
మణిరత్నం విపులబుద్ధే ప్రవర్ష జంబుధ్వజే వర్షం.
ఏవం బహుప్రకారా సంగీతి రవానునిశ్చరా గాథాః,
చోదేంతి కరుణామానసం అయం సకాలో మా ఉపేక్షస్వ - ఇతి.

ఓ విపుల పుణ్యానిచయా, అనంత ప్రజ్ఞా ప్రభాకరా, అతుల బల, విపుల విక్రమా, అతిగతమయ స్మృతిని స్మరించు. జ్ఞానదీప సహాయంతో వ్యాపించు. ప్రవచనం చేయి.

విపుల నిర్మల మనస్సు కలవాడా! త్రిమలాల మాలిన్యం నశింపజేసే వాడా! శుభవిమల శుద్ధచిత్తం కలవాడా! లోకసంచారిణి అయిన పుర ప్రజ్ఞను స్మరించు.

మహా కులీనుడా! కోటి నియుత కల్పాలపాటు వీర్య బల ధ్యాన ప్రజ్ఞలతో సేవించబడినవాడా! శమం, శీలవ్రతం, క్షమ, దమం- వీటిని స్మరించు.



అనంతకీర్తీ! నియుత సంఖ్యాబుద్ధ జన్మలలోను, సకల లోకాల లోను పూజితుడవయినావు. అందరినీ కరుణించడానికి ఇది కాలం. ఉపేక్షించవద్దు.

ఎప్పుడు క్రిందిలోకాలకు దిగజారవలెనో తెలిసిన చ్యుతివిజ్ఞుడా! జరామరణ క్లేశ వినాశకుడా! రజోరహితుడా! క్రిందిలోకాలకు దిగు, దిగు. పలువురు దేవాసుర నాగ యక్ష గంధర్వులు నీకోసం నిరీక్షిస్తున్నారు.

సముద్రంలో నీటికి తృప్తి లేనట్టే కల్పసహస్రాలు దేవలోకంలో భోగాలు అనుభవించినా తృప్తి ఉండదు. ఓ సాధో! ప్రజ్ఞాతృప్తుడవు కమ్ము. చిరకాలంగా సంసార తృష్ణతో బాధపడుతున్న జనతను తృప్తి పొందించు.

ఓ అనిందితమయిన యశస్సు కలవాడా! నీవు ధర్మరతిరతుడివే కాని, కామరతుడివి కావు. అమలనయనుడా! దేవలోకాన్నీ మానవ లోకాన్నీ అనుకంపతో చూడు.

నయుతసంఖ్యాకులయిన దేవతలు ఎంతకాలం నీనుంచి ధర్మం విన్నా తృప్తిపొందరు. కనుక, అపాయాపన్నులై రక్షణ పొందగోరే వారి విషయమై శ్రద్ధ తీసుకో.

ఓ విమలచక్షో! దశదిక్కులలోను బుద్ధులను చూస్తున్నావు. వారి నుంచి ధర్మం వింటున్నావు. ఆ వరధర్మాన్ని లోకానికి పంచిపెట్టు.

హే శ్రీమన్! తుషితభవనం నీ పుణ్యసంపదతో శోభిస్తున్నది. కరుణా మానసుడా! జంబూధ్వజంపై (జంబూద్వీపంపై) దయావర్షం వర్షించు.

కామధాతువును అతిక్రమించిన దేవతలు, రూపధాతువును ఆశ్రయించిన అనేక దేవతలు, అందరూ నిన్ను అభినందిస్తున్నారు. సిద్ధవ్రతుడవై బోధిని స్పృశించు.

నాథా! దుష్కరకారి అయిన మారుణ్ణి హతమార్చావు. ఇతర దుష్టతీర్థికులను జయించావు. ఏ బోధితో నీవు సకలగతుడవయావో ఆ బోధిని స్మరించే కాలమిది. ఉపేక్షించవద్దు.

ఓ వీరుడా! లోకం క్లేశాగ్నితో మండిపోతున్నది. నీవు మేఘం లాగ గగనాంగణమంతా అలముకొని అమృతవర్షం కురిపించు. నరులను మరుభూముల క్లేశాలను శమింపజేయి.

ఓ సత్యవాన్! నీవు వైద్యధాతు కుశలుడివి. సత్యమైన వైద్యుడివి. చిరకాలంగా ఆతురులుగా వున్నవారిని మూడు విధాలయిన మోక్షాలనే గదనివారణ యోగాలతో త్వరలో రోగనివారణ చేసి, వారికి శాశ్వతంగా సుఖం కలిగించు.

నక్కలు సింహనాదం విననంతవరకు నిర్భయంగా వూళపెడుతూ వుంటాయి. ఓ బుద్ధ సింహమా! గర్జించు. శత్రువులయిన తీర్థికులనే శృగాలాలను భయపెట్టి తరుము.

ప్రజ్ఞ అనే గొప్ప దీపాన్ని చేతితో పట్టుకుని బల వీర్యవంతుడివై, మారుణ్ణి చంపి, కరతలవరంతో ధరణిని ఉద్ధరించు; రక్షించు.

నీకు పాత్రదానం చేయడానికి నలుగురు పాలులు నిరీక్షిస్తున్నారు. ఇంద్రులు, నయుత సంఖ్యాకు లయిన బ్రహ్మలు, నీకు స్వాగత మివ్వడానికి వేచి యున్నారు.

ఓ మహాకీర్తీ! కుల కులీనుడా! శ్రేష్ఠమయిన కులరత్నం నీ కోసం వేచియున్నది. ఓ సుమతీ! అక్కడ ఉండి నీవు బోధిసత్త్వచరితం ప్రపంచానికి చూపగలవు.

ఓ శ్రీమన్! విమలబుద్ధీ! నీ భాజనంలో మణిరత్నాలున్నాయి. వాటిని జంబూధ్వజంలో వర్షించు.

ఈ విధంగా ధర్మ సంగీతిరవంతో పాటు బహుప్రకారా లయిన గాథలు, వెలువడి కరుణామానసు డయిన ఆతనిని "ఇదే సరైన కాలం. ఉపేక్షించవద్దు" అని ప్రోత్సహించాయి.

ఇది శ్రీ లలిత విస్తర మహాపురాణంలో సముత్సాహ పరివర్తమనే
ద్వితీయాధ్యాయం.

---

# 3. కులపరిశుద్ధి పరివర్తం

భిక్షువులారా! బోధిసత్త్వుడు యీ విధంగా ధర్మకాల సంచోదితుడై మహా విమానంనుంచి నిష్క్రమించి ధర్మోచ్చయ మనే మహా ప్రాసాదం అధిరోహించి సుధర్మమనే సింహాసనంలో ఆసీనుడై తుషిత దేవతలకు ధర్మోపదేశం చేయ నారంభించాడు. ఆ బోధిసత్త్వుని సభాగులు సమయాన సంప్రస్థితులు అయిన దేవపుత్రులు, దశదిక్కులనుంచి వచ్చిన సభాగ చరితులు అయిన బోధిసత్త్వులు ఆ ధర్మోచ్చయ మహాప్రసాదాన్నే అధిరోహించి తమకు అర్హమైన సింహాసనాలలో ఆసీనులయ్యారు. అప్సరోగణాలుగాని, ప్రాకృత దేవపుత్రులుగాని లేక సమానాధ్యాశయం గల అరవయ్యొనిమిది వేల కోట్ల పరివారం అప్పుడు బోధిసత్త్వుని పరివేష్టించింది.

ఆ బోధిసత్త్వుడు తన ఉపదేశంలో యీ విధంగా తెలిపాడు:

"భిక్షువులారా! బోధిసత్త్వుడు ఇక పన్నెండు సంవత్సరాలకు తల్లిగర్భంలో ప్రవేశిస్తాడు.

ఇలా వుండగా, శుద్ధావాసకాయిక దేవతలు జంబూద్వీపానికివచ్చి తమ దివ్య స్వరూప కాంతులను కప్పిపుచ్చి బ్రాహ్మణ వేషంతో బ్రాహ్మణులకు వేదాధ్యాపనం చేసేవారు. గర్భంలో ప్రవేశించే శిశువు ముప్ఫయి రెండు మహాపురుష లక్షణాలతో కూడి వుంటాడు. ఈ మహాపురుష లక్షణ లక్షితుడైన శిశువుకు రెండే మార్గాలు. మూడవమార్గం లేదు. అతడు అగారవాసి అయితే చక్రవర్తి అయిన రాజయి, చతురంగ బలయుతుడు, విజయి, ధార్మికుడు, ధర్మరాజు, సప్తరత్నసమన్వాగతుడు (సమన్వితుడు) అవుతాడు. ఆ సప్తరత్నాలు ఏవంటే - చక్రరత్నం, హస్తిరత్నం, అశ్వరత్నం, మణిరత్నం, స్త్రీరత్నం, గృహపతిరత్నం, పరిణాయక రత్నం.

చక్రవర్తి అయిన రాజు ఏ విధంగా చక్రరత్నయుతుడవుతాడు? మూర్ధాభిషిక్తుడైన, క్షత్రియుడైన రాజు ప్రాతఃకాలంలో యాభైగడియలకే లేచి శిరఃస్నానంచేసి, ఉపవాసంతో ప్రాసాదోపరిభాగానికి స్త్రీజన పరివృతుడై వెళ్ళివున్నపుడు పూర్వదిక్కున దివ్యమైన చక్రరత్నం ప్రాదుర్భవిస్తుంది. ఈ చక్రరత్నం సహస్రారం. నేమితోను, నాభితోను ఉండేది. బంగారు రంగుతో, అపూర్వమైన పనితనంతో ఉండేది. ఈ చక్రరత్నం ఏడు తాటిచెట్ల ఎత్తునుంచి అంతఃపురాన్ని చూస్తున్నట్లు ఉంటుంది. ఇదే మూర్ధాభిషిక్తుడైన, క్షత్రియుడైన రాజుకు దివ్యచక్రరత్నం. ఇలాటి దివ్యచక్రరత్నం కలవాడు చక్రవర్తి అవుతాడని విన్నాను. దివ్యచక్రరత్నం తెలుసుకొన్నవాడినయితే నేను కూడా తప్పక చక్రవర్తి అయిన రాజు అయివుండేవాడిని. మూర్ధాభిషిక్తుడైన రాజు ఉత్తరీయాన్ని భుజంపై వేసుకుని కుడిమోకాలిని భూమికి ఆనించి కుడిచేయి ఎత్తి "ఓ భట్టారక! దివ్యచక్రరత్నాన్ని ధర్మంతో ప్రవర్తింపజేయి. అధర్మంతో ప్రవర్తింపజేయవద్దు" అని ప్రార్థిస్తూ నివేదించాలి. అప్పుడు ఆ చక్రరత్నం మూర్ధాభిషిక్తుడైన రాజుతో ఆ విధంగా ప్రవర్తింపజేయబడి ఉత్తమబుద్ధిమార్గంలో పూర్వాకాశంలో వెళ్లుతుంది. చక్రవర్తి అయిన రాజు చతురంగ బలాలతో దానిని అనుసరిస్తాడు. ఆ చక్రరత్నం పృథివిమీద ఎక్కడ ఆగుతుందో అక్కడ మూర్ధాభిషిక్తుడైన రాజు చతురంగబలాలతోపాటు నివాసం కల్పించుకుంటాడు. తర్వాత పూర్వదిక్కున ఉన్న మండలేశ్వరులైన రాజులు సువర్ణచూర్ణ పరిపూర్ణమైన రజతపాత్రనుగాని, రజతచూర్ణ పరిపూర్ణమైన సువర్ణపాత్రనుగాని, చేతిలో గ్రహించి ఆ చక్రవర్తి అయిన రాజుకు ఎదురేగి "దేవా! దయచేయి. దేవరకు స్వాగతం! సమృద్ధము, విస్తీర్ణము, సుభిక్షము, క్షేమము, రమణీయము, బహుజనాకీర్ణము అయిన యీ రాజ్యం మీకు జయంవల్ల ప్రాప్తించింది. దీనిలో మీరు వసించండి" అని విన్నవిస్తున్నారు. వారు ఆ విధంగా విన్నవించగా, త్రాత అయిన ఆ మూర్ధాభిషిక్తుడు ఆ మండలేశ్వరులైన రాజులతో ఇలా అన్నాడు: "మీరంతా మీ మీ రాజ్యాలను ధర్మంతో పాలించండి. అయ్యో! మీరు ప్రాణివధ చేయకండి. మనఃపూర్వకంగా ఇవ్వనివాటిని తీసుకోకండి. కోరదగని



కోరికలు కోరకండి. అసత్యం పలుకకండి. నేను జయించిన రాజ్యంలో అధర్మం కలుగకుండా ఉండుగాక! జనానికి అధర్మపరులు రుచించకుండా ఉందురుగాక!"

ఈ విధంగా మూర్ధాభిషిక్తుడైన రాజు పూర్వదిక్కును జయిస్తాడు. పూర్వదిక్కును జయించినమీదట పూర్వ సముద్రంలో దిగి, దానిని దాటి, ఉత్తమ మాహాత్మ్యంతో ఆకాశమార్గాన చతురంగ బలాలతో దక్షిణ దిక్కుగా వెళ్లుతాడు. మునుపటిలాగ దక్షిణ దిక్కునుకూడా జయిస్తాడు. తర్వాత ఆ రీతిగానే పశ్చిమదిక్కును జయించి, ఉత్తర సముద్రంలో మునిగి, దానిని దాటి మునుపటిలాగ మాహాత్మ్యంతో ఆకాశమార్గాన బయలుదేరి నిరామయంగా అంతఃపురద్వారం చేరుతాడు. ఈ విధంగా మూర్ధాభిషిక్తుడైన రాజు చక్రరత్న సమన్వితుడవుతాడు.

చక్రవర్తి అయిన రాజు హస్తిరత్నయుతుడు ఎలా అవుతాడు? మూర్ధాభిషక్తుడయిన రాజుకు పూర్వంవలెనే హస్తిరత్నం సిద్ధిస్తుంది. ఈ హస్తిరత్నం పేరు బోధి. ఇది తెల్లని ఒడలితో స్వర్ణ చూడాధ్వజాలతో, స్వర్ణాలంకారాలతో, బంగారు కవచంతో శోభాయమానంగా ఉండేది. సప్తాంగాలతో సుప్రతిష్ఠితమైనది. గొప్ప బుద్ధి (మాహాత్మ్యం) గలది. ఆకాశగామి. ఎప్పుడూ సంతోషంతో ప్రసన్నంగా వుండేది. మూర్ధాభిషిక్తుడైన రాజు ఈ నాగరాజును - హస్తిరత్నాన్ని పొందుతాడు. తర్వాత సూర్యోదయ వేళలో యీ హస్తిరత్నం అధిరోహించి సముద్ర పరిఖ, సముద్ర పర్యంత అయిన యీ భూమి అంతటా పర్యటించి రాజధానికి మరలి వచ్చి శాసనంలో యిష్టం కలవాడై రాజ్యం అనుభవిస్తాడు. ఈ విధంగా చక్రవర్తి అయిన రాజు హస్తిరత్నయుతుడవుతాడు.

చక్రవర్తి ఏ విధంగా అశ్వరత్నయుతుడవుతాడు? మూర్ధాభిషిక్తుడైన రాజుకు పూర్వంవలె అశ్వరత్నమూ ఉత్పన్నమవుతుంది. ఈ అశ్వరత్నం నీలవర్ణ దేహంతో, కృష్ణవర్ణ శిరస్సుతో, మనోహరమైన జూలుతో ఆదృతవదనంతో, స్వర్ణధ్వజాలంకారాలతో, స్వర్ణ కవచంతో, మాహాత్మ్యంతో ఆకాశంలో చరించేది. సంతోషంతో ప్రసన్నంగా వుండేది.

ఈ అశ్వశ్రేష్ఠం పేరు వాలాహకం. మూర్ధాభిషిక్తుడైన రాజు యీ అశ్వరత్నం పొందుతాడు. తర్వాత సూర్యోదయ వేళలో యీ అశ్వరత్నం ఆరోహించి సముద్ర పరిఖ, సముద్రపర్యంత అయిన యీ పృథివి అంతటా పర్యటించి రాజధానికి తిరిగి వచ్చి శాసనంలో ఇష్టం కలవాడై రాజ్యం అనుభవిస్తాడు. ఈ విధంగా చక్రవర్తి అయిన రాజు అశ్వరత్నం పొందుతాడు.

చక్రవర్తి అయిన రాజు ఎలాంటి మణిరత్నం పొందుతాడు? మూర్ధాభిషిక్తుడైన చక్రవర్తికి పూర్వంవలెనే మణిరత్నమూ సిద్ధిస్తుంది. శుద్ధ నీల వైడూర్యం ఎనిమిది అంశలు గలది, బాగా చెక్కినది అయిన యీ మణిరత్నంకాంతులకు అంతఃపురమంతా వెలిగిపోయి స్ఫుటంగా కనిపిస్తుంది. మూర్ధాభిషిక్తుడైన రాజు ఈలాటి మణిరత్నాన్ని పొందదలచినప్పుడు పొందుతాడు. అంధకార బంధురమైన అర్ధరాత్రిలో రాజు ఆ మణిరత్నాన్ని ధ్వజాగ్రానికి కట్టి, ఎత్తిపట్టుకొని పరిసర సుభూమిని చూడడానికి ఉద్యానానికి వెళ్ళుతాడు. ఆ మణిరత్నకాంతికి సకల చతురంగబలనికాయం, యోజనంవరకు గల ప్రాంతం స్పష్టంగా కనిపిస్తాయి. ఆ మణిరత్న సమీపంలో ఉన్న మనుష్యులు దాని కాంతిలో ఒకరనొకరు తెలుసుకొని, ఒకరినొకరు చూస్తూ, "మంచి అబ్బాయిలు, లేవండి. కాలకృత్యాలు తీర్చుకోండి. అంగళ్ళు తెరవండి. తెల్లవారిందనుకుంటాము. సూర్యుడు ఉదయించాడు" అని ఒకరినొకరు పిలుచుకోవడం ప్రారంభిస్తారు. మూర్ధాభిషిక్తుడైన రాజు ఈలాటి మణిరత్నసమన్వితుడవుతాడు.

చక్రవర్తి అయిన రాజు ఎలాటి స్త్రీరత్నసమన్వితుడవుతాడు? మూర్ధాభిషిక్తుడైన రాజుకు ముందులాగే స్త్రీరత్నమూ సిద్ధిస్తుంది. అనురూప, క్షత్రియ, అంత పొడవరి కానిది, పొట్టిది కానిదీ, అంత లావుపాటిది కానిదీ, అంత పలుచనిది కానిదీ, అంత పచ్చని మేనిచాయకానిదీ, అంత నల్లని చాయకానిదీ, అభిరూప, ప్రసాదాభిముఖి, దర్శనీయ అయిన స్త్రీరత్నం లభిస్తుంది. ఆమె రోమకూపాలనుంచి చందన గంధమూ, ముఖంనుంచి కలువగంధమూ వీస్తుంది. ఆమె కాచిలింద కుసుమంవంటి సుఖస్పర్శ



గలది. శీతకాలంలో అవయవసంస్పర్శనం ఉష్ణంగాను, ఉష్ణకాలంలో శీతలంగాను ఉంటుంది. ఆమె చక్రవర్తి అయిన రాజును వదలి మనసా కూడా ఇతరులపై అనురాగం చూపదన్నపుడు శరీరంతో చూపదని చెప్పనక్కరలేదు. చక్రవర్తి అయిన రాజు ఇలాటి స్త్రీరత్నయుక్తుడవుతాడు.

చక్రవర్తి అయన రాజుకు ఎలాటి గృహపతిరత్నం సిద్ధిస్తుంది? మూర్ధాభిషిక్తుడైన రాజుకు పూర్వంవలెనే గృహపతిరత్నమూ సిద్ధిస్తుంది. ఆ గృహపతి పండితుడు, వివేకం గలవాడు, మేధావి, దివ్యచక్షువు అయివుంటాడు. అతడు తన దివ్యచక్షువుతో యోజనంవరకు సస్వామికాలు అస్వామికాలు అయిన నిధులు చూస్తాడు. అస్వామికా లయిన నిధులతో చక్రవర్తి అయిన రాజుకు సంబంధించిన కర్తవ్యాలు నెరవేరుస్తాడు. ఇలాటి గృహపతిరత్నాన్ని చక్రవర్తి అయిన రాజు పొందగలుగుతాడు.

చక్రవర్తి అయిన రాజుకు ఎలాటి పరిణాయక రత్నం (సేనాపతి) సిద్ధిస్తుంది? మూర్ధాభిషిక్తుడైన రాజుకు మునుపటిలాగే పరిణాయక రత్నం సిద్ధిస్తుంది. పండితుడు, వ్యక్తుడు, మేధావి, చక్రవర్తి అయిన రాజు తలచినంత మాత్రాననే సేనలను సకూర్చగలిగినవాడు అయిన పరిణాయక రత్నాన్ని పొందగలుగుతాడు. ఈలాగు సప్తరత్నాలు సమకూరుతాయి. ఈ చక్రవర్తి అయిన రాజుకు శూరులు, వీరులు, అంగసౌష్ఠవంగల సుందరరూపులు, పరసైన్య ప్రమర్దకులూ అయిన వేయిమంది పుత్రులు జనిస్తారు. అలాటి చక్రవర్తి సాగరపర్యంత అయిన అఖిల మహాపృథ్విని దండం, శస్త్రం అనేవే లేక జయించి అకంటకంగా పాలిస్తాడు. అతడు ఇంటినుంచి బయలువెడలి అనగారికుడై, ప్రవ్రజ్య స్వీకరించే పక్షంలో వీతకాముడై, వీతరాగుడై నేత అయి అనన్యదేవుడై దేవతలకు, మనుష్యులకు శాస్త అవుతాడు.

అప్పుడు ఇతర దేవపుత్రులు కూడా జంబూ ద్వీపానికి వచ్చి ప్రత్యేక బుద్ధులకు యీ విధంగా తెలియజేశారు: "మార్షులారా! బుద్ధక్షేత్రాన్ని నింపండి. తడపండి. ఇక పన్నెండు సంవత్సరాలకు బోధిసత్త్వుడు తల్లిగర్భంలో ప్రవేశిస్తాడు" అని.

ఓ భిక్షువులారా, ఆ సమయంలో మహానగరమైన రాజగృహం లోని గోలాంగుల పరివర్తన పర్వతంలో మాతంగుడనే ప్రత్యేక బుద్ధుడు విహరించేవాడు. అతడు దేవపుత్రులు చెప్పిన మాటల సవ్వడి విని రాతిపై పడిన బురదవలె త్రుళ్లిపడి, ఏడు తాటిచెట్ల యెత్తున ఎగిరి, తేజోధాతు రూపం పొంది ఉల్కవలె పరినిర్వాణం పొందాడు. అతని పిత్త శ్లేష్మ స్నాయ్వస్థి మాంస రుధిర ధాతువులు తేజస్సుతో పర్యవదానం పొంది, శుద్ధ శరీరాలు మాత్రమే భూమిపై పడ్డాయి. ఇప్పటికీ వాటిని 'ఋషి పదాలు' అనే అంటున్నారు.

ఓ భిక్షువులారా, ఆ సమయంలో వారణాసిలో ఋషిపతన మనే మృగదావంలో (మృగారణ్యంలో) అయిదు వందలమంది ప్రత్యేక బుద్ధులు విహరించేవారు. వారు కూడా దేవపుత్రులు చెప్పిన మాటల సవ్వడి విని ఏడు తాటిచెట్ల ప్రమాణాన పైని ఎగిరి, తేజోధాతురూపం పొంది, ఉల్కలవలె పరినిర్వాణం చెందారు. వారి పిత్త శ్లేష్మ మాంసాస్థి స్నాయు రుధిర ధాతువులు తేజోమయాలై శుద్ధ శరీరాలు మాత్రమే భూమిపై పడ్డాయి. అక్కడ యీ విధంగా ఋషులు పడ్డాగనే, అప్పటి నుంచి "ఋషిపతనం" అనే పేరు వచ్చింది. ఆ మృగారణ్యంలో మృగాలు, అభయమిచ్చినట్టుగా నిర్భయంగా తిరగడంవల్ల 'మృగదావం' అనే పేరూ అప్పటినుంచి వాడుకైంది.

భిక్షువులారా, తుషితవరభవనస్థితుడైన బోధిసత్త్వుడు నాలుగు మహా విలోకితాలు విలోకించాడు. ఆ నాలుగు మహా విలోకితాలు ఏవి? కాల విలోకితం, ద్వీప విలోకితం, దేశ విలోకితం, కుల విలోకితం.

భిక్షువులారా, బోధిసత్త్వుడు కాల విలోకితం విలోకించడానికి కారణ మేమిటి? బోధిసత్త్వుడు ఆదిప్రవృత్తమైన లోకంలో సంవర్తనీకాల సమయంలో తల్లి గర్భంలో ప్రవేశించాడు. లోకం సత్త్వ వ్యక్తమై సుస్థితమైనప్పుడు, జాతి జరావ్యాధి మరణాల తత్త్వం తెలుసుకున్నపుడు బోధిసత్త్వుడు తల్లిగర్భంలో ప్రవేశిస్తాడు. కనుకనే కాల విలోకితం.



బోధిసత్త్వుడు ద్వీప విలోకితం విలోకించడానికి గల కారణ మేమిటి? బోధిసత్త్వులు ప్రత్యంత ద్వీపాలలో జన్మించరు. పూర్వ విదేహాలలో జన్మించరు. అపరగోదానీయ దేశంలో జన్మించరు. ఉత్తర కురు దేశాలలో జన్మించరు. జంబు ద్వీపంలోనే జన్మిస్తారు. కనుకనే ద్వీప విలోకితం.

భిక్షువులారా, బోధిసత్త్వుడు దేశ విలోకితం విలోకించడానికి కారణ మేమిటి? బోధిసత్త్వులు ప్రత్యంత జనపదాలలో జన్మించరు. ఈ ప్రత్యంత జనపదాలలో అంధులు, జడులు, మూగలు, చెవిటివారు, సుభాషిత దుర్భాషితాల అర్థం తెలుసుకోలేని అభావ్యులు వుంటారు. కనుకనే బోధిసత్త్వులు మధ్యమ జనపదాలలోనే జన్మిస్తారు. అందువల్లనే దేశ విలోకితం.

భిక్షువులారా, బోధిసత్త్వుడు కుల విలోకితం విలోకించడానికి కారణ మేమిటి? బోధిసత్త్వులు హీన కులాలలో జన్మించరు. చండాల కులంలోగాని, వేణుకార కులంలోగాని, రథకార కులంలోగాని, పుల్కస కులంలోగాని జన్మించరు. రెండు కులాలలో మాత్రమే జన్మిస్తారు. లోకానికి బ్రాహ్మణులు గురువులుగా వున్నప్పుడు బోధిసత్త్వులు బ్రాహ్మణ కులంలో జన్మిస్తారు. క్షత్రియులు లోకానికి గురువులుగా వున్నప్పుడు క్షత్రియ కులంలో పుడతారు. ఇప్పుడు లోకానికి క్షత్రియులు గురువులు. కనుక బోధిసత్త్వులు క్షత్రియ కులంలో జన్మిస్తారు.

తుషితవర భవనస్థుడైన బోధిసత్త్వుడు యీ విషయాలను సమర్థంగానే గ్రహించి నాలుగు మహా విలోకితాలు విలోకించాడు.

తుషితపర భవనస్థుడైన బోధిసత్త్వుడు యీ విధంగా అవలోకించి మౌనం వహించాడు. భిక్షువులారా, బోధిసత్త్వుడు మౌనం వహించగానే అక్కడి దేవపుత్రులు "ఏ కులరత్నంలో, ఎలాటి జననిలో బోధిసత్త్వుడు అవతరిస్తాడు?" అని పరస్పరం ప్రశ్నించుకున్నారు. కొందరు అన్నారు: "వైదేహీకులం మగధజనపదాలలో సమృద్ధమూ, సంపన్నమూ, స్ఫీతమూ, క్షేమమూ, సుభిక్షమూ అయినది. బోధిసత్త్వుని గర్భస్థానానికి ఇదే తగినది" అని. "అది తగినది కాదు. దానికి మాతృశుద్ధిగాని, పితృశుద్ధి

గాని లేదు. విస్తృతమైనది కాదు. చంచలమైనదీ, అనవస్థితమైనదీని. పుణ్యాభిష్యంది కాని, విపుల పుణ్యాభిషిక్తం కాని కాదు. సత్కుల ప్రదేశోపచారాలు కలది గాని, ఉద్యాన సర స్తటాకాకీర్ణం కాని కాదు. కర్వటంలాగ ఒకదానిని అంటిపెట్టుకొని ఉండేది. కనుక బోధిసత్త్వుని గర్భస్థానానికి తగదు'' అని మరొకరన్నారు.

''ఇదిగో కోశలకులం. ఇది మహావాహవాలు, మహాపరివారం, మహాధనం గల కులం. కనుక ఈ కులం బోధిసత్త్వుని గర్భ ప్రతిసంస్థానానికి తగినది'' అని ఇంకొకరన్నారు. ''అదికూడా తగినది కాదు. ఎందుకంటే ఈ కోశలకులం మాతంగచ్యుతితో పుట్టినది. మాతృపితృ శుద్ధి లేనిది. హీనాధిముక్తికమైనది. పెద్ద కులాలతోపాటు పేర్కొన్నది కాదు. అపరిమితమైన ధనరత్న నిధులు పుట్టుకు వచ్చినది కాదు. కనుక, తగినది కాదు'' అని మరొక రన్నారు.

ఇంకా కొందరు యీ విధంగా అన్నారు: ''ఇదిగో వత్సరాజ కులం సమృద్ధమైనది, విస్తృతమైనది, క్షేమ సుభిక్షాలు గలదీని. ఇది బోధిసత్త్వుని గర్భస్థానానికి అర్హమైనది'' అని వేరొకరు అన్నారు. ''ఇదికూడా తగినది కాదు. ఏ కారణంవల్లనంటే వత్సరాజ కులం ప్రాకృతం, భయంకరమూను. ఉజ్వలిత తేజస్సు గలది కాదు. పర పురుష జన్మవృత్తమైనది. మాతాపితల స్వకీయ తేజఃకర్మలు లేనిది. అక్కడి రాజేమో ఉచ్ఛేదవాది - వినాశం కోరేవాడు. కనుక ఈ కులం తగినది కాదు'' అని ఇంకొకరు దానికి సమాధాన మిచ్చారు.

''ఇదిగో వైశాలీ మహానగరి. చాల సమృద్ధమైనది. విస్తృతమైనది. క్షేమ సుభిక్షాలు గలది. రమణీయమైనది. బహుజన మనుష్యాకీర్ణమైనది. అరుగులు, ద్వారాలు, తోరణాలు, గవాక్షాలు గల రమ్యహర్మ్యాలతో, కూటాగారాలతో, ప్రాసాదాలతో అలంకృతమైనది. పూచిన పుష్ప వాటికలు, వనరాజి గలది. అమరభవన పురంవలె ప్రకాశించేది. ఈ మహానగరి బోధిసత్త్వుని గర్భప్రతిసంస్థానానికి అర్హమైనది'' అని ఎవరో అన్నారు. ''అహఁ! అదికూడా తగినది కాదు. కారణ మేమిటంటే వైశాలీయులకు పరస్పర న్యాయవాదితగాని, ధర్మాచరణగాని,



ఉచ్చ మధ్య వృద్ధ జ్యేష్ఠానుపాలన మనేదిగాని లేదు. నేనే రాజును, నేనే రాజును అని ప్రతివాడూ అనుకుంటాడు. ఒకరి శిష్యత్వంగాని, ధర్మత్వంగాని పొందరు. కనుక ఆ వైశాలి అనురూప కాదు'' అని యింక కొంతమంది అన్నారు.

మరికొందరు ఇలా అన్నారు: ''ఇదిగో ప్రద్యోత కులం. మహా వాహనాలు గల కుల ముది. శత్రుసేనలను ఎదిరించి విజయాలు పొందినది. బోధిసత్త్వుని గర్భ ప్రతిసంస్థానానికి యీ కులం అనురూపమైనది'' అని. ''ఊహు! ఇదికూడా ప్రతిరూపమైనది కాదు. ఎందుకంటే ప్రద్యోతకుల రాజులు చండులు, చపలులు, రౌద్రులు, పరుషులు, సాహసికులూను. కర్మదర్శులు కారు. కనుక ఆ కులం కూడా బోధిసత్త్వుని గర్భప్రతి సంస్థానానికి తగినది కాదు'' అని కొందరు సమాధానం చెప్పారు.

''ఇదుగో మధురానగరి చూచారా? సమృద్ధమైనది, స్ఫీతమైనది, క్షేమ సుభిక్షాలు గలది, బహుజన మనుష్యాకీర్ణమైనది. సుబాహు మహా రాజుకు కంసకులుడైన శూరసేనేశ్వరునికి రాజధాని. ఇది బోధిసత్త్వుని అవతారానికి అనురూపమైనది'' అని కొందరన్నారు. ''ఇదికూడా అను రూపమైనది కాదు. కారణ మేమిటంటే అక్కడి రాజు మిథ్యాదృష్టి కులవంశ ప్రసూతుడు, దస్యురాజు. కనుక చరమభవికుడైన బోధిసత్త్వునికి మిథ్యాదృష్టి గల కులంలో జన్మించడం ఉచితం కాదు. కనుక ఇది కూడా అనురూపమైనది కాదు'' అన్నారు కొందరు.

''ఇదిగో హస్తినాపురం. ఇది మహానగరం. రాజు పాండవకుల వంశ ప్రసూతుడు. శూరుడు. వీర్యవంతుడు. వరాంగరూప సంపన్నుడు. పరసైన్యాలను మర్దించేవాడు. ఈ కులం బోధిసత్త్వుని గర్భప్రతి సంస్థానానికి అనురూపమైనది'' - అని కొందరు అనగా మరికొందరు కాదన్నారు. ''పాండవ కుల ప్రమాతులవలన కులం అతి వ్యాకులీకృత మైనది. యుధిష్ఠిరుడు ధర్మరాజుపుత్రుడని అంటారు. భీమసేనుడు వాయుపుత్రుడని, అర్జునుడు ఇంద్రుని పుత్రుడని, నకుల సహదేవులు అశ్వినుల పుత్రులని అంటారు. కనుక ఆ కులంకూడా బోధిసత్త్వుని గర్భ స్థితికి అనుగుణమైనది కాదు.''

ఇతరులు అన్నారు: "ఇది మిథిలానగరి. అత్యంత రమణీయమైనది. మైథిలుడైన సుమిత్ర భూపాలుని నివాసభూమి. ఆ రాజు అపార హస్త్యశ్వ రథపదాతి బల సముదాయ సమన్వితుడు. ప్రభూతమైన హిరణ్య సువర్ణ మణిముక్తా వైడూర్య శంఖ శిలా ప్రవాళ జాతరూప రజత విత్తోపకరణాలు గలవాడు. సర్వ సామంతరాజులకు భయంకరమైన పరాక్రమం గలవాడు. మిత్రులు అపారంగా గలవాడు. ధర్మవత్సలుడు. ఆ కులం బోధిసత్త్వుని గర్భస్థితికి అనుగుణమైనది" అని మరికొందరన్నారు. "అది కూడా ప్రతిరూపమైనది కాదు. ఈ సుమిత్ర మహారాజు ఇలాటి గుణగణాన్వితుడు కావడం నిజమే. కాని అతివృద్ధుడు. అతి బహుపుత్రుడు. ప్రజోత్పాదన సమర్థుడు గాడు. కనుక ఆ కులంకూడా బోధిసత్త్వుని గర్భప్రతిసంస్థానానికి అనురూపమైనది కాదు" అని.

భిక్షువులారా, యీ విధంగా బోధిసత్త్వులు, దేవపుత్రులు జంబుద్వీపంలో పదహారు జానపదాలలో ఉన్న పెద్ద పెద్ద రాజకులాలన్నిటినీ చూచారు. అవన్నీ దోషయుక్తాలుగానే కనిపించాయి దోషరహితమైన వంశమేదీ కనిపించక వారంతా చింతామనస్కారయుతులు కాగా జ్ఞానకేతుధ్వజుడనే దేవపుత్రుడు అవైవర్తికుడు యీ మహాయానంలోనే బోధిదర్శనం చేసుకుందామనే కృతనిశ్చయుడు, ఆ గొప్పదైన బోధిసత్త్వ దేవపర్షత్తును చూచి యిలా అన్నాడు: "మారులారా. యీ విషయాన్ని బోధిసత్త్వుణ్ణే సమీపించి అడుగుదాము. ఎలాటి గుణ సంపన్నమైన కులంలో చరమభవికుడైన బోధిసత్త్వుడు జన్మిస్తాడో ప్రశ్నిద్దాము" అని. దానికి వారందరూ సరేనని బోధిసత్త్వుని సన్నిధికి వెళ్లి అంజలి ఘటించి "ఎలాటి గుణసంపన్నమైన సత్పురుష కులరత్నంలో చరమభవికుడైన బోధిసత్త్వుడు ఉదయిస్తాడు?" అని ప్రశ్నించారు.

అప్పుడు ఆ బోధిసత్త్వుడు ఆ బోధిసత్త్వగణాన్నీ, దేవగణాన్నీ చూచి యిలా అన్నాడు: "ఓ మార్షులారా, చరమభవికుడైన బోధిసత్త్వుడు జనించే కులం అరవైనాలుగు ఆకారాలతో సంపన్నంగా ఉంటుంది. ఆ అరవైనాలుగు ఆకారాలు ఏవి అంటే: ఆ కులం అభిజ్ఞాతంగా ఉంటుంది అక్షుద్రానుపఘాతిగాను, జాతిసంపన్నంగానూ, గోత్ర



సంపన్నంగానూ, పురుషయుగ సంపన్నంగాను, హీనం కానిదిగాను, పూర్వపురుషయుగ సంపన్నంగాను, అభిజాత పురుషయుగ సంపన్నంగాను, అభిలక్షిత పురుషయుగ సంపన్నంగాను, మహేశాఖ్య పురుషయుగ సంపన్నంగాను ఉంటుంది. స్త్రీలు హెచ్చుగా కలదిగాను, పురుషులు హెచ్చుగా గలదిగాను, భయంలేనిది, దీనంకానిది, లోభం లేనిది, శీలవంతమైనది, ప్రజ్ఞావంతమైనదిగాను ఉంటుంది. అమాత్యాపేక్షితమై భోగాలు అనుభవిస్తుంది. అవంధ్యమైన శిల్పాలకు స్థానంగా వుంటూ భోగాలను అనుభవిస్తుంది. ఆ కులానికి దృఢచిత్తులైన మిత్రులు వుంటారు. తిర్యగ్యోనిగత ప్రాణులను కూడా అది బాధించదు. కృతజ్ఞత గలదిగాను, కృతవేదిగాను ఉంటుంది. ఇచ్చ వచ్చినట్టు ప్రవర్తించనిది, దోషమార్గంలో పోనిది, మోహమార్గంలో వెళ్లనిది, అవద్య విషయాలకు భయపడేది, మోహంలో విహరించనిది, స్థూలభిక్షుంగాను అయి వుంటుంది. ఆ కులం క్రియాధిముక్తమూ, త్యాగాధిముక్తమూ, దానాధిముక్తమూ అయి వుంటుంది. పురుషకారమతి గలదిగాను, దృఢవిక్రమం గలదిగాను, బలవిక్రమం గలదిగాను, శ్రేష్ఠవిక్రమం గలదిగాను, అయి వుంటుంది. ఋషులను పూజించేది, దేవతలను పూజించేది, చైత్యాలను పూజించేది, పూర్వ ప్రేతాలను పూజించేది ఆ కులం. ఆ కులానికి ఎవరితోను బద్ధవైరమనేది లేదు. దశదిక్కులలోను పేరు పొందినట్టిదిగాను, మహాపరివారయుతమైనదిగాను, అభేద్యపరివారయుతమైనదిగాను, అనుత్తర పరివారయుతమైనదిగాను, కులజ్యేష్ఠమూ కులశ్రేష్ఠమూ అయినదిగాను ఆ కులం వుంటుంది. కుల వశిత్వం పొందినది, మహేశాఖ్య గలది, తల్లిని తెలిసినది, తండ్రిని తెలిసినది, శ్రమణులు గలది బ్రాహ్మణులు గలది ఆ కులం. ప్రభూతమైన ధనధాన్యాలు, కోశం, కోష్టాగారాలు గలది, ప్రభూతమైన హిరణ్య సువర్ణ మణిముక్తా జాతరూప రజత విత్తోపకరణాలు గలది. అసంఖ్యాకమైన ఏనుగులు, గుర్రాలు, ఒంటెలు, గోవులు, గొర్రెలు గలది, ప్రభూతంగా దాసదాసీజనులు, పనివారు, మనుష్యులు ఉన్నది ఆ కులం. ఆ కులం దుష్ప్రధర్షమైనది. సర్వార్థాలూ సిద్ధించింది. చక్రవర్తులు పుట్టినది. పూర్వకుశల మూల సహాయంతో అభివృద్ధి చెందినది. బోధిసత్త్వకుల కులోదితమైనది. సర్వ

జాతి వాదదోషాలతో నిండి, దేవతలు, మారుడు, బ్రహ్మ ఉన్న యీ లోకంలో - శ్రవణులు, బ్రాహ్మణులు మొదలైన ప్రజలున్న యీ లోకంలో నిర్దోషమైనది ఆ కులం. మార్షులారా, ఈ అరవైనాలుగు ఆకారాలు గల కులంలో చరమభవికుడు (తుది పుట్టుక గలవాడు) అయిన బోధిసత్త్వుడు జన్మిస్తాడు.

ఓ మార్షులారా ! చరమభవికుడయిన బోధిసత్త్వుడు కుక్షిలో ప్రవేశించే స్త్రీకి ముప్ఫయి రెండు గుణాకారా లుంటాయి. ఆ ముప్ఫయి రెండు గుణాకారాలు ఏమిటంటే - అభిజ్ఞాత అయిన స్త్రీ కుక్షిలోనే చరమభవికుడయిన బోధిసత్త్వుడు ప్రవేశిస్తాడు. ఆమె అభిలషిత, నిరంతరం ఉపచారాలు పొందేది, జాతిసంపన్న, కులసంపన్న, రూపసంపన్న, నామసంపన్న, ఆరోహపరిణాహ(అంగసౌష్ఠవ)సంపన్న, అప్రసూత, శీలసంపన్న, త్యాగసంపన్న, స్మితముఖ, ప్రదక్షిణగ్రాహిణి, వ్యక్త, వినీత, విశారద, బహుశ్రుత, పండిత, శఠురాలు కానిది, మాయమర్మాలు లేనిది, క్రోధంలేనిది, ఈర్ష్యలేనిది, మాత్సర్యంలేనిది, అచంచల, అచపల, వడవడ వాగనిది, క్షాంతిసౌరభ్యసంపన్న, లజ్జాసంపన్న, రాగద్వేషమోహాలు తక్కువగా గలది, తల్లివైపు దోషాలు లేనిది, పతివ్రత, సర్వాకారగుణసంపన్న. మార్షులారా, ఇలాటి ముప్పయి రెండు గుణాకారాలు గల స్త్రీ కుక్షిలోనే చరమభవికుడయిన బోధిసత్త్వుడు ప్రవేశిస్తాడు.

"మార్షులారా, బోధిసత్త్వుడు కృష్ణపక్షంలో తల్లిగర్భంలో ప్రవేశించడు. శుక్లపక్షంలో, పూర్ణిమ సంపూర్ణంగా ఉన్న నాడు, పుణ్య నక్షత్ర యోగంలో పోషధవ్రతస్థురాలయిన మాత గర్భంలో ప్రవేశిస్తాడు."

తర్వాత, ఆ బోధిసత్త్వులు, దేవపుత్రులు బోధిసత్త్వునినుంచి ఈ విధమయిన కులపరిశుద్ధిని, మాతృపరిశుద్ధిని విని కూడా చింతాకులితులయారు. ఇప్పుడు చింత ఎందుకంటే, ఈ సత్పురుషుడు నిర్దేశించిన ఈలాటి గుణాలు గల కులం ఏదా? - అని. ఈలాటి చింతతో ఆకులితమనస్కులయిన వారికి ఈ విధంగా తోచినది : "ఇదిగో శాక్యకులం ఉండనే ఉన్నది. ఇది సమృద్ధమూ, స్ఫీతమూ, క్షేమసుభిక్షయుతమూ, రమణీయమూ, బహు



జన మనుష్యాకీర్ణమూను. ఈ కులంలోని శుద్ధోదనరాజు మాతృశుద్ధి, పితృశుద్ధి, పత్నీశుద్ధి కలవాడు. అపరితృప్త సంపన్నుడు. స్వాకారసదృశమైన ప్రజ్ఞ గలవాడు. పుణ్యతేజస్సుతో భాసించేవాడు. మహాసంయతకుల ప్రసూతుడు. చక్రవర్తి వంశకులకులోదితుడు. అపరిమిత ధననిధి. రత్నసమన్వితుడు. కర్మదృష్టి గలవాడు. పాపదృష్టి రహితుడు. సర్వశాక్యులకు ఏకైకరాజు. శ్రేష్ఠి, గృహపతి అమాత్యపారిషద్యులు మొదలయిన వారికి పూజ్యుడు. మాన్యుడు. ప్రసాదగుణశోభితుడు. దర్శనీయుడు. అతివృద్ధుడు అతి తరుణుడు కాక అభిరూప సంపన్నుడు. సర్వగుణోపేతుడు. శిల్పజ్ఞుడు. కాలజ్ఞుడు. ఆత్మజ్ఞుడు. ధర్మజ్ఞుడు. తత్త్వజ్ఞుడు. లోకజ్ఞుడు. లక్షణజ్ఞుడు. ధర్మరాజు. కుశలమూలాలు లేని ప్రాణులను కూడా ధర్మంతో అనుశాసించేవాడు. కపిలవస్తు మహానగరవాసి. ఆ నగరంలో ఉన్న ఇతరులుకూడా ఆ స్వభావం గలవారే. శుద్ధోదనరాజు దేవేరి పేరు మాయ. ఆమె సుప్రబుద్ధుడనే శాక్యాధిపతికుమార్తె. ఆమె నవతరుణి. రూపయౌవనసంపన్న. అప్రసూత. అపగతపుత్రదుహితృక, సురూప. పటంలోని చిత్రంవలె దర్శనీయ. దేవకన్యలాగ సర్వాలంకారభూషిత. తల్లివంశంవైపు దోషాలు లేనిది. సత్యవాదిని. అకర్కశ. అపరుష. అచపల. అనవద్య. కోకిలస్వర. అప్రలాపిని. మధురప్రియవాదిని. క్రోధమదమానదర్పాలు లేనిది. ఈర్ష్యలేనిది. సమయమెరిగి మాట్లాడేది. త్యాగసంపన్న. శీలవతి. పతిసంతుష్ట. పతివ్రత. మనస్సుచేతనూ పరపురుషుణ్ణి చింతించనిది. శిరస్సు, కర్ణాలు, నాసిక సమంగా ఉండేది. భ్రమరవరసదృశకేశాలు గలది. సుందరమయిన లలాటస్థలం గలది. మంచి కనుబొమలు గలది. బొమ ముడిపాటు లేనిది. స్మితముఖి. పూర్వాభిభాషిని (ముందుగానే పలుకరించేది). శ్లక్ష్ణ మధుర వచన. ప్రదక్షిణగ్రాహిణి. ఋజువయిన దేహం కలది. అకుటిల. అశఠ. మాయమర్మాలు ఎరుగనిది. లజ్జావతి. అచపల. అచంచల. అముఖర. (వాగుడు లేనిది.) చెదరని మాటలు గలది. రాగద్వేషమోహాలు లేనిది. క్షాంతిసౌరభ్య సంపన్న. కరచరణనయన స్వారక్షిత బుద్ధి. మృదువయిన లేలేత హస్తపాదాలు గలది. కాచిలిందిక కుసుమంవంటి మృదుస్పర్శ గలది. నవవికసితమైన కమలపత్రం, ఇందీవరపత్రంవంటి విశుద్ధమైన నేత్రాలు గలది. ఎర్రటి ఎత్తైన నాసిక

గలది. సుప్రతిష్ఠితమైన అంగాలు గలది. వజ్రయష్ఠివంటి దేహం గలది. సువినీత. సువిభక్తమయిన అంగ ప్రత్యంగాలు గలది. అనిందితాంగి. బింబోష్ఠి. చారుదశన. చక్కని మెడ గలది. మంచి అలంకారాలు గలది. మంచి మనస్సు గలది. వార్షికి. సువిశుద్ధ దర్శన. వాలిన భుజాలు గలది. అనుపూర్వ (క్రమసుందర) బాహువులు గలది. చాపోపమోదరి. చెక్కుకొని పోయినట్టులేని పార్శ్వభాగాలు గలది. గంభీరమయిన నాభిమండలం గలది. గుండ్రనిది, విస్తీర్ణమైనది, నునుపైనది, కఠినమైనది అయిన కటిభాగం గలది. గజసంహసన సదృశమయిన దేహం కలది. ఏనుగుతొండం వంటి సమాహితమైన ఊరువులు గలది. జింకల జంఘలవంటి జంఘలు గలది. లాక్షారససదృశమైన పాణిపాదాలు గలది. నయనాభిరమ్య. అప్రతిహతమయిన చూపు గలది. మనోహర ప్రియదర్శన. స్త్రీరత్న రూపానికి తార్కాణం వంటిది. మాయానిర్మితమైన పత్తలికవలె మాయానామధేయురాలు. కళా విచక్షణ. నందనవనంలోని అప్సరసవలె శుద్ధోదన మహారాజు అంతఃపురంలో ప్రకాశించే ఆ మాయాదేవి బోధిసత్త్వునికి జనని కాదగినది. బోధిసత్త్వుడు తెలిపిన కులపరిశుద్ధి శాక్యకులంలోనే కనిపిస్తున్నది.''

ఇది శ్రీ లలితవిస్తర మహాపురాణంలో కులపరిశుద్ధి పరివర్తమనే తృతీయాధ్యాయం.

# 4. ధర్మాలోక ముఖపరివర్తం

భిక్షువులారా, బోధిసత్త్వుడు ఈ విధంగా జన్మకులం విలోకించి తుషితాలయంలో ఉచ్చధ్వజమనే మహావిమానాన్ని అధిరోహించి తుషితులనే దేవతలకు ధర్మం ఉపదేశిస్తున్నాడు. ఆ మహావిమానం పొడువు, వెడల్పు అరవై నాలుగు యోజనాలు. ఆ మహావిమానాన్ని బోధిసత్త్వుడు అధిరోహించి, తుషితకాయికులనే దేవపుత్రులందరిని ''ఓ దేవపుత్రులారా, విమానంలో వచ్చి వాలండి. చ్యుత్యాకారప్రయోగమనే ధర్మానుస్మృతిచర్యానుశాసనమైన కడపటి ధర్మాన్ని బోధిసత్త్వునినుంచి వినండి'' అని ఆహ్వానించాడు. ఈ మాట విని తుషిత దేవపుత్రులు అప్సరోగణాలతో సహా ఆ విమానానికి వచ్చి చేరారు.

చతుర్మహాద్వీప సమూహంలో లోకధాతు విస్తర ప్రమాణమైన ఆ విమానంలో బోధిసత్త్వుడు మండలమాత్ర ప్రదేశం అధిష్ఠించాడు. ఆ విమానం ఎంతో విచిత్రంగా, ఎంతో దర్శనీయంగా, ఎంతో అలంకృతంగా, ఎంతో సురుచిరంగాను ఉన్నది. దానిని చూచి కామావచరులైన దేవతలు, రూపావచరులైన దేవపుత్రులు తమ భవన సమూహాలను శ్మశాన ప్రాయంగా భావించారు.

ఆ విమానంలో బోధిసత్త్వుడు ఒక సింహాసనంలో ఆసీనుడయాడు. ఆ సింహాసనం అతని పుణ్యపరిపాక ప్రవాహంతో పరివేష్ఠితమయినట్లు కాంతిమండలంతో పరిమండితమైనది. దాని పాదాలు అనేక మణిరత్నాలతో తాపబడ్డాయి. అనేక పుష్పాలతో దానిపై సెజ్జలు తీర్చారు. అది అనేక దివ్యగంధాలతోను, అనేక శ్రేష్ఠగంధ ధూపాలతోను వాసితమైంది. రంగురంగుల దివ్యపుష్పాల గంధాలు దానికి పూశారు. అది, తాపడం చేసిన శతసహస్రమణిరత్నాల కాంతితో మహోజ్జ్వలంగా మెరిసిపోతున్నది. దానిని అనేక మణిరత్నహారాలతోను, పెక్కు గజ్జెల మాలలతోను అలంకరించారు. అవి కదలినప్పుడు మనోహరమైన ధ్వని వినవస్తుంది. అనేక రత్నఘంటాశతసహస్రాలు దానికి కట్టారు. వాటి మంజురణితమూ వినవస్తుంది.

పైని అనేక రత్నశతసహస్రగణం కప్పారు. వాటి కాంతి కిందికి తన్ని సింహాసనాన్ని మరింత పరిస్ఫుటం చేస్తున్నది. దానికి అనేకశతసహస్ర పట్టువస్త్రాలు ప్రేలాడదీశారు. అవి గాలికి అటూ ఇటూ కదులుతూ మరింత అందం ఇస్తున్నవి. అనేక పట్టువస్త్రాలు, శతసహస్ర పుష్పమాలికలు అలంకరించారు. అనేక శతసహస్రాప్సరసలు గానంచేస్తూ, వాద్యాలతో కూడా నృత్యం చేస్తున్నారు. అనేక సహస్ర గణాలు దానిని వర్ణిస్తున్నాయి. అనేక శతసహస్రలోకపాలకులు దానిని రక్షిస్తున్నారు. అనేక శతసహస్ర సంఖ్యాకులయిన ఇంద్రులు దానికి నమస్కరిస్తున్నారు. వేలకొలది బ్రహ్మలు దానికి ప్రణామాలు చేస్తున్నారు. అనేక శతసహస్ర కోటీనియుత బోధిసత్త్వులు దానిని పట్టుకున్నారు. దశదిక్కులనుంచి వచ్చిన శతసహస్రకోటి నియుత సంఖ్యాకులయిన బుద్ధులు దానిని తీసుకొని వస్తున్నారు. అపరిమిత కల్పకోటీ నియుత శతసహస్ర పారమితా సమూహం పుణ్యపరిపాకప్రవాహంనుంచి ఉద్భవించిందా అన్నట్టు ఉంది. భిక్షువులారా, బోధిసత్త్వుడు ఇలాటి గుణగణాలు గల సింహాసనంపై ఆసీనుడై ఆ గొప్ప దేవపరిషత్తును ఆహ్వానించాడు. మహర్షులందరూ వందలకొలదీ పుణ్యలక్షణాలతో అలంకృతమయిన బోధిసత్త్వుని శరీరాన్ని దర్శించారు. అప్పుడు పూర్వంలోను, దక్షిణంలోను, పశ్చిమంలోను, ఉత్తరంలోను, పైని, కింద - దశదిక్కులలోను అప్రమేయులు, అసంఖ్యేయులు, గణనకు మీరినవారు అయిన బోధిసత్త్వులు కనిపించారు. తుషితవరభవనవాసులైన ఆ బోధిసత్త్వులందరూ చరమభవాభిముఖులై, దేవగణపరివృతులై దేవతలకుకూడా హర్షం కలిగించే చ్యుత్యాకార ప్రయోగమనే ధర్మలోకముఖం వెల్లడిస్తున్నారు. అప్పుడు ఆ దేవపరిషత్తు బోధిసత్త్వాధిష్ఠానంతో అసంఖ్యాకబోధిసత్త్వులను దర్శించి, ఈ అపూర్వదర్శనానికి మూలకారణమైన బోధిసత్త్వునికి అంజలి ఘటించి పంచమండల నమస్కారంచేసి ఈ విధంగా అనుకున్నారు: "సాధు సాధు. ఈ బోధిసత్త్వాధిష్ఠానం ఆశ్చర్యకరంగా వుంది. ఊహించలేకున్నాము. బోధిసత్త్వవిలోకనమాత్రంతోనే ఇంతమంది బోధిసత్త్వులను చూస్తున్నాము."

అనంతరం బోధిసత్త్వుడు ఆ మహా దేవపరిషత్తును మరల ఈ విధంగా సంబోధించాడు: "మార్షులారా, దేవతలకుకూడా హర్షం



కలిగించే చ్యుత్యాకార మనే ధర్మాలోక ముఖాన్ని ఈ బోధిసత్త్వులు ఈ దేవపుత్రులకు ఉపదేశిస్తారు. ఈ ధర్మాలోక ముఖం నూట ఎనిమిది విధాలు. దీనిని చ్యవన సమయంలో బోధిసత్త్వుడు దేవపరిషత్తులో వెల్లడించవలసి ఉన్నది. ఆ నూటయెనిమిది విధాలు ఏవంటే: మార్షులారా, శ్రద్ధ అనేది మొదటి ధర్మాలోకనముఖం. ఇది అభేద్యాశయత కలిగించేది. ప్రసాద మనేది రెండవ ధర్మావలోకనముఖం. ఇది కలతపడిన మనస్సుకు ప్రసన్నభావం కలిగించగలది. ప్రామోద్యమనే ధర్మాలోకనముఖం ప్రకర్షమైన సిద్ధిని కలిగిస్తుంది. ప్రీతి అనే ధర్మాలోకనముఖం చిత్తవిశుద్ధిని చేకూరుస్తుంది. కాయసంవరమనే ధర్మాలోకముఖం త్రివిధ కాయపరిశుద్ధికి, వాక్సంవర మనే ధర్మాలోకముఖం నాల్గు విధాలయిన వాగ్దోషాలను తొలగించుకొనడానికి తగినవి. మనస్సంవర మనే ధర్మాలోకముఖం అభిధ్యను, మిథ్యాదృష్టిని తొలగించడానికి, బుద్ధానుస్మృతి అనేది ధర్మబోధ విశుద్ధికి, సంఘానుస్మృతి అనేది న్యాయాక్రమణతకు, త్యాగానుస్మృతి అనేది సర్వోపధి ప్రతినిస్సర్గంకోసమూ, శీలానుస్మృతి అనేది ప్రణిధాన పరిపూర్తికి, దేవతానుస్మృతి అనేది ఉదారచిత్తతకు, మైత్రి అనేది సర్వధర్మచింత గల పుణ్యక్రియా సంపాదనకు తోడ్పడుతాయి. కరుణ అనే ధర్మాలోకముఖం అహింసాబుద్ధికి, ముదిత అనేది సకలానిష్టాపకర్షణకు, ఉపేక్ష అనేది కామంపట్ల జుగుప్స కలిగించడానికి తగినవి. అనిత్యప్రత్యవేక్ష అనేది కామరూపారూప్యరాగాలను అతిక్రమించడానికి, దుఃఖప్రత్యవేక్ష అనేది ప్రణిధాన సముచ్ఛేదానికి, అనాత్మ ప్రత్యవేక్ష అనేది ఆత్మయెడ అభినివేశం లేకుండా చేయడానికి, శాంత ప్రత్యవేక్ష అనేది అనునయాభివృద్ధికి, హ్రీ అనే ధర్మాలోకనముఖం ఆత్మోపశాంతికి, అపత్రాప్య మనేది ఆకారగోపనాన్ని పోగొట్టడానికి, సత్యమనేది దేవ మనుష్య భేదనిరాసానికి, భూత మనేది ఆత్మావిసంవాదానికి, ధర్మచరణ మనేది ధర్మాన్ని శరణు పొందడానికి, త్రిశరణగమన మనేది మూడు అపాయాలను దాటడానికి, కృతజ్ఞత అనేది లోగడ చేసిన కుశలకర్మల మూలం నశించకుండా ఉండడానికి, కృతవేదిత అనేది పరులను అభిమానించడానికి, ఆత్మజ్ఞత అనేది ఆత్మోత్కర్షాభావానికి, సత్త్వజ్ఞత అనేది పరుల ఆప

దలను తన ఆపదలతో సమానంగా చూడడానికి, ధర్మజ్ఞత అనేది ధర్మానుధర్మ ప్రతిపత్తికి, కాలజ్ఞత అనేది అమోఘ దర్శనం సంపాదించడానికి, నిహితమానత అనేది జ్ఞాన పరిపూర్తికి, అప్రతిహతచిత్తత అనేది తనను, ఇతరులను రక్షించుకొనే బుద్ధికోసం, అనుపనాహమనేది దుష్టకృత్యాలు చేయకపోవడానికి, అధిముక్తి అనేది సంశయంలేకుండడానికి, అశుభ ప్రత్యవేక్ష అనేది కామవితర్క వినాశానికి, అవ్యాపాదమనేది ద్రోహచింతను పోగొట్టడానికి, అమోహమనేది సత్యాజ్ఞానాన్ని ఎగురగొట్టడానికి, ధర్మార్థికత అనేది అర్థప్రతి శరణతకు, ధర్మకామత అనేది లోక ప్రబిలంభానికి, శ్రుతిపర్యేష్టి అనేది యోనిశో ధర్మ ప్రత్యవేక్షణతకు, సమ్యక్ప్రయోగ మనేది సమ్యగ్జ్ఞానానికి, నామరూపపరిజ్ఞ అనేది సర్వసంగాలను అతిక్రమించడానికి, హేతుదృష్టి సముద్ఘాటమనేది విద్యాధిముక్తి లాభానికి, అనునయప్రతిఘ ప్రహాణం అనేది ఉబ్బడం తగ్గడం లేకపోవడానికి, స్కంధకౌశల్యమనేది దుఃఖపరిజ్ఞానం కోసం, ధాతు సమత అనేది దేని ప్రకోపమునయినా నివారించడానికి, ఆయతనాపకర్షణ మనేది మార్గం తెలుసుకొనడానికి, అనుత్పాదక్షాంతి అనేది మరుగుగా ఉన్నదానిని సాక్షాత్కరించుకోడానికి, కాయగతానుస్మృతి అనేది కాయవివేకంకోసం, వేదనాగతానుస్మృతి అనేది సర్వ విషయాలయెడ గొప్ప శ్రద్ధ కలిగి ఉండడానికి, చిత్తగతానుస్మృతి అనేది మాయోపమ చిత్తప్రత్యవేక్షణ కలిగి ఉండడానికి, ధర్మగతానుస్మృతి అంధకారరహితమైన జ్ఞానం కలిగి ఉండడానికి, సమ్యక్ప్రహాణచతుష్టయమనే ధర్మాలోకముఖం సమస్తమైన అకుశల ధర్మనివారణకు, సర్వకుశల ధర్మపరిపూర్తికి ఉపకరిస్తాయి. బుద్ధిపాదచతుష్టయమనే ధర్మాలోకముఖం కాయమనస్సుల లఘుత్వంకోసం, శ్రద్ధేంద్రియమనేది ఇతరులయెడ వినయానికి, వీర్యేంద్రియ మనేది సువిచింతిత జ్ఞానంకోసం, స్మృతీంద్రియ మనేది సుకృత కర్మలకు, సమాధీంద్రియ మనేది చిత్తవిముక్తికి, ప్రజ్ఞేంద్రియ మనేది ప్రత్యవేక్షణ జ్ఞానానికి, శ్రద్ధాబల మనేది మారుని బలాన్ని అతిక్రమించడానికి, వీర్యబల మనేది విరోధం లేకపోవడానికి, స్మృతిబల మనేది అసంహార్యతకు, సమాధిబల మనేది సమస్తవితర్కాల వినాశానికి, ప్రజ్ఞాబల మనేది మాఢ్యరహితత్వానికి, స్మృతి సంబోధ్యంగ మనేది



యథావిధిగా ధర్మం తెలుసుకొనడానికి, ధర్మప్రవిచయసంబోధ్యంగ మనేది సర్వధర్మ పరిపూర్తికి, వీర్యసంబోధ్యంగ మనేది సువిచిత్రబుద్ధి కలుగడానికి, ప్రీతిసంబోధ్యంగ మనేది ధ్యాననిష్ఠకు, ప్రశ్రబ్ధిసంబోధ్యంగ మనేది చేయవలసిన కార్యాలు చేయడానికి, సమాధి సంబోధ్యంగ మనేది సమతాజ్ఞానానికి, ఉపేక్షా సంబోధ్యంగ మనేది సర్వోపపత్తులను ఏవగించుకొనడానికి, సమ్యగ్దృష్టి అనేది న్యాయాక్రమణతకూ, సమ్యక్సంకల్ప మనేది సర్వకల్ప వికల్ప పరికల్ప వినాశానికి, సమ్యగ్వాక్కు అనేది సమస్తాక్షర రుతఘోష వాక్యాలు, ప్రథప్రతిశ్రుతులు సమానమైనవని బోధించడానికి, సమ్యక్కర్మాంతమనేది అకర్మలు పరిపాకం కాకుండా ఉండడానికి, సమ్యగాజీవ మనేది సర్వేషణ ప్రతిప్రశ్రబ్ధికి, సమ్యగ్వ్యాయామ మనేది ఆవలి ఒడ్డును పొందడానికి, సమ్యక్స్మృతి అనేది చెడ్డ స్మృతిలో మనసు లగ్నం కాకుండా ఉండడానికి, సమ్యక్సమాధి అనేది కోపరహితమైన చేతస్సమాధి పొందడానికి, బోధిచిత్తమనేది చిరంతన వంశాలకు నాశం లేకుండా చేయడానికి, ఆశయమనే ధర్మాలోకముఖం హీనయానాన్ని ఆశించకపోవడానికి, అధ్యాశయ మనేది ఉదారమైన బుద్ధ ధర్మాన్ని అవలంబించడానికి, ప్రయోగమనేది సర్వకుశల ధర్మపరిపూర్తికి, దానపారమిత అనేది లక్షణానువ్యంజన బుద్ధక్షేత్రపరిశుద్ధికి, మత్సరులయినవారి పరిపాకానికి, శీలపారమిత అనేది సకలాశాంత్యపాయాలను దాటడానికి, దుష్టశీలులను పరిపాకం పొందించడానికి, క్షాంతిపారమిత అనేది సర్వద్రోహచింతనలను, సమస్తదోషాలను, మాన మద దర్పాలను పోగొట్టుకొనడానికి, అపద్గ్రస్తులయినవారి పరిపాకానికి, వీర్యపారమిత అనేది సర్వకుశలాలకు మూలమయిన ధర్మం ఉద్ధరణకు, పేరాశగలవారి పరిపాకానికి, ధ్యానపారమిత అనేది సర్వజ్ఞానాభిజ్ఞులు కలిగించడానికి చిత్తనిక్షేపంగల ప్రాణుల రక్షణకు, ప్రజ్ఞాపారమిత అవిద్యామోహ తమోంధకారోపలంభ దృష్టిని తొలగించడానికి, దుష్టప్రజ్ఞగలవారిని సంస్కరించడానికి ఉపకరిస్తాయి. ఉపాయ కౌశల మనేది అధిముక్తజీవులకు ఆర్యపథ సందర్శనం కోసం, సర్వబుద్ధ ధర్మాచరణ మనస్కతకు ఉద్దేశించబడింది. సంగ్రహ వస్తు చతుష్టయ మనే ధర్మాలోకముఖం సత్త్వసంగ్రహానికి, సంబోధి పొందినవాడు ధర్మ

సంప్రత్యవేక్షణ సాధించడానికి, సత్త్వపరిపాక మనేది ఆత్మసుఖాలు విడవడానికి, పరిఖేదం లేకపోవడానికీ, సద్ధర్మ పరిగ్రహ మనేది సకల జీవుల క్లేశనివారణకు, పుణ్య సంభార మనేది సర్వజీవులకూ ఆధార భూతుడు కాదగిన యోగ్యతకు, జ్ఞానసంభార మనేది దశబల సంపూర్ణతకు, శమథ సంభార మనేది తథాగతుని సమాధ్యవస్థా లాభానికి, విదర్శనా సంభారమనేది ప్రజ్ఞాచక్షు లాభానికి, ప్రతిసంవిదవతార మనేది ధర్మనేత్ర సంపాదనకు, ప్రతిశరణావతార మనేది బుద్ధనేత్ర పరిశుద్ధికి, ధారణీ ప్రతిలంభ మనేది సర్వబుద్ధ భాషితాలను ధారణ చేసుకొనడానికి, ప్రతిభాన ప్రతిలంభ మనేది సర్వజీవులను సుభాషితాలతో సంతోషపెట్టడానికి, ఆనులోమిక ధర్మక్షాంతి అనేది సర్వ బుద్ధ ధర్మాలను చక్కబరచడానికి, అనుత్పత్తిక ధర్మక్షాంతి అనేది వ్యాఖ్యాన లాభంకోసం, అవైవర్తిక భూమి అనేది సర్వబుద్ధ ధర్మ ప్రతిపూర్తికి, భూమేర్భూమి సంక్రాంతి అనేది సర్వజ్ఞ జ్ఞానాభిషేకం పొందడానికి, అభిషేకభూమి అనేది, అవక్రమణం, జన్మాభి నిష్క్రమణం, దుష్కర చర్య. బోధిమండోపసంక్రమణం, మారధ్వంసనం, బోధి విబోధనం, ధర్మచక్ర ప్రవర్తనం, మహాపరినిర్వాణం - వీటిని సందర్శించడానికి తగినవి. ఓ మార్షులారా, నూట యెనిమిది ధర్మాలోక ముఖాలు ఇవే. వీటిని బోధిసత్త్వుడు చ్యుతికాలంలో దేవపషత్తులో తప్పక వెల్లడించవలసి ఉన్నది.

భిక్షువులారా, బోధిసత్త్వుడు ఈ విధంగా ఆ దేవపరిషత్తులో ధర్మాలోక పరివర్తం తెలుపుతుండగా, ఎనభైనాలుగువేలమంది దేవపుత్రులకు అనుత్తరసమ్యక్సంబోధిలో మనస్సు కలిగింది. పూర్వం కరుణా ముదితాది పరికర్మలు గల ముప్ఫయిరెండు వేలమంది దేవపుత్రులకు ఇక ఉత్పత్తి కలిగించని ధర్మాలలో మన్నన కలిగింది. ముప్ఫయిఆరు నయుతాల దేవపుత్రులు రజోరహితులు, మలరహితులు అయి, పరిశుద్ధమైన ధర్మదృష్టి కలిగినవారయారు. తుషిత భవనమంతటా మోకాలుబంటి దివ్య పుష్పవర్షం కురిసింది.



అంతట బోధిసత్త్వుడు ఆ మహా దేవపరిషత్తును అత్యధికంగా సంతోషపెట్టడంకోసం ఈ గాథలను పలికాడు :

తుషిత వరభవన నిలయాత్ యదా చ్యవతి నాయకః పురుషసింహః,
ఆమంత్రయతే దేవాన్ ప్రమాద మఖిలం విసర్జయత.

యా కాచి దతి వియూహా దివ్యా మనసా విచింతితా శ్రీమాన్,
సర్వశుభకర్మ హేతోః ఫల మిదం శృణు రస్య కర్మస్య.

తస్మాద్భవత కృతజ్ఞాః అపూర్వ శుభ సంచయం క్షుపిత్వేహ,
మా గచ్ఛత పున రపాయాన్ అసాధ్యసుఖ వేదనా యత్ర.

ధర్మశ్చ య శ్రుతోయం మమాంతికే గౌరవ ముపజనిత్వా,
తత్ర ప్రతిప ద్యథాః ప్రాస్స్యథ నియతం సుఖ మనంతం.

సర్వ మనిత్య కామా అధ్రువం న చ శాశ్వతా అపి నకల్పాః,
మాయా మరీచి సదృశా విద్యుత్ఫేనోపమా శ్చపలాః.

న చ కామగుణరతీభిః తృప్తి ర్లవణోదకం యథా పీత్వా,
తే తృప్తయేష ప్రజ్ఞా ఆర్యా లోకోత్తరా విరజా.

న తు రంగతుల్య కల్పాః సంగీతి చ అప్సరోభిసంవాసః,
అన్యోన్య గమనయుక్తా యథైవ సా మాయి కామం చ.

నచ సంస్కృతే సహాయా న మిత్రజ్ఞాతీజనో పరివారాః,
అన్యత్ర కర్మ సుకృతాదనుబంధతి పృష్ఠతో యాతి.

తస్మా త్సహితసమగ్రా అన్యోయం మైత్రచిత్త హితచిత్తాః,
ధర్మచరణం చరేథాః సుచరితచరణా న తప్యంతే.

బుద్ధ మనుస్మరేథాః ధర్మం సంఘం తథా ప్రమాదం చ,
శ్రుత శీల దాన నిరతా క్షాంత్యా సౌరభ్యసంపన్నాః.

దుఃఖ మనిత్య మనాత్మా నిరీక్షథా యోనిసా ఇమా ధర్మా,
హేతు ప్రత్యయయుక్తా వర్తంతేఽస్వామికా జడా బుద్ధ్యా.

యా కాచి బుద్ధి మహ్యాం పశ్యత ప్రతిభాం చ జ్ఞానగుణతాం చ,
సర్వశుభ కర్మహేతోః శీలేన శ్రుతేన చాప్రమాదేన.

అనుశిష్యధ్వం మహ్యాం శీలేన శ్రుతీ చాప్రమాదేన,
దానదమ సంయమేనా సర్వార్థహితార్థ మిత్రార్థః.

నచ వాక్యరుతరవేణా శక్యాః సంపాదితు కుశలధర్మాన్,
ప్రతిపత్తి మారిభేతా యథాచ వదథా తథ కరేథా.

మా ఖలు పరావకాశం స్వయం యతధ్వం సదా ప్రయత్నేన,
న చ కశ్చి కృత్వ దదతే న చాప్యకృత్వా భవతి సిద్ధిః.

సమనుస్మరథా పూర్వే యద్దుఃఖం సంసారగిర మనుభూతం,
నచ నిర్వృతీ విరాగో సమనుగతో మిథ్య నియతైవ.

తస్మాత్ క్షణం లభిత్వా మిత్రం ప్రతిరూపదేశవాసం చ,
శ్రేష్ఠం చ ధర్మ శ్రవణం ప్రమేథ రాగాదికాన్ క్లేశాన్.

మానమద దర్ప విగతా సదార్జవా మందవాశ్చ అశథాశ్చ,
నిర్వాణ గతి పరాయణ యుజ్యత మార్గాభిసమయాయ.

మోహా కలుషాంధకారం ప్రజ్ఞాప్రదీపేన విధమథా సర్వం,
సానుశయదోషజాలం విదారయత జ్ఞాన వజ్రేణ.

కిమపి సుబహు వదేయం ధర్మం యుష్మాక మర్థసంయుక్తం,
న చ తత్రప్రతిష్ఠేథా నతత్ర ధర్మస్య అపరాధః.

బోధి ర్యథామి ప్రాప్తా (స్యాద్) ధర్మంచ ప్రవర్షయే దమృతగామిం,
పునరపి విశుద్ధచిత్తా ఉపేథ వరధర్మ శ్రవణాయ.

ఈ గాథల తాత్పర్య మిది :

పురుషసింహుడు, నాయకుడు అయిన బోధిసత్త్వుడు తుషితవర భవననిలయంనుంచి కిందికి — భూలోకానికి అవతరిస్తున్న సమయంలో దేవతలను సంబోధించి ఈ విధంగా అన్నాడు :



"అఖిలాపాయమార్గాలూ వదలుకోండి" అని.

సర్వశుభ కర్మలకు హేతువయిన కర్మఫల స్వరూపంవంటి దివ్యమైన ఆలోచనను మనసులో బాగా విమర్శించి చెబుతున్నాను. వినండి.

కృతజ్ఞులుగా ఉండండి. ఇక్కడ అపూర్వశుభసంచయం అనుభవించి. చెడుగు, దుఃఖం, వేదన గల అపాయాలలో పడకండి.

గౌరవంతో నా సమీపంనుంచి విన్న ధర్మం స్వీకరించండి. తప్పక అనంతమైన సుఖాలు పొందండి.

అంతా అనిత్యం. సర్వవాంఛలు ధ్రువమయినవి కావు. కల్పాలు శాశ్వతమయినవి కావు. మాయామరీచికా సదృశాలు. విద్యుత్తులాగాను, నురగలాగాను చపలమయినవి.

ఉప్పునీరు ఎంత తాగినా దప్పితీరనట్టు కామసుఖాలు, భోగాలు ఎంత అనుభవించినా ఆశ తీరదు. రజోరహితులు, ప్రజ్ఞావంతులు, లోకోత్తరులు అయిన ఆర్యులే తృప్తిపొందగలుగుతారు.

తురంగాలవలె పరుగెత్తుతున్న కల్పాలుగాని, సంగీతిగాని, అప్సరలతో సహవాసముగాని, మరొకటిగాని — అన్నీ మరొకచోటికి వెళ్లుతున్న వాటివలె చంచలమైనవి. కామంకూడా అలాటిదే.

ఈ సంసారంలో మిత్రుడుగాని, జ్ఞాతిగాని, పరివారాలుగాని, సహాయపడేవారు గారు. వెనుక జన్మలో చేసినకర్మ మన పుణ్యంతో మనవెంట అంటి వస్తుంది.

అందువల్ల సమాహిత మనస్సుతో, సంపూర్ణహృదయంతో, పరస్పరం మైత్రీహృదయంతో హితచిత్తంతో ధర్మం ఆచరించండి. ఉత్తమ కర్మలు చేసేవారు పాపసంతాపం పొందరు.

శ్రుతశీలదాన నిరతులై క్షాంతి అనే సౌరభంతో బుద్ధుని, ధర్మాన్ని, సంఘాన్ని స్మరించండి. ఈ విధంగానే అప్రమాదాన్ని — కుశలాన్ని కూడా స్మరించండి.

దుఃఖాన్ని, అనిత్యాన్ని, అనాత్మను గ్రహించండి. ఈ ధర్మాలు యోనిసాలు, అనధికారులయిన జడబుద్ధులు హేతుప్రత్యయసహితులుగా

ఉంటారు. నాలో కనిపించే కొద్దిపాటి బుద్ధి (మాహాత్మ్యం), ప్రతిభ, జ్ఞానగుణత సర్వశుభ కర్మలకు మూలమైన శీలంతోను, శ్రుతంతోను అప్రమాదంతోను కలిగినవే.

మీరు శీలంతో, శ్రుతంతో, అప్రమాదంతో దాన దమ సంయమాలతో నానుంచి శిక్షణ పొందండి. అప్పుడు సత్త్వార్థ, హితార్థ, మిత్రార్థాలు సమకూరుతాయి.

కుశల ధర్మాలు వాక్యరుతరవాలతో— పెద్దపెద్ద మాటలతో— సంపాదించడం సాధ్యంకాదు. సమ్యక్ జ్ఞానం సంపాదించడం ఆరంభించండి ఆడినమాటప్రకారం నడుచుకోండి.

ఇతరులు చేస్తారని ఎదురుచూడకండి. సదా స్వప్రయత్నంతో కృషిచేయండి. ఎవ్వరూ దేనినీ మనకోసం చేసి యివ్వరు. ఏమీ చేయక ఏదీ సిద్ధించదు. పూర్వం సంసారంలో అనుభవించిన దుఃఖాన్ని స్మరించుకోండి. మిథ్యానియమాల మూలంగా నిర్వృతి గాని, విరాగంగాని ఏర్పడదు.

కనుక అనురూపదేశ నివాసంవంటి, మిత్రునివంటి శ్రేష్ఠమైన ధర్మశ్రవణం సంపాదించి రాగాదికేశాలను తొలగించుకోండి.

మానమదదర్ప విహీనులై, ఎల్లప్పుడూ ఋజుస్వభావంతో, చురుకుతనంతో— ప్రవర్తిస్తూ శఠస్వభావం వీడి నిర్వాణగతిపరాయణులై మహాయానమార్గంలో ప్రవర్తించండి.

మోహకలుషాంధకార మంతటినీ ప్రజ్ఞాప్రదీపంతో పటాపంచలు చేసి, జ్ఞానవజ్రంతో దీర్ఘ ద్వేషాది దోషజాలం ఖండించండి.

అర్థసంయుక్తమైన ధర్మాన్ని మీకు ఎంతో విస్తృతంగా చెబుతాను. మీరు - ఆ ధర్మంతో నిలవకపోతే - దానిని అనుష్ఠించకపోతే - అది ధర్మం అపరాధం కాదు.

బోధి కలిగి, అమృతత్వదాయకమైన ధర్మాన్ని వర్షిస్తుంది. అలాటి శ్రేష్ఠమైన ధర్మాన్ని విశుద్ధచిత్తంతో వినడానికి రండి.''

ఇది శ్రీ లలిత విస్తర మహాపురాణంలో ధర్మాలోకముఖ పరివర్తమనే చతుర్థాధ్యాయం.

# 5. ప్రచల పరివర్తం

భిక్షువులారా, బోధిసత్త్వుడు ఈ విధంగా ఆ గొప్ప దేవపరిషత్తుకు ధర్మయుతమైన కథతో కనువిప్పు కలిగించి, ప్రోత్సహించి, ఆనందపరచినాడు. తర్వాత ఆ మంగళకరమయిన దేవపరిషత్తుతో ''ఓ మార్షులారా, నేను జంబూద్వీపానికి వెళ్లుతున్నాను. నేను పూర్వం బోధిసత్త్వచర్యను ఆచరిస్తున్నప్పుడు దానం, ప్రియవాదిత, అర్థక్రియ, సమానార్థత అనే నాలుగు సంగ్రహవస్తువులను ప్రాణులకు ఉపదేశించాను. నేను ఇప్పుడు అనుత్తర సమ్యక్సంబోధిలో అభిసంబుద్ధి కలిగించకపోతే ఉచితం కాదు. కృతజ్ఞత కూడా కాదు. కనుక నేను అక్కడికి వెళ్లుతున్నాను'' అని అన్నాడు.

బోధిసత్త్వుడు ఆ విధంగా అనగానే తుషిత కాయికులయిన దేవపుత్రులు ఏడుస్తూ, ఆ బోధిసత్త్వుని పాదాలు పట్టుకుని ''ఓ సత్పురుషుడా, నీవు లేకపోతే ఈ తుషితభవనం ప్రకాశించదు'' అని విన్నవించారు. అప్పుడు ఈ బోధసత్త్వుడు ఆ గొప్ప దేవపరిషత్తుతో ''ఇదిగో ఈ మైత్రేయబోధిసత్త్వుడు మీకు ధర్మం ఉపదేశిస్తాడు'' అని అంటూ, తన శిరస్సుమీది పట్టముకుటం తీసి మైత్రేయ బోధిసత్త్వుని శిరస్సుపై ప్రతిష్ఠిస్తూ ఇలా అన్నాడు: ''ఓ సత్పురుషుడా, నేను లేనప్పుడు నీవు అనుత్తర సమ్యక్సంబోధిని ఉపదేశిస్తావు'' అని.

బోధిసత్త్వుడు ఈ విధంగా మైత్రేయబోధిసత్త్వుని తుషితవరభవనంలో తన స్థానంలో నియమించి, ఆ గొప్ప దేవపరిషత్తును మరల చూచి ''ఓ మార్షులారా, నేను ఎలాటిరూపంతో తల్లి గర్భంలో ప్రవేశించాలి?'' అని ప్రశ్నించాడు. మానవరూపంతోనని కొందరు మార్షులన్నారు. కొందరు శక్రరూపంతోనని, కొందరు బ్రహ్మరూపంతోనని, కొందరు మహారాజికరూపంతోనని, కొందరు వైశ్రవణరూపంతోనని, కొందరు గంధర్వరూపంతోనని, కొందరు కిన్నరరూపంతోనని, కొందరు మహో

రగరూపంతోనని, కొందరు మహేశ్వరరూపంతోనని, కొందరు చంద్రరూపంతోనని, కొందరు సూర్యరూపంతోనని, కొందరు గరుడరూపంతోనని తమకు తోచినవిధంగా అన్నారు. పూర్వం పెక్కు ఋషి జన్మలు ఎత్తినవాడు, అనుత్తరజ్ఞాన సంబోధినుంచి మళ్లనివాడు, బ్రహ్మకాయికుడు అయిన ఉగ్రతేజుడనే దేవపుత్రుడు ఇలా అన్నాడు: “బ్రాహ్మణుల మంత్రవేదశాస్త్ర పాఠాలు సహజంగా రాదగిన రూపంతో బోధిసత్త్వుడు మాతృగర్భంలో ప్రవేశించాలి. ఆ రూపం ఇంకా ఎలా వుండాలంటే, ఆరు దంతాలతో, బంగారు మాలికలతో ప్రకాశిస్తూ, ఎర్రని శిరస్సుతో అందంగా ఒప్పుతూ, స్పష్ట పరిణతరూపం గల గజశ్రేష్ఠ మహాప్రమాణంలో ఉండాలి” అని. ఉగ్రతేజుడు సూచించిన ఆ రూపం విని, మాతృగర్భంలో ప్రవేశించే బోధిసత్త్వుడు బ్రాహ్మణ వేదశాస్త్ర తత్త్వజ్ఞుడూ, ముప్ఫయిరెండు శుభలక్షణాలు గలవాడూ అయి, ఇక్కడినుంచి అవతరించనున్నాడు.

భిక్షువులారా, తుషితభవనవాసి అయిన బోధిసత్త్వుడు భూలోకంలో అవతరించే సమయంకోసం నిరీక్షిస్తుండగా, శుద్ధోదన మహారాజు నగరులో ఎనిమిది పూర్వశుభనిమిత్తాలు కనిపించాయి. ఆ ఎనిమిదీ ఏవంటే—

శుద్ధోదనుని భవనం గడ్డీ గాదం, మోడులు, ముళ్లు, గులకరాళ్లు మొదలయినవి లేక నిర్మలంగా అయినది. జలసిక్తమయినది. బాగా వూడ్చినట్టయినది. కలవరం పోయినది. గాలి, చీకటి, దుమ్ము లేక, దోమలు, ఈగలు, మిడతలు, పాములు లేక, అంతటా పూవులు చల్లినట్టు, అరచేయిలాగ సమంగాను అయినది. ఇది మొదటి పూర్వనిమిత్తం.

హిమవత్పర్వతంపై నివసించే చిత్రవిచిత్ర సుందరపక్షాలు గల పత్రగుప్త శుక శారికా కోకిల హంస క్రౌంచ మయూర చక్రవాక కుణాల కలవింక జీవంజీవాది పక్షులు మనోహరంగాను ప్రియంగాను పలుకుతూ, శుద్ధోదనమహారాజు నగరుకు వచ్చి, ఆ నగరు అరుగులమీద, చూరుల మీద, తోరణాలమీద, గవాక్షాలలోను, హర్మ్యాలమీద, కూటాగారాల మీద, ప్రాసాదాలమీద వాలి సంతోషంతో, ప్రీతితో, సౌమనస్యంతో,



తమ తమ ధ్వనులతో వీనులవిందు చేయసాగాయి. ఇది రెండవ పూర్వనిమిత్తం.

శుద్ధోదనమహారాజు ఆరామ రమణీయాలలో (రమణీయారామాలలో), రమణీయవనాలలో, రమణీయోద్యానాలలో ఆయా ఋతువులలో పుష్పించి ఫలించే నానా పుష్ప ఫలవృక్షాలు అన్నీ ఋతుభేదం పాటించకనే ఆ సమయంలో పుష్పించాయి. ఇది మూడవ పూర్వనిమిత్తం.

శుద్ధోదనమహారాజు పుష్కరిణులన్నీ జలపరిపూర్ణాలై, అనేక కోటీ నియుత శత సహస్ర దళాలున్న బండిచక్రాలంతేసి పెద్ద శతపత్రాలతో నిండాయి. ఇది నాల్గవ పూర్వనిమిత్తం.

శుద్ధోదనమహారాజు నగరులో భోజనార్థమైన నేయి, నూనె, తేనె, కండచక్కెర, చక్కెర మొదలయినవి ఎందరు ఎంతగా వాడినా కొరత ఏర్పడేది కాదు. నిండినవి నిండినట్టుగానే ఉండేవి. ఇది ఐదవ పూర్వనిమిత్తం.

శుద్ధోదనమహారాజు నగరులోని గొప్ప అంతపురంలో భేరి, మద్దెల, ఉడుక, రంధ్రవాద్యం, వీణ, వేణు, వల్లకి, తప్పెట మొదలయిన వాద్యాలు ఎవరూ వాయించకనే మనోహరంగా నదించాయి. ఇది ఆరవ పూర్వనిమిత్తం.

శుద్ధోదనమహారాజు గృహశ్రేష్ఠంలో బంగారు, వెండి, మణిముక్తావైడూర్యాలు. శంఖశిలాప్రవాళాలు, రత్నాలు మొదలయినవి ఉన్న పాత్రలు అంచులవరకు పొంగి, మూతలు తొలగి, నిండుగా విశుద్ధ కాంతులు ఈనుతూ కనిపించాయి. ఇది ఏడవ పూర్వనిమిత్తం.

శుద్ధోదనమహారాజు నగరును అంతా చంద్ర సూర్య కాంతులను కూడా మించి, దేహచిత్తాలకు అపూర్వబలం కలిగించే ఒకానొక అపూర్వ పరిశుద్ధ ప్రభ వ్యాపించి ప్రకాశవంతం చేసింది. ఇది ఎనిమిదవ పూర్వనిమిత్తం.

అప్పుడు శుద్ధోదనమహారాజు సంగీతి ప్రాసాదం (కొలువుతీర్చే ప్రాసాదం) లో సుఖోపవిష్టుడై ఉండగా, ఆయన పట్టమహిషి మాయా

దేవి స్నానంచేసి, మైపూతలు పూసుకొని భుజాలకు వివిధాభరణాలు అలంకరించుకొని, సన్నని దువ్వలువలు ధరించి, ప్రీతి ప్రమోదాలతో మనసు ముప్పిరిగొనగా, పదివేలమంది దాసీజనం వెంట రాగా, సంగీతి ప్రాసాదానికి వెళ్లి, సుఖోపవిష్టుడయిన రాజువద్దకు వచ్చి, ఆయనకు కుడి పక్కన ఉన్న రత్నఖచితమైన భద్రాసనంలో కూర్చుని, బొమముడిపాటు లేక, మందహాసంతో ఇలా పలికింది.

ఆమె పలికిన గాథల తాత్పర్యమిది.

“ఉత్తముడైన ఓ భూమిపాలా, ఇప్పుడు నిన్నొక వరం అడుగుతున్నాను. తప్పక దయచేయి. నా మనస్సుకు ప్రహర్షం కలిగించే నా అభిప్రాయం విను. విన్నతర్వాత అత్యంత సంతోషచిత్తుడివి అవుతావు. నేను మైత్రితో కూడిన మనస్సుతో అష్టాంగపోషధవ్రతం స్వీకరించి బ్రహ్మచర్యంతో ఉపవాసమున్నాను. ప్రాణిహింస వదలి, సదా శుద్ధభావంతో నాపై చూపినట్లే పరులపై ప్రేమ చూపుతున్నాను. మనస్సులోనూ తస్కరబుద్ధి మాని, మదలోభాలు వదలి, మిథ్యాకామాలు విడనాడినాను. సత్యం అనుసరిస్తూ, పిశునత్వం, పారుష్యం వదలి, అశుభాలయిన సంధిప్రలాపాలు మానివేశాను. ఎవరికీ ద్రోహచింత తలపెట్టక మోహమదాలు వదలి, సర్వాభిఖ్యలూ (అభిఖ్య - పరద్రవ్యాభిలాషలూ) త్యజించి, స్వధనంతో సంతుష్టిపడుతూ, సమ్యక్‌దృష్టితో ప్రయత్నాలు చేస్తూ, కపటం దగ్గరకు రానీయక, అసూయ మాని ఈ దశకుశల కర్మలూ ఆచరిస్తున్నాను. కనుక ఓ నరేంద్రా, నాపై కామాభిలాష వద్దు. శీలవ్రతాభిరతుడవై, సంయమంగల నీకు శీలవ్రత ఖండన రూపమయిన అపుణ్యం కలుగకుండుగాక! దీర్ఘ రాత్రులకాలం నా శీలవ్రతోపవాసానికి అనుమోదించు. చెలికత్తెలతో సహా ప్రాసాదహర్మ్యశిఖరంమీది చంద్రశాలలో త్వరలో ప్రవేశించి, పరిమళించే మృదు పుష్పశయ్యపై విశ్రమించి సంతోషించాలని ఆశపడుతున్నాను. కాంచుకీయులుగాని, బాలకులుగాని, మరే సాధారణ పరిజనంగాని, నాముందు ఉండరాదు. మరొక మనోహర రూపం చూడను. ఇతరుల మధురశబ్దగంధాలు వినను; మూచూడను. కారాగారాలలో ఉన్నవారి నందరినీ వదలిపెట్టి, వారికి ద్రవ్యాంబరాలిచ్చి వారిని ధనవంతులుగా చేయి. జగత్సుఖంకోసం ఏడు రాత్రులపాటు



వస్త్రాన్నపానాలు, రథాలు, గుర్రాలు, దానం చేయి. ఇది నా వ్రతనియమం. ఈ నగరంలో ఎక్కడా వివాదాలు, కలహాలు, రోషవాక్యాలు వినబడరాదు. పురుషులు, పిన్నలు, పెద్దలు, దేవతలు అన్యోన్యమైత్రీ మనస్సుతో నందనవనాలలో విహరించనీ. రాజభటులు ఎవరినీ దండించకుండా ఉండనీ. అన్యాయశిక్ష విధించడంగాని, పీడించడంగాని, బెదిరించడంగాని ఉండకుండా ఉండుగాక! ఓ దేవ, జనసముదాయాన్నంతా ఒకేవిధంగా పుత్రులవలె ప్రసన్న మనస్సుతో, హితమైత్రీచిత్తంతో చూడు.”

మహాదేవి మహాసంతోషంతో చెప్పిన మాటలు విని శుద్ధోదనమహారాజు “దేవీ, నీవు కోరినదంతా జరుగనీ. నీవు మనసులో ఆలోచించిన ప్రకారంగానే జరుగనీ. నీవు కోరిన వరం ఇస్తున్నాను” అన్నాడు.

తర్వాత రాజు తన సభాసదులకు యీ విషయాలు తెలిపి, ప్రాసాదశ్రేష్ఠం శిఖరంపై మాయాదేవి విహారానికి ఏర్పాట్లు చేయవలసిందని ఉత్తరువు చేశాడు. ప్రాసాదశిఖరంపై పూవుల సెజ్జలు ఏర్పాటు చేశాడు. శ్రేష్ఠమైన ధూపాలతో పరిమళింపజేశాడు. ఛత్రపతాకా తాళవృంతాలతో అలంకరింపజేశాడు. దేవికి భయం లేకుండా ఉండడంకోసం విచిత్ర కవచాలు, నారాచం, శూలం, ఖడ్గం, శక్తి మున్నగు ఆయుధాలతో సన్నద్ధులఅయిన ముప్ఫయివేలమంది రణశుండాలులైన భటులను ఆ ప్రాసాదానికి కావలి పెట్టించాడు.

మాయాదేవి స్నానం ఆచరించి, సుగంధాంగరాగాలు పూసుకొని, శ్రేష్ఠ వస్త్రభూషణాలు ధరించి, పరిజనం వెంట రాగా, వేలమంది చెలికత్తెలు మనోజ్ఞ మంగళగీత ఘోషలు చేస్తుండగా దేవకన్యలాగ వెలుగుతూ ఆ ప్రాసాదాన్ని అధిరోహించి విశ్రమించింది.

దివ్యమైనవి, అమూల్యమయినవి అయిన చిత్రవిచిత్ర రత్నాలతో చెక్కిన కోళ్లతో వివిధ మనోహర పుష్పశయ్యతో ఒప్పారే మంచంపై విశ్రమించగా మణిచూడామణ్యాద్యాభరణాలు, సడలినప్పుడు ఆమె మిశ్రకావనంలో విహరించే దేవకన్యలాగ ఉన్నది.

భిక్షువులారా, తర్వాత చతుర్మహారాజికులనే దేవతలు, దేవరాజయిన ఇంద్రుడు, సుయాముడు, సంతుషితుడు, పరనిర్మితవశవర్తి, సార్థవాహుడు మొదలయిన దేవపుత్రులు, మారపుత్రబ్రహ్మ, సహాపతి, బ్రహ్మోత్తర పురోహితుడు, సుబ్రహ్మపురోహితుడు, ప్రభావ్యూహాభాస్వరుడు, మహేశ్వరుడు మొదలయిన శుద్ధావాసకాయిక దేవపుత్రులు, నిష్ఠాగతుడు, అకనిష్ఠుడు మొదలయిన అనేక శతసహస్ర దేవపుత్రులు అక్కడ సమావేశమయి, పరస్పరం ఇలా అనుకున్నారు : "మార్షులారా, మనం బోధిసత్త్వుణ్ని ఒంటరిగా భూలోకానికి పంపడమనేది యుక్తము కాదు. కృతజ్ఞతా కాదు. ఆయన మాతృగర్భంలో ప్రవేశించడం మొదలుకొని, గర్భావస్థితి, జననం, యౌవనభూమి, దారకక్రీడ, అంతఃపుర నాటక సందర్శనం, అభినిష్క్రమణం, దుష్కరచర్య, బోధిమండలోపసంక్రమణం, మారధర్షణం, బోధి, అభిసంబోధనం, ధర్మచక్ర ప్రవర్తనం, మహాపరినిర్వాణం వరకు హితచిత్తంతో, స్నిగ్ధచిత్తంతో, ప్రియచిత్తంతో, మైత్రీచిత్తంతో, సౌమ్యచిత్తంతో ఆయనను సతతం అనుసరించడానికి మనలో ఎవరు ఉత్సాహపడుతున్నారు?" అని. అప్పుడు వారిలో వారు ఈ గాథలను పలికారు.

"కో వోత్సహేత వరరూపధరం అనుబంధయితుం సతతం ప్రీతమనాః,
కః పుణ్యతేజ యశసా వచసా స్వయమాత్మనేచ్ఛతి వివర్ధయితుం.

యస్యేప్సితం త్రిదశదేవపురే దివ్యైస్సుఖైర్హి రమితుం సతతం,
పరమాప్సరోభి రిహ కామగుణైః అనుబంధతాం విమలచంద్రముఖం.

తథమిశ్రకే వనవరే రుచిరే దివ్యాకరే రమితు దేవపురే,
పుష్పోత్కరే కనకచూర్ణనిభే అనుబంధతాం విమలతేజధరం.

యస్యేప్సితం రమితు చిత్రరథే తథ నందనే సురవధూసహితః,
మాందారవైః కుసుమ పత్రచితే అనుబంధతామిము మహాపురుషం.

యామాధిపత్య మథవా తుషితైః అథచాపి ప్రార్థయతి చేశ్వరతాం,
పూజా రహో భవితు సర్వజగే అనుబంధతామిము అనన్యయశం.



యో ఇచ్ఛతి నిర్మితపురే రుచిరే వశవర్తి దేవభవనే రమితుం,
మనసైవ సర్వ మనుభోక్తి క్రియా అనుబంధతామిము గుణాద్యధరం.

సారేశ్వరో న చ ప్రదుష్టమనా సర్వవిధైశ్వర్యవారగతః,
కామేశ్వరో వసిత పారగతో గచ్ఛత్వసౌ హితకరేణ సహ.

తథ కామధాతు సమతిక్రమితుం మతి యస్య బ్రహ్మపుర మావసితుం,
చతుర ప్రమాణ ప్రభ తేజధరః సోద్యానుబద్ధతు మహాపురుషం.

అథవాపి యస్య మనుజేషు మతి వరచక్రవర్తి విషయే విపులే,
రత్నాకర మభయ సౌఖ్యదదం అనుబంధతాం విపుల పుణ్యధరం.

పృథివీశ్వర స్తథపి శ్రేష్ఠిసుతో ఆఢ్యో మహాధను మహానిచయః,
పరివారవాన్నిహతశత్రుగణో గచ్ఛత్వసౌ హితకరేణసహ.

రూపం చ భోగమపి చేశ్వరతా కీర్తిర్యశశ్చ బలతా గుణవతీ,
ఆదేయ వాక్యభవిగ్రాహ్యరుతో బ్రహ్మేశ్వరం సముపయాతు విదుం,

యే దివ్యకామ తథ మానుషకాం యా ఇచ్ఛతీ త్రిభావి సర్వసుఖం,
ధ్యానే సుఖం చ ప్రవివేక సుఖం ధర్మేశ్వరం సమనుబంధయతాం,

రాగ ప్రహాణు తథ దోషమపీ యో ఇచ్ఛతే తథ వివేశజహాం,
శాంత ప్రశాంత ఉపశాంతమనా సో దాంతచిత్త మనుయాతు లఘుం.

శైక్షా అశైక్ష తథ ప్రత్యేకజినా సర్వజ్ఞ జ్ఞాన మనుప్రాపురితుం,
దశభి ర్బలై ర్నదితు సింహ ఇవ గుణసాగరం సమనుయాతు విదుం.

పిధితుం అపాయపథ యేషమతిః వివృతుం చ సద్గతిపథం హ్యామృతం,
అష్టాంగ మార్గగమనేన గతిం అనుబంధతాం గతిపథాంతకరం.

యో ఇచ్ఛతే సుగత పూజయితుం ధర్మం చ తేషు శ్రుతికారుణికే,
ప్రాప్తో గుణా నపిచ సంఘగతాన్ గుణసాగరం సమనుయాతు ఇమం.

జాతి జరామరణ దుఃఖక్షయం సంసారబంధన విమోక్షయితుం,
చరితుం విశుద్ధ గమనాంతసమం సో శుద్ధసత్త్వ మనుబంధయతాం.

ఇష్టో మనాపప్రియయు సర్వజగే వరలక్షణో...గుణోపచితః,
ఆత్మాపరం చ తథ మోచయితుం ప్రియదర్శనం సమపయాతు విదుం.

శీలం సమాధి తథ ప్రజ్ఞమయీ గంభీర దుర్దర్శ దురోపగమం,
యో ఇచ్ఛతే విదు విముక్తి లభే సో వైద్యరాజ మనుయాతు లఘుం.

ఏతే చ అన్యగుణ నైకవిధా ఉపపత్తి సౌఖ్య తథ నిర్వృతయే,
సర్వైర్గుణేభి ప్రతిపూర్ణ సిద్ధ్యే సిద్ధవ్రతం సమనుయాతు విదుం.

వీటి తాత్పర్య మిది :—

"శ్రేష్ఠమయిన రూపంతో భూలోకంలో అవతరించే బోధిసత్త్వుని ప్రీతమనస్సుతో సతతం అనుసరించడానికి ఎవరు ఉత్సాహపడుతున్నారో చెప్పండి. తన పుణ్య తేజస్సును కీర్తితో అభివృద్ధి చేసుకొనడానికి మనో వాక్కాయాత్మలతో వృద్ధి పొందించుకొనగోరేవా రెవరు? త్రిదశ దేవ పురంలో పరమాప్సరలతో కామరూప గుణాలతో దివ్యసుఖాలు అనుభ వించ దలచినవా రెవ్వరు? అలాటివారు బోధిసత్త్వుడనే విమల చంద్ర ముఖుణ్ణి అనుసరించండి. మిశ్రకమనే దేవపురంలో బంగారుపాడితో మిల మిలలాడే పుష్పసమూహంతో అందాలుచిందే మహోద్యానంలో విహరిం చదలచినవారు విమల తేజోవిరాజితుడైన బోధిసత్త్వుని అనుసరించండి. మందార కుసుమాల రేకులు రాలి పూలసెజ్జల భ్రాంతిని కలిగించే చిత్రరథం లోను, నందనవనంలోను దేవకాంతలతోపాటు విహరించడం ఇష్టమయిన వారు ఈ మహాపురుషుణ్ణి అనుసరించండి. లోకపాలకత్వాన్నిగాని, తుషి తలోకాధివాసాన్ని గాని, ఈశ్వరత్వంగాని, సమస్తజగత్తులోను పూజలు గాని పొందగోరేవారు అనంతకీర్తిగల ఈ మహామహుణ్ని అనుసరించండి. వసపర్తి దేవభవనంలో సుందరమయిన నిర్మితపురంలో తలచుకొనడం మాత్రంతోనే సకలక్రియలూ అనుభవించదలచినవారు శ్రేష్ఠగుణాలు గల ఈతనిని అనుసరించండి. సారేశ్వరుడయి సర్వవిధ సంపదల పారగతుడు గాను, కామేశ్వరుడై వసితపారగుడుగాను కాదలచినవాడు దుష్టమన స్సును మానుకొని ఈ హితకరునితోపాటు భూలోకానికి వెళ్లనీ. కామ ధాతువును (కామాన్ని) అతిక్రమించి, బ్రహ్మపురంలో వసించదలచిన



వారు ప్రమాణచతుష్టయ ప్రభావంతుడయిన ఈ మహామహాపురుషుణ్ణి ఇప్పుడు అనుసరించండి. మనుజులలో విపుల చక్రవర్తులు గల దేశాలలో ఉండదలచినవారు రత్నాకరంవంటివాడు, అభయ సౌఖ్యాలు ఇచ్చేవాడు అయిన ఈ విపుల పుణ్యావంతుని అనుసరించండి. పృథ్వీశ్వరుడు, శ్రేష్ఠి సుతుడు, ఆఢ్యుడు, కోటికి పడగెత్తినవాడు, మహాధనసంచయం గల వాడు, పరివారసహితులు, శత్రుభీకరులు అయినవారు ఈ హితకరునితో పాటు వెళ్లండి. రూపం, భోగం, ఈశ్వరత్వం, కీర్తి, యశస్సు, బలం, గుణం కోరేవారు, సంసారంలో ఆదేయ వాక్యాలు గ్రహించదలచిన వారు వేత్త అయిన ఈ బ్రహ్మేశ్వరుణ్ణి ఆశ్రయించండి. దివ్యకామనలు గాని, మనుష్య కామనలుగాని కలవారు, మూడు లోకాలలోను సర్వ సుఖాలు కోరేవారు, ధ్యానసుఖం, ప్రవివేక సుఖం కోరేవారు ఈ ధర్మే శ్వరుణ్ణి అనుసరించండి. రాగాన్ని, ఇతర దోషాలను విడువగోరేవారు, జ్ఞానకాంక్షులు, శాంత ప్రశాంత ఉపశాంత మనస్సుతో ఈ దాంతచిత్తుని అనుసరించండి. శైక్షులు, అశైక్షులు, ప్రత్యేక జనులు సర్వజ్ఞ జ్ఞానం పొందదలిస్తే, దశబలాలతో సింహంలాగ గర్జించదలిస్తే ఈ వేత్త అయిన గుణసాగరుణ్ణి అనుసరించండి. అపాయమార్గంనుంచి తొలగే బుద్ధిగలవారు, అమృతమయిన సద్గతిని తెలుసుకొనదలచినవారు సంసార మార్గాన్ని అంతంచేసే ఈ బోధిసత్త్వుణ్ణి అష్టాంగమార్గ గమనంతో వెన్నాడండి. సుగతుని పూజించదలచినవారు, శ్రుతి కారుణికమయిన ధర్మాన్ని అనుసరించదలచినవారు, సంఘగత గుణాలను పొందగోరే వారు ఈ గుణసాగరుణ్ణి అనుసరించండి. జన్మజరామరణ దుఃఖక్షయమూ, సంసారబంధ విమోచనమూ కోరేవారు, విశుద్ధమార్గంలో ధర్మం ఆచ రించదలచినవారు ఈ శుద్ధసత్త్వుని అనుసరించండి. సర్వజగత్తులకు ప్రియుడు, మనోహరుడు, వరలక్షణ లక్షితుడు, శ్రేష్ఠ గుణోపేతుడు, తనను, పెరవారిని సంసారబంధంనుంచి విముక్తి పొందించగలవాడు కాగోరితే ప్రియదర్శనుడైన ఈ వేత్తను ఆశ్రయించండి. శీలం, సమాధి, ప్రజ్ఞ, దుర్దర్శనమూ, దురుపగమమూ అయిన గంభీర సత్యం— వీటిని అభిలషించేవారు విముక్తిలాభం కోసం ఈ వైద్యరాజును అనుసరించండి. ఈ గుణాలు, అనేకవిధాలయిన ఇతరగుణాలు పొంది సౌఖ్యనిర్వృతులను

పొందగోరేవారు, సమస్తగుణాల పరిపూర్ణసిద్ధి కోరేవారు సిద్ధవ్రతుడయిన బోధిసత్త్వుని అనుసరించండి."

ఈ మాటలు విని చతుర్మహారాజికులనే దేవతలు ఎనభైనాలుగువేల మంది, త్రయత్రింశులనేవారు నూరువేలమంది, యాములనేవారు నూరు వేలమంది, తుషితులనేవారు నూరువేలమంది, నూరువేలమంది నిర్మాణరతులు, పరినిర్మితవశవర్తులు నూరువేలమంది, అరవైవేలమంది పూర్వ శుభ కర్మ నిర్వాతులయిన మారకాయికులు, బ్రహ్మకాయికులు అరవైఎనిమిదివేల మంది, యావద కనిష్ఠులనే దేవతలు నూరువేలమంది, ఆయనను సమీపించారు. సూర్యుడు, పూర్వ రక్షిణ పశ్చిమోత్తర దిక్కులనుంచి అనేక సహస్ర దేవతలు సమీపించారు. వారిలో మహోదారు లయివ దేవపుత్రులు, ఆ గొప్ప దేవపరిషత్తును చూచి గాథలతో ఇలా అన్నారు ఆ గాథల భావ మిది:

"అహో! అమరేశ్వరాది దేవతలారా! మా మాట వినండి. ఎలాంటి తత్త్వం గలవా రయినప్పటికీ, ఈ విషయములో బుద్ధిని దృఢతరం చేసుకుని, అర్థకామరతి వదలి, ధ్యానసుఖం అలవరచుకుని, ఈ ఉత్తమ శుద్ధసత్త్వుణ్ణి అనుకరిద్దాము. లోకాంతిపాదు డయినప్పటికీ, గర్భస్థితు డయిన ఈ అతిశయపూజార్హుడైన మహాత్ముణ్ణి పూజిద్దాము. ఈయన అవతారంవల్ల మన మనస్సు పరిశుద్ధమయినది. మన పుణ్యాలతో రక్షించుకోదగిన ఈ ఋషిని రక్షించుకుందాము. తూర్యాది సువాద్యాలతో సంగీతంతో గుణసాగరు డయిన బోధిసత్త్వుని గుణగణాలను కొనియాడి దేవతలకు, మనుష్యులకు సంతోషం కలిగిద్దాము. దానిని విని ప్రతిజీవిమనస్సులోను శ్రేష్ఠమయిన బోధిజ్ఞానం కలుగనీ. శుద్ధోదనమహారాజు నగరును పుష్పవర్షాలతో నింపుదాము. కాలాగురు మొదలైన ఉత్తమ ధూపాలజో సుగంధితం చేద్దాము. ఆ సువాసనను ఆఘ్రాణించి దేవతలు, మానవులు జ్వరాలు వీడి, రోగముక్తులై, సుఖవంతులు, సంతోషచిత్తులు అవుతారు. పూర్వ శుభకర్మలవల్ల ఉద్భవించిన ఈ బోధిసత్త్వుని పూజలకోసం మందార కుసుమాలు, పారిజాతాలు మొదలైన ప్రకాశించే పుష్పాలతో భూమినే కపిశవర్ణంగా (చిత్రవిచిత్రవర్ణంగా) చేద్దాము. గర్భంలో ఉన్న



ప్పుడు త్రిమలాలు అంటక, ఉద్భవించిన తరువాత జరామరణాలను అంతమొందించేవానిని ప్రసన్న మనస్సుతో అనుసరిద్దాము. ఈ మహామతిధరుని పూజిద్దాము. ఇదే మన నిశ్చయం. ఈయన పుట్టగానే ఏడు అడుగులు వేయటం సురులు, మనుష్యులు చూచే భాగ్యం పొందుతారు. ఈయనను ఇరువైపుల శక్రుడు, బ్రహ్మ చేతులు పట్టుకుని, గంధోదకాలతో అభిషేకిస్తారు. ఈయన ఎంతకాలం లోకాన్ని అనువర్తిస్తూ వుంటాడో, కామక్లేశాలు పోగొట్టుకుని ఎంతవరకు అంతఃపురంలో ఉంటాడో, రాజ్యమంతా వదలి ఎంతవరకు నిష్క్రమిస్తాడో, అంతవరకు ప్రసన్నమనస్సులతో అనుసరిద్దాము. ఈ సుగతుడు మహిమండి తృణం స్వీకరించి, బోధిని స్పృశించి, మారుణ్ణి జయించి బ్రాహ్మణులతోకూడా ధర్మచక్రం వర్తింపచేసేవరకు విపులపూజను చేద్దాము. బుద్ధకార్యం ముగిసి, త్రిసహస్రకోటినయుత సంఖ్యాక మయిన జీవరాశి అమృతోపదేశం పొందిన పిదప, ఈ మహర్షి ప్రీతభావుడై నిర్వాణమార్గం పొందేవరకు వదలవద్దు."

తర్వాత, భిక్షువులారా, బోధిసత్త్వుని రూప కాయ పరినిష్పత్తిని (మానవ రూపధారణం) చూచి, కామధాతుచరులయిన దేవకన్యలు ఈ ఉత్తమోత్తముడయిన శుద్ధసత్త్వుని గర్భంలో ధరించే కన్య ఏలాంటిదై వుంటుంది?—అని ఆలోచించారు. పిదప, వారు కుతూహలంతో ఆమెను చూడదలచి, శ్రేష్ఠాతిశ్రేష్ఠమయిన పుష్పధూప గంధమాల్య విలేపన చూర్ణ వస్త్రాలు గ్రహించి, మనస్సు కోరిన దివ్యభావం పొంది, పుణ్యపరిపాకంవల్ల ఆ క్షణంలోనే అమరపురంనుంచి అంతర్ధానం చెంది, ఉద్యానశతసహస్ర శోభితమయిన శుద్ధోదనుని రాజధాని కపిలవస్తులో దేవేంద్రుని నగరువలె ప్రకాశించే ధృతరాష్ట్రమనే మహాప్రాసాదం చేరి, చేతులు పదిగోళ్లూ కలిసే విధంగా అంజలి ఘటించి, తమ దివ్యవస్త్రాలు జీరాడుతుండగా, శుభవిమల దేహకాంతులు కొత్త అందాలు తెస్తూవుండగా, భుజాలకు పెట్టుకున్న దివ్యాభరణాలు భుజాలను చుట్టివేశాయా అన్నట్లు కనుపించగా, ఎవరికీ కనుపించక, గగనతలంనుండే ప్రక్కమీదపరుండివున్న మాయాదేవిని కుడిచేతివేలితో చూపుతూ, పరస్పరం ఈ విధంగా గాథలలో అనుకున్నారు. ఆ గాథల తాత్పర్య మిది:

“మనం అప్సరసల రూపమే పరమ మనోహర రూపమని అనుకుంటున్నాము. ఈ నరపతివధువును చూస్తూ వుంటే మనభావం తప్పని తోస్తున్నది. ఈమె రతీ పమాన. గుణాన్విత. ఈమె పుణ్యలభావం పొందిన పరమ శ్రేష్ఠుని తల్లి. మణి రత్నాలకు ఉత్తమభాజనం యోగ్యమయినట్లు దేవదేవుని గర్భంలో ధరించడానికి ఈమె అర్హురాలు. కర చరణతలాలు మొదలు శిఖ పర్యంతం అన్నిఅంగాలూ దివ్యమనోహరమయినవి. కన్నులతీర చూడండి! ఎంతచూచినా తనివితీరదు. ఎంత చూచినా మనస్సు మరీ మరీ సంతృప్తిచెందుతుంది. ఈమె వదనం ఆకాశంలో వెలుగుతున్న చంద్రునివలె విరాజిల్లుతున్నది. దేహంనుంచి రవి తేజస్సువంటి తేజస్సు, ఆత్మభావంనుంచి చంద్రదీప్తివంటి కాంతి వెలుగుతున్నాయి. సుజాత జాతరూప అయిన (మంచివంశం, రూపం కలిగిన) ఈ దేవిశరీరం బంగారువలె ప్రకాశిస్తున్నది. ఈమె కుంతలాలు భ్రమరవర సదృశాలయి, మృదువులై, కుసుమగంధం విరియింపజేస్తున్నాయి. ఈమె నేత్రాలు కమలదళసదృశాలు. ఈ తెల్లటి పండ్లు ఆకాశంలోని నక్షత్రాలులాగా ప్రకాశిస్తున్నాయి. నడుము వింటివడుమువలె సన్ననిది. పార్శ్వభాగాలు విశాలాలై, కండపట్టి సంధిబంధాలు తెలియక ఉన్నాయి. ఈమె తొడలు ఏనుగుతొండంలాగున, మోకాళ్లు పిక్కలు పొందికగా, క్రమంగా పుట్టుకొనివచ్చినట్లు వున్నాయి. కరతలాలు, చరణతలాలు ఎగుడు, దిగుడు లేక సమానంగా ఉండి, ఎర్రని కాంతులు ఈనుతూ ఉన్నాయి. ఈ లక్షణా లన్నింటినీబట్టి ఈమె దేవకన్యే కాని మరొకతె కాదు.

ఈ విధంగా వారు మాయాదేవిని బహువిధాల వర్ణించి, ఆమెపైని పూవులు చల్లి ప్రదక్షిణంచేసి, తిరిగి దేవపురానికి వెళ్ళిపోయారు.

తర్వాత చతురులైన దిక్పాలకులు, ఇంద్రుడు, సుయాముడు, నిమితుడు, దేవగణాలు, కుంభాండాదులైన రాక్షసులు, అసురులు, కిన్నరులు, నాగులు ఇలా అన్నారు:

“ఈ పురుషోత్తమునికి ముందు నడవండి. ఈ మహాత్మునికి రక్షకులుగా ఉండండి. ఎటువంటి తప్పునూ మనస్సులో కూడా తలచకండి.



మనుష్యులకు ఎటువంటి కష్టమూ కలిగించవద్దు. మాయాదేవి నివసిస్తూవున్న గృహానికి మీ రందరున్నూ పారిషద్యులతోపాటు వెళ్ళి, విల్లమ్ములు, శక్తి, ఖడ్గము, మొదలైన ఆయుధాలు ధరించి, ఆకాశతలంలో నిలిచి నిరీక్షిస్తూ వుండండి. ఓ దేవపుత్రులారా! మీరు సంతుష్టచిత్తులై ఆయన తుషిత దేవలోకంనుంచి చ్యుతుడయే సమయాన్ని తెలుసుకుని, అప్పుడు సమీపానికి విలేపనాదులను తీసుకువెళ్ళి చేతులు జోడించి, నమస్కరిస్తూ, ‘ఓ! వాదిసింహా! శుద్ధసత్త్వుడ వయిన మహాత్మా! ఇది నీకు భూలోకానికి అవతరించవలసిన సమయం. ఓ నరేంద్రుడా! భూలోకానికి అవతరించు. అవతరించు. కరుణ చూపు. సమస్తలోకాలను జయించి, ధర్మంకోసమూ, దానంకోసమూ అవతరించు’ అని ప్రార్థించండి!”

భిక్షువులారా, అనంతరం బోధిసత్త్వుని భూలోకాగమన సమయంలో తూర్పుదిక్కున తుషితభవనంలో నివసించే నూరువేలమంది ఏకజాతి ప్రతిబద్ధులయిన బోధిసత్త్వు లందరూ ఇతనిని పూజించడం కోసం, ఇతడు ఉన్నచోటికి వచ్చారు. ఈ విధంగానే పదిదిక్కులందు ఉన్న వారూ వచ్చారు. ఒక్కొక్క దిక్కున ఉన్న నూరువేలమంది తుషిత వర భవన వాసులయిన బోధిసత్త్వులందరూ ఇతనిని పూజించడంకోసం వచ్చారు. ఈ రీతిగానే చాతుర్మహారాజకాయికులైన దేవతలనుండి ఎనభైనాలుగు లక్షల అప్సరసలూ, ఈ విధంగానే త్రయత్రింశు లనే దేవతలనుంచి యాములు, తుషితులు, నిర్మాణరతులు, పరినిర్మితవశవర్తులు అనే దేవతలనుంచి చెరి ఎనభైనాలుగు లక్షలమంది అప్సరసలు నానా విధ గీత వాద్యాలతోపాటు బోధిసత్త్వుణ్ణి పూజించడానికి అతని సన్నిధికి వచ్చారు.

అప్పుడు ఆ మహా కూటాగారంలో సర్వ దేవతలూ, నాగులూ సేవిస్తూ వుండగా, సర్వపుణ్యాలుసాకారంగా మలుచుకుని వచ్చినట్లున్న శ్రీగర్భ సింహాసనంలో అధిష్ఠించినవాడయిన ఆ బోధిసత్త్వుడు ఆ బోధిసత్త్వులు, కోటినియుత శత సహస్ర యక్షనాగులు పరివేష్టించి, మరి కొందరు ముందున నడువగా, తుషితవరభవనంనుంచి బయలుదేరారు. బయలుదేరి నడుస్తున్న బోధిసత్త్వుని శరీరంనుంచి గొప్ప ప్రభ (కాంతి)

వెలువడింది. అది త్రిసహస్ర మహాసహస్రమూ, మహా విపుల విస్తీర్ణమూ అయిన లోకధాతువును (పంచ భూతాత్మకమైన లోకాన్ని) మహోదారమైన దివ్యకాంతిపుంజంతో కప్పి ధవళాతిధవళం చేసింది. లోకంలో మరుగున ఉన్న పాపాలు, సూక్ష్మాతిసూక్ష్మములయిన పాపాలు, అంధకారాలు, గాడాంధకారాలు, సూర్యచంద్రులు, మహర్ధులనేవారు, మహేశాఖ్యులనే మహానుభావులు మొదలైనవారినందరినీ ఈ తేజస్సు ధవళాతిధవళం చేసింది. అన్నిటి కాంతీ ఆ కాంతిలో, ఆ వర్ణంలో వర్ణం, ఆ తేజస్సులో తేజస్సు కలిసిపోయి స్వప్రకాశాన్ని, తేజస్సును కోల్పోయాయి. ఆ కాంతిలో పడిన ప్రాణులు తమ అవయవాలు చాచినా చూడలేకపోయాయి. అందులో అప్పుడు ఉదారమయిన మహాకాంతి ఉదయించింది. ఆ కాంతిలో అక్కడ వున్న ప్రాణులందరూ సమమైన ఒడ్డు పొడవును స్పష్టంగా చూడగలిగారు. పరస్పరం గుర్తుపట్టగలిగారు. మరికొందరు "ఓహో! ఇక్కడ ఉన్నారా!" అని ఒకరినొకరు హెచ్చరించుకున్నారు.

ఆ సమయంలో త్రిసాహస్ర మహాసహస్రమైన లోకధాతువు (లోకం)లో ఆరు వికారాలు, పదెనిమిది నిమిత్తాలు కలిగాయి. అది కంపించింది, ప్రకంపించింది, సంప్రకంపించింది, వేధించింది, (పైకి ఎగిసినది), ప్రవేధించింది, సంప్రవేధించింది. చలించినది, ప్రచలించినది, సంప్రచలించినది, క్షోభించినది, ప్రక్షోభించినది, సంప్రక్షోభించినది. రణించినది, ప్రరణించినది, సంప్రరణించినది. గర్జించినది, ప్రగర్జించినది, సంప్రగర్జించినది. చివరను తగ్గి మధ్యను ఉన్నతమైంది. మధ్యను తగ్గి, అంతంలో ఉన్నతమైంది. పూర్వ దిక్కున తగ్గి, పశ్చిమ దిక్కున ఉన్నతమయినది. పశ్చిమ దిక్కున తగ్గి పూర్వ దిక్కున ఎగిసింది. దక్షిణ దిక్కున తగ్గి ఉత్తర దిక్కున పైకెగిసింది. ఉత్తర దిక్కున తగ్గి దక్షిణ దిక్కున పైకెగిసింది. ఆ సమయంలో హర్షణీయాలు, తోషణీయాలు, ప్రేమణీయాలు, ప్రసాదనీయాలు, అవలోకనీయాలు, ప్రహ్లాదనీయాలు, నిర్వర్ణనీయాలు, ఆసేచనీయాలు, అప్రతికూలాలు, అనుత్రాసకరాలు అయిన శబ్దాలు వినబడ్డాయి. ఆ సమయంలో ఏ ప్రాణికిగాని విహేగంకాని, హింసకాని, భయంకాని, కొయ్యబారిపోవడంగాని కలుగలేదు.



అప్పుడు సూర్యచంద్రుల, బ్రహ్మశక్ర లోకపాలుల కాంతి తెలియలేదు. సకల నరకగత ప్రాణులు, తిర్యగ్యోనిగత ప్రాణులు, యమలోకం పొందిన ప్రాణులు, ఆ క్షణంలో దుఃఖరహితాలయ్యాయి; సర్వసుఖాలు పొందాయి. ఏ ప్రాణినీ రాగమూ, ద్వేషమూ, మోహమూ, ఈర్ష్యా, మాత్సర్యమూ, మానమూ, మ్రక్షమూ (అపశబ్దాలు), మదమూ, క్రోధమూ, ద్రోహచింతా, పరిదాహమూ బాధించలేదు. అన్ని ప్రాణులూ స్నేహబుద్ధితో, హితచిత్తంతో పరస్పరం ఒక తల్లికీ తండ్రికీ జనించినట్టు అయాయి. శతసహస్ర కోటినియుత దివ్యమానవ భేరీలు ఎవరూ వాయించకనే మనోజ్ఞంగా నదించాయి. శతసహస్ర కోటినియుతసంఖ్యాకులైన దేవతలు బోధిసత్త్వుడు ఆసీనుడయిన విమానాన్ని చేతులతో, భుజాలతో, శిరస్సుతో మోయసాగినారు. శతసహస్ర సంఖ్యాక లయిన అప్సరసలు తమ తమ సంగీత మేళాలతో ముందూ వెనుకా ప్రక్కలలోనూ మూగి బోధిసత్త్వుని సంగీత స్వరవర్ణాలతో ఈ విధముగా స్తోత్రం చేశారు.

"పూర్వకర్మ శుభసంచితస్య తే దీర్ఘరాత్ర కుశలోదితస్య తే,
సత్య ధర్మ నయ శోధితస్య తే పూజ అద్య విపులా ప్రవర్తతే.

పూర్వి తుభ్య బహుకల్పకోటియో దాను దత్తు ప్రియపుత్రధీతరాః.
తస్య దానచరితస్య తత్ఫలం యేన దివ్యకుసుమాః ప్రవర్షితాః.

ఆత్మమాంస తులయిత్వ తే విభో సోభి దత్తు ప్రియపక్షికారణాత్,
తస్య దానచరితస్య తత్ఫలం ప్రేతలోకి లభి పాన భోజనం.

పూర్వి తుభ్య బహు కల్ప కోటియో శీలరక్షిత మఖండన వ్రతం,
తస్య శీలచరితస్య తత్ఫలం యేన లక్షణ అపాయ శోధితాః.

పూర్వి తుభ్య బహుకల్ప కోటియో క్షాంతి భావిత నిదాన బోధయే,
తస్య క్షాంతిచరితస్య తత్ఫలం మైత్ర చిత్ర భుత దేవ మానుషాః.

పూర్వి తుభ్య బహుకల్ప కోటియో వీర్య భావిత మలీన ముత్తమం,
తస్య వీర్య చరితస్య తత్ఫలం యేన కాయు యథ మేరు శోభతే.

పూర్వి తుభ్య బహుకల్పకోటియో ధ్యానధ్యాయిత కిలేశ ధ్యేషణాత్,
తస్య ధ్యానచరితస్య తత్ఫలం యేన క్లేశజగతో న బాధతే.

పూర్వి తుభ్య బహుకల్పకోటియో ప్రజ్ఞభావిత కిలేశచ్ఛేదనీ,
తస్య ప్రజ్ఞచరితస్య తత్ఫలం యేన ఆభ పరమో విరోచతే.

మైత్ర వర్మిత కిలేశ సూదనా సర్వసత్త్వ కరుణాయ ఉద్గతా,
మోదిప్రాప్త పరమా ఉపేక్షకా బ్రహ్మభూత సుగతా నమోఽస్తు తే.

ప్రజ్ఞ ఉల్కప్రభ తేజసోద్గతా సర్వదోషతమ మోహ శోధకా,
చక్షుభూత త్రిసహస్రి నాయకా మార్గ దేశికమునే నమోఽస్తు తే.

బుద్ధిపాదవరభిజ్ఞ కోవిదా సత్యదర్శి పరమార్థ శిక్షితా,
తీర్ణ తారయసి అన్య ప్రాణినో దాశభూత సుగతా నమోఽస్తు తే.

సర్వోపాయ వరభిజ్ఞకోవిదా దర్శయసి చ్యుతి మచ్యుతిచ్యుతిం,
లోకధర్మ భవనాభివర్తసే నో చ లోకి క్వచి ఓపలిప్యసే.

లాభ తేష పరమా అచింతియా యేషు దర్శన శ్రవం చ ఏష్మసే,
కిం పునః శ్రుణుయ యోతిధర్మతాం శ్రద్ధ ప్రీతి విపులా జనేష్యసే.

జిహ్మ సర్వతుషితాలయో భుతో జంబుద్వీపి పురి యో ఉదాగతః,
ప్రాణికోటినయుతా అచింతియాం బోధయిష్యసి ప్రసుప్త క్లేశతీ.

బుద్ధస్ఫీత పురమధ్య భేష్యతీ దేవకోటి నయుతైః స్పమాకులం,
అప్సరోభి తురియై ర్నినాదితం రాజగేహి మధురం శ్రుణిష్యతి.

పుణ్య తేజభరితా శుభకర్మణా నారి సా పరమరూప ఉపేతా,
యస్య పుత్ర అయ మేవ సమృద్ధః త్రిసలోకి అభిభాతి శిరియే.

నో భుయో పురవరస్మి దేహినాం లోభ దోష కలహో వివాదకాః,
సర్వమైత్రమనసః సగౌరవాః భావినో నరవరస్య తేజసా.

రాజవంశనృపతేః ప్రవర్ధతే చక్రవర్తి కులరాజసంభవః,
భేష్యతే కపిలసాహ్వయం పురం రత్నకోషభరితం సుసమృద్ధం.



యక్ష రాక్షస కుంభాండ గుహ్యకా దేవదానవగణాః సఇంద్రకాః,
యే స్థితా నరవరస్య రక్షకాః తేషు మోక్షం నచిరేణ భేష్యతే.

పుణ్య ప్రార్జితు స్తవిత్వ నాయకం ప్రేమ గౌరవ ముపస్థపిస్వనా,
సర్వబోధి పరిణామయామహే క్షిప్ర భోమ యథ త్వం నరోత్తమ."

"పూర్వ కర్మశుభాలు సేకరించుకుని, దీర్ఘకాలంతో పెరిగి సత్య ధర్మనయాలతో పరిశుద్ధుడవయిన నీకు విపులంగా పూజలు జరుగుతాయి. పూర్వం అనేకకోటి కల్పాలతో నీవు నీకు అత్యంతప్రియులైన పుత్రులను ఇతరులకు దాన మిచ్చావు. ఆ దానచరితకు ఫలమే ఈ దివ్యకుసుమవర్షం. ఓ విభూ! నీవు ఒక ప్రియపక్షికోసం నీ మాంసం తూచి యిచ్చావు. అందువల్ల, ఆ దానచరితఫలంవల్ల ప్రేతలోకంలోను పానభోజనాలు లభించాయి. నీవు పూర్వం పెక్కు కోటి కల్పాలు శీలరక్షితవ్రతం అఖండితంగా చేశావు. ఆ శీలచరితపుణ్యంతో అశుభాలు, అపాయాలు తొలగాయి. పూర్వం నీవు అనేకకోటికల్పాలు నిదానబోధికోసం క్షాంతిని సాధించావు. ఆ క్షాంతి చరితఫలం దేవ మనుష్య లందరూ నీయందు మైత్రీ చిత్తంతో మెలగడమే. పూర్వం నీవు బహుకోటి కల్పాలు ఇంద్రియనిగ్రహమనే అపూర్వమైన ఉత్తమమయిన వ్రతం ఆచరించి వీర్యవంతుడ వయ్యావు. ఆ నిష్ఠా ఫలంవల్లనే నేడు నీ దేహం మేరునగంవలె శోభిస్తున్నది. పూర్వం నీవు పెక్కు కోటి కల్పాలు లోకక్లేశ నివారణార్థం ధ్యానం ఆచరించావు. ఆ ధ్యానచరితఫలంగా నేడు జగత్తును క్లేశం బాధించడం లేదు. పూర్వం నీవు ఎన్నో కోటికల్పాలు లోకక్లేశచ్ఛేదకమయిన ప్రజ్ఞను భావించావు. ఆ ప్రజ్ఞాచరితం ఫలంవల్ల పరమకాంతి ప్రకాశిస్తున్నది. మైత్రి అనే కవచంతో క్లేశాలు పోగొట్టేవాడా, సర్వప్రాణులపయిని కరుణ చూపడానికే ఉదయించినవాడా, మైత్రిని పొందినవాడా, ఉపేక్షాస్థితిని సాధించి, బ్రహ్మభూతుడ వయిన సుగతుడా, నీకు నమస్కారం. ప్రజ్ఞా ప్రభాపటల సముద్గతుడా, సర్వదోషాలను, మోహాన్ని పటాపంచలు చేసేవాడా, ప్రపంచానికే చక్షువువంటివాడా, త్రిసహస్రనాయకా, మార్గదేశికుడవైన మునీ! నీకు నమస్కారాలు. బుద్ధిపాదం (అపూర్వ మాహాత్మ్యాలు) చక్కగా తెలిసినవాడా, కోవిదుడా, సత్యదర్శీ, పర

మార్గవేత్తా, శాస్తా, నీవు తరించి యితరప్రాణులను తరింపజేసేవాడా, నాశభూతుడవైన సుగతుడా, నమస్కారం. నీవు సర్వోపాయాలు ఎరిగినవాడివి, సకలవిషయకోవిదుడివి, చ్యుతిఅచ్యుతిని అచ్యుతిచ్యుతిని చూపగలవాడివి, లోకంలో ధర్మప్రతిష్ఠకోసం ఉంటున్నావు. అయినా, ఎక్కడా, ఏ మాత్రమూ, ఉపలిప్తుడివి కావు. నిన్ను దర్శించడమే అచింతితమయిన పరమలాభం. ఇంక నీనుంచి ధర్మోపదేశం పొందగల భాగ్యశాలికి శ్రద్ధా, ప్రీతీ విపులంగా నీవు కలిగించగలవనడం, చెప్పాలా? నీవు జంబూద్వీపంలోని నగరంలో అవతరించడంవల్ల తుషితదేవలోకమంతా సంక్షుభితమయింది. క్లేశాలలో నిద్రపోతున్న ప్రాణికోటిని మేల్కొలిపి అచింతితమయిన బోధిని కలిగిస్తావు. ఇక నీవు అతిసమృద్ధమూ, స్ఫీతమూ అయిన కపిలవాస్తు నగరాన్ని దేవకోటి నయుతాలతో కిటకిట లాడేదాన్ని ప్రవేశిస్తున్నావు. రాజగృహంలో అప్సరసలు ప్రయోగించే మధుర తూర్యరావాలు వింటారు. నీ జనని పరమసుందర రూపోపేత, పుణ్యతేజోవంతురాలు, శుభకర్మలు చేసేదిని. అలాంటి నారీమణిపుత్రుడు వీడే ననే మంచిమాటతో నీవు సమృద్ధి కలిగి మూడు లోకాలలోను యశఃశ్రీని వెలిగిస్తావు. పుట్టబోతున్న నరశ్రేష్ఠుడవైన నీ తేజస్సువల్ల నీవు జన్మించే పురవరంలో ప్రాణులకు లోభం, ద్వేషం, కలహం, వివాదం ఉండవు. అందరూ మైత్రీమనస్కులై గౌరవభావంతో ప్రవర్తిస్తూ ఉంటారు. శుద్ధోదన మహారాజు వంశం చక్రవర్తివంటి సకల లక్షణోపేతుడ వయిన నీవు అవతరించడంవల్ల అభివృద్ధి పొందుతుంది. కపిలవాస్తు పట్టణమూ రత్నకోశభరితమై సమృద్ధి పొందుతుంది. నరవరుడవైన నీకు రక్షకులుగా ఉన్న యక్షులు, రాక్షసులు, కుంభాండులు, గుహ్యకులు, ఇంద్రునితో సహా దేవతలు, దానవులు త్వరలో మోక్షం పొందుతారు. ఓ నరోత్తమా! నీవు త్వరలో భూమికి అవతరించు. నాయకుడవైన నిన్ను స్తోత్రంచేసి పుణ్యాం సంపాదించి, ప్రేమగౌరవాలు పొందుతాము. సమ్యక్సంబోధిపరిణామాలను పొందగలుగుతాము.'' ఈ విధంగా అప్సరశ్శతసహస్రం బోధిసత్త్వుణి స్తుతించింది.

ఇది శ్రీ లలిత విస్తరంలో ప్రచలపరివర్తమనే ఐదవ అధ్యాయం.

---

# గర్భావక్రాంతి పరివర్తం

భిక్షువులారా, శిశిరకాలం గడిచిపోగా, వైశాఖమాసంలో విశాఖా నక్షత్రం రాగా, వసంతఋతువులో చెట్లన్నీ బాగా చిగిరించాయి. చక్కగా పుష్పించాయి. నేల మృదువైన పచ్చికతోకూడి మనోహరంగా ఉన్నది. ఎక్కువ చలిగాని, ఎక్కువ ఎండగాని లేదు. దుమ్ముగాని, చీకటిగాని లేదు. సమయం యిలా అనుకూలంగా ఉండగా, మాసంలో పదిహేనవ దినమయిన పౌర్ణమినాడు పుష్యనక్షత్రయుక్త సమయంలో త్రిభువన జ్యేష్ఠుడూ, లోకహితకారీ అయిన బోధిసత్త్వుడు తుషితభవనం నుండి కిందికి దిగి, పోషధవ్రతం స్వీకరించిన తల్లి అయిన మాయాదేవి గర్భంలో గున్నయేనుగు రూపంతో ప్రవేశించాడు. ఆ పిల్ల ఏనుగు తెల్లగా వున్నది. దానికి ఆరుదంతా లుండినవి. దానితల ఆరుద్రపురుగువలె ఎర్రగా వుండినది. దంతాలు బంగారుకాంతి కలిగి వుండినవి. అవయవాలన్నీ పొందికగా ఎట్టి లోపమూ లేకుండా ఉండినవి. ఇట్టి గజపోతం తల్లి గర్భంలో దక్షిణభాగమందే ప్రవేశించింది. ఎడమభాగంలో ప్రవేశించలేదు. సుఖంగా నిద్రిస్తూన్న మాయాదేవికి ఇలాటి స్వప్నం కలిగింది:

''హిమ రజతనిభశ్చ షడ్విషాణః సుచరణ చారుభుజః సురక్తశీర్షః,
ఉదర ముపగతో గజప్రధానః లలితగతిః దృఢవజ్రగాత్రసంధిః.

నచ మమ సుఖ జాతు ఏవరూపం
దృష్టమపి శ్రుతం నాపి చానుభూతం,
కాయసుఖ చిత్త సౌఖ్యభావా
యథరివ ధ్యాన సమాహితా అభూవమ్.''

ఈ గాథల భావమిది :—

"హిమం వలెను, వెండివలెను, తెల్లని దేహం కలిగి, ఆరుదంతాలు, అందమైన తొండమూ, ఎఱ్ఱని శిరస్సు, వజ్రంవలె దృఢమయిన అవయవ సంధులూ గల గజరాజు లలితమయిన గమనంతో ఉదరంలో ప్రవేశించింది. ఇప్పుడు కలిగినంత సుఖం నాకు ఎప్పుడూ కలుగలేదు. ఇట్టి సుఖాన్ని యిదివరలో కని, విని యెరుగను. అనుభవించి యెరుగను. నా శరీరానికీ, మనస్సుకూ కూడా ఇప్పుడు ఎంతో సుఖంగా ఉంది. ధ్యాన సమాహితురాలనుగా ఉన్నప్పటిస్థితి యిప్పుడు నాకు కలుగుతున్నది."

తర్వాత, మాయాదేవి ఆభరణాలను, విలువైన వస్త్రాలను ధరించి, సుఖంగా ఉన్న శరీరమూ, సంతోషించిన మనస్సూ కలదై, ప్రసన్న భావాన్ని పొంది, పడకమీదనుండి లేచినది. చెలికత్తెలందరూ ఆమెకు మిక్కిలి గౌరవం చూపుతూ ముందు నడువగా, ఆమె ప్రాసాదశిఖరం నుండి క్రిందికి దిగి అశోకవనంవైపు వెళ్ళింది. మాయాదేవి ఆ భవనంలో ప్రవేశించి, సుఖంగా కూర్చున్నదై "దేవి యిక్కడ ప్రభువును చూడ గోరుతున్నది. వెంటనే రావలెను" అని ఒక సేవకునిమూలంగా మహారాజైన శుద్ధోదనునికి వార్త పంపింది.

శుద్ధోదనుడు ఆ వార్తను విని మిక్కిలి సంతోషించినాడు. శరీరం కంపిస్తూ వుండగా, సింహాసనంనుండి లేచినాడు. మంత్రులు, వేత్తలు, సభ్యులు, బంధువులు వెంట రాగా, శుద్ధోదనుడు అశోకవనం దగ్గరకు వచ్చినాడు. సమీపించాడే గాని, దానిలోపల ప్రవేశించలేకపోయినాడు. అతని కప్పుడు తన శరీరమే బరువుగా తోచింది. అతడు అశోకవన ద్వారం దగ్గరే నిలబడి, క్షణకాలం ఆలోచించి, ఆ సమయంలో ఒక గాథను పలికినాడు. దాని భావమిది :

"రణంలో అరితేరినవారికి మూర్ధన్యుడనైన నాకు ఈ విధంగా శరీరం బరువుగా వుండడం వింతగా ఉన్నది. ఇలాటిది ఎప్పుడూ జరిగి



నట్లు జ్ఞాపకం లేదు. నా శరీరం యీ విధంగా అయి, నా సొంతగృహం లోనే నేను ప్రవేశించలేకుండా ఉన్నాను. ఎవరిని అడగను ?"

అప్పుడు శుద్ధావాసకాయికులైన దేవపుత్రులు ఆకాశంపైని వుండే, తమ సగం శరీరం కనబడేటట్లు వంగి, రాజైన శుద్ధోదనునితో ఇట్లన్నారు: "ఓ రాజా ! వ్రతాలతో, తపస్సుతో, గుణాలతో కూడి మూడు లోకాల లోను పూజ్యతను పొంది, మైత్రీ, కరుణలను సంపాదించి, పుణ్యజ్ఞానం చేత అభిషిక్తుడైన మహాత్ముడు—బోధిసత్త్వుడు తుషితభవనంనుంచి దిగి, మాయాదేవి గర్భంలో ప్రవేశించి, నీకు పుత్రుడుగా అవతరిస్తాడు."

ఆ మాట విని, శుద్ధోదనమహారాజు పది వ్రేళ్ళు కలుసుకునే రీతిని చేతులు జోడించి, ఆశ్చర్యంతో తల ఊపుతూ, చిత్రకారులతో కూడా ఆ వనంలోపల ప్రవేశించి, మానదర్పాలు లేక ప్రశాంతురాలయిన రాణిని చూచి "ఓ మాయాదేవీ, నీకు ఏమి కావాలి ? నన్నేమి చెయ్యమన్నావో చెప్పు" అని అడిగినాడు.

అప్పుడు మాయాదేవి యిట్లన్నది: "ఓ ప్రభూ! నేనొక కల గన్నాను. మంచుతోనూ, వెండితోనూ సమానమయిన తెల్లని దేహమూ, చంద్ర సూర్యులను అతిక్రమించిన తేజస్సూ, చక్కని పాదాలూ, పొందిక అయిన అవయవ సన్నివేశమూ, ఆరుదంతాలు, దృఢమయిన సంధిబంధాలూ, వజ్రసమానమయిన అందమైన శరీరమూ కల గొప్ప గజ రాజు ఒకటి నా గర్భంలో ప్రవేశించింది. చీకట్లు నశించేటట్లుగా మూడు వేల నయుతాలమంది దేవతలు వచ్చి పడుకొన్న నన్ను స్తోత్రం చేయ సాగినారు. నాకు దోషమూ, రోషమూ, అజ్ఞానమూ నశించాయి. ధ్యాన సుఖాన్ని అనుభవిస్తూ, నేను శాంతచిత్తనై వున్నాను. ఇదీ కల. ఓ రాజా! వేదవేత్తలూ, విధిజ్ఞులూ అయిన బ్రాహ్మణులను పిలిపించు. నా స్వప్న వృత్తాంతాన్ని వారికి విపులంగా వివరించి చెప్పు. దీనివల్ల మన వంశానికి శ్రేయస్సు కలుగుతుందో, పాపం కలుగుతుందో వారిని అడిగి తెలుసు కోవాలి."

రాజు ఈ మాటను విని వెంటనే వేదవేత్తలూ, శాస్త్రాలు తెలిసిన వారూ అయిన బ్రాహ్మణులను పిలిపించి, మాయాదేవి ఎదుటనే స్వప్న వృత్తాంతాన్ని వివరించి చెప్పి "ఈమె స్వప్నానికి ఫలం ఏమిటో చెప్పండి" అని అడిగినాడు.

అప్పుడు వారు మాయాదేవితో "ఓ మహారాజ్ఞీ ! నీకు ఎలాంటి స్వప్నం వచ్చిందో తెలుపు" అని అడిగినారు.

ఆమె యిలా చెప్పింది :— "మంచుతోనూ, వెండితోనూ సమానమయిన తెల్లని దేహమూ, చంద్ర సూర్యులను అతిక్రమించిన తేజస్సు, చక్కని పాదాలు, పొందికఅయిన అవయవసన్నివేశమూ, ఆరుదంతాలూ, దృఢమైనసంధిబంధాలూ, వజ్రసమానమై, అందమయిన శరీరమూ కలిగి వున్న గొప్ప గజరాజు ఒకటి నా గర్భంలో ప్రవేశించింది" అని.

బ్రాహ్మణులు ఈ మాటలు విని యిలా అన్నారు : "బాగా ఆలోచించి చూడగా దీనివల్ల వంశానికి పాపం ఏమీ లేదు. శుభలక్షణాలతో అలంకరించబడిన శరీరం కలవాడై నీకొక కుమారుడు కలుగుతాడు. అతడు మహాత్ముడు. చక్రవర్తి. రాజవంశంలో ఉత్తమోత్తముడు. అతడు కోరికలను జయించి, ఇంటినీ, పట్టణాన్నీ, రాజ్యాన్నీ విడిచి సన్యాసి అయి, సర్వ లోకాలయెడల దయ కలిగి వుంటాడు. దేనియందూ ఆపేక్ష వుండదు. అతడు మూడు లోకాలకూ గౌరవపాత్రుడవుతాడు. బుద్ధుడై అమృతవర్షంవల్ల సమస్త లోకాలనూ తృప్తి పొందించగలడు."

ఆ బ్రాహ్మణులు ఈ విధంగా స్వప్నం వివరించి, సౌమ్యవాక్యాలు పలికి, రాజభోజనం ఆరగించి, వస్త్రాలను బహుమానంగా గ్రహించి వెళ్ళిపోయారు.

భిక్షువులారా, రాజైన శుద్ధోదనుడు స్వప్నవృత్తాంతం శుభలక్షణాలను వివరంగా చెప్పిన వైపంచికులు, స్వప్నాధ్యాయ పాఠకులు అయిన బ్రాహ్మణులవల్ల జరుగబోయేదాన్ని శ్రద్ధగా విని, అత్యధికంగా సంతోషించాడు; చతుర్విధాహారాలతో వారికి తృప్తి కలిగించి, వస్త్రాలను యిచ్చి పంపివేసినాడు. ఆ సమయంలో కపిలవస్తు నగరానికి గల



నాలుగు ద్వారాలలోనూ, అన్ని పురాంగణాలలోనూ, అన్ని చతుష్పథాలలోనూ, శృంగాటకాలలోనూ దానాలు ఇచ్చాడు. అన్నం కావలసిన వాళ్ళకు అన్నమూ, పానం కావలసినవాళ్ళకు పానమూ, వస్త్రాలు కోరినవారికి వస్త్రాలూ, వాహనాలు కోరినవారికి వాహనాలూ ఇచ్చాడు. ఈ విధంగా ఆ యా వస్తువులను కోరినవారికి గంధ, మాల్య, విలేపన, శయ్యాస్థానాలూ యిచ్చాడు. బోధిసత్త్వుణ్ణి గౌరవించడంకోసం జీవిక కోరినవారికి జీవికనూ యిచ్చాడు.

అనంతరం ఎట్టి శ్రమా లేకుండా సుఖంగా మాయాదేవి విహరించడానికి ఏ గృహం అనుకూలమై వుంటుందా అని శుద్ధోదన మహారాజుకు ఆలోచన కలిగింది. అతడు అలా ఆలోచిస్తూ వున్న సమయంలోనే చతుర్మహారాజులనే దేవతలు అతని దగ్గరకు వచ్చి యిలా అన్నారు— "ఓ ప్రభూ ! నీవు తహతహపాటు తగ్గించుకో. ఈ విషయంలో వుపేక్ష వహించి, సుఖంగా ఉండు. మేము బోధిసత్త్వుడికి తగిన గృహాన్ని చూడగలం" అని.

అప్పుడు దేవతలకు ప్రభువైన ఇంద్రుడు రాజైన శుద్ధోదనుడి దగ్గరకు వచ్చి "ముప్ఫయి ముగ్గురు పాలకుల విమానాలూ ఉత్తమాలయి వున్నా, అవి ఇతనికి తగవు. నేను వైజయంతంతో సమానమయిన భవనాన్ని బోధిసత్త్వుడికి ఇయ్యగలను" అని చెప్పాడు.

సుయాముడనే దేవపుత్రుడు రాజైన శుద్ధోదనుని సమీపించి "నా భవనం సుయామభవనంగా ప్రసిద్ధి పొందింది. దాన్ని చూచి, ఇంద్రాదులు కూడా ఎంతో ఆశ్చర్యపడతారు. దాన్ని నేను బోధిసత్త్వుడికి ఇస్తాను" అన్నాడు.

అంతలో సంతుషితుడనే దేవపుత్రుడు రాజైన శుద్ధోదనుడి దగ్గరకు వచ్చి "తుషితలోకంలో గొప్ప కీర్తికల బోధిసత్త్వుడు పూర్వం నివసిస్తూ వుండిన భవనం మిక్కిలి ఆనందమైనది. ఆ భవనాన్నే నేను బోధిసత్త్వుడికి ఇస్తాను" అని అన్నాడు.

సునిర్మితుడనే దేవపుత్రుడు రాజైన శుద్ధోదనుడి దగ్గరకు వచ్చి "ఓ రాజా! రత్నమయమయిన గొప్ప భవనాన్ని మనస్సులో ఆలోచించి తయారుచేసి, బోధిసత్త్వుడికోసం నేను యివ్వగలను" అన్నాడు.

తరువాత పరనిర్మిత వశవర్తి అనే దేవపుత్రుడు రాజైన శుద్ధోదనుడి వద్దకు వచ్చి ఇలా పలికాడు – "ఓ రాజా! శోభనములూ, కామధాతుస్థములూ అయిన విమానాలు అన్నీ నా విమానానికి సాటి కావు. నా విమానంకాంతిముందు అవి వెలవెలపోతాయి. రత్నమయమైన ఆ విమానగృహాన్ని నేను ఇవ్వగలను. బోధిసత్త్వుణ్ణి గౌరవించేందుకు దాన్ని నేను తెచ్చి సమర్పిస్తాను. అది దివ్యాలైన పుష్పాలతో అలంకరించబడినది. దివ్యాలైన సువాసనలతో పరిమళిస్తూ వుంటుంది. విశాలమైన దానిలో మాయాదేవి నివసించవచ్చును."

కామావచరులైన దేవేశ్వరు లందరూ యీ విధంగా బోధిసత్త్వుణ్ణి గౌరవించి, అతడు నివసించడానికై కపిలవస్తుపురంలో తమ తమ భవనాలను తీసుకుని వచ్చారు. మానవులను అతిక్రమించి, దివ్యులచే పొందదగిన గృహశ్రేష్ఠాన్నే శుద్ధోదనమహారాజు సిద్ధపరిచాడు. మహాసత్త్వం గల బోధిసత్త్వుడు మహావ్యూహ సమాధి ప్రభావంవల్ల మాయాదేవి అందరి గృహాలలోను ఉన్నట్లుగా చూపించాడు. అతడు మాయాదేవి గర్భం ప్రవేశించి, గర్భంలో దక్షిణభాగాన్నే శయనంగా ఏర్పరచుకుని సుఖంగా కూర్చున్నాడు. ఆ దేవేశ్వరులలో ఒక్కొక్కరూ బోధిసత్త్వుని మాత తమ గృహంలోనే నివసిస్తున్నది, మరొకరి గృహంలో నివసించలేదు—అనే అనుకున్నారు.

ఇక్కడ ఈ గాథ అంటారు:

"మహా వ్యూహాయ స్థితః సమాధియే అచింతియా నిర్మిత నిర్మిణిత్వా,
సర్వేష దేవా నభిప్రాయపూరితా నృపస్య పూర్ణశ్చ తదా మనోరథః."

దీని తాత్పర్యమిది:—బోధిసత్త్వుడు మహా వ్యూహసమాధిస్థితుడై తలవని తలంపుగా అన్నీ నిర్మించాడు. దేవతలు సంతృప్తిపడ్డారు. శుద్ధోదన నరపాలుడూ పూర్ణమనోరథుడయాడు.



ఆ దేవతల సదస్సులో ఉన్న కొందరు దేవపుత్రుల మనస్సులో ఒకటి తోచింది. చాతుర్మహారాజకాయికులైన దేవతలు కూడా మనుష్యులను ఆశ్రయించడం మూలాన అవిద్యతో వెళ్ళుతున్నారు. ఇట్టి స్థితిలో ఇతరులైన దేవతలను గురించి ఎవరు గొప్ప అని వేరే చెప్పనేల? త్రాయత్రింశులసంగతీ, యాముల సంగతీ, తుషితుల సంగతీ కూడా ఇంతే. వీరంతా అనుకున్నారు కదా – బోధిసత్త్వుడు సర్వలోకాశ్రయుడు, పరిశుద్ధుడు, ఆమగంధం లేనివాడు, ప్రాణులలో శ్రేష్ఠుడు. అట్టివాడు తుషితలోకంలోని దేవ సమూహంనుంచి భూలోకంలోకి దిగి వచ్చి, దుర్గంధమూ, మనుష్యాశ్రయమూ అయిన తల్లి గర్భంలో పది నెలలు ఎలా వుంటాడో కదా—అని.

అప్పుడు ఆయుష్మంతుడైన ఆనందుడు బుద్ధానుభావంతో భగవంతుడైన బోధిసత్త్వునితో ఇలా మనవి చేశాడు:

"హే భగవాన్, ఇది చాలా ఆశ్చర్యంగా వున్నది. తల్లి గర్భావాసం రాగంతో కూడినదనిన్నీ, జుగుప్సాకరమనిన్నీ, తథాగతులే యిదివరకు తెలిపి వున్నారు కదా! సర్వలోకాశ్రయులైన తమరు తొలుత బోధిసత్త్వులుగానే వుండి, తుషితలోకంలోని దేవసమూహంనుంచి భూలోకంలోకి దిగి వచ్చి మనుష్య సంబంధమై, దుర్గంధమై ఉన్న తల్లి గర్భంలో దక్షిణపార్శ్వంలో ఎలా వున్నారో యిది మిక్కిలి ఆశ్చర్యకరంగా వున్నది. ఇలాగున అడగడానికి నాకు ఎంతమాత్రమూ యిష్టం లేదు. అయినా, మొదట తమరు మానవశరీరం గురించి ప్రస్తావించినందున మనవి చేస్తున్నాను" అని.

భగవానుడు "ఆనందా! పూర్వం తల్లి గర్భంలో వున్నప్పుడు బోధిసత్త్వుడు రత్నవ్యూహపరిభోగాన్ని అనుభవించాడు కదా! ఆ పరిభోగాన్ని చూడాలని కోరుతున్నావా?" అని అడిగాడు. ఆనందుడు "అవునవును. ఇదే దానికి చక్కని సమయం. తథాగతులు ఆ బోధిసత్త్వ పరిభోగాన్ని ప్రదర్శించడానికి ఇదే తగిన సమయం! దాన్ని చూచి మేము ఎంతో ఆనందిస్తాం" అని అన్నాడు.

భగవానుడైన బోధిసత్త్వుడు దానికి తగిన సంఘటనను కలిగించాడు. అప్పుడు సహాపతి అయిన బ్రహ్మ అరవైఎనిమిది లక్షల బ్రహ్మలతో కూడా, బ్రహ్మలోకంలో ఉండినవాడు అక్కడ మాయమై, భగవానుని యెదుట ప్రత్యక్షమయ్యాడు. అతడు తన శిరస్సుతో భగవానుని పాదాలకు ప్రణామం చేసి, మూడుసార్లు ప్రదక్షిణం చేసి, సమీపంలో చేతులు జోడించుకుని నిలిచినాడు. భగవానునికి విషయమంతా బాగుగా తెలిసి వుండి కూడా సహాపతి అయిన ఆ బ్రహ్మను చూచి "ఓ బ్రహ్మ! పూర్వం నేను బోధిసత్త్వుడనుగా వుండినప్పుడు, మాతృగర్భంలో వున్న సమయంలో అక్కడ పది మాసాలు పరిభోగం వుండినది. దానిని నీవు తీసుకొన్నావు కదూ?" అని అన్నాడు. అప్పుడు ఆ బ్రహ్మ "అది నిజమే. అది అలాగే తీసుకున్నాను" అని సమాధానం ఇచ్చినాడు. "అది యిప్పుడు ఎక్కడ వున్నదో చూపు" అని భగవానుడు అడుగగా "బ్రహ్మలోకంలో వున్న"దని బ్రహ్మ ప్రత్యుత్తరం ఇచ్చినాడు. పిదప, బోధిసత్త్వుడు "అది యే రీతిగా వున్నదో చూద్దాము; తీసుకుని వచ్చి చూపవలెను" అని బ్రహ్మతో చెప్పినాడు.

తర్వాత సహాపతి అయిన బ్రహ్మ తనవెంట వున్న బ్రహ్మలను చూచి "మీరు యిక్కడే వుండండి. నేను వెళ్ళి బోధిసత్త్వ పరిభోగమైన రత్నవ్యూహాన్ని తీసుకుని వస్తాను" అని చెప్పినాడు.

ఆ బ్రహ్మ బోధిసత్త్వుని పాదాలదగ్గర తన తలను ఉంచి, నమస్కరించి, అతని యెదుటనే మాయమై, బ్రహ్మలోకాన్ని చేరినాడు. అతడు అక్కడవున్న సుబ్రహ్మ అనే దేవపుత్రుణ్ణి చూచి "ఓ మార్షా! నీవు 'బోధిసత్త్వ పరిభోగమైన రత్నవ్యూహాన్ని మేము తథాగతుని సమీపానికి తీసుకునిపోతున్నాము. మీలో చూడదలచినవారందరూ వెంటనే వచ్చి చూడవచ్చును' అని ఈ బ్రహ్మలోకం మొదలు త్రయస్త్రింశద్దేవభవనం వరకు ఘోషం వేయించు. వెంటనే పో" అని అన్నాడు.

తరువాత సహాపతి అయిన బ్రహ్మ ఎనభైనాలుగు కోట్ల దేవతల తోను, ఎన్నో కోట్ల సంఖ్య గల యితరులతోనూ కూడా మూడు వందల



యోజనాల పరిమితి గల బ్రహ్మసంబంధమైన విమానం ఎక్కి, బోధిసత్త్వ పరిభోగమైన రత్నవ్యూహాన్ని భద్రంగా ఉంచుకుని, జంబూద్వీపంలో దిగినాడు.

ఆ సమయంలోనే కామావచరులైన దేవతలున్నూ భగవానుని సమీపాన్ని చేరడానికి సిద్ధపడ్డారు. బోధిసత్త్వపరిభోగమైన ఆ రత్నవ్యూహం దివ్యవస్త్రాలతోను, అట్లే దివ్యములైన మాల్యాలు, గంధాలు, పుష్పాలు, వాద్యాలు, మున్నగు వాటితోను అలంకరించబడింది. దేవతలకు ప్రభువయిన ఇంద్రుడు, మహేశుడు మున్నగు దేవతలతో కూడా మేరువుమీద నిలిచి తాటిఆకుల గొడుగులను పట్టుకుని, దూరంగానే వుండి, దానిని బోధిసత్త్వునికి పడుతూ, తలయెత్తి మీదుగా చూస్తూ వుండినీ చూడలేక పోయినాడు. మహేశుడు మొదలైన దేవతలూ, బ్రాహ్మణులూ, మిగిలిన త్రయత్రింశ దేవతలూ, యామదేవతలూ, తుషితులూ, నిర్మాణ రతులూ, పరినిర్మిత వశవర్తులూ అయిన దేవతలూ కూడా చూడలేక మూర్ఛపోతూ వుండినారు. ఇక ఇంద్రుని సంగతి లెక్క యేమిటి?

భగవానుని ఆదేశంవల్ల మ్రోగించబడిన ఆ దివ్యవాద్యాల ధ్వనిని విన్నమాత్రంచేతనే జంబూద్వీపంలో ఉన్న మనుష్యులకు ఉన్మాదం కలిగేటట్లు తోచింది. అందువల్ల భగవానుడు వెంటనే ఆ వాద్య ధ్వనిని నిలిపివేశాడు.

అప్పుడు చతుర్మహారాజక దేవతలు దేవతల ప్రభువైన ఇంద్రుణ్ణి సమీపించి "ఓ ఇంద్రుడా! బోధిసత్త్వ పరిభోగమయిన రత్నవ్యూహాన్ని మేము చూడలేదు. దాన్ని చూచే భాగ్యం ఎలా వస్తుంది?" అని ప్రశ్నించారు. దానికి ఇంద్రుడు "నేనేమి చెయ్యగలను? మార్షులారా! దాన్ని చూచే భాగ్యం నాకుకూడా కలుగలేదు. అయినా విచారించకండి. అది భగవానుని దగ్గరకు తేబడుతుంది. అప్పుడు చూడవచ్చును" అన్నాడు. అప్పుడు వారు దాన్ని వేగంగా చూడడానికి తగిన ఏర్పాటు చేయాలని ఇంద్రుణి ప్రార్థించారు. ఇంద్రుడు "అయితే, మీరు రండి. ముహూర్తకాలంలోగా అతిక్రాంతులూ అతిక్రాంతతములూ అయిన దేవ

పుత్రులు భగవానుని సమీపం చేరి ఎంతో ఆనందిస్తున్నారు. తలలు ఎత్తి నమస్కరించి, అయనను కన్నులారా చూస్తున్నారు. మీరున్నూ రండి'' అని చెప్పాడు.

తర్వాత సహాపతి అయిన బ్రహ్మ ఎనభైనాలుగు కోట్ల దేవతలతోను, ఎంతో సంఖ్య గల యితరులతోను కూడా బోధిసత్త్వ పరిభోగమైన రత్న వ్యూహాన్ని తీసుకుని భగవానుడైన బోధిసత్త్వుడు వున్న స్థలానికి వచ్చి నాడు. ఆ రత్నవ్యూహం అభిరూప మయినది. అనుకూల దర్శన మయినది. చతురస్రంగా ఉన్నది. నాలుగు స్తంభాలు కలది. మీదిభాగంలో కూటాగారం ఉన్నది. అది షణ్మాసజాతుడయిన పుత్రునికి తగినంత ఎత్తున ఉన్నది. ఆ కూటాగారం మధ్యలో ఒక పడక వున్నది. అది షణ్మాసజాతుడైన పుత్రునికి భిత్తిఫలకం వలె వున్నది. బోధిసత్త్వ పరిభోగమైన ఆ రత్నవ్యూహం చక్కని రంగులతో వున్నది. అట్టిది దేవ లోకంలో గానీ, మారలోకంలోగానీ, బ్రహ్మలోకంలోగానీ లేదు. ఆకారంలో గానీ, రంగులో గానీ దానికి సాటి అయినది ఎక్కడా లేదు. దాన్ని చూచి దేవతలుకూడా ఎంతో ఆశ్చర్యపడ్డారు. వాళ్ళ కన్నులు తిరిగి పోయాయి. తథాగతుని దగ్గరకు తీసుకురాగానే అది ఎంతో ప్రకాశించింది. మంచి నేర్పుగల స్వర్ణకారునిచేత తయారుచెయ్యబడి ఎలాటి నీరసలోహమూ లేకుండా ఉన్నది. అందులోని పర్యంకంవంటి పర్యంకం మరొకటి దేవలోకంలోకూడా లేదు. ఆకారంలోనూ, రంగులోనూ దానికి మరేదీ సాటి కాదు. కంబుగ్రీవుడయిన బోధిసత్త్వునికోసం మహాబ్రహ్మ కావిగుడ్డ పరిచి వున్నాడు. అది యీ బోధిసత్త్వుని పర్యంకం ముందు ఏమీ ప్రకాశించలేదు. అది గాలికీ, వర్షానికీ, దెబ్బతిన్న నల్లకంబళి వలె వున్నది. ఆ కూటాగారానికి ఉరగసారగంధం పూయబడి వున్నది. ఆ ఉరగ సార చందనం వేయి సువర్ణధారణుల (ఒక నాణెం) విలువ కలది. అటువంటిదే ఆ రత్నవ్యూహంలో రెండవ కూటాగారం ఉన్నది. అది మొదటి కూటాగారాన్ని అంటీఅంటనట్లు వున్నది. ఆ రెండవ కూటాగారంలో మూడవ కూటాగార మున్నది. ఇదిన్నీ అంటీఅంటనట్లున్నది. ఆ మూడవ దానిలోనే పర్యంకం కలదు. మూడవ కూటాగారం గంధమయమై



వున్నది. ఆ కూటాగారానికిన్నీ ఉరగసార చందనపుపూత ఉన్నది. అది నీల వైడూర్యాల రంగుతో వెలిగిపోతున్నది. ఆ కూటాగారంమీద అంతటనూ లోకోత్తరాలూ, దివ్యాలూ అయిన పుష్పాలు కానవస్తున్నవి. అవి అన్నీ బోధిసత్త్వుని పూర్వకుశలంవల్ల ఏర్పడినవే!

బోధిసత్త్వ పరిభోగమయిన ఆ రత్నవ్యూహం మిక్కిలి దృఢమయినది. దాన్ని భేదించడం సాధ్యం కాదు. అది వజ్రంతో సమానంగా ఉంటుంది. అది కాచిలిందపుష్పాలవలె మిక్కిలి చల్లని సుఖస్పర్శ కలది. బోధిసత్త్వపరిభోగమయిన ఆ రత్నవ్యూహంలో కామావచరులైన దేవతల భవనవ్యూహాలన్నీ కానవస్తున్నవి.

బోధిసత్త్వుడు మాతృగర్భంలో ప్రవేశించిన రాత్రే ఆపస్కంధం మొదలు అరవై యెనిమిది లక్షల యోజనాలు భూమిని భేదించుకుని బ్రహ్మలోక పర్యంతమూ, ఒక పద్మం ఉద్భవించి, విస్తరించింది. దానిని సారథిసరోత్తముడూ, దశశత సాహస్రికుడయిన మహాబ్రహ్మ తప్ప ఇతరు లెవ్వరూ చూడలేదు. వేలకొద్దీ వుండే లోకధాతువులూ, చిక్కని పదార్థాలూ, మధురరసాలూ, ఎన్ని వున్నవో అవన్నీ ఆ పద్మంలో మధు బిందువులుగా అయినవి.

అంతట మహాబ్రహ్మ చక్కని వైడూర్య పాత్రలో ఆ మధు బిందువులను వుంచి, బోధిసత్త్వునికి సమర్పించినాడు. ఆ మహాబ్రహ్మను అనుగ్రహించడంకోసం బోధిసత్త్వుడు వాటిని స్వీకరించి భుజించాడు. సర్వబోధిసత్త్వ లక్షణ పరిపూర్ణుడూ, చరమభవిక బోధిసత్త్వుడూ అయిన భగవానునికంటె ఇతర ప్రాణిసమూహంలో ఏ సత్వమున్నూ ఆ అమృత బిందువును అనుభవించనూ లేదు. అనుభవించి ఆరగించుకుని సుఖపడనూ లేదు. ఒకానొక కర్మవిపాకంవల్ల అది బోధిసత్త్వునికి లభించింది. పూర్వం దీర్ఘ రాత్రులు బోధిసత్త్వచర్యను ఆచరిస్తూ వుండినప్పుడు బోధిసత్త్వుడు రోగాలతో బాధపడిన ప్రాణులకు మందులు యిస్తూ వుండేవాడు. కోరికలు కోరేవారి కోరికలను తీరుస్తూ వుండేవాడు. శరణాగతులను ఎన్నడూ విడిచిపెట్టలేదు. నిత్యమూ, మొదట పూచిన పుష్పమూ,

తొలుత పండిన ఫలమూ, మొదట లభించిన రసమూ, తథాగతులకూ, తథాగత చైత్యాలకూ తథాగత శ్రావక సంఘాలకూ, తలిదండ్రులకూ మొదట యిచ్చి, తరువాత స్వీకరించేవాడు. అటువంటి కర్మయొక్క పరిపాకం వల్లనే బోధిసత్త్వునికి మహాబ్రహ్మ మధుబిందువును తెచ్చి యివ్వడం సంభవించినది.

ఆ కూటాగారంలో అతిక్రాంతానతిక్రాంతా లయిన మాయా గుణ రతి క్రీడా సమవసతల స్థానాలు ఉన్నవి. అవన్నీ బోధిసత్త్వుని పూర్వ కర్మపరిపాకంవల్ల కలిగినవే!

బోధిసత్త్వ పరిభోగమయిన ఆ రత్నవ్యూహంతో శత సహస్ర వ్యూహమనే వస్త్రద్వయం ఏర్పడి ఉన్నది. చరమభవికుడైన బోధిసత్త్వుని కంటే ఇతరులైన వారికి ఎవ్వరికీ అది లేదు. ఆ కూటాగారంలో కనుపించ నట్టి అత్యంతోదారాలైన రూప, శబ్ద, గంధ, రస, స్పర్శలు లేవు. ఆ కూటాగారపరిభోగం, లోపలి భాగంలోనూ, బయటనూ, బాగుగా పరి నిష్ఠితమై, మృదువై, కాచిలిందక సుఖస్పర్శ కలదై వున్నది. దానితో సమానమైనది ఎక్కడా లేదు.

మహాసత్త్వుడైన బోధిసత్త్వుడు పూర్వప్రణిధానంతో ధర్మమైన చేతనను మనుష్యలోకంలో ప్రవర్తింపజేయవలసి వున్నది. భవనంనుంచి అభినిష్క్రమణం చేసి, లోకోత్తరమయిన సమ్యక్సంబోధిని వెల్లడించి, ధర్మచక్రాన్ని నడుపవలసి వున్నది. అతడు తల్లిగర్భంలో ప్రవేశించి, జన్మించి ఇలా జరుపవలసి ఉన్నది. కనుకనే ఆ తల్లి గర్భంలో దక్షిణ భాగంలోనే మొదట రత్నవ్యూహమైన కూటాగారం సిద్ధంగా వుంది. అదేగదా బోధిసత్త్వుని ధర్మత. పూర్వప్రణిధానంతోనే ఈ చేతన. తర్వాతనే బోధిసత్త్వుడు తుషితులనుంచి భూమికి జారి, ఆ కూటాగారం లోని పర్యంకంపైని సుఖంగా కూర్చుండుట సంభవిస్తుంది. బోధి సత్త్వుని శరీరం సామాన్య మానవుల శరీరంలాగ కలలార్బుద పేశీరూపంలో అభివృద్ధి కాదు. సర్వాంగ, ప్రత్యంగ లక్షణాలతో కూడినదై, కూర్చుండి వున్న స్థితిలోనే ప్రాదుర్భవిస్తుంది. తర్వాతనే బోధిసత్త్వుని మాతృదేవి



అయిన మాయాదేవికి స్వప్నం వచ్చి మహాగజం తన గర్భంలో ప్రవేశించి నట్లు తెలుసుకున్నది.

బోధిసత్త్వుడు ఈ విధంగా తల్లిగర్భంలో కూర్చుని వుండగా, దేవతలకు ప్రభువైన ఇంద్రుడూ, నలుగురు మహారాజులూ, ఇరవైఎనమండు గురు మహాయక్ష సేనాపతులూ, గుహ్యకాధిపతి అయిన కుబేరుడూ, వజ్ర పాణి ఉత్పన్నమయిన యక్షకులమూ – వీరందరూ ఈ సమాచారాన్ని తెలుసుకుని, అందరూ ఎప్పుడూ గుమిగా కూడే అక్కడ వుండినారు. బోధిసత్త్వునికి దేవతలైన నలుగురు పరిచారికలు, ఉత్కలి, సముత్కలి, ధ్వజవతి, ప్రభావతి అనే పేర్లు గలవారు ఉన్నారు. వారున్నూ, బోధి సత్త్వుడు మాతృగర్భంలో ప్రవేశించిన సమాచారం తెలుసుకుని ఎల్ల ప్పుడూ అతనిని రక్షిస్తూనే ఉండినారు. దేవతలకు ప్రభువైన యింద్రుడు అయిదువందల దేవపుత్రులతో కూడా తల్లిగర్భంలో వున్న బోధిసత్త్వునికి సన్నిధానంలోనే వున్నాడు.

గాఢాంధకారబంధురమయిన రాత్రిలో పర్వతశిఖరంమీద అగ్ని పుంజం యోజనం దూరం కానవస్తూ వుంటుంది. యోజనం మాత్రమే కాదు. ఐదు యోజనాల దూరందాకా కానవస్తూ వుంటుంది. ఆ రీతిగానే మాతృగర్భంలో ఉన్న బోధిసత్త్వుని ఆత్మభావం మిక్కిలి ప్రకాశిస్తూ చాలాదూరం కానవస్తూ వున్నది. ఆ గర్భంలోని కూటాగారంలో పర్యంకం పైని కూరుమండిన బోధిసత్త్వుడు బంగారంపైని వైడూర్యాలు పొదిగి నట్లు మిక్కిలి ప్రకాశిస్తూ ఉన్నాడు. అతని మాతృదేవి కూడా గర్భస్థు డైన బోధిసత్త్వుని ధ్యానించి చూస్తూ వున్నది.

కారుమేఘాల చాటున తళుక్కుమనే మెరుపు విస్తారమయిన కాంతిని వ్యాపింపజేసిన విధంగా బోధిసత్త్వుడు మాతృదేవిగర్భంలోనే ఉంటూ, శోభచేతను, తేజస్సుచేతను, వర్ణంచేతను మొదటిదైన రత్న కూటాగారాన్ని ప్రకాశింపజేస్తూ వుండినాడు. తరువాత రెండవదయిన గంధకూటాగారాన్ని ప్రకాశింపజేసి, పిదప మూడవదైన రత్నకూటా గారాన్ని ప్రకాశింపజేస్తూ ఉండినాడు. ఇలా మూడవ రత్నకూటా గారాన్ని ప్రకాశింపజేసిన తరువాత తల్లి ఆత్మభావాన్ని అవభాసింపజేసి

సాడు. తర్వాత అతడు ఏ ఆసనంలో ఆసీనుడయినాడో, ఆ ఆసనం ప్రకాశింపజేసినాడు. పిదప ఆ గృహమంతా భాసింపజేసినాడు. అటుపిమ్మట గృహోపరిభాగంనుంచి బయలు వెడలివచ్చి మొదట తూర్పుదిక్కును ప్రకాశింపజేసినాడు. తర్వాత వరుసగా, దక్షిణ దిక్కునూ, పడమటి దిక్కునూ, ఉత్తరదిక్కునూ, క్రిందివైపునూ, ఊర్ధ్వదిక్కునూ ఈ రీతిగా పది దిక్కులనూ ఒక క్రోసు దూరంవరకూ ప్రకాశింపజేస్తూ ఉండినాడు.

ఓ భిక్షులారా, నలుగురు మహారాజులూ, ఇరవై ఎనమండుగురు మహా యక్ష సేనాపతులూ అయిదువందల యక్షులతో కూడా పూర్వాహ్ణకాల సమయంలో బోధిసత్త్వుణ్ణి దర్శించడానికీ, ఆయనను నమస్కరించడానికీ, అతనిని ధ్యానించడానికీ, ధర్మశ్రవణమునకున్నూ వచ్చినారు. అప్పుడు బోధిసత్త్వుడు వారి రాకను తెలుసుకొని కుడిచేతిని యెత్తి ఒక వ్రేలితో వారు కూర్చుండడానికి ఆసనాలను చూపినాడు. లోకపాలురు మొదలైన ఆ వచ్చినవా రందరున్నూ, జ్యేష్ఠానుక్రమంగా ఆయన చూపిన ఆసనాలపై కూర్చుండినారు. అప్పుడు తల్లి గర్భంలో వున్న బోధిసత్త్వుడు బంగారు విగ్రహంవలె ఉండినాడు. అతడు చేతిని ఎత్తి కదుపుతూ, దింపుతూ ఉండగా వారందరూ ప్రీతిప్రమోద ప్రసాదాలతో బోధిసత్త్వునికి నమస్కరించినారు. వారందరూ కూర్చున్నట్లు తెలుసుకున్న తరువాత బోధిసత్త్వుడు ధర్మమయిన కథలు ఉపదేశించసాగినాడు. వారికి సంతోషాన్నీ, ఉత్తేజాన్నీ కలిగించినాడు. వారు తనవద్ద సెలవు తీసుకుని వెళ్ళవలెనని అనుకున్నప్పుడు వారి అభిప్రాయాన్ని మనస్సుతోనే గ్రహించి, ఎడమ కాలిని ఎత్తి కొంచెం కదుపసాగినాడు. తర్వాత పరికించినాడు. అలా చెయ్యడంవల్ల తల్లికి ఏమాత్రం బాధ కలుగలేదు.

అప్పుడు నలుగురు మహారాజులున్నూ "బోధిసత్త్వుడు వెళ్ళిపోవడానికి మనకు అనుమతి యిచ్చాడు" అని అనుకున్నారు. వారు బోధిసత్త్వునికిన్నీ, అతని మాతృదేవికిన్నీ మూడుసార్లు ప్రదక్షిణంచేసి, బయలుదేరారు. రాత్రి గడచిపోగా, బోధిసత్త్వుడు కుడిచేతిని చాచి, వారిని పరికించసాగాడు. ఆ రీతిని పరికించి, ఆ చేతిని పూర్వస్థితిలో ఉంచే



వాడు. ఆ విధంగా తరువాత కూడా బోధిసత్త్వుని దర్శనార్థమై పలువురు వచ్చినారు. స్త్రీలూ, పురుషులూ, కుమారులూ, కుమారికలూ చాలామంది వస్తూ వుండినారు. వారందరినీ తొలుత బోధిసత్త్వుడు ఆనందపరుస్తూ వుండినాడు. తర్వాత అతని తల్లి సంతోషపరుస్తూ వుండినది.

ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు తల్లి గర్భంలో ఉంటూనే ప్రాణులకు సంతోషం కలిగిస్తూ, కుశలప్రశ్నలు చేసేవాడు. దేవతలుగాని, నాగులుగాని, యక్షులుగాని, మనుష్యులుగాని, అమనుష్యులుగాని, ఎవరు కూడా మొట్టమొదట బోధిసత్త్వుణ్ణి చూచి కుశలం అడగగలిగేవారు కారు. బోధిసత్త్వుడే మొదట ప్రతిసంబోధన చేసేవాడు. తరువాత బోధిసత్త్వుని మాత.

పూర్వాహ్ణకాల సమయం గడిచి, మధ్యాహ్నకాల సమయం రాగా, దేవతల ప్రభువయిన ఇంద్రుడు బయలుదేరి బోధిసత్త్వుని దర్శించడానికీ, నమస్కరించడానికీ, పూజించడానికీ వచ్చాడు. అతని వెంట త్రయత్రింశద్దేవతలూ, బయలుదేరి వచ్చారు. ఆ వస్తూవున్నవారిని దూరంనుంచే చూచి, బోధిసత్త్వుడు బంగారు చాయ గల కుడిచేతిని చాచి, ఇంద్రుణ్ణీ, ముప్ఫయిముగ్గురు దేవతలనూ ఆనందపరిచినాడు. కూర్చుండడానికి ఒక వ్రేలితో ఆసనాలను చూపినాడు. బోధిసత్త్వుని ఆజ్ఞను అతిక్రమించడానికి ఇంద్రుడికి సాధ్యం కాలేదు. అందువల్ల అతడు తనకు చూపిన ఆసనంపైని కూర్చున్నాడు. మిగిలిన దేవపుత్రులున్నూ తమ తమ ఆసనాలపైని కూర్చుండినారు. వా రందరూ కూర్చున్న పిదప, బోధిసత్త్వుడు ధర్మ్యములయిన మాటలతో పలుకరిస్తూ, వారికి సంతోషాన్నీ, ఉత్తేజాన్నీ కలిగించసాగినాడు. చేతి కదలికనుబట్టి బోధిసత్త్వుని మాతృదేవి ఆ వైపు తిరిగేది. అప్పుడు వారందరూ బోధిసత్త్వుడు తమతోకూడ ఆనందించాడని భావించారు. వారిలో ఒక్కొక్కడున్నూ తనతో బోధిసత్త్వుడు సంభాషిస్తున్నాడనీ, తన్నే సంతోషపెడుతున్నాడనీ అనుకునేవాడు.

ఆ కూటాగారంలో దేవతల ప్రభువయిన ఇంద్రుడిదీ, ముప్ఫయి ముగ్గురు దేవతలదీ ప్రతిభాసం కానబడుతూ వుండేది. కాని, మాతృగర్భంలో ఉన్న బోధిసత్త్వుని పరిభోగంవంటి పరిశుద్ధమయిన పరిభోగం మరి యెక్కడా కానరాలేదు. అతని కాంతిముందు వారి కాంతిపుంజం వెల వెలపోయేది. ఇంద్రుడూ, దేవతలూ తనవద్ద సెలవు తీసుకుని, వెళ్ళవలె నని మనస్సులోనే అనుకుంటూ వున్నప్పుడు బోధిసత్త్వుడు మనస్సులోనే వారి అభిప్రాయాన్ని తెలుసుకుని కుడిపాదాన్ని ఎత్తి కొంచెం కదప సాగినాడు. తిరిగి దాన్ని యథారీతిగా ఉంచినాడు. అలా చెయ్యడంవల్ల తల్లికి ఏమీ బాధ కలుగలేదు. అప్పుడు దేవతల ప్రభువయిన యింద్రుడున్నూ, మిగిలిన ముప్ఫయి ముగ్గురు దేవతలున్నూ "మనం వెళ్ళిపోవడానికి బోధిసత్త్వుడు అనుమతి యిచ్చాడు" అని అనుకున్నారు. వారు బోధిసత్త్వునికిన్నీ, అతని మాతృదేవికిన్నీ ముమ్మారు ప్రదక్షిణంచేసి బయలుదేరారు.

మధ్యాహ్నకాలం జరిగిపోయి, సాయాహ్నకాలం సమీపించగా సహాపతి అయిన బ్రహ్మ అనేక లక్షలకొద్దీ వున్న బ్రహ్మకాయులైన దేవపుత్రులతో సహా దివ్యమైన ఓజో బిందువును తీసుకుని, బోధిసత్త్వుణ్ణి దర్శించడానికీ, అతనికి నమస్కరించడానికీ, ధ్యానించడానికీ, అతని ధర్మశ్రవణం కోసమున్నూ బోధిసత్త్వుడు వున్నచోటికి వచ్చినాడు. వస్తున్న అతనిని చూచి, బోధిసత్త్వుడున్నూ బంగారుచాయ గల తన కుడిచేతిని చాచి, సహాపతి అయిన బ్రహ్మనూ, అనేక లక్షలకొద్దీ వున్న బ్రహ్మకాయిక దేవపుత్రులనూ ఆనందపరిచినాడు. కూర్చుండడానికై వ్రేలితో ఆసనాలను చూపినాడు. బోధిసత్త్వుని ఆజ్ఞను తిరస్కరించడానికి సహాపతి అయిన బ్రహ్మకు సాధ్యం కాలేదు. అతనికి ఆశక్తి లేదు. ఆ బ్రహ్మ, మిగిలిన బ్రహ్మకాయికులైన దేవపుత్రులున్నూ తమకు నిర్దేశించబడిన ఆసనాలపై కూర్చున్నారు. వారందరూ కూర్చున్న తర్వాత బోధిసత్త్వుడు ధర్మ్యమయిన చూపుతో చూస్తూ, వారికి సంతోషాన్నీ, ఉత్తేజాన్నీ కలిగించసాగినాడు. చేతిని కదిలించసాగినాడు. బోధిసత్త్వుడు ఎటు వైపు చేతిని కదిలిస్తాడో, మాయాదేవి ఆ వైపు



తిరిగేది. అప్పుడు వారిలో ప్రతివారూ "బోధిసత్త్వుడు తనతోనే సంభాషిస్తున్నాడు" అని అనుకోసాగినారు.

సహాపతి అయిన బ్రహ్మ, యితరులైన బ్రహ్మకాయిక దేవపుత్రులూ తనవద్ద సెలవు తీసుకుని, వెళ్ళవలెనని మనస్సులోనే అనుకుంటూ వున్నప్పుడు బోధిసత్త్వుడు మనస్సులోనే వారి అభిప్రాయాన్ని తెలుసుకుని, కుడిపాదాన్ని ఎత్తి, కొంచెం కదిలించాడు. తిరిగి దాన్ని యథారీతిగా ఉంచినాడు. ఇలా చెయ్యడంవల్ల తల్లికి ఏమీ బాధ కలుగలేదు. అది చూచి సహాపతి అయిన బ్రహ్మ, బ్రహ్మకాయికు లయిన దేవపుత్రులూ "మనం సెలవు తీసుకోనడానికి బోధిసత్త్వుడు అనుమతిని ఇచ్చాడు" అని అనుకున్నారు. వారు బోధిసత్త్వునికిన్నీ, అతని మాతృదేవికిన్నీ మూడుసార్లు ప్రదక్షిణంచేసి బయలుదేరి వెళ్ళినారు.

తరువాత తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరం అనే నాలుగు దిక్కులనుంచిన్నీ, క్రిందినుంచీ, పైనుంచీ, పదివైపులనుంచిన్నీ లక్షలకొద్దీ బోధిసత్త్వులు బోధిసత్త్వుని దర్శనానికిన్నీ, అతనిని నమస్కరించడానికిన్నీ, ధ్యానించడానికిన్నీ, అతనినుండి ధర్మాన్ని వినడానికిన్నీ వచ్చారు. వారు వస్తూ వుండగా, బోధిసత్త్వుడు తన శరీరాన్నుంచి కాంతిని వెడలజేసి, ప్రభావ్యూహాలైన సింహాసనాలను నిర్మించాడు. ఆ రీతిని నిర్మించి, వాటిపై బోధిసత్త్వులను కూర్చుండజేశాడు. వారు కూర్చున్న తరువాత వారి యోగక్షేమాలను ప్రశ్నించాడు. మహాయానుడయిన ఆ బోధిసత్త్వుని కాంతి విస్తరవిభాగంలో వున్నందున అక్కడ వున్న దేవపుత్రులు తప్ప యితరులు ఎవ్వరూ వారిని చూడలేదు. బోధిసత్త్వుడు రాత్రి గడచిన తరువాత స్వశరీరాన్నుంచి తేజస్సును బయటకు వ్యాపింపజేయడమే దీనికి కారణం.

మాయాదేవికి బోధిసత్త్వుడున్న గర్భభాగం పెద్దగా గానీ, బరువుగాగానీ, తోచలేదు. తక్కిన భాగంలాగా, చాలా తేలికగా ఉండినది. అది మృదువుగాను, సౌఖ్యకరంగాను ఉన్నది. గర్భగతాలైన కష్టాలేవీ కలుగలేదు. రాగంవల్లగానీ, ద్వేషంవల్లగానీ, మోహంవల్లగానీ

ఆమెకు ఎట్టి తాపమూ కలుగలేదు. కామాన్ని గురించిన ఆలోచనగానీ, ద్రోహచింతగానీ, హింసించే ఆలోచన గానీ ఆమెకు కలుగలేదు. చలిని గానీ, తాపాన్ని గానీ, ఆకలి దప్పికలనుగానీ, రజోగుణాన్ని గానీ, తమోగుణాన్ని గానీ, శ్రమను గానీ ఆమె ఎరుగదు. చూడనూ లేదు. ఆమెకు అయిష్టమయిన రూప, శబ్ద, గంధ, రస స్పర్శలు కనుపించలేదు. చెడ్డ కలలు రాలేదు. స్త్రీ మాయగానీ, శఠత్వంగానీ, ఈర్ష్యగానీ, స్త్రీల కష్టాలుగానీ, ఆమెను బాధించలేదు. ఆ సమయంలో బోధిసత్త్వుని తల్లి పంచశిక్షాపదాలను పొంది, శీలవతియై దశ కుశల కర్మమార్గంలో ఉండినది. ఆమెకు ఏ పురుషునియందున్నూ రాగబుద్ధి కలుగలేదు. ఆమె సమీపంలో ఏ పురుషుడికీ కూడా రాగబుద్ధి కలుగలేదు. కపిలవస్తు మహానగరంలో కానీ, ఆ ప్రాంతంలోని పల్లెలలో గానీ ఉండే స్త్రీ పురుషులూ, బాల బాలికలూ, నాగ, యక్ష, గంధర్వ, అసుర, గరుడ, భూతాలచే అవిష్టులై వున్నట్లయితే, మాయాదేవిని చూడగానే ఆ భూతాలు వదిలిపోయి, వారు నెమ్మదిగా అయ్యేవారు. ఆ భూతాదులు వెంటనే భయపడి పారిపోయేవి. అనేక విధాలయిన రోగాలతో బాధ పడుతూ వుండేవారు—వాత, పిత్త, శ్లేష్మాల సన్నిపాతంవల్ల కలిగే రోగాలతోనూ, కన్ను, ముక్కు, చెవి, జిహ్వ, పెదవులు, దంతాలు, కంఠం మున్నగువాటికి కలిగే రోగాలతోనూ, గలగండం, ఉరగండం, కుష్ఠు, బొల్లి, శోఫ, ఉన్మాదం, మతిభ్రమణ, జ్వరం, గలగండపిటకం, చప్పి, (విసర్ప విచర్చికాది) చర్మరోగాలు మొదలైన రోగాలతో బాధ పడేవారు - మాయాదేవి వారి తలమీద కుడిచేతిని ఉంచినంతమాత్రాన రోగాలు నశించి, సంతోషంతో తమ తమ యిళ్ళకు పోతూ వుండేవారు. చివరకు ఆమె నేలమీద పడ్డ గడ్డిపోచ తీసి బాధపడిన ప్రాణులకు యిచ్చేది. దాన్ని స్వీకరించగానే, అవి, రోగాలు నశించి, సుఖపడేవి. మాయాదేవి తన గర్భంలోని దక్షిణపార్శ్వాన్ని పరిశీలించినప్పుడు బోధిసత్త్వుడు గర్భంలో ఉన్నట్లు చూచేది. సుపరిశుద్ధమయిన అద్దంలో ముఖమండలం స్పష్టంగా కనబడేటట్లు కనబడేవాడు! చూచి చాలా సంతోషించేది. ఆమెకు ఎంతో ప్రీతి, సౌమనస్యం కలిగేవి.



బోధిసత్త్వుడు తల్లిగర్భంలో ప్రవేశించగా రాత్రింబగళ్ళు ఎడతెగకుండా దివ్యాలయిన తూర్యధ్వనులు మ్రోగుతూ వుండినవి. దివ్యాలైన పుష్పాలు వర్షంవలె కురుస్తూ ఉండినవి. సరియైన కాలంలో దేవతలు వర్షాలు కురిపించేవారు. తగిన సమయాలలో వాయువులు వీచేవి. ఋతువులున్నూ, నక్షత్రాలున్నూ, ఆ యా కాలాలకు తగినట్లు జరుగుతూ వుండేవి. రాజ్యం సుభిక్షంగానూ, క్షేమంగానూ, ఎట్టి కలతలూ లేకుండానూ ఉండినది. కపిలవస్తు మహానగరంలో వున్న శాక్యులూ, ఇతర జనులందరూ అన్నపానాలకు లోటులేకుండా వినోదంగానూ, సంతోషంగానూ ఉండినారు. అంతే కాదు. ఇతరులకు దానాలు యిస్తూ వుండేవారు. పుణ్యకార్యాలు చేస్తూ వుండేవారు. శరత్కాలంలోని చాతుర్మాస్యంలో వెన్నెలలో వలెనే విహరిస్తూ వుండేవారు. రాజైన శుద్ధోదనుడు, బ్రహ్మచర్య దీక్షను వహించి, రాజ్య కార్యకలాపాలను విడిచి, పరిశుద్ధుడై, తపోవనంలో నివసిస్తూ వున్నవారివలెనే ధర్మనిమగ్నుడై వుండేవాడు.

ఈ విధంగా సకల సమృద్ధులతోనూ కూడి బోధిసత్త్వుడు తల్లి గర్భంలో ఉండినాడు. అప్పుడు భగవానుడయిన బోధిసత్త్వుడు ఆయుష్మంతుడయిన ఆనందుని పిలిచి "పూర్వం బోధిసత్త్వుడు మాతృగర్భంలో ఉండినప్పుడు బోధిసత్త్వ పరిభోగమయిన రత్నవ్యూహం ఉండినది కదా! దానిని చూస్తావా?" అని పలికినాడు. ఆనందుడు "భగవన్! తప్పక చూస్తాను. సుగత! తప్పక చూస్తాను" అని సమాధానం చెప్పినాడు. అప్పుడు సుగతుడు (బోధిసత్త్వుడు) ఆనందునికీ, దేవతల ప్రభువయిన ఇంద్రునికీ, నలుగురు లోకపాలకులకూ, తదితరులైన దేవతలకూ, మనుష్యులకూ కూడా దానిని చూపినాడు. దాన్ని చూచి వారంతా సంతోషించారు. వారికి ఎంతో ఆసక్తీ, సంప్రీతీ, సౌమనస్యమూ కలిగాయి. సహాపతి అయిన బ్రహ్మ దానిని తిరిగి చైత్యం కోసమై బ్రహ్మలోకంలో భద్రంగా ప్రతిష్ఠించినాడు.

అప్పుడు భగవానుడు భిక్షువులను మరల ఉద్బోధించినాడు: "భిక్షువులారా, ఈ విధంగా పది మాసాలు మాతృగర్భంలో ఉండిన

బోధిసత్త్వుడు ఈ విధంగా మూడు లక్షల అరవై వేలమంది దేవతలనూ, మానవులనూ, మూడు యానాలతోను పరిపాకం పొందించాడు.”

ఇక్కడ ఈ సంగ్రహ గాథలను చూడవచ్చు.

యద్బోధిసత్త్వ అగ్రసత్త్వ మాతుకుక్షి సంస్థితః
ప్రకమ్పితా చ షడ్వికార మేదినీ సకాననా,
సువర్ణవర్ణ అభముక్తా సర్వాపాయ శోధితా
ప్రహర్షితాశ్చ దేవసంఘ ధర్మ మఞ్జు భేష్యతే.

సుసంస్థితో మహావిమాను నైకరత్న చిత్రితో
యత్ర వీరు ఆరుహిత్వ తిష్ఠతే వినాయకః,
గన్ధోత్తమేన చన్దనేన పూరితో విరాజతే
యస్యైకకర్ష త్రిసహస్ర మూల్య రత్నపూరితా.

మహాసహస్ర లోకధాతు హేష్విభిన్ది యిల్వాలా
ఉదాగతో గుణాకరస్య పద్మఓజ బిన్దుకో,
సో సప్తరాత్ర పుణ్యతేజ బ్రహ్మలోకి ఉద్గతో
గృహీత్వ బ్రహ్మ ఓజబిన్దు బోధిసత్త్వనామయీ.

న అస్తి సర్వ సత్త్వకాయి భుక్తయో జరేయ తం
అన్యత్ర భూరి బోధిసత్త్వ బ్రహ్మకల్ప సన్నిభే,
అనేక కల్ప పుణ్యతేజ ఓజబిందు సంస్థితో
భుజిత్వ సత్త్వ కాయచిత్త జ్ఞాన శుద్ధ గచ్ఛిషు.

శక్ర బ్రహ్మ లోకపాల పూజనాయ నాయకం
త్రీణి కాల ఆగమిత్వ బోధిసత్త్వ అంతికం,
వన్దయిత్వ పూజయిత్వ ధర్మ శ్రుణుతే వరం
ప్రదక్షిణం కరిత్వ సర్వ గచ్ఛిషూ యథాగతా.



బోధిసత్త్వ ధర్మ కామ ఏన్తి లోక ధాతుషు
ప్రభావియూహ ఆసనేషు తే నిషణ్ణదృశ్యిషు,
పరస్పరం చ శ్రుత్వ ధర్మ యానశ్రేష్ఠ ముత్తమం
ప్రయాన్తి సర్వి హృష్టచిత్త వర్ణమాల భాషతో.

యే చ ఇష్టదారకాసు దుఃఖితా తథా అభూత్
భూతస్పృష్టక్షిప్తచిత్త నగ్నప్రాంశు మ్రక్షితా,
తేచ సర్వ దృష్టు మాయ భోన్తి లబ్ధచేతనా
స్మృతీ మతీ గతీ ఉపేత గేహి గేహి గచ్ఛిషు.

వాతతో వా పిత్తతో వా శ్లేష్మసంనిపాతకైః
యే చ చక్షు శ్రోత్రరోగకాయ చిత్తపీడితా,
నైకరూపనైకజాతి వ్యాధిభిశ్చ యే హతాః
స్థాపితే స్మ మాయ మూర్ధ్ని పాణి భోన్తి నిర్జరా.

అథాపి వా తృణస్య తూలి భూమితో గృహీత్వనా
దదాతి మాయ ఆతురాణ సర్వి భోన్తి నిర్జరా,
సౌఖ్యప్రాప్తి నిర్వికార గేహిగేహి గచ్ఛిషు
భైషజ్యభూతి వైద్యరాజ కుక్షి సంప్రతిష్ఠతే.

యస్మి కాలి మాయదేవి స్వాతనుం నిరీక్షతే
అదృశాతి బోధిసత్త్వ కుక్షియే ప్రతిష్ఠితం,
యథైవ చన్ద్రి అన్తరీక్ష తారకై పరివృతం
తథైవ నాథు బోధిసత్త్వ లక్షణైరలంకృతం.

నో చ తస్య రాగదోష నైవ మోహ బాధతే,
కామఛన్దు నైవ తస్య ఈర్షి నైవ హింసితా,

తుష్టచిత్త హృష్టచిత్త ప్రీతి సౌమనస్థితా
క్షుధా పిపాస శీత ఉష్ణ నైవ తస్య బాధతే.

ఆఘట్టితాశ్చ నిత్య కాల దివ్య తూర్య వాదిషు
ప్రవర్షయన్తి దివ్యపుష్ప గన్ధ శ్రేష్ఠ శోభనా,
దేవ పశ్యి మానుషాశ్చ మానుషా అమానుషా
నో విహేఠి నో విహింసి తత్ర తే పరస్పరం.

రమన్తి సత్త్వ క్రీడయన్తి అన్నపాన దేన్తి చ
ఆనన్దశబ్ద ఘోషయన్తి హృష్ట తుష్ట మానసాః,
క్షుమా రజో అనాకులా చ కాలి దేవ వర్ష తే
తృణాశ్చ పుష్ప ఓషధీయ తస్మి కాలి రోహిషు.

రాజగేహి సప్తరాత్ర రత్నవర్ష వర్షితో
యతో దరిద్ర సత్త్వ గృహ్య దాన దేన్తి భుంజతే,
నాస్తి సత్త్వ యో దరిద్ర యో చ అసి దుఃఖితో
మేరు మూర్ధ్ని నన్దనేవ ఏవ సత్త్వనన్దిషు.

సో చ రాజు శాకియాన పోషధీ ఉపోషితో
రాజ్యకార్య నో కరోతి ధర్మమేవ గోచరీ,
తపోవనం చ సోప్రనిష్ట మాయదేవి పృచ్ఛతే
కీదృశేన్తి కాయిసౌఖ్య అగ్రసత్త్వ ధారతి.

వీని అభిప్రాయం యిది:— ప్రాణులలో ఉత్తమోత్తముడైన బోధిసత్త్వుడు తల్లిగర్భంలో ప్రవేశించగా, సకానన అయిన భూమి ఆరు విధాలుగా కంపించినది. సమస్తాపాయాలూ తొలగిపోయి కాంతి వ్యాపించినది. ధర్మఖని అవతరిస్తున్నాడని తెలుసుకొని దేవతందరూ మిక్కిలి సంతోషించారు. అనేక రత్నాలతో చిత్రితమై ఉన్న మహా



విమానాన్ని వీరుడైన వినాయకుడు (సుగతుడు) అధిష్ఠించాడు. అది మంచి పరిమళంతో కూడిన చందనంతో ప్రకాశిస్తూ వున్నది. ఆ చందనం కర్ష ప్రమాణమూ కూడా మూడువేల రత్నాల విలువ గలది. అప్పుడు అనేక సహస్రాలుగా ఉండే లోకధాతువయిన భూమిని వేధించుకొని ఒక పద్మం మొలిచి బ్రహ్మలోక పర్యంతం వ్యాపించినది. అది ఆరు రాత్రులలో బోధిసత్త్వుడు చేసిన పుణ్యాల తేజమయిన ఓజో బిందువుతో నిండినది. ఆ బిందువును బ్రహ్మ గ్రహించి బోధిసత్త్వునికి సమర్పించాడు. బ్రహ్మను, దేవుడితో సమానుడైన ఆ బోధిసత్త్వుని విడిచి, ప్రాణులలో మరియెవ్వరూ ఆ మధుబిందువును భుజించి అరిగించుకోలేరు. అనేక కల్పాలలో చేసిన పుణ్యంవల్లనే ఆ మధుబిందువు బోధిసత్త్వునికి లభించింది. దాన్ని భుజించి శరీరమునూ, మనస్సునూ ఆయన పరిశుద్ధం చేసుకున్నాడు. నాయకుడైన బోధిసత్త్వుని గౌరవించడానికి ఇంద్రుడున్నూ, బ్రహ్మయున్నూ, లోకపాలకులున్నూ త్రికాలాలలోనూ అతని దగ్గరకు వచ్చి నమస్కరించి, పూజచేసి ధర్మాన్ని విన్నారు. అతనికి ప్రదక్షిణం చేసి తిరిగి వెళ్లిపోయారు. బోధిసత్త్వుడు ధర్మాన్ని కోరుతూ సమస్త లోక ధాతువులలోనూ_ కాంతివ్యూహంలోనూ ఆసనాలు కల్పించాడు. ఇంద్రుడు, బ్రహ్మ మున్నగువారు అందరూ ఆ ఆసనాలపై కూర్చుని అతనివల్ల బోధను విని మిక్కిలి సంతుష్టులై, అతన్ని ప్రశంసిస్తూ వెళ్లిపోయినారు. పెద్దలైనా, పిన్నలైనా సరే_ దుఃఖాలతో కూడినవారూ, భూతం పట్టినవారూ, క్లిష్టమైన మనస్సుఉన్నవారూ, మాయాదేవి చూచిన వెంటనే వారందరూ బాధలు పోయి స్మృతినీ, గతినీ పొంది సంతోషంతో తమ తమ గృహాలకు వెళ్లిపోయేవారు. వాత, పిత్త, శ్లేష్మాలతోనూ, వాటి సన్నిపాతంవల్ల కలిగే రోగాలతోనూ, కన్ను, చెవి మున్నగువానికి కల్గిన బాధలతోనూ, చర్మచిత్త రోగాలతోనూ_ ఇలా అనేక విధాల రోగాలతో బాధపడేవారందరూ మాయాదేవి చేతితో తలను తాకినంత మాత్రాన రోగం నశించినవారవుతున్నారు. మాయాదేవి భూమిమీదనుంచి ఒక గడ్డిపోచను తీసి యిస్తే దాన్ని గ్రహించినవారందరూ రోగం లేనివారు అవుతున్నారు. నిర్వికారులై సౌఖ్యాన్ని పొంది తమ తమ గృహాలకు వెళ్లిపోతున్నారు. ఆత్రాణమే గొప్ప మందు. ఆమెగర్భంలో వున్న బోధిసత్త్వుడే వైద్యరాజు.

మాయాదేవి తనశరీరాన్ని చూచుకొన్నప్పుడు గర్భంలోవున్న బోధిసత్త్వుడు కనబడేవాడు. అంతరిక్షంలో చుక్కలతో కూడిన చంద్రుడివలెనే సర్వలక్షణాలతోనూ కూడిన నాథుడైన బోధిసత్త్వుడు కనబడేవాడు. రాగమూ, దోషమూ, మోహమూ ఆమెను బాధించలేదు. కామంపైనీ, హింసపైనీ ఆమెకు బుద్ధిలేదు. అసూయ కలగలేదు. సంతుష్టమైన మనస్సు కలిగి ప్రీతి సౌమనస్యాలతో ఉండినది. ఆకలిదప్పులూ, శీతోష్ణాలూ ఆమెను బాధించలేదు. ఎల్లప్పుడూ దివ్య తూర్యవాదిత్రాలు ఎవ్వరూ వాయించకనే తమంతట తామే మ్రోగుతూ వుండినవి. సువాసనతో కూడిన దివ్యపుష్పాలు వర్షిస్తూ వుండినవి. మాయాదేవిని చూడడానికి దేవతలూ, మనుష్యులూ, అసురులూ వచ్చేవారు. వారు పరస్పరం హింసించుకోలేదు. అపాయం తలపెట్టలేదు. ప్రాణులు మనస్సులో తుష్టినీ, ఆనందాన్నీ పొంది ఆటలాడుతూ వినోదిస్తూ ఇతరులకు అన్నపానాలు దానం చేసేవారు. శాంతి కల్గి రజోగుణం, కలతపాటు లేక వుండేవారు. వర్షాలు సకాలంలో వర్షించేవి. ఓషధులూ, పుష్పాలూ, తృణ విశేషాలూ సకాలంలో వృద్ధిగా వుండేవి. రాజగృహంలో ఏడురాత్రులు రత్నవర్షం కురిసింది. దరిద్రులైన వారు ఆ రత్నాలు గ్రహించి, ఇతరులకు ఇచ్చి తాము సుఖం అనుభవించేవారు. దుఃఖితులూ, దరిద్రులూ లేరు. మేరువుమీద ఉన్నట్లు అందరూ ఆనందించారు. శాక్యరాజైన శుద్ధోదనుడు పోషధ వ్రతంతో, ఉపవాస నియమంతో రాజ్యకార్యాలు విడిచి, ధర్మాన్నే ఆచరిస్తూ వుండినాడు. తపోవనంలో వున్నట్లే వుండినాడు. బోధిసత్త్వుణ్ణి గర్భంలో ధరించివున్న మాయాదేవిని, ఆమె శరీరసౌఖ్యాన్ని గురించి ప్రశ్నించి, తెలుసుకుంటూ వుండేవాడు.

ఇది లలిత విస్తరంలో గర్భావక్రాంతి పరివర్తం అనే
ఆరవ అధ్యాయం.

# 7. జన్మ పరివర్తం

భిక్షువులారా, ఈ విధంగా పది నెలలు గడవగా బోధిసత్త్వునికి జనన సమయం సంప్రాప్తమయింది. అప్పుడు రాజయిన శుద్ధోదనుని గృహోద్యానంలో ముప్ఫయిరెండు పూర్వనిమిత్తాలూ ప్రాదుర్భవించాయి. అవి ఏవంటే—అన్ని పుష్పాలూ ఒక్కసారిగా పూయలేదు. కొలనులలో వివిధాలైన తామరలూ, కలువలూ మొగ్గలుగానే వుండి పుష్పించలేదు. అప్పుడు పూలచెట్లూ, పండ్లచెట్లూ భూమినుంచి మొలిచినవన్నీ పసరు మొగ్గలు, కసుగాయలు గలవై పుష్పించడంగాని, ఫలించడంగాని లేదు. ఎనిమిది రత్నవృక్షాలు ప్రాదుర్భవించాయి. ఇరవైలక్షల రత్న నిధానాలు ఆవిర్భవించాయి. అంతఃపురంలో రత్నాంకురాలు ఆవిర్భవించాయి. సుగంధతైలాల వాసన వ్యాప్తమయిన శీతోష్ణగంధోదకాలు ప్రవహించాయి. హిమవత్పర్వతపు చరియలనుంచి సింహపుపిల్లలు ఆనందంతో గంతులిడుతూ వచ్చి కపిలవస్తునగరానికి ప్రదక్షిణంచేసి ద్వారప్రాంతాలలో ఉంటున్నవి. అవి ఏప్రాణినీ బాధించలేదు. తెల్లని ఏనుగుపిల్లలు అయిదువందలు వచ్చి తమ తొండాల చివరలతో శుద్ధోదనమహారాజు పాదాలను రాస్తూ ఉన్నవి. మొలనూలు ధరించిన దేవపుత్రులైన బాలకులు శుద్ధోదనుని అంతఃపురంలో ఒకరి తొడలను ఒకరు రాసుకుని తిరుగుతూ వుండినారు. గగనతలంలో సగం శరీరం కనబడుతూ ఉండేరీతిగా నిలిచి, నాగకన్యలు అనేకవిధాల పూజాద్రవ్యాలు తీసుకొని వచ్చి, వానిని జాగ్రతగా పట్టుకొని వుండినారు. పదివేలమంది నాగకన్యకలు మయూరాంగ హస్తకాలు (నెమలపురి వీవనలు) గ్రహించి ఆకాశంలో నిలిచి వుండినారు. పదివేలమంది నాగకన్యలు పూర్ణకుంభాలు పట్టుకొని కపిలవస్తు మహానగరానికి ప్రదక్షిణంచేస్తూ వున్నట్టు కనిపించింది. పదివేలమంది దేవకన్యలు గంధోదకాలు నింపిన పాత్రలను తలపైని ధరించి వుండినట్టు కనిపించింది. మరి పదివేలమంది ఛత్రాలనూ, ధ్వజపతాకలనూ పట్టుకొని వుండినారు. అనేకలక్షల దేవతలు శంఖ, భేరీ, మృదంగ, పణ

వాలు, గంటలు పట్టుకొని మ్రోగించడానికి తగిన సమయాన్ని నిరీక్షిస్తూ వుండినారు. వాయువులన్నీ కదలికలేక స్తంభించి వుండినవి. నదులూ, వాగులూ ప్రవహించడం లేదు. సూర్య, చంద్రుల విమానాలూ, గ్రహాలూ, నక్షత్రాలూ ప్రకాశించలేదు. పుష్య నక్షత్రం వచ్చినది. రాజైన శుద్ధోదనుని గృహం రత్నాలతో నిండిపోయినది. అగ్ని జ్వలించలేదు. కూటాగారాలలోనూ, మేడలలోనూ, తోరణద్వార ప్రదేశాలలోనూ మణులూ, రత్నాలూ వ్రేలాడుతూ వున్నట్టు కనిపించింది. దూష్యమైన అంగడి వీథులు, వివిధరత్నవిపణులు మూసుకొనిపోయాయి. కాకి, గుడ్లగూబ, గద్ద, తోడేలు, నక్కల అరపులు వినరాలేదు. 'సుజాత, జాత, జాత' అన్న శబ్దాలే వినబడసాగినవి. అన్ని జనపద ప్రాంతాల్లోనూ పనులు నిలిచిపోయాయి. ఎత్తు, పల్లాలుగా వుండిన భూప్రదేశాలు సమతలాలుగా మారిపోయినవి. వీథులూ, చతుష్పథాలూ, బాటలూ, అంగళ్ళూ మొదలైనవి చేతులతో తుడిచినట్లు పరిశుభ్రంగా వుండినవి. వాటిమీద దట్టంగా పుష్పాలు చల్లినట్టు ఎంతో ప్రకాశిస్తూ వున్నవి. గర్భవతులైన స్త్రీలందరూ సుఖంగా ప్రసవించారు. సమస్త శాల వన దేవతలున్నూ ఆకులతో సగం శరీరాన్ని కప్పుకుని వంగి వుండినట్లు కానవచ్చినారు. ఈ రీతిగా ముప్పయిరెండు పూర్వనిమిత్తాలూ కానవచ్చినవి.

అప్పుడు మాయాదేవి, బోధిసత్త్వుడు జన్మించే సమయం వచ్చిందని తెలుసుకొని, బోధిసత్త్వుని తేజోఽనుభావంతో రాత్రి మొదటిజాములో రాజైన శుద్ధోదనునివద్దకు వెళ్ళి యీ గాథలను పలికింది.

"దేవ శ్రుణుహి మహ్యాం భావతోఽయం మతం మే
అచిర-చిర-చిరేణా జాత ఉద్యానబుద్ధిః,
యది చ తవ న రోషో నైవ దోషో న మోహః
క్షిప్ర మహు వ్రజేయం క్రీడ ఉద్యానభూమిం.

త్వమిహ తపసి ఖిన్నో ధర్మచిత్తప్రయుక్తో
అహు చ చిరప్రవిష్టా శుద్ధసత్త్వం ధరేస్తీ,



ద్రుమవరప్రవిబుద్ధాః ఫుల్లితాః శాలవృక్షాః
యుక్త భవియ దేవా గన్తు ముద్యానభూమిం.

ఋతుప్రవరవసన్తో యోషితాం మణ్డనీయో
భ్రమరవరవిఘుష్టా కోకిల బర్హి గీతాః,
శ్రుతి రుచిర విచిత్రా భ్రామ్యతే పుష్పరేణుః
సాధు దదహి ఆజ్ఞాం గచ్ఛమో మా విలమ్బః."

ఈ గాథల అభిప్రాయం ఇది: "దేవా! నా యీ ప్రార్థనను విను. ఉద్యానంలో విహరించాలనే బుద్ధి చిరకాలంగా నాకు కలిగినది. నీకు రోషంగాని, దోషంగాని, మోహంగాని లేకపోతే, త్వరలోనే నేను ఉద్యానవనంలో విహరించడానికి వెళ్లుతాను. నీ విప్పుడు తపోనియమంలో వుండి ధర్మంలోనే మనస్సు వుంచి శాంతుడవై వున్నావు. నేనూ చిరకాలంగా శుద్ధసత్త్వం వహించి వున్నాను. చక్కని వృక్షాలతోనూ, విరియబూసిన మద్దిచెట్లతోనూ ఉద్యానవనం మనోహరంగా ఉంటున్నది. అక్కడికి వెళ్ళాలని మనస్సవుతూ వుంది. ఋతువుల్లో ఉత్తమమైనది వసంతం! అది యువతులకు ఆనందకరం! తుమ్మెదలూ, కోకిలలూ, నెమిళ్ళూ మనోహరంగా చెవులకు ఇంపుగా ధ్వనిచేస్తూ ఉంటాయి. చిత్రమైన రంగు రంగుల పుప్పొడి అంతటా వ్యాపిస్తూ వుంటుంది. నేను అక్కడికి వెళ్ళుతాను. సాధో! ఆలస్యం చెయ్యక ఆజ్ఞ ఇయ్యి."

పార్థివేంద్రుడు రాణి పలికిన యీ మాటలు విని, సంతోషించిన మనస్సు కలవాడై తృప్తిపడి, పారిషదులతో ఇలా గాథలతో అన్నాడు:

"ఓ పారిషదులారా! మీరు ప్రవర గుణ సమృద్ధమయిన లుంబినీ వనాన్ని చక్కగా అలంకరించండి. గుర్రాలనూ, ఏనుగులనూ సిద్ధపరచండి. రథాలకు తగిన వాహనాలను కట్టండి. మేఘచ్ఛాయ కలవీ, నల్లని కొండలవలె ఉన్నవీ అయిన ఇరవైవేల ఏనుగులను సిద్ధం చెయ్యండి. అవి ఆరేసి దంతాలుకలవై వుండాలి. వాటికి పార్శ్వాలలో గంటలు వ్రేలా

డుతూ వుండాలి. మణులతోనూ, హేమజలాలతోనూ వాటిని చక్కగా అలంకరించాలి. మంచువలె, వెండివలె తెల్లగా వున్నవీ, ముంజ గడ్డివంటి చక్కని జూలు కలవీ అయిన ఇరవై వేల గుర్రాలను సిద్ధం చెయ్యండి. వాటి పార్శ్వాలను బంగారంతో అలంకరించి, చిరుగంటలు వ్రేలాడుతూ ఉండేటట్లు చెయ్యండి. అవి వాయువేగం కలవై ఉండాలి. యుద్ధ విద్యలలో ఆరితేరినవారూ, మహాశూరులూ అయిన ఇరవై వేలమంది వీరులను విల్లమ్ములూ, శక్తీ, పాశమూ, కత్తీ మున్నగు ఆయుధాలతో శీఘ్రంగా సిద్ధంచేయించండి. వారు పరివారంతో సహా వెళ్ళే మాయాదేవికి రక్షకులై అప్రమత్తులుగా వుండాలి! లుంబినీవనంలో మణులనూ, బంగారాన్నీ చల్లండి. చెట్లను వస్త్రాలతోనూ, మణులతోనూ అలంకరించండి. ఇలా వివిధ కుసుమ చిత్రమైన ఆ వనం, దేవతల నందనవనమా అన్నట్లుగా చేసి త్వరగా నాకు చెప్పండి.''

రాజు చెప్పివ యీ మాటలను శ్రద్ధగా విని పారిషదు లందరూ క్షణంలో ఆ యా ఏర్పాట్లు జరిపించారు. లుంబినీవనాన్ని చక్కగా అలంకరించారు. అలంకరించి రాజుతో ఇలా విన్నవించారు.

``జయము, జయము మహారాజా! నీకు దీర్ఘాయువు కలుగుగాక! రాజ్యాన్ని చిరకాలం పాలింతువుగాక! ప్రభువులు చెప్పినట్లు సమస్తం జరిగించాము. దేవర చిత్తగించవచ్చును.''

రాజేంద్రుడైన శుద్ధోదనుడు చాల సంతోషించి, భవనంలోపలికి వెళ్ళి మాయాదేవికి ఇష్టురాండ్రైన చెలికత్తెలతో ఇలా అన్నాడు:

``నేను ఎక్కువగా ప్రేమిస్తున్నదీ, నన్ను ప్రేమిస్తున్నదీ అయిన మీ యజమానురాలైన మాయాదేవి తన అభిప్రాయం తెలిపి వెంటనే నన్ను ఆజ్ఞాపించవచ్చును. అంతరంగం రజింపజేసే పరిమళిస్తున్న మైపూతలు పూసుకుని, మనోజ్ఞాలూ, మృదువులూ అయిన వస్త్రాలు ధరించి రొమ్ములపై ముత్యాలహారాలు వేసుకుని, ఇంకా చక్కని ఆభరణాలు ధరించి, మీరందరూ దేవకన్యల్లాగా ఎంతో అందంగా కనబడాలి. వీణ, వేణువు, ముకుండం, మృదంగం, తుణం, పణవం మొదలయిన



వాద్యాలూ, లక్షలకొద్దీ తూర్యాలూ సిద్ధం చేసుకొని, దేవి బయలుదేరేటప్పుడు ఆమె మనస్సుకు ఎంతో హర్షాన్ని కలిగించాలి. ఈ వాద్య మధుర ధ్వనిని విని దేవతలుకూడా ఆశ్చర్యపడాలి! మాయాదేవి గొప్పరథంపైని కూర్చుండనీ. స్త్రీగాని, పురుషుడుగాని మరి ఒక్కరెవ్వరూ దానిపై యెక్కరాదు. అనేకవిధాల కవచాలు ధరించిన యువతులే దానిని మోయవలెను. దీనికి ప్రతికూలమైనమాట వినబడకూడదు.''

రథ, గజ, హయ, పదాతిరూపమైన చతురంగబలం రాజభవన ద్వారం దగ్గర సిద్ధంగా ఉండినది. అప్పుడు పెద్ద సందడిగా ఉండినది. కల్లోలాలతో క్షుభితమైన మహాసముద్ర ఘోషవలె పెద్దఘోష ఏర్పడింది.

మాయాదేవి భవనంనుండి ద్వారదేశానికి వచ్చినప్పుడు మంగళార్థమై లక్షలకొద్దీ గంటలు మ్రోగినవి. ఆమె కూర్చుండే రథాన్ని మహారాజు దివ్యాలైన సింహాసనాలతో అలంకరించాడు. పత్రాలతోనూ, పుష్పాలతోనూ కూడిన నాలుగు రత్నవృక్షాలు నాల్గువైపులా దానికి కట్టబడినవి. వాటిమీద హంసలూ, క్రౌంచపక్షులూ, నెమిళ్ళూ మనోజ్ఞంగా ధ్వని చేస్తున్నవి. అది ఛత్రాలతోనూ, ధ్వజాలతోనూ అలంకరించబడినది. దానికి చిరుగంటలు కట్టబడినవి. దానిపైని నిలువైన వస్త్రం కట్టబడింది. దేవతాస్త్రీలు ఆకాశంమీదనుంచే ఆ రథాన్ని చూస్తూ, మధుర దివ్యగీతాలు పాడుతూ కొనియాడారు.

మాయాదేవి ఆ రథంలోని సింహాసనంపై కూర్చున్నప్పుడు త్రిసహస్ర యోజన పరివ్యాప్తమయిన భూమి ఆరు విధాలుగా కనిపించింది. అంబర వీధిలో దేవతలు తిరుగుతూ పుష్పవర్షం కురిపించారు. జగత్తులోకల్లా శ్రేష్ఠుడయినవాడు లుంబినీ వనంలో జన్మిస్తాడని దేవత లందరూ గ్రహించారు.

ఆ రథాన్ని నలుగురు దిక్పాలకులు మోసినారు. దేవరాజయిన ఇంద్రుడు రథమార్గాన్ని పరిశుభ్రం చేస్తూ ఉండినాడు. దుర్మార్గులెవరూ ఎదురుగా రాకుండా వారిస్తూ బ్రహ్మ ముందు బయలుదేరినాడు. లక్షలకొలది దేవతలు చేతులు జోడించుకుని నమస్కరిస్తూ ఉండినారు.

శుద్ధోదననరపతి ఈ వ్యూహమంతా చూచి ముదితచిత్తుడైనాడు. ఆయన మనసులో ఇలా అనుకున్నాడు :—"నలుగురు పాలకులు, బ్రహ్మ, దేవేంద్రుడు, ఇతర దేవతలు విపుల పూజలు జరుపుతున్న యీ శుద్ధ సత్త్వుడు దేవదేవుడనడం స్పష్టం. త్రిభువనాలలోను ఇలాటి పూజను సహించేవారు మరొకరు లేరు. దేవతలు, నాగులు, శక్రులు, బ్రహ్మ, పాలులు శిరస్సులతో నమస్కరించి తమ జీవితం ఫలింపజేసుకుంటున్నారు. ఈతడు మాత్రం దేవాదిదేవుడు. సర్వపూజలను వహిస్తున్నాడు."

భిక్షువులారా, అనంతరం మాయాదేవిని సర్వాలంకార భూషితాలైన ఎనభైనాలుగువేల హయరథాలు, సర్వాలంకారభూషితాలయిన ఎనభైనాలుగువేల గజ రథాలు, శూరులు, వీరులు వరాంగరూపులు, దృఢకవచాలు ధరించినవారు ఎనభైనాలుగువేలమంది పదాతి సైనికులు పరివేష్టించినారు. అరవైవేలమంది శాక్యకన్యలు ఆమెకు ముందుగా నడిచారు. శుద్ధోదనుని జ్ఞాతులు, శాక్య వంశీయులు అయిన పిన్నలు పెద్దలు మధ్యవయస్కులు నలభైవేలమంది ఆమెకు రక్షకులుగా బయలుదేరి వెళ్ళినారు. శుద్ధోదనుని అంతఃపురంలోని గీత వాద్య నిపుణులు అరవై వేలమంది తూర్యాదులను ధ్వనింపజేస్తూ గీతాలు పాడుతూ ఆమెను అనుసరించారు. ఎనభైనాలుగువేల దేవకన్యలు ఆమెవెంట ఉన్నారు. అంతకుముందే నాగకన్యలూ, అసురకన్యలూ ఆమెను వెంబడించారు. వారందరూ అనేకవిధాలంకారాలు ధరించి మనోహరంగా పాడుతూ మధురంగా భాషిస్తూ రాగా, మాయాదేవి లుంబినీ వనానికి బయలుదేరినది. అప్పుడు లుంబినీవనం అంతటా గంధోదకం చల్లబడింది. దివ్య పుష్పాలు విరజల్లబడినవి. ఆ వనంలో వున్న వృక్షాలన్నీ అకాలంలో చిగిర్చి, పుష్పించి ఫలించాయి. ఆ వనం దేవతల, మిశ్రకావనం వలెనే దేవతలతో అలంకరించబడింది.

మాయాదేవి ఆ లుంబినీ వనంలో ప్రవేశించి రథంనుంచి దిగినది. మనుష్య కన్యకలూ, దేవకన్యకలూ తన వెంట రాగా ఆమె చెట్టునుండి చెట్టుకు పోతూ, ఒక వనంనుండి మరొక వనానికి తిరుగుతూ ప్రతివృక్షాన్నీ పరిశీలిస్తూ ఒక ప్లక్షవృక్షాన్ని చూచింది. ఆ ప్లక్షవృక్షం కొమ్మలు వేర్వేరుగా, విశాలంగా వున్నవి. అది వివిధాలయిన దివ్యాదివ్య పుష్పాలు పుష్పించింది. రంగురంగుల సురభివస్త్రాలు దానినుంచి వేలాడుతున్నాయి. అది అనేక మణికాంతులతో ప్రకాశిస్తూ, ఉత్తమమైన రత్నాల వేళ్లతో, రత్నాల బోదెలతో, కొమ్మలతో, ఆకులతో ఒప్పారుతున్నది. దాని చుట్టూ ఉన్న ప్రాంతం విస్తీర్ణంగాను, నెమలి మెడరగుంవంటి పచ్చికతో కాచిలింద పుష్పంవలె మెత్తగాను, అరచేయిలాగ సమంగాను ఉన్నది. ఆ ప్లక్షవృక్షాన్ని పూర్వజినజనులు ఆశ్రయించుకొని ఉన్నారు. దానిని ఆశ్రయించుకొని దేవతలు ఆనందంతో సంగీతాలు పాడుతున్నారు. శుభ విమల విశుద్ధమయిన ఆ వృక్షాన్ని ప్రశాంతచిత్తులు, జటామకుటమండితశిరస్కులు అయిన శుద్ధావాసకాయిక దేవతలు వేలకొలదిగా అభినందిస్తున్నారు. మాయాదేవి అలాటి ఆ మహావృక్షం చూచి, దాని దగ్గరికి వెళ్ళింది.



ఆ ప్లక్షవృక్షం బోధిసత్త్వుని తేజఃప్రభావవంతో మాయాదేవికి వంగి నమస్కరించింది. మాయాదేవి గగనతలంలో విద్యుత్తు ప్రసరించినట్టుగా తన మెరిసే దక్షిణబాహువును ముందుకు చాచి, ఒక ప్లక్షశాఖను పట్టుకుని, సవిలాసంగా ఆకాశంవైపు చూస్తూ ఆవులిస్తూ నిలబడ్డది. ఆ సమయంలో కామావచర దేవతలకు సంబంధించిన అరవై లక్షలమంది అప్సరసలు వచ్చి మాయాదేవికి పరిచర్యచేస్తూ ఉండినారు.

ఇలాటి దివ్యమహత్త్వం గల బోధిసత్త్వుడు మాతృగర్భగతుడై ఉండినాడు. పది మాసాలు నిండినందున అతడు తల్లి దక్షిణగర్భపార్శ్వంనుంచి నిష్క్రమించినాడు. ఇతరులెవ్వరైనా మాతృగర్భంనుంచి బయటపడినప్పుడు గర్భమలాలతో కూడి వుంటారు. బోధిసత్త్వుడు మాత్రం పుడుతున్నప్పుడు అట్టి మలాలతో అనులిప్తుడు కాలేదు.

ఓ భిక్షులారా, ఆ సమయంలో దేవతలకు ప్రభువైన ఇంద్రుడూ, సహాపతి అయిన బ్రహ్మ ముందు వచ్చి నిలబడ్డారు. వారు ఎంతో గౌరవంతో బోధిసత్త్వునికి పట్టువస్త్రం కప్పి, అన్ని అవయవాలనూ స్పృశించి అతన్ని పట్టుకొన్నారు. మాయాదేవి గర్భకోశంలో బోధిసత్త్వుడు ఉండిన

కూటాగారాన్ని సహాపతియైన బ్రహ్మ, బ్రహ్మకాయికులైన దేవపుత్రులూ ఎత్తి, చైత్యంకొరకున్నూ, పూజించుటకున్నూ బ్రహ్మలోకానికి తీసుకొని పోయారు. మొదట మనుష్యులెవరూ బోధిసత్త్వుని పరిగ్రహించలేదు. మొట్టమొదటగా దేవతలే అతన్ని స్వీకరించారు.

బోధిసత్త్వుడు తల్లిగర్భంనుండి పుట్టి భూమిపైని అవతరించినాడు. మహాసత్త్వుడైన అతడు అవతరించిన వెంటనే భూమిని భేదించుకొని మహాపద్మం ఒకటి ప్రాదుర్భవించినది. నందుడు, ఉపనందుడు అనే నాగరాజు లిద్దరు గగనతలంలో సగంమాత్రమే కనిపిస్తూన్నవారై శీతోష్ణంగా ఉన్న జలధారలను రెంటిని కల్పించి బోధిసత్త్వునికి స్నానంచేయించారు. ఇంద్రుడు, బ్రహ్మ, లోకపాలకులు, ముందుగా వచ్చిన లక్షలకొద్దీ వున్న దేవపుత్రులు అనేకాలైన గంధోదకాలతో స్నానంచేయించి అతనిమీద పూవులు చల్లారు. అంతరిక్షంలో రెండు చామరాలు, రత్నచ్ఛత్రం పుట్టినవి. సజాతుడైన బోధిసత్త్వుడు ఆ మహాపద్మంలో ఆసీనుడై నాలుగుదిక్కులను చూచాడు. సింహావలోకితంగా, మహాపురుషావలోకితంగా నాల్గు దిక్కులూ చూచాడు.

ఆ సమయంలో బోధిసత్త్వుడు పూర్వ కుశలమూల విపాకంతో కలిగిన అప్రతిహతమైన దివ్యదృష్టితో నగరాలు, నిగమాలు (శ్రేష్ఠి సంఘాలు), జనపదాలు, రాష్ట్రాలు, రాజధానులు ఉన్న-దేవతలు మానవులూ నివసిస్తున్న త్రిసాహస్రం, మహాసాహస్రం అయిన సమస్త లోకధాతువును (లోకాలను) చూచాడు. సర్వప్రాణుల మనోగతాన్ని గ్రహించాడు. గ్రహించి బాగా పరిశీలించాడు. "శీలంచేతగాని, సమాధిచేతగాని, ప్రజ్ఞచేతగాని, కుశలమూలచర్యచేతగాని నాకు సమానమైనవాడు ప్రాణులలో ఎవ్వడైనా ఉన్నాడా?" అనే ప్రశ్న బోధిసత్త్వునికి కలిగింది. త్రిసాహస్ర మహాసాహస్రమైన లోకధాతువులో తనతో సమానమైనవాడు ఎవ్వడూ లేడని అతనిక తెలిసింది. సింహానికి ఎట్టి భయమూ లేనట్లు అతనికి కూడా అప్పుడు భయమనేది కలగడం లేదు. బోధిసత్త్వుడు స్తంభీభావం లేనివాడై బాగుగా ఆలోచించి సమస్తప్రాణుల మనోభావా



లనూ గ్రహించి, ఎవ్వరివల్లనూ, దేనినీ పరిగ్రహించక తూర్పుదిక్కువైపు తిరిగి ఏడు అడుగులు వేసి బయలుదేరాడు. "సమస్త కుశలమూలాలైన ధర్మాలకు ముందుగా నడుస్తాను — పూర్వంగముడనవుతాను" అని అనుకొన్నాడు. అతడు ఇట్లు బయలుదేరగా మీదివైపు అంతరిక్షంలో దివ్యమై విశాలమైన ఛత్రమూ, శుభచామరాలూ అతనిని అనుసరించిపోతూ వుండినవి. బోధిసత్త్వుడు అడుగుపెట్టినచోట అంతటా పద్మాలు ప్రాదుర్భవిస్తూ ఉండినవి. తర్వాత బోధిసత్త్వుడు దక్షిణదిక్కునకు అభిముఖంగా ఉండి ఏడడుగులు వేసి, బయలుదేరాడు. "దేవమనుష్యులకు దక్షిణీయుణ్ణి అవుతాను — కోరికలను తీర్చగలను" అని తన అభిప్రాయం తెలియజేసినాడు. తర్వాత పడమటివైపు తిరిగి ఏడడుగులువేసి బయలుదేరినాడు. ఏడవ అడుగులోనే వుండి "నేను లోకంలో జ్యేష్ఠుడను. శ్రేష్ఠుడను. నాజాతి పశ్చిమం — చాలా వెనుకబడి వున్నది. ఈ జాతికి జరామరణ దుఃఖాలు లేకుండా చేస్తాను" అని సింహధ్వనితో సంతోషకరమైన మాటలు చెప్పాడు. తర్వాత అతడు ఉత్తరంవైపు తిరిగి ఏడడుగులువేసి "నేను సర్వప్రాణులలోను అనుత్తరుడిని — ఎదురులేనివాడిని కాగలను" అని వ్యక్తంచేసినాడు. అటుపిదప కింది దిక్కుకు అభిముఖుడై ఏడడుగులు నడిచి "మారుణ్ని, మారసేననూ నశింపజేస్తాను. సమస్త పాపాలనే అగ్నులను చల్లార్చడానికి మహాధర్మమనే మేఘంనుంచి వర్షాలు కురిపిస్తాను. అందరూ ఏ బాధా లేక సుఖించగలరు" అని పలికినాడు. అనంతరం మీదివైపుచూస్తూ ఏడడుగులువేసి "సర్వప్రాణులకూ ఉల్లోకనీయుణ్ణి అవుతాను — ఉన్నతస్థితిలో చూడదగిన వాణ్ణవుతాను" అని అన్నాడు. బోధిసత్త్వుడు అవతరించిన వెంటనే ఈ విధంగా పలికినాడు. "ఇది బోధిసత్త్వునికి కర్మవిపాకంవల్ల కలిగిన అభిజ్ఞా ధర్మత — పూర్వధర్మజ్ఞానం — అని అతని స్వరంవల్ల ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువు బోధపరచుకొన్నది.

చరమ భవికుడైన బోధిసత్త్వుడు ఉద్భవించి అనుత్తరసమ్యక్సంబోధిని తెలుసుకొన్నప్పుడు అతనికి ఈలాటి బుద్ధ ప్రాతిహార్యాలు, మాహాత్మ్యాలు, సిద్ధులు కలుగుతాయి. ఓ భిక్షువులారా, ఆసమయంలో

సమస్త ప్రాణులకూ సంతోషంవల్ల రోమాంచం కలిగినది. భూమికూడా రోమహర్షంవల్ల కంపించినది. దివ్యాలూ, మానుషాలూ అయిన తూర్యాలు ఎవరూ మ్రోయించకనే మ్రోగినవి. ఆ సమయంలో వృక్షాలన్నీ సర్వ ఋతువులకూ, అన్నికాలాలకూ అనుకూలాలై, పుష్పిస్తూ, ఫలిస్తూ ఉండినవి. విశుద్ధమైన గగనతలనుండి మేఘాల ఉరుములు వినబడుతూ ఉండినవి. మేఘాలు చెదరిపోయి నిర్మలంగా ఉండిన గగనంనుంచి దేవతలు మెల్లమెల్లగా వర్షాలు కురిపించారు. అనేకమైన రంగులు కల పూవుల, వస్త్రాభరణ గంధచూర్ణాల సువాసనను వ్యాపింపజేస్తూ, సుఖస్పర్శగల మందమారుతాలు వీస్తూ ఉండినవి. అన్నిదిక్కులూ, చీకటి, దుమ్ము, పొగ, మంచు లేనివై నిర్మలంగా ప్రకాశిస్తూ ఉండినవి. అదృశ్యాలు, గంభీరాలు అయిన బ్రహ్మఘోషలు ఆకాశంనుండి వినబడుతూ ఉండినవి. చంద్రుడు, సూర్యుడు, ఇంద్రుడు, బ్రహ్మ, లోకపాలకులు మున్నగువారి తేజస్సు మందగించింది. సమస్తాలైన త్రిసాహస్ర మహాసాహస్రలోక ధాతువులూ సుఖసంస్పర్శ కలిగి, సమస్త ప్రాణుల శరీర మనస్సులకు సుఖాన్ని కలిగించే లోకోత్తరమైన వివిధ వర్ణాల కాంతులతో విరాజిల్లుతూ ఉండినవి. అన్ని ప్రాణులున్నూ అప్పుడే అవతరించిన బోధిసత్త్వునికి ఎక్కువసుఖాన్ని కలిగిస్తూ ఉండినవి. సకల జీవులూ రాగాన్నీ, ద్వేషాన్నీ, మోహాన్నీ, అరతినీ, దర్పాన్నీ, విషాదాన్నీ. భయాన్నీ, లోభాన్నీ, ఈర్ష్యనూ, మాత్సర్యాన్నీ విడిచి ఉండినవి. సమస్తములైన అకుశలకార్యాలూ అణగారినవి. రోగుల వ్యాధులన్నీ శమించాయి. ఆకలి, దప్పులచేత బాధపడే వారికి ఆ ఆకలి దప్పికలు నశించాయి. మద్యపానంచేసి మత్తెక్కినవారి మదం విరిగింది. పిచ్చివాళ్లు స్వాస్థ్యాన్ని పొందారు. కన్నులు పోయిన వారికి కన్నులు వచ్చాయి. చెవులులేనివారికి చెవులు వచ్చాయి. అంగ ప్రత్యంగ వికలుల కందరికీ ఆయా అంగాలు వచ్చి అంగవైకల్యం నశించినది. దరిద్రులకు ధనప్రాప్తి కలిగింది. కారాగారంలో బంధించబడినవారికి చెర తొలగినది. ఆ సమయంలో అవీచి మున్నగు నరకా లనుభవిస్తూ బాధపడేవారి దుఃఖం పోయినది. తిర్యక్కులైన జంతువులు మున్నగునవి ఒకదాని నొకటి తినడం మానివేశాయి. యమలోకంలో ఉండే ప్రాణులకు ఆకలిదప్పుల బాధలు నశించాయి.



బోధిసత్త్వుడు జన్మించిన వెంటనే ఏడేసి అడుగులు వేసి మహాబల వేగంతో నడిచిన వజ్రమయమైన ఆ మహాపృథ్వీ ప్రదేశానికి ఉత్తమ కార్యాలతోను, పట్టుదలతోను ధర్మాన్ని అవలంబించిన కోట్లకొలది బుద్ధులు దశ దిక్కులనుంచీ దిగి వచ్చారు. అప్పుడు మహాకాంతితో సర్వ లోకాంతరాలు వెలిగిపోయి స్ఫుటంగా కనిపించాయి. ఆ సమయంలో గొప్ప వాద్యధ్వని, నృత్యధ్వని వినవచ్చాయి. అప్పుడు పుష్పచూర్ణ గంధ మాల్య రత్నాభరణ వస్త్రాల మేఘాలు అప్రమేయంగా వర్షించాయి. అన్ని ప్రాణులూ ఎంతో సంతోషించినవి. సర్వలోకాభ్యుద్గతుడైన బోధిసత్త్వుడు, భూలోకంలో అవతరించినప్పుడు వూహించడానికి అలవికాని కార్యాలు జరిగాయి. వాటిని సంక్షేపంగానే చెప్పగలం.

అప్పుడు ఆయుష్మంతుడయిన ఆనందుడు ఆసనంనుంచి లేచి ఉత్తరీయాన్ని ఒక భుజంమీద వేసుకుని, కుడిమోకాలిని నేలమీద మోపి, చేతులు జోడించి ప్రణామం చేసి, భగవానుడైన బోధిసత్త్వునితో ఇలా మనవి చేసినాడు: “భగవానుడైన తథాగతుడు సకల ప్రాణులకూ ఆశ్చర్యాన్ని కలిగిస్తూనే ఉన్నాడు. ఇక బోధిసత్త్వుడుగా అవతరించి అద్భుత ధర్మసహితుడై అనుత్తర సమ్యక్సంబోధిని గ్రహిస్తాడనడంలో వాద మేమిటి? కనుక నేను భగవన్, నాలుగైదుసార్లే కాదు, పదిసార్లు ఏభైసార్లూ కాదు; నూరుసార్లూ, తుదకు లక్షసార్లూ భగవానుడైన బుద్ధుణ్ణే శరణు పొందుతున్నాను” అని.

ఆయుష్మంతుడైన ఆనందుడు ఇలా మనవి చేయగా భగవానుడు ఇలా అన్నాడు: “ఓ ఆనందా! మునుముందు కొందరు భిక్షువులు అభావితకాయులు (పొందిక లేని శరీరం గలవారు), అభావిత చిత్తులు, అభావిత శీలులు, అభావిత ప్రజ్ఞులు, బాలులు, అపండితులు, ఆత్మాభిమానం గలవారు, ఔద్ధత్యం గలిగి లొంగుబాటు లేక చంచలచిత్తులై వుంటారు. వారికి కోరికలు ఎక్కువ. సందేహాలు అధికం. శ్రద్ధ ఉండదు. శ్రమణులనే పేరు మాత్రమే గాని ఆసక్తి ఉండదు. ఈ రీతిగా ఉన్న బోధిసత్త్వుని గర్భావక్రాంతి పరిశుద్ధిని వారు గ్రహింపలేరు. వారు చాటుచాటుగా గుమిగూడి ఒకరితో ఒకరు ‘చూడండయ్యా ఈ నమ్మని,

గౌరవించని కథ! తల్లి కడుపున ఉచ్చార ప్రస్రావ మండాది మిశ్రితుడయిన బోధిసత్త్వునికి ఇలాటి విభూతి కలిగిందంటారు. ఆ బోధిసత్త్వుడు తల్లిగర్భంలో కుడివైపునుంచి అవతరిస్తూ గర్భమలాలతో అనవలిప్తుడయాడట! ఇది ఎలా కుదురుతుంది?' అని గుసగుసలుగా చెప్పుకుంటూ ఉంటారు. సుకృత కర్మలు చేసిన ప్రాణుల శరీరాలు ఉచ్చార ప్రస్రావ మండాలతో సంభవించవని ఆ అజ్ఞాన పురుషులు తెలుసుకోలేరు. అలాటి ప్రాణులకు గర్భావక్రాంతి భద్రంకరంగాను ఉంటుంది. బోధిసత్త్వుడు ప్రాణులయెడ ఎక్కువ దయ గలవాడు గనుకనే గర్భావస్థితుడై లోకంలో అవతరిస్తున్నాడు. దేవభూతుడై ఉండే ధర్మచక్రాన్ని నడపడం లేదు. ఆనందా, భగవానుడు దేవత. తథాగతుడు, అర్హంతుడు, సమ్యక్సంబుద్ధుడు. మనం మానవమాత్రులం. అతని స్థానాన్ని నింపడానికి అసమర్థులం—అని కౌసీద్యం ప్రాణులకు సోమరితనం - వెగటు కలుగరాదు సుమా! అంతేకాక ఆనందా, ధర్మపు దొంగలయిన ఆ మోహపురుషులకు ‘ఆ ప్రాణి అచింత్యుడు. మనం అతనిని ప్రమాణంగా తీసుకోరాదు’ అనే భావమూ కలుగరాదు. అట్టి సమయంలో వారు (బుద్ధుని) బుద్ధి ప్రాతిహార్యాన్ని (మాహాత్మ్యాన్ని) గ్రహించలేరు గదా, బోధిసత్త్వభూతుడయిన తథాగతుని విభూతిని గురించి చెప్పాలా? ఇతర జాతీయులయిన ఆ మోహపురుషులు బుద్ధధర్మాలు ఆక్షేపిస్తూ, లాభానికీ, సత్కారానికీ, కీర్తికీ లొంగిపోయి, వాటిమీది ఆశతో మలంలో చిక్కుకొని, ఎంతటి పుణ్యం సంపాదిస్తారో చూడు, ఆనందా.”

అప్పుడు ఆనందుడు “భగవన్, ఈ విధంగా సుఖకరమూ, భద్రంకరమూ, సూత్రాంతమూ అయిన ధర్మాన్ని ఆక్షేపించేవారు, ప్రతిపక్షం స్వీకరించేవారు అయిన భిక్షువులు ముమ్ముందు ఉండరు కదా!” అన్నాడు.

భగవానుడప్పుడు “ఓ ఆనందా, ధర్మాన్ని ఈ రీతిగా ఆక్షేపిస్తూ, ఎదురు తిరుగుతూ, అనేక ప్రకారాలయిన పాపాభిసంస్కారాలు చేస్తూ, అనర్థకులైనవారు శ్రమణులు కాలేరు” అన్నాడు.



“అయితే భగవన్, అలాటి అసత్పురుషులకు ఎలాటి గతి కలుగుతుంది?” అని ఆనందుడు ప్రశ్నించాడు.

“బుద్ధబోధను తిరస్కరించి, అతీతులూ, అనాగతులూ, ప్రత్యుత్పన్నులూ అయి, భగవానులయిన బుద్ధులను లెక్కచెయ్యనివారికి కలిగే గతి వీరికీ కలుగుతుంది” అని భగవానుడు అన్నాడు.

అటు తర్వాత ఆయుష్మంతుడయిన ఆనందుడు సంతోషంవల్ల రోమాంచం కలుగగా “నమో బుద్ధాయ” అని అన్నాడు. ఆ అసత్పురుషుల పద్ధతిని వినడంవల్ల తనకు మూర్ఛ వస్తున్నదనీ అన్నాడు.

అప్పుడు భగవానుడు ఇలా అన్నాడు “ఓ ఆనందా! వారికి మంచి ఆచారాలు ఉండవు. వారు విషమమైన ఆచారం కలవారు! వారు తమ విషమాచారంవల్ల అవీచీ మహానరకంలో పడగలరు. భిక్షులుగాని, భిక్షుణులు గాని, ఉపాసకులు కాని, ఉపాసికలు కాని, ఈ సూత్రాంత ధర్మ బోధలను విని ఆమోదించకున్నా, వీనియెడల శ్రద్ధ చూపకున్నా, అనుసరించకున్నా, వారు అవీచీ మహానరకంలో పడక తప్పదు. వారు తథాగతుని ప్రామాణికునిగా గ్రహించరు. ఇంకా విను. ఆనందా! ఎందుకంటే తథాగతుడు అప్రమేయుడు, గంభీరుడు, విపులుడు. అతనిని తెలుసుకోవడం చాలా కష్టం! ఇలాటి ధర్మబోధలను విని, అర్థం చేసుకున్నవారు ప్రీతినీ, ప్రమోదాన్నీ, అనుగ్రహాన్నీ, లాభాన్నీ పొందుతారు. వారి జీవితం చాలా అమోఘంగా ఉంటుంది. వారి జన్మ సఫలమైనది! వారు మంచినే ఆచరిస్తారు. మూడైన అపాయాలనుంచీ వారికి ముక్తి లభిస్తుంది. వారు తథాగతునికి పుత్రులై వుంటారు. వారి కార్యాలన్నీ ఫలిస్తాయి. వారి శ్రద్ధా ప్రతిలంభం అమోఘంగా ఉంటుంది. వారు రాష్ట్రాలను చక్కగా వింగడించి పాలిస్తారు. పెద్దలు వారిని అనుగ్రహిస్తారు. వారు మారపాశాలను తెంచివెయ్యగలరు. సంసారాటవీ కాంతారాన్ని వారు సులభంగా దాటగలరు. శోకశల్యాన్ని వూడలాగగలరు. ప్రమోదాన్ని కలిగించే వస్తువులు పొందగలరు. ఈ శరణగమనాలు గ్రహించగలరు. వారు దక్షిణీయులు, పూజార్హులు, దుర్లభ

జన్ములు గనుక లోకంలో వారిని గౌరవించి ఉంచుకోవాలి. ఎందుచేతనంటే – ఆనందా, వారు సర్వలోక విశ్రుతమైన, సర్వలోక విప్రత్యనీకమైన (శత్రువు కాని) తథాగత ధర్మం విషయంలో శ్రద్ధ వహిస్తున్నారు గనుక. వారి కుశలమూలాలు కొద్దిపాటివి కావు. ఆనందా! వారు నాకు ఏకజాతి ప్రతిబద్ధులైన నెచ్చెలులు. అది ఎందుకంటే, ఆనందా! ఒక్కొకడూ శ్రవణంవల్లనే ప్రియుడూ, నచ్చినవాడూ అవుతాడు. దర్శనంతో కాదు. ఒక్కొకడూ దర్శనంతో ప్రియుడు, ఇష్టుడు అవుతాడు, శ్రవణం వల్ల కాదు. ఒక్కొకడూ దర్శనంతోను, శ్రవణంతోను ఇష్టుడవుతాడు. వారిలో కొందరికి నేను దర్శనంచేత గాని, శ్రవణంచేత గాని ఇష్టుణ్ణయి, నిష్ఠాత్వం పొందితే, వారు నాకు ఏక జాతి ప్రతిబద్ధులయిన మిత్రులు కారు. వారిని తథాగతుడు చూచి, సకల బంధవిముక్తులను చేసి, సమ గుణ ప్రత్యంశ గలవారుగాను, తథాగత గుణ, ప్రత్యంశ గలవారుగాను చేసి, ఉపాసకులుగా చేసుకొని సమీపంలోనే పెట్టుకోవాలి. ఓ ఆనందా! పూర్వం బోధిసత్త్వ చర్యను ఆచరిస్తున్న నా వద్దకు భయార్దితులయిన ప్రాణులు వచ్చి అభయం అడుగగా, అన్నిటికీ అభయమిచ్చినాను. మరి యిప్పుడు అనుత్తర సమ్యక్సంబోధిని పొందిన తర్వాత వేరుగా చెప్పాలా? శ్రద్ధతో ఆసక్తి ఉంచాలి. తథాగతుడు చెప్పేదిది: ఆనందా! మీరు చేయవలసింది తథాగతుడే చేసివేశాడు. మానమనే శల్యాన్ని పెరికివేశాడు. మిత్రుడనే మాట వినగానే నూరు యోజనాలయినా వెళ్ళుతారు గదా! వెళ్ళి ఇదివరకు చూడని మిత్రుణ్ణి చూచి ఎంతో సంతోషం అనుభవిస్తారు గదా? మరి నన్ను చూచి ఆశ్రయించిన మీదట కుశలమూలాలను 'పెరికివేయడ' మనేది ఏటి మాట? ఆనందా! అర్హంతులు, సమ్యక్సంబుద్ధులు అయిన తథాగతులకు పూర్వమిత్రులు, తథాగతులయిన మాకు కూడ మిత్రులేనన్న సంగతి తెలుసుకో. ఎందుకంటే, మిత్రుని మిత్రుడు ఇష్టమయినవాడు, ప్రీతిపాత్రుడు అవుతాడు. ఆ మిత్రునికి ప్రియమైన మిత్రుడు మనకూ నచ్చినవాడూ, ప్రియమైనవాడూ అవుతాడు. అందువల్ల నేను నచ్చజెప్పేది, తెలియజేసేది ఏమిటంటే, శ్రద్ధతో గమనించాలి. అనాగతులు, అర్హతులు, సమ్య



క్సంబుద్ధులు అయిన తథాగతుల దగ్గరివారు మనకు కూడా మిత్రులని గ్రహించి వారి అభిమతాలను నెరవేర్చవలెననే మేము చెబుతున్నది. ఎలాగంటే—ఒక వ్యక్తికి ఒక కుమారుడు ఉన్నాడనుకో. ఆ వ్యక్తి మంచి వయసువాడూ, ప్రదక్షిణంగా వెళ్ళి గౌరవించదగినవాడూ, పలువురు మిత్రులు గలవాడూ అనుకో. ఆ వ్యక్తి కాలధర్మం చెందినా, అతని మిత్రులు అతని పుత్రుని చేయి విడువరు. ఈ విధంగానే ఆనందా, నా విషయంలో శ్రద్ధ తీసుకునేవారిని నేను స్వీకరిస్తాను. వారు నన్ను మిత్రులులాగ శరణు పొందారు. తథాగతుడు బహు మిత్రుడు. ఆ తథాగతుని మిత్రులు యథార్థవాదులే గాని మృషావాదులు కారు. యథార్థవాదులలో తథాగతుని మిత్రులయినవారంతా అనాగతులు, అర్హతులు, సమ్యక్సంబోధి గలవారు అయిన తథాగతులే. ఇది నీకు వివరించాను. శ్రద్ధతో ఆసక్తి కలిగించుకో. శ్రద్ధతో మనస్సును లగ్నం చేయి. ఇదే ఇక్కడ నేను మీకు విజ్ఞాపన చేస్తున్నది.''

ఈ విధంగా బోధిసత్త్వుడు అవతరించగానే, కోట్లకొలది అప్సరసలు మాయాదేవిపై దివ్య పుష్ప ధూపగంధ మాల్యవిలేపన వస్త్రాభరణ వర్షం కురిపించారు. ఇక్కడ ఈ గాథలు చెబుతారు.

శుభవిమల విశుద్ధ దేహప్రభా చంద్రసూర్యప్రభా
షష్టి దశసహస్ర దేవాప్సరా మంజుఘోషస్వరాః,
తస్మిన్ క్షణే ఉపేత్య తాం లుంబినీం మాయాదేవ్యబ్రువన్
మాఖు జని విషాదు తుష్టా భవోపస్థాయికాస్తే వయమ్.

భణహి కింకరణీయు కిం కుర్మహే కేన కార్యం చ తే
వయం తవ సుసమర్థోపస్థాయికా ప్రేమభావస్థితాః,
అపి చ భవ ఉదగ్రహర్షాన్వితా మా చ ఖేదం జనేహి
జరామరణ విఘాతి వైద్యోత్తమం అద్య దేవీ జనేషీ లఘుం.

యథ ద్రుమ పరిఫుల్ల సంపుష్పితా శాలవృక్షా ఇమే
యథ చ మరుసహస్ర పార్శ్వ స్థితా భ్రామయన్తో భుజాన్,

యథ చ చలి ససాగరా మేదినీ షడ్వికారా ఇయం
దివి భువి చ విఘుష్ట లోకోత్తర ంత్వం జనేషి సుతమ్.

యథ చ ప్రభ విశుద్ధ విభ్రాజతే స్వర్ణవర్ణ శుభా
తూర్యశతమనోజ్ఞా చాఘట్టితా ఘుష్యయన్తేఽమ్బరే,
యథ చ శతసహస్ర శుద్ధా శుభావీతరాగాః సురా
నమిషు ముదితచిత్తా అద్యోజనే సర్వలోకే హితమ్.

శక్రమపి చ బ్రహ్మ లోకపాలా అపిచాన్యా చ యా దేవతా
తుష్టముదితచిత్తా పార్శ్వ స్థితా నామయన్తో భుజాం,
సో చ పురుషసింహో శుద్ధవ్రతో (భిత్త్వ) కుక్షినిర్ధావితో
కనకగిరి వికాస శుద్ధవ్రతో నిష్క్రిమీ నాయకః.

శక్రమపి చ బ్రహ్మ తే పాణిభిః సంప్రతీచ్ఛా మునిం
క్షేత్ర శతసహస్ర సఙ్కమ్పితా ఆభ ముక్తా శుభా,
అపి చ త్రిషు అపాయి సత్త్వా సుఖీ నాస్తి దుఃఖం పున
అమర శతసహస్ర పుష్పాం క్షిపీ భ్రామయ న్త్యమ్బరాన్.

వీర్యబల ఉపేత వజ్రాత్మికా మేదినీ సంస్థితా (భూ త్తదా)
పద్మ రుచిర చిత్రు అభ్యుద్గతో యత్ర (చక్రాఙ్కచిత్రేభిః) పద్భ్యాం
స్థితో (ఽపి నాయకః)
సప్తపద క్రమిత్వ బ్రహ్మస్వరో ముఞ్చి ఘోషోత్తమం
జరామరణ విఘాతి వైద్యోత్తమో భేష్యి సర్వోత్తమః.

గగణతల స్థిహిత్వ బ్రహ్మోత్తమో శక్ర దేవోత్తమః
శుచిరుచిర ప్రసన్న గన్ధోదకై విన్నపీ నాయకం,
అపి చ ఉరగరాజా శీతోష్ణే ద్వే వారిధారే శుభే వ్యముఞ్చతా న్తరిక్షేస్థితా
ఆమరశతసహస్ర గన్ధోదకై విన్నపీ నాయకం.



లోకపాలాశ్చ సంభ్రాన్త సన్ధారయన్తీ కరైః శోభనైః,
త్రిసహస్రా ఇయం భూమిః కమ్పతే సచరాచరా.

ప్రభా చ రుచిరా ముక్తా అపాయాశ్చ విశోధితాః,
క్లేశదుఃఖాశ్చ తే శాన్తా జాతే లోకవినాయకే.

క్షిపన్తి మరుతః పుష్పం జాతే ఽస్మిన్ నరనాయకే,
క్రమ సప్తపదాం వీరః క్రమతే బలవీర్యవాన్.

పాదా నిక్షిపతే యత్ర భూమౌ పద్మవరాః శుభాః,
అభ్యుద్గచ్ఛన్ తతో మహ్యాం పద్మరత్న విభూషితాః.

యదా సప్తపదాం గత్వా బ్రహ్మస్వర ముదాహరి,
జరామరణ విఘాతి భిషగ్వర ఇవోద్గతః.

వ్యవలోకయిత్వా చ విశాలదో దిశాం తతోగిరాం ముఞ్చతి అర్థయుక్తాం,
జ్యేష్ఠోఽహం సర్వలోకస్య శ్రేష్ఠో లోకే ఇయం చ జాతిర్మమ పశ్చిమా
(ఇతి) వినాయకః,

హాస్యం చ ముక్తం నరనాయకేన సలోకపాలైర్మరుభిశ్చ సేన్ద్రైః,
ప్రసన్నచిత్తై ర్వరగన్ధవారిభిః సంస్కారితో లోకహితార్థకారీ.
అపి చోరగేన్ద్రైః సహితైః సమగ్రైః గన్ధోగ్రధారా వినరైః స్నపిస్స,
అన్యేఽపి దేవా నయుతా న్తరిక్షే స్నపిస్స గన్ధాగ్రజలే స్వయమ్భుం.
శ్వేతం చ విపులం ఛత్రం చామరాంశ్చ శుభామ్బరాన్,
అన్తరీక్షే గతా దేవాః స్నాపయన్తి నరర్షభం.

వీని, మరికొన్ని గాథల అభిప్రాయం యిది—

చంద్ర సూర్యులవంటి కాంతి కలవారున్నూ, శుభమై పరిశుద్ధమైన మేనిచాయ గలవారున్నూ, మధురమైన కంఠధ్వని కలవారున్నూ అయిన ఆరులక్షల అప్సరసలు ఆ క్షణంలో లుంబినీవనానికి వచ్చి మాయా

దేవితో ఇట్లు పలికినారు. "అమ్మా! విచారించవద్దు. సంతోషపడు. మేము నీకు ఉపస్థాయికలము (పరిచారికలము). నీకు ఏమి కావాలో చెప్పు. మేము నీ కే పని చెయ్యాలి? ప్రేమభావంతో ఉన్న మేము నీకు కావలసినది చెయ్యడానికి తగిన పరిచారికలము. జరామరణాలు లేకుండా చేసే గొప్ప వైద్యుని, ఓ దేవీ! నీవు ప్రసవించనున్నావు. నీవు గొప్ప సంతోషంతో ఉండు. విచారించవద్దు. బాగుగా విరియపూసిన మద్ది చెట్లు అందంగా ఉన్నవి. వేలకొద్దీ దేవతలు నీ పార్శ్వంలో చేతులు జోడించుకొని వున్నారు. షడ్వికారాలు గల యీ భూమి సముద్రసహితంగా చలించినది. దివినీ, భువినీ కూడా లోకోత్తరుడైన కుమారుని ప్రసవించనున్నావు. బంగారపు చాయ గల విశుద్ధమైన కాంతి ప్రకాశిస్తూ వున్నది. మనోజ్ఞాలైన వందల కొలదీ తూర్యాలు ఎవరూ తాకకనే ధ్వనిస్తున్నాయి. శుభస్వరూపులూ, వీతరాగులూ అయిన దేవతలు లక్షలకొద్దీ సంతోషంతో చేతులు జోడించి నమస్కరిస్తున్నారు."

ఇంద్రుడూ, బ్రహ్మ, లోకపాలకులూ, తదితర దేవతలూ సంతుష్టచిత్తులై చేతులు జోడించుకొని పార్శ్వములందు నిలిచి వున్నారు. అపుడు పురుషసింహుడూ, శుద్ధవ్రతుడూ, మేరుసమానుడూ అయిన నాయకుడు-బోధిసత్త్వుడు మాతృగర్భంనుంచి అవతరించాడు. ఇంద్రుడూ, బ్రహ్మ అతన్ని తమచేతులతో గ్రహించారు. శతసహస్ర క్షేత్రాలతో కూడిన భూమి కంపించినది. ప్రాణులు మూడు అపాయాలనుంచీ తప్పించుకొని సుఖించారు. వారికి దుఃఖం లేదు. లక్షలకొద్దీ వున్న దేవతలు ఆకాశంలో తిరుగుతూ పూవులను చల్లారు. భూమి వీర్యంతోనూ, బలంతోనూ కూడి వజ్రంవలె ఉన్నది. అందుండి చిత్రమూ, అందమైనదీ అయిన ఒకపద్మం ఉద్భవించింది. బోధిసత్త్వుడు ఏడడుగులు వేశాడు. ఆ అడుగులలో చిత్రాలైన చక్రచిహ్నాలు ఉన్నవి. అప్పుడు "సర్వోత్తముడైన బోధిసత్త్వుడు జరామరణాలను పోగొట్టే గొప్ప వైద్యుడుగా అవతరించాడు" అనే బ్రహ్మస్వరం మహాధ్వనితో వినబడింది.

దేవోత్తములైన బ్రహ్మ, ఇంద్రుడూ, లక్షలకొద్దీ ఉన్న తక్కిన దేవతలూ గగనతలంనుంచి శుచీ, రుచిరమూ, ప్రసన్నమూ అయిన గంధో



దకంతో బోధిసత్త్వునికి స్నానం చేయించారు. నాగరాజు శీతోష్ణజల ధారలను వర్షించి స్నానం చేయించాడు. లోకపాలకులు సంభ్రాంతులై, చేతులు జోడించి నమస్కరించారు. చరాచరాత్మకమైన యీ భూమి కంపించింది. దివ్యమైన కాంతి వెల్లివిరిసింది. అపాయాలు తొలగిపోయాయి. లోకనాయకుడైన బోధిసత్త్వుడు జన్మించగా క్లేశమూ, దుఃఖమూ శాంతించాయి. ఆ నరవాయకుడు జన్మించగా, దేవతలు పూలవాన కురిపించారు. బలపరాక్రమాలు గల పుట్టగానే ఆ బోధిసత్త్వుడు ఏడడుగులు వేశాడు. అతడు అడుగులు వేసినచోటల్లా నేలమీద శుభములూ, రత్నాలంకృతములూ అయిన పద్మాల చిహ్నాలు కనిపించాయి. అతడు ఏడు అడుగులు వెయ్యగా జరామరణాలు నశింపజేసే గొప్ప వైద్యుడుగా అతడు ఉదయించినట్లు బ్రహ్మస్వరం వినిపించింది. అతడు నాలుగు దిక్కులనూ కలయజూచి "నేనే జ్యేష్ఠుడను. లోకంలో నేనే శ్రేష్ఠుడను" అని అర్థయుక్తమైన మాటను పలికినాడు. ఈ జన్మే తనకు కడపటిదనినాడు. నరనాయకుడైన బోధిసత్త్వుడు నవ్వు మానినాడు. ప్రసన్నచిత్తులైన ఇంద్రుడూ, లోకపాలురూ, మిగిలిన దేవతలూ లోకహితం కోరే అతనికి గంధోదకాలతో స్నానం చేయించినారు. నాగులూ, దేవతలూ ఆకాశంపైనే ఉండి పరిమళిస్తున్న నీటి ధారలతో అతనికి స్నానం చేయించారు. ఇతర దేవ సహస్రాలూ ఆ స్వయంభువునకు గంధోదకాలతో స్నానం చేయించారు. అంరరిక్షంలో ఉన్న దేవతలు ఆ నరర్షభునికి స్నానం చేయించి తెల్లగొడుగునూ, చామరాలనూ, శుభ్ర వస్త్రాలనూ సమర్పించారు.

ఆ సమయంలో ఒక రాజపురుషుడు వేగంగా శుదోదన మహారాజు వద్దకు వెళ్ళి సంతోషంతో "దేవా, నీకు విపులమైన వృద్ధి కలుగుగాక! నీకు సకల లక్షణ భూషితుడైన కుమారుడు కలిగినాడు. మహా కులరత్నానికి మెరుగుబెట్టేటట్టున్న అతడు స్పష్టంగా చక్రవర్తి లక్షణాలతో విరాజిల్లుతున్నాడు. అతనికి జంబూధ్వజంలో (జంబూ ద్వీపంలో) ఎదురుండడు. ఏకచ్ఛత్రాధిపతి అవుతాడు" అని విన్నవించాడు. ఇంతలో మరొక రాజపురుషుడు వచ్చి చేతులు జోడించి "దేవా, నీకు విపులమైన సంపద

కలుగుగాక! నీ శాక్యవంశంలో ఇరవయి అయిదువేలమంది కుమారులు జన్మించారు. అందరూ బలోపేతులే. ఉదగ్రులే. ఇతరులకు ఎదిరింపరాని వారే'' అని విన్నవించాడు. తర్వాత మూడవ రాజపురుషుడు వచ్చి "నేను తెచ్చిన ఈ ఆనందవార్తను విను. ఛందకుడు మొదలయి ఎనిమిది వందల మంది చేటీపుత్రులు జన్మించారు. కంటకాశ్వానికి నెచ్చెలులయిన గుర్రాలు పదివేలు పుట్టాయి. అవన్నీ శ్రేష్ఠమయినవి. బంగారువంటి దేహచ్ఛాయగలవి. సుందరమైన జాలు కలవి'' అన్నాడు.

తర్వాత ఇరవై వేలమంది కోట్టరాజులు (దుర్గాధీశులు) వచ్చి శుద్ధోదనుణి క్రమానుసారం గౌరవించి "దేవా, జయము, జయము. ఏమి పని చేయాలో వెంటనే మాకు ఆనతి ఇయ్యి. మేము పోయి ఆ పనిని నెరవేర్చుకొని వస్తాము. ఓ భట్టదేవ, నీవిక్కడే వుండు. మేము నీ భృత్యులం గదా!'' అని విన్నవించారు.

ఇంతలో బంగారు భూషణాలతో వెలిగిపోతున్న నాగులు ఇరవై వేలమంది ఆకాశంపై గర్జిస్తూ రాజగృహానికి త్వరగా వచ్చి "ఓ దేవ, కృష్ణ, నబల, వత్స, గోప మొదలయిన అరవై వందలమంది బాలికలు జన్మించారు. దేవదేవోత్తముడైన సుతుడు పుట్టిన సమయాన ఇది కూడా రాజగృహానికి సమృద్ధే. నృపతీ, నీవు వెళ్ళి అంతా స్వయంగా చూడు. పుణ్యతేజఃప్రభ లీనే కుమారుణ్ణి వేలకొద్దీ నరులూ, దేవతలూ చూచి ఎంతో సంతోషించారు. గుణసాగరుడు, శోకరహితుడు అయిన అతనిని చూడడానికి జనులు బయలుదేరి వచ్చారు'' అని మనవి చేశారు.

ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు జన్మించగా దానాలు బాగా జరిగాయి. ఐదు వందల కులికలు (శిల్పికులశ్రేష్ఠులు) ప్రసవించారు. యశోవతి మొదలైన పదివేల కన్యకలూ ప్రసవించారు. ఎనిమిదివందల దాసీజనం ఛందకుడు మొదలైన ఎనిమిది వందలమందిని ప్రసవించారు. ఎనిమిదివందల ఆడుగుర్రాలు కంటకం మొదలైన పదివేల పిల్లలను ఈనాయి. ఐదువేల ఏనుగులు అయిదువేల పిల్లఏనుగులను ప్రసవించాయి. వాటిని గమనించేవారితో కూడా శుద్ధోదనుడు ఆ అశ్వాదులను కుమా



రుడికి ఆటలాడుకొనడానికి ఇచ్చాడు. కోట్లకొలది వున్న ద్వీపాలమధ్యనున్న భూమిపైని రావిమాను ఉద్భవించింది. అక్కడ చందనవనం ఒకటి వెలసినది. అది బోధిసత్త్వుని అనుభావంవల్ల బోధిసత్త్వుని అనుభవం కొరకే ఏర్పడింది. ఆ బోధిసత్త్వుడు అనుభవించడంకొరకే అయిదు వందల ఉద్యానాలు పట్టణం అంతటా ఏర్పడినవి. అయిదువేల నిధులు భూమినుంచి బయటికి ఉబికాయి. శుద్ధోదన మహారాజు, కుమారుడికి ఏవేవి కావాలని సంకల్పించాడో, అవన్నీ సిద్ధంగా ఉండినవి.

తర్వాత, తన కుమారునికి ఏమి పేరు పెట్టాలి? అనే ఆలోచన శుద్ధోదనునికి కలిగింది. అతడు బాగా ఆలోచించాడు. "కుమారుడు జన్మించగానే సర్వములైన అర్థాలూ నాకు సిద్ధించినవి. ఆ కారణంవల్ల ఈ కుమారుడికి సర్వార్థసిద్ధి అనే పేరు పెడతాను'' అని అనుకున్నాడు. తర్వాత రాజు బోధిసత్త్వుణ్ణి గొప్పగా గౌరవించి "ఈ నా కుమారుడు పేరుచేత సర్వార్థసిద్ధుడై ఉండునుగాక!'' అని ఆ పేరే పెట్టినాడు.

ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు పుట్టగానే తల్లి కుక్షిలోని పార్శ్వభాగం అనుపహతంగా, అక్షతంగా యథాపూర్వంగా ఉండినది. మూడు జలకూపాలు పెల్లుబికి పారాయి. పరిమళ తైల సరస్సులు ప్రాదుర్భవించాయి. అయిదువేలమంది అప్సరసలు దివ్య పరిమళంతో గుమగుమలాడే తైలాన్ని తీసుకుని బోధిసత్త్వునితల్లిదగ్గరకు వచ్చి 'పుత్రరత్నాన్ని ప్రసవించిన మీ శరీరానికి శ్రమలేక సుఖంగా వున్నదా?' అని కుశలం ప్రశ్నించారు. ఆ రీతిగానే అయిదువేలమంది అప్సరసలు దివ్యమైన మైపూతను తీసుకుని వచ్చి, ఐదువేలమంది అప్సరసలు దివ్యగంధోదకంతో నిండిన ఘటాలను తీసుకొని వచ్చి, ఐదువేలమంది అప్సరసలు దివ్యాలైన వస్త్రాలు, పాత్రిళ్ళు తీసుకుని వచ్చి, ఐదువేలమంది అప్సరసలు దివ్యాలయిన ఆభరణాలు తీసుకొని వచ్చి, అయిదువేలమంది అప్సరసలు దివ్య తూర్యాలు ధ్వనిచేస్తూ సంగీతం పాడుతూ వచ్చి ఆమె క్షేమాన్ని ప్రశ్నించారు. జంబూద్వీపంలో వుండే పంచాభిజ్ఞులైన ఋషులందరున్నూ ఆకాశమార్గంగా వచ్చి, రాజైన శుద్ధోధనుని యెదుట నిలిచి జయ జయ ధ్వనులు, వర్ధతాం వర్ధతాం ధ్వనులు చేశారు.

భిక్షులారా, బోధిసత్త్వుడు జన్మించగానే లుంబినీవనంలో ఏడు రాత్రులు దివ్యులూ, మానవులున్నూ తూర్యధ్వనులు చేస్తూ, అతని జన్మ కొనియాడారు. ఎంతో గౌరవించారు. పూజించారు. ఖాద్యాలూ, భోజ్యాలూ, స్వాదనీయాలూ అయిన భక్ష్యాలను సమర్పించారు. శాక్య వంశంలోనివా రందరూ ఒకటిగా వచ్చి 'ఆనందం, ఆనందం' అని ఘోషించారు. ఎన్నో దానాలు చేశారు. పుణ్యకార్యాలు చేశారు. ముప్ఫయిరెండు లక్షల బ్రాహ్మణులకు ప్రతిదినమూ సమారాధన జరిగేది. ఎవరు ఏమి కోరితే అది వారికి ఇవ్వబడింది. దేవతలకు ప్రభువైన ఇంద్రుడూ, బ్రహ్మ ఆ బ్రాహ్మణ సదస్సులో మానవరూపాలను ధరించి అగ్రాసనంపై కూర్చుండి మంగళరూపమైన కొన్ని గాథలను భాషించారు. వాటి తాత్పర్యమిది_

"అపాయాలన్నీ తొలగిపోయి జగత్తు సుఖంగా వుంది గనుక సుఖకరుడైన ఈ కుమారుడు జగత్తును సుఖంలో నిలుపుతాడనడం నిశ్చయం. చీకట్లు పోగొట్టే ఈయన దేహకాంతి రవిచంద్ర సురప్రభా పటలాన్ని కూడా తిరస్కరించి ప్రకాశిస్తున్నది గనుక ఈయన పుణ్య ప్రభతో జన్మించాడనడం ధ్రువం. కళ్ళు లేనివారు చూడగలుగుతున్నారు. చెవులు లేనివారు వినగలుగుతున్నారు. ఉన్మత్తులు స్మృతిమంతులు అవుతున్నారు. కనుక ఇతడు లోకానికి జ్ఞానచైతన్యం కలిగించేవాడు కావడం తప్పదు. లోకంలో క్లేశాలన్నీ శాంతించాయి. జగత్తంతా మిత్రజనమయ మయింది. కనుక ఇతడు బ్రహ్మ కోటులకు పూజార్హుడవుతాడనడం నిస్సంశయం. సాలవృక్షాలు పుష్పించాయి. మేదిని సమస్థితిలో వున్నది. కనుక ఈయన సర్వజగత్పూజ్యుడైన సర్వజ్ఞుడు కావడం తప్పదు. లోకం నిరాకులంగా వుంది. ఈయనతోపాటే మహాపద్మం పుట్టింది. కనుక ఈ మహాతేజస్వి లోకనాథుడు కావడం నిస్సందేహం. దివ్య గంధోపవాసితాలైన వాయువులు మృదువుగా వీస్తూ ప్రాణుల వ్యాధులను శమింపజేస్తున్నవి. కనుక ఇతడు భవరోగ వైద్యరాజు కాగలడు. వందల కొలదిగా వున్న ఈ దేవతలు తమ రూపధాతువులో రాగం తొలగి కృతాంజలులై ఇతనికి నమస్కరిస్తున్నారు గనుక ఇతడు దక్షిణీయుడవుతాడు. దేవతలను మానవులు, మానవులను దేవతలు చూస్తున్నారు.



పరస్పరం ద్వేషించడం లేదు. కనుక ఇతడు సార్థవాహుడు (తనతోపాటు ప్రజలను నడిపించేవాడు) అవుతాడు. అగ్ని శాంతించింది. నదులు పొంగాయి. భూమి సూక్ష్మంగా కంపిస్తున్నది. కనుక ఇతడు తత్త్వ దర్శకుడవుతాడు."

భిక్షులారా, ఇలా బోధిసత్త్వుడు జన్మించి ఏడు రాత్రులు కాగా, అతని తల్లి అయిన మాయాదేవి కాలం చేసినది. ఆమె దేహాన్ని చాలించి ముప్ఫయి ముగ్గురు దేవతలతోను కలిసిపోయినది. ఓ భిక్షులారా, బోధిసత్త్వుని అపరాధంవల్లనే మాయాదేవి కాలగతిని పొంది ఉంటుందని మీకు సందేహం కలుగవచ్చును. కాని, మీరు అలా అనుకోకూడదు. ఆమెకు ఆయుస్సు అవధి అంతే! ఇదివరలో అవతరించిన బోధిసత్త్వుల మాతలు కూడా పుత్రులు జన్మించిన ఏడు రాత్రులకే కాలంచేసి వున్నారు. బోధిసత్త్వుడు వివృద్ధుడై పరిపూర్ణేంద్రియాలతో అభినిష్క్రమించినందున తల్లి హృదయం పగిలిపోతుంది.

మాయాదేవి ఎట్టి వ్యూహంతో కపిలవస్తుపురంనుంచి ఉద్యానవనానికి వచ్చినదో, అంతకంటెను శతసహస్రకోట్ల వ్యూహంతో ఏడవ దినాన బోధిసత్త్వుడు కపిలవస్తు మహానగరంలో ప్రవేశించినాడు. అతడు నగరంలో ప్రవేశిస్తూ వుండగా సుగంధ జలాలతో నిండిన అయిదువేల పూర్ణకుంభాలు ఎదురుగా తీసుకొనిరాబడినవి. నెమలి పురులు (మయూర హస్తకాలు) పట్టుకొన్న ఐదువేలమంది కన్యకలు ముందు నడిచారు. అయిదువేలమంది కన్యకలు తాటాకు విసనకర్రలు పట్టుకొని ముందు నడిచారు. మరి ఐదువేలమంది కన్యకలు గంధోదకంతో నిండిన బంగారు పాత్రలను పట్టుకుని ముందుగా పోతూ, ఆ నీటిని మార్గం పైని చల్లారు. ఐదువేలమంది కన్యలు విచిత్రాలైన వస్త్రాలను పట్టుకొని ముందు వెళ్ళారు. ఐదువేలమంది కన్యకలు చేతులలో వ్రేలాడుతున్న పూల దండలతో ముందు వెళ్ళారు. ఐదువేలమంది కన్యలు రత్నాలంకారాలు పట్టుకుని, ముందు వెళ్ళుతూ దారిని సరిపరిచారు. ఐదువేలమంది కన్యలు భద్రాసనాలు పట్టుకొని ముందు వెళ్ళారు. ఐదువేలమంది కన్యలు గంటలు వాయిస్తూ, మాంగల్య శబ్దాలు వినిపిస్తూ వెళ్ళారు. ఇరవై వేల

ఏనుగులు సకలాలంకార భూషితాలై ముందు నడిచాయి. ఇరవై వేల ఏనుగులు బంగారు నగలతో మెరిసిపోతూ ముందు నడిచాయి. ఎత్తైన ధ్వజపటాలతో, చిరుగంటలతో అలంకృతమైన ఎనభై వేల రథాలు బోధిసత్త్వుని వెనుక నడిచాయి. శూరులూ, వీరులూ, మంచి దేహసౌష్ఠవం కలవారూ, దృఢమైన కవచాలు ధరించినవారూ అయిన భటులు నలభై వేల మంది బోధిసత్త్వుని వెనుక నడిచారు. కామావచరులూ, రూపావచరులూ అనబడే దేవపుత్రులు శతసహస్ర కోటినయుత సంఖ్యతో గగనతలాన్ని నానా ప్రకారమైన వ్యూహాలతో పూజలు చేస్తూ వెంట నడిచారు. బోధిసత్త్వుడు ఆరోహించిన రథాన్ని కామావచరులనే దేవతలు అనేక వ్యూహాలతో అలంకరించారు. ఇరవై వేలమంది దేవకన్యలు సకలాలంకారాలు ధరించి రత్నాల పగ్గాలు కట్టిన రథం మోసుకొని వెళ్లారు. ఇద్దరు అప్సరసల మధ్య ఒక మానవకన్య, ఇద్దరు మానవకన్యల మధ్య ఒక అప్సరస–ఇలా నిలబడ్డారు. అప్సరసలకు మానవస్త్రీల దుర్గంధం తగలడం లేదు. మానవస్త్రీలు అప్సరసల రూపం చూచి పొరపడడం లేదు. ఇదంతా బోధిసత్త్వుని తేజఃప్రభావం.

భిక్షువులారా, కపిలవస్తు నగరంలో సర్వార్థసిద్ధునికోసం ఐదువందల మంది శాక్యులు ఐదువందల గృహాలు నిర్మించారు. వారు నగరంలో ప్రవేశిస్తున్న బోధిసత్త్వుడు తమ ఇండ్లముందు రాగానే గృహద్వారమూలంలో నిలబడి అంజలి ఘటించి, సగౌరవంగా ఇలా విన్నవించారు :—“ఇదిగో! సర్వార్థసిద్ధుడా, ఈ గృహం ప్రవేశించు. ఇదిగో! సారథిశ్రేష్ఠుడా, ఇక్కడ ప్రవేశించు. ఇదిగో! ప్రీతి ప్రమోదకరుడా, ఈ గృహం ప్రవేశించు. ఇదిగో! అనిందితమయిన యశస్సు కలవాడా, ఈ గృహం ప్రవేశించు. ఇదిగో! సమంతచక్షూ, ఈ నా గృహం ప్రవేశించు. అసమసమా, ఇక్కడికి రా. సాటిలేని తేజోగుణ లక్షణాలతో అలంకృతమైన దేహం కలవాడా, ఇక్కడికి రా” అని పిలిచారు. అతనియందుండే స్నేహాన్ని పురస్కరించుకొని “సర్వార్థసిద్ధా!” అని ఆహ్వానించారు. అప్పటినుంచీ సర్వార్థసిద్ధుడనే పేరు అతనికి ప్రసిద్ధికెక్కింది.



శుద్ధోదనమహారాజు వారందరినీ సంతుష్టి పరచడానికి బోధిసత్త్వుని ఒక్కొక్కరి ఇంటిలోనూ ప్రవేశపెట్టి నాలుగు మాసాలైన తర్వాత తన యింటికి తీసుకుని వచ్చినాడు. అక్కడ ‘నానారత్న వ్యూహం’ అనే పేరుగల మేడలో బోధిసత్త్వుడు ప్రవేశించాడు. అక్కడ బుద్ధిమంతులూ, వృద్ధులూ అయిన శాక్యులందరూ చేరి “హితబుద్ధితోనూ, స్నేహంతోనూ గుణాలు ఏర్పడేటట్టూ, సౌమ్యత అలవడేటట్టూ కాపాడడానికీ, ఆటలాడించడానికీ తగినది ఎవరా?” అని ఆలోచించారు. అక్కడున్న అయిదు వందల శాక్యస్త్రీలలో ప్రతి ఒక్కరూ తానే ఆ కుమారుణ్ణి భద్రంగా చూస్తానని చెప్పినది. అప్పుడు మహల్లకమహల్లికులైన (కంచుకులు) శాక్యులు ఇలా అన్నారు. “ఈ యువతులందరూ క్రొత్తవాళ్లూ, చిన్నవాళ్లూ, యువతులున్నూ. రూప యౌవనగర్వంచేత మదించి వుంటారు. ఆ యా సమయాలను కనిపెట్టి బోధిసత్త్వుణ్ణి సంరక్షించడానికి వీరు ఎంత మాత్రమూ తగరు. ఈ కుమారునికి పినతల్లి మహాప్రజాపతి గౌతమి మాత్రమే యితణ్ణి సుఖంగా పెంచడానికీ, శుదోదనునికి ధైర్యం చెప్పి నెమ్మది కూర్చడానికిన్నీ తగినది.” ఇలా వారందరూ కూడి ఆలోచించుకొని మహాప్రజాపతి గౌతమికి ఉత్సాహం కలిగేటట్లు మాటలాడారు. గౌతమీదేవి ఆ పిల్లవానిని పెంచుతూ వుండినది. ఆ బోధిసత్త్వుని కోసం ముప్ఫయి యిద్దరు పెంపుడు తల్లులు నియమించబడినారు. వారిలో ఎనమండుగురు అవయవాలను భద్రంగా చూచేవారు. ఎనమండుగురు పాలిచ్చేవారు. ఎనమండుగురు మలశోధన చేసేవారు. ఎనమండుగురు ఆటలాడించేవారు.

తర్వాత రాజైన శుద్ధోదనుడు శాక్యుల గణాన్ని అంతటినీ ఒకచోట చేర్చి వారితో చర్చించాడు “ఈ కుమారుడు మొదట రాజై తర్వాత చక్రవర్తి అవుతాడా? లేక సన్న్యాసం తీసుకొనడానికి అభినిష్క్రమణం చేస్తాడా?” అని.

ఆ సమయంలో పర్వతరాజైన హిమవంతుని పార్శ్వంలో అసితుడనే మహాముని నివసిస్తూ ఉండేవాడు. పంచాభిజ్ఞుడైన ఆ మహర్షి

మేనల్లుడైన నరదత్తుడు కూడా అతనితో కలిసి వుండేవాడు. బోధిసత్త్వుడు పుట్టినవెంటనే ఆ మహాముని చాలా అద్భుత సంఘటనలను చూచినాడు. అతడు 'బుద్ధ' అనేమాటను ఉచ్చరిస్తూ, గుడ్డలను ఇటూ, అటూ విసురుతూ, సంతోషంతో తిరుగుతూ వున్న గగనచరులైన దేవపుత్రులను చూచినాడు. ఇంకా ఏమి కనబడతాయా అని అతనికి తోచింది. అతడు తన దివ్యదృష్టితో జంబూద్వీపాన్ని చూస్తూ అందులో కపిలవస్తు మహానగరంలో రాజైన శుదోదనుని గృహంలో వందలకొద్దీ పుణ్యాలవలన కలిగిన తేజస్సుతో ప్రకాశిస్తూ జన్మించిన రాజకుమారుని చూచినాడు. ఆ పిల్లవాడు సర్వలోకాలకూ పూజనీయుడు. ముప్ఫయి రెండు మహాపురుష లక్షణాలతో అలంకరించబడిన దేహం కలవాడు. ఆ బాలుణ్ణి దివ్యదృష్టితో చూచి ఆ మహాముని బ్రహ్మచారిఅయిన నరదత్తుడితో ఇలా పలికినాడు:- "అబ్బాయీ! తెలుసునా? జంబూద్వీపంలో మహారత్నం ఒకటి ఉద్భవించినది. కపిలవస్తు మహానగరంలో శుద్ధోదన మహారాజుగృహంలో కుమారుడు పుట్టినాడు. అతడు వందలకొద్దీ పుణ్యాలవల్ల కల్గిన తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. అతడు సర్వలోకాలకూ పూజనీయుడు, ముప్ఫయి రెండు మహాపురుషలక్షణాలతో వున్నాడు. అతడు గృహంలోనే ఉండేటట్లయితే, చతురంగ బలంతో విజయాలు పొందుతూ వుండే చక్రవర్తి కాగలడు. ధార్మికుడై, ధర్మరాజై, పరాక్రమవంతుడై సప్తరత్నాలనూ పొందుతాడు. ఆ ఏడురత్నాలు ఏవన—చక్రరత్నం, హస్తిరత్నం, అశ్వరత్న, మణిరత్నం, స్త్రీరత్నం, గృహరత్నం, పరిణాయకరత్నం అనేవి. అతనికి శూరులూ, వీరులూ, చక్కనివారూ, శత్రుసైన్యాలను బాగా మర్దించేవారూ అయిన వెయ్యిమంది కుమారులు సప్తరత్నసంపూర్ణులై పుట్టగలరు. అతడు శిక్షలు లేకుండా, ఆయుధాలను ఉపయోగించకుండా తన ధర్మబలంచేతనే సముద్ర వలయితమైన యీ భూమండలాన్ని జయించి ఐశ్వర్యాధిపత్యంతో రాజ్యపాలన చేయగలడు. అతడు గృహాన్ని విడిచి అనగారికుడై సన్న్యసిస్తే సమ్యక్సంబోధిని పొంది అర్హతుడూ, తథాగతుడూ అయి, నాయకత్వం వహించి లోకంలో శాసకుడూ సంబుద్ధుడూ కాగలడు. ఇదిగో అతనిని దర్శించడానికి మనం వెళ్ళుదాము."



తర్వాత ఆ అసితమహర్షి మేనల్లుడైన నరదత్తుడితోకూడా రాజహంసవలె ఆకాశంపైకి ఎగిరి కపిలవస్తు మహానగరందగ్గిర దిగాడు. అలాగున దిగి, తన శక్తిని ఉపసంహరించి కాలినడకనే నగరంలో ప్రవేశించాడు. అతడు శుద్ధోదనమహారాజుభవనం చేరి, ఆ భవనద్వారందగ్గర నిలిచినాడు.

భిక్షులారా, ఈ విధంగా ఆ మహర్షి ఆ ద్వారందగ్గర లక్షలకొద్దీ జనాన్ని చూచాడు. ఆ రీతిని అతడు ద్వారపాలకునిదగ్గరకు పోయి "ఓ పురుషుడా! నీవు రాజైన శుద్ధోదనుని దగ్గరకు పోయి రాజద్వారంలో ఒక ఋషి కాచుకొని వున్నాడని మనవిచెయ్యి" అని చెప్పినాడు. అతడు 'సరే' అని మహర్షితో పలికి రాజుగారున్న చోటికి వెళ్లి చేతులు జోడించుకొని ఇలా మనవి చేశాడు——"దేవా! చాలా వృద్ధుడూ, జీర్ణావయవములు కలవాడూ, మహల్లకుడూ (ఏమీ చేతకానివాడూ) అయిన ఒక ఋషి ద్వారందగ్గర కాచుకొని వున్నాడు. రాజుగారిని తాను చూడవలెనని అంటున్నాడు" అని.

రాజైన శుద్ధోదనుడు ఆ మాట విని ఆ మహర్షికి ఆసనం సిద్ధం చేయించి "ఆ ఋషిని ప్రవేశించమని చెప్పు" అని ఆ పురుషునితో పలికినాడు. అప్పుడు ఆ పురుషుడు రాజభవనంనుంచి వచ్చి, ఆ మహర్షితో "తమరు లోపలికి వెళ్ళవచ్చును" అని చెప్పినాడు.

అసితమహర్షి శుదోదన మహారాజు ఉన్నచోటికి పోయి, అతని యెదుట నిలిచి "జయము జయము మహారాజా! నీకు చిరాయువు కల్గును గాక! ప్రజలను ధర్మంగా ఏలుతూ రాజ్యాన్ని పాలింతువుగాక!" అని దీవించినాడు.

శుద్ధోదన మహారాజు ఆ అసితమహామునికి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి పూజించి ఎంతో ఆదరంగా గౌరవించి ఆసనం చూపినాడు. ఆ మహాముని సుఖోపనిష్టుడైన పిదప "ఓ మహర్షీ! ఇదివరకు తమ దర్శనం నాకు లభించినట్లు జ్ఞప్తిలో లేదు. ఏ కార్యంపైని తమరు దయచేశారో తెలుప ప్రార్థన" అని మిక్కిలి మర్యాదగా ప్రశ్నించాడు.

రాజు యిలా ప్రశ్నించగా ఆ అసితమహాముని "ఓ మహారాజా! మీకు కుమారుడు కలిగినాడుకదా! అతనిని చూడాలనే కుతూహలంతో వచ్చాను" అన్నాడు.

అప్పుడు రాజు "పిల్లవాడు నిద్రపోతున్నాడు. ముహూర్తమాత్రం ఆగండి. నిద్రలేస్తాడు" అన్నాడు.

అప్పుడు ఆ మహాముని "ఓ మహారాజా! అటువంటి మహాపురుషులు చాలాసేపు నిద్రపోరు. అట్టి సత్పురుషులు మేలుకొని ఉండే స్వభావం కలవారే!" అని అన్నాడు.

భిక్షులారా, అప్పుడు అసితమహామునియందుండే దయవల్ల బోధసత్త్వుడు మేలుకొన్నాడు. శుద్ధోదనమహారాజు కుమారుడైన సర్వార్థసిద్ధుని రెండు చేతులతోనూ భద్రంగానూ, నెమ్మదిగానూ పట్టుకొని, అసితమహాముని సమీపానికి తీసుకొని వచ్చాడు.

అసితమహర్షి బోధిసత్త్వుణ్ణి చూచినాడు. బాలుడుగా అవతరించిన ఆ బోధిసత్త్వుడు ముప్ఫయిరెండు మహాపురుష లక్షణాలతో ఎనభై అనువ్యంజనాల గుర్తులతో విచిత్రమైన అవయవాలు కలిగి, ఇంద్ర బ్రహ్మలోకపాలురను అతిశయించిన శరీరం కలవాడై, కోటిసూర్యుల తేజస్సు కలవాడై, సర్వాంగసుందరుడై ఉన్నాడు. ఇట్టి బోధిసత్త్వుణ్ణి చూచి ఆ ముని ఉదానవాయువు బైటికి ఉబికేటట్లు శ్వాసించి, మిక్కిలి ఆశ్చర్యంతో "ఆహా! ఈయన మహాశ్చర్య పుంగలుడు. ఈ లోకంలో అవతరించాడు" అంటూ ఆసనం మీదనుంచి లేచి, చేతులు జోడించుకొని, బోధిసత్త్వుని పాదాలపై పడి, ప్రదక్షిణంచేసి, అతనిని తన తొడపై కూర్చుండబెట్టుకొని, ధ్యాననిమగ్నుడైనాడు. ముప్ఫయిరెండు మహాపురుష లక్షణాలు చూచినాడు. ఈ లక్షణాలతో వున్న పురుష పుంగలునికి (శ్రేష్ఠునికి) రెండే పద్ధతులు ఉంటాయని ఆ మహామునికి తెలుసును. అతడు గృహంలోనే వుండేటట్లయితే రాజు కాగలడు. చతురంగ బలాలతో కూడి, చక్రవర్తి అయి ఆధిపత్యాన్నీ, ఐశ్వర్యాన్నీ పొంది వుంటాడు. గృహాన్ని విడిచి సన్న్యసిస్తే తథాగతుడు కాగలడు. అసితుడు బోధిసత్త్వుణ్ణి చూచి మొదట ఏడ్చి కన్నీరు విడిచినాడు. తర్వాత గంభీరంగా నిట్టూర్చినాడు.



ఆ విధంగా మొదట యేడుస్తూ, కన్నీరు విడిచి, తర్వాత గంభీరంగా నిట్టూర్పులు విడిచిన అసితమహామునిని శుద్ధోదనమహారాజు చూచాడు. శరీరం జలదరించగా దీనమైన మనస్సు కలవాడై తొందర తొందరగా ఆ మహర్షితో "ఓ మహర్షీ! ఏ కారణంవల్ల మీరు మొదట యేడుస్తూ కన్నీరు విడిచి, తర్వాత గంభీరంగా నిట్టూర్పు విడిచారు? కుమారుడికి ఏ విధమైన ఆపద లేదుగదా?" అని ప్రశ్నించినాడు.

అప్పుడు అసితమహర్షి శుద్ధోదన మహారాజుతో ఈ రీతిని పలికాడు—"ఓ మహారాజా! నేను కుమారుడినిగురించి ఎంతమాత్రమూ ఏడ్వలేదు. ఇతనికి ఏ విధమైన ఆపదా లేదు. నన్నుగురించే నే నేడుస్తున్నాను. కారణం ఏమంటే - నేను వృద్ధుడను. అవయవాలు జీర్ణించిపోయాయి. మహల్లకుడను. నీ కుమారుడైన యీ సర్వార్థసిద్ధుడు తప్పకుండా లోకోత్తరమైన ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేయగలడు. ఇదివరలో ఏ శ్రమణుడుగానీ, ఏ బ్రాహ్మణుడుగానీ, ఏ దేవతగానీ, మారుడుగానీ, తదితరులుగానీ లోకంలో ఇట్లు ధర్మాన్ని ప్రవర్తింపజేసినవారు లేరు. ఇతడు దేవతలతోసహా సకల లోకహితానికీ, సుఖానికీ ధర్మాన్ని బోధించగలడు. ఆదిలోనూ, మధ్యలోనూ, అంతంలోనూ కూడా కల్యాణమయమూ, మంచి అర్థం కలదీ, కేవలమూ, సావయవమూ, సంపూర్ణమూ, పరిశుద్ధమూ, స్వచ్ఛమూ అయిన బ్రహ్మచర్యమును ప్రాణులకు వెల్లడించగలడు. ఇతనివల్ల ఆ ధర్మాన్ని విని జాతిధర్మాలను అనుసరించే ప్రాణులు జాతివల్ల విడుదల పొందుతారు. ఇల్లే ముసలితనం, రోగం, మరణశోకం, విచారం, దుఃఖం, మనస్సు కలతపాటు, ఆయాసం మున్నగువాటినుంచి విముక్తి పొందుతారు. రాగం, ద్వేషం, మోహం అనే అగ్నులవల్ల తపించబడ్డ ప్రాణులకు సద్ధర్మమనే జలవర్షంవల్ల సంతోషాన్ని కలిగిస్తాడు. చెడ్డదృష్టి కలవారికీ, చెడు మార్గాల్లో నడిచేవారికీ ఋజుమార్గాన్ని ఉపదేశించి నిర్వాణ మార్గానికి తీసుకువస్తాడు. సంసారమనే పంజర చారకంలో (చెరలో) పడి క్లేశాలుపడే ప్రాణులకు బంధమోక్షాన్ని కలిగిస్తాడు. అజ్ఞానమనే తిమిరరోగంవల్ల కన్నులు కానరాని ప్రాణులకు ప్రజ్ఞ అనే దృష్టిని కలిగిస్తాడు. క్లేశమనే శల్యం గ్రుచ్చు

కొన్ని ప్రాణులకు ఆ శల్యాన్ని ఊడలాగి సుఖాన్ని కలిగిస్తాడు. మహారాజా! అత్తిచెట్టు ఎప్పుడోగాని, ఎందుకోగాని పుష్పించదు. ఎక్కడోగాని దాని పువ్వు లభించదు. ఆ విధంగానే ఒకానొకప్పుడు ఎక్కడో ఒక్కచోట ఎన్నో కోట్ల కల్పాలకు భగవానులైన బుద్ధులు లోకంలో జన్మిస్తారు. ఈ నీ కుమారుడు తప్పకుండా లోకోత్తరమైన అనుత్తర సమ్యక్సంబోధిని బోధించగలడు. అలా బోధించి కోట్లకొలదిగా వున్న ప్రజలను సంసార సాగరంనుండి దరిని చేర్చగలడు. వారికి అమృతత్వాన్ని పొందించగలడు. అట్టి స్థితిలో ఈ బుద్ధరత్నాన్ని చూడలేక పోతున్నాను గదా అని నేను ఏడుస్తున్నాను. ఇట్టి నా అనారోగ్య స్థితిలోనయినా ఇతనిని పూజిస్తున్నాను గదా అని దీర్ఘంగా నిట్టూరుస్తున్నాను.

ఓ మహారాజా! మాకు మంత్ర, వేద, శాస్త్రాలవల్ల యీ సర్వార్థసిద్ధుడు గృహంలో ఉండడనే విషయం తెలుస్తున్నది. ఎట్లనగా- ఈ కుమారుడు ముప్ఫయిరెండు మహాపురుష లక్షణాలతోనూ సమన్వితుడు. ఆ ముప్ఫయిరెండు లక్షణాలూ ఏవో విను. ఈ సర్వార్థసిద్ధుడు ఉష్ణీషశీర్షుడు. ఇది మొదటి మహాపురుష లక్షణం. అతడు భిన్నాంజన మయూర కలాపంవలె మిక్కిలి నీలమై, కుడివైపు సుడిగల (దక్షిణావర్త) కేశములతో ఉన్నాడు. సమంగానూ, విశాలంగానూ ఉన్న నుదురు కలవాడు. ఇతని కనుబొమల మధ్య హిమ, రజత ప్రకాశం గల సుడి వున్నది. ఆవు రెప్పలవంటి రెప్పలు కలిగి వున్నాడు, కన్నులు మిక్కిలి నల్లనివి. సరిసమంగా ఉన్న నలభై దంతాలున్నవి. అవి సందులు లేక దగ్గర దగ్గరగా ఉన్నవి. తెల్లగానూ ఉన్నవి. ఒ మహారాజా! సర్వార్థసిద్ధుడు బ్రహ్మస్వరం కలవాడు. నాలుక పెద్దదిగను, పల్చగను ఉన్నది. రసనాగ్రం సరసముగా ఉన్నది. సింహపు దవడలవంటి దవడలు గలవాడు. ఎగుభుజాలు గుండ్రనివి. సప్తోత్సదుడు (ఎత్తైన ఏడు అంగాలు కలవాడు). తగిన భుజమధ్యభాగం (దండలు) కలవాడు. బంగారంవంటి మేనిచాయ కలవాడు. వంగక వ్రేలుచున్న బాహువులు కలవాడు. సింహాన్ని పోలిన పూర్వదేహం కలవాడు, న్యగ్రోధ పరిమండలం కల



వాడు. విడివడి ఒంటిగా వున్న రోమాలు కలవాడు. ఒక్కొక్క రోమమూ ఊర్ధ్వాగ్రమై, దక్షిణావర్తం కలిగివున్నది. కోశోపగతమయిన (మరుగుగా ఉన్న) పొత్తి కడుపు, గుహ్యావయవం కలవాడు, గుండ్రని తొడలు కలవాడు. జింకవంటి పిక్కలు. సింహంవంటి పిక్కలు కలవాడు. పొడవైన వ్రేళ్లు కలవాడు. పొడవైన కాలిమడమలు, పాదములు కలవాడు. కలయికలేని పాదాలు కలవాడు. మృదువులూ, లేతవీ అయిన హస్త పాదాలు కలవాడు. జాలమువంటి (గుత్తుగా గల) వ్రేళ్ళు గల కాలుసేతులు కలవాడు. పొడుగు వ్రేళ్ళు కలవాడు. సమతలమయిన ఇతని పాదాల అడుగు భాగంలో కుంచమూ, అంచూ, రేకలూ గల చిత్రమైన చక్రాలు ఉన్నవి. అవి ఎంతో ప్రకాశిస్తూ, తెల్లగా ఉన్నవి. మహారాజా! నీ కుమారుడు ఈ ముప్ఫయిరెండు మహాపురుష లక్షణాలతోనూ ఉన్నాడు. ఇట్టి లక్షణాలు చక్రవర్తులకే ఉంటాయి. బోధిసత్త్వాలకు కూడా ఉంటాయి.

మహారాజా! మీ కుమారుడైన సర్వార్థసిద్ధుని శరీరంలో ఎనభై అనువ్యంజనా లున్నవి. అవి ఉన్నవాడు గృహంలో నివసించడు. తప్పక సన్యసించడానికి అభినిష్క్రమిస్తాడు. ఆ అభివ్యంజనాలు ఏమంటే— సర్వార్థసిద్ధుడు ఎత్తుగానూ, ఎర్రగానూ, నునుపుగానూ ఉన్న గోళ్ళు కలవాడు. ఇతని వ్రేళ్ళు వృత్తములుగానూ, ఆనుపూర్వికంగా చిత్రంగానూ ఉన్నవి. మొదళ్లు గూఢమైనవి. గుల్ఫాలు గూఢంగా ఉన్నవి. కీళ్ళు ఘనమైనవి. పాదాలు హెచ్చుతగ్గులు లేకుండా సమంగానూ, పొడవుగానూ ఉన్నవి. ఇతని అరచెయ్యి నునుపుగానూ, సమంగానూ, గంభీరంగానూ, వంకర లేకుండానూ అనుపూర్వంగానూ, రేఖలతో కూడి వున్నది. పెదవి దొండపండువలె ఉన్నది. ఇతడు గట్టిగా మాటలాడుతూ అరవడు. మృదువై ఎర్రగా ఉన్న నాలుక కలవాడు. ఏనుగు ఘీంకారంవలెనూ, మేఘగర్జనంవలెనూ మధురమైన స్వరం కలవాడు. పరిపూర్ణాలైన ధ్వనులు కలవాడు. పొడవైన బాహువులు కలవాడు. శుచిగా ఉన్న అవయవాలతో కూడి ఉన్నవాడు. మృదువైన శరీరం కలవాడు. ఆ శరీరం విశాలంగానూ ఉంటున్నది. పుష్టిగానూ, ఉన్నతంగానూ ఉంటున్నది. దైన్యం లేకుండాను ఉంటున్నది. అవయవ సన్ని

వేశం విభక్తమై వుంటున్నది. మోకాళ్ళు పెద్దవిగానూ, విపులంగానూ, పరిపూర్ణంగానూ ఉంటున్నవి. శరీరం సువృత్తమై ఉంటున్నది. ఇతని శరీరం మిక్కిలి పరిశుభ్రంగానూ, వంకర లేకుండానూ, అనుపూర్వంగానూ ఉన్నది. ఇతని గాత్రం వృషభగాత్రం వంటిది. నాభి లోతుగానూ, వంకర లేకుండానూ ఆనుపూర్వికంగానూ ఉంటున్నది. ఋషభం వలెనే ఇతడు అంతటను ప్రసన్నత కలవాడు. మిక్కిలి పరిశుద్ధుడై, చీకటిని తొలగజేసే సర్వవ్యాప్తమైన కాంతి కలవాడు. గజరాజువలె మెల్లని నడక కలవాడు. సింహమువలెను, వృషభమువలెను, హంసవలెను ధీరమైన గమనం కలవాడు. ప్రదక్షిణావర్తమైన గమనం కలవాడు. వృత్తము, పరిశుభ్రము, వంకరలేనిది అయిన కుక్షి కలవాడు. వింటివంటి ఉదరం కలవాడు. నీలి, కాలిక (మంగు) మొదలయిన దోషాలులేని శరీరం గలవాడు. గుండ్రనివీ, వాడి అయినవీ, అనుపూర్వంగా ఉన్నవీ అయిన దంతాలు కలవాడు. ఎత్తయిన ముక్కు కలవాడు. శుచిగా వుండి, నిర్మలములై, నవ్వుతూ, విశాలంగానూ, పొడవుగానూ, నల్ల కలువల వలెనూ ఉన్న కన్నులు కలవాడు. పొందికగానూ, చిత్రంగానూ, నల్లగానూ, సంగతంగానూ ఉన్న కనుబొమలు కలవాడు. సమంగానూ, ఎత్తుగానూ ఉన్న చెక్కిళ్ళు కలవాడు. గండదోషమూ, ఏదుపూ లేనివాడు. స్పష్టములూ, పరిపూర్ణాలూ అయిన అవయవాలు కలవాడు. ఇతని ముఖమూ, లలాటమూ పొందికగా ఉన్నవి. శిరస్సు పరిపూర్ణమైనది. కేశములు నల్లనివై, మృదువులై, పరిమళిస్తూ ఉన్నవై, సుసంగతములై, చిక్కులేక అనుపూర్వంగా ఉన్నవి. అవి కుటిలములై, శ్రీవత్స, స్వస్తిక, నంద్యావర్త, వర్ధమాన లక్షణాలతో పొందికగా ఉన్నవి. మహారాజా, ఇవన్నీ నీ కుమారుడైన సర్వార్థసిద్ధునకు వుండే ఎనభై అనువ్యంజనాలు. ఇవి వున్నవాడు ఎన్నడూ గృహంలో నివసించడు. సన్న్యసించడానికి తప్పకుండా అభినిష్క్రమణం చేస్తాడు.''

శుద్ధోదన మహారాజు ఆ అసితమహర్షి వల్ల తన కుమారుని గురించిన యీ సమాచారం అంతా విని మిక్కిలి సంతోషంతో ఆనందించినాడు. ఎంతో ప్రీతినీ, సౌమనస్యాన్నీ పొందాడు. తాను కూర్చున్న ఆసనం



మీదనుండి లేచి బోధిసత్త్వుని పాదాలకు నమస్కరించి యీ గాథను పలికినాడు :

'వన్దితస్త్వం సురైః సేన్ద్రైః ఋషిభిశ్చాపి పూజితః,
వైద్యం సర్వస్య లోకస్య వన్దేఽహమపి త్వాం విభో!'

(ఓ ప్రభూ! నిన్ను ఇంద్రునితోసహా దేవతలందరూ పూజిస్తారు. ఋషులుకూడా పూజిస్తారు. ఈ లోకానికంతకూ నీవు వైద్యుడివి. నేను కూడా నీకు నమస్కరిస్తున్నాను.)

భిక్షువులారా! ఆ తర్వాత శుద్ధోదన మహారాజు ఆసితమహామునిని మేనల్లుడూ, తగిన భక్తుడూ అయిన నరదత్తునితోసహా బాగా సంతృప్తిపరచి, వస్త్రాలు ఇచ్చి ప్రదక్షిణం చేసినాడు. అసితమహర్షి అక్కడనుండి ఆకాశమార్గంగా తన ఆశ్రమానికి బయలుదేరినాడు. అతడు బ్రహ్మచారి అయిన నరదత్తునితో ఇట్లనినాడు: ''నరదత్తా! ఇది విను. బుద్ధుడు లోకంలో ఉద్భవించాడు. నీవు అతని ఆజ్ఞను తీసుకుని సన్న్యసించాలి. దానివల్ల నీకు ఎంతోకాలం హితము, సుఖము, మోక్షము కలుగగలవు.''

(ఇక్కడ వున్న శ్లోకాల అభిప్రాయమూ ఇదే.)

తర్వాత అసితమహాముని సర్వార్థసిద్ధుని పాదాలకు నమస్కారం చేసి, ప్రదక్షిణంచేసి, శుద్ధోదనునితో ''రాజా! నీవు గొప్ప అదృష్టవంతుడవు. ఇట్టి లోకోత్తరుడు నీకు కుమారుడై జన్మించాడు. ఇతడు దేవలోకాన్నీ, మనుష్యలోకాన్నీ ధర్మంవల్ల తృప్తిపరుస్తాడు'' అని చెప్పి, కపిలవస్తు నగరంనుంచి బయలుదేరి, అరణ్యంలో వుండే తన ఆశ్రమాన్ని చేరుకొన్నాడు.

భిక్షువులారా! బోధిసత్త్వుడు ఈ విధంగా అవతరించగానే మహేశ్వరుడనే దేవపుత్రుడు శుద్ధావాసకాయికులనే దేవపుత్రులను పిలిచి ఈ విధంగా అన్నాడు: ''మార్షులారా, జగత్తును జ్ఞానవంతం చేసే మహాసత్త్వుడయిన బోధిసత్త్వుడు మనుష్యలోకంలో ఇక్ష్వాకు

కులంలో ఉద్భవించాడు. అతడు అసంఖ్యేయ కల్పకోటి నియుత శత సహస్రాల పుణ్యకర్మ, దాన శీల క్షాంతి వీర్య ధ్యాన ప్రజ్ఞోపాయ శ్రుత చరణవ్రత తపఃసుచరిత చరణుడు. మహా మైత్రీ మహాకరుణా మహాముదితా సమన్వితుడు. ఉపేక్షాగుణ సముద్గత చిత్తుడు. సమస్త ప్రాణుల హితానికీ, సుఖానికీ ఉద్యమించినవాడు. వీర్యమనే దృఢకవచం ధరించి సన్నద్ధుడై వుండేవాడు. పూర్వులయిన జినుల కుశలమూలాల సుకృతం కలవాడు. అనేకపుణ్యలక్షణ సమలంకృతుడయినవాడు. సుకృతంవల్ల కలిగిన నిశ్చయమనే పరాక్రమం కలవాడు. పరచక్ర ప్రమథనుడు. పరమ పరిశుద్ధమైన ఆశయం గలవాడు. పుణ్యాచరణ కలవాడు. మహాజ్ఞానమనే మహాధ్వజం కలవాడు. మారుని బలాలను అంతం చేసేవాడు. త్రిసాహస్ర మహాసాహస్ర సార్థవాహుడు. దేవతలచేతను, మనుష్యులచేతను పూజింపబడేవాడు. మహాయజ్ఞం చేసేవాడు. సమృద్ధిగా వున్న పుణ్య సమూహం చేత తరించే సంకల్పం కలవాడు. జాతినీ (పుట్టుకను), చావునూ, వార్ధక్యాన్నీ పోగొట్టేవాడు. చక్కగా ఉన్నవాడు. అతడు చాలా శీఘ్రంగానే లోకంలో అనుత్తరమయిన సమ్యక్సంబోధిని వెల్లడిస్తాడు. అతనిని అభినందించడానికీ, గౌరవించడానికీ, పూజించడానికీ, స్తుతించడానికీ, గర్వాభిభూతులైన దేవపుత్రుల మాన, మదాలను పిండివెయ్యడానికీ మన మందరం వెళ్ళుదాము. మనం బోధిసత్త్వునికి నమస్కారాలు చేస్తూ వుంటే చూచి, ఆ అహంకారపూరితులు కూడా నమస్కరించి, గౌరవించి, పూజించగలరు. అలా చెయ్యడంవల్ల వారికి చాలా కాలం ప్రయోజనం, హితం, సుఖం, అమృతత్వం కలుగగలవు. శుద్ధోదన మహారాజుకు జయం చెప్పినట్లూ అవుతుంది. యథార్థతత్త్వం చెప్పడంవల్ల బోధిసత్త్వుని సమగ్రంగా వివరించి తిరిగి వద్దాము."

ఇలా దేవపుత్రుడైన మహేశ్వరుడు పన్నెండులక్షల దేవపుత్రులతో కూడా కపిలాహ్వయ మహానగరానికి వచ్చాడు. వచ్చి శుద్ధోదన మహారాజుభవనం చేరి దౌవారికుని ద్వారా తన రాకను మహారాజుకు తెలియజేశాడు. తర్వాత రాజాజ్ఞ పొంది రాజభవనంలో ప్రవేశించి, బోధిసత్త్వుని చూచి, అతని పాదాలకు తలతో నమస్కరించి, ఉత్త



రీయాన్ని ఒక్క భుజంమీద వేసుకొని అనేక లక్షలసార్లు ప్రదక్షిణం చేసి, ఆ బోధిసత్త్వుణ్ణి తన తొడపైని కూర్చుండబెట్టుకొని శుద్ధోదన మహారాజుతో ఇట్లు పలికినాడు: "మహారాజా, సంతుష్టుడవై వుండు. ఎక్కువ ప్రీతితో ఉండు. ఎందుకంటే—మహారాజా, ఈ బోధిసత్త్వుని శరీరం శుభలక్షణాలూ, అనువ్యంజనాలూ కలిగి వున్నది. ఇతడు చాయచేత, తేజస్సుచేత, కీర్తిచేత, సంపదచేత, దేవ మనుష్యాసురలోకాలు మూడింటినీ తిరస్కరిస్తున్నాడనడంలో సందేహంలేదు. మహారాజా, బోధిసత్త్వుడు అనుత్తర సమ్యక్సంబోధిని లోకంలో వెల్లడి చేయగలడు."

భిక్షువులారా, దేవపుత్రుడైన మహేశ్వరుడు శుద్ధావాస కాయికులైన దేవపుత్రులతో కూడా బోధిసత్త్వుని గొప్పగా పూజించి, బోధిసత్త్వుని తత్త్వాన్ని వివరించి తన భవనానికి తిరిగి వెళ్ళిపోయినాడు.

ఇక్కడ ప్రాచీనులు చెప్పే కొన్ని శ్లోకాలు ఇవి:

జాతస్య తస్య గుణసాగరసాగరస్య
జ్ఞాత్వా సురేశ్వర మరుద్భువనే ఉదగ్రః,
యస్యా మృదున్నభశ్రవో బహుకల్పకోట్యా
హంతే థ తం ప్రజమ పూజయితుం మునీంద్రం.

పరిపూర్ణ ద్వాదశ సహస్ర మరుద్విశుద్ధా
మణిరత్న చూడ సమలంకృతి ఇర్యవంతః,
కపిలాహ్వయం పురవరం సముపేత్య శీఘ్రం
ద్వారి స్థితా పరపతే స్సువిలంబచూడాః.

తే ద్వారపాల మవదన్ సుమనోజ్ఞఘోషాః
ప్రతివేదయస్వ నృపతే భవనం ప్రవిశ్య,
దౌవారికో వచన శ్రుత్వ గృహం ప్రవిష్టః
ప్రహ్వాకృతాంజలిపుటో నృపతిం బభాషే.

జయ దేవ నిత్య మనుపాలయ దీర్ఘమాయుః
ద్వారే స్థితా విపుల పుణ్య విశుద్ధ భాసః,

మణిరత్న చూడ సువిభూషిత ఇర్యవంతః
పరిపూర్ణచంద్రవదనా శశినిర్మలాభాః.

ఛాయాం న తేష నృపతే క్వచిద ప్యపశ్యన్
శబ్దం న చైవ చరణోత్క్షిపణే శృణోమి,
న చ మేదినీం విచరతో రజ ముత్క్షిపంతి
తృప్తిం న యాంతి చ జనాః సముదీక్షుతాం వై.

కాయప్రభా సువిపులా చ విభాతి తేషాం
వాచా మనోజ్ఞ యథ నాస్తిహ మానుషాణాం,
గంభీరశ్లక్ష్ణ సుశిలా చ సు ఆకరా చ
శంకా హి మే సురగణా నహి తే మనుష్యాః.

వర పుష్పమాల్య అనులేపనపట్టదామా
పాణీ గృహీత్వన ఉదీక్షితు గౌరవేణ,
నిస్సంశయం నృపతి ద్రష్టు కుమార మేతే
దేవాధిదేవ మరుతాగత పూజనార్థం.

రాజా నిశమ్య వచనం పరమం ఉదగ్రో
గచ్ఛా భణాహి ప్రవిశంతు గృహం భవంతః,
న హి మానుషాణ ఇయ మీదృశ బుద్ధి కాచి
యథ భాషసే చ గుణ తేష యథా చ ఇర్యా.

దౌవారికః కృతపుటో మరుతైవ మాహ
ప్రవిశీ భవంత అనుజ్ఞాతు నరాధిపేన,
తే హృష్టతుష్ట మనసో వరమాల్యహస్తా
గేహం ప్రవిష్ట నృపతే రమరాలయం వా.

దృష్ట్వా చ తాన్ సురవరాన్ ప్రవిశంత గేహం
ప్రత్యుత్థితో నృపతి రంజలి సంప్రగృహ్యా,
సంవిద్యయంత ఇవ ఆసన రత్నపాదా
అత్రా నిషీదత భవ న్ననుకంప్య బుద్ధ్యా.



తే మానదర్పవిగతా స్థిత ఆసనేషు
యస్యార్థి ఆగత ఇహో నృపతే శృణుష్వ,
పుత్ర స్తవాతిపృథుపుణ్యవిశుద్ధకాయో
జాత స్సుజాతచరణం వయ ద్రష్టుకామాః.

అత్మో విధిజ్ఞ వరలక్షణలక్షణజ్ఞా
యేషాం తథా భవతి యా గతి య ప్రయోగః,
తత్పృథు పార్థివవర ప్రజహాస్వ ఖేదం
పశ్యామ లక్షణ విచిత్ర విభూషితాంగం.

స స్త్రీగణైః పరివృతో నృపతిః ప్రహృష్టో
గృహ్యా కుమార మసమం జ్వలనార్చివర్ణం,
ఉపనామయన్ సురవరాం సువిలంబచూడాం
ద్వారాత్తు నిష్క్రమితు కంపిత త్రిస్సహస్రాః.

దృష్ట్వైవ తే సురవరా క్రమ నాయకస్య
తామ్రాం నఖాం విపులపత్ర విశుద్ధ తేజాం,
తే ఉత్థితా త్వరితరూపవిలంబిచూడా
మూర్ధ్నాభివందిషు క్రమాం విమలప్రభస్య.

యథ లక్షణా యథ చ దర్శిత లక్షితా చ
యథ పుణ్య తేజ శిరి మూర్ధ విలోకితం చ,
యథ ఇర్య నేత్ర విమలోప్రభ ఊర్ణకోశా
నిస్సంశయం స్పృశతి బోధి విజిత్య మారం.

తే తం స్తువంతి గుణభూత యథార్థదర్శీ
ధ్యాయీ గుణాం విగతక్లేశ తమోనుదస్య,
సుచిరేణ సత్త్వరతనస్య హి ప్రాదుర్భావో
జాతే జరామరణక్లేశరణం జహాస్య.

ఉద్దీప్త సర్వత్రిభవం త్రిభి రగ్నితప్తం
సంకల్పరాగవిషయారణి ఉచ్ఛ్రితేన,

త్వం ధర్మమేఘ త్రిసహస్ర స్ఫురిత్వ ధీరా
అమృతోదకేన ప్రశమేష్యసి క్లేశతాపం.

త్వం మైత్రవాక్య కరుణాన్వితశ్లక్ష్ణవాక్య
బ్రహ్మస్వరారచిత ఘోష మనోజ్ఞవాణి,
త్రిసహస్ర ఆజ్ఞ పరివిజ్ఞపనీ జగస్య
క్షిప్రం ప్రముంచ భగవాన్ మహాబుద్ధఘోషం.

భగ్నా కుతీర్థికగణా విపరీతదృష్టిః
భవరాగబంధన నిమగ్నస్థితా భవాగ్రే,
హేతు ప్రతీత్య భవశూన్య శ్రుణిత్వ ధర్మా
సింహాస్య కోష్టుకగణైవ పలాయితాస్తే.

భిత్వా అవిద్య పటలం మహాక్లేశధూమం
పర్యుత్థితా జనతయే నియతప్రకాశే,
జ్ఞానార్చి ప్రజ్ఞ ప్రభవిద్యు విలోకితేన
సర్వం జగే విధమయే మహాదంధకారం.

లాభా సులబ్ధ్వ విపులా మరుమానుషాణాం
యత్రోద్భవోఽద్భుత ఇహేదృశి శుద్ధసత్త్వే,
పిధితా అపాయపథ స్థిత మరుత్పథాని
భీ త్త్వంతి సత్త్వరత నేన విబోధకేన.

వర్షిత్వ దివ్యకుసుమాం కపిలాహ్వయేఽస్మిన్
కృత్వా ప్రదక్షిణ స్తవిత్వ చ గౌరవేణ,
బుద్ధ సంబుద్ధ ఇతి వాక్య ముదీరయంతః
ప్రక్రాంత తే సురగణా గగణే సలీలాః.

వీటి తాత్పర్యమిది:

గుణమహాసాగరుడయిన సుగతుడు అవతరించిన సంగతిని సురేశ్వరుడు దేవలోకంలో విని, ఉత్కంఠతో దేవతలను చూచి



"బహుకోటి కల్పాలకైనా మనకు సుదుర్లభమయిన ఉపదేశామృతం ప్రసాదించే మునీంద్రుడు అవతరించాడు. అతనిని పూజించడానికి వెళ్ళుదాము రాండి" అని అన్నాడు.

ఇలా అని సురేశ్వరుడు విశుద్ధులైన పన్నెండువేలమంది దేవతలతో పాటు వేగంగా కపిలవస్తుపురవరానికి వచ్చి నరపతిప్రాసాద మహాద్వారంలో నిలబడ్డాడు. ఆ దేవత లందరూ మణిరత్నసమలంకృతమై, లంబమానమయిన కేశపాశం గలవారు. ధ్యానమౌనాదివ్రతానుష్ఠానాలు గలవారు. శాస్త్రసమ్మతమైన నడవడి కలవారు (ఇర్యవంతులు). వారు ద్వారపాలకునితో "మేము వచ్చిన సంగతిని మహారాజునకు మనవి చెయ్యి" అని మధురస్వరంతో పలికారు. దౌవారికుడు వారి మాట ప్రకారం లోపలికి పోయి, చేతులు జోడించుకొని రాజుయెదుట నిలిచి ఇట్లు విన్నవించాడు:

"దేవా, జయము. నిత్యమూ రాజ్యాన్ని పాలింతువుగాక! నీవు చిరాయువు అగునుగాక! ప్రభూ, కొందరు పురుషులు వచ్చి ద్వారదేశంలో కాచుకొని వున్నారు. వారు కేశపాశంలో మణి, రత్న భూషణాలు ధరించి చక్కగా వున్నారు—పరిపూర్ణ చంద్రవదనులు. విపుల పుణ్య విశుద్ధకాంతి గలవారు. ఇర్యవంతులు. చంద్రనిర్మలకాంతి గలవారు. రాజా, వారి ఛాయవంటి ఛాయను నే నెక్కడా చూడలేదు. నేలపైని కాలుపెట్టిన ధ్వని కూడా లేదు. వారు నేలపైని తిరుగుతున్నా, నేలను తాకనందున దుమ్ము పైకి ఎగరలేదు. వారిని చూస్తూవున్న జనులకు తనివి తీరడం లేదు. వారి శరీరకాంతి మిక్కిలి విస్తారమై ఎంతో ప్రకాశిస్తూ ఉన్నది. వారి వాక్కులు మధురమైనవి. మనుష్యుల వాక్కుల లాగ తోచడంలేదు. ఆ వాక్కులు గంభీరమైనవి. తరచైనవి. మిక్కిలి మృదువుగా ఉన్నవి. వారు మనుష్యులు కారనీ, దేవతలై వుందురనీ నా శంక. వారు మేలైన పూలమాలికలను, అనులేపనాలను, పట్టువస్త్రాలను చేతులలో ధరించి, ఎక్కువైన గౌరవాన్ని సూచిస్తూ ఉన్నారు. ఓ దేవ దేవా, వారు తమ కుమారుని పూజించడానికై వచ్చినట్లు తెలుస్తున్నది. సందేహం లేదు."

రాజు ఆ దౌవారికుని మాటను విని మిక్కిలి ఆతురతతో "వెళ్లు. పూజ్యులైన తమరు లోపల ప్రవేశించవచ్చునని వారితో చెప్పు. మనుష్య మాత్రులకు నీవు చెప్పినటువంటి మాహాత్మ్యం కలుగదు. గొప్ప గుణాలు ఏర్పడి ఉండవు. ఇర్య (అపూర్వశోభ) ఉండదు" అన్నాడు.

దౌవారికుడు చేతులు జోడించుకొని ఆ దేవతలను చూచి "మీరు లోపలికి పోవచ్చును. రాజుగారు అనుమతించారు" అని చెప్పినాడు. వారు సంతోషించినవారై మాలికలను హస్తాలతో పట్టుకొని స్వర్గంవలె ఉన్న రాజగృహం ప్రవేశించారు.

తన భవనంలో ప్రవేశిస్తూ ఉన్న ఆ దేవతలను చూచి శుద్ధోదనుడు ఎదురుగా పోయి చేతులు జోడించుకొని స్వాగతం యిచ్చి "ఓ విజ్ఞులారా, ఇవిగో రత్నాల కోళ్ళున్న ఆసనాలు. నాయందు అనుగ్రహం ఉంచి వీనిపైని కూర్చోండి" అని ప్రార్థించాడు.

దురభిమానం గాని, గర్వం గాని లేని ఆ దేవతలు ఆ ఆసనాలపై కూర్చుని ఇట్లన్నారు: "ఓ రాజా, మేము ఇక్కడికి వచ్చిన కారణం విను. గొప్ప పుణ్యాలు కారణంగా పరిశుద్ధ శరీరుడైన కుమారుడు నీకు కలిగినందున, అతనిని చూడడానికి వచ్చినాము. నీ కుమారుడు విధిజ్ఞుడు. యోగ్యలక్షణాలు కలవాడు. ఇట్టి లక్షణాలు లోకోత్తరులకే ఉంటాయి. మేము లక్షణజ్ఞులం. శుభలక్షణాలతో నీ కుమారుని శరీరం చిహ్నితమై వున్నట్లు చూస్తున్నాము. నీకు ఏ విధమైన విచారమూ అక్కరలేదు."

రాజు మిక్కిలి సంతోషించి స్త్రీజనం వెంటరాగా అగ్నిశిఖవంటి తేజస్సుగల ఆ కుమారుని తీసుకొని వచ్చినప్పుడు త్రిసాహస్రులయిన ఆ దేవతలు కంపించి, వేలాడే సిగలు కదలాడగా, ద్వారప్రాంతంనుంచి తప్పుకొన్నారు. తర్వాత వారు తెప్పరిల్లుకుని, నాయకుడైన సర్వార్థసిద్ధ కుమారుని విమలపత్ర విశుద్ధ తేజస్సును, ఎర్రటి నఖాలను చూచి త్వరగా ఆసనాలనుంచి లేచి కేశపాశం వేలాడుతుండగా శిరసా ప్రణామం చేశారు. "ఇతడు పుణ్యతేజుడు. ఉష్ణీషశిరస్కుడు. ఇర్యనేత్రుడు. విమలప్రభుడు. ఊర్ణకేశుడు. ఈ లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి గనుక



మారుణ్ణి జయించి సమ్యక్సంబోధిని అందుకోడం నిస్సంశయం" అని అనుకున్నారు.

ఇలా అనుకున్న తర్వాత ఈ విధంగా స్తుతించారు: "దేవా, నీవు గుణభూతుడివి. యథార్థదర్శివి. ధ్యాయివి. గుణవంతుడివి. క్లేశతమస్సులను పోగొట్టేవాడివి. జనుల జాతి (జన్మ) జరామరణక్లేశాలు నశింపజేసే సత్త్వరత్న ప్రాదుర్భావం ఎంతో కాలానికి గాని కలుగదు. సంకల్ప రాగ విషయారణిలో పుట్టి వ్యాపించిన మూడు అగ్నులతో (తాపాలతో) త్రిభువనాలూ మండిపోతున్నప్పుడు – ఓ ధీరుడా, ధర్మమనే మేఘాన్ని మూడు వేలసార్లు నీవు కల్పించి అమృతోదకంతో క్లేశతాపం పోగొట్టుతావు. నీవు మైత్రీ గుణపూరితమైన పలుకులు గలవాడివి. కరుణాన్వితుడివి. శ్లక్ష్ణవాక్కులు కలవాడివి. బ్రహ్మస్వరం వినిపించినవాడివి. మనోజ్ఞమైన మాటలు గలవాడివి. జగత్తుకు త్రిసహస్రోపదేశం చేయనున్నావు. త్వరలో మహాబుద్ధఘోష వదలు (చెయ్యి). హేతుప్రతీత్యమూ, భవశూన్యమూ అయిన నీ ధర్మం విని కుత్సితులు, విపరీతమయిన దృష్టి కలవారు, భవరాగ బంధన నిమగ్నులు అయిన తీర్థికులు నీముందు, సింహం ముందు నక్కల గుంపులవలె పలాయనం చిత్తగిస్తున్నారు. ఈ జనత గొప్ప క్లేశాలనే ధూమంతో, అవిద్య అనే అంధకార పటలంతో పరివృతమయింది. నీవు జ్ఞానకాంతులతో, ప్రజ్ఞాప్రభలనే విద్యుద్విలోకనాలతో జగత్తునుంచి ఆ మహాంధకారాన్ని పటాపంచలు చేయి.

"అద్భుతమైన ఇటువంటి శుద్ధసత్త్వుడు జన్మించడంవల్ల దేవతలకూ, మనుష్యులకూ విపులంగా లాభాలు కలుగుతవి. అపాయ మార్గాలన్నీ, సత్త్వరత్నమయిన ఇతని బోధనలవల్ల దేవమార్గాలు కాగలవు."

ఆ దేవగణాలు ఈ విధంగా ప్రశంసించి కపిలవస్తు మహానగరంలో దివ్యకుసుమాలను వర్షించారు. ఎంతో గౌరవంతో బోధిసత్త్వుని స్తుతించి, ప్రదక్షిణం చేశారు. "బుద్ధ! సుంబుద్ధ!" అని పలుకుతూ సవిలాసంగా ఆకాశమార్గాన తమ నివాసాలకు బయలుదేరారు.

ఇది లలితవిస్తరంలో జన్మపరివర్తం అనే ఏడవ అధ్యాయం.

---

# 8. దేవకులోపనయన పరివర్తం

భిక్షువులారా, బోధిసత్త్వుడు అవతరించిన రాత్రే క్షత్రియ, బ్రాహ్మణ, నైగమ, (వణిక్) గృహపతి (శ్రీమంతులయిన కర్షకులు), మహాసాల కులాలలో ఇరవై వేలమంది కన్యలు జన్మించారు. వారందరినీ వారి తల్లిదండ్రులు బోధిసత్త్వుని ఉపస్థాన పరిచర్యకోసం సమర్పించారు. శుద్ధోదన మహారాజు తాను ప్రత్యేకంగా ఇరవై వేలమంది కన్యకలను బోధిసత్త్వుని ఉపస్థాన పరిచర్యలకోసం ఏర్పాటు చేశాడు. ఇరవై వేలమంది కన్యకలను, మిత్రులూ, మంత్రులూ, జ్ఞాతులూ, సాలోహితులూ మొదలైన వారు బోధిసత్త్వుని ఉపస్థానసేవకోసం ఇచ్చారు. ఇరవై వేలమంది కన్యకలను అమాత్యులు, రాజసభలోని సభ్యులు బోధిసత్త్వుని ఉపస్థావ పరిచర్యకోసం సమర్పించారు.

ఆ సమయంలో మహల్లకనుహల్లిక శాక్యులు (శాంచుకేయులు) మహారాజైన శుద్ధోదనుడి దగ్గరకు వచ్చి, అతనితో ఈ విధంగా చెప్పారు— "ప్రభూ! తమ కుమారుడిని దేవాలయానికి తీసుకువెళ్ళవలసి వున్నదని మనవి చేస్తున్నాము" అని.

అప్పుడు రాజు ఇలా చెప్పినాడు: "సరే. బాగానే చెప్పారు మీరు! తప్పకుండా కుమారుడిని దేవాలయానికి తీసుకొనివెళ్ళుదాము. అందుకోసమై ముందుగా నగరాన్ని అలంకరించాలి. వీథులనూ, రహదారులనూ, చతుష్పథాలనూ, శృంగాటకాలనూ, అంగడులనూ, రథమార్గాలనూ చక్కగా శోభిస్తూ వుండేటట్లు చెయ్యాలి. అమంగళాన్ని సూచించే గ్రుడ్డివారూ, కుంటివాళ్ళూ, మరుగుజ్జులూ, చెవిటివాళ్ళూ, మూగవాళ్ళూ, వికారంగా కానవచ్చేవారూ, పరిపూర్ణంగా లేని ఇంద్రియాలు కలవాళ్ళూ - వీరెవ్వరూ మార్గంలో కానరాకూడదు. మంగళవాక్యాలనే ఉచ్చరించాలి. మంగళకరాలయిన భేరీధ్వనులు చెలరేగాలి. శుభాన్ని సూచించే గంటలమ్రోత వినరావాలి. పురద్వారాలను చక్కగా అలంకరించాలి. మిక్కిలి మనోజ్ఞంగా తూర్యధ్వనులు వినబడాలి. సమస్త కోట (సామంత) రాజులూ కలిసి రావాలి. గృహపతులూ, అమాత్యులూ, శ్రేష్ఠులూ, ద్వారపాలకులూ, పరిషత్సభ్యులూ ఒకటిగా చేరి రావాలి. కన్యలు రథాలను ఆయత్తం చేయాలి. పూర్ణకుంభాలను తీసుకు రావాలి. వేదాధ్యయనపరులైన బ్రాహ్మణులు రావాలి. దేవాలయాలను అలంకరించాలి."



భిక్షులారా, మహారాజు ఆనతిచ్చిన ప్రకారంగా సర్వమూ జరిగినది. తర్వాత మహారాజైన శుద్ధోదనుడు తన భవనంలో ప్రవేశించి మహాప్రజాపతి గౌతమిని పిలిచి ఇలా పలికినాడు: "కుమారుణ్ణి చక్కగా అలంకరించి, దేవాలయానికి తీసుకొనివెళ్ళు" అని. ఆమె "సరే" అని సమాధానమిచ్చి కుమారుణ్ణి చక్కగా అలంకరించినది.

చక్కగా అలంకృతుడైన ఆ సర్వార్థసిద్ధుడు కనుబొమలను ముడివేయకుండా నవ్వుముఖం కలవాడై మధుర మధురమైన మాటలతో పినతల్లి అయిన గౌతమితో ఇలా అన్నాడు—"అమ్మా! నన్ను ఎక్కడికి తీసుకువెళ్ళుతారు?" అని. "కుమారా! దేవాలయానికి" అని చెప్పినది ఆమె.

సర్వార్థసిద్ధుడు చిరునవ్వు చిందులాడగా, నవ్వుముఖంతో పినతల్లితో యీ గాథలను పలికినాడు:—

"జాతస్య మహ్యా మిహ కమ్పిత త్రిసహస్రం
శక్రశ్చ బ్రహ్మ అసురాశ్చ మహోరగాశ్చ,
చన్ద్రశ్చ సూర్య అథ వైశ్రవణః కుమారో
మూర్ధ్నా క్రమేషు నిపతిత్వ నమస్యయన్తి.

కతమోఽన్య దేవ మమ ఉత్తరియో విశిష్టో
యస్మిన్ మమ ప్రణయసే త్వ మిహాద్య అమ్బ!
దేవాతిదేవ అహ ఉత్తము సర్వదేవైః
దేవో న మేఽస్తి సదృశః కుత ఉత్తరం వా.

లోకానువర్తనప్రతీ ఇతి అంబ యాస్యే
దృష్ట్వా విపర్విత మమా జనతా ఉదగ్రాః,
అధిమాత్రుగౌరవ కరిష్యతి చిత్రకారః
జ్ఞాస్యన్తి దేవమనుజా స్వయ దేవదేవః."

"నేను జన్మించగానే త్రిసాహస్రమైన భువనం వణికిపోయింది. ఇంద్రుడు, బ్రహ్మ, అసురులు, ఉరగులు, సూర్యుడు, చంద్రుడు, వైశ్రవణుడు, కుమారుడు తలలు నా పాదాలపై పెట్టి నమస్కరించారు. అమ్మా, నాకంటే ఉత్తరుడు (గొప్పవాడు), విశిష్టుడు అయిన దేవుడు ఎవడున్నాడు? అమ్మా, అలాటి ఏ దేవుని దగ్గరికి నీవు నన్ను తీసుకుని వెళ్ళుతున్నావు? నేను దేవాతిదేవుణ్ణి. సర్వ దేవతలకూ ఉత్తముణ్ణి, నాకు సాటి అయిన దేవుడే లేడు. ఇంక నాకంటె గొప్పవాడు ఎక్కడ? అమ్మా, నాకంటెనూ ఉత్తముడైన దేవుడు లేకపోయినా లోకపదతిని అనుసరించి దేవగృహానికి వెళ్ళుతాను. ఉదగ్రులైన జనులు నన్ను చూచి, నా మార్గాన్ని అనుసరింతురుగాక! మాతృదేవతయందు గౌరవం వుంచి ఆమె చెప్పినట్లు, చిత్రకారునిలాగ చేస్తాను. దేవతలూ, మనుష్యులూ అందరూ దేవదేవుడనైన నన్ను తెలుసుకొందురుగాక!"

తర్వాత అన్ని వర్గాలవారు స్తుతిమంగళాలు పఠిస్తూ ఎదురు రాగా, వీథులూ, చతుష్పథాలూ, అంగడివీథులూ మున్నగునవి ఎంతో చక్కగా అలంకరించబడగా, అంతఃపురంలో రాజకుమారుడు కూర్చుండే రథం చక్కగా అలంకరించబడింది. రాజకుమారుడు ప్రయాణంచేసే మార్గం ధూపాలతో పరిమళించేటట్లు చేయబడింది. అంతటా పువ్వులు చల్లబడినవి. ఆ మార్గంలో ఉచితస్థలాల్లో హయ, గజ, రథ, పదాతులైన చతురంగ బలం ఉంచబడినది. ఛత్రాలూ, కేతువులూ కూడా ఏర్పరచబడినవి. తూర్య ధ్వనులు చెలరేగాయి. మహారాజైన శుద్ధోదనుడు బ్రాహ్మణులూ, నైగములూ, (వ్యాపారులూ,) శ్రేష్ఠులూ, గృహపతులూ, మంత్రులూ సామంత రాజులూ, దౌవారికులూ, సభ్యులూ, మిత్రులూ, జ్ఞాతులూ మున్నగువారితో కూడా తన కుమారుణ్ణి తీసుకువెళ్ళాడు. లక్షలకొద్దీ వున్న దేవతలు ఆ కుమారుడు కూర్చున్న రథాన్ని వహిస్తూ ఉండినారు. అసంఖ్యాకంగా



వున్న దేవపుత్రులూ, అప్సరసలూ ఆకాశంమీద వుండి పుష్పవర్షాన్ని కురిపించసాగారు. తూర్యాలను ధ్వనింపజేశారు. రాజైన శుద్ధోదనుడు గొప్ప రాజవ్యూహంతోనూ, గొప్ప రాజసంపత్తితోనూ, గొప్ప రాజఠీవి తోనూ కుమారుణ్ణి తీసుకుని దేవాలయంలో ప్రవేశించాడు. ప్రవేశించే టప్పుడు బోధిసత్త్వుడు మొదట తన కుడికాలిని దేవాలయంలో ఉంచాడు. ఉంచీ ఉంచగానే అక్కడ అచేతనాలుగా వున్న శివుడూ, కుమార స్వామీ, నారాయణుడూ, కుబేరుడూ, చంద్రుడూ, సూర్యుడూ, బ్రహ్మ, లోకపాలకులూ మున్నగువారి విగ్రహాలన్నీ తమ తమ స్థానాలనుండి లేచి వచ్చి బోధిసత్త్వుని క్రమతలంపైని (అడుగులపైన) పడసాగినవి. అది చూచి అక్కడ లక్షలకొద్దీ వున్న దేవతలూ, మనుష్యులూ కిలకిలధ్వనులు చేస్తూ, గట్టిగా అరుస్తూ, ఆనందాతిశయంతో గుడ్డలను ఎగురవేయ సాగినారు. కపిలవస్తు మహానగరం (ఆరు విధాలుగా) చలించినది. దివ్య కుసుమాలు వర్షించాయి. లక్షలకొలది తూర్యాలు ధ్వనించినవి. ఆ దేవతల ప్రతిమలన్నీ తమ తమ స్వరూపాన్ని చూపి యీ గాథలను పలికినవి—

'నో మేరూ గిరిరాజ పర్వతవరో జాతూ నమే సర్షపే
నోవా సాగర నాగరాజ నిలయో జాతూ నమే గోష్పదే,
చన్ద్రాదిత్య ప్రభంకరా ప్రభకరా ఖద్యోతకే నో నమే
ప్రజ్ఞాపుణ్యకులోదితో గుణధరః కస్మాన్నమే దేవతే.
యద్వత్ సర్షప గోష్పదేన సలిలం ఖద్యోతకా వా భవేత్
ఏవం చ త్రిసహస్ర దేవ మనుజా యేకేచి మానాశ్రితాః,
మేరూ సాగర చన్ద్రసూర్యసదృశో లోకే స్వయంభూత్తమో
యం లోకో వ్యాభివన్ద్య లాభ లభతే స్వర్గం తథా నిర్వృతిం."

"సర్వతాలకు రాజైన మేరు పర్వతం నాకు ఆవగింజంతకూడా కాదు. నాగరాజుకు నిలయమైన మహాసముద్రం నాకు గోష్పాదం అంత కూడా కాదు. వెలుగును వ్యాపింపజేస్తూ వున్న సూర్యుడూ, చంద్రుడూ నాకు మిణుగురుపురుగులవంటివారుగా కూడా కాజాలరు. కనుక

వారిని నమస్కరించను. ప్రజ్ఞా విశేషంవల్లనూ, పుణ్య విశేషంవల్లనూ ఉత్తమ కులంలో గుణవంతుడైన యీ బోధిసత్త్వుడు ఉద్భవించడంవల్ల నాకు దేవతగా అయినాడు. కనుక నమస్కరిస్తున్నాను. 'మానాభిమానాలు కల త్రిసాహస్రదేవతలూ, మనుష్యులూ అందరున్నూ ఆవగింజలవలెను, గోష్పాదాలవలెనూ, మిణుగురుపురుగులవలెనూ ఉండేవారు. వారందరిముందునూ, స్వయంభువులలో ఉత్తమోత్తముడైన బోధిసత్త్వుడు మేరు పర్వతంతోనూ, సముద్రంతోనూ, చంద్ర సూర్యులతోనూ సమానమైనవాడు. లోకం అంతా అతనికి నమస్కరించి, స్తుతించి లాభాన్ని పొందగలదు. స్వర్గాన్నీ, నిర్వాణాన్నీ పొందగలదు."

భిక్షులారా, మహాసత్త్వుడైన బోధిసత్త్వుడు దేవాలయప్రవేశం చేస్తూ వుండగా దర్శించిన ముప్ఫయిరెండు లక్షల దేవపుత్రులందరూ లోకోత్తరమైన సమ్యక్సంబోధియందు మనస్సును ఉంచారు. భిక్షులారా, దేవాలయ గమనంలో బోధిసత్త్వుడు ఉపేక్ష చూపడానికి ఇదే హేతువు. ఇదే ప్రత్యయం.

ఇది లలిత విస్తరంలో దేవకులోపనయన పరివర్తమనే
ఎనిమిదవ అధ్యాయం.

# 9. ఆభరణ పరివర్తం

భిక్షులారా, ఉదాయి తండ్రీ, రాజుగారి పురోహితుడూ అయిన ఉదయనుడు అనే బ్రాహ్మణుడు ఐదువందలమంది బ్రాహ్మణులతోసహా హస్తానక్షత్రం అనంతరం చిత్రానక్షత్రం వచ్చిన సమయంలో మహారాజైన శుద్ధోదనుడి వద్దకు వచ్చి "దేవా! తమ కుమారుడైన సర్వార్థసిద్ధుడికి ఆభరణాలు చేయించవలసి వున్నది" అని మనవి చేశాడు. "తప్పకుండా అలాగే చేయిస్తాను" అని రాజు అతనితో అన్నాడు.

తర్వాత శుద్ధోదన మహారాజూ, ఐదువందలమంది శాక్యవంశీయులూ ఐదువందల ఆభరణాలను చేయించారు. వాటిలో హస్తాభరణాలూ, పాదాభరణాలూ, మూర్ధాభరణాలూ, కంఠాభరణాలూ, ఉంగరాలూ, కర్ణాభరణాలూ, భుజకీర్తులూ, బంగారు మొలత్రాళ్లూ, రత్నాలూ మణులూ తాపిన మువ్వలూ, పాదుకలూ, నానావిధాలైన రత్నహారాలూ, కడియాలూ, (హర్షాలు) కిరీటాలూ మున్నగునవి ఉన్నవి. వీటన్నింటినీ చేయించి ఆ శాక్యులు పుష్యనక్షత్రయుక్తమైన సమయంలో శుద్ధోదన మహారాజుసన్నిధికి వచ్చి "ప్రభూ! ఆభరణాలు అన్నీ సిద్ధంగా ఉన్నవి. కుమారుణ్ణి అలంకరించవచ్చును" అని మనవిచేశారు. "మీరు కుమారుణ్ణి చక్కగా అలంకరించి పూజించినట్లే భావిస్తాను. నేనుకూడా పిల్లవానికి సమస్తాభరణాలూ చేయించాను" అని రాజు పలికినాడు. అప్పుడు వారు "దేవా, వారం వారం అయినా మేము చేయించిన ఆభరణాలను కుమారుడు శరీరంపై ధరించగలందులకు ప్రార్థన. లేకపోతే మా పడిన శ్రమ అంతా వ్యర్థమవుతుంది" అని చెప్పారు.

రాత్రి గడిచింది. సూర్యుడు ఉదయించాడు. విమల వ్యూహమనే ఉద్యానానికి బోధిసత్త్వుడు బయలుదేరాడు. అక్కడ మహాప్రజాపతి గౌతమీదేవి కుమారుణ్ణి తన తొడపై కూర్చుండబెట్టుకొన్నది. ఎనభైవేలమంది కన్యకలు ఎదురుగా పోయి, ఆ బోధిసత్త్వుని ముఖాన్ని చూస్తూ

ఉండినారు. పదివేలమంది కన్యలు ఎదురేగి, బోధిసత్త్వుని ముఖాన్ని చూస్తూ ఉండినారు. అయిదువేలమంది బ్రాహ్మణులు ఎదురేగి, అతని ముఖాన్ని చూస్తూ ఉండినారు. శాక్యరాజైన భద్రికుడు చేయించిన ఆభరణాలన్నీ బోధిసత్త్వుని శరీరం పైని అలంకరించబడినవి. ఆ ఆభరణాలు వుంచినా, అవి బోధిసత్త్వుని దేహకాంతిముందు వెలవెలపోయి ప్రకాశించలేదు. మేలిమి బంగారం ముందర మసి పిండం (ముద్ద) వుంటే ఏ విధంగా శోభించదో, ఆ రీతిగా బోధిసత్త్వుని శరీరంపై ఉన్న ఆ ఆభరణాలు అతని శరీర కాంతివల్ల ప్రకాశించకుండా వెలవెలపోతూ వుండినవి. బోధిసత్త్వుని శరీరంపైని ఏ ఆభరణం అలంకరించబడినదో, ఆ ఆభరణం మసి ముద్దవలె కళావిహీనమై వెలవెలపోతూనే ఉండినది.

ఆ ఉద్యానవనంలో విమల అనే పేరుగల వనదేవత ఉన్నది. ఆమె ఉదాత్తమైన తన స్వరూపాన్ని ప్రదర్శించి శుద్ధోదన మహారాజు ఎదుట నిలిచి, ఆతనితోనూ, అక్కడ వున్న శాక్యగణంతోనూ ఈ గాథలను పలికినది:

"సర్వేయం త్రి సహస్రమేదినీ సనగరనిగమా
పూర్ణా కాంచన సంచితా భవేత్ సురుచిరవిమలా,
ఏకా కాకిని జామ్బుకాంచనే భవతి ఉపహతా
నాభాసీ ఇతరః సకాంచన ప్రభసిరి రహితః.

జామ్బూకాంచన సంనిభా పునర్భవేత్ మకర ఇయమపి
రోమే ఆభప్రముక్తనాయకే హితసిరి భరితే,
నాభాసీ న తపీ న సోభతే నచ ప్రభవతి
ఆభా యే సుగతస్య కాయినో భవతి యథ మసిః.

స్వే తేజేన అయాం స్వలంకృతో గుణశతభరితో
నో తస్యాభరణా విరోచిషూ సువిమల వపుషః,
చంద్రసూర్యప్రభశ్చ జ్యోతిషా తథ మణిజ్వలనాః
శక్రబ్రహ్మ ప్రభా న భాసతే పురత సిరి ఘనే.



అస్యా లక్షణికాయు చిత్రతః పురిమ శుభఫలైః
కిం తస్యాభరణేభి రిత్వరైః పరకృత కరణైః,
అపనేథాభరణా మహేరతా అబుధ బుధకరం
నాయం కృత్రిమ భూషణార్థిక పరమమతికరః.

చేటస్యాభరణాని దేథిమే సురుచిర విమలా
సహజాతోయ సుభూషి ఛన్దకో నృపతికుల శుభే,
తుష్టా శాకియ విస్మితాశ్చ అభవన్ ప్రముదిత మనసో
వృద్ధిః శాక్యకుల నవస్య చోత్తమా భవిష్యతి విపులా."

"త్రిసాహస్రమూ, మహానగరాలతోనూ పట్నాలతోనూ కూడి నదీ, అయిన యీ భూమండలం అంతా సువర్ణపూరితమై, అందంగానూ, నిర్మలంగానూ (కుమారుని తేజస్సువల్ల) ఉంటుంది. బంగారపుకాంతి తిరస్కరించబడుతుంది. ఒక్క బంగారపుకాంతే కాదు. ఇతరమైన ఏ కాంతినీ ఇతని తేజస్సు యెదుట ప్రకాశించక కాంతిరహితం ఐపోతుంది. నాయకుడైన బోధిసత్త్వుని శరీరంనుండి వెలువడిన కాంతి ముందు బంగారపు కాంతి, రత్ననిధుల కాంతి ప్రకాశించవు. శోభించవు. నిలవనూ నిలవలేవు. సుగతుని శరీరంవల్ల వ్యాపించిన కాంతిముందు అవి మసిముద్దవలె ఉంటున్నవి. వందలకొద్దీ ఉత్తమ గుణాలతో కూడిన బోధిసత్త్వునికి స్వభావసిద్ధమైన తేజస్సే అలంకారం. స్వభావంగా వినిర్మల దేహం గల ఇతనికి ఆభరణాలు శోభను కూర్చలేవు. ఈ సిరిఘనుని ముందు చంద్రసూర్యుల కాంతులు, నక్షత్రాల, మణుల కాంతులు, అగ్ని తేజస్సు, ఇంద్రబ్రహ్మల తేజస్సులూ ప్రకాశించవు. ఈ బోధిసత్త్వుని శరీరం పరమ శుభఫల లక్షణాలతో అలంకృతమైనది. ఇతరులచేత నిర్మితమైన అశాశ్వతాభరణాలవల్ల ఇతనికి ఏమీ ప్రయోజనం లేదు. ఈ ఆభరణాలను తొలగించండి. అజ్ఞానులను జ్ఞానవంతులను చేసే ఈ పరమ మతికరుడు కృత్రిమ భూషణాలను కోరడు. ద్వేషించడు.

బోధిసత్త్వునికి సహజాతుడూ, చేటుడూ అయిన చంధకునికి నృపతికుల శుభార్థమై సుందరమైన ఆభరణాలు ఇవ్వండి. శాక్యకుల నందనునికి విపులమూ, ఉత్తమమూ అయిన వృద్ధి కలుగుతుంది'' అని అన్నది.

శాక్యులందరూ ఆశ్చర్యపడ్డారు. ప్రముదితమానసు లయారు. వన దేవత దివ్య పుష్పాలను బోధిసత్త్వునిపై చల్లి, అక్కడే అంతర్ధాన మయింది.

ఇది శ్రీ లలితవిస్తరంలో ఆభరణ పరివర్త మనే నవమాధ్యాయం.

---

# 10. లిపిశాలా సందర్శన పరివర్తం

భిక్షులారా, కుమారుడు కొంచెం పెద్దవాడైన తర్వాత శుద్ధోదన మహారాజు అతనిని లక్షలకొద్దీ మాంగళ్యాలతో కూడా విద్యాభ్యాసం కొరకై లిపిశాలకు తీసుకొని వెళ్ళినాడు. కుమారుడైన ఆ సర్వార్థసిద్ధుని వెంట పదివేలమంది పిల్లవాళ్ళూ వెళ్ళినారు. ఆతనివెంట ఖాద్యాలు, భోజ్యాలు, స్వాద్యాలు అయిన తినుబండాలతో పదివేల రథాలు బయలు దేరాయి. వాటిలో సువర్ణ పరిపూర్ణాలయిన రథాలూ ఉన్నవి. అవి కపిల వస్తు మహానగరంలోని వీథులలోనూ, రథ్యలలోనూ, చతుష్పథాల లోనూ, అంగడి వీథులలోనూ ఆగి, ఆ తినుబండాలనూ, బంగారాన్నీ చల్లుతూ ప్రయాణం చేశాయి. ఎనిమిది లక్షల తూర్యాలు గొప్ప ధ్వనితో ఘోషించసాగినవి. గొప్ప పూలవాన కురిసింది. తిన్నెలమీదా, వాకిళ్ళలోనూ, తోరణాలపైనీ, గవాక్షాలలోనూ, మేడలపైనీ, కూటాగారాలలోనూ, భవనాలపైనీ లక్షలకొలది కన్యకలు చక్కగా అలంకరించుకొని నిలబడి బోధిసత్త్వుణ్ణి చూస్తూ వుండి, అతనిమీద పూవులను చల్లారు. ఎనిమిదివేలమంది దేవతాకన్యకలు జారిపోతూవుండే అలంకారాలతో శోభిస్తూ చేతులతో రత్న భద్రంకరాలను (చీపురులు) పట్టుకొని మార్గాన్ని శోధిస్తూ బోధిసత్త్వునికి ముందుగా నడవసాగారు. దేవతలూ, నాగులూ, యక్షులూ, గంధర్వులూ, అసురులూ, గరుడులూ, కిన్నరులూ, మహానాగులూ మున్నగువారు సగం వంగి ఆకాశంమీదనుంచే పూల మాలలనూ, పట్టుదామములనూ వ్రేలాడేటట్లు పట్టుకొన్నారు. శుద్ధోదన మహారాజు ముందు నడువగా, శాక్యగణంలోనివా రందరూ బోధిసత్త్వునికి ముందుగా వెళ్ళారు. ఇట్టి గొప్ప వ్యూహంతో బోధిసత్త్వుడు లిపిశాలకు తీసుకొని రాబడినాడు.

బోధిసత్త్వుడు లిపిశాలలో ప్రవేశించగానే అతనికి గురువుగా నిర్ణయించబడిన విశ్వామిత్రుడనే విద్వాంసుడు బోధిసత్త్వుని శోభనూ,

తేజస్సునూ చూచి తట్టుకోలేక నేలమీద కూలబడి బోరగిలా పడిపోయినాడు. అతడు ఆ విధంగా పడిపోవడం చూచి శుభాంగుడనే తుషితకాయికుడైన దేవపుత్రుడు కుడిచేతితో పట్టుకొని లేవదీశాడు. ఆ విధంగా విశ్వామిత్రుణ్ణి లేవదీసి ఆ దేవపుత్రుడు ఆకాశంపైని ఉంటూనే మహారాజైన శుద్ధోదనునితోనూ, అక్కడవుండే పెద్ద జన సమూహంతోనూ ఈ గాథలను పలికినాడు.

"శాస్త్రాణి యాని ప్రచరన్తి మనుష్యలోకే
సంఖ్యా లిపిశ్చ గణనాపి చ ధాతుతన్త్రం,
యే శిల్పయోగ పృథు లౌకిక అప్రమేయాః
తేష్వేషు శిక్షితు పురా బహుకల్ప కోట్యః.

కిం నూ జనస్య అనువర్తనతాం కరోమి
లిపిశాల మాగతు సుశిక్షితు శిష్యణార్థం,
పరిపాచనార్థ బహుదారక అగ్రయానే
అవ్యాంశ్చ సత్త్వనయుతా నమృతే వినేతుం.

లోకోత్తరేషు చతుసత్యపథే విధిజ్ఞో
హేతుప్రతీత్య కుశలో యథ సంభవన్తి,
యథ చానురోధక్షయు సంస్థితు సీతిభావః
తస్మిన్ విధిజ్ఞ కి మథో లిపిశాస్త్రమాత్రే.

నేతస్య ఆచరియ ఉత్తరి వా త్రిలోకే
సర్వేషు దేవమనుజేష్వయ మేవ జ్యేష్ఠః,
నామాపి తేష లిపినాం నహి విత్థ యూయం
యత్రేష శిక్షితు పురా బహుకల్పకోట్యః.

సో చిత్తధార జగతాం వివిధా విచిత్రా
ఏకక్షణేన ఆయు జానతి శుద్ధసత్త్వః,
అదృశ్యరూపరహితస్య గతిం చ వేత్తి
కిం వా పునోఽథ లిపినోఽక్షర దృశ్యరూపాం."



"మానవ లోకంలో ఎన్నెన్ని శాస్త్రాలు ఉన్నవో, వానినీ, సంఖ్యాలిపినీ, గణననూ, ధాతుతంత్రాన్ని, శిల్పాన్నీ, యోగాన్నీ, అప్రమేయాలైన గొప్ప లౌకికవిద్యలనూ ఈ బోధిసత్త్వుడు పూర్వమే అనేకకోట్ల జన్మలలో బాగుగా తెలుసుకొని ఉన్నాడు. జనులు తన్ను అనుసరించేటట్లు చెయ్యవలెననే అభిప్రాయంతోనే లిపిశాలను ఇతడు ప్రవేశించాడు. తగిన శిక్షణ పొందదలచాడు. అనేకమంది కుమారులకు అగ్రయానంలో మార్గదర్శకుడుగా ఉండడానికీ, ఇతరులైన ప్రాణులను అమృతత్వాన్ని పొందించడానికీ బోధిసత్త్వుడు సంకల్పించాడు. ఇతడు లోకోత్తరాలయిన ఆర్యచతుస్సత్యమార్గాలలోనూ విధిజ్ఞుడు. హేతుప్రతీత్యకుశలుడు. అనిరోధక్షయ సంస్థితి సీతి భావప్రాజ్ఞుడు. ఇట్టి విధిజ్ఞునికి లిపిశాస్త్రాలు ఎంత? మూడు లోకాలలోనూ ఇతనిని మించిన ఆచార్యుడు లేడు. దేవ మానవులందరిలోనూ ఇతడే జ్యేష్ఠుడు. ఇతడు పూర్వం కోటకొలదీ వున్న బహుజన్మలలో అనేకాలైనలిపులను అభ్యసించి వున్నాడు. ఆ లిపులయొక్క పేర్లుకూడా మీరు ఎరిగి వుండరు. ఈ బోధిసత్త్వుడు గొప్ప ధారణాశక్తి కలవాడు. శుద్ధసత్త్వుడైన యితడు లోకాలన్నింటిలోని అనేక విచిత్ర పద్ధతులను ఒక్కక్షణంలోనే తెలుసుకోగలడు. అదృశ్యాలు, రూపంలేనివి అయిన పద్ధతులనూ గ్రహించగలడు. అక్షర దృశ్యరూపంగా వుండే లిపులను గురించి వేరే చెప్పాలా?"

ఆ దేవపుత్రుడు ఈ విధంగా పలికి దివ్యాలైన పుష్పాలతో బోధిసత్త్వుణి పూజించి అక్కడే మాయమయినాడు,

అక్కడ మహారాజు పెంపుడు తల్లులనూ, దాసీజనాన్ని ఏర్పాటు చేసినాడు. వారుతప్ప మిగిలిన శాక్యులూ, శుద్ధోదన మహారాజూ అక్కడ నుండి వెళ్ళిపోయారు.

బోధిసత్త్వుడు ఉరగసారచందనం పూసిన పలకను, అంతటా మణులూ రత్నాలూ, తాపిన దివ్యార్ష సువర్ణమయమయిన తిరకం (బలపం)ను పుచ్చుకొని గురువులైన విశ్వామిత్రులవారితో ఇలా అన్నాడు - "భో ఉపాధ్యాయ! తమరు నాకు ఏ లిపిని అభ్యసింపజేస్తారు? లిపులు - బ్రాహ్మీలిపి, ఖరోష్ఠీలిపి, పుష్కరసారి, అంగలిపి, వంగలిపి, మగధలిపి. మంగళ్య

లిపి, అంగుళీయలిపి, సకారిలిపి, బ్రహ్మవలిలిపి, పారుష్యలిపి, ద్రావిడలిపి, కిరాతలిపి, దాక్షిణ్యలిపి, ఉగ్రలిపి, సంఖ్యాలిపి, అనులోమలిపి, అవమూరలిపి, దరదలిపి, భాష్యలిపి, చీనలిపి, లూనలిపి, హూణలిపి, మధ్యాక్షరవిస్తరలిపి, పుష్పలిపి, దేవలిపి, నాగలిపి, యక్షలిపి, గంధర్వలిపి, కిన్నరలిపి, మహోరగలిపి, అసురలిపి, గరుడలిపి, మృగచక్రలిపి, వాయసరుతలిపి, భౌమదేవలిపి, అంతరీక్షదేవలిపి, ఉత్తర కురుద్వీపలిపి, అపరగోడానీలిపి, పూర్వవిదేహలిపి, ఉత్క్షేపలిపి, నిక్షేపలిపి, విక్షేపలిపి, ప్రక్షేపలిపి, సాగరలిపి, వజ్రలిపి, లేఖప్రతిలేఖలిపి, అనుద్రుతలిపి, శాస్త్రావర్తలిపి, గణనావర్తలిపి, ఉత్క్షేపావర్తలిపి (నిక్షేపావర్తలిపి), పాదలిఖితలిపి, ద్విరుత్తర పదసంధిలిపి, యావద్దశోత్తరపదసంధిలిపి, మధ్యాహారిణీలిపి, సర్వరుత సంగ్రహిణీలిపి, విద్యానులోమా విమిశ్రితలిపి, ఋషితప స్తప్తలిపి, రోచమానలిపి, ధారిణీలిపి, ప్రేక్షిణీలిపి, గగనప్రేక్షిణీలిపి, సర్వౌషధినిష్యందలిపి, సర్వసార సంగ్రహణలిపి, సర్వభూతరుతగ్రాహిణీలిపి— అని వున్నవి గదా! ఈ అరవైనాలుగు లిపులలో ఏ లిపిని నాకు మీరు బోధిస్తారు?" అని.

ఆ మాటలకు ఆ బడిపిల్లల గురువైన విశ్వామిత్రుడు మిక్కిలి ఆశ్చర్యపడి, చిరునవ్వు నవ్వుతూ మానమద దర్పాలు ఉడిగి ఈ గాథలను పలికినాడు:

"ఆశ్చర్యం శుద్ధ సత్త్వస్య లోకే లోకానువర్తినో,
శిక్షితః సర్వశాస్త్రేషు లిపిశాలా ముపాగతః.
యేషామహం నామధేయం లిపీనాం న ప్రజానమి,
తత్రైష శిక్షిత సన్తో లిపిశాలా ముపాగతః.
వక్త్రం చాస్య న పశ్యామి మూర్ధానం తస్య నైవచ,
శిష్యయిష్యే కథం హ్యేనం లిపి ప్రజ్ఞాయ పారగం.
దేవదేవో హ్యతిదేవః సర్వదేవోత్తమో విభుః,
అసమశ్చ విశిష్టశ్చ లోకేష్వప్రతిపుద్గలః.
ఆస్యైవ త్వనుభావేన ప్రజ్ఞోపాయే విశేషతః,
శిక్షితం శిష్యయిష్యామి సర్వలోక పరాయణం."



"సమస్త శాస్త్రాలూ బాగా ఎరిగినవాడున్నూ, లోకం అనువర్తింపదగినవాడున్నూ అయిన బోధిసత్త్వుడు లిపులను అభ్యసించడానికి లిపిశాలకు వచ్చాడు. ఇది చాలా ఆశ్చర్యకరం! నేను పేర్లుకూడా ఎరుగని లిపులలో ఇతడు ఆరితేరి వున్నాడు. అట్టి మహావిద్వాంసుడు లిపులను అభ్యసించడానికి లిపిశాలకు వచ్చాడు. ఇతనికి ఏమి చెప్పవలెనో నాకు తెలియరాకున్నది. ఇతని తలవైపు చూడలేకుండా వున్నాను. లిపుల విజ్ఞానంలో పారగుడైన ఇతనికి ఎలా బోధించగలనో తెలియకున్నది. ఇతడు దేవులకు దేవుడు. దేవతలను అతిక్రమించినవాడు. దేవత లందరిలోనూ ఉత్తముడు. ప్రభువు, విశిష్టస్వరూపుడు. ఇతనికి సాటి ఎవరూ లేరు. అన్ని లోకాలలోను ఎదురులేని పుంగలుడు (పురుషోత్తముడు). ఈ బోధిసత్త్వుని అనుభావంవల్లనే ప్రజ్ఞనూ, ఉపాయాన్నీ అధికంగా సంపాదించి, సర్వలోక పరాయణుడూ, సుశిక్షితుతూ అయిన యితనికే బోధిస్తాను."

భిక్షులారా, విశ్వామిత్రుడు బోధిసత్త్వునితో కూడా పదివేలమంది కుమారులకున్నూ లిపిని బోధించాడు. ఆ కుమారులు బోధిసత్త్వుణ్ణి ఆశ్రయించి, వర్ణసమామ్నాయాన్ని అభ్యసించేవారు. వారు ఆకారాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు "అనిత్యం సర్వ సంస్కారం" అనే శబ్దం వచ్చినది. ఆకారాన్ని ఉచ్చరించినప్పుడు. "ఆత్మపరహిత" శబ్దం వచ్చినది. అట్లే ఇకారాన్ని ఉచ్చరించినప్పుడు "ఇంద్రియ వైకల్య" శబ్దమూ, ఈకారాన్ని ఉచ్చరించినప్పుడు "ఈతి బహులం జగత్తు" అనే శబ్దమూ, ఉకారాన్ని ఉచ్చరించేటప్పుడు "ఉపద్రవ బహుళమైంది లోకం" అనే శబ్దమూ వెలువడాయి. ఊకారాన్ని ఉచ్చరించినప్పుడు "ఊన (తక్కువ) సత్త్వం కలది జగత్తు"ని, ఏకారాన్ని ఉచ్చరించినప్పుడు "ఏషణా సముత్థానదోష" (కోరికలను గూర్చిన ప్రయత్నం దోషమనే) శబ్దమూ, ఐకారాన్ని ఉచ్చరించినప్పుడు "ఐర్యాపథము (తపస్సును సాధన చేసే మార్గం) శ్రేయస్కర"మనీ వ్యక్తమయినది. ఓకారోచ్చారణంలో "ఓఘోత్తర"మనే శబ్దమూ, ఔకారోచ్చారణలో "ఔపపాదక" (యుక్తియుక్తంగా సమర్థనమూ) అనే శబ్దమూ, అంకారోచ్చారణంలో "అమో

ఘమైన ఉత్పత్తి'' ఆః కారంలో ''అస్తంగమన'' శబ్దమూ వచ్చినవి. కకారోచ్చారణలో ''కర్మ విపాకావతార'' శబ్దమూ, ఖకారోచ్చారణంలో ''ఖసమసర్వధర్మ'' (సమస్తధర్మాలూ ఖసమానాలు) అనే శబ్దమూ, గకారోచ్చారణంలో ''గంభీరధర్మ ప్రతీత్య సముత్పాదావతార'' శబ్దమూ, ఘకారోచ్చారణలో ''ఘనపటలావిద్యామోహాంధకారవిధమనం'' (అవిద్యవల్ల కలిగిన మోహమనే అంధకారఘనపటలాన్ని ఊది వేయగలవాడనే) శబ్దమూ, ఙకారోచ్చారణలో ''ఙ్గవిశుద్ధి'' శబ్దమూ, చకారవిషయంలో చతురార్య సత్యశబ్దమూ, ఛకారంలో ''ఛందరాగ ప్రహాణ'' (కోరికలనూ, రాగాన్నీ నశింపచేయాలనే) శబ్దమూ, జకారోచ్చారణలో ''జరామరణాలను అతిక్రమించాలనే'' శబ్దమూ, ఝకారోచ్చారణంలో ''ఝషధ్వజబల నిగ్రహణ'' (మన్మథుని బలాన్ని నిగ్రహించాడనే) శబ్దమూ, ఞకారోచ్చారణలో జ్ఞానవశబ్దమూ వినవచ్చినవి. టకారంలో పటోపచ్ఛేదన శబ్దమూ, ఠకారోచ్చారణలో 'ఠపనీయ ప్రశ్న' శబ్దమూ, డకారంలో 'డమరమారనిగ్రహ (అపశకున రూపమైన మారుణ్ణి నిగ్రహించే)' శబ్దమూ, ఢకారంలో 'మీఢ విషయా! (విషయాలన్నీ మాత్రాదులవంటివి)'లనే శబ్దమూ, ణకారంలో 'రేణువులవంటివి కష్టా'లనే శబ్దమూ, తకారోచ్చారణలో 'తథతాసంభేద' శబ్దమూ, థకారోచ్చారణంలో 'థామబలవేగ వైశారద్య' శబ్దమూ, దకారోచ్చారణలో 'దాన దమ సంయమ సౌరభ్య' శబ్దమూ, ధకారోచ్చారణంలో ''ధనం ఆర్యులకు ఏడు విధాలు'' అనే శబ్దమూ, నకారోచ్చారణలో 'నామరూప పరిజ్ఞా' శబ్దమూ, వినవచ్చినవి. పకారోచ్చారణంలో 'పరమార్థ' శబ్దమూ, ఫకారోచ్చారణలో 'ఫలప్రాప్తిసాక్షాత్కార' శబ్దమూ, బకారోచ్చారణలో 'బంధనమోక్ష' శబ్దమూ, భకారోచ్చారణంలో 'భవవిభవ' శబ్దమూ, మకారంలో 'మదమానోపశమన' శబ్దమూ వినవచ్చాయి. యకారోచ్చారణలో 'యథావదర్థ ప్రతిబోధ' శబ్దమూ, రకారోచ్చారణలో (రేఫోచ్చారణము) రతి, అరతి, పరమార్థ రతిశబ్దములూ, లకారంలో 'లతాఛేదన' శబ్దమూ, వకారోచ్చార



ణలో 'వరయాన' శబ్దమూ, శకారోచ్చారణలో 'శమథవిపశ్యనా (నిశ్చలతా దృష్టి)' శబ్దమూ, షకారోచ్చారణంలో 'షడాయతనాలనూ నిగ్రహించుటకైన అభిజ్ఞజ్ఞానం పొందా' లనే శబ్దమూ, సకారోచ్చారణలో 'సర్వజ్ఞజ్ఞానాభిసంబోధన' శబ్దమూ, హకారంలో 'హతకేశ విరాగ' శబ్దమూ, క్షకారోచ్చారణలో 'క్షణ పర్యంతమూ అభిలాష్యములై సర్వధర్మాలూ ఉండు'ననే శబ్దమూ వినవచ్చినవి.

భిక్షులారా, అక్షర సమామ్నాయాన్ని చదువుతూ వున్న ఆ కుమారులకు బోధిసత్త్వుని అనుభావంవల్లనే గొప్పవీ, సంఖ్యాతీతాలూ అయిన లక్షలకొలదీ ధర్మాలు అవగతా లయినవి.

బోధిసత్త్వుడు ఆ విధంగా లిపిశాలలోనే వుండి ముప్ఫయి రెండు వేల కుమారుల మనస్సులను పరిణతిం చేసి వారికి గొప్ప జ్ఞానాన్ని కలిగించాడు. ముప్ఫయి రెండు వేల కుమారులకున్నూ, లోకోత్తరమైన సమ్యక్సంబోధిలో మనస్సు కలిగేటట్లు చేశాడు. బోధిసత్త్వుడు ఇదివరకే వివిధ లిపులలోనూ, వివిధ విద్యలలోనూ సుశిక్షితుడై వుండినా లిపిశాలకు రావడానికి హేతు విదే, ప్రత్యయ మిదే!

ఇది శ్రీ లలితవిస్తరంలో లిపిశాలా సందర్శన పరివర్తనమనే
పదవ అధ్యాయం.

# 11. కృషిగ్రామ పరివర్తం

సర్వార్థసిద్ధుడు పెరిగి పెద్దవాడైన తిరువాత తోడి బాలురతోనూ, మంత్రి పుత్రులతోనూ కూడా కృషిగ్రామాన్ని చూడడానికి వెళ్ళినాడు. అక్కడ జరిగే వ్యవసాయకర్మను చూచిన తర్వాత అక్కడ వున్న ఉద్యానవనంలో ప్రవేశించాడు. బోధిసత్త్వుడు అలా ప్రవేశించి మనస్సు కొంచెం కలతపడగా, ఒంటరిగా వేరెవ్వరి సహాయమూ లేక ఆ ఉద్యాన వనం అంతా తిరుగుతూ ఒకచోట ఆకర్షణీయంగా వున్న చక్కని నేరేడు చెట్టును చూచివాడు. అతడు దానిక్రింద నీడలో పర్యంక బంధంలో కూర్చున్నాడు. కూర్చుని మనస్సును ఏకాగ్రతలో ఉంచినాడు. ఆ రీతిని ఏకాగ్రమైన చిత్తంతో ఏకాంతమూ, కోరికలు లేనిదీ, పాపాలూ, అకుశలములూ అయిన పద్ధతులు లేనిదీ, చర్చతోనూ, విమర్శతోనూ కూడినదీ, వివేకంవల్ల జనించినదీ, ప్రీతి సుఖాలను కలిగించేదీ అయిన ప్రథమ ధ్యానలాభాన్ని పొంది విహరించసాగినాడు.

అతడు వితర్క విచారణలతో కూడిన ధ్యానాన్ని పొంది, ఆత్మకు నిర్మలత్వాన్నీ, చేతస్సునకు అవితర్కమునూ, అవిచారమునూ సంగ్రహించి, సమాధిలోనుండి ప్రీతి సుఖరూపమయిన రెండవ ధ్యానముద్రను పొంది విహరించసాగినాడు.

తర్వాత ప్రీతి విరాగాలను ఉపేక్షించి విహరించసాగినాడు. పూర్వస్మృతిని పొందినవాడై, ప్రజ్ఞావంతుడై సుఖం అనుభవించినాడు. ఆ సుఖం ఆయన శరీరంలో స్పష్టంగా వ్యక్తమయింది. ఉపేక్షకుడు, పూర్వస్మృతి కలవాడు, సుఖవిహారి అని ఆర్యులు (పెద్దలు) ఎవరినైతే అంటారో అలాటివాడై, నిష్ప్రీతికమైన మూడవ ధ్యానావస్థను పొంది విహరించాడు.



సుఖం నశించింది. దుఃఖమూ నశించింది. అంతకు పూర్వమే సౌమనస్య దౌర్మనస్యాలు అణగిపోవడంవల్ల దుఃఖసుఖాలు లేని, ఉపేక్షా స్మృతులతో పరిశుద్ధమైన నాల్గవ ధ్యానస్థితిలో విహరించాడు.

ఆ సమయంలో పంచాభిజ్ఞులు, మాహాత్మ్యం కలవారు అయిన ఐదుగురు బాహ్యాఋషులు ఆకాశమార్గంగా దక్షిణదిక్కునుంచి ఉత్తరం వైపు పోతూ వుండినారు. వారు బోధిసత్త్వుడున్న ఉద్యానం మీదుగా పోతూవున్నప్పుడు ఎవరో అడ్డుకొనినట్లయి, ప్రయాణం అసాధ్యమయినది. శరీరం జల్లుమనగా, వారు ఈ రీతి గాథ పలికారు :

వయ మిహ మణివజ్రకూటం గిరిం
మేరుమభ్యుద్గతం తిర్యగత్యర్థ వైస్తారికం
గజ ప్రసహాకార శుభాకులం వృక్ష
బృందాం ప్రదారిత్వ నిర్ధావితానేకశః,
వయ మిహ మరుణాం పురేచాప్యసక్తాగతా
యక్షు గంధర్వ వేశ్మాని చోర్ధ్వం నభే మిశ్రితా
ఇమ పున వనఖండ మాసాద్య సీదామ భోః
కస్య లక్ష్మీ నివర్తేతి బుద్ధేర్బలం.”

“తీయ మామిడి కొమ్మలు గజిబిజిగా అల్లుకుని వున్న వృక్షాల గుంపును గజరాజు విరిచివేసినట్లుగా మేము మిక్కిలి ఎత్తుగా లేచి, మణి వజ్రకూటాలతో విస్తరించిన మేరుపర్వతాన్ని అడ్డంగా తొక్కుకుంటూ అనేకసార్లు దాటుతున్నాము. దేవతల నగరంలో కూడా మాకు అడ్డు లేదు. యక్షుల, గంధర్వుల గృహాలమీదుగా వెళ్ళి వున్నాము. ఆకాశం మీదనుండి పోతూ యీ చిన్న ఉద్యానవనాన్ని దాటిపోలేకున్నాము. ఎవ్వరి గొప్ప అభ్యుదయ బలం, ఎవ్వరి సిరి, ఎవరి మాహాత్మ్య బలం, యిలా అడ్డు వచ్చినదో తెలియకున్నది.”

అప్పుడు అక్కడ వుండిన వనదేవత ఆ ఋషులతో ఈ క్రింది గాథతో పలికింది.

"నృపతి పతి కులోదితః శాక్య
రాజాత్మజో బాలసూర్య ప్రకాశప్రభః
స్ఫుటిత కమలగర్భ వర్ణప్రభ
శ్చారు చన్ద్రాననో లోకజేష్ఠో విదుః,
అయ మిహ వనమాశ్రితో ధ్యాన
చిన్తాపరో దేవగన్ధర్వ నాగేంద్ర యక్షార్చితో
భవ శతగుణ కోటిసంవర్ధిత స్తస్య
లక్ష్మీ నివర్తేతి బుద్ధేర్బలం."

"ఓ ఋషులారా, ఉత్తమ రాజవంశంలో ఉద్భవించినవాడూ, శాక్యవంశపు రాజకుమారుడూ, బాలసూర్యుని తేజస్సుతో వెలుగుతూన్నవాడూ, వికసించిన తామరపూవు లోభాగంవంటి మేనిచాయ కలవాడూ, చక్కని చంద్రునివంటి ముఖం కలవాడూ, లోకంలో జ్యేష్ఠుడూ, విద్వాంసుడూ అయిన మహానుభావుడు ఈ వనంలో ధ్యానచింతాపరుడై ఉన్నాడు. ఇతన్ని దేవతలూ, గంధర్వులూ, నాగేంద్రులూ, యక్షులూ, పూజిస్తూ వుంటారు. వందలకొద్దీ వెనుకటి జన్మలలో కోట్లకొద్దీ గుణాలతో వృద్ధి పొంది వున్నాడు. అతని అభ్యుదయమూ, మాహాత్మ్యమూ, బుద్ధీ, బలసంమృద్ధీ మిమ్మలిని వెళ్ళనియ్యకుండా ఆటంకపరచినవి."

తర్వాత ఆ ఋషులు క్రిందికి చూచారు. వారికి సిరితోనూ, అభ్యుదయంతోనూ, తేజస్సుతోనూ, వెలిగిపోతూ వున్న బోధిసత్త్వుడు కనుపించాడు. అప్పుడు వారికి ఇలా తోచింది—

"ఈ కూర్చున్న కుమారుడు ఎవ్వడు? ఇతడు ధనాధిపతి అయిన వైశ్రవణుడు గానీ, కామాలకు అధిపతి అయిన మారుడుగానీ, మహోరగాల ప్రభువుగానీ, అయి వుండాలి. లేకపోతే—వజ్రధరుడైన యింద్రుడో, కుంభాండాధిపతి అయిన రుద్రుడో, మహోత్సాహం కనీ కృష్ణుడో అయి వుండాలి. లేదా — దేవపుత్రుడైన చంద్రుడుగాల,



సహస్రరశ్మి అయిన సూర్యుడు గానీ, చక్రవర్తి అయిన రాజుగానీ అయి వుండాలి."

ఇలా అంటూ ఆ సమయంలో వారు ఈ గాథను చెప్పారు:—

"రూపం వైశ్రవణాతిరేక వపుషం వ్యక్తం కుబేలోఽహ్యాయం
అహో వజ్రధరస్య చైవ ప్రతిమా చన్ద్రోఽథ సూర్యోఽహ్యాయం,
కామాగ్రాధిపతిశ్చ యా ప్రతికృతీ రుద్రస్య కృష్ణస్య వా
శ్రీమాన్ లక్షణ చిత్రితాంగ మనఘో బుద్ధోఽథవా స్యాదయం.

"ఇతని శరీరం వైశ్రవణుని అతిక్రమించిన చక్కని రూపం కలది. ఇతడు తప్పక కుబేరుడై వుండాలి. లేదా వజ్రధరుని పోలిక కానవస్తున్నది. కాకపోతే యితడు చంద్రుడో, సూర్యుడో అయి వుండాలి. కామాధిపతిపోలిక యితనిలో కానవస్తున్నది. లేదా రుద్రునిదో, కృష్ణునిదో పోలిక అయి వుండాలి. అభ్యున్నతితోనూ, శుభ లక్షణాలతోనూ కూడివున్న యితడు అనఘుడైన బుద్ధుడయినా అయి వుండాలి."

తర్వాత ఆ వనదేవత ఆ ఋషులనుగురించి యీ గాథ పలికింది—

"యా శ్రీ వైశ్రవణే చ వై నివసతే యా వా సహస్రేక్షణే
లోకానాం పరిపాలకేషు చతుషూ యా చాసురేన్ద్రశ్రియా,
బ్రహ్మే యా చ సహాపతౌ నివసతే కృష్ణే చ యా చ శ్రియా
సా శ్రీ ప్రాప్య ఇమం హి శాక్యతనయం నోపైతి కాంచిత్కలాం."

వైశ్రవణునిలో గల సిరి (కాంతి) సహస్రేక్షణుడైన యింద్రునియందున్న సిరి, నలుగురు లోకపాలకులయందు గల సిరి, అసురేంద్రునిలోని సిరి, సహాపతి అయిన బ్రహ్మయందు గల సిరి, కృష్ణునియందున్న సిరి - ఇవన్నీ యీ శాక్యతనయుణ్ణి పొందినా ఒక్క కళనైనా - కొంచెం కాంతినైనా కూర్చలేవు."

తర్వాత ఆ అయిదుగురు ఋషులూ ఆ వనదేవతమాటను విని, భూమికి దిగారు. దిగి ధ్యానంలో మునిగియున్న బోధిసత్త్వుణ్ణి

చూచారు. అనింద్యమానమయిన శరీరాన్ని ధరించి ఒక తేజోరాశి జ్వలిస్తూ వున్నట్టు వారికి కానవచ్చినది. వారు బోధిసత్త్వుణ్ణి తనివి తీరునట్లు చూచి, ఈ గాథలతో స్తుతించారు. వారిలో ఒకడు ఇలా చెప్పాడు:

"లోకే క్లేశాగ్ని సంతప్తే ప్రాదుర్భూతో౽హ్యాయం హ్రదః,
అయం తం ప్రాప్స్యతే ధర్మం యజ్జగద్ హ్లాదయిష్యతి."

లోకం క్లేశాలనే అగ్నివలన పూర్తిగా తపించిపోగా, ఈ బోధిసత్త్వుడనే సరస్సు ఉద్భవించింది. లోకపు తాపాన్ని అణచివేసి, సంతోషపెట్టే ధర్మాన్ని పొందగలదు.

మరొక ఋషి ఇలా అన్నాడు:

"అజ్ఞాన తిమిరే లోకే ప్రాదుర్భూతః ప్రదీపకః,
అయం తం ప్రాప్స్యతే ధర్మం యజ్జగద్ భాసయిష్యతి."

లోకమంతా అజ్ఞానమనే గాఢాంధకారంలో మునిగి వుండగా, ప్రకాశవంతమయిన దీపం ప్రాదుర్భవించింది. లోకాన్నంతటినీ వెలుగులోకి తెచ్చే ధర్మాన్ని యిది పొందగలదు.

ఇంకొకడు యిలా చెప్పాడు:

"శోక సాగర కాన్తారే యానశ్రేష్ఠముపస్థితం,
అయం తం ప్రాప్స్యతే ధర్మం య జ్జగ త్తారయిష్యతి."

అడవివలే వుండే శోకాలనే సముద్రం దాటడానికి యానశ్రేష్ఠం (ఉత్తమమైన పడవ) లభించినది. లోకాన్ని ఆవలిఒడ్డుకు చేర్చే ధర్మాన్ని యిది పొందగలదు.

ఇంకొకడు యిలా అన్నాడు:

"క్లేశబంధన బద్ధానాం ప్రాదుర్భూతః ప్రమోచకః,
అయం తం ప్రాప్స్యతే ధర్మం యజ్జగన్మోచయిష్యతి."



క్లేశాలనే త్రాళ్ళతో బంధించబడినవారి బంధాలను తొలగించే మహానుభావుడు జన్మించాడు. ఇతడు లోకానికి క్లేశవిమోచనం చేసే ధర్మాన్ని పొందగలడు.

వేరొకడు యిలా చెప్పినాడు:

"జరావ్యాధి క్లిష్టానాం ప్రాదుర్భూతో భిషగ్వరః,
అయం తం ప్రాప్స్యతే ధర్మం జాతిమృత్యు ప్రమోచకం."

ముసలితనంచేతనూ, రోగాలచేతనూ, బాధపడేవారిని ఉద్ధరించడానికి ఈ ఉత్తమవైద్యుడు ఉద్భవించాడు. ఇతడు జనన మరణాలనుండి విమోచన చేసే ధర్మాన్ని పొందగలడు.

ఓ భిక్షులారా! ఆ అయిదుగురు ఋషులూ యీ విధంగా అయిదు గాథలతో బోధిసత్త్వుణ్ణి స్తుతించి, ముమ్మారు ప్రదక్షిణంచేసి, ఆకాశమార్గంగానే వెళ్ళిపోయారు.

కుమారుడు గృహంలో కానరాకపోగా, శుద్ధోదన మహారాజు ఆందోళన పడినాడు. అతడు కానరాకపోతే తనకు సంతుష్టే లేదు. "కుమారుడు కనబడలేదే! ఎక్కడకు వెళ్లాడు?" అని ఆయన ప్రశ్నించగా, పరిజనం అంతా బోధిసత్త్వుణి వెదకడానికి నాలుగువైపులా వెళ్లారు. మంత్రులు కూడా నాల్గువైపులా వెళ్ళారు. వారిలో ఒక మంత్రికి ఆ ఉద్యానంలో నేరేడుచెట్టునీడలో కూర్చుని ధ్యాననిమగ్నుడై వున్న బోధిసత్త్వుడు కనబడ్డాడు. సూర్యగమనాన్నిబట్టి చెట్లనీడలు మారిపోయినా, అతడు కూర్చున్న నేరేడుచెట్టు నీడమాత్రం చలించకుండా, బోధిసత్త్వుడు మొదట కూర్చున్నప్పుడు ఎలా వున్నదో, ఇప్పుడూ అలాగే వుండినది. దాన్ని చూచి, ఆ అమాత్యుడు మిక్కిలి ఆశ్చర్యపడి, పరుగు పరుగున మహారాజైన శుద్ధోదనునివద్దకు పోయి

"పశ్య దేవ కుమారో౽యం జమ్బుఛాయా హి ధ్యాయతి,
యథా శక్రో౽థవా బ్రహ్మా శ్రియా తేజేన శోభతే.

యస్య వృక్షస్య ఛాయాయాం నిషణ్ణో వరలక్షణః,
నైనం న జహతే ఛాయా ధ్యాయన్తం పురుషోత్తమం.''

''దేవా చూడు! మీ కుమారుడు నేరేడుచెట్టు నీడలో ధ్యానం చేస్తూ ఉన్నాడు. ఇంద్రునివలె, బ్రహ్మదేవునివలె సిరితోను (అభ్యుదయం తోనూ), తేజస్సుతోనూ ప్రకాశిస్తున్నాడు.

యోగ్యాలైన లక్షణాలు గల కుమారుడు ఆ చెట్టునీడలో కూర్చుని ఉండగా, ఆ నీడ ధ్యాన నిమగ్నుడైన యీ పురుషోత్తముణ్ణి విడిచి పోలేదు.''

ఆ మాటలు విని శుద్ధోదన మహారాజు ఆ నేరేడుచెట్టు వున్న చోటుకు వచ్చాడు. అక్కడ అభ్యుదయంతోనూ, తేజస్సుతోనూ ప్రకాశిస్తూ వున్న బోధిసత్త్వుణ్ణి చూచాడు. చూచి ఈ గాథను పలికాడు.

''హుతాశనో వా గిరిమూర్ధ్ని సంస్థితః శశీవ నక్షత్రగణానుచీర్ణః,
వేపన్తి గాత్రాణి మి పత్యతో ఇమం ధ్యాయన్తు తేజోను ప్రదీపకల్పం.''

''పర్వతశిఖరంపై వున్న అగ్నివలెను, నక్షత్రగణాలతోవున్న చంద్రునివలెను, తేజస్వంతుడై దీపంవలే ప్రకాశిస్తూ, ధ్యాన నిమగ్నుడై వున్న ఇతనిని చూస్తూ వుండగా, నా అవయవాలు వణుకుతూ వున్నవి.''

శుద్ధోదన మహారాజు బోధిసత్త్వుని పాదాలకు నమస్కారంచేసి, యీ గాథను పలికినాడు.

''యదాచాసి మునే జాతో యదా ధ్యాయసి చార్చిమన్,
ఏకద్విరపి తే నాథ పాదౌ వన్దే వినాయక.''

''ఓ మహామునీ! నీవు ఉద్భవించి తేజస్సుతో ప్రకాశిస్తూ ధ్యానం చేస్తూ వున్నావు. లోకానికి నాథుడవూ, పెద్ద నాయకుడవూ అయిన నీ పాదాలకు ముమ్మారు నమస్కరిస్తున్నాను.''

అప్పుడు త్రిఫలాలు తెచ్చుకుంటున్న బాలకులు కొంత గోల చేశారు. అక్కడ వున్న శుద్ధోదనుని మంత్రులు ''గోలచెయ్యకండి, గోల



చెయ్యకండి'' అని అన్నారు. ''ఎందుకు? ఏమిటి ఇదంతా?'' అని ఆ బాలకులు అడిగారు. మంత్రులు ఒక గాథతో సమాధాన మిచ్చారు. దాని భావమిది__

''తిమిరాలు తొలగదోసే సూర్యమండలం ఆకాశ మధ్యనుంచి పడమటికి దిగజారినా, శుభశ్రేష్ఠ లక్షణాలు కలిగిన పర్వతంవలె నిశ్చంచలంగా ధ్యానం చేస్తున్న ఈ సిద్ధార్థ నరేంద్రపుత్రుణ్ణి ఈ చెట్టునీడ విడవడంలేదు'' అని.

ఇక్కడ కొన్ని గాథ లున్నాయి. వాటిభావ మిది__.

గ్రీష్మంలో, వసంతం తరువాత వచ్చిన జ్యేష్ఠమాసంలో చెటు చిగిర్చి, పుష్పించి, పూలతో చివుళ్ళతో నిండారి వుండగా, క్రౌంచ పక్షులూ, నెమళ్లూ, చిలుకలూ, గోరువంకలూ, ధ్వనులు చేస్తూవుండగా శాక్యసుతులు పలువురు బయలుదేరారు.

అప్పుడు ఛందకుడు ఆ కుమారులతో ''వనాన్ని చూడడానికి మీరంతా రండి. బ్రాహ్మణునివలె ఇంటిలో కూర్చుంటే ఏమి ప్రయోజనం? మనం వనానికి వెళ్ళుదాము'' అని చెప్పాడు.

పరిశుద్ధసత్త్వం కల సర్వార్థసిదుడు మధ్యాహ్న కాల సమయములో ఐదువందలమంది సేవకులతో కూడా తల్లికి గాని, తండ్రికి గాని తెలుపకుండా బయలుదేరి కృషిగ్రామానికి వెళ్ళాడు. మహారాజులకు చెందిన ఆ కృషి గ్రామములో విశాలములైన అనేక శాఖలతో కూడిన నేరేడుచెట్టు వున్నది. ఆ గ్రామాన్ని చూడగానే బోధిసత్త్వునికి దుఃఖం పొంగి పొరలి ''అయ్యో! ఎంత కష్టంతో జనం కృషికర్మ సాగిస్తున్నది?'' అని అనుకున్నాడు. తర్వాత నేరేడుచెటునీడను కూర్చుని, వినీతచిత్తుడై, అక్కడి గడ్డిని చేర్చి పడకగా చేసుకుని, దానిపైన శరీరాన్ని చేరవేసి, పర్యంకబంధంలో ఆసీనుడై, నాలుగు శుభధ్యానావస్థలు పొందాడు.

ఆకాశమార్గంగా పోతూ వున్న ఐదుగురు ఋషులు ఆ చెటు దగరకు వచ్చి, దానిమీదనుంచి పోవ యత్నింపగా, సాధ్యపడలేదు. వెంటనే

వారి మానమదాలు అణగిపోయాయి. అందరూ ఆశ్చర్యంతో ఒకరి నొకరు చూడసాగారు.

“మేము మేరుపర్వతం మీదనుండి అడ్డులేక పోతున్నాము. దిఙ్మధ్యాన్ని భేదించుకుని పోతున్నాము. మా వేగానికి అడ్డు లేదు. ఇప్పుడిక్కడ ఈ నేరేడుచెట్టును దాటిపోవడం సాధ్యం కాలేదు. దీనికి కారణం ఏమిటో తెలియడంలేదు” అని, ఇలా అనుకుంటూ వారు మేదినీతలానికి దిగి చూచారు. ఆ నేరేడుచెట్టు మొదట వారికి శాక్యతనయుడు కానవచ్చాడు. అతడు బంగారుచాయ కల్గి, గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తూ పర్యంకంపై ధ్యానమగ్నుడై ఉండినాడు.

ఆ ఋషులు అతనిని చూచి ఆశ్చర్యపడి, పదివ్రేళ్లూ దగ్గర పడేటట్లు చేతులు జోడించుకుని, అతని పాదాలపైని పడి “ఓ సాధూ! సుజాతుడా! సుముఖుడవై లోకాన్ని దయతో చూడు. ప్రాణుల నందరినీ వేగంగా అమృతత్వాన్ని పొందించు” అని ప్రార్థించారు.

సూర్యుడు మళ్ళిపోయినా, ఆ చెట్టునీడ సుగతునిపై చెదరకుండా ఆ విధంగానే వున్నది. ఆ వృక్షము పద్మపత్రంవలె అల్లలనాడింది. వేలకొద్దీ దేవతలు చేతులు జోడించుకుని కృతనిశ్చయుడైన ఆ బోధిసత్త్వుని పాదాలకు నమస్కరిస్తూ ఉండినారు.

శుద్ధోదన మహారాజు తన గృహంలో కుమారుని కోసం వెతుకుతూ, అతడు కనబడకపోగా “కుమారుడు ఎక్కడకు వెళ్ళాడు?” అని అక్కడివారిని అడిగాడు. పినతల్లి అయిన గౌతమి “కుమారుడు కానరా లేదే? ఎక్కడకు వెళ్ళాడు?” అని మహారాజును ప్రశ్నించినది.

వెంటనే శుద్ధోదనుడు అంతఃపురంలోని కంచుకినీ, ద్వారపాలకునీ, తక్కినవారి నందరినీ “నా కుమారుడు భవనంనుంచి వెళ్ళుతూ వుండగా ఎవరైననూ చూచారా?” అని అడిగాడు. చూచినవారు “దేవా! మీ కుమారుడు కృషిగ్రామానికి వెళ్ళాడు” అని తెలియజేశారు.

శుద్ధోదన మహారాజు వేగంగా శాక్యులతోకూడా బయలుదేరి కృషిగ్రామాన్ని ప్రవేశించాడు. కోట్లకొలదీ సూర్యులు ఉదయించినట్లున్న



తేజస్సుతో ప్రకాశిస్తూ, హితకరుడూ, అభ్యుదయంతో, సిరితో వెలుగుతున్నవాడూ అయిన బోధిసత్త్వుణ్ణి అతడు చూచాడు. మహారాజు తన కిరీటాన్నీ, కత్తినీ, పాదుకలనూ తీసివేసి పదివేళ్ళూ దగ్గర పడేటట్లు చేతులు జోడించి తలపై ఉంచుకుని, అతనికి నమస్కరించాడు. ఋషులు యథార్థవచనులనీ, నిశ్చయంగా తన కుమారుడు మహాత్ముడై, సమ్యక్సంబోధికోసం అభినిష్క్రమించాడనీ అనుకున్నాడు.

పన్నెండు వందలమంది సుప్రసన్నులైన దేవతలూ, ఐదువందలమంది శాక్యులూ వచ్చి గుణసముద్రుడైన బోధిసత్త్వుని ఋద్ధిని (గొప్పతనాన్ని) చూచారు. దృఢమయిన ఆశయంతో వారికి సంబోధిలో మనస్సు కలిగింది. బోధిసత్త్వుడు త్రిసాహస్రమయిన భూమిని కంపింపజేస్తూ, బాహ్యస్మృతినీ, సంప్రజ్ఞనూ పొంది, సమాధ్యవస్థనుంచి లేచి తేజస్సుతో వెలిగిపోతూ, శుద్ధోదనుని చూచి బ్రహ్మస్వరంతో యిలా అన్నాడు:

“తండ్రీ! పూరు వదలి నన్ను వెదకడానికి కృషిగ్రామానికి వచ్చినట్లుంది. మీకు బంగారం కావలిస్తే స్వర్ణ వర్షం కురిపిస్తాను. వస్త్రాలు కావలసినవారికి వస్త్రాలు నేనే యిస్తాను. ధాన్యాలు కావలసినవారికి వర్షాలు కురిపించి నేనే ధాన్యాలు పండేటట్లు చేస్తాను. రాజా! సర్వ జగత్కార్యాలూ చక్కగా కొనసాగించు.”

బోధిసత్త్వుడు జనుల పరిషత్తులో తండ్రిని ఈ విధంగా అనుశాసించి, ఆ క్షణంలోనే పట్టణంలో తిరిగి ప్రవేశించాడు. పట్టణంలో నైష్క్రమ్యయుక్త మనస్సుతో ఆ విశుద్ధసత్త్వుడు జగత్సంగ్రహార్థం లోకసామాన్య ధర్మాలను అనుసరించాడు.

ఇది లలిత విస్తరంలో కృషిగ్రామపరివర్త మనే
పదకొండవ అధ్యాయం.

# 12. శిల్పసందర్శన పరివర్తం

భిక్షువులారా! కుమారుడు పెద్దవాడైన తర్వాత శుద్ధోదన మహారాజు ఒకప్పుడు శాక్యుల గణంతో కూడా సంస్థాగారంలో కొలువుతీరినాడు. ఆ సమయంలో మహల్లక - మహాల్లిక శాక్యులు మహారాజుతో ఇట్లు మనవి చేశారు: "దేవా! నైమిత్తికులయిన బ్రాహ్మణులు చక్కగా నిర్ణయించి, కుమారుడు అభినిష్క్రమణం చేసినట్లయితే తథాగతుడూ, అర్హతుడూ, సమ్యక్ సంబుద్ధుడూ కాగలడు. ఒకవేళ అభినిష్క్రమణం చెయ్యక పోతే చతురంగబలాలతో కూడి చక్రవర్తి అయి విజయాలను పొందుతూ ధర్మరాజై ధార్మికుడుగా ఉండి సప్తరత్నాలనూ సంపాదించగలడు. ఆ ఏడు రత్నాలు ఏవంటే-చక్రరత్నమూ, హస్తిరత్నమూ, అశ్వరత్నమూ మణిరత్నమూ, స్త్రీరత్నమూ, గృహపతిరత్నమూ, పరిణాయకరత్నమూ అనేవి. ఈ విధంగా సప్తరత్నాలతోనూ పరిపూర్ణులై అతనికి వెయ్యిమంది కుమారులు కలుగుతారు. ఆ పుత్రులు శూరులూ, చక్కదనం కలవారూ అయి శత్రుసైన్యాలను మర్దించగలరు. అతడు శస్త్రం ప్రయోగించకుండా, శిక్ష అనేది లేకుండా భూమండలాన్ని జయించి ధర్మంగా పరిపాలిస్తాడు —అని చెప్పారు గదా. తమరు వెంటనే కుమారుడికి వివాహం చెయ్యండి. అంతఃపురంలో పెట్టండి. అతడు స్త్రీగణంతో కూడి సుఖంగా కాలం గడుపుతూ రతి అంటే ఏమిటో తెలుసుకుంటాడు. ఇల్లు విడిచి వెళ్ళిపోడు. దీనివల్ల మనకు ఎడతెగకుండా చక్రవర్తుల పరిపాలన లభిస్తుంది కూడా. మన గౌరవమూ నిలుస్తుంది. సామంతరాజులందరూ మనయందు ఎట్టి లోపాన్నీ ఎంచకుండా ఉంటారు."

శుద్ధోదన మహారాజు "సరే, అలా అయితే కుమారునికి ఏ కన్యక అనురూపంగా వుంటుందో చూచి చెప్పండి" అని అన్నాడు.



అక్కడ వున్న అయిదువందల శాక్యులలోనూ ప్రతి ఒక్కడున్నూ తన కుమార్తెయే సర్వార్థసిద్ధునికి అనురూప, సురూప అయినదని తెలియజేశాడు.

"కుమారుడు దురాసదుడు. అందువల్ల ఈ విషయంలో అతని యిష్టానికి వ్యతిరేకంగా జరపడం సాధ్యం కాదు. అతనికి ఏ కన్యక యిష్టమో తెలుసుకుంటాము" అని శుద్ధోదనుడు వాళ్ళకు తెలిపాడు.

తర్వాత ఆ శాక్యులందరూ కలిసి సర్వార్థసిద్ధుణ్ణి చూచి తమ అభిప్రాయాన్ని విన్నవించారు. నాటికి ఏడవ దినమున సమాధానం ఇస్తానని అతడు వారికి తెలియజేశాడు.

తర్వాత బోధిసత్త్వుని మనస్సులో ఇలా తోచింది.

"విదిత మమ అనన్త కామదోషాః
సరణ సవైర సశోక దుఃఖమూలాః,
భయకర విషపత్ర సంనికాశాః
జ్వలననిభా అసిధారతుల్యరూపాః.

కామగుణి న మేఽస్తి ఛందరాగో
న చ అహు సోభమి ఇస్త్రిగారమధ్యే,
యన్ను అహు వనే వసేయ తూష్ణీం
ధ్యానసమాధి సుఖేన శాంతచిత్తః."

"కామములు అనంతాలైన దోషాలు కలవి. జగడాలకూ, విరోధాలకూ, శోకమునకూ, దుఃఖమునకూ అవి మూలములు. భయంకరమైన విషపత్రాలతో (రంపాలతో) సమానమైనవి. అవి అగ్నితోనూ, కత్తిదారతోనూ సమానాలు. ఈ సంగతి నాకు తెలుసు. కామము విషయంలో నాకు ఏ మాత్రమూ ఇష్టంలేదు. స్త్రీలతో నిండివున్న గృహంలో నేను శోభించలేను. శాంతచిత్తం కలవాడనై అడవిలో నివసిస్తూ ధ్యానసమాధి సుఖాన్ని అనుభవించగలను."

బోధిసత్త్వుడు తిరిగి చర్చనూ, ఉపాయాలనూ, నేర్పునూ సుముఖం చేసుకొని, సత్త్వపరిపాకాన్ని కోరుతూ, గొప్ప దయకలవాడై ఆ సమయంలో గాథలను పలికినాడు: వాని భావ మిది—

"బురదలో ఉండినప్పుడే తామరలు వృద్ధిని పొందుతూ ఉన్నవి. జనులమధ్యలో కలిసి మెలిసి వున్నప్పుడే రాజు గౌరవాన్ని పొందుతున్నాడు. బోధిసత్త్వుడు పరివార బలాన్ని పొందినప్పుడే కోటానుకోటి జనులకు అమృతత్వ సిద్ధి కలిగిస్తున్నాడు. ఇదివరలో ఉండిన బోధిసత్త్వ లందరున్నూ భార్యలతోనూ, పుత్రులతోనూ కలిసి స్త్రీలుండే గృహాలలో ఉండేవారు. వారెవ్వరూ రాగరక్తులు కాలేదు. ధ్యానసుఖాలనుండి భ్రష్టులూ కాలేదు. నేను కూడా వారి పద్ధతులనే అనుసరిస్తాను. నాకు అనుకూలురాలైన వధువు ఎన్నడూ అనాగరకురాలు కాదు. ఆమె ఎప్పుడూ సత్యవాక్యాలనే పలుకుతూ వుంటుంది. అప్రమత్తురాలై నన్ను ఆరాధిస్తూ, మనసులో నన్నే తలుస్తూ వుంటుంది. రూపంచేతనూ, జన్మకుల గోత్రాలచేతనూ పరిశుద్ధురాలై ఉంటుంది."

సర్వార్థ సిద్ధుడు అర్థయుక్తంగా కొన్ని గాథలను లేఖలో వ్రాసి "ఇలాంటి గుణాలు గల కన్య వుంటె ఆమెనే వివాహమాడగలను. అసంవృతమైన ప్రాకృతజనాన్ని సహించలేను. నేను చెప్పిన గుణాలున్న కన్యనే వరిస్తాను" అని తండ్రికి తెలియజేశాడు. ఆ లేఖలోని గాథ లివి:

"యా రూపయౌవనవరా న చ రూపమత్తా
మాతా స్వసావ యథ వర్తతి మైత్రచిత్తా,
త్యాగే రతా శ్రమణ బ్రాహ్మణ దానశీలా
తాం తాదృశాం మమ వధూం వరయస్వ తాత.

యస్యా న మాను న ఖిలో న చ దోష మస్తి
న చ శాఠ్య ఈర్ష్యి న చ మాయ నచ ఉజ్జు భ్రష్టా,
స్వప్నాంతరేసి పురుషే న పరేఽభిరక్తా
తుష్టా స్వకేన పతినా శయతేఽప్రమత్తా.



నచ గర్వితా న పిచ ఉద్ధత న ప్రగల్భా
నిర్మాన మానవిగతాపి చ చేటిభూతా,
నచ పాన గృహ్య న రసేషు న శబ్దగంధే
నిర్లోభభిద్య విగతా స్వధనేన తుష్టా.

సత్యే స్థితా న పిచ చఞ్చల నైవ భ్రాన్తా
నచ ఉద్ధతోన్నతస్థితా హిరివస్త్రఛన్నా,
నచ దృష్టి మజ్జలరతా సద ధర్మయుక్తా
కాయేన వాచ మనసా సద శుద్ధభావా.

న స్థాన మిద్ధబహులా న చ మానమూఢా
మీమాంసయుక్త సుకృతా సద ధర్మచారీ,
స్వశ్రౌచ తస్య శ్వశురే యథ శాస్త్రప్రేమా
దాసీకలత్రజని యాదృశ మాత్మప్రేమ.

శాస్త్రే విధిజ్ఞ కుశలా గణికా యథైవ
పశ్చాత్ స్వపేత్ ప్రథమ ముత్థిహతే చ శయ్యాత్,
మైత్రానువర్తి అకుహాపి చ మాతృభూతా
ఏతాదృశీమి నృపతే వధుకాం వృణీష్వ."

"రూపంచేతనూ, యౌవనంచేతనూ యోగ్యురాలూ, తాను రూపవతి ననే గర్వంలేనిదీ, తల్లివలెనూ సోదరివలెనూ ఎంతో ప్రేమగలదీ, త్యాగం చేయుటలో ఆసక్తికలదీ, శ్రవణులకూ బ్రాహ్మణులకూ దానం యిచ్చే స్వభావం కలదీ అయిన వధువునే ఓ తండ్రీ! నాకోసం నిర్ణయించు. గర్వం లేనిదీ, గొడ్రాలు కానిదీ, ఎట్టి దోషములూ లేనిదీ, పరుషంగా మాటలాడనిదీ, అసూయలేనిదీ, మాయమర్మాలు ఎరుగనిదీ, ఉన్నతస్థితి నుండి భ్రష్టం కానిదీ, స్వప్నమునందైననూ పరపురుషునియెడల ఆసక్తి లేనిదీ, భర్తను సేవించి తృప్తిని పొందునదీ, అప్రమత్తురాలయి నిద్రించేదీ ఐన వధువే యోగ్యురాలు. గర్వమూ ఔద్ధత్యమూ లేనిదీ, ప్రగల్భంగా

మాటలాడనిదీ, దురభిమానం లేనిదీ, మానం (కోపం) లేనిదీ, సేవలో చేటివలె ఉండునదీ, ద్రాక్షాదిపానాలను స్వీకరించనిదీ, రసములయెడలనూ శబ్దమునందూ గంధమునందునూ ఆశ లేనిదీ, తనకు ఉన్నదానితో తృప్తిపడేదీ అయిన కన్య కావాలి. ఎప్పుడూ సత్యమున నిలిచి వుండునదీ, చాంచల్యంగానీ భ్రాంతిగానీ లేనిదీ, ఔద్ధత్యములేనిదీ, ఉన్నతస్థితిలో ఉన్నట్లు అనుకోనిదీ, లజ్జ అనే వస్త్రంతో ఆచ్ఛాదిత అయినదీ, దృష్టి మంగళరత కానిదీ, ఎల్లప్పుడూ ధర్మబుద్ధి కలదీ, శరీరంచేతనూ, మాటచేతనూ, మనస్సుచేతనూ ఎల్లప్పుడూ పరిశుద్ధమైన స్వభావం కలదీ అయిన వధువు కావాలి. తన గొప్పతనాన్ని చూపనిదీ, మాన మూఢురాలు కానిదీ, ఆలోచన కలదీ, పుణ్యాత్మురాలూ, ఎల్లప్పుడునూ ధర్మాన్ని ఆచరించేదీ, అత్తమామల ఆజ్ఞలకు లోబడి వుండేదీ, వారిని ప్రేమించేదీ, తన వారిని అభిమానించినట్లే దాసీజనాన్ని అభిమానించేదీ అయినదిగా వధువు వుండాలి. గణికవలెనే శాస్త్రములనూ, విధులనూ తెలుసుకోవడంలో నేర్పుకలిగి ఉండాలి. భర్త నిద్రించిన తర్వాత నిద్రించి, అతడు మేల్కొనకముందే నిద్ర లేవాలి. ఎంతో మైత్రితోనూ, నటన లేకుండానూ, తల్లి మాదిరిగా అభిమానించాలి. రాజా! ఇట్టి వధువును వెదకి తీసుకొని రావలసి ఉన్నది."

భిక్షులారా! తర్వాత శుద్ధోదనుడు పురోహితుణ్ణి పిలిపించి, అతనికి సర్వార్థసిద్ధుడు వ్రాసిన లేఖలోని గాథలను వినిపించి "ఓ మహాబ్రాహ్మణుడా! కపిలవస్తు మహానగరంలో యింటింటికీ పోయి, అక్కడ వుండే కన్యకలను బాగా పరిశోధించు. ఇలాంటి ఉత్తమగుణాలున్న కన్యక వుంటే చూడు. ఆమె బ్రాహ్మణకన్య అయినా, క్షత్రియకన్య అయినా, వైశ్యకన్య అయినా, శూద్రకన్య అయినా—ఏజాతికి చెందినా సరే! ఆ కన్యనుగురించి మాకు తెలియజెయ్యాలి. ఇలా ఎందుకు చెప్తున్నానంటే - కుమారుడికి కులంతోగాని, వంశంతోగాని నిమిత్తం లేదు. అతనికి గుణాలే కావాలి" అని చెప్పాడు. ఇట్లు చెప్పి అతడు ఈ గాథలను తెలిపాడు—



"బ్రాహ్మణీం క్షత్రియాం కన్యాం వైశ్యాం శూద్రీం తథైవచ,
యస్యా ఏతే గుణాః సన్తి తాం మే కన్యాం ప్రవేదయ.
న కులేన న గోత్రేణ కుమారో మమ విస్మితః,
గుణే సత్యే చ ధర్మే చ తత్రాస్య రమతే మనః."

(బ్రాహ్మణ కన్య అయినా, క్షత్రియ కన్య అయినా, వైశ్యకన్య అయినా, శూద్రకన్యఅయినా సరే, ఏకన్యయందైతే యీ గుణాలు వుంటాయో ఆమెను నాకు తెలియజెయ్యి. నాకుమారుడు కులగోత్రాలు చూచి వింతపడడు. అతని మనస్సును ఉత్తమగుణాలూ సత్యధర్మాలూ ఆకర్షిస్తాయి.)

రాజపురోహితుడు ఆ గాథలతో వున్న ఆ లేఖను తీసుకుని కపిలవస్తు మహానగరంలోని యిండ్లను అన్నింటినీ పరిశీలిస్తూ విసుగులేకుండా తిరుగుతూ కన్యను వెదకసాగాడు. ఎంత వెదకినా అతనికి ఈ గుణాలు గల కన్య కానరాలేదు. అట్టి గుణములు గల కన్యకోసం యింకా వెతుకుతూ శాక్యుడైన దండపాణి గృహానికి వెళ్ళాడు. ఆ గృహంలో ప్రవేశించగా శుభలక్షణాలతో కూడిన ఒక కన్య అతనికి కానవచ్చింది. ఆ కన్య అభిరూపగానూ, దర్శనీయగానూ ప్రసన్నభావం కలదిగానూ, శుభకరమైన శరీరచ్ఛాయతో కూడినదిగానూ ఉన్నది. అంత పొట్టిగానూ, అంత పొడుగుగానూ కాక తగినట్లున్నది. లావుగాగాని, సన్నంగాగాని లేదు. అంత తెల్లగానూ లేదు, నల్లగానూ లేదు. ప్రథమయౌవనావస్థలో వుండి స్త్రీలలో రత్నంగా ప్రకాశిస్తూ ఉన్నది.

రాజపురోహితుణ్ణి చూడగానే ఆ కన్య అతని పాదాలకు వందనం చేసి "ఓ మహాబ్రాహ్మణా! ఏమి పనిమీద తమ రిక్కడికి వచ్చారు?" అని ప్రశ్నించినది. అంత పురోహితుడు ఇట్లన్నాడు: "అమ్మాయీ! శుదోదన మహారాజు కుమారుడు మిక్కిలి అభిరూపుడైనవాడు. ముప్ఫయి రెండు శుభలక్షణాలతోనూ వున్నవాడు. గొప్ప గుణాలు, తేజస్సూ కలవాడు. అతడు వధువుకు ఉండవలసిన గుణాలను వివరిస్తూ గాథలను ఒక

లేఖలో వ్రాసి యిచ్చాడు. ఈ గుణాలు ఎవతెకు ఉంటాయో ఆమెనే అతడు వివాహమాడదలచాడు'' అని. యిలా చెప్పుతూ అతడు ఆ గాథా లేఖను ఆమెకు యిచ్చాడు.

ఆమె దానిని చదువుకొని చిరునవ్వునవ్వుతూ ఆ పురోహితునితో ''ఓ మహాబ్రాహ్మణుడా! ఇందులో చెప్పబడిన అనురూపాలైన గుణాలన్నీ నాకు ఉన్నవి. సౌమ్యుడూ, చక్కని రూపం కలవాడూ అయిన రాజకుమారుడు నాకు భర్తకావడం మేలు! రాజకుమారునితో ఈ విషయంలో విలంబం చేయవద్దు అనిన్నీ, విలంబముచేస్తే హీనప్రాకృత జనులకు (నేను) చిక్కిపోవడం సంభవమనీ మనవి చెయ్యి'' అని చెప్పినది.

తర్వాత ఆ రాజపురోహితుడు శుద్ధోదన మహారాజువద్దకు పోయి ''దేవా! కుమారునికి 'అనురూపురాలైన కన్య కానవచ్చినది'' అని చెప్పినాడు. ''ఎవరి కన్యక?'' అని రాజు అడుగగా ''శాక్యవంశీయుడైన దండపాణి కుమార్తె'' అని పురోహితుడు సమాధానం ఇచ్చాడు.

అప్పుడు శుద్ధోదన మహారాజుమనస్సులో ఇలా తోచినది: ''కుమారుడిని ఒప్పించడం—చాలా కష్టం! శుభాలు అవీ పాటించేవాడుకాడు. కన్యకలకు గుణాలు అన్నీ లేకపోయినా తల్లులు గుణాలు వున్నవనే తెలియజేస్తారు. అందువల్ల గుణనిర్ణయం కష్టసాధ్యమైనది. నాకొక ఉపాయం తోస్తున్నది. నేను అశోక భాండకాలు (ఒకవిధమైన ఆభరణాలను) తయారుచేయిస్తాను. వాటిని కుమారుడే స్వయంగా నగరంలోని కన్యకలకు బహుమానం యిచ్చే ఏర్పాటు చేయిస్తాను. ఏ బాలికపైని కుమారుడి దృష్టి లగ్నం అవుతుందో కనిపెట్టి ఆ కన్యనే తెచ్చి వివాహం చేస్తాను.''

ఇలా అనుకొని, శుద్ధోదనమహారాజు బంగారంతోను, వెండితోను, రత్నాలతోను అశోక భాండకాలను తయారుచేయించి 'నేటికి ఏడవనాడు రాజకుమారుడు దర్శనం యిస్తాడు. బాలికలందరికీ అశోకభాండకాలను పంచిపెడతాడు. కనుక బాలిక లందరూ తప్పక ఆ దినం రాజభవనంలోని సంస్థాగారానికి రావలసి వున్నది'' అని నగరంలో చాటింపు వేయించాడు.



మహారాజు చాటించినట్లే నాటికి ఏడవనాడు సర్వార్థసిద్ధుడు కన్యకలను చూడడానికి తగిన ఏర్పాట్లు జరిగాయి. రాజకుమారుడు సంస్థాగారానికి వచ్చి భద్రాసనంపైని కూర్చున్నాడు. రాజకుమారుని దృష్టి ఏ కన్యకపైని పడుతుందో కనిపెట్టి తనకు తెల్పవలసిందని శుద్ధోదన మహారాజు కొందరు పురుషులను రహస్యంగా ఉంచాడు. కపిలవస్తుమహానగరంలో వున్న బాలికలందరూ ఆనాడు సంస్థాగారానికి—బోధిసత్త్వుణ్ణి దర్శించడానికీ, అతనివల్ల అశోక భాండకాలను స్వీకరించడానికీ వచ్చారు.

రాజకుమారుడు తన దర్శనానికి వస్తూవున్న బాలికలకు ఒక్కొక్కరికి అశోక భాండకాలను ఇస్తూవచ్చాడు. ఆ బాలికలు బోధిసత్త్వుని అభ్యున్నతినీ, తేజస్సునూ చూచి అక్కడ నిలువలేకపోయారు. వారు అశోకభాండకాలను పుచ్చుకొని త్వరత్వరగా వెనక్కు వెళ్ళిపోయారు.

శాక్యుడైన దండపాణి కుమార్తె గోప అనే కన్యక దాసీజనంతో కూడా బోధిసత్త్వుడు వున్న సంస్థాగారానికి వచ్చినది. వచ్చి, ఆమె తక్కిన కన్యకలతో చేరక చాటుగా వుండి రెప్పపాటులేని చూపులతో బోధిసత్త్వుణ్ణి చూస్తూ వుండినది. బాలిక లందరికీ అశోకభాండకాలను ఇచ్చివేసేవరకూ ఆమె బోధిసత్త్వునికంట పడలేదు. అశోకభాండకాలన్నీ అయిపోయిన తర్వాత ఆమె చిరునవ్వు నవ్వుతూ బోధిసత్త్వుణ్ణి సమీపించి ''రాజకుమారా! నేనేమి తప్పుచేశాను? నన్నిలా అవమానిస్తున్నావు?'' అని అన్నది, తనకు అశోకభాండకాన్ని ఇవ్వలేదనే భావంతో.

రాజకుమారుడు ''నిన్ను నేను అవమానించడంలేదు. నీవు ఆలస్యంగా వచ్చావు'' అంటూ అనేక లక్షలు విలువగల తనచేతి ఉంగరాన్ని తీసి ఆమెకు ఇచ్చాడు.

అప్పుడు ఆమె ''దీనిని మాత్రమేనా నేను మీనుంచి గ్రహించడానికి అర్హురాలను?'' అని ప్రశ్నించినది. ''ఇదొక్కటే కాదు, నా ఆభరణాలన్నింటినీనీవు తీసుకోవచ్చును'' అని రాజకుమారుడు అన్నాడు.

అప్పుడు ఆమె "రాజకుమారుణ్ణి అలంకార విహీనునిగా చెయ్యాలని నా అభిప్రాయం కాదు. ఆయనను నేను అలంకరిస్తాను" అంటూ వెళ్ళిపోయినది.

తర్వాత అక్కడ రహస్యంగా ఉంచబడిన పురుషులు శుద్ధోదన మహారాజువద్దకు పోయి "దేవా! శాక్యుడైన దండపాణి కుమార్తె గోప అనే కన్యక వున్నది. ఆమెయందే రాజకుమారుని దృష్టి లగ్నమైనది. వారిద్దరికి క్షణకాలం సంభాషణకూడా జరిగినది" అని మనవిచేశారు.

ఈ మాటలను విని శుద్ధోదన మహారాజు "మీ కుమార్తెను నా కుమారున కివ్వండి" అని దండపాణివద్దకు తన పురోహితుని మూలంగా దౌత్యం పంపాడు.

దండపాణి యిలా సమాధానం ఇచ్చాడు: "ఆర్యకుమారుడు రాజభవనంలో ఎంతో గారాబంగా పెరిగాడు. శిల్పజ్ఞానికే కన్యనిచ్చి వివాహం చెయ్యవలెననీ, శిల్పజ్ఞుడు కానివానికి ఇవ్వకూడదనీ మా కులధర్మం ఉన్నది. రాజకుమారుడు శిల్పజ్ఞుడు కాడు. ఖడ్గ ధనుర్విద్య తెలియదు. యుద్ధంలో ఎదుర్కొనే పద్ధతీ తెలియదు. శిల్పజ్ఞుడుకాని ఇతనికి నా పుత్రికను ఎట్లు ఇవ్వడం సాధ్యమో మీరే ఆలోచించండి" అని.

ఆ మాటలకు శుద్ధోదన మహారాజు ఇలా అనుకున్నాడు—"ఈ విధంగా సాటివారితో తిరస్కారం జరగడం ఇది రెండవసారి. వెనక ఒకప్పుడు శాక్యకుమారులను "మీరు నా కుమారుడివద్దకు ఎందుకు వస్తూ వుండడం లేదు?" అని అడగ్గా వారు "మీ మండకం కోసం (మీరు ఇచ్చే మండకమనే పిండివంట ఆసించి) మేము రానవసరంలేదు" అని సమాధానమిచ్చారు. ఇదీ ఆ విధంగానే జరిగింది." ఇలా అనుకుంటూ అతడు ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

బోధిసత్త్వుడు జరిగిన సమాచారాన్ని విన్నాడు. విని శుద్ధోదన మహారాజు ఉన్నచోటికి వచ్చి "తండ్రీ! మీరు విచారంతో వున్నట్లున్నారే! ఎందుచేత?" అని అడిగాడు. శుద్ధోదనుడు విచారంతో వున్నా "ఏమీ లేదు" అని జవాబిచ్చాడు.



అంత కుమారుడు "దేవా! ఏమైనా సరే! మీరు మీ విచారకారణాన్ని చెప్పవలసి వున్నది" అంటూ నొక్కి నొక్కి ముమ్మారు అడిగాడు.

శుద్ధోదన మహారాజునకు ఇక చెప్పక తప్పినది కాదు. జరిగిన సమాచారాన్ని అంతటినీ అతడు కుమారుడికి తెలియజేశాడు. దానిని విని బోధిసత్త్వుడు "తండ్రీ! మీకు విచారం వద్దు. ఈ పట్నంలో శిల్పంలో నాతోకూడా ప్రదర్శనం చెయ్యడానికి సమర్థుడైనవాడు ఎవ్వడైనా ఉన్నాడా?" అని అన్నాడు.

అప్పుడు శుద్ధోదన మహారాజు చిరునవ్వు నవ్వుతూ "కుమారా! నీవు శిల్పప్రదర్శనం చెయ్యగలవా?" అని అడిగాడు. "ఓ! బాఢం! (తప్పక) నా శిల్పసామర్థ్యాన్ని బాగా ప్రదర్శించగలను. సమస్త శిల్పశాస్త్రజ్ఞులనూ పిలిపించండి. వారి సమక్షంలోనే నా శిల్పసామర్థ్యాన్ని ప్రదర్శించగలను" అని బోధిసత్త్వుడు సమాధానమిచ్చాడు.

కుమారుడు ఆ విధంగా దృఢనిశ్చయంతో చెప్పిన మాటలను విని శుద్ధోదన మహారాజు "నేటికి ఏడవ దినమున నా కుమారుడు తన శిల్పసామర్థ్యాన్ని ప్రదర్శిస్తాడు. అప్పటికి శిల్పజ్ఞులందరూ రావాలి" అని కపిలవస్తు మహానగరంలో చాటించాడు.

నాటికి సమంగా ఏడవ దినమున ఐదువందలమంది శాక్యకుమారులు ప్రదర్శనస్థలానికి వచ్చారు. శాక్యవంశీయుడైన దండపాణి కుమార్తె గోప అనే కన్య జయపతాకగా నిర్ణయించబడింది. ఈ ప్రదర్శనంలో విలువిద్యలోనూ, ఖడ్గయుద్ధంలోనూ, యుద్ధంలోనూ, ఇతరులను ఎదిరించడంలోనూ, అసి ధనుష్కలాప యుద్ధసాలంభాలలోనూ ఎవడు విజయాన్ని పొందుతాడో అతనిదే యీమె" అని.

అందరికంటె ముందుగా దేవదత్తుడు పట్టణంనుండి బయలుదేరాడు. బోధిసత్త్వునికోసం ఒకపెద్ద తెల్లఏనుగును పట్టణంలోనికి తీసుకుని వస్తున్నారు. సర్వార్థసిద్ధునిపై గల ఈర్ష్యా, శాక్యులబలం తనకు ఉన్నదనే

గర్వమూ ప్రోత్సహించగా, మదించి, అతడు ఎడమచేతితో ఆ తెల్లయేనుగు తొండాన్ని పట్టుకుని కుడిచేతితో గట్టిగా ఒక చెంపపెట్టు పెట్టాడు. వెంటనే ఆ హస్తినాగం చచ్చిపోయింది.

అతని తర్వాత సుందరనందకుమారుడు బయలుదేరాడు. అతడు నగరద్వారంలో చచ్చి పడివున్న ఆ ఏనుగును చూశాడు. చూచి "దీనిని ఎవ్వరు చంపినారు?" అని అక్కడ వున్న జనులను అడుగగా వారు "దేవదత్తుడు" అని సమాధానం చెప్పారు. "దేవదత్తుడు చేసిన పని ఏమీ బాగులేదు" అని అంటూ, సుందరనందకుమారుడు ఆ హస్తినాగం తోక పట్టుకుని నగరద్వారంనుండి దూరంగా ఈడ్చుకుని పోయినాడు.

తర్వాత బోధిసత్త్వకుమారుడు రథారూఢుడై నగరంనుండి బయలుదేరాడు. అతడు మార్గంలో చచ్చి పడివున్న ఏనుగును చూచి "దీనిని ఎవ్వరు చంపారు?" అని అక్కడివారిని అడిగాడు. "దేవదత్తుడు నగరద్వారంలో చంపాడు" అని అక్కడున్నవారు చెప్పారు. "దేవదత్తుడు చేసినపని ఏమీ బాగులేదు" అని పలికి "దీన్ని నగరద్వారంనుండి ఇక్కడి కెవరు ఈడ్చుకు వచ్చారు?" అని బోధిసత్త్వుడు అడిగాడు. "సుందరనందకుమారుడు" అని అక్కడ వున్న జనులు అన్నారు. "సుందరనందుడు చేసిన పని చక్కగా వున్నది. కానీ, దీని శరీరం చాలా పెద్దది. పచ్చిగా ఉన్నది. కుళ్ళిపోయి ఇది యిక్కడవుంటే దీని దుర్గంధం నగరం అంతటా వ్యాపిస్తుంది" అని అంటూ రథంపై ఉంటూనే ఒకపాదాన్ని నేలమీదకు వ్రేలాడవేసి, ఆ కాలివేలితో ఆ ఏనుగు తోకను పట్టుకుని యీడ్చుకుని పోతూ సప్తప్రాకారాలూ, ఏడు అగడ్తలూ దాటి, నగర బహిఃప్రదేశంలో కోసుమారాన పడవేశాడు. **ఆ ఏనుగు** పడిన స్థలంలో ఒక పెద్దగొయ్యి ఏర్పడినది. అదే యిప్పుడు "**హస్తిగర్తం**" అని ప్రసిద్ధిపొంది వున్నది.

ఆ ప్రదర్శన స్థలంలో లక్షలకొద్దీ దేవతలూ, మనుష్యులూ హాహా కారాలూ, కిలకిల ధ్వనులూ చేస్తూ, ఉత్సాహంతో గుడ్డలను ఎగురవేయ సాగినారు. అప్పుడు గగనతలంపై వున్న దేవపుత్రులు రెండు గాథలను పలికారు. వాని అభిప్రాయం యిది:



"మదించిన గజేంద్రుని గమనం గల యీ బోధిసత్త్వుడు గజేంద్రాన్ని కాలివ్రేలితో పట్టుకొని యీడ్చుకుపోతూ, సప్తపురాలూ, ఏడు అగడ్తలూ దాటి నగర బహిఃప్రదేశంలో పడవేసినాడు. గొప్ప బుద్ధిమంతుడయిన యితడు ఒక్కడే తన ప్రజ్ఞాబలంచేతనే సంసారంలో పడి మదంతో కొవ్విన దేహం కలవారిని వెలుపలికి లాగివేయగలడు."

అయిదువందలమంది శాక్యకుమారులున్నూ నగరంనుంచి బయలు దేరి సర్వార్థసిద్ధుడూ, శాక్యకుమారులూ తమ తమ శిల్ప ప్రావీణ్యాన్ని ప్రదర్శించే స్థలానికి వచ్చారు. శుద్ధోదన మహారాజు, మహల్లకమహల్లికలూ, అసంఖ్యాకులైన జనులూ బోధిసత్త్వునియొక్క, తక్కిన శాక్యుల యొక్క శిల్ప విశేషాలను చూడవలెననే అభిలాషతో అక్కడికి వచ్చారు.

మొట్టమొదట లిపులలో సమర్థులైన శాక్యకుమారులు లిపివిషయంలో బోధిసత్త్వునితో పోటీకి సిద్ధపడ్డారు. వారు ఆచార్య విశ్వామిత్రుణ్ణి మధ్యవర్తిగా నిర్ణయించుకున్నారు. లిపిజ్ఞానంలో గాని, వ్రాతలో గాని, అనేక లిపులను నిర్మించటంలోగాని ఎవరు విశిష్టులో నిర్ణయించాలని కోరినారు. ఆచార్య విశ్వామిత్రుడు ప్రత్యక్షంగా బోధిసత్త్వుని లిపిజ్ఞానాన్ని గురించి ఎరిగివున్నవాడు కాబట్టి చిరునవ్వు నవ్వుతూ, వారితో ఇలా అన్నాడు:—

"మానవలోకంలోనూ, దేవలోకంలోనూ, గంధర్వ లోకంలోనూ, అసుర లోకంలోనూ, ఇంకా మిగిలివున్న ఇతర లోకాలలోనూ ఉన్న లిపులు అన్నింటిలోనూ, శుద్ధసత్త్వుడైన యీ బోధిసత్త్వుడు పారంగతుడై వున్నాడు. ఇతనికి తెలిసివున్న లిపుల, అక్షరాల పేర్లు కూడా మీకూ తెలియవు. నాకున్నూ తెలియవు. మనుష్యచంద్రుడైన ఇతడే వాటి నన్నింటినీ బాగుగా ఎరుగును. ఈ విషయంలో నాకు ప్రత్యక్షానుభవం వున్నది. ఇతడే తప్పక జయిస్తాడు" అని.

విశ్వామిత్రుని మాటలు విని శాక్యకుమారులు "లిపిజ్ఞానంలో రాజకుమారుడు మము మించవచ్చుగాక, సంఖ్యాగణనం చూద్దాం" అన్నారు. శాక్యగణకుడు, మహామాత్రుడూ అయిన అర్జునుడు, సంఖ్యాగణనంలో

పారంగతుడు—మధ్యవర్తిగా నిర్ణయించబడినాడు. మొదట బోధిసత్త్వుడు ప్రశ్నిస్తే, శాక్యకుమారుల్లో ఒకడు సమాధానం చెప్పడానికి సిద్ధపడ్డాడు. కాని నెగ్గలేకపోయాడు. ఈ రీతిగా ఒక్కడూ, ఇద్దరూ, ముగ్గురూ, నలుగురూ, ఐదుగురూ, పదిమందీ, ఇరవైమందీ, ముప్ఫయిమందీ, నలభైమందీ, ఏభైమందీ, నూరుగురివరకూ—చివరకు ఐదువందలమంది శాక్యకుమారులూ కూడా ఒక్కసారిగా ప్రయత్నించి కూడా నెగ్గలేకపోయారు. అప్పుడు బోధిసత్త్వుడు “మీరు అడగండి; నేను సమాధానం యిస్తాను” అని అన్నాడు. ఒక శాక్యకుమారుడు ప్రశ్నించి ఓడించలేకపోయాడు. అల్లే ఇద్దరూ, ముగ్గురూ, ఐదుగురూ, పదిమందీ, ఇరవైమందీ, ముప్ఫయిమందీ, నలభైమందీ, ఏభైమందీ, చివరకు అయిదువందలమంది శాక్యకుమారులూ జట్టుగా కూడా అతనిని ఓడించలేకపోయారు.

అప్పుడు, బోధిసత్త్వుడు “సరే పోనీండి. ఇకమీద యీ వివాదం వద్దు. మీరందరూ ఒక్కసారిగా ఉద్దేశించండి (ప్రశ్నించండి). ఒక్కమారుగా మీ అందరికీ నిక్షేపిస్తాను, (సమాధానం చెప్తాను)” అని అన్నాడు. అయిదువందల మంది శాక్యకుమారులున్నూ ఒక్కమారుగా ఒక్క గొంతుతో ప్రశ్నించారు. బోధిసత్త్వుడు వారందరికీ తగిన సమాధానం చెప్పాడు. శాక్యకుమారు లంతా ఓడిపోయారు. బోధిసత్త్వుడు గెలిచాడు.

అప్పుడు గణకమహామాత్రుడైన అర్జునుడు మిక్కిలి ఆశ్చర్యపడి యీ రెండు గాథలనూ చెప్పినాడు :

“జ్ఞానస్య శీఘ్రతా సాధు బుద్ధే సంపరిపృచ్ఛతా,
పంచమాత్ర శతాన్యేతేఽధిష్ఠితా గణనాపదే.
ఈదృశీ చ ఇయం ప్రజ్ఞా బుద్ధిర్జ్ఞానం స్మృతి ర్మతిః,
అద్యాపి శిక్షతే చాయం గణితం జ్ఞానసాగరః.”

“వేగంగా తెలుసుకునే శక్తీ, ఉత్తమమైనబుద్ధీ గణన పద్ధతిలో ప్రశ్నిస్తున్న యితడు వ్యక్తం చేశాడు. అయిదువందలమంది శాక్యకుమారులను ఇతడు అల్లే నిలబెట్టాడు. ఇట్టి గొప్ప ప్రజ్ఞాబుద్ధీ, జ్ఞానమూ, స్మృతీ, మతీ, ఎక్కడా కానరావు. జ్ఞానపారగుడైన యితడు ఇప్పటికీ ఇతరులకు గణితాన్ని బోధిస్తూనే వున్నాడు.”



శాక్యగణాలన్నీ మిక్కిలి ఆశ్చర్యపడినవి. అందరూ ఒక్క కంఠంతో “కుమారుడైన సర్వార్థసిద్ధుడు జయించాడు” అని అంటూ తమ తమ ఆసనాలనుండి లేచి, చేతులు జోడించుకుని బోధిసత్త్వునికి నమస్కారం చేస్తూ, శుద్ధోదన మహారాజుతో “ఓ మహారాజా! మీకు గొప్ప లాభాలు సులభంగా కలుగుతాయి. మీ కుమారుడు శీఘ్రంగానూ, సంగ్రహంగానూ, జవంతోనూ, వేగంగానూ, ప్రశ్నలు వేసే గొప్ప ప్రతిభాశాలి” అని అంటూ అతనిని ప్రశంసించారు.

ఆ తర్వాత శుద్ధోదనమహారాజు బోధిసత్త్వునితో “కుమారా! గణకమహామాత్రుడైన అర్జునునితో సంఖ్యాజ్ఞాన కౌశలాన్ని ప్రదర్శిస్తూ, గణనాగతి చెబుతూ పోగలవా?” అని అన్నాడు. బోధిసత్త్వుడు తాను గణనాగతిని సాగించగలనని అన్నాడు. ఆ రీతిని చర్చ సాగించాలని మహారాజు కోరాడు.

అప్పుడు గణకమహామాత్రుడైన అర్జునుడు బోధిసత్త్వునితో “రాజకుమారా! నూరుకోట్లకు పైనుండే సంఖ్యలగతిని తెలుపగలవా?” అని ప్రశ్నించాడు. “ఓ! చెప్పగలను” అని బోధిసత్త్వుడు సమాధానమియ్యగా దానిని వివరించవలెనని అర్జునుడు అడిగినాడు. బోధిసత్త్వుడు ఇట్లు చెప్పసాగెను.

“నూరుకోట్ల సంఖ్య ఆయుతమని అనబడుతుంది. నూరు ఆయుతాలు నియుతం అనబడుతుంది. నూరు నియుతా లయితే కజ్కారం అవుతుంది. నూరు కజ్కారాలు వివరం అని చెప్పబడుతుంది. నూరు వివరాలు అక్షోభ్యం. నూరు అక్షోభ్యాలు వివాహం. నూరు వివాహాలయితే ఉత్సంగం. నూరు ఉత్సంగాలు బహులం! నూరు బహులాలు నాగబలం అనబడుతుంది. నూరు నాగబలాలు తిటిలంభం. నూరు తిటిలంభాలు ఒక వ్యవస్థాన ప్రజ్ఞప్తి. నూరు వ్యవస్థాన ప్రజ్ఞప్తులు ఒక హేతుహిలం అని చెప్పబడుతుంది. నూరు హేతుహిలాలు ఒక కరఘువు. నూరు కరఘువులు

ఒక హేత్వింద్రియం. నూరు హేత్వింద్రియాలు ఒక సమాప్తలంభం. నూరు సమాప్తలంభాలు గణనాగతి అని చెప్పబడుతుంది. నూరు గణనాగతులు ఒక నిరవద్యం. నూరు నిరవద్యాలు ఒక ముద్రాబలం. నూరు ముద్రాబలాలు ఒక సర్వబలం. నూరు సర్వబలాలు ఒక విసంజ్ఞాగతి. నూరు విసంజ్ఞాగతులు ఒక సర్వసంజ్ఞ. నూరు సర్వసంజ్ఞలు ఒక విభూతంగమ అవుతుంది. నూరు విభూతంగమలు ఒక తల్లక్షణమని చెప్పబడుతుంది. ఈ విధంగా లక్ష నిక్షేపక్రియ గల తల్లక్షణ గణనవల్ల మేరు పర్వతం కూడా తగ్గిపోతుంది. దానికిపైని ధ్వజాగ్రపతి అనే సంఖ్య ఉన్నది. ఆ లెక్కలో లక్ష నిక్షేపక్రియవల్ల గంగానదిలోని యిసుక తిన్నెలు కూడా తక్కువ సంఖ్యగలవి అవుతాయి. దానికిపైని ధ్వజాగ్ర నిశామణి అనే సంఖ్య. దానికి పైని వాహనప్రజ్ఞప్తి అనే సంఖ్య. దానికి పైని ఇంగ అనే సంఖ్య ఉన్నది. దానికి పైని కురుటుఅనే సంఖ్య ఉన్నది. కురుటుకు మీద కురుటావి అనే సంఖ్య ఉన్నది. దానికి పైని సర్వనిక్షేప అనే సంఖ్య ఉన్నది. ఆ గణనలో లక్ష నిక్షేపక్రియవలన పది గంగా నదుల యిసుకతిన్నెలు తక్కువసంఖ్యలోనివి అవుతాయి. దానికిమీద అగ్రసార అనే సంఖ్య ఉన్నది. ఆ లెక్కలో శతకోటి గంగానదుల యిసుకతిన్నెలు, లక్ష నిక్షేపక్రియవల్ల పరిక్షయాన్ని పొందుతాయి. దానికిపైని పరమాణురజః ప్రవేశానుగత అనే సంఖ్య వున్నది. ఆ సంఖ్యలో తథాగతుని స్థాపించి ఈ లెక్కనంతటినీ తెలుసుకొనగలవాడు బోధిమండవరాగ్రగతుడూ, సర్వ ధర్మాభిషేకాభిముఖుడూ అయిన బోధిసత్త్వుణ్ణి విడిచి ప్రాణిలోకంలో మరి ఎవ్వడున్నూ లేడు. దానిని నేను, నావంటివాడూ, చరమభావికుడూ, వినిష్క్రాంతగృహవాసుడూ అయిన బోధిసత్త్వుడు తప్ప మరెవ్వరూ తెలుసుకోలేరు."

అప్పుడు అర్జునుడు "కుమారా! పరమాణురజఃప్రవేశగణనను తెలియడం ఎలా?" అని అడుగగా, బోధిసత్త్వుడు ఇలా చెప్పాడు.

"పరమాణురజములు ఏడైతే ఒక్క అణువు అగును. ఏడు అణువులు ఒక త్రుటి అగును. త్రుటులు ఏడైతే ఒక వాతాయన రజస్సు అగును. ఏడు వాతాయనరజస్సులు ఒక శశరజస్సు అగును. ఏడు శశరజ



స్సులు ఒక యేడకరజస్సు అగును. ఏడు ఏడకరజస్సులు ఒక గోరజస్సు అగును. ఏడు గోరజస్సులు ఒక లిక్షారజస్సు. సప్తలిక్షారజస్సులు ఒక సర్షపమగును. ఏడు సర్షపాలు ఒక యవం. ఏడు యవలు ఒక అంగుళీపర్వం. పన్నెండు అంగుళీపర్వాలు ఒక వితస్తి. రెండు వితస్తులు ఒక హస్తం. నాలుగు హస్తాలు ఒక ధనుస్సు. వేయి ధనుస్సులు ఒక మార్గం. రెండు మార్గాలు ఒక కోసు. నాలుగు కోసులు ఒక యోజనం. ఇక యోజన పిండం అనే దానిలో ఎన్ని పరమాణు రజస్సులు వున్నదీ మీలో ఎవరికైనా తెలుసునా? ఆలోచించండి."

అప్పుడు అర్జునుడు "కుమారా! నాకే ఇదంతా అగమ్యంగా ఉన్నది. సంమోహం కలిగింది. ఇక అల్పబుద్ధులైన తక్కినవారి సంగతి లెక్క ఏమిటి? యోజనపిండంలో ఎన్ని పరమాణు రజస్సులు ఉన్నదీ వివరించు కుమారా" అన్నాడు.

అప్పుడు బోధిసత్త్వుడు ఇలా వివరించాడు:—"ఒక అక్షోభ్యనయుతమూ, ముప్పైకోటీనయుత శతసహస్రములూ, అరవైవందలకోట్లూ, ముప్పయిరెండుకోట్లూ, పదిహేనులక్షలూ, పన్నెండువేలూ—వరసగా పెడితే ఎంత సంఖ్య అగునో అన్ని పరమాణురజస్సులు ఒక యోజనపిండమగును. ఈ పద్ధతిలో జంబూద్వీపం ఏడువేల యోజనాలు. గోదానీయ ద్వీపం ఎనిమిదివేల యోజనాలు. తూర్పు విదేహం తొమ్మిదివేల యోజనాలు. ఈ పద్ధతినే యీ నాల్గుద్వీపాల లోకధాతువునూ ప్రధానంగా చేసిన, పరిపూర్ణంగా నూరుకోట్లు, నాల్గుద్వీపాల లోకధాతువులకూ అవుతుంది. మహాసముద్రాలు నూరుకోట్లు, చక్రవాడ, మహాచక్రవాడాలకు నూరుకోట్లు, పర్వతరాజమైన సుమేరువునకు నూరుకోట్లు, చాతుర్మహారాజకులయిన దేవతలకు నూరుకోట్లు, త్రాయత్రింశులగు దేవతలకు నూరుకోట్లు. యాములనే దేవతలకు నూరుకోట్లు. తుషితులకు నూరుకోట్లు. నిర్మాణరతులకు నూరు కోట్లు. పరనిర్మితవశవర్తులకు నూరుకోట్లు, బ్రహ్మకాయికులైన దేవపుత్రులకు నూరుకోట్లు. బ్రహ్మపురోహితులకు నూరుకోట్లు. బ్రహ్మపార్షద్యులకు నూరు కోట్లు. మహాబ్రాహ్మణులకు నూరుకోట్లు, పరీత్తాభులకు నూరుకోట్లు. అప్రమాణాభులకు నూరుకోట్లు. ఆభా

స్వరులకు నూరుకోట్లు. పరీత్తశుభులకు నూరుకోట్లు. అప్రమాణశుభులకు నూరుకోట్లు. శుభకృత్స్నలకు నూరుకోట్లు. అనభ్రకులకు నూరుకోట్లు. పుణ్యప్రసువులకు నూరుకోట్లు. బృహత్ఫలులకు నూరుకోట్లు. అసంజ్ఞిసత్త్వులకు నూరుకోట్లు. అవృహులకు నూరుకోట్లు. అతపులకు నూరుకోట్లు. సుదృశులకు నూరుకోట్లు. సుదర్శనులకు నూరుకోట్లు. అకనిష్ఠులైన దేవతలకు నూరుకోట్లు. త్రిసాహస్ర మహాసాహస్రమైన లోకధాతువు విపులమైనదీ, విస్తీర్ణమైనదిన్నీ. త్రిసాహస్ర మహాసాహస్రమైన లోకధాతువులో ఎన్ని వందల యోజనా లున్నవో, ఎన్ని వేల యోజనాలున్నవో, ఎన్ని కోట్ల యోజనాలున్నవో, ఎన్ని నయుతాల యోజనాలున్నవో, పేయాలంవరకూ ఎన్ని యోజనాలున్నవో, వాటిలో వుండే పరమాణు రజస్సు లెన్ని వుంటాయో వూహించండి. వీటి సంఖ్యాగణన మిక్కిలి అధికమై వున్నందున అసంఖ్యేయమని చెప్పబడుతూ ఉన్నది. అందువల్లనే త్రిసాహస్ర మహాసాహస్రమైన లోకధాతువులో వుండే పరమాణు రజములు అసంఖ్యేయా లవుతున్నవి.”

బోధిసత్త్వుడు యీ విధంగా లెక్క చెప్పుతూ వుండగా గణకమహామాత్రుడైన అర్జునుడూ, అక్కడవున్న సమస్త శాక్యులూ మిక్కిలి సంతోషించి, ఎంతో ఆశ్చర్యాన్ని పొందినారు. వారందరూ ఏకవస్త్రంతోనే వుండి — కట్టుగుడ్డ మినహాగా మిగిలిన వస్త్రాలతోనూ, ఆభరణాలతోనూ బోధిసత్త్వుణ్ణి ముంచివేశారు.

అప్పుడు మహామాత్రుడైన అర్జునుడు ఈ గాథలను పలికినాడు:

“కోటీశతం చ ఆయుతా నయుతా స్తథైవ
నియుతాను కంకరగతీ తథ బింబరాశ్చ,
అక్షోభిణీ పరమజ్ఞాను న మేఽస్త్యతోఽర్థం
మత ఉత్తరే గణన మప్రతిమస్య జ్ఞానం.”

“నూరుకోట్లు, ఆయుతం, నయుతం, నియుతం, కంకరం, బింబరం, అక్షోభిణి — ఈ సంఖ్యలలో నన్ను మించినవాడు లేడు. కాని, నాకంటే మంచి జ్ఞానం కలవాడు ఈ రాజకుమారుడు.



“శాక్యులారా అంతేకాకుండా—

“త్రిసాహస్రి రజాశ్రయంతికా
తృణవన ఓషధియో జలస్య బిందూన్,
హుంకారేణ న్యసేయ ఏకనైషో
కో పుని విస్మయు పంచబిశ్నతేభిః”

“ఈ త్రిసాహస్ర లోకధాతువులోని పరమాణు రజములను, వనంలోని తృణాన్ని, ఓషధులను, నీటిబిందువులను ఒక్క హుంకారంతోనే ఇతడు లెక్కిస్తాడు. ఐదువందలమంది శాక్యకుమారులూ ఆశ్చర్యపడడం లెక్కా?” అని ప్రశంసించాడు.

అప్పుడు అక్కడ చేరిన దేవతలు, మనుష్యులు హాహా ధ్వనులు, కిలకిలారావాలు చేశారు. గగనతలంపై వున్న దేవపుత్రులు గాథలు పలికారు. వాని భావమిది: “ఈ మూడు లోకాలలో ఎన్ని ప్రాణులు ఉన్నాయో వాటిచిత్తాలు వితర్కంకలిగి. సంక్షేపనిక్షేపాలతో హీనంగా ఉన్నాయి. ఆలాంటి చిత్తాలుగల ప్రజలకు చిత్తపరివర్తం కలిగించేవాడు ఇతడొక్కడే.”

భిక్షులారా, ఈ విధంగా శాక్యకుమారులందరూ పరాభూతులైనారు. బోధిసత్త్వుడే జయించాడు. తర్వాత దాటడంలోనూ, ఎగరడంలోనూ, పరుగెత్తడంలోనూ — (లంఘితప్లావితజవితాలలో) అన్నింటిలోనూ అతడే గెలిచాడు. గగనతలంపైనుండి వీనిని చూస్తూవున్న దేవపుత్రులు గాథలతో ఇలా స్తుతించారు:—

“కల్పకోటి సంవత్సరాలు జరిపిన వ్రతాలూ, తపస్సులూ, సంయమమూ, క్షమా, దమమూ, మైత్రీ మున్నగువాని బలంవల్ల ఈ నాయకుని శరీరమూ, చిత్తమూ చాలా తేలికగా అయినవి. ఇతని వేగంవిశిష్టతను వినండి. కేవలం ఇంటిలోనే కూర్చుండిన రాజకుమారుని సత్త్వసారాన్ని గమనించండి. ఇతడు క్షణంలో పదిదిక్కులకూ వెళ్ళుతున్నాడు. లోకధాతువుల్లో విచిత్రములైన మణులతోనూ, కనకంతోనూ అపరిమితులైన జినులకు ఇతడు పూజలు చేస్తూ వుంటాడు. ఈ రాజకుమారుని గమనాగను

నాలను మీరు గుర్తించలేరు. ఇతడు ఆ విషయాలలో చాల అభివృద్ధి పొందాడు. ఇతని వేగం చూచి ఎవరికి విస్మయం కలుగదు? ఇతడు అసదృశుడు. మీరు ఇతనియందు గౌరవభావం ఉంచండి.''

లిపులలో, గణనాగతిలో గెలుపొందడం చూచి శాక్యకుమారులు అన్నారు గదా – ''మల్లయుద్ధం మొదలయిన వాటిలో రాజకుమారుడు శక్తిసామర్థ్యాలు చూపి గెలిస్తే మేము ఓడినట్లే'' అని. అక్కడ బోధిసత్త్వుడు ఒకచోట ఒంటరిగా వుండిపోయాడు. తక్కిన ఐదువందల మంది శాక్య కుమారులూ ఒక్కటి అయి యుద్ధానికి సిద్ధపడ్డారు.

మొట్టమొదట ముప్ఫయి ఇద్దరు శాక్యకుమారులు బోధిసత్త్వునితో మల్లయుద్ధానికి సిద్ధపడ్డారు. నందుడూ, ఆనందుడూ బోధిసత్త్వునితో సాలంభానికి (మల్లయుద్ధానికి) తలపడ్డారు. కాని రాజకుమారుణ్ణి తాకిన మరుక్షణంలోనే అతని తేజస్సునూ, బలాన్నీ సహించలేనివారై భూమిమీద పడిపోయారు. తర్వాత దేవదత్తుడు బలవంతుడు కావడంవల్ల దురభిమానంతోనూ, గర్వంతోనూ, శాక్యకుమారులలో సమరుడననే భావంతోనూ బోధిసత్త్వునితో తలపడ్డానికి సిద్ధపడి రంగమండలానికి (స్థలానికి) ప్రదక్షిణం చేసి వచ్చి, అతనిని ఎదిరించాడు. బోధిసత్త్వుడు ఎట్టి తొందరపాటూ, ప్రయత్నమూ లేకుండానే తన కుడిచేతితో ఎదిరించి వస్తున్న దేవదత్తుణ్ణి సవిలాసంగా పట్టుకొని ముమ్మారు గగన తలంలో గిర్రున త్రిప్పి అతని గర్వాన్ని అణచివేసి హింసించకూడదనే అభిప్రాయంతోనూ, స్నేహ బుద్ధితోనూ మెల్లగా భూమిపైని పడవేశాడు. అతని శరీరానికి ఎట్టి గాయాన్నీ కలిగించలేదు.

అప్పుడు బోధిసత్త్వుడు ''దీని సంగతి విడవండి. వాదం ఎందుకు? మీరందరూ కలిసి ఒక్కసారిగా నా మీదికి వచ్చినా రావచ్చును'' అని అన్నాడు.

ఈ మాటకు శాక్యకుమారు లందరూ చాలా సంతోషించారు. అందరూ కలిసి పైనిపడితే బోధిసత్త్వుణ్ణి ఓడించవచ్చునని వారి నమ్మకం. వా రందరూ ఒక్కసారిగా అతనిపైని పడ్డారు. కాని అతని తేజస్సునూ,



శరీర బలాన్నీ, సిరతనూ సహించలేక పోయారు. తన్ను తాకీతాకగానే బోధిసత్త్వుడు వారిని నేలపై పడగొట్టాడు. అక్కడ లక్షలకొద్దీ వున్న దేవతలూ, మనుష్యులూ హాహాకారాలు చేస్తూ కిలకిలమంటూ గట్టిగా ధ్వనులు చేశారు. గగనతలంపైని వున్న దేవపుత్రులు పెద్ద పూలవానను కురిపించి గాథలను పలికారు. వాటి తాత్పర్య మిది:

''పది దిక్కులలోనూ నయుత సంఖ్యలో వున్న మల్లులు అందరున్నూ పురుష శ్రేష్ఠుడైన బోధిసత్త్వుణ్ణి స్పృశించినంతమాత్రాననే క్షణంలో నగ్నసమూలై (పసిపిల్లలవంటివారై) భూమిపై పడిపోయారు. పదిదిక్కుల లోనూ వుండే మేరువు, సుమేరువు, వజ్రకం, చక్రవాడం మొదలైన పర్వతాలను ఇతడు చేతులతో గ్రహించి పిండిపిండిగా చెయ్యగలడు. అసారమైన యీ సంసారంలో ఇది ఒక ఆశ్చర్యం కాదు. దుష్టుడూ, మల్లులలో గొప్పవాడూ, సైన్య సమేతుడూ, హయ పదాతులతో కూడినవాడూ, కృష్ణుని బంధువూ అయిన మారుణ్ణి మైత్రీబలంచేతనే సంహరించి లోకోత్తరమైన సమ్యక్సంబోధిని అందుకోగలడు.''

తర్వాత దండపాణి శాక్యకుమారులతో ఇలా అన్నాడు—''ఇంతవరకూ తెలుసుకున్నాం గదా! ఇక బాణ ప్రయోగంలో పోటీని చూడవలసివున్నది'' అని.

అప్పుడు ఆనందుడు రెండు క్రోసులదూరంలో ఒక ఇనుపభేరీని లక్ష్యంగా ఉంచినాడు. దేవదత్తుడు అంతకంటె అధికంగా నాలుగు క్రోసుల దూరంలో ఒక ఇనుప భేరీని లక్ష్యంగా నిలిపాడు. సుందరనందుడు ఆరుక్రోసుల దూరంలో ఇనుపభేరీని లక్ష్యంగా ఉంచాడు. దండపాణి రెండు యోజనాల దూరంలో ఒగ ఇనుపభేరీని లక్ష్యంగా నిలిపాడు. బోధిసత్త్వుడు పదిక్రోసుల దూరంలో లక్ష్యంగా ఒక ఇనుపభేరీని వుంచాడు. అంతే కాకుండా దానికి మీద సప్తతాళాలనూ, వానికి మీద ఇనుముతోచేసిన వరాహ ప్రతిమనూ స్థాపించాడు. ఆ ప్రతిమ యంత్రయుక్తమైనది.

ఆనందుడు రెండు క్రోసుల దూరంలో వుంచిన తన లక్ష్యాన్ని మాత్రం కొట్టగలిగాడు. అంతకుమించి అతని బాణం ముందుకు పోలేదు. దేవదత్తుడు నాలుగు క్రోసుల దూరాన వుంచిన లక్ష్యాన్ని మాత్రం కొట్టగలిగాడు. అతని బాణం అంతకుమించి ముందుకు సాగలేదు. సుందరనందుడు ఆరు క్రోసుల దూరాన్ని నిల్పిన తన లక్ష్యమైన యినుపభేరీనే కొట్టగలిగాడు. దాన్నిదాటి అతని బాణం ముందుకు జరుగలేదు. దండపాణి రెండు యోజనాల దూరంలో వున్న భేరీనిమాత్రం కొట్టగలిగాడు. అంతకు మించి అతని బాణం ముందుకు పోలేదు.

బోధిసత్త్వుడు బాణాన్ని వింటిపైనుంచి కొట్టడానికి విల్లు వంచినంతమాత్రాన అది విరిగిపోయింది. అప్పుడు అతడు తండ్రిని “నాయనగారూ! నా శరీరబలాన్ని సహించి నేను వంచితే విరిగిపోకుండా నిలిచే ధనుస్సు యీ నగరంలో వున్నదా?” అని ప్రశ్నించాడు. “లేకేమి కుమారా! మీ తాతగారైన సింహహనువువిల్లు ఉన్నది. అది దేవకులంలో (దేవ పూజామందిరంలో) గంధమాల్యాదులచే పూజింపబడుతూ వున్నది. దాన్ని ఎక్కుపెట్టడానికిగాని, దానిలో బాణాన్ని సంధించడానికిగాని ఎవ్వరికీ సాధ్యంకాదు”' అని శుద్ధోదనమహారాజు సమాధానం యిచ్చాడు.

ఆ వింటిని వెంటనే తెప్పించవలెనని రాజకుమారుడు కోరగా, మహారాజు దాన్ని తెప్పించాడు. దాన్ని రాజకుమారుడు శ్రమ లేకుండానే వంచాడు. ‘మేము మాత్రం దీన్ని వంచలేమా?” అనే అహంకారంతో తక్కిన శాక్యకుమారులూ ఎంతో ప్రయత్నించారు. కాని ఎవ్వరూ వంచలేకపోయారు. దండపాణి దాన్ని అతికష్టంమీద వంచగలిగాడు గాని, నారిని సంధించలేక పోయాడు. బోధిసత్త్వుడు దాన్ని సులభంగా వంచి, తాను కూర్చున్న ఆసనంమీదనుంచి లేవకుండానే సగం వంగి ఎడమచేతితో వింటిని పట్టుకొని కుడిచేతి ఒక్క వ్రేలికొనతోనే వారిని సంధించాడు. ఆ రీతిని నారిని ఎక్కుపెట్టి ఒక్కసారి టంకారం చేశాడు. ఆ ధ్వని కపిలవస్తు మహానగరం అంతటినీ చలింపజేసింది. నగరంలో సమస్తజనులు విహ్వలులై చలించిపోయి “ఈ ధ్వని ఎక్కడినుంచి వచ్చింది?”



అని ఒకరి నొకరు ప్రశ్నించుకొనసాగారు. విషయం తెలిసిన కొందరు రాజకుమారుడు సర్వార్థసిద్ధుడు తన తాతగారి వింటిని ఎక్కుపెట్టాడనీ, ఇది దాని ధ్వని అనీ తెలిపారు. అప్పుడు అక్కడ లక్షలకొద్దీ వున్న దేవతలూ, మనుష్యులూ హాహాకారాలూ, కిలకిల ధ్వనులూ చేస్తూ ఆనందాన్ని వెలిబుచ్చారు. గగనతలంపై వున్న దేవపుత్రులు శుద్ధోదనమహారాజును గురించీ, అక్కడ ఉన్న జనంగురించీ ఒక గాథను పలికారు. దాని తాత్పర్యమిది:

“ఈ వింటిని ఎత్తడానికి గాని, ఎక్కుపెట్టడానికి గాని ఎవ్వరికీ సాధ్యం కాదు. అట్టి దీన్ని మునియైన బోధిసత్త్వుడు ఎక్కుపెట్టాడు. సందేహం లేదు. బోధిసత్త్వుడు మారుని సైన్యాన్ని ఎదుర్కొని సులువుగా భేదించి విజయం పొందగలడు. ఇది మా సంపూర్ణమైన అభిప్రాయం.”

భిక్షులారా! తర్వాత బోధిసత్త్వుడు ఆ ధనుస్సును ఎక్కుపెట్టి బాణాన్ని సంధించి, తన బలాన్ని ఉపయోగించి బాణాన్ని విడిచిపెట్టాడు. అది, ఆనందుడు లక్ష్యంగా ఉంచిన భేరీని, రేవదత్తుని భేరీని, సుందరనందుని భేరీని, దండపాణి భేరీని బ్రద్దలుకొట్టి, పది క్రోసులదూరంలో వుంచబడిన తన భేరీనీ, సప్తతాళాలనూ, యంత్రయుక్తమైన వరాహ ప్రతిమనూ భేదించుకొని భూమిలోనికి చొచ్చుకుని పోయినది. అది మరి కానరాలేదు. ఆ బాణం భూమిలోనికి చొచ్చుకొనిపోయిన చోట ఒక నుయ్యి ఏర్పడింది. అది యిప్పటికినీ శరకూపం అనే పేరుతో ప్రసిద్ధమై ఉన్నది. అప్పుడు అక్కడ లక్షలకొద్దీ వున్న దేరతలూ, మనుష్యులూ, హాహాకారాలూ, కిలకిలధ్వనులూ చేస్తూ, సంతోషంతో చప్పట్లు చరిచారు. శాక్యగణమంతా ఎంతో ఆశ్చర్యపడింది. “ఎంత ఆశ్చర్యం! ఇతడేనా ఇటువంటి శిల్పకౌశలాన్ని చూపి, ఇట్టి అద్భుతకార్యం చేశాడు?” అని వారు భావించారు.

అప్పుడు గగనతలంలో వున్న దేవపుత్రులు శుద్ధోదనమహారాజునూ, ఆ గొప్ప జన సమూహాన్నీ చూచి ఒక గాథ పలికారు. దాని తాత్పర్యమిది:

"ఇందులో ఆశ్చర్య మేమీ లేదు. ఎందుచేతనంటే—ఇతడు భూమండలంలో పూర్వ బుద్ధాసనస్థుడై సమత అనే ధనుస్సును తీసుకుని శూన్య నైరాత్మ్యబాణాలతో క్లేశాలనే శత్రువులను కొట్టి దృష్టిఅనే జాలాన్ని భేదించుకొని శుభమూ, విరజమూ, అశోకమూ అయిన సమ్యక్సంబోధిని పొందగలడు."

దేవపుత్రులు ఈ విధంగా పలికి బోధిసత్త్వునిపై దివ్యపుష్పాలను కురిపించారు. ఈ విధంగా దాటుటలోనూ, ప్రాచీన లిపిలోనూ, గణనలోనూ, సంఖ్యలోనూ, మల్లయుద్ధంలోనూ, విలువిద్యలోనూ, పరుగులోనూ, ఎగరడంలోనూ, దాటడంలోనూ, ఈదడంలోనూ, అస్త్రవిద్యలోనూ, గజారోహణంలోనూ, గుర్రపుస్వారీలోనూ, రథారోహణంలోనూ, ధనుష్కలాపంలోనూ, స్థైర్యంలోనూ, శౌర్యంలోనూ, భుజపరాక్రమంలోనూ, అంకుశ విద్యలోనూ, పాశగ్రహణంలోనూ, ఎక్కుటలోనూ, దిగుటలోనూ, ఎదురు నడకలోనూ, పిడికిటి పోటులోనూ, మండిపట్టులోనూ, శిఖాబంధంలోనూ, నరుకుటలోనూ, పగులగొట్టుటలోనూ, చీల్చడంలోనూ, బద్దలుకొట్టడంలోనూ, స్ఫాలనంలోనూ, లక్ష్యవేధి, మర్మవేధి, శబ్దవేధి విద్యలలోనూ, దృఢ ప్రహారంలోనూ, జూదమాడుటలోనూ, కావ్యకరణంలోనూ (కవిత్వంలోనూ), గ్రంథరచనలోనూ, చిత్ర రచనలోనూ, రూప నిర్మాణంలోనూ, రూపకర్మలోనూ, ద్రుతంలోనూ, విసరడంలోనూ,అగ్ని కర్మలోనూ, వీణావాదనంలోనూ, వాద్యంలోనూ, గీతంలోనూ, నృత్యంలోనూ, పఠనంలోనూ, ఆఖ్యానంలోనూ, హాస్యంలోనూ, లాస్యంలోనూ, నాట్యంలోనూ, అనుకరణంలోనూ, మాలికలు గుచ్చడంలోనూ, సంవాహన క్రియలోనూ, మణులకూ, వస్త్రాలకూ రంగులు వెయ్యడంలోనూ, మాయాకృత్యంలోనూ, స్వప్నాల విషయంలోనూ, శకునాల విషయంలోనూ, స్త్రీ లక్షణాలలోనూ, పురుష లక్షణాలలోనూ, అశ్వలక్షణంలోనూ, గజలక్షణంలోనూ, గోలక్షణంలోనూ, అజలక్షణంలోనూ, మిశ్రలక్షణంలోనూ, కౌటుభేశ్వర (కోడి) లక్షణంలోనూ, నిర్ఘంటువు (నిఘంటువు లోనూ), నిగమంలోనూ, పురాణంలోనూ, ఇతిహాసంలోనూ, వేదంలోనూ, వ్యాకరణంలోనూ,



నిరుక్తంలోనూ, శిక్షలోనూ, ఛందస్సులోనూ, కల్పంలోనూ, జ్యోతిషంలోనూ సాంఖ్యంలోనూ, యోగంలోనూ, క్రియాకల్పంలోరూ, వైశిక విద్యలోనూ, వైశేషికంలోనూ, అర్థ విద్యలోనూ బార్హస్పత్యంలోనూ, ఆంభీర్య విద్యలోనూ, అసుర విద్యలోనూ, మృగపక్షుల ధ్వనులలోనూ, అలంకరణ విద్యలోనూ, జలయంత్రంలోనూ, మైనపు పనిలోనూ, కుట్టుపనిలోనూ, బిదల కర్మ (వెదురుపని) లోనూ, ఆకులు కొయ్యడంలోనూ, గంధం తియ్యడంలోనూ - ఇలాంటి లౌకికాలైన కర్మకళలలో దివ్యమానుష్యకార్యాలన్నింటిలోనూ బోధిసత్త్వుడే విజయాన్ని పొందాడు.

అపుడు శాక్యుడైన దండపాణి తన కుమార్తె అయిన గోపను బోధిసత్త్వుడికి ఇచ్చాడు. శుద్ధోదనమహారాజు ఆ కన్యను తన కుమారునికి శాస్త్ర ప్రకారం వివాహం చేశాడు. వివాహితుడైన బోధిసత్త్వుడు, ఎనభైనాలుగు వేల స్త్రీలమధ్య, వారివల్ల సేవలను పొందుతూ సుఖంగా కాలం గడప సాగాడు. ఆ ఎనభైనాలుగువేలమంది యువతులకూ శాక్యకన్య అయిన గోపయే అగ్రమహిషిగా ఉండినది.

శాక్యకన్య అయిన గోప అత్తమామలు కంట పడినా, అంతఃపురంలోని ఎవ్వరయినా కంటపడినా, మేలిముసుగు వేసుకోదు. ఆ సంగతిని అక్కడివారు అనుకొనేవారు. కొంత విమర్శించేవారు. "కొత్తగా వచ్చిన కోడలు కొంత సిగ్గుతోనూ, సంకోచంతోనూ మరుగున ఉంటుంది. ఈమె ఆ రీతిని కాకుండా మేలిముసుగు లేకుండానే కంటబడుతుంది" అని గుసగుసలు పోయేవారు. ఈ విషయాన్ని ఆమె ఆనోటా ఆనోటా విని అంతఃపురంలో ఉన్నవారి యెదుటకువచ్చి కొన్ని గాథలను పలికినది. వాటి అభిప్రాయం యిది:

"ఆర్యుడు ఆసన స్థాన చంక్రమాలలో ఎట్టి ఆచ్ఛాదనా లేక బహిరంగంగా ఉన్నప్పుడే శోభిస్తాడు. ధ్వజంచివరి మణి బయిటికి కానవస్తున్నప్పుడే మిక్కిలి ప్రకాశిస్తుంది. ఆర్యుడైనవాడు నడుస్తూవున్నా, నడవకుండా వున్నా, నిలిచివున్నా, కూర్చునివున్నా-అన్ని అవస్థలయందూ శోభిస్తాడు. ఆర్యుడు మాటలాడుతున్నా శోభిస్తాడు. లేదా మూకీభావం వహించివున్నా శోభిస్తాడు. కలవింకం (పిచ్చుక) రూపంచేతనూ, స్వరం

చేతనూ కూడా శోభిస్తూ ఉంటుంది. గుణ భూషితుడై ఉండే గుణవంతుడు కుశలూ (గడ్డిచీరలూ), నారచీరలూ ధరించినా, దిగంబరుడై వున్నా, చిన్న గుడ్డ కట్టుకొని వున్నా, శరీరం చాలా కృశించి వున్నా సరే, అతడు తన తేజస్సు చేతనే మిక్కిలి ప్రకాశిస్తాడు. పాపం లేకున్నప్పుడు ఆర్యుడు అన్ని విధాలా శోభిస్తాడు. ఎంత అలంకరించుకొని వున్న చిన్నవాడైనా పాపాలు చేసినట్టయితే ప్రకాశించడు. "మధురమైన మాటలూ, హృదయంలో చెడ్డ తలపులూ ఉన్నవారు పైకి అమృతం తడిపిన విషకుంభాలవంటివారు. స్పృశించుటకున్నూ సాధ్యంకాని కఠినములైన శైల శిలల వంటి కఠిన హృదయులు. అట్టివారి దర్శనం సర్పదర్శనంలా అందరికీ విరసమైనదే! ఆర్యులైనవారు అందరియెడలను నమ్రత కలిగి ఉంటారు. అందరియెడలను సౌమ్యంగా ఉంటారు. అందరికీ పవిత్రస్థలం వంటివారు. సమస్త జగత్తులకూ ఉపజీవ్యులు. ఎల్లప్పుడూ దధిక్షీరాలతో నిండిన ఘటాలవంటివారు. అట్టివారి దర్శనం పరిశుద్ధమైనది. సుమంగళమైనది. ఆర్యులు దీర్ఘ రాత్రి వంటి పాపులయిన మిత్రులను విడిచి, కల్యాణమిత్ర రత్నాలనే పరిగ్రహిస్తూ వుంటారు. పాపాన్ని విడిచిపెట్టి బుద్ధధర్మంలోనే మనస్సును ఉంచుతారు. అట్టివారి దర్శనం సుమంగళమైనదీ, సఫలమైనదిన్నీ. "శరీరమును మాత్రం కప్పుకొని వుండేవారు శరీర దోషాలను బహిరంగపరచక కప్పుకొని వుండేవారు! వాక్సంయమం కలిగి ఎల్లప్పుడూ రంజించే మాటలాడుతూ ఇంద్రియాలను గుప్తంగా ఉంచుకుని, వినయ విధేయతలు కలిగి, ప్రసన్నమైన మనస్సుతో ఉన్నవారికి ముఖం కప్పుకొనవలసిన అవసరం లేదు. వెయ్యి వస్త్రాలు శరీరాన్ని కప్పినా, మనస్సు గుప్తంగా లేక వివృతంగానే ఉంటూ, సిగ్గూ బిడియమూ లేనివారు. ఇట్టి గుణాలూ, సత్యవాక్యమూ అనేవే లేనట్టివారు నగ్నమైన ఈ లోకంలో నగ్నంగానే సంచరిస్తారు. ఎల్లప్పుడూ ఇంద్రియాలను అరికట్టి, గుప్తమైన చిత్తం కలిగి, తన భర్తతోనే తృప్తి పొందుతూ, ఇతర వ్యక్తులపై మనస్సు లేనివారు సూర్య చంద్రులతో సమానమైన వారు. వెల్లడిగా వున్న కాంతి కలవారు. అలాటివారు ముఖాన్ని ఆచ్ఛాదించుకొనవలసిన పనిలేదు. ఇంతేకాకుండా— నా ఆశయాన్ని మహాత్ములైన ఋషులు తెలిసికొనగలరు. ఇతరుల మనస్సులను తెలిసికొనే బుద్ధికుశలులూ, దేవతలూ గ్రహించగలరు. నా శీలమూ



గుణసంపదా ప్రమాదరహితాలని తెలుసుకొనగలరు. నేను ముఖానికి మేలిముసుగు ఎందుకు వేసుకోవాలో తెలియదు."

భిక్షులారా! రాజైన శుద్ధోదనుడు శాక్యకన్య అయిన గోప చెప్పిన యీ గాథలను విని, ఆమె ప్రతిభకు మిక్కిలి సంతోషించాడు; సంతృప్తి పొంది సౌమనస్యంతో అనేక రత్నాలు పొదిగిన వస్త్రద్వయాన్ని, కోట్లకొద్దీ విలువగల ముత్యాలహారాన్ని, మేలురకం ఎర్రముత్యాలు పొదిగిన సువర్ణమాలనూ ఆమెకు బహుమానంగా ఇచ్చి ఇలా అన్నాడు:

యథాచ పుత్రో మను భూషితో గుణైః
తథా చ కన్యా స్వగుణా ప్రభాసతే,
విశుద్ధ సత్త్వౌ తదుభౌ సమాగతౌ
సమేతి సర్పి ర్యథ సర్పిమండే."

"నా కుమారుడు ఉత్తమ గుణాలతో అలంకరించబడి ఉన్నట్లు ఈ కన్యకూడా ఉత్తమ గుణాలతో ప్రకాశిస్తూ వున్నది. నేతి తేటలో నెయ్యి కలిసి పోయినట్లు వీరిద్దరూ విశుద్ధసత్త్వం గలవారు ఒక్కటిగా చేరినారు."

ఇది లలితవిస్తరంలో శిల్పసందర్శన పరివర్తనమనే పన్నెండవ అధ్యాయం.

# 13. సంచోదనా పరివర్తం

భిక్షులారా, అంతఃపురంలో వున్న బోధిసత్త్వుణ్ణి పూజించడానికి ఔత్సుక్యంతో హర్షధ్వనులు చేసుకుంటూ దేవతలతో కూడా నాగులూ, యక్షులూ, గంధర్వులూ, అసురులూ, గరుడులూ, కిన్నరులూ మహోరగులూ, ఇంద్రుడూ బ్రహ్మ, లోకపాలురూ వస్తూవుండేవారు.

ఒక సమయంలో గుంపుగా అక్కడ కూడిన దేవ, నాగ, యక్ష, గంధర్వ, అసుర, గరుడ, కిన్నర, మహోరగులకున్నూ, ఇంద్ర, బ్రహ్మ లోకపాలకులకున్నూ మనస్సులో ఇలా తోచినది. "అయ్యో! సత్పురుషుడైన యీ బోధిసత్త్వుడు చాలకాలంగా అంతఃపురంలోనే వుంటూ ఆలస్యం చేస్తూ ఉన్నాడు. ఆలసించకపోతే చాలాకాలం యితనితో ఉండే ప్రాణులు దానమూ, ప్రియవాక్యమూ, అర్థక్రియా, సమానార్థతా అనే నాలుగు సంగ్రహవస్తువులతో పరిపాకం పొంది, బోధిసత్త్వుని ధర్మోపదేశాన్ని తెలుసుకొంటారు. తెలుసుకొని అంతర్హితులవుతారు. తర్వాత బోధిసత్త్వుడున్నూ గృహంనుండి అభినిష్క్రమణంచేసి లోకోత్తరమైన సమ్యక్సంబోధిని లోకానికి ఉపదేశిస్తాడు" అని.

తర్వాత వారు ప్రతీక్షిస్తూ, గౌరవంగా చేతులు జోడించుకొని బోధిసత్త్వునికి నమస్కరించారు. ఇట్టి అభిప్రాయంతోనే ఆయనవైపే చూస్తూ ఆలాగే నిలిచి వుండినారు. ఉత్తమోత్తముడూ, శుద్ధసత్త్వుడూ అయిన బోధిసత్త్వుడు గృహంనుండి అభినిష్క్రమణం చెయ్యడం ఎప్పుడు చూస్తామా? ఈయన అభినిష్క్రమించి ఆ వృక్షరాజమూలంలో కూర్చుండి సైన్యంతోకూడా వున్న మారుణ్ణి హింసించి లోకోత్తరమైన సమ్యక్సంబోధిని ఎప్పుడు బోధిస్తాడా? పది తథాగతబలాలతోనూ, నాలుగు తథాగత వైశారద్యాలతోనూ, పదెనిమిది అవేణిక బుద్ధధర్మాలతోనూ కూడి మూడు భ్రమణాలూ, పన్నెండు ఆకులూ, కల లోకోత్తరమైన ధర్మ



చక్రాన్ని ఎప్పుడు ప్రవర్తింప చేస్తాడా? గొప్పదైన బుద్ధవిక్రీడితంతో ఆధిని పోగొట్టే సుభాషితంవల్ల దేవ మనుష్యాసుర లోకాలకు ఎప్పుడు సంతోషం కలిగిస్తాడా?—అని వారు ఎదురుచూస్తూ ఉండినారు.

బోధిసత్త్వుడు చాలకాలం లెక్కలేని కల్పాలు దీర్ఘరాత్రులు ఇతరులకు విధేయుడు కాకుండానే వుండినాడు. లోకోత్తరములైన లౌకిక ధర్మాల విషయంలో అతడే ఆచార్యుడై చాలకాలం సమస్త కుశలాలకూ మూలమైన ధర్మచర్యలలో కాలాన్నీ, సమయాన్నీ, వేళనూ తెలుసుకొని చ్యుతి లేనివాడూ, లభిజ్ఞుడూ అయి పంచాభిజ్ఞులు పొందినాడు. బుద్ధి పాదవిక్రీడితుడై సమస్తములైన ఇంద్రియములందును కుశలుడై, కాలాకాలములను గుర్తెరిగి కాలంచూస్తూ సముద్రంవలెనే వేలను (హద్దును, కాలాన్ని) మీరక వుండినాడు. అతడు అభిజ్ఞజ్ఞానబలంతో సమస్తమూ స్వయంగానే తెలుసుకొనేవాడు. నిగ్రహానికి ఇది సమయం. ప్రగ్రహానికి ఇది సమయం. సంగ్రహానికి, అనుగ్రహానికి, ఉపేక్షకు, సంభాషించడానికి, మౌనంగా ఉండడానికి, ఇల్లు విడిచి రావడానికి ఇది సమయం. సన్యసించడానికి, స్వాధ్యాయానికి, యోనిశోమనస్కారానికి, గొప్ప వివేకానికి ఇదే సరైన సమయం. క్షత్రియ పరిషత్తును చేరడానికి, బ్రాహ్మణ గృహపతి పరిషత్తులను చేరడానికి, పేయాలం వరకు ఇదే కాలం. దేవ నాగ యక్ష గంధర్వ అసుర గరుడ కిన్నర మహోరగులు, ఇంద్రుడు, బ్రహ్మ, లోకపాలురు, భిక్షులు, భిక్షుణులు, ఉపాసకులు, ఉపాసికలూ—అనే వారి పరిషత్తులను చేరడానికీ ఇదే సమయం. ధర్మోపదేశానికి, ప్రతిసంలయనానికీ ఇదే కాలం. ఈ విధంగా బోధిసత్త్వుడు అంతటా నిత్యమూ కాలజ్ఞుడై కాలాపేక్షి అయి ఉండేవాడు.

భిక్షువులారా, చరమభావికులైన బోధిసత్త్వులకు ఇదే ధర్మతాప్రతిలంభం (ధర్మలాభం). ఆ లాభమేమిటంటే పది దిక్కులందలి లోకధాతువులలో ఉన్నవారూ, బుద్ధులు అయినవారూ అంతఃపురంలో ఉన్న బోధిసత్త్వులను సంగీతతూర్య నిగాదరూపాలయిన ధర్మపద్ధతులతో ప్రతిబోధించవలసి ఉంటుంది.

ఇక్కడ కొన్ని ప్రాచీన గాథలు ఇలా ఉంటున్నాయి :

యే సత్వాగ్రా దశది గ్లోకే తేషు నిశేషా త్త్రత రతితురియైః,
గాథా గీతా ఇమ రతిమధురా సంచోదంతీ నరవరప్రవరం.

పూర్వి తుభ్యం అయు కృతుప్రణిధీ దృష్ట్వా సత్వాన్ దుఃఖశతభరితాన్,
వేనంత్రాణం జగ నిజశరణే భేష్యే నాథో హితకరు పరమః.

సాథో వీరా స్మరచరిపురిమాం యాతే ఆసీ జగహిత ప్రణిధిః,
కాలో వేలా అయు తవ సమయో నిష్క్రమ్యాహీ ఋషివరప్రవరా.

యస్యార్థేతే ధనవరవివిధా త్యక్తా పూర్వే శిరకరచరణాః,
భేష్యే బుద్ధో నరమరుదమకో లోకస్యాగ్రో గుణశత నిచితః.

త్వం శీలేన వ్రతతపచరితః త్వం క్షాంతీయే జగహితకరణః,
త్వం వీర్యేణా శుభగుణ నిచితో ధ్యానే ప్రజ్ఞే న తు సము త్రిభవే.

క్రోధావిష్టా ఖిలమలబహుళా తే మైత్రీయే త్వయి స్ఫుటసుగతా,
కారుణ్యం తే బహువిధ మబుధే మిథ్యా త్వేషూ శుభగుణరహితే.

పుణ్యజ్ఞానే శుభ నిచితాత్మా ధ్యానాభిజ్ఞో ప్రభవసి విరజో,
ఓభాసేసీ దశ ఇమ దిశతో మేఘాముక్తః శశిరిన నిమలః.

ఏతే చాన్యే బహువిధ రుచిరా తూర్యైర్ఘోషా జినరుతరననా.
యే చోదేంతీ సురనరమహితం నిష్క్రమ్యాహీ అయు తన సమయః.

వీటి భావమిది: లోకంలో పది దిక్కులలోను ఉన్న ఉత్తమ ప్రాణు లందరూ రతిమధుర గాథలతోను, గీతాలతోను, ముఖ్యంగా రతితూర్యారావంతోను నరవరప్రవరుడైన సిద్ధార్థకుమారుణి ఈ విధంగా ప్రబోధిస్తున్నట్టున్నాయి :

"దుఃఖశతభరితులయిన ప్రాణులను చూచి, నీవు వారికి జగత్తులో శరణమిచ్చి రక్షించి, పరమహితకరుడైన నాథుడివి కావాలని పూర్వం ప్రార్థించాము. నిన్ను ప్రణిధిగా చేశాము. ఓ నాథా, ఓ వీరుడా వెనుకటి సంగతిని స్మరణకు తెచ్చుకో. నీవు జగత్తుకు హితాన్ని కలిగించే సేవాపరాయణుడవై ఉన్నావు. ఓ ఋషివర ప్రవరా, గృహం నుంచి నిష్క్రమించడానికి ఇదే సమయం. ఇదే కాలం. ఇదే వేళ. నీవు పూర్వంకూడా లోకోద్ధరణకోసం వివిధ సంపదలను, ధనాలను వదలిపెట్టినావు. శిరస్సు, కరచరణాలు మొదలయిన అవయవాలను కూడా దాన మిచ్చావు. నీవు నరులకు అమరులకు (దేవతలకు) శిక్షకుడవై, గుణశత పూర్ణుడవై లోకానికి నాయకుడ వవుతావు. నీవు శీలంతో వ్రతాలు, తపస్సూ చేస్తావు. క్షాంతితో జగద్ధితం కలుగజేస్తావు. పరాక్రమంతో శుభగుణపూర్ణుడ వవుతావు. ధ్యానంలో, ప్రజ్ఞలో నీకు సాటి అయిన వాడు త్రిభువనాలలోను లేడు. క్రోధావిష్టులూ, దురహంకారం మితిమీరినవారూ నీ మైత్రివలన మంచిమార్గాన్ని పొందుతారు. మూఢులపైన, మిథ్యావాదులపైన, శుభగుణాలు లేనివారిపైన నీకు అపార కారుణ్యం ఏర్పడుతుంది. పుణ్యజ్ఞానంలో మనస్సు కలిగి, ధ్యానాభిజ్ఞుడవైన నీవు విరాగివై తపస్సు చేస్తావు. మేఘాలనుంచి విడివడిన చంద్రునిలాగ విమలకాంతితో పది దిక్కులలోనూ ప్రకాశిస్తావు."

ఈలాటివి మరికొన్ని అత్యంతరుచిరమైన తూర్యరవాలు జినరుతధ్వనిని ప్రతిధ్వనిచేస్తూ, వాటిమాటలను అనురణింపజేస్తూ, గృహంనుంచి నిష్క్రమించడానికి ఇదే సమయమని సురనర మహితుడైన ఆ బోధిసత్త్వుణ్ణి ప్రబోధించాయి.

భిక్షులారా, బోధిసత్త్వుడు నివసిస్తూ వున్న భవనం సమస్తమైన గృహోపకరణాలతోనూ సమృద్ధమై వున్నది. మనస్సునకు నచ్చినట్లు సుఖంగా విహరించడానికి అనుకూలంగా ఉన్నది. దేవతల నగరంలోని భవనంవలె ప్రకాశిస్తూ వున్నది. రకరకాలైన ద్వారాలతోనూ, తిన్నెలతోనూ, తోరణాలతోనూ, గవాక్షాలతోనూ, మేడలతోనూ, కూటాగారాలతోనూ, ఉత్తమ భవనాలతోనూ కూడినది. సమస్త రత్నాలతోనూ, అనేకరీతుల చిత్రవిచిత్రంగా అలంకరింపబడినది. ఎత్తుగాఉన్న ఛత్రాలతోనూ, అనేక రత్నాలూ, చిరుగంటలూ గల జెండాలతోనూ అలంకరించబడినది. దానికి పట్టుతో తయారుచేసిన మాలికలు చాలా

వ్రేలకట్టబడి ఉన్నవి. ముత్యాలహారాలూ వ్రేలకట్టబడినవి. ఆ భవనం నిండా రత్నాలు పొదగబడినవి. మూల మూల ఘట్టాలలో ధూపాలు గుబాళిస్తున్నవి. మంచువలె తెల్లనైన వస్త్రాల చాందినీలు (మేలుకట్లు) కట్టబడినవి. అన్ని ఋతువులలోనూ పుష్పించిన పూవులు పడి మిక్కిలి పరిమళిస్తున్నట్టివీ, అల్లిబిల్లిగా అల్లుకున్న తామరలతో నిండినవీ అయిన కొలకులు దానిదగ్గర ఉన్నవి. అక్కడ వున్న పూలతోట చాలా అందమైనది. అక్కడి చెట్ల ఆకులలో కలిసిపోయి ఉన్న చిలుకలూ, గోరువంకలూ, హంసలూ, కోకిలలూ, నెమళ్లూ, చక్రవాకాలూ, కునాలములూ (కాటుకపిట్టలు), పిచ్చుకలూ, వెన్నెలపిట్టలూ మొదలైన పక్షులు మధురంగా ధ్వనిచేస్తూ వుంటాయి. అక్కడి నేలలు నీల వైడూర్యాలతో మిలమిల మెరుస్తూ, వాటిపై నడిచేవారి ప్రతిబింబాలను చక్కగా కనబరుస్తూ ఉంటాయి. దాని అందాన్ని ఎంత చూచినా తనివితీరదు. చూడడానికి ఎంతో ఆనందమూ, ఉత్సాహమూ కలుగుతూ ఉంటుంది. అట్టి భవనంలో బోధిసత్త్వుడు నివసిస్తూ వుంటున్నాడు.

అతడు పరిశుద్ధములూ, నిర్మలములూ అయిన అవయవాలు కలవాడు. ముక్తామాల్యాభరణాలను ధరిస్తూ అందంగా ఉంటాడు. శరీరం నిండుగా మేలయిన పరిమళలేపనాన్ని పూసుకొంటాడు. పరిశుభ్రమైనదీ, మిక్కిలి తెల్లనిదీ అయిన వస్త్రాన్ని ధరించి వుంటాడు. కాచలిందక సుఖస్పర్శ కలిగి మిక్కిలి సున్నితాలైన బట్టలు పరిచిన పసిడి పడకపైని శయనిస్తాడు. దేవతాస్త్రీలవలెనే ఎట్టి దోషములూ ఎట్టి ప్రతికూల భావమూ లేని దృష్టికల యువతుల ఉపచారాలను పొందుతూ ఉంటాడు. చక్కని అంతఃపురంమధ్యలో ఉంటాడు. నిద్రపోతూ వున్న అతడు శంఖ, భేరీ, మృదంగ, పణవ, తుణవ, వీణా, వల్లకీ, సంతాడకీ, పులవకుల, సుఘోషక, మధుర వేణువులు మొదలయినవాని మధురధ్వనులూ, తూర్యధ్వనులూ, సంగీతమూ వింటూ మేల్కొంటాడు. అక్కడున్న యువతులు మధురంగానూ, మనోజ్ఞంగానూ, వేణునాదం చేస్తూ అతనిని సంబోధిస్తూ వుంటారు. పది దిక్కులలోనూ ఉన్న భగవానులయిన బుద్ధుల ప్రభావంవల్ల, ఈ వేణు తూర్య ధ్వనుల మూలంగా బోధిసత్త్వునికి సంచోదన కలిగించే గాథలు వెలువడ్డాయి. వాని అభిప్రాయం ఇది:



ముదిత మనస్సుతో, ప్రసన్న చిత్తంతో మధుర మనోహరంగా వేణువులను ఊదుతున్న స్త్రీలను దశదిగ్గతులైన జినోత్తములు ఆవేశించారు. ఆ విధంగా ఆవేశించడంవల్ల చిత్ర విచిత్ర రూపాలయిన గాథలు వారినుంచి వెలువడ్డాయి. అవి ఇలా ప్రబోధిస్తున్నాయి.

"ఓ వీరుడా! నీవు పూర్వం ఈ అనాథ అయిన జనత జరామరణాలవల్లను, ఇతర దుఃఖాలవల్లనూ బాధపడుతూ వుండడం చూచి, దుఃఖమూ జరా లేని పరమమార్గాన్ని తెలుసుకొని ఉద్ధరించడానికి ప్రణిధీభూతుడవయావు. కనుక సాధో! ఋషులు కానివారితో నిండిన ఈ పురవరంనుంచి శీఘ్రమే బయలువెడలి, ధరణితల ప్రదేశం ఆక్రమించుకొని, అసదృశమైన జినజ్ఞానాన్ని తెలుసుకో. నీవు పూర్వం విచిత్రధన రత్నాలను, కరచరణప్రీతిని కూడా వదలిపెట్టినవాడివి. ఓ మహర్షి! ఇదే నీకు తగిన సమయం. జగత్తులో అనంతమైన ధర్మసముదాయాన్ని విస్తరింపజేయి. నీ శీలం శుభవిమలమయినది. అఖండమయినది. పూర్వం కూడా నీవు యిలాటి శీలంతోనే భూషితుడివి. శీలంతో నీవు అనతిసదృశుడివి. మహర్షి! వివిధ క్లేశయుక్తమైన జగత్తును గురించి నీవు విచారించు. అనేకమైన ఉత్తమగుణాలున్న నీవు క్షాంతిని సాధించు. జగత్తులోని వివిధదుర్భాషలను క్షాంతితో అణచివేయి. ఓ ద్విపదేంద్రా! శమదమ నిరతుడవై కాంతితో నైష్క్రమ్యంలో బుద్ధిని ప్రవర్తింపజేయి. నీ పరాక్రమం చలింపనిది; దృఢమైనది. దానిని ఎవ్వరూ కదిలించలేరు. నీ పూర్వులందరూ సుగతులైనారు. నీవున్నూ, శత్రుడైన నముచిని ససైన్యంగా చెరపట్టి, ముల్లోకాలనూ సమస్తములైన అపాయాలనుంచీ కాపాడగలవు. కలి కలుషాలనూ, క్లేశాలనూ ఆలోచించి వాటిని నశింపజేయడానికై వ్రతాలను ఆచరించి, తపోనియమాన్ని వహించు. చాలాకాలం నుంచీ దప్పిగొనివున్న అనాథులకు అమోఘమైన అమృతవర్షాన్ని కురిపించి తృప్తిని కలిగించు. ఇదివరలో నీవు పలికివున్నమాటను బాగా యోచించి, వెంటనే కపిలవస్తునగరంనుంచి అభినిష్క్రమణం చెయ్యి. శోకాన్ని నశింపజేసే అమృతమయమైన పద్ధతిని తెలుసుకొని, దప్పితో బాధపడినవారికి అమృతరసాన్ని యిచ్చి తృప్తిని కలిగించు. నీవు ప్రజ్ఞ

వలన కుశలం కలిగించు. నీజ్ఞానం విపులం, గొప్పది, అనంతమైనదిన్నీ. చెడుమార్గాలలో నడుస్తూ ఉన్న మూఢులకు తెలివినీ, శుభాన్నీ కలిగించు. మైత్రిని, కారుణ్యాన్ని, ముదిత ఉపేక్షలను అలవరుచుకొని, ఇదివరలో ఏ విధంగా ప్రవర్తించావో ఆచరితాన్నే ఇప్పుడు జగత్తులో విస్తరింపజేయి.''

ఈ విధంగా ఆ యువతులు దశదిక్కులందూ ఉన్న జినుల తేజస్సుతో, ఆవేశంతో గుణ కుసుమ విచిత్రాలైన గాథలను పలుకుతూ, తూర్యధ్వనులు చేస్తూ, నిద్రిస్తున్న కుమారునికి ప్రోత్సాహం కలిగించారు. ప్రముదితలైన ప్రమదామణులు తూర్యారావాలతోపాటు సురుచిర సుమధురంగా గాథలను గానంచేస్తున్న సమయంలోనే, సురనరులను శమదమవంతులనుచేసే దశదిశలలోను ఉన్న జినులు పర్వతాలు ప్రతిధ్వనించే ఆ తూర్యారావాలతోపాటు ఈ విధంగా ప్రబోధించారు :

కృత త్వయి హితకర బహుగుణ జనతో
నిజినితు జినగుణ విచరతి గతిషూ,
స్మర స్మర పురిమక వ్రతతపచరణా
లఘు వ్రజ ద్రుమవరు స్పృశపదమమృతం.

సుతృషిత వరమరు జినగుణ రహితా
త్వయి మతి ప్రతిబలు అమృతరసదదా,
దశబలగుణధర బుధజన మహితం
లఘు త్వయి నరపతి విభజహి అమృతం.''

ఈ గాథలతోను, ఇలాటి మరికొన్నిగాథలతోను వారు ఉద్బోధించారు. వాటి భావమిది :

''ఓ గుణనిధీ, నీవు జనానికి ఎంతో హితం చేకూర్చినావు. వారి జీవితంలో జినగుణాలను చేకూర్చినావు. పూర్వం నీవు చేసిన మహాత్కార్యాలను స్మరించు. వ్రతతపశ్చరణంకోసం త్వరగా ద్రుమరాజాన్ని ఆశ్రయించు. అమృతపదం స్పృశించు. జినగుణాలు లేనివారూ, దప్పిగొన్నవారూ అయిన నరులకు, సురలకు నీవు మతిని, బలాన్ని, అమృత



రసాన్ని ఇచ్చేవాడివి. ఓ దశబల గుణవంతుడా! నరపతీ! బుధజనమహితమైన అమృతాన్ని తీవ్రత్వరలో పంచిపెట్టు. పూర్వ జన్మలలో నీవు ధనమణికనకాలను, పుత్రమిత్రకళత్రాలను, నగరనిగమసహితమైన భూమిని త్యజించినవాడివి. నీ కరచరణాలను, శిరస్సునుకూడా ఇతరులకోసం త్యాగంచేసినవాడివి. జగత్తులో జినగుణనిరతుడు, లోకహితకరుడు అయినవాడు మరొక డెవరు? పూర్వం నీవు నృపకుమారుడుగా జన్మించినప్పుడు, ఒక నరుడు వచ్చి నగర నిగమ పూర్ణమయిన ఈ మహీమండలాన్ని తనకు దానంచేయుమని కోరాడు. అప్పుడు నీవు సకల మహీవలయాన్ని విడిచిపెట్టినావు. అప్పుడుకూడ నీ మనస్సు ప్రమోదించిందేకాని, సంక్షోభించలేదు. ఓ నరపతీ! నీవు బ్రాహ్మణుడవుగా అవతరించిన జన్మలో గురుజనులకు పరిచర్య చేశావు. ఎవరికీ ద్రోహం చేయలేదు. నీవు మరుల్లోకంనుంచి ఈ సంసారానికి చ్యుతుడవయినావు. బహుజనకుశలం కలుగజేయి. ఓ నృపసుతా! నీవు ఋషివిగా ఉన్న జన్మలో కలినృపతి నీ కరచరణాలు నరికివేశాడు. అయినా, నీవు నీ కుల క్రమాగతమైన ధర్మాన్నే ఆచరించినావు గాని మనఃక్షోభ పడలేదు. నరికివేయబడిన నీ కరచరణాలనుంచి క్షీరం కారిందేకాని రక్తం కారలేదు. నీవు పూర్వం ఒక జన్మలో ఋషికుమారుడివై ఉన్నప్పుడు వ్రతరతుడవై గిరివరనిలయంలో నివసిస్తూ తపస్సు చేస్తుండినావు. అప్పుడు ఒక రాజు నిన్ను విషలిప్తమైన బాణంతో కొట్టాడు. ఆ రాజువిషయంలో నీవు కృపనే చూపావుగాని, మనస్సులో క్షోభపడలేదు. నీవు పూర్వం ఒక జన్మలో మృగపతిగా ఉన్నప్పుడు, గిరినదీ జల ప్రవాహంలో ఒక మానవుడు పడిపోయి కొట్టుకొని పోతుండగా, అతనిహితం కోరి స్థలపథం (ఒడ్డు) ఎక్కించివావు. ఒడ్డు ఎక్కిన తరువాత అతడు నీకు శత్రువయాడు. అయినా నీవు క్షోభపడలేదు. ఓ నరవరా! నీవు పూర్వం వణిక్సుతుడుగా పుట్టినప్పుడు ఎంతో శ్రమతో సంపాదించిన నీ చింతామణి విపులాగాధ సముద్రంలో పడిపోయింది. అప్పుడు నీవు సముద్రాన్ని శోషింపజేసి, ఆ ధనమణిని మరల సంపాదించినావు. ఎంతో ధృఢబలం కలవాడివి. వృషభ సమానుడివి. ఓ సుపురుషుడా! నీవు పూర్వం ఋషివరుడవుగా జన్మించినప్పుడు, ఒక బ్రాహ్మణుడు నీ వద్దకు వచ్చి 'నాకు

శరణు యివ్వండి; నన్నొక శత్రువు వెంటాడుతున్నాడు' అని ప్రార్థించాడు. అప్పుడు నీవు ఆ ద్విజునికోసం నీ శరీరం త్యజించావే కాని ద్విజుణ్ణి త్యజించ లేదు. పూర్వం నీవు ఒక ద్రుమతలంలో తపస్సుచేస్తూ ఉన్నప్పుడు ఒక ఋషి వచ్చి 'ఈ చెట్టులో ఎన్ని చిగుళ్ళు ఉన్నాయో చెప్పు' అన్నాడు. అప్పుడు నీవు చెప్పావు. ఆ ఋషి తర్వాత వాటిని లెక్కపెట్టి, నీవు చెప్పినది సరియైన లెక్క అయ్యేవేళకు ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు నీవు అవితథవాక్కువు, సమవాక్కువు అయావు. ఓ ఉత్తమ గుణుడా! పూర్వం నీవు చిలుకవై ఒక వృక్షాన్ని ఆశ్రయించి వుండినావు. ఆ చెట్టు క్షీణించి పోయినా నీవు మాత్రం విశ్వాసం కొద్దీ ఆ వృక్షాన్ని విడువలేదు. దీన్ని గమనించిన యింద్రుడు చాలా సంతోషించి మెచ్చుకోగా అతనివల్ల ఆ వృక్షానికే మేలు కలిగించావు. వ్రతాలూ, తపస్సూ ఆచరించే ఉత్తముడా! ఈ విధంగా నీవు చాలా ఉత్తమ కార్యాలు చేసి ఉత్తమగుణుడే వని అనిపించుకున్నావు. ఇప్పుడు నగరంతో కూడిన రాజ్యాన్ని విడిచి పెట్టు. దానికి ఇదే తగిన సమయం. వేగంగా బయలుదేరు. జినగుణా చరణంతో లోకాన్ని స్థిరంగా నిలువు."

ప్రమదారత్నాలు శుభ్రమైన వస్త్రాలు ధరించి, ఆభరణాలతో శరీరాన్ని అలంకరించుకొని, మనోజ్ఞంగా గానం చేస్తూ, దశదిక్కుల లోను ఉన్న జినుల తేజస్సుతో ఇంకా ఇలాంటి విచిత్ర గాథలను తూర్య రావాలతోపాటు ఆలపించారు.

"తవప్రణిధీ పురిమే బహుకల్పాం లోకప్రదీపా
జరమరణ గ్రసితే అహు లోకే త్రాను భవిష్యే,
స్మర పురిమ ప్రణిధిం నరసింహా యాతి అభూక్షీ
అయు సమయో త్వమిహా ద్విపదేంద్ర నిష్క్రమణాయ."

ఇంకా ఇలాంటి గాథలూ వెలువడ్డాయి. వాటి తాత్పర్యమిది:

"లోకానికి ప్రదీపం వంటి ఓ రాజకుమారా! నీవు పూర్వం ఎన్నో కల్పాలు ప్రణిధిగా వుండి జరామరణాలు మింగివేస్తున్న లోకాన్ని ఉద్ధరించావు. ఓ పురుషోత్తముడా! నరసింహుడా! పూర్వం ప్రణిధివై ఉన్న



విషయాన్ని జ్ఞప్తికి తెచ్చుకో! రా. ఇదే తగిన సమయం. గృహంనుండి అభినిష్క్రమణం చెయ్యి. ఓ రాజకుమారా! భవనాలతో కూడా నీవు ఇక్కడ అనేకాలైన దానాలను ఇచ్చి వున్నావు. ధనాన్నీ, బంగారాన్నీ, రత్నాలనూ, విలువయిన వస్త్రాలనూ, విచిత్రాలైన గొప్ప వస్తువులనూ, కరచరణాలనూ, ప్రియపుత్రులనూ దానంచేసి వున్నావు. నీ రాజ్యం సమృద్ధంగానే వున్నది. నీవు గృహాన్ని విడిచి పెట్టి వచ్చినా దోషం లేదు. యాచకులకు కష్టం వుండదు. ఓ రాజకుమారా! నీవు శశికేతుడనే వాడుగాను, సుదంష్ట్రుడుగాను, కరుణామానసుడైన మణి చూడుడుగాను, చంద్రప్రదీపుడనే రాజుగాను పూర్వ జన్మలలో అవతరించి మహాశూరుడివిగా పేరు పొంది, దాననిరతుడవై నయుత సంఖ్యగల రాజుల ప్రశంసలు పొందావు. ఆ జన్మలలో ఎన్ని అపకారాలు జరిగినా నీ దానశీలానికి దెబ్బ తగలలేదు. ఓ సుగతుడా! నీవు బహుకల్పాలుగా ఉత్తమ శీల చర్యను ఆచరిస్తున్నందున నీ శీల సంపద విమల మణిరత్నసదృశమైంది. చమరీమృగం తన వాలాన్ని ఎంత జాగ్రత్తగా రక్షించుకొంటుందో శీలరతుడవైన నీవూ అంత జాగ్రత్తగా విపులార్థమైన శీలాన్ని కాపాడుకున్నావు. నీవు పూర్వం గొప్ప గజంగా అవతరించి, ఎంతో చక్కగా ఉండినావు. అప్పుడు ఒక వ్యాధుడు నీ చక్కని దంతాలకోసం నిన్ను బాణంతో కొట్టినాడు. అతనిపై కోపం చూపకుండా ఎంతో దయను ప్రకటించి అతనికి దంతాలు ఇచ్చివేశావు. అతనికి ఎట్టి హానినీ కలిగించలేదు. అతని విపరీతచర్య కూడా నీ శీలానికి భంగం కలిగించలేదు. లోకం అనేకాలైన అహితాలతో నిండి వేలకొద్దీ దుఃఖాలతోనూ, మిక్కిలి కఠినాలయిన మాటలతోనూ, వధలూ, బంధాలూ, అశాంతులతోనూ నిండి వుండగా నీవు పూర్వం వాటి నన్నిటినీ పోగొట్టి, అందరికీ సుఖాన్ని కలిగించి, క్షాంతిని నెలకొల్పినావు. నీవు పరిచరించిన వారే నీకు మారకులుగా పరిణమించారు. అయినా నీవు క్షాంతిని వదల లేదు. పూర్వం నీవు కొండప్రదేశంలో భల్లూకంగా వుండినప్పుడు చంద్రుడి మంచు కిరణాలనే జలంగా గ్రహిస్తూ వుండినావు. ఒక మనుష్యుడు నిన్ను చూచి మిక్కిలి భయపడగా వానికి పరిచర్య చేశావు. వివిధఫలాలనూ, దుంపలనూ ఇచ్చి అతనిని సంతోషపెట్టావు. అతడు నిన్ను చంపదల

చినా, శాంతిని వహించి క్షమించావు. నీ పరాక్రమం చలించనిది. దానిని ఎవ్వరూ కదల్పలేరు. గొప్ప జ్ఞానమూ, గుణాలూ నీకున్నవి. వ్రతాలూ, తపస్సూ ఆచరిస్తున్నావు. సమ్యక్సంబోధిలో ఆసక్తి ఎక్కువ. నీవు నీ పరాక్రమబలంచేత నముచిని బలహీనుణ్ణిగా చేసి లొంగదీసుకున్నావు. ఓ పురుషసింహుడా! అభినిష్క్రమణానికి నీకు యిదే తగిన సమయం. నీవు పూర్వం బంగారుచాయ గల అశ్వరాజుగా వున్నప్పుడు శీఘ్రంగా ఆకాశ మార్గాన రాక్షసద్వీపానికి పోయావు. కరుణాహృదయుడవై అక్కడ చెరలో వుండి బాధపడుతున్న మనుష్యులను చెర తప్పించి, వారికి క్షేమాన్ని కలిగించావు. ఈ విధంగా నీ పరాక్రమం లోకప్రసిద్ధమైనది. ధ్యానం చేస్తున్నవారిలో నీవు అగ్రేసరుడవై నియమంలో వున్నప్పుడు క్లేశాలను నశింపజేసి, తేలికయై చపలంగా వున్న చిత్తంలో విషయేచ్ఛలు కలుగకుండా అరికట్టినావు. లోకంమేలు కోరుతూ ధ్యాననిమగ్నుడవైనావు. ఓ గొప్పసత్త్వం కలవాడా! మళ్ళీ ధ్యాననిమగ్నుడవగుటకు ఇదే తగిన సమయం! నీవు పూర్వం ఒక మహర్షివై ధ్యానంలో మునిగి వుండినావు. అలా మునిగివున్నప్పుడు తగిన రాజు లేక అల్లాడుతూన్న జనులు నిన్ను ప్రార్థించి రాజ్యానికి అభిషేకం చేశారు. తండ్రివలెనే వారికి దశవిధాలైన కుశలాలనూ కలిగించావు. బ్రహ్మపథంలో నడిపించావు. బ్రహ్మలోకంనుండి చ్యుతులైన మనుష్యుల నందరినీ తిరిగి బ్రహ్మలోకానికి పంపించావు. దిక్కులందునూ, మూలలందునూ వివిధాలయిన గతులను తెలుసుకోవడంలో నీవు ఆరితేరినవాడవు. జగత్తులో సత్యజ్ఞానాన్ని గురించీ, ఇంద్రియజ్ఞానాన్ని గురించీ నయ వినయాలను గురించీ, ఇంకా వివిధ విషయాలను గురించీ నీకే బాగుగా తెలియును. ఓ నృపసూనుడా! గృహంనుండి అభినిష్క్రమణం చెయ్యడానికి ఇదే నీకు తగిన సమయం. లోకంలోని జను లందరూ జరా మరణాలవల్లనూ వివిధాలయిన కష్టాలతోనూ గుడ్డివారై మిక్కిలి బాధ పడుతూ వుండగా, నీవు పూర్వం ఎంతో కరుణతో లోకాన్ని ఋజు మార్గానికి తెచ్చావు. వారి అజ్ఞానాంధకారం పోగొట్టావు. లోకంలో మహార్థం వ్యాపింపజేశావు.''

ఈ విధంగా రుచిరగుణ యుక్తాలైన వివిధ విచిత్ర గాథలు జినతేజస్సులో తూర్యధ్వనులతోపాటు బయలువెడలి ''దుఃఖభరితమైన జనతను



చూచి, ఉపేక్షించవద్దు. ఓ ఉత్తమబుద్ధి గలవాడా! అభినిష్క్రమణానికి నీకు ఇదే సమయం'' అని ప్రోత్సహించాయి.

విచిత్ర వస్త్ర రత్నహార గంధమాల్య భూషితలు, ప్రసన్న చిత్తలు, ప్రహర్షితలు, ప్రేమ పరిపూర్ణలు అయిన ఆ మహిళలు వాయించే తూర్యాలనుంచి, ఇంకా ఈ విధంగా జినానుభావం గల గాథలు వెలువడ్డాయి.

''యస్యార్థి తుభ్య కల్పనేక త్యక్తత్యాగ దుస్త్యజా
సుచీర్ణ శీలు క్షాంతి వీర్య ధ్యానప్రజ్ఞ భావితా,
జగద్ధితార్థ సోతికాలు సాంప్రతం ఉపస్థితో
నైష్క్రమ్య బుద్ధి చింతయాసు మా విలంబ నాయక.''

త్యక్తపూర్వి రత్నకోశ స్వర్ణరూప్య భూషణా
యష్టాతి యజ్ఞనైకరూప తాసు తాసు జాతిషు,
త్యక్తభార్యపుత్ర ధీత కాయు రాజ్యజీవితం
బోధిహేతు రప్రమేయ త్యక్త దుస్త్యజా త్వయా.''

ఈ గాథల, మరికొన్ని ఇలాటి గాథల తాత్పర్యమిది :

''యాచకుల కోసం నీవు దుస్త్యజమైన త్యాగాలు అనేక కల్పాలలో చేశావు. నీ శీలం విస్తృతమైనది, క్షాంతి వీర్య ధ్యాన ప్రజ్ఞాభావితమైనది. జగద్ధితంకోసం పాటుపడవలసిన కాలం సమీపించింది. నైష్క్రమ్య బుద్ధినిగురించి ఆలోచించుచూ, విలంబం చేయకు. నీవు పూర్వం రత్నకోశ స్వర్ణరూప్యభూషణాలను దానం చేసినవాడివి. ఆ యా జన్మలలో అనేకరూపాలయిన యజ్ఞాలు చేశావు. భార్యాపుత్రాదులను, కాయాన్ని, రాజ్యాన్ని, జీవితాన్ని దానంచేశావు, అప్రమేయమైన సంబోధికోసం నీవు దుస్త్యజమైనవాటినీ త్యజించావు. నీవు ఒక జన్మలో మహా సంపద గల అదీనపుణ్యుడవనే రాజుగా ఉండినావు. నిమింధరుడని నిమి అని, కృష్ణుడని, బ్రహ్మదత్తుడని, కేసరి అని, సహస్రయజ్ఞుడని, ధర్మచింతుడని, అర్చిమంతుడని, దృఢధనువు అని, సుచింతితార్థుడవని

ఆయా జన్మలలో పేరుపొంది, ఎవరూ త్యాగంచేయని త్యాగాలు చేశావు. సుమసోముడు, దీప్తవీర్యుడు, పుణ్యరశ్మి అనే జన్మలు ఎత్తి త్యాగవంతుడివి, క్షామవంతుడివి అయ్యావు. రాజర్షి, చంద్రరూపుడు, సూరుడు, సత్యవర్ధనుడు, సుభాషితగవేషి, సుమతి, సురతుడు అనే రాజులజన్మలు ఎత్తావు. చంద్రప్రభుడు, విశేషగామి, రేణుభూదిశాంపతి, ప్రదానశూరుడు, కాశిరాజు, రత్నచూడుడు, శాంతిగుడు మొదలయిన జన్మలలో దుస్త్యజమైనవాటిని త్యజించావు. అప్పుడు త్యాగం వర్షించినట్టే ధర్మాన్ని వర్షించావు. ఓ సత్త్వసారుడా, పూర్వం గంగావాలుకా సదృశమైన వస్తువులను ఒక జన్మలో చూచావు. అప్రమేయమైన చింతతో బుద్ధపూజ చేశావు. సకలప్రాణులకు మోక్షం కలిగించే శ్రేష్ఠమైన బోధి ఉదయిస్తున్నది. కనుక ఓ శూరుడా, పురవరంనుంచి నిష్క్రమించడానికి సమయం ఆసన్నమైంది. ఓ అమోఘదర్శీ, మొదట విరోచనుడు నిన్ను శాలపుష్పాలతో పూజించి, ప్రసన్నచిత్తుడై క్షణంలో వెళ్ళిపోయాడు. దుందుభిస్వనంవంటి గంభీరధ్వని గల నీనుంచి హారీతకి అనే యక్షిణి ధాన్యం తీసుకొని పిడికిలిలో పెట్టుకోగా చందనమైంది. ఓ సత్వసారుడా! అన్య జన్మలలో ఇలాటివి, పూర్వపూజితాలయినవి అయిన నానారూప విచిత్రాలను స్మరించు. ఆ శాస్తల పూజలనుకూడా స్మరించు. అనాథులకు బలం కలుగజేసేవాడా, శోకపూర్ణులను ఉపేక్షించకు. నిష్క్రమించు. దీపంకర బుద్ధుని దర్శన మాత్రంచేతనే ఉత్తమ క్షాంతి, అచ్యుతమైన ఆనులోమిక పంచాభిజ్ఞ జ్ఞానమూ కలిగాయి. అసంఖ్య కల్పాలలో సర్వలోక ధాతువులలోను ప్రత్యేకబుద్ధులను వెలయింపజేసినావు. ఓ అప్రమేయుడా, ఆ బుద్ధులందరూ నిర్వాణం పొందారు. వారందరూ నీ ఆత్మభావంలోవారే, ఎక్కడికో వెళ్ళిపోయారు. ఈ సంసారంలో నిత్యమనేది ఏదీ లేదు. సర్వమూ క్షయాంతధర్మియే—(క్షయమయ్యేదే). ఈ కామరాజ్యభోగమంతా అనిత్యం. పురవరంనుంచి నిష్క్రమించు. దారుణమైన జర, వ్యాధి, మృత్యువు మహాభయం కలిగిస్తూ, కల్పాంత భయంకరాగ్నివలె పెద్దమంటలతో ముంచుకొని వస్తున్నాయి. సర్వ భావాలు అంతంలో క్షయం పొందేవి (క్షయాంత ధర్మాలు). ఈ సంసారంలో నిత్యమనేది



ఏదీ లేదు. కష్టాలలో మునిగిన ప్రాణులను రక్షించడానికి, ఓ గుణంధరా, వెంటనే నిష్క్రమించు.''

నారీగణం, సుఖశయ్యాగతుడైన మనుజాధిప కుమారుణి తూణవేణురవాలతోను, వివిధతూర్య రవాలతోను ప్రతిబోధిస్తుండగా, ఆ తూర్య రవాలనుంచి ఇంకా ఈ విధమైన హెచ్చరిక కలుగజేసే గాథలు వెలువడ్డాయి.

''జ్వలితం త్రిభవం జరవ్యాధిదుఃఖైః
మరణాగ్నిప్రదీప్త మనాథ మిదం,
భవ విస్సరణే సద మూఢజగత్
భ్రమతీ భ్రమరో యథ కుంభగతో.

అధ్రువం త్రిభవం శరదభ్రనిభం
నటరంగ సమాజగిరూర్మిరుచి,
గిరినద్యసమం లఘుశీఘ్రజవం
ప్రజతాయు జగే యథ విద్యు నభే.''

ఈ గాథల, ఇలాంటి మరికొన్ని గాథల తాత్పర్యమిది :

''ఓ రాజకుమారుడా! ఈ త్రిభువనం జరా వ్యాధి దుఃఖాలతో మండిపోతున్నది. మరణాగ్నితో మండిపోతూ అనాథగా ఉన్నది. ఈ జగత్తులోని మానవులు సంసారంనుంచి విడివడలేక మూఢులై కొట్టుమిట్టాడుతున్నారు. కుండలో పడిన తుమ్మెద కుండలోనే తిరుగుతూ ఉన్నట్లు ఈ మూఢమైన లోకం ఈ సంసారంలో తిరుగుతూ ఉంటున్నది. ఈ త్రిభువనం స్థిరమైనది కాదు. శరత్కాలంలోని మేఘంవంటిది. దుఃఖ మోహాభరితమైన ఈ జగత్తు నటులతో కూడిన రంగస్థలం వంటిది. ఈ జగత్తులో ఆయుస్సు ఆకాశంలోని మెరుపులాగా, పర్వత శిఖరంనుండి పడే సెలయేరులాగా మహావేగంతో గడిచిపోతూ వుంటుంది. భూలోకమూ, దేవలోకమూ కూడా త్రివిధాపాయాలకున్నూ మార్గములై వున్నవి. జనసమూహం సంసారపు ఆశకూ, అవిద్యకూ

వశమై ఉన్నది. కుమ్మరివాని సారె తిరుగుతూ వున్నట్లుగా అజ్ఞులు పంచ విధాలైన గతులలోనూ తిరుగుతూ ఉంటారు. కలిపాశంలో పడిన ఈ జగత్తు ప్రియమైన చక్కని రూపాలతోనూ, ప్రేమను వ్యక్తంచేసే ధ్వనులతోనూ, శుభకరాలైన గంధాలతోనూ, రసాలతోనూ, మంచి సుఖస్పర్శలతోనూ ఆవరించి ఉన్నది. వేటగాని వలలో చిక్కుకున్న వరాహంవలెనే యిది కానవస్తున్నది. కామగుణాలు భయంతోనూ, రణంతోనూ కూడినవి. విరోధాన్నీ, ఉపద్రవాన్నీ, వానిమూలంగా శోకాన్నీ కలిగిస్తాయి. కత్తిదారుతో అవి సమానమైనవీ, విషపత్రాల వంటివీ, మలకుంభాలవంటివీ అని ఆర్యులు వాటిని విడిచిపెడుతారు. ఈ కామగుణాలు స్మృతిశోకాన్నీ. అజ్ఞానాన్నీ కలిగిస్తాయి. భయహేతువులు; సదా దుఃఖకారణాలు. సంసారతృష్ణాలతను వృద్ధిపరచేవేగాని, తగ్గించేవి కావు. భయాన్ని, కలహాన్ని కలిగిస్తూ ఉంటాయి. మండే నిప్పుగుండం ఎలా భయం కలిగిస్తుందో, కామనలు అలాంటివేనని విదితార్థులయిన జనానికి తెలుసు. అంతేకాదు. ఇవి మహాపంకసమానమైనవి. అసి ధారతో సమానమైనవి. మామూలు అసిధారవంటివి కావు. తేనె పూసిన అసిధారవంటివి. ఈ కామగుణాలు సేతిగుంట వంటివని, మూత్ర ఘటాలవంటివని, శూల్యమాంససమాలని, పక్షుల పేశీలవంటివని, కుక్క నోటిలోని ఎముకలవంటివని విద్వాంసులకు తెలుసు. కామగుణాలు నీటి లోని చంద్రుని ప్రతిబింబాలవంటివి, కొండలలో కలిగే ప్రతి ధ్వనుల వంటివి, భ్రమాత్మకమైన ప్రతిభాసాల వంటివి, నటుల రంగ స్థలాల వంటివి, స్వప్నాలవంటివి అని ఆర్యులు అంటున్నారు. కామ గుణాలు క్షణికాలూ, శూన్యాలూ ఐనవి. మాయగానున్న ఎండమావుల వంటివి. గాలిపోగులను పోలినవి. నీటిబుగ్గలతోనూ, నురుగుతోనూ సమానమైనవి. నిరుపయోగమైనవి. ఈ విధంగా బుద్ధ విజ్ఞానవేత్తలు చెప్పుతున్నారు. ఈ శరీరం ప్రథమ వయస్సులో చక్కని రూపం కలిగి వుంటుంది. బాల్యంలో ప్రియంగానూ, ఇష్టంగానూ కానవస్తుంది. ముసలి తనము, వ్యాధి మున్నగువానివల్ల దుఃఖం సంభవించినప్పుడు శరీరంలోని తేజస్సంతా నశిస్తుంది. అట్టిదేహాన్ని ఎండిపోయిన నదిని మృగాలు విడిచి పెట్టినట్లుగా అందరూ విడిచిపెడతారు. చిన్నప్పుడు వ్యక్తి ప్రియం



గానూ, ఇష్టంగానూ ఉంటాడు. ధనదాన్యాలతో తులతూగుతూ, ఎక్కువ సొత్తు కలిగి బలవంతుడునూ అవుతాడు. ఆ ధనమంతా నశించి, చిక్కులలో పడిపోయినప్పుడు శూన్యమైన అడవిని విడిచిపెట్టి పోయి నట్లు అందరూ విడిచిపెట్టి పోతారు. మనుష్యుడు దానాలు చేస్తూవున్న ప్పుడు పువ్వులతో కూడిన చెట్లవలెనూ, ఫలాలనిచ్చే వృక్షాలవలెనూ అందరికీ ప్రీతిపాత్రుడై వుంటాడు. అతడు ధనహీనుడై, వార్ధక్యంవల్ల బాధపడుతూ అందరినీ యాచించే స్థితిలో వున్నప్పుడు గ్రద్దవలెనే అందరికీ అప్రియమైనవాడు అవుతాడు. మానవుడు ప్రభువై చక్కని రూపమూ, ధనమూ, బలమూ వుండి ఇష్టులతో కలసిమెలసి అందరికీ ఎంతో ప్రీతిని కలిగిస్తూ వుంటాడు. అతడే వార్ధక్యంవల్లనూ, వ్యాధుల వల్లనూ బాధపడి దుఃఖిస్తూ, ధనహీనుడై వుండగా, మృత్యువువలెనే అందరికీ అప్రియం కలిగిస్తాడు. వయస్సు అతిక్రమించిన మనుష్యుడు ముసలితనంవల్ల బాధపడుతున్నప్పుడు పిడుగుపడి వికారంగా ఉన్న వృక్షం వలె కానబడతాడు. ముసలితనం జీర్ణగృహంవంటిది. అది భయంకర మైనది. ఓ మునీ! ఈ జరను నశింపజేసే సులభమైన మార్గాన్ని త్వరగా తెలుపు. స్త్రీ పురుషుల సమూహాన్ని ముసలితనం, మాలులత మద్దిచెట్ల వనాన్ని శుష్కింపజేసినట్లు శుష్కింపజేస్తుంది. ముసలితనం వీర్యాన్నీ, పరాక్రమాన్నీ, వేగాన్నీ హరింపజేస్తుంది. బురదలో కూరుకుపోయిన మానవుడు బయటకు రాలేనట్లే ముసలితనం వచ్చినవాడూ బైటపడలేడు. ముసలితనం వస్తే చక్కని రూపం వికారమైన రూపంగా మారిపోతుంది. అది తేజస్సునూ, బలపరాక్రమాలనూ నశింపజేస్తుంది. అది సౌఖ్యాన్ని పోగొట్టి పరిభవాన్ని కలిగిస్తుంది. అది కాంతిని హరించి, మరణాన్ని కలిగిస్తుంది. ప్రాణులు అనేకవిధాల రోగాలచేతనూ, దుఃఖాలచేతనూ, బాధపడుతూన్న లోకం జ్వలిస్తున్న మృగంవలె కానవస్తుంది. జరా వ్యాధులతో నిండివున్న యీ లోకాన్ని గమనించి దుఃఖనివారణో పాయాన్ని శీఘ్రంగా ఉపదేశించు. శిశిరఋతువులో ఎక్కువగా కురు స్తున్న మంచు తరుగుల్మాల, లతల, ఓషధుల ఓజస్సును నశింపజేస్తూ వున్నట్లు అనేక రోగాలూ, ముసలితనమూ కాంతిని నశింపజేస్తాయి. అవి ఇంద్రియ రూపబలాలను నశింజేస్తాయి. జరా వ్యాధులు ధనధాన్యా

దులనూ, సంపదనూ నశింపజేస్తాయి. అవి మిక్కిలి పరితాపాన్ని కలిగిస్తాయి. అవి ప్రాణులను చంపివేస్తాయి. ఇష్టులకు కూడా విరోధాన్ని కలిగిస్తాయి. సూర్యుడు ఆకాశంలో ఎక్కువ తాపాన్ని కలిగిస్తున్నట్లు జనులకు తాపాన్ని కలిగిస్తాయి. మరణం పతనాన్ని కలిగిస్తుంది. ఇష్టుల వల్లనూ, ద్రవ్యంవల్లనూ, ఇతరులవల్లనూ, శాశ్వతమైన వియోగాన్ని కలిగిస్తుంది. మరణించినవాడు తిరిగి రానేరాడు. నదీప్రవాహంలో చెట్ల ఆకులు రాలిపడితే ఆ ప్రవాహంలో కొట్టుకుపోయినట్లు మరణం యీ లోకంనుంచి ఈడ్చుకుపోతుంది. మరణం ప్రాణుల వశిత్వాన్ని పోగొట్టుతుంది. దానికి అందరూ లొంగిపోవాలి. నదిలో పడిన దారువు కొట్టుకుని పోయినట్లు మరణం ఈడ్చుకుని పోతుంది. అసహాయుడైన మానవుడు దానికి లొంగి ఒంటరిగానే పోతాడు. అతడు తన కర్మఫలానికి తగినట్లు దానికి వశుడైపోతాడు. జలంలో ఉన్న మొసలి ప్రాణులను హరించినట్లూ, గరుడుడు పామును తన్నుకుని పోయినట్లూ, మృగరాజు ఏనుగును హరించినట్లూ, అగ్ని తృణాన్నీ, ఓషధివర్గాన్నీ ప్రాణిసమూహాన్నీ కాల్చివేసినట్లూ మరణం వందలకొద్దీ వుండే ప్రాణిసమూహాన్ని మింగివేస్తుంది. ఓ రాజకుమారా! ఈలాటి అనేక కష్టాలనుంచి లోకాన్ని విడిపించడానికి నీవు పూర్వమే ప్రణిధిగా నిర్ణయించబడి వున్నావు. వెనుకటి ఆ విషయాలను జ్ఞప్తికి తెచ్చుకో. నీవు గృహంనుంచి అభినిష్క్రమణం చేయడానికి ఇదే తగిన సమయం.''

ప్రహర్షితమైన నారీగణం మహాముని అయిన సిద్ధార్థుణ్ణి తూర్యారావాలతో మేల్కొల్పుతున్నప్పుడు అష్టదిక్కుల సుగతుల ప్రభావం వల్ల ఇంకా విచిత్రమైన గాథలు బయలుదేరాయి.

''లఘు తద్భంజతి సర్వసంస్కృతం
అచిరస్థాయి నభేవ విద్యుతః.
అయు కాలు తవా ఉపస్థితః
సమయో నిష్క్రమణాయ సువ్రత.
సంస్కార అనిత్య అధ్రువాః
ఆమకుంభోపమ భేదనాత్మకాః,



పరకేర యాచితోపమాః
పాంశునగరోపమ తావకాలికాః.

ఈ గాథల, ఇలాటి మరికొన్ని గాథల తాత్పర్య మిది:

''ఆకాశంలో విద్యుత్తు కొంతసేపే వుండి, తిరిగి మరుగైపోయినట్లుగా ఈ సకల సంసారం త్వరలో నశించేదే. కనుక, ఓ సువ్రతుడా! నిష్క్రమణానికి నీకు సమయం ఆసన్నమైంది. ఈ జగత్తులు అనిత్యాలు, అధ్రువాలు, పచ్చికుండలలాగా త్వరలో పగుల్లువారేవిని, పరకేరక యాచితతో సమానమైనవి. ఇసుకతో నిర్మించిన నగరాలలాగే తాత్కాలికమైనవి. ప్రలోభమనే ప్రధానలక్షణం గల ఈ జగత్తు వర్షాకాలంలో చెదరిపోయిన లేపనం (రంగు) వంటిది. ప్రత్యయాధీన స్వభావ దుర్బలమయిన జగత్తు నదుల ఇసుకగట్లవలె నిర్బలంగా కూలిపోయేది. ఈ సంసారమనేది ప్రదీపకాంతులలాగా త్వరలో పుట్టి వ్యాపించే స్వభావం గలది. అనవస్థితమైన గాలివంటిది. ఫేనపిండం (నురుగుముద్ద) వలె అసారమైనది, దుర్బలమైనదీని. ఈ సంసారాలు నిరీహశూన్యాలు. చూడడానికి అరటిబోదెలవంటివి. పసిపిల్లల ఉల్లాపనలలాగ, పసిపిల్ల పట్టిన పిడికిళ్ళలాగ, మాయలలాగ చిత్తమోహనమయినవి. హేతువులచేత, ప్రత్యయాలచేత ఈ సకలజగత్తు ప్రవర్తిస్తున్నది. అన్యోన్య ప్రతీత్య హేతువువల్ల ఈ విషయాన్ని బాలులవంటివారు గ్రహించలేక పోతున్నారు. ఘటీయంత్రానికి తాడు కట్టినప్పుడు వ్యాయామబలంచేత దాన్ని లాగితే చక్రం తిరుగుతూ యంత్రం పనిచేస్తుంది. అంతేకాని, దేనికది ప్రత్యేకంగా ప్రవర్తించడం లేదు. ఆ విధంగా ఒకదానికి ఒకటి అంగంగా వుండే అన్నీ ఒకదానికి యింకొకటి సంబంధించి వుంటాయి. ఒకటి ముందూ, ఒకటి వెనుకా అనే పద్ధతి వుండదు. బీజమనేది వుంటేనే దానివల్ల అంకురం ఏర్పడుతుంది. బీజం లేకపోతే అంకురమనేదే వుండదు. అది లేకపోతే యిది ఉండదు. ఈవిధంగానే ఈ అనుచ్ఛేదం (సంసారం) అశాశ్వతలక్షణం కూడా. ఈ సంస్కారం అవిద్యా ప్రత్యయం. అంటే లేనిగుణాలు ఉన్నట్లు భాసిస్తాయి. నిజానికి ఆ గుణాలు దీనిలో లేవు. ఈ సంసారం అసత్తు శూన్యమొక్కటే నిజం. జనులు

ఈ విషయం తెలియనివారు. ముద్రనుంచి ప్రతిముద్ర కనుపిస్తుంది కాని, ముద్ర సంక్రాంతి కనిపించదు. ముద్రలేకపోతే ముద్రసంక్రాంతి లేదు. ఈ విధంగానే ఈ సంస్కారానుచ్ఛేదమూ అశాశ్వతమైనది. రూపంపై చక్షువును ప్రసరింపజేసినప్పుడు చాక్షుషప్రతీతి (జ్ఞానం) కలుగుతుంది. చక్షువు రూపనిశ్చితం కాదు. చక్షువులో రూపసంక్రాంతీ లేదు. ధర్మవిషయాలలో నైరాత్మ్యంవల్ల శుభం కలుగుతుంది. అయితే, ఆత్మవశుభాలు కలుగుతాయని కల్పించబడుతున్నది. ఈ కల్పన చాల విపరీతమైనది, అసత్తు కూడాను. చాక్షుషజ్ఞానం దీనివల్లనే కలుగుతూ వుంటుంది. విజ్ఞానం కామనిరోధంవల్ల కలుగుతుంది. యోగి అయినవాడు ఈ విజ్ఞానోత్పాదవ్యయాన్ని, గతాన్ని, ఆగతాన్ని, మాయాసదృశమైన శూన్యాన్నీ చూస్తాడు. 'అరణి' ఉత్తరారణి, చేతితో తరచడం (హస్త వ్యాయామం) ఇవి మూడూ కలిస్తే అగ్ని ఉత్పన్నమవుతుంది. పుట్టినది బాగా వెలిగి, త్వరలో చల్లారుతుంది. పండితు డెవడో ఒకడు, ఇది ఎక్కడినుంచి వచ్చింది, ఎక్కడికి పోతుంది అని దిక్కులు, విదిక్కులు వెదుకుతారు. దీని రాకగానీ, పోకగానీ తెలియదు. ఈ ధాతువులు స్కంధ ధాత్వాయతనాలు తృష్ణ, అవిద్య అనేవి కర్మప్రత్యయాలు. సామగ్రి ఏమో సత్త్వసూచన. వీటి పరమార్థం తెలుసుకోలేము. కంఠం, పెదవులూ, దౌడలూ, నాలుక — అనేవాని కదలికవల్ల అక్షరాలు ఏర్పడుతాయి. అయితే, తరచిచూస్తే కంఠంలోగాని, తాలువులలోగాని ఒక అక్షరమన్నా లభించదు. ఈ కంఠతాలుజిహ్వోష్ఠ ప్రతీతివల్ల మాట మనోబుద్ధివశంతో వెలువడుతుంది. మనస్సనేది అదృశ్యరూపి. లోపలగాని, వెలుపలగాని కనిపించదు. ఈ వాక్కులు రుతఘోషాల ఉత్పత్తి పద్ధతిని గ్రహించిన పండితుడు సర్వవాక్కులు ప్రతిశ్రుతి సదృశాలు, క్షణికాలు, శూన్యాలునని గ్రహిస్తాడు. ఈ వాక్యబద్ధంలాగే తంత్రి, దారువు, హస్త వ్యాయామం (చేతితో మీటడం) ఈ మూడింటి సంగతికలన తుణ, వీణ సుఘోషకాదులనుంచి శబ్దం పుడుతుంది. ఒకానొక పండితుడు 'ఈ శబ్దం ఎక్కడినుంచి వచ్చింది? ఎక్కడికి పోతుంది?' అని దిక్కులను, విదిక్కులను వెదికినా, ఈ శబ్దంయొక్క గమనాగమనాలను తెలుసుకోలేడు. హేతువులచేత, ప్రత్యయాలచేత సర్వసంస్కారపద్ధతులూ ప్రవర్తిస్తున్నాయి. శూన్య సంస్కారుడూ, నిరీహుడూ అయిన యోగిమాత్రమే వీటికన్నిటికీ మూలమైన భూతాలను చూడటంవల్ల సమస్తమూ తెలుసుకోగలుగుతున్నాడు. స్కంధాయతనాలూ, ధాతువులూ, శూన్యమైన ఆధ్యాత్మికాలూ, శూన్యబాహ్యకాలు, సత్వాత్మవివిక్తమనాలయాలు, ధర్మాకాశానికి స్వభావ లక్షణాలు. ఇంకా యిలాంటి ధర్మలక్షణాలను నీవు దీపంకరబుద్ధుని దర్శనంతో స్వయంగా తెలుసుకున్నావు. నీవు తెలుసుకున్న విధంగా దేవతలకూ, మనుష్యులకూ, అందరికీ బోధించు. ఓ నాయకుడా! ఈ లోకం విపరీతమైన అభూతకల్పనలతోను, రాగదోషాలతోను మండిపోతూన్నది. కృపామేఘాలనుంచి శీతలమైన అమృతధారలను వర్షించు. ఓ పండితుడా! నీవు బహుకల్పకోటులలో పలువురికి పలుదానాలు చేశావు. దానివల్ల ఉత్తమమైన బోధిని పొందావు. ప్రాణులకు కూడా ఉత్తమబోధిని కలిగించి ఆర్యధనసంగ్రహం కలిగించు. సమస్త సత్వాలకూ, సారథి అయినవాడా, పూర్వచరితాన్ని స్మరించు. ఆర్యధనహీనులను, దరిద్రులను, దుఃఖితులను ఉపేక్షించవద్దు. వారికి ఆర్యధనసంగ్రహం కలిగించు. లోకాల అపాయాలను కప్పిపుచ్చడానికి నీయందు ఎల్లప్పుడూ ఉత్తమశీలం, సురక్షితమై వున్నది. కోట్లకొలదిగా ఉన్న ప్రాణులకు ఉత్తమమైన స్వర్గామృతద్వారాన్ని చూపించు. నీవు పూర్వచరిత్ర స్మరించు. నరకద్వారాలను మూసివేయి. స్వర్గామృతద్వారం తెరువు. శీలచింతను శీలవంతుల చర్యను అభివృద్ధిపరచు. క్రోధంతోను, కోపంతోను ఉన్న ప్రాణులయెడల నీవు ఎల్లప్పుడూ శాంతాన్నే వహించి వుంటావు. సంసారార్ణవంనుంచి ప్రాణులను తరింపజేయడానికి నీవు తాపరహితమైన క్షేమాన్ని స్థాపించగలవు. విరోధాలూ, వధలూ, హింసలూ మున్నగువాటితో కలతపడుతూ వున్న యీ లోకవృత్తాన్ని బాగుగా జ్ఞప్తి ఉంచుకో. హింసించేవారిని ఎంతమాత్రం ఉపేక్షించవద్దు. ఈ లోకాన్ని శాంతిస్థానంలో స్థిరంగా నిలుపుము. నీవు నీ బలపరాక్రమాలను ఉపయోగించి, ధర్మం అనే నావను నడుపుతూ లోకాన్ని సంసారసముద్రంనుంచి దాటించి, తాపరహితమై క్షేమకరమైన స్థానంలో నిలుపగలవు. నాలుగు ఓఘాలచేతనూ లోకం పరవశమై వున్న సంగతిని గుర్తించు. నీ వీర్య, బల, పరాక్రమాలను ఉపయోగించి నాయకుడు లేని

యీ జగత్తును త్వరగా ఉద్ధరించుము. నీవు జగత్తుకోసం ధ్యానక్లేశాలు
ముందు అనుభవించావు. ఆ జగత్తు భ్రాంతేంద్రియం, ప్రాకృతేంద్రియం
అంటే చిత్తభ్రాంతి, అజ్ఞానం కలది. అలాంటిదానినీ నీవు చిత్తార్థ
పథంలో ఉంచు. క్లేశ సమూహాలతో మిక్కిలి కలతపడివున్న యీ
లోకాన్ని నీవు బాగా యోచించు. క్లేశపడుతూ వున్న దీన్ని ఉపేక్షించ
వద్దు. ఈ ప్రజాసమూహాన్ని ధ్యానైకాగ్రస్థితిలో స్థిరంగా స్థాపించు.
మోహంతోనూ, అవిద్యతోనూ, అంధతమోబంధురమైన యీ
లోకంలో నీవు పూర్వం చక్కగా ప్రజ్ఞను వ్యాపింపజేశావు. వందల
కొద్దీ వున్న అనేక ధర్మాలను చూడడానికి చక్షుస్సులకు తత్త్వదర్శన
శక్తిని ప్రసాదించు. మోహావిద్యాంధతమోవృతమైన ఈ జగత్తుకు
గొప్ప ప్రజ్ఞను, తేజస్సును, విమలమూ, నిరంజనమూ అయిన ధర్మ
చక్షుస్సునూ అనుగ్రహించు.

"ఇయమీదృశ గాథ నిశ్చరీ
తూర్యసంగీతరవాతు నారిణాం,
యం శ్రుత్వ మిద్ధం వివర్జయా
చిత్తు ప్రేషేతి వరాగ్రబోధయే."

మహిళల తూర్య సంగీతరవాలనుంచి ఇలాంటి గాథలు వెలు
వడ్డాయి. రాజకుమారుడు వాటిని విని ఆలస్యం వదలి ఉత్తమమైన బోధి
యందు చిత్తం లగ్నంచేశాడు.

భిక్షువులారా, బోధిసత్త్వుడు అంతఃపురం మధ్యను ఉన్నప్పటికీ
ధర్మశ్రవణ విరహితుడు కాలేదు. ధర్మంపట్ల సావధానుడు కాకపోలేదు.
అది ఎలాగంటే – భిక్షువులారా, బోధిసత్త్వుడు పెక్కురాత్రులు ధర్మా
లోచనంలోనే గడిపాడు. ధర్మాలలోను, ధర్మభాణకాలలోను పట్టు
దలతో ధర్మం కోరుతూ ధర్మకాముడూ, ధర్మరతిరతుడూ అయి, కేవల
ధర్మ విషయమైన తర్కవితర్కాలతో అసంతృప్తి పొందుతూ, యథా
శ్రుత ధర్మాలను ప్రకాశింపజేస్తూ, సాటిలేని మహాధర్మదానపతి అయి,
లాభాపేక్షలేని ధర్మోపదేశకుడై, ధర్మదానంతో మాత్సర్యం పొందక,



ఆచార్యని పట్టునుంచి తప్పించుకొని, ధర్మానుధర్మజ్ఞానం పొంది,
ధర్మప్రతిపత్తి శూరుడై ధర్మలయనుడు, ధర్మత్రాణుడు, ధర్మ శర
ణుడు, ధర్మప్రతిశరణుడు, ధర్మపరాయణుడు అయి, ధర్మనిధ్యాప్తి
కలిగి, క్షాంతిని వెదజిమ్ముతూ, ప్రజ్ఞాపారమితా చరితుడై ఉపాయ
కౌశల్య మార్గం పొందాడు.

తర్వాత బోధిసత్త్వుడు గొప్ప ఉపాయ కౌశల్య లీలవలన సమస్త
మైన అంతఃపురానికీ ఆధులను పోగొట్టి, ధ్యానమానాది మార్గాన్ని
ప్రదర్శిస్తూ, లోక విషయాలను అతిక్రమించిన పూర్వ బుద్ధుల లోకాను
వర్తన పద్ధతినే అనుసరిస్తూ, పెక్కురాత్రులు కామాలవల్ల గలిగే దోషా
లను గుర్తించి, సత్త్వపరిపాకంవలన అకామంతోనే కామోపభోగాలు
చూచి, అపరిమితాలయిన కుశలాలకు మూలమైన పుణ్యసంభార బల విశే
షంతో సాటిలేని లోకాధిపతిత్వాన్ని ప్రదర్శించి, దేవమనుష్యులకు అతీత
మైనదీ, సారోదారమూ, వివిధ విచిత్ర రూప శబ్ద గంధ రస స్పర్శ పరమ
రతిరమణీయమూ అయిన కామరతిసౌఖ్యాన్ని చూచి, సర్వకామరతి
విషయాలు ఎంత అనుభవించినా ఆశ తీరనివి కనుక వాటి విషయంలో
తన వశవర్తిత్వం వెల్లడించి, పూర్వజన్మ ప్రణిధానంవల్ల కలిగిన బలసహా
యంతో కుశలమూలం అభివృద్ధిచెందిన ప్రాణులను సహవాసంతో పరి
పాకం పొందించి, సర్వలోక క్లేశదోషాల, కష్టాల సంపర్కంలేని మనస్సు
కలవాడు గనుక అంతఃపుర మధ్యంలో ఉన్నప్పటికీ, తన సత్త్వధాతువు
పరిపాకకాలం ప్రతీక్షిస్తూ, ఆ సమయంలో విశేషంగా తన పూర్వ ప్రతి
జ్ఞను మననం చేసుకుంటూ ఉన్నాడు. బుద్ధ ధర్మాలను నెమరు వేసు
కుంటూ ఉన్నాడు. ప్రణిధానబలం సడలించుకుంటూ ఉన్నాడు. సకల
ప్రాణులయందు మహాకరుణారసం ప్రసరింపజేస్తూ ఉన్నాడు. ప్రాణుల
ముక్తినిగురించి ఆలోచిస్తూ ఉన్నాడు. సమస్త సంపదలూ పర్యవ
సానంలో విపత్తిని కలిగించేవని ఎదురుచూస్తూ ఉన్నాడు. ఈ సంసారం
అనేకోపద్రవాలతో, భయాలతో నిండినదని పరీక్షిస్తూ ఉన్నాడు. మార
కలిపాశాలను ఛేదిస్తూ ఉన్నాడు. సంసారబంధనంనుంచి తనను విడి
పించుకొని, మనస్సును నిర్వాణంలో సంచరింపజేస్తూ ఉన్నాడు.

అంతేకాదు భిక్షువులారా, బోధిసత్త్వుడు పూర్వమే సంసారంలోని దోషాలను గుర్తెరిగినవాడు; సంస్కరించబడిన అధ్యాశయం కలవాడు గనుక ఆయనకు కోరికలన్నీ తొలగిపోయాయి. సర్వోపాదానాలు తీసుకోవడంవల్ల ఆయన ఇతరులనుంచి కోరదగిందేమీ లేదు. బుద్ధధర్మాలకు, నిర్వాణానికి అభిముఖుడై సంసారపరాఙ్ముఖుడై, తథాగత విషయాలలో అభిరతీ, మారవిషయాలలో అసంసర్గమూ కలవాడై ఉన్నాడు. మండిపోతున్న ఈ సంసారంలోని దోషాలను చూచాడు. త్రైధాతుకమైన ఈ లోకంనుంచి వెడలిపోవడం మేలని అభిప్రాయపడినాడు. సంసారదోషాలనుంచి బయటపడడంలో కుశలత సంపాదించుకొని, ప్రవ్రజ్యను పొందాలనే అభిలాషతో, నిష్క్రమణాభిప్రాయంతో వివేక నిమ్నుడూ, వివేక ప్రవణుడూ, వివేకప్రాగ్భారుడూ అయి అరణ్యప్రారణ్యగమనాభిముఖుడయాడు. గొప్ప వివేకాన్నీ, ప్రశమాన్నీ కోరసాగినాడు. ఆత్మహితంలోను, పరహితంలోను ఆసక్తిగలవాడయి, అనుత్తర జ్ఞానశూరుడై లోకప్రయోజనం, లోకహితం కోరుతూ, లోకసుఖం, లోకయోగక్షేమం కోరుతూ, లోకానుకంపతో కరుణా, మైత్రి విహారి అయి సంగ్రహ వస్తువులను సంగ్రహించుకొనడంలో కుశలత పొందాడు. ఎప్పుడూ అతనిమనస్సు ఖేదం ఎరిగేది కాదు. సకల సత్త్వాలను పరిపాకం పొందించాలనే దీక్షలో కుశలుడయాడు. సకల ప్రాణులందూ ఏకపుత్రునియం దుండే ప్రేమతో ప్రవర్తించసాగినాడు. సర్వ వస్తువులను అపేక్షలేక పరిత్యజించాడు. దానపరుడై, త్యాగనిరతుడై, చేయి చాచి త్యాగం చేయడంలో శూరుడై యాగాలు చేశాడు; పుణ్యాలు సమృద్ధిగా సంపాదించాడు. పరిష్కారంతో మనస్సులోని మలమాత్సర్యాలు పోగొట్టుకొని, సాటిలేని మహాదానపతి అయి, ఫలితాన్ని ఎదురుచూడని ప్రధానశూరుడయాడు. ఇచ్ఛ, మహేచ్ఛ, లోభం, ద్వేషం, మదం, మాత్సర్యం, మానం, మోహం మొదలయిన శత్రు రూపాలయిన క్లేశగణాలను నిగ్రహించడానికి సంసిద్ధుడై సర్వజ్ఞతాచిత్తంనుంచి చలించక, మహాత్యాగం చేసే మనస్సన్నాహంతో లోకానుకంపనుడై, లోకహితం కోరుతూ వుండేవాడు. అతనికి వీర్యమే కవచం. ప్రాణులకు ముక్తి గలిగింతామనే మహాకరుణే బలపరా



క్రమం. సర్వప్రాణులందూ తిరుగులేని సమాన చిత్తమూ, సమానత్యాగదృష్టి అనేవే ఆయన ఆయుధాలు. ఆయన ఆ యా ప్రాణులను వాటి ఆశయానుగుణంగా సంతోషపెడుతూ, బోధిజ్ఞానానికి భాజనుడై, కాలాక్షుణ్ణ ధరాన్ని (కాలాతీతంకాని ధర్మాన్ని) తెలుసుకొని, బోధిపరిణామప్రణిధిగా భాసించాడు. అనవనామితమైన ధ్వజం కలవాడు. త్రిమండల పరిశోధన దానపరిత్యాగి జ్ఞానమనే వజ్రదృఢమైన ఆయుధంతో క్లేశాలనే శత్రువులను నిగ్రహించి, శీలగుణచారిత్ర సంపన్నుడై, దేవతల రక్షణ పొందిన కాయవాఙ్మనఃకర్మలు కలిగి, అణుమాత్రమూ ఇతరులకు వెరపు కలుగనీయక, సుపరిశుద్ధశీలుడై, అమల విమల నిర్మల చిత్తుడై, సకల దుర్భాషితాలకు, దురాగత వచనాలకు, ఆక్రోశాలకు, తిట్లకు, నిందలకు, తాడనాలకు, బెదరింపులకు, వధబంధనాలకు, అవరోధన పరిక్లేశాలకు ఆందోళనపడని మనస్సు - అక్షుభితమనస్సు కలవాడయి, క్షాంతి సౌరభ్య సంపన్నుడై, అక్షతుడు, అనుపహతుడు, అవ్యాపన్నచిత్తుడు అయి, సమస్తప్రాణుల మేలుకోసం తీవ్రమైన ప్రయత్నం చేసేవాడై, సమస్త కుశలాలకు మూలమైన ధర్మం స్థాపించాలనే స్మృతి కలిగి, సుసంప్రజ్ఞతో కూడి, స్థిరమనస్కుడై, ధ్యానముందే ఏకాగ్రమయిన మనస్సు కలవాడై, ధర్మ ప్రచారకుశలుడై, కాంతిని పొంది, అజ్ఞానాంధకారం పోనాడి, దుఃఖంలేని ఆత్మ కలవాడై (అంతా అనిత్యమనే దుఃఖం తెలిసిన ఆత్మ కలవాడై) శుభాకారపరిభావితమైన మనస్సు కలవాడై, స్మృతి, ఉపస్థానం, సమ్యక్ప్రహాణం, బుద్ధిపాదం, ఇంద్రియబలం, బోధ్యంగమార్గం, ఆర్యసత్యాలు మొదలయిన సర్వబోధిపక్ష ధర్మకర్మలు మనస్సులో నిలిపి, సమథ విపశ్యనలతో పరిశుద్ధమైన బుద్ధి కలిగి, ప్రతీత్య సముత్పాదమనే సత్యాన్ని దర్శించి, సత్యానుబోధంలో మహాప్రత్యయం కలిగి, త్రిలోక ధాతు మోక్షసుఖంతో క్రీడిస్తూ, మాయ, మరీచి, స్వప్నం, ఉదకచంద్రుడు, ప్రతిశ్రుతి, ప్రతిభాసం — ఇలాటివాటితో సమానమైన సర్వధర్మనయాలను అవలోకించాడు.

భిక్షువులారా, ఈ విధంగా సహజంగానే ధర్మవిహారి, గుణమాహాత్మ్యవిహారి, సర్వార్థాభియుక్త విహారి అయిన బోధిసత్త్వుడు, దశ

దిక్కుల బుద్ధుల ప్రభావంతో తూర్య సంగీతాలనుంచి వెలువడిన గాథలచే ప్రబోధితుడై, ఆ సమయంలో చరమభవోపగతులైన పూర్వ బోధిసత్త్వులు అంతఃపురంలో ప్రబోధించిన నాలుగు ధర్మ ముఖాలను అభిముఖం చేసుకొనసాగినాడు. ఆ ధర్మముఖాలు నాలుగూ ఏవంటే: దానం, ప్రియవచనం, అర్థక్రియ, సమానార్థత. చతుస్సంగ్రహవస్తు ప్రయోగనిర్హార విశుద్ధి అనే ధర్మముఖాన్ని తెలుసుకొన్నాడు. నాశరహితమైన సర్వజ్ఞతలో చిత్తప్రణిధాన బలాధానానైవర్త్య విషయమనే ధర్మముఖం తెలుసుకొన్నాడు. సకలప్రాణులను విడవకుండడం, మహాకరుణ చూపడమనే ధర్మముఖం తెలుసుకొన్నాడు. సర్వబోధిపక్ష ధర్మమార్గంలో ఉండే భేదార్థాలను నిర్ణయించే జ్ఞానసంసార బలవిశేష సముదానయన మహావ్యూహమనే ధర్మముఖాన్ని తెలుసుకొన్నాడు. బోధిసత్త్వుడు ఈ నాలుగు ధర్మముఖాలను తెలుసుకొని, అభిముఖం చేసుకొని, ఆ సమయంలో అంతఃపురంలోని వారి నందరిని పరిపాకం పొందించడానికి అలాటి బుద్ధిని (మాహాత్మ్యాన్ని) వ్యాపింపజేశాడు. ఆ మాహాత్మ్య సంస్కృతమైనందువల్ల ఆ సంగీతి రవాలనుంచి అనేక రూపాలయిన ధర్మముఖ శతసహస్రాలు ఈ విధంగా వెలువడ్డాయి.

"ఉదార ఛందేన చ ఆశయేన అధ్యాశయేన కరుణాయ ప్రాణిషు,
ఉత్పద్యతే చిత్తు పరాగ్రబోధయే శబ్దే చ రూపస్తురియేభి నిశ్చరీ.
శ్రద్ధా ప్రసాదో అధిముక్తి గౌరవం నిర్మాణతా ఓనమనా గురూణాం,
పరిపృచ్ఛతా కిం కుశలం గవేషణా అనుస్మృతీ భావను శబ్ద నిశ్చరీ."

ఈ గాథల, మరికొన్ని గాథల భావం యిది:

'ఉదారమైన కోరికతోను, ఆశయంతోను, అధ్యాశయంతోను ప్రాణులయెడ కరుణతోను శ్రేష్ఠమైన సమ్యక్సంబోధికోసం చిత్తం ఏర్పడుతుంది' అని తూర్యరవాలనుంచి ధ్వని వెలువడింది. శ్రద్ధా, ప్రసాదగుణం, ముక్తిపట్ల గౌరవం, నిర్మాణత, గురువుల పట్ల వినయభావం, పరిప్రశ్న, కుశలగవేషణ, అనుస్మృతిభావన అవసరం అనే ధ్వని వినబడింది. దానం, దమం, సంయమశీలం అవసరం. క్షాంతి



అవసరం. వీర్యం ఉండాలి. ధ్యానం, అభినిర్హారం, సమాధి, ఉపాయం, ప్రజ్ఞ అవసరం అనే శబ్దాలు భేరీ రవాలనుంచి వెలువడ్డాయి. మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష అనే చతుస్సంగ్రహ వస్తువుల నిశ్చయబుద్ధితోనే ప్రాణుల మనస్సు పరిపక్వమవుతుంది" అని సంగీతి నినాదంనుంచి వాక్యాలు వెలువడ్డాయి. స్మృత్యుపస్థానం, సమ్యక్ప్రహాణం, బుద్ధిపాదం, పంచేంద్రియాలు, పంచబల ప్రభేదాలు, బోధ్యంగాలు— అనే మాటలు తూర్యారావాలనుంచి వెలువడ్డాయి. అష్టాంగమార్గం బలమైనదనే శబ్దమూ, సమథ, విపశ్యన అనే శబ్దాలు, అనిత్య దుఃఖార్తి అనాత్మశబ్దమూ, అశుభార్తి శబ్దమూ తూర్యారవంనుంచి వెలువడ్డాయి. విరాగం, వివేకం, క్షయజ్ఞానం, అనుత్పాదం, అనిరోధం, అనాలయం, నిర్వాణం అనే శబ్దాలు తూణరవంలో పుట్టాయి.

ఇలాటి శబ్దాలు, సంబోధిశబ్దమూ తూర్యరవంనుంచి బయలువెడలాయి. ఈ శబ్దాలను విని అంతఃపురంలోని ప్రమద లందరూ శిక్షణ పొంది బోధికోసం తమ శక్తిని ఏకాగ్రం చేశారు.

భిక్షువులారా, ఈ విధంగా అంతఃపురంలో ఉన్న బోధిసత్త్వుడు ఎనభైనాలుగు వేలమంది యువతుల మనసులనూ పరిపక్వం చేశాడు. అనుత్తర సమ్యక్సంబోధికోసం వచ్చిన దేవతాశతసహస్రాలు పరిపాకం పొందాయి.

రాజకుమారుడు అభినిష్క్రమణ చేయడానికి సిద్ధంగా ఉన్న ఆ సమయంలో హ్రీదేవుడనే తుషితకాయికుడైన దేవపుత్రుడు అనుత్తర సమ్యక్సంబోధికోసం రాత్రి గడచిన తర్వాత ముప్ఫయిరెండు వేలమంది దేవపుత్రులతో కూడా రాజకుమారుడున్న ప్రాసాదం చేరి గగనతలంలోనే ఉంటూ అతనిని ఈ గాథలతో స్తుతించాడు:

"చ్యుతిదర్శితా అతియశా జన్మ చ సందర్శితం పురుషసింహ,
అంతఃపురం విదర్శితు కృతానువృత్తి త్వయా లోకే,
పరిపాచితాతిబహవో దేవమనుజలోకే ధర్మ మనుప్రాప్య,
అయ మద్య కాలసమయో నిష్క్రిమ్యే మతి విచిన్తేహి.

న హి బుద్ధ మోచయాతీ న చాంధపురుషేణ దర్శయతి మార్గః,
ముక్తస్తు మోచయాతీ స చక్షుషా దర్శయాతి మార్గః.

యే సత్త్వ కామదాసా గృహే ధనే పుత్రభార్య పరిశుద్ధాః,
తే తుభ్య శిష్యమాణా నైష్క్రమ్యమతా స్పృహాం కుర్యుః.

ఐశ్వర్య కామ క్రీడా చతుద్వీపా సప్తరత్న విజహిత్వా,
నిష్క్రాంత త్వాం విదిత్వా స్పృహయేత్సనరామరో లోకః.

కించాపి ధ్యాన సౌఖ్యైః విహరసి ధర్మైర్నచాసి కామరతః.
అథ పున చిరప్రసుప్తాం బోధయ మరుమానుషశతాని.

అతి పలిత యౌవన మిదం గిరినది యథ చఞ్చల ప్రచలవేగా,
గతయౌవనస్య భవతో నైష్క్రమ్యమతి ర్న శోభేతే.

తత్సాధు తరణరూపే పథమే పరయౌవనేఽభినిష్క్రమ్య,
ఉత్తారయ ప్రతికాంక్షాం కురుష్వ చార్థం సురగణానాం.

న చ కామగుణ రతీభి స్తృప్తిర్లవణోద ధైర్య థామ్భోభిః,
తే తృప్త యేష ప్రజ్ఞా ఆర్యా లోకోత్తరా విరజా.

త్వమిహ ప్రియా మనాపో రాజ్ఞః శుద్ధోదనస్య రాష్ట్రస్య,
శతపత్రసదృశవదనా నైష్క్రమ్యమతిం విచిన్తేహి.

ఆదీప్త క్లేశతాపైః అనిశ్వర జైర్గాధబధ నైర్బద్ధాం,
శీఘ్రం ప్రమోక్షమార్గే స్థాపయ శాన్తే అసమవీరా.

త్వం వైద్య ధాతుకుశల శ్చిరాతురాం సత్త్వరోగ సంస్పృష్టాం,
భైషజ్య ధర్మయోగై ర్నిర్వాణసుఖే స్థపయ శీఘ్రం.

అనాథిమా అనయనాం మోహపల దృష్టిజాల బద్ధాః,
ప్రజ్ఞా ప్రదీపచక్షుః శోధయ శీఘ్రం నరమరూణాం.



సముదీక్షన్తే బహవో దేవాసుర నాగయక్షగన్ధర్వాః,
ద్రక్ష్యానుబోధిప్రాప్తం నిరుత్తరం ధర్మ శ్రోష్యామః.

ద్రక్ష్యతి చ భుజగరాజో భవనం అవభాసితం తవ శిరీయే,
కరియతి అనన్త పూజా పూరేహి వ్రతాశయ స్తస్య.

చత్వారి లోకపాలాః ససైన్యకా స్తే తవ ప్రతీక్షన్తే,
దాస్యామ చతురి పాత్రాం బోధిధ్వజి పూర్ణ మనసస్య.

బ్రహ్మ ప్రశాన్తచారీ ఉదీక్షతే మైత్ర వాక్కరుణలాభీ,
అధ్యేషిష్యే నరేంద్రం వర్తేన్తి నిరుత్తరం చక్రం,

బోధి పరిపాచికాపి చ దేవత అభితుస్తువు బోధిమణ్డేఽస్మిన్,
ఉత్పత్స్యేఽయం సత్త్వతి ద్రక్ష్యా మ్యభిబుధ్యతో బోధిం.

సత్యం మి బోధిసత్త్వా అన్తఃపురియే క్రియా విదర్శేన్తి,
పూర్వంగమో భవ త్వం మాభేష్యసి పశ్చిమ స్తేషాం.

మంజురుత మంజుఘోషా స్మరాహి దీపంకరస్య వ్యాకరణం,
భూతం తథా అవితథా జనఘోషరుతం ఉదీరేహి.''

గొప్పకీర్తికల పురుష శ్రేష్ఠుడా! నీవు తుషిత లోకంనుంచి దిగి వచ్చి భూలోకంలో నీ పుట్టుకను వెల్లడించావు. రాజాంతఃపురాన్ని చూడడానికై అక్కడనే అవతరించావు. లోకమర్యాదను కాపాడినావు. దేవలోకంలోనూ, మనుష్యలోకంలోనూ ఉన్న చాలామంది నీవు బోధించే ధర్మాన్ని పొంది పరిపాకం పొందారు. అభినిష్క్రమణానికి ఇదే నీకు తగిన సమయం. ఈ విషయాన్ని గమనించు. తాను బద్ధుడై వున్నవాడు పైవారికి బంధమోక్షం చెయ్యలేడు. గ్రుడ్డివాడు మార్గాన్ని ఎట్లు చూపగలడు? విడుదల పొందినవాడే యితరులను విడిపించుతాడు. కన్నులున్నవాడే మార్గాన్ని చూడగలడుగదా! కోరికలకు దాసులై వుండి గృహంపైనీ, ధనంపైనీ, భార్యాపుత్రులపైనీ ఎక్కువ శ్రద్ధచూపే

ప్రాణులు నీకు శిష్యులుగా చేరి అభినిష్క్రమణం చెయ్యవలెననే కోరికను పొందుతారు. నీవు ఐశ్వర్యాన్నీ, కామోపభోగాలనూ, నాల్గు ద్వీపాల భూమండలాన్నీ, సప్తరత్నాలనూ విడిచివేసి, అభినిష్క్రమణం చేసిన విషయాన్ని తెలుసుకొని నరులతోనూ, దేవతలతోనూ కూడివున్న లోకానికి కూడా, అభినిష్క్రమణం చేయవలెననే కోరిక కలుగుతుంది. నీవు ధ్యాన సౌఖ్యాలతోనూ, ధర్మాలతోనూ విహరిస్తూ వున్నావు. కోరికల యెడల ఆసక్తి లేదు. కామరతుడివి కాలేదు. చాలకాలంనుంచి నిద్రావస్థలో పడి, వందల సంఖ్యలో వున్న దేవతలనూ, మనుష్యులనూ మేల్కొల్పు. యౌవనమనేది వేగంగా పతితమవుతుంది. సెలయేటివలెనే మిక్కిలి చంచలమై వేగంగా జరిగిపోతుంది. నీ యౌవనం గతించిపోయాక అభినిష్క్రమణం చెయ్యాలనే బుద్ధి శోభించదు. తరుణ రూపమైన నవయౌవనంలోనే అభినిష్క్రమణం చెయ్యడం మేలు. సురగణాల కోరికను నెరవేర్చి, వారిని తరింపజేయి. వాళ్ళపనిని సఫలం చెయ్యి. నీ ప్రతిజ్ఞను నిలబెట్టుకో. సముద్రానికి ఎంత నీరు వచ్చినా తృప్తికలుగనట్లు ప్రాణులకు కామగుణ రతులవల్ల ఎంతమాత్రమూ తృప్తి లేదు. వారికి ఉత్తమమూ, లోకోత్తమూ, రజోగుణం లేనిదీ అయిన ప్రజ్ఞను ప్రసాదించి తృప్తి పొందించు. శతపత్రపద్మంతో సమానమైన ముఖం కల రాజకుమారా! శుద్ధోదన మహారాజుకూ, రాష్ట్రానికంతటికీ నీవు చాలా ప్రియమైనవాడివి. అభినిష్క్రమణంలో మనస్సు ఉంచు. క్లేశతాపాలచేత తపించిపోతూ, దిక్కూ మొక్కూ లేక, గట్టి బంధనాలతో కట్టబడిన ప్రజలను — ఓ గొప్ప వీరుడా! శాంతమైన మోక్షమార్గంలో నిలువు. చాలాకాలంనుంచీ సంసారరోగాలతో బాధపడుతూ రోగగ్రస్తమై వున్న ప్రజకు చికిత్స చెయ్యడంలో నీవు ధాతుకుశలతగల వైద్యుడివి. వారికి ధర్మ రూపమైన ఔషధ యోగాలు ఇచ్చి వేగంగా నిర్వాణ సుఖాన్ని అనుగ్రహించు. దేవతలూ, మనుష్యులూ — అందరూ కూడా అజ్ఞానంచేత మోహాకులమైన దృష్టి అనే వలలో తగులుకొన్నవారై కన్నులు కానరాక అంధతమనస్సులో ఉన్నారు. వేగంగా వారికి ప్రజ్ఞాప్రదీపం అనే చక్షుస్సును అనుగ్రహించి ఉద్ధరించు. బోధిప్రాప్తిని చూడగలమనీ, లోకోత్తర



మైన ధర్మాన్ని వినగలమనీ చాలామంది దేవతలూ, అసురులూ, నాగులూ, యక్షులూ, గంధర్వులూ నిరీక్షిస్తూ వున్నారు. ఐశ్వర్యంతో అవభాసిస్తూ వున్న నీ భవనాన్ని నాగరాజు చూస్తున్నాడు. అనంతుడు నిన్ను గొప్పగా పూజిస్తున్నాడు. అతని ఆశయాన్ని నెరవేర్చు. సమ్యక్సంబోధిలో పూర్ణమైన మనస్సు గల నీకు నాల్గు పాత్రములు ఇయ్యవలెనని నలుగురు లోకపాలకులూ ససైన్యంగా నీకోసం యెదురుచూస్తూ వున్నారు. రాజకుమారుడు సాటిలేని ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేయాలని కోరుతాను అంటూ ప్రశాంతంగా ప్రవర్తించే బ్రహ్మ నీ మైత్రీసంభాషణనూ, కరుణనూ కోరి నిరీక్షిస్తున్నాడు. 'ఇతడు అభినిష్క్రమణం చేసి రాగా, సమ్యక్సంబోధిని తెలుసుకోగల' మని బోధిపరిపాచితులైన దేవతలు ఈ బోధిమండలంలో నిన్ను ప్రశంసిస్తున్నారు. ఓ బోధిసత్త్వుడా! అంతఃపురంలో అనుకూలమైన సంఘటనలు ఏర్పడ్డాయి. నీవు ముందు నడువుము. వాటికి వెనుకగా వుండవద్దు. ఓ మధురఘోషుడా! దీపంకరబుద్ధుని మాటలను స్మరించు. ఆ దీపంకరుని మాటలు భూతకాలంలో వ్యర్థం కాని జినఘోషరవాన్ని తెలుపుతున్నవి.''

ఇది లలితవిస్తరంలో సంచోదనా పరివర్తం అనే పదమూడవ అధ్యాయం.

# 14. స్వప్న పరివర్తం

హ్రీదేవుడనే పేరు గల ఆ దేవపుత్రుడు ఈ విధంగా బోధిసత్త్వునికి ప్రోత్సాహం కలుగజేసి, శుద్ధోదన మహారాజుకు ఒక కల వచ్చేటట్లు చేసినాడు. ఆ రాత్రి శుద్ధోదన మహారాజు నిద్రపోతూ ఒక కల గన్నాడు—రాత్రి బాగా మాటుమణిగి ప్రశాంతంగా వున్న సమయంలో సిద్ధార్థుడు దేవగణాలతో కూడా అభినిష్క్రమణం చేస్తున్నట్లూ, అభినిష్క్రమణం చేసి సన్యాసియై, కాషాయ వస్త్రాలు ధరించినట్లున్నూ. ఈ విధంగా కల గని ఆయన వెంటనే తెలివితెచ్చుకొని తొందర తొందరగా కంచుకిని ప్రశ్నించాడు "కుమారుడు అంతఃపురంలో వున్నాడా లేడా?" అని. 'అంతఃపురంలోనే వున్నారు' అని కంచుకి జవాబు చెప్పాడు.

తర్వాత అంతఃపురంలో వుండిన శుద్ధోదన మహారాజు మనస్సులో శోకం అనే శల్యం ప్రవేశించింది. ఈ పూర్వనిమిత్తాలనుబట్టి 'కుమారుడు ఇల్లు విడిచిపోవడం నిశ్చయం' అని అతని మనస్సుకు బాగా తట్టింది.

కుమారుడు అంతఃపురాన్ని విడిచి ఉద్యానవనానికి కూడా వెళ్ళకుండా వుండేటట్లు చూడాలనీ, ఆ రీతిని అంతఃపురంలోనే స్త్రీల మధ్యను వుంటే వాళ్ళతోనే వినోదంగా కాలం గడుపుతూ ఇల్లు విడిచి పోడనీ అతనికి ఆలోచన తోచింది.

అందువల్ల ఆ మహారాజు కుమారుని సుఖానుభవంకోసం మూడు భవనాలను కట్టించాడు. వాటిలో ఒకటి వేసవిభవనం! మరొకటి వర్షాకాలపుభవనం! ఇంకొకటి హేమంతకాల భవనం! వేసవికాలపు భవనంలో ఎప్పుడూ చాలా చల్లగా వుంటుంది. వర్షాకాలపు భవనంలో శీతోష్ణాలు సమానంగా వుంటాయి. శీతకాల (హేమంతకాల) భవనంలో వెచ్చగా ఉంటుంది. ఈ మూడు భవనాలకూ వేరే వేరే బల్లల మెట్లు వున్నాయి. అవి భవనాలకు వెయ్యడానికీ, తియ్యడానికీ తగినట్లున్నాయి. వాటిని భవనాలకు అమర్చడానికీ, తీసివేయడానికీ అయిదేసి వందలమంది మనుష్యులు నియమించబడి వున్నారు. వాటిని తీసేటప్పుడూ, వేసేటప్పుడూ పెద్దధ్వని అవుతూ వుంటుంది. అది అర్ధయోజన దూరం వినబడుతుంది. కుమారుడు తనకు తెలియకుండా అభినిష్క్రమణం చెయ్యకూడదనే సంకల్పంతోనే శుద్ధోదనమహారాజు యిలాటి యేర్పాటు చేశాడు. "నగరం మంగళద్వారంనుంచి రాజకుమారుడు అభినిష్క్రమణం చేస్తాడు" అని దైవజ్ఞులూ, శకునం తెలిసినవారూ (నిమిత్తజ్ఞులు, వైపంచికులు) చెప్పడంవల్ల మహారాజు ఆ ద్వారానికి పెద్దపెద్ద తలుపులు పెట్టించాడు. ఒక్కొక్క తలుపు ముయ్యడానికీ, తెరవడానికీ అయిదువందలమంది మనుష్యులు నియమించబడ్డారు. తలుపులు వేసేటప్పుడూ, తీసేటప్పుడూ పెద్ద ధ్వని కలుగుతుంది. అది అర్ధయోజనందూరంవరకూ వినబడుతుంది. అయిదువందలమంది రాజకుమారుని గుణాలను ప్రశంసిస్తూ వుంటారు. యువతులు ఎప్పుడూ గీతాలు పాడుతూ, వాద్యాలు వాయిస్తూ రాజకుమారుని అనుసరించే వుంటారు.

భిక్షులారా, ఇలా వుండగా ఒకప్పుడు బోధిసత్త్వుడు సారథిని పిలిచి "సారథీ! త్వరగా రథాన్ని సిద్ధం చెయ్యి, నేను ఉద్యానవనాన్ని చూడడానికి వెళ్ళవలసివున్నది" అని ఆదేశించాడు. సారథి వెంటనే శుద్ధోదన మహారాజువద్దకు పోయి యీ సమాచారాన్ని తెలియజేశాడు.

అప్పుడు రాజు మనస్సులో ఒక ఆలోచన తోచింది : "ఇదివరకు ఎప్పుడూ నేను కుమారుణ్ణి చక్కని దృశ్యాలు చూడడంకోసం ఉద్యానవనానికి పంపలేదు. నేనిప్పుడు అతనిని పంపితే—స్త్రీలతో కూడా అక్కడికి వెళ్ళి వినోదంగా కాలం గడిపి వస్తాడు. సుఖమనేది తెలుసుకుంటాడు. అప్పుడు గృహాన్ని విడిచి పోవాలనే బుద్ధి అతనికి పుట్టకపోవచ్చును."

తర్వాత శుద్ధోదన మహారాజు బోధిసత్త్వునియందు తనకు వుండే గౌరవంతోనూ, స్నేహంతోనూ ఘనంగా చాటింపు చేయించాడు.

"నేటికి ఏడవనాడు రాజకుమారుడు చక్కని దృశ్యాలు చూడడానికి ఉద్యానవనానికి వెళ్ళుతాడు. మీ రందరూ, చూడరానివాటి నన్నిటిని తొలగించాలి. రాజకుమారుడికి ప్రతికూలదృశ్యా లేవీ కనబడకూడదు. రమ్యంగా వుండేవాటినే వుంచాలి" అని.

ఏడవనాటికి పట్టణమంతా చక్కగా అలంకరించబడింది. ఉద్యానవనం కూడా చక్కగా అలంకరించబడింది. రంగు రంగుల మేలుకట్లూ, ఛత్రాలూ, ధ్వజపతాకాలూ తగినచోట్ల ఉంచబడినవి. ఉద్యానవనానికి వెళ్ళే మార్గం చక్కగా చిమ్మబడింది. దానిపైని ఒత్తుగా గంధోదకాలు చల్లారు. మార్గంపైని పువ్వులు చల్లి గంధ ఘటికలతో ధూపాలు వేశారు. పూర్ణకుంభాలు ఉంచారు. అరటిచెట్లు కట్టారు. మేలుకట్లు కట్టారు. రత్నాలతోనూ, మువ్వలతోనూ, వాటికి హారాలూ అర్ధహారాలూ చిత్రవిచిత్రంగా వ్రేలకట్టారు, చతురంగసైన్యమూ, రాజ పరివారమూ రాజకుమారుడు వుండే అంతఃపురాన్ని చక్కగా అలంకరించారు. అప్పుడు శుద్ధావాసకాయికులైన దేవపుత్రులు మాత్రం బోధిసత్త్వుని గృహంనుంచి తీసుకుపోవాలనే సంకల్పంతో వున్నారు. బోధిసత్త్వుడు గొప్ప సంరంభంతో కపిలవస్తు మహానగరం తూర్పు ద్వారంనుంచి ఉద్యానవనానికి బయలుదేరాడు.

బోధిసత్త్వుని అభిప్రాయాన్ని అనుసరించే శుద్ధావాసకాయికులైన దేవపుత్రులు, అతడు వెళ్ళే మార్గంలో ఒక మనుష్యుణ్ణి నిలిపారు. అతడు చాలా ముసలివాడు. అవయవాలు జీర్ణించిపోయాయి. శరీరంలోని నరాలన్నీ బయటపడుతున్నాయి. దంతాలు వూడిపోయాయి. దేహమంతా ముడతలుపడి వున్నది. ఒళ్ళంతా నరాలు బయటపడ్డాయి. తల పూర్తిగా నెరిసిపోయింది. మనిషి చాలా పొట్టిగా కానవస్తున్నాడు. ఇంటికొప్పువలె వక్రమైన ఆకారం కలిగి, యవ్వనం నశించినందున తత్తరపాటు పొందుతూ కర్ర వూతగా పట్టుకుని గురగురమని ధ్వనిచేసే కంఠంతో అవయవాలన్నీ మిక్కిలి వణకుతూ వున్నాడు. అతణ్ణి దారి మధ్యలో నిలిపి వుంచారు.



బోధిసత్త్వుడు ఆ వ్యక్తిని చూచి విషయం తెలిసినప్పటికీ సారథితో ఇట్లన్నాడు: "సారథీ! ఈ మనిషి చాలా దుర్బలంగానూ, తక్కువ శక్తి కలవాడుగానూ వున్నాడు. మాంసం కుష్కించిపోయింది. రక్తం యింకిపోయింది. నరాలతో కట్టిన తోలువలెనే ఉన్నాడు. తల బాగా నెరిసిపోయింది. దంతాలు వూడిపోయాయి. శరీరం పూర్తిగా చిక్కిపోయింది. రూపం వికారంగా వున్నది. మిక్కిలి శ్రమపడుతూ, జారుతూ జారుతూ, కర్ర పట్టుకొని నడుస్తూ వున్నాడు. ఎందుచేత ఇలా వున్నాడు?" అని.

"ఓ దేవా! ఈ పురుషుణ్ణి ముసలితనం లోబరచుకొన్నది. ముసలివాళ్ళకు ఇంద్రియాలు క్షీణించిపోతాయి. బలమూ, శక్తీ క్షీణిస్తాయి. ఎక్కువ శ్రమ కలుగుతుంది. అతన్ని ఎవరూ ఆదరించరు. దగ్గరి బంధువులు కూడా విడిచిపెట్టి పోతారు. అతడు ఏ పనినీ చెయ్యలేడు. అడవిలో విడిచిపెట్టిన దుంగవలెనే వుంటాడు" అని సారథి రాజకుమారుడితో అన్నాడు.

తర్వాత బోధిసత్త్వుడు "ఈ విధంగా ముసలివాడుగా కావడం కులధర్మమా? ఇలా కావడంవల్ల యితడికి మేలు కలుగుతుందా? లేకపోతే—యిలా కావడం లోకసామాన్యమైన పరిపాటియా? దీనిని గురించి త్వరగా చెప్పు. నీవు చెప్పినది విని దీని కారణాన్ని గురించి యోచిస్తాను" అని సారథిని ప్రశ్నించాడు.

"దేవా! ఇది కులధర్మం కాని, రాష్ట్రధర్మం కాని కాదు. లోకంలో యవ్వనం గల అందరినీ కూడా ముసలితనం ఆక్రమిస్తుంది. మీరూ, మీ తల్లిదండ్రులూ, బంధువులూ, జ్ఞాతివర్గం అందరూ దీనికి లొంగవలసినదే! ముసలితనం ఎవ్వరినీ విడిచిపెట్టదు. దానికి లొంగిపోవడం తప్ప ఎవ్వరికీ గత్యంతరం లేదు" అని సారథి చెప్పినాడు.

అప్పుడు బోధిసత్త్వుడు సారథితో ఇలా అన్నాడు—"చూడు సారథి! అవిద్వాంసులైన యీ జనులు బాలురవలెనే ఏమాత్రమూ తెలిసికోలేని స్థితిలో వున్నారు. యవ్వనం వున్నప్పుడు మదంచేత కొవ్వి, తమకు ముసలితనం రాబోతుందని గమనించలేకున్నారు. రథాన్ని వెనుకకు

త్రిప్పివేయి. పట్నంలోకే పోదాము. ముసలితనం కాచుకొని వున్న నాకు యీ విలాసాలతోనూ, వినోదాలతోనూ ఏమి నిమిత్తం వుంది గనుక!''

రాజకుమారుని ఆజ్ఞప్రకారం సారథి రథాన్ని వెనుకకు తిప్పాడు. వారు తిరిగి పట్నంలో ప్రవేశించారు.

మరొకప్పుడు బోధిసత్త్వుడికి ఉద్యానవనానికి వెళ్ళాలనే సంకల్పం తిరిగి కల్గింది. ఈ సారి నగరం దక్షిణద్వారంగుండా పెద్ద సన్నాహంతో బయలుదేరాడు. మార్గంలో అతనికి వ్యాధిగ్రస్తుడైన ఒక మనిషి కనబడ్డాడు. అతని కడుపు ఎండిపోయి వున్నది. శరీరం శుష్కించిపోయింది. అతడు మలమూత్రాలు విసర్జిస్తూ వాటిలోనే పడి వున్నాడు. ఎంతో కష్టంమీద ఉచ్ఛ్వాస నిశ్వాసాలు జరుపుతూ దిక్కులేని స్థితిలో వున్నాడు. ఆ వ్యక్తిని చూచి బోధిసత్త్వుడు సారథితో ఇలా అన్నాడు:

''ఓ సారథీ! ఈ పురుషుడు రోగంచేత వివర్ణశరీరుడై వున్నాడు. అవయవాలన్నీ వికలాలయిపోయాయి. ఎంతో కష్టంగా శ్వాస వస్తున్నది. అంగాలన్నీ శుష్కించిపోయాయి. పొట్ట ఎండి వున్నది. చాలా కష్టస్థితిని పొంది వున్నాడు. చాల అసహ్యంగా తాను విసర్జించిన మలమూత్రాల లోనే పడి వున్నాడు. ఇలా వుండడానికి కారణం ఏమిటి?''

అప్పుడు సారథి ''దేవా! ఈ పురుషుడు చాలా దుర్బలుడు. వ్యాధిగ్రస్తుడై మరణించే స్థితిలో వున్నాడు. బలం క్షీణించిపోయింది. ఆరోగ్యం పోయింది. తేజస్సు నశించింది. రక్షణ లేదు. భూమియే ఇతనికి దిక్కు. దేనిపైనీ ఆసక్తి వుండదు'' అని చెప్పాడు.

''ఆరోగ్యమనేది స్వప్నంవలెనే భాసిస్తున్నది. వ్యాధి భయంకరమైనది. అది మనిషిరూపాన్ని చాలా ఘోరంగా మార్చివేస్తుంది. విజ్ఞుడైనవాడు ఇట్టి అవస్థను చూస్తూ వినోదించడానికి ఎలా సంకల్పించుకోగలుగుతున్నాడో? శుభాలు ఎలా పొందగలుగుతున్నాడో? ఆశ్చర్యం!'' అని బోధిసత్త్వుడు పలికి మరి ఉద్యానవనానికి వెళ్ళడానికి మనస్సుపోక రథాన్ని పట్టణానికి మళ్ళించి రాజభవనం ప్రవేశించాడు.



భిక్షులారా! మరికొంతకాలానికి బోధిసత్త్వుడికి తిరిగి ఉద్యానవనానికి వెళ్ళాలనే బుద్ధి పుట్టింది. ఈ సారి కూడా గొప్ప సన్నాహంతో బయలుదేరాడు. కాని, వెనుకటి ద్వారాలగుండా కాకుండా పడమటి ద్వారమార్గంగా ప్రయాణం సాగించాడు. దారిలో అతనికి ఒక పురుష శవం కనబడ్డది. దాన్ని మంచంపై (పాడెపై) వుంచి కొందరు మోసుకొని పోతున్నారు. మంచంపై ఒక గుడ్డను మేలుకట్టుగా కట్టారు. దాని వెనుక బంధువులు నడుస్తున్నారు. వారు ఏడుస్తూ, అరుస్తూ, విచారిస్తూ, జుత్తు విరియబోసుకుని, తలమీద దుమ్ము చల్లుకుంటూ, రొమ్ము బాదుకొంటూ నడుస్తున్నారు. ఇదంతా చూచి బోధిసత్త్వుడు సారథితో ఇలా అన్నాడు.

''ఓ సారథీ! ఈ మనుష్యుని యిలా మోసుకొనిపోతున్నారు. జుత్తు విరియబోసుకుని మట్టిని తీసి తలమీద పోసుకుంటున్నారు. వెనుక వెళ్లుతూ రొమ్ము బాదుకుంటూ అనేక విధాలుగా విలాపవాక్యాలు పలుకుతూ వున్నారు. దీనికి కారణం ఏమిటి?'' అని.

సారథి యిలా అన్నాడు—''ఓ దేవా! జంబూద్వీపంలో వున్న యీ మనుష్యుడు మరణించాడు. ఇతడు తిరిగి తల్లిదండ్రులను గాని, భార్యాపుత్రులను గాని చూడలేడు. భోగగృహ మిత్రజ్ఞాతి సంఘాన్ని వదిలి వెళ్ళిపోతున్నాడు. మృతునికి వేరే సహాయం ఎవరూ వుండరు. మరణించినవాడు పరలోకానికి పోతాడు. అతడు బంధువులనుగాని, మిత్రులనుగాని, జ్ఞాతులనుగాని మరల చూడలేడు.''

అప్పుడు బోధిసత్త్వుడు ''యవ్వనం గాని ముసలితనంగాని అసహ్యమైనవే. రెండూ పరుగెత్తిపోయేవి. ఆరోగ్యం అటువంటిదే. అది అనేక విధాల రోగాలమూలంగా చెడిపోతుంది. జీవితం వ్యర్థమైనది. అస్థిరుడైన విద్వాంసుడివల్లా ప్రయోజనం లేదు. పండితుని రతిప్రసంగాలు నిరుపయోగాలు. ముసలితనంగాని, రోగంగాని, మృత్యువుగాని లేకపోయినా దుఃఖమనేది తప్పదు. రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా సంస్కారములనే పంచస్కంధాలూ వుండినా అంతే. ఇక జరామరణాలతోనూ, వ్యాధుల

తోనూ కొట్టుమిట్టాడుతున్నవారి సంగతి చెప్పనక్కరలేదు. నేను వెనక్కు తిరిగి వెళ్ళిపోయి మోక్షమార్గాన్ని గురించి ఆలోచిస్తాను'' అని పల్కినాడు.

భిక్షులారా! ఈ విధంగా మరికొంచెం కాలం గడిచింది. బోధిసత్త్వుడికి ఉద్యానవనానికి పోవాలని మళ్ళీ బుద్ధి పుట్టింది. ఈసారి అతడు నగరం ఉత్తరద్వారంనుంచి బయలుదేరాడు. దేవపుత్రులు అతడు వెళ్ళే మార్గంలో యీ సారి ఒక భిక్షువును ఉంచారు. ఆ భిక్షువు శాంతుడు. దాంతుడు. ఓరిమికలవాడు. బ్రహ్మచారి. చలనంలేని చూపుతో యుగమాత్రదూరమే చూస్తూ వున్నవాడు. మేలైన తపోమార్గాన్ని అనుసరించి ప్రసాదగుణంగల అభిక్రమ ప్రతిక్రమాలతో వున్నవాడు. స్వచ్ఛములైన అవలోకిత వ్యవలోకితాలతో వున్నవాడు. అతడు చీవరాలు, భిక్షాపాత్ర ధరించి ఉన్నాడు.

అట్టి బిచ్చగానిని చూచి బోధిసత్త్వుడు సారథితో ''ఓ సారథీ! ఈ పురుషుడు మిక్కిలి శాంతచిత్తుడుగా ఉన్నాడు. కన్నెత్తి చూడడం లేదు. అతనిచూపు యుగమాత్రదూరం ప్రసరిస్తున్నది. కావివస్త్రాన్ని ధరించి వున్నాడు. ప్రశాంతంగా తిరుగుతున్నాడు. పాత్రాన్ని పట్టుకొన్నాడు. ఉద్ధతుడుగాగాని, ఉన్నతుడుగాగాని లేడు. ఇతడు ఎవ్వడు?'' అని అడిగాడు.

అప్పుడు సారథి ''దేవా! ఇతడు ఒక భిక్షువు. ఇతడు కామసుఖాలను విడిచిపెట్టి వినీతుడుగా వుంటూ సన్యాసాన్ని స్వీకరించాడు. అందరినీ తనతో సమానంగా చూస్తూ, రాగద్వేషాలు విడిచి ఉన్నాడు. పిండచర్యతో (అన్నపుకబళాలు యాచించి తిని) జీవిస్తున్నాడు'' అని అన్నాడు.

బోధిసత్త్వుడు ఇలా అన్నాడు—''సారథీ! నీవు చెప్పినది చాలా బాగుగా ఉన్నది. ఈ పద్ధతే నాకున్నూ చాలా ఇష్టంగా ఉన్నది. సన్యాసాన్నే విద్వాంసు లందరూ ఎంతగానో ప్రశంసిస్తారు. దానివల్ల తనకూ, తనవల్ల ఇతరులకూ మేలు కలుగుతుంది. జీవితం సుఖమయంగా



ఉంటుంది. మధురంగానూ ఉంటుంది. దానివల్ల అమృతమయమైన ఫలం లభిస్తుందికూడా.''

ఈ విధంగా పలికి అతడు రథాన్ని వెనుకకు మళ్ళించి పట్నంలో ప్రవేశించాడు.

భిక్షులారా! బోధిసత్త్వునికి కలిగిన యీ విధమైన నిష్క్రమణార్థమైన ప్రోత్సాహం శుద్ధోదనమహారాజునకు తెలిసింది. అతడు ఎంతో ప్రయత్నించి ఇతడు వెళ్ళిపోవడానికి వీలులేకుండా ప్రాకారాలను బలంగానూ, ఎత్తుగానూ కట్టించాడు. అగడ్తలను లోతుగా త్రవ్వించాడు. ద్వారాః దిట్టంగా వుండేటట్లు ఏర్పాటు చేయించాడు. రక్షకులను ఆ యా స్థలాల్లో వుంచాడు. శూరులను హెచ్చరించాడు. వాహనాలను నియమించాడు. కవచధారులను ఏనుగులమీద కావలిపెట్టించాడు. నాలుగు నగరద్వార చతుష్పథాలలోనూ బోధిసత్త్వుని పరిరక్షణార్థమై పెద్ద సైన్యాలను నిలిపాడు. ఆ వీరభటులు రాత్రింబగళ్ళు బోధిసత్త్వునికి కాపలా కాస్తూ వున్నారు. బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చెయ్యకుండా చూస్తూ వున్నారు. ఒకప్పుడూ కూడా సంగీతాన్ని నిలపకూడదని మహారాజు అంతఃపురానికి కట్టడ చేశాడు. సమస్తములైన వినోదాలనూ, ఆనందాన్ని ఇచ్చే క్రీడలనూ ఎప్పుడూ నిలిపివేయకూడదనీ, రాజకుమారుడు అనురక్తచిత్తుడై వుండేటట్లున్నూ, సన్యాసంవైపు అతని మనస్సు పోకుండా వుండేటట్లున్నూ చూడాలనీ హెచ్చరించాడు.

ఇక్కడ కొన్ని శ్లోకాలు పెద్దలు చెప్పేని ఇలా ఉన్నాయి:

''ద్వారే స్థాపితయుద్ధశౌండ పురుషాః ఖడ్గాయుధాపాణయో
హాస్తీ అశ్వరథాశ్చ వర్మితనరా ఆరూఢ నాగావళీ,
పరిఖా ఖోటక తోరణాశ్చ మహతా ప్రాకార ఉచ్ఛ్రాపితా
ద్వారాబద్ధ సుగాఢబంధనకృతాః క్రోశస్వరా ముంచనాః.
సర్వే శాక్యగణా విషణ్ణమనసో రక్షంతి రాత్రిందివం
నిర్ఘోషశ్చ బలస్య తస్య మహతః శబ్దో మహాన్ శ్రూయతే,

నగరం వ్యాకుల భీతత్రస్తమనసో మాస్మాద్ర్వజేత్సూరతో
మా భూ చ్ఛాక్యకులోదితస్య గమనే ఛిద్యేత వంశోఽహ్యాయం.
ఆజ్ఞాప్తో యువతీజనశ్చ సతతం సంగీతి మాఛేత్స్వథాః
వ స్థానం ప్రకరోథ క్రీడరతిభిః నిర్బంధథా మానసం,
యే వా ఇస్త్రియ మాయ నేకవివిధా దర్శేథ చేష్టాం బహుం
ఆరక్షాం ప్రకరోథ విఘ్న కురుథా మాఖు ప్రజేత్సూరతః.”

ఈ శ్లోకాల, మరికొన్నింటి శ్లోకాల తాత్పర్యం ఇది:

ఆ యా ద్వారాల్లో ఖడ్గపాణులూ యుద్ధనిపుణులూ అయిన వీర పురుషులు నియమించబడినారు. రథాశ్వగజపదాతులనే చతురంగ సైన్యమూ, వీరులు అధిష్ఠించిన ఏనుగులూ, ఏర్పరచబడినవి. అగడ్తలు లోతుగా త్రవ్వబడినవి. ఖోటకాలూ, తోరణాలూ దిట్టపరచబడినవి. ప్రాకారాలూ బలపరచబడినవి. ద్వారాలకు గట్టి తలుపులు పెట్టబడినవి. ఆ తలుపులచప్పుడు క్రోసుదూరము వినవస్తుంది.

శాక్యవంశానికి చెందినవారందరూ చాలా విచారంతో వుండి రాత్రిందివం రాజకుమారుణ్ణి కాపాడుతున్నారు. సేనల సందడివల్ల పెద్ద ధ్వని వినవస్తూ వున్నది. నగరంలో వున్న జనులు అందరూ, రాకుమారుడు అభినిష్క్రమణంచేస్తే వంశవిచ్ఛేదం కలుగుతుందని వ్యాకులమైన మనస్సుకలవారై చాలా భయపడుతూ ఉండినారు.

ఒకప్పుడూ కూడా సంగీతాన్ని విడిచిపెట్టకూడదని అంతఃపురంలోని యువతీజనానికి రాజాజ్ఞ అయినది. అనేకములైన క్రీడలతోనూ, వినోదాలతోనూ రాజకుమారుని మనస్సును అరికట్టవలసినదని వారిని మహారాజు కోరాడు. అనేకములైన స్త్రీ మాయలను చూపి అతనిని వశం చేసుకొనవలెననీ రాజకుమారుణ్ణి రక్షిస్తూ, అతడు సన్యాసం స్వీకరించడానికి విఘ్నాలు కలిగించవలెననీ శుద్ధోదనుడు కోరాడు.

లోకాన్ని మంచి మార్గంలో నడపడానికి సారథి అయిన బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చేయబోయే సమయంలో కొన్ని నిమిత్తాలు



కనిపించాయి. హంసలూ, క్రౌంచపక్షులూ, నెమిళ్లూ, గోరువంకలూ, చిలుకలూ మొదలైన పక్షులు ఏమాత్రమూ ధ్వని చెయ్యడంలేదు. మేడల మీది గవాక్షాలలోనూ, తోరణాలమీదా, మంచెలమీదా జనులు కలత పడిన మనస్సులతో ఏమాత్రం నెమ్మదిలేక తలలువంచుకొని ఏదో ఆలోచిస్తూ వుండినారు.

తామరకొలకులలో పద్మాలు ముకుళించుకొనిపోసాగినాయి; వాడిపోసాగినాయి. చెట్ల ఆకులు ఎండి రాలిపోయి, పూవులూ కనబడకుండా పోయాయి. ఆ చెట్లు తిరిగి పుష్పించలేదు. వీణలు మొదలైన తీగలుకట్టిన వాద్యాల తీగలు అకస్మాత్తుగా తెగిపోతూ వున్నవి. భేరి, మృదంగం మొదలైన వాద్యములను చేతితో కొట్టినా ధ్వనించడం లేదు. వాటిచర్మాలు పగుళ్ళువారుతున్నాయి.

కపిలవస్తు మహానగరం అంతా కలతపాటుతో నిద్రపోతున్నట్లుండినది. ఎవ్వరికీ గానం చెయ్యడానికి గాని, నాట్యం చెయ్యడానికి గాని మనస్సు పుట్టలేదు. మహారాజుకూడా దీనమైన మనసుతో “అయ్యో! శాక్యవంశంలో మహాధీమంతుడైన రాజపుత్రుడు వెళ్ళిపోకుండా వుండే మార్గంయేది?” అని విచారంతో ఆలోచిస్తూ వుండినాడు.

ఆ సమయంలో బోధిసత్త్వుడూ, అతనిభార్య గోపా ఏకశయనంపైనే వుండినారు. అప్పుడు అర్ధరాత్రి సమయం. గోపకు ఒక కల వచ్చింది. ఆ కలలో ప్రపంచం అంతా కంపించిపోతున్నట్లూ, పర్వతాలు చలిస్తున్నట్లూ, వృక్షాలు వేళ్ళతోకూడా గాలికి పెల్లగిలిపోతున్నట్లూ ఆ స్వప్నం. సూర్యచంద్రులు నక్షత్రాలతో కూడా భూమిపైని పడిపోయినట్లూ, దక్షిణంవైపు జుట్టు వూడిపోయినట్లూ, కిరీటం భుజంపైని జారిపడిపోయినట్లూ, తన కాళ్ళూ, చేతులూ ఛేదింపబడినట్లూ, తాను నగ్నంగా వున్నట్లూ, తన మెడలోని ముత్యాలహారమూ, నడుములోని మణుల మొలనూలూ తెగిపోయినట్లూ ఆమె కలగన్నది. రాజకుమారుడు కోళ్ళు విరిగిపోయిన మంచంమీదిమంచి భూమిపైని పడిపోయి, అక్కడే పండుకొని వున్నట్లూ, రత్నచిత్రములు విరిగినట్లూ, రాజచిహ్నాలయిన ఛత్రమూ, దండమూ భిన్నములైపోయినట్లూ, ఆభరణాలన్నీ నేలపైని

చెల్లాచెదురుగా పడిపోయినట్లూ, రాజకుమారుని వస్త్రాలూ, కిరీటమూ నీటిలో పడిపోయినట్లూ, కల గని ఆమె పడకపైని ఎంతో విచారంతో ఉండినది. కపిలవస్తు నగరంనుండి ఒక తేజోరేఖ (ఉల్క) ఎక్కడికో పోయినట్లూ, పట్నం అంతా అంధకారబంధురం అయినట్లూ, రత్న జాలికలు ఛిన్నాలైనట్లూ, పెద్దముత్యాలహారం తెగిపడిపోయినట్లూ, మహాసముద్రం కల్లోలితమైనట్లూ, మేరుపర్వతం తన స్థానాన్ని తప్పి కంపించినట్లూ ఆమెకు స్వప్నం వచ్చింది.

శాక్యకన్య అయిన గోప యిటువంటి కలలను కన్నదై, స్వప్నానంతరం మేలుకొని, ప్రక్కనే వున్న భర్తను నిదానించి చూచి, తనకు వచ్చిన స్వప్నాలను వివరించి చెప్పి "దేవా! ఇలాంటి స్వప్నాలవల్ల ముందు ముందు ఎలాంటి ఫలితాలు కలుగుతాయో చెప్పండి. నాకు చాలా కలతగా వున్నది. నా స్మృతి భ్రమించినది. మనస్సు శోకార్దితం. ఎంతో దుఃఖం కలుగుతూవున్నది" అని అన్నది.

కలవింకంవలెనూ, దుందుభివలెనూ గంభీరమైన బ్రహ్మస్వరం గల సర్వార్థసిద్ధుడు గోపతో యీ రీతిగా అన్నాడు. "గోపా! ఇలాంటి స్వప్నాలు వచ్చినందుకు చాలా సంతోషించు. వీటివల్ల నీకు ఏమీ చెరుపు కలగదు. పూర్వజన్మలో ఎంతో పుణ్యం చేసుకున్నవారికే ఇట్టి కలలు వస్తూ వుంటాయి. సామాన్యులకు ఇట్టి మంచికలలు ఎన్నడూ రావు.

భూమి కంపించిపోతున్నట్లూ, కొండలు భూమిమీదనుంచి పడిపోతున్నట్లూ నీకు కలరావడంవల్ల దేవ నాగ రాక్షస భూతాదుల సంఘాలు నిన్ను పూజించి శ్రేష్ఠురాలినిగా చేస్తారని తెలుసుకో. వ్రేళ్లు పెల్లగిలి చెట్లు పడిపోయినట్లూ, దక్షిణభాగంలో కేశాలు వూడిపోయినట్లూ కల వచ్చినందువల్ల క్లేశాలన్నీ నశించి నీవు దృష్టిజాలం ఉద్ధరించగలవు. ఓ గోపా! సూర్యచంద్రులు పడిపోతూ ఉన్నట్లూ, గ్రహాలూ, నక్షత్రాలూ పడిపోతూ ఉన్నట్లూ కల వచ్చినందువల్ల నీవు క్లేశాలనే శత్రువులను నశింపజేసి లోకానికి పూజ్యురాలవై కీర్తిని పొందగలవు. ఓ గోపా! ముత్యాలహారల తెగిపోయి పడినట్లున్నూ, నీవు నగ్నంగా వున్నట్లున్నూ కల వచ్చినందున నీవు శీఘ్రకాలంలోనే స్త్రీ శరీరాన్ని విడిచిపెట్టి పురుషశరీరాన్ని పొందగలవు. మంచంకోళ్ళు విరిగి



పోయినట్లూ, ఛత్రమూ, దండమూ విరిగినట్లూ, రత్నాల చిత్రములు పగిలి పాడయినట్లూ కల వచ్చినందున నాల్గు ప్రవాహాలనూ దాటి నీవు ముల్లోకాలకూ ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన నన్ను చూడగలవు. ఓ గోపా! నా నగలూ, వస్త్రాలూ అన్నీ పోయినట్లు కలకనడంవల్ల శుభలక్షణాలతో అలంకరించబడిన నా శరీరం సమస్త లోకములచేతనూ స్తుతించబడుతూ నేనై వుండడం చూడగలవు. ఓ గోపా! కపిలవస్తు మహానగరంనుంచి కోటి శత దివ్యజ్యోతులు బయటికి పోయినట్టూ, పట్నమంతా చీకటికోణంగా వున్నట్టూ నీకు కల వచ్చినందున మోహావిద్య అనే అంధకారంతో కూడిన లోకంలో ప్రజ్ఞాకాంతిని నేను ప్రసరింపజెయ్యడం చూడగలవు. ఓ గోపా! ముక్తాహారం తెగిపోయిపడినట్టూ, విచిత్రమైన స్వర్ణసూత్రం ఛిన్నమైనట్లూ కల వచ్చినందున నీవు క్లేశజాలాన్ని ఛేదించుకొని గొప్ప జ్ఞానసూత్రాన్ని ఉద్ధరించగలవు. ఓ గోపా! నీవు ఉత్తమమైన పద్ధతిలో ఎంతో గౌరవంగా పూజలుచేస్తూ వుండడంవల్ల, నీకు ఎట్టి దుర్గతి కాని, శోకం కాని కలగవు. శీఘ్రంగా ప్రీతిప్రామోద్యాన్ని పొందగలవు. పూర్వజన్మంలో నాకు నీవు దానం యిచ్చావు. అందువల్లనే నీకు ఉత్తమశీలమూ, నిత్యశాంతీ వుంటున్నవి. నా అనుగ్రహం పొందినవారందరూ ప్రీతి ప్రామోద్యలాభాన్ని పొందగలరు. బోధి కల్పాలకొద్దీ, కోట్లకొద్దీ జన్మలు, సంస్కారాలు జరిగాయి. మార్గాన్ని నేను పరిశోధించి నిర్ణయించాను. నాకు తనుపైని అనుగ్రహం కలిగేటట్లు ప్రవర్తించినవారందరూ త్రివిధాలైన అపాయాలనూ పొందకుండా తప్పుకొనగలరు. ఓ గోపా! నీవు హర్షాన్నే పొందు. దుఃఖం పొందవద్దు. తుష్టినీ, ప్రీతిప్రామోద్యాలనూ పొందగలవు. నీకు కలిగిన నిమిత్తాలన్నీ చాలా శుభప్రదమైనవి."

పుణ్యాసంపద, తేజస్సు వున్న బోధిసత్త్వుడు పూర్వం అనేక నిమిత్తాలయిన స్వప్నాలనూ కన్నాడు. అవి చాలా ఉత్తమమైనవి. పూర్వజన్మలో శుభకర్మలను అధికంగా చేసిన పురుషపుంగవులకే, అభినిష్క్రమణ సమయంలోనే అవి సంభవిస్తాయి.

అతడు, నాలుగు మహాసముద్రాలలోని నీటినీ కాలు సేతులతో కొడుతూ దాటుతూ ఉన్నట్టూ, భూమి నంతటినీ శయనంగానూ, మేరు

పర్వతాన్ని తలగడగానూ ఏర్పరచుకుని పండుకొన్నట్టూ కల గన్నాడు. ఆ స్వప్నంలో ఒక గొప్ప కాంతి ఛత్రంనుంచి ఉద్గతమై గొప్ప చీకటిలో మునిగి వుండే లోకానికి గొప్ప వెలుగును ఇచ్చినట్టూ, దానివల్ల ఉపద్రవాలూ, దుఃఖాలూ ప్రశాంతిని పొందినట్టూ కానవచ్చినది. నల్లని శుభకరమయిన ఒక ప్రాణి తన పాదాలతో రాస్తూ, నాలుగు వర్ణాలు గలదై ఏకవర్ణంగా మారినట్టూ, ఆ ప్రాణి పరమహీనమైన, జుగుప్సాకరమైన పురీషపర్వతాన్ని ఏమీ అంటకుండా దాటిపోయినట్టూ కల గన్నాడు. జలంతో పూర్తిగా నిండినవీ, కోట్లకొలదీ జలచరాలతో నిండినవీ అయి వున్న నదులను అతడు పెద్దధ్వనిచేస్తూ దాటి, అవలిఒడ్డుచేరి మంచిస్థలంలో అభయాన్నీ అశోకాన్ని స్థాపించినట్లున్నూ కల గన్నాడు. జను లందరూ ఆరోగ్యమూ, తేజస్సూ నశించి, బలహీనులై అనేక విధాలైన రోగాలతో బాధపడుతూ వుండగా, తాను వైద్యుడై అనేకములైన ఓషధులను యిచ్చి చికిత్సచేసి, వారిని రోగవిముక్తులను చేసినట్లున్నూ అతనికి కల వచ్చింది. తాను సంగ్రామమధ్యంలో విజయాన్ని పొంది మేరు పర్వతపు పానుపుపయి సింహాసనంమీద ఆసీనుడై వున్నట్టూ, శిష్యులు చేతులు జోడించుకుని తన్ను సేవిస్తూ ఉన్నట్టూ, గగనంపైని దేవతలు "ఆనందం, ఆనందం" అని పలుకుతూ ఉన్నట్టూ కూడా బోధిసత్త్వుడు కల గన్నాడు.

ఏవంవిధా సుపిని అద్రశి బోధిసత్త్వో
మంగల్య శోభనవ్రతస్యచ పారిపూరిం,
యాం శ్రుత్వ దేవమనుజా అభవన్ ప్రహృష్టాః
న చిరా ద్భవిష్యతి అయం నరదేవదేవః.

ఇలాంటి స్వప్నాలు బోధిసత్త్వునికి కలిగాయి. అతని మాంగల్య శోభనవ్రతానికి పరిపూర్తి కూడా ఏర్పడింది. దానిని విని దేవతలూ, మనుష్యులు 'ఇతడు త్వరలో నరదేవదేవుడు కాగలడు' అని సంతోషచిత్తులయారు.

ఇది శ్రీలలితవిస్తరంలో స్వప్నపరివర్తమనే పధ్నాలుగవ అధ్యాయం.

---

# 15. అభినిష్క్రమణ పరివర్తం

భిక్షులారా! తర్వాత బోధిసత్త్వుని మనస్సులో ఈ ఆలోచన కలిగింది. "శుద్ధోదన మహారాజుగారికి వివరించిచెప్పి, వారి అనుమతిని పొందకుండా గృహపరిత్యాగం చెయ్యడం అనుచితమూ, కృతఘ్నతా కూడా అవుతుంది. అందువల్ల నేను తండ్రిగారికి యీ విషయం తెలియజేస్తాను" ఈ విధంగా అనుకొని బోధిసత్త్వుడు రాత్రి మాటుమణిగిన తర్వాత తన నివాసభవనంనుండి దిగి శుద్ధోదన మహారాజుప్రాసాదానికి వెళ్లాడు. అక్కడికి వెళ్ళేసరికి యితని తేజస్సుతో ఆ భవనం నిండిపోయింది.

అప్పుడు మహారాజు మేలుకొని యీ వెలుగును చూచాడు. చూచి వెంటనే కంచుకిని పిలిచి "ఏమి కంచుకీ! అప్పుడే సూర్యుడు ఉదయించాడా యేమిటి, ఇంత వెలుగు వచ్చింది?" అని అడిగాడు. కంచుకి "దేవా! రాత్రిలో యింకా సగం అయినా కాలేదు. సూర్యునికాంతి అయితే గోడలమీదా, చెట్లమీదా నీడ వ్యాపిస్తుంది. శరీరానికి తాపాన్ని కలిగిస్తుంది. చెమట పుడుతుంది. హంసలూ, నెమిళ్లూ, చిలుకలూ, కోకిలలూ, చక్రవాకపక్షులూ ప్రత్యూషకాలంలో మధురంగా ధ్వనిచేస్తాయి. ఈ కాంతి మనోజ్ఞమైనది. నరులకూ, దేవతలకూ సుఖాన్ని కలిగించేది. సంతోషాన్నీ, శుభాన్నీ కలిగిస్తున్నది. ఎంతమాత్రమూ తాపాన్ని కలిగించడం లేదు. గోడలమీదా, చెట్లపైనీ నీడలు కానరావు. ఇక్కడ తేజోవంతుడైన-గుణభరుడైన ఆర్యుడు ప్రవేశించి వుంటాడు. ఇది నిశ్చయం" అని విన్నవించాడు.

మహారాజు విచారంతో పదిదిక్కులనూ పరికించాడు. అతనికి కమలాలవంటి కన్నులు కలవాడూ, శుద్ధసత్త్వుడూ అయిన రాజకుమారుడు కానవచ్చాడు. మహారాజు పడకమీదినుంచి లేవడానికి ప్రయత్నించాడు. కాని అది సాధ్యం కాలేదు. రాజకుమారుడు అభివందనంచేసి పితృగారవాన్ని వెల్లడించాడు.

రాజకుమారుడు తండ్రియెదుట నిలిచి యిలా అన్నాడు: "నాయనా! నా ప్రయత్నానికి విఘ్నం కలిగించవద్దు. మీరు ఎంతమాత్రమూ విచారించవద్దు. ఇది నాకు అభినిష్క్రమణం చెయ్యవలసిన సమయం! రాష్ట్రంతోనూ, జనంతోనూ సహా నీవు నన్ను క్షమించాలని ప్రార్థిస్తున్నాను" అని.

అప్పుడు అశ్రువులతో నిండిన కన్నులు కల మహారాజు కుమారుడితో ఇట్లు పలికినాడు: "నాయనా! నీవు అభినిష్క్రమణం చెయ్యవద్దు. ఇక్కడ వుంటేనే ఎంతో ప్రయోజనం వున్నది. నీకు యేమి కావలసినా, సమస్తమునూ ఇస్తాను. నన్నూ, యీ రాజకులాన్నీ, యీ రాజ్యాన్నీ అనుగ్రహించు. నీకు యే వరం కావలసినా ఇస్తాను."

అప్పుడు బోధిసత్త్వుడు మధురమైన వాక్యాలతో "దేవా! అలా అయితే నాకు నాలుగు వరాలు కావాలి. అవి యివ్వడానికి సాధ్యమైతే నాకు ఇయ్యి. వాటిని నీవు యిచ్చినట్లయితే నేను అభినిష్క్రమణం చెయ్యక ఎప్పుడూ యింటిలోనే వుండిపోతాను. ఆ వరాలు ఏమిటంటే— (1) నాకు ఎప్పుడూ ముసలితనం రాకూడదు. నేను నవనవలాడుతూ ఎప్పుడూ యౌవనంతోనే ఉండాలి. (2) నాకు ఎప్పుడూ వ్యాధి రాకూడదు. ఆరోగ్యంగానే ఉంటూ ఉండాలి. (3) నాకు చిరాయుస్సు ఉండాలి. ఎప్పుడూ మరణం రాకూడదు. (4) నాకు సర్వదా సంపత్తే కలుగుతూ ఉండాలి. విపత్తి కలుగనే కూడదు" అని అన్నాడు.

శుద్ధోదన మహారాజు యీ మాటలు విని మిక్కిలి దుఃఖార్తుడై "నాయనా! నీవు అస్థానంలో అసాధ్యాలైన వరాలను కోరుతున్నావు, వీటిని యిచ్చే శక్తి నాకు లేదు. జరా వ్యాధి మరణాల భయంవల్లనూ, ఆపతులవల్లనూ తప్పించుకున్నవారు ఎవ్వరూ లేరు. కల్పాంతాలవరకూ వుండే ఋషులు కూడా వీటివల్ల విడుదల పొందలేకపోయారు" అని అన్నాడు.

అప్పుడు బోధిసత్త్వుడు తండ్రితో 'దేవా! జరావ్యాధి మృత్యు భయాలనుంచీ, విపత్తినుంచీ తప్పించడమనే నాలుగు వరాలూ ఇవ్వడానికి సాధ్యం కాకపోతే పోనీయండి. నామాట విని వేరొక్క వరం మాత్రం



అనుగ్రహించండి. నా అభినిష్క్రమణానికి ఎంతమాత్రమూ వ్యతిరేకం చెప్పకండి" అని కోరాడు.

శుద్ధోదన మహారాజు ఈ మాటను విని ఆశను తగ్గించుకొని, పుత్రస్నేహాన్ని కూడా తెంచుకొని లోకానికి హితాన్నీ, మోక్షాన్నీ కలుగచేయ ప్రయత్నించడానికి కుమారుడు అనుమతిని కోరగా "సరే! నీ యిష్టమే జరగనీ! నీ అభిప్రాయం పరిపూర్ణతను పొందనీ!" అని అన్నాడు.

భిక్షులారా, తర్వాత బోధిసత్త్వుడు అక్కడనుంచి తన భవనానికి తిరిగి వచ్చాడు. తిరిగి వచ్చి తన పడకపై కూర్చున్నాడు. అతడు తన భవనంనుంచి తండ్రిదగ్గరకు వెళ్లడం, అక్కడనుంచి తిరిగి రావడం ఎవ్వరికీ తెలియదు.

ఆ రాత్రి గడచి తెల్లవారిన తర్వాత శుద్ధోదన మహారాజు శాక్యగణంవారిని అందరినీ పిలిపించి విషయాన్ని వివరంగా తెల్పి "రాజకుమారుడు తప్పక అభినిష్క్రమణం చేస్తాడు. దానికి మనం ఏమి చెయ్యవలెను?" అని అడిగాడు. శాక్యులు "దేవా! మేము తగిన రక్షణను ఏర్పాటుచేస్తాము. మేము చాలామందిమి ఉన్నాము. అతడు ఒంటిగాడు. బలవంతంగా అభినిష్క్రమణం చెయ్యడానికి అతనికి ఎలా శక్తి వుంటుంది?" అని అన్నారు.

ఆ శాక్యులున్నూ, శుద్ధోదన మహారాజున్నూ బోధిసత్త్వుని రక్షణకోసమై అస్త్రవిద్యలో ఆరితేరిన ఐదేసివందలమంది శాక్యకుమారులను నియమించారు. వారు విలువిద్యలో మిక్కిలి గట్టివారు. గొప్ప నాగబలం కలవారు (మహానగ్నబలోపేతులు). బోధిసత్త్వుడు నగరం తూర్పు ద్వారంనుంచి వెళ్లిపోకుండా వారు ఆ ద్వారందగ్గర కాచుకొని వుండేవారు. ఒక్కొక్క శాక్యకుమారునికీ అయిదేసివందల రథాలు వుండినవి. ఒక్కొక్క రథానికీ ఐదేసివందల కాల్బలం ఉండినది. ఈ విధంగా నగరం దక్షిణద్వారంలోనూ, పడమటి ద్వారంలోనూ, ఉత్తరద్వారంలోనూ కూడా ఐదేసివందల శాక్యకుమారులు బోధిసత్త్వుని రక్షణార్థం నియమింపబడ్డారు. వారు అస్త్రవిద్యలో

ఆరి తేరి, విలువిద్యలో సమరులై మహాబలవంతులై ఉన్నవారు. వారిలో ఒక్కొక్క శాక్యకుమారుడికీ అయిదేసి వందల రథాలూ, ఒక్కొక్క రథానికీ అయిదేసివందల వీరభటులూ బోధిసత్త్వుని రక్షణకోసం వుండినారు. మహల్లక మహల్లికులైన శాక్యులు పట్టణంలోని చతుష్పథాలలోనూ, శృంగాటకాలలలోనూ, రథ్యలలోనూ, జనుల గుంపులుండే చోట్లనూ బోధిసత్త్వుని రక్షణార్థం వున్నారు. శుద్ధోదన మహారాజు ఐదువందలమంది శాక్యకుమారులతో పరివృతుడై తన గృహద్వారం దగ్గరనే భద్రంగా ఉన్నాడు. ఆ కుమారులు గుర్రాలమీదా, ఏనుగుల మీదా అధిరోహించి కావలికాస్తూ ఉండినారు. మహాప్రజాపతి గౌతమి చేటికలను పిలిచి ఇలా ఆనతి ఇచ్చింది:

"మీరు దీపాలను పరిశుభ్రంచేసి కాంతి వ్యాపించే రీతిని వెలిగించండి. ధ్వజాగ్రాలకు మణులను కూర్చండి. మణిహారాలు వేసుకోండి. భవనంఅంతా బాగా వెలుగుతూ వుండేటట్లు చెయ్యండి. సంగీతాన్ని ప్రారంభించండి. ఈ రాత్రి నిద్రపోక అందరూ మేలుకొని వుండండి! రాజకుమారుడు మనకు తెలియకుండా వెళ్ళిపోవడానికి వీలుకాకుండా అతనిని భద్రంగా చూడండి. కవచాలను ధరించి, అమ్ములపొదీ, కత్తీ, ధనుర్బాణాలూ, శక్తీ, తోమరం మొదలైన అయుధాలను పట్టుకొని సర్వజనేష్టుడైన రాజకుమారుని రక్షణార్థం మహాప్రయత్నంలో ఉండండి. ద్వారాల నన్నింటినీ మూసివేసి, గట్టిగా అడ్డుగడియలు వెయ్యండి. తలుపులను దృఢంగా బంధించండి. అకాలంలో వాటిని తెరవవద్దు. తెరిస్తే ఉత్తమసత్త్వంగల రాజకుమారుడు వెళ్లిపోగలడు. మణిహారాలనూ, ముత్యాల హారాలనూ, ముఖపుష్పకం(పాపటపూవు), చంద్రవంక మొదలైన వాటినీ, మొదనూలూ, కర్ణాభరణమూ, అంగుళీయకం, అందెలూ మొదలైన ఆభరణాలనూ అలంకరించుకొని అకర్షణీయంగా వుండండి. నరులకూ, దేవతలకూ హితం కోరి, మత్తగజంవంటి నడక గల రాజకుమారుడు వేగంగా అభినిష్క్రమణం చెయ్యవచ్చు. అతని గమనానికి విఘాతం కలిగే మాదిరిగా మీరు మీ మీ పరాక్రమాలను చూపండి.

"శక్తి అనే ఆయుధాన్ని ధరించిన యువతులు పరిశుద్ధ చరిత్రుడైన రాజకుమారుని శయనం చుట్టూచేరి సూర్యుడివలె కన్నులు తెరుచు



కునే కనిపెట్టుకోవలసి వున్నది. రాజకుమారుణ్ణి రక్షించడం కోసం రాజభవనాన్ని రత్నాలతో కప్పివేయండి. వేణునాదాలు చేస్తూ, రాత్రి అంతా భద్రంగా వుండండి. మీరు రాత్రి పూర్తిగా మేలుకొని, ఒకరి కొకరు హెచ్చరించుకుంటూ వుండండి. లేకపోతే రాజకుమారుడు రాష్ట్రాన్నీ, రాజ్యాన్నీ విడిచిపెట్టి అభినిష్క్రమణం చెయ్యవచ్చు. రాజకుమారుడు గృహ పరిత్యాగం చేసి వెళ్లిపోతే సమస్తమైన రాజకులమూ విచారంలో మునిగిపోతుంది. తరతరాలుగా వస్తూ వున్న రాజవంశం విచ్ఛిన్నమైపోతుంది."

భిక్షులారా! అప్పుడు ఇరవై యెనమండుగురు మహాయక్ష సేనాపతులూ, ఐదు యక్ష సేనాపతి పూర్వాంగమాలూ, ఐదువందలమంది హారీత పుత్రులూ ఒక్క చోట చేరి ఇలా ఆలోచించారు – "మార్షులారా! ఇప్పుడు బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చేస్తాడు. అతనిని పూజించడానికి మీ రందరూ ఎంతో వేడుకను వెల్లడించాలి" అని.

ఆ సమయంలో నలుగురు మహారాజులూ యక్షరాజధాని అయిన అలకావతీ నగరంలో ప్రవేశించి పెద్ద యక్షపరిషత్తును సమావేశపరిచి "ఓ మార్షులారా! ఇప్పుడు బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చేస్తాడు. మీరు అతని అశ్వరాజం పాదాలను గ్రహించి వేగంగా అభినిష్క్రమణం జరిగేటట్లు చూడాలి' అని అన్నారు.

అప్పుడు ఆ యక్షపరిషత్తు ఇలాగున అన్నది: "ఆయన సాక్షాత్తూ నారాయణుడు. వజ్రంవలె దృఢమై, అభేద్యంగా ఉంటాడు. ఆయనే ఆత్మభావాన్ని పొందినవాడు. గురువు. వీర్యబలోపేతుడు. చలనం లేనివాడు. అన్ని సత్త్వాల్లోనూ ఉత్తముడు. ఎవరైనా గిరివరమైన మహామేరువును ఎత్తి ఆకాశంలో నిలిపినా నిలపవచ్చునేమో గాని, గుణముల చేత మేరు పర్వతంకంటెనూ బరువై, పుణ్యజ్ఞానాశ్రితుడైన బోధిసత్త్వుణ్ణి మోసి మరొకచోటికి చేర్పడం అసాధ్యమైన పని."

ఆ పరిషత్తు పలికిన మాటలు విని వైశ్రమణుడు ఇలా అన్నాడు: "మానగర్వితులైన మనుష్యులు మాత్రం, బోధిసత్త్వుడు చాలా బరువుగా ఉంటాడని అనుకుంటారు. అతని యెడల ప్రేమ గౌరవాలు కలవారు

ఆతడు చాలా తేలికగానే వుంటాడని భావిస్తారు. ఇట్టి గౌరవ సంకల్పం వుంటే ఆయన బరువుగా తోచడు. పక్షులు దూదిపింజను మోసుకొని పోయినట్లు మిక్కిలి తేలికగానే వుంటాడు. నేను మీకు ముందు నడిచి మార్గదర్శకుడను కాగలను. మీరు ఆయన అధిష్ఠించే గుర్రాన్ని వహించండి. మన మందరమూ బోధిసత్త్వుని అభినిష్క్రమణానికి తోడుపడి ఎంతో పుణ్యాన్ని సంపాదించగలం.''

భిక్షులారా! దేవతలకు ప్రభువైన యింద్రుడు ముప్ఫయిముగ్గురు ముఖ్యదేవతలను పిలిచి ''ఓ మార్షులారా! ఇప్పుడు బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చెయ్యబోతున్నాడు. మీ రందరూ ఆయనను పూజించడానికి వేడుకతో ఉండండి'' అని తెలియజేశాడు.

వారిలో శాంతమతి అనే దేవపుత్రుడు ''నేను కపిలవస్తు మహానగరంలో వుండే స్త్రీ పురుషులనూ, బాలబాలికలనూ---అందరినీ గాఢనిద్రలో మునిగిపోయేటట్లు చేస్తాను'' అని చెప్పినాడు.

లలితవ్యూహుడనే దేవపుత్రుడు ''నేను కపిలవస్తుపురంలోని గుర్రాలూ, ఏనుగులూ, గాడిదలూ, ఒంటెలూ, ఆవులూ, ఎడ్లూ, బర్రెలూ, దున్నలూ, స్త్రీ పురుషులూ, బాలబాలికలూ---సమస్త ప్రాణులూ ఎట్టి శబ్దమూ చెయ్యకుండా చూస్తాను'' అన్నాడు.

వ్యూహమతి అనే దేవపుత్రుడు ఇట్లు పలికాడు: ''నేను గగనతలంలో ఏడు రథాలు వరుసగా వెళ్ళడానికి అనుకూలమై, రత్న వేదికలతో కూడి, సూర్యకాంత మాణిక్యాల కాంతితో వెలుగుతూ ఎత్తయిన ఛత్రమూ, ధ్వజపతాకా వుండే మార్గాన్ని ఏర్పాటుచేసి, దాని నిండుగా పుష్పాలు చల్లి, గంధఘుటికలతో ధూపం వేయిస్తాను. ఆ మార్గాన్ని అనుసరించే బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చెయ్యగలడు'' అని.

''నేను నా తొండంతో కొలిచి ముప్ఫయిరెండు యోజనాల ప్రమాణం గల గొప్ప కూటాగారాన్ని నిర్మిస్తాను. దానిపైని అప్సరసలు ఎక్కి తూర్యధ్వనులు చేస్తూ గానంచేస్తూ బోధిసత్త్వుని సేవిస్తూ అతని వెంట వెళ్ళగలరు'' అని గజరాజైన ఐరావణం అన్నది.



దేవతలకు ప్రభువైన యింద్రుడు తాను ద్వారాల నన్నింటినీ తెరచి బోధిసత్త్వునికి మార్గం చూపగలనని అన్నాడు. ధర్మచారి అనే దేవపుత్రుడు అంతఃపురం అంతా వికృతంగా ఉండేటట్లు చూపగలనని చెప్పాడు. సంచోదకుడనే దేవపుత్రుడు తాను బోధిసత్త్వుణ్ణి శయనం నుంచి లేపగలనని చెప్పాడు.

బోధిసత్త్వుని పూజార్థమై తాము కాలానుసారిగా మేఘాలను కల్పించి ఉరగసార చందన చూర్ణాన్ని వర్షించగలమని వరుణుడనే నాగరాజూ, మనస్వి అనే నాగరాజూ, సాగరుడనే నాగరాజూ, అనవతప్తుడనే నాగరాజూ, నందోపనందులనే నాగరాజులూ అన్నారు.

భిక్షులారా, దేవ నాగ యక్ష గంధర్వులుకూడా యీ విధంగానే నిశ్చితాభిప్రాయానికి వచ్చారు. అప్పుడు బోధిసత్త్వుడు ధర్మచింతన చేస్తూ, సంగీతం జరుగుతూ వున్న భవనాలలో సుఖంగా శయనించి ఉన్నాడు. అతడు అంతఃపుర మధ్యంలో వుండి పూర్వపు బుద్ధచరిత్రలను ఆలోచిస్తూ, సమస్తప్రాణుల హితాన్ని పరిశీలిస్తూ ఉన్నాడు. అతనికి ఆ సమయంలో నాలుగు పూర్వప్రణిధానపదాలు స్ఫురణకు వచ్చాయి. అవి యేమిటంటే— వాటిలో మొదటిది---'పూర్వం స్వయంభువుల కందరికీ ఆధిపత్యాన్ని కోరిన నేను, సర్వజ్ఞత్వాన్ని అభిలషిస్తూ ఇలాటి సన్నాహం చేశాను. దుఃఖంలో మునిగివున్న ప్రాణులను చూచి, సంసారమనే పెద్ద చెరసాలలో బంధించబడిన జనసమూహాన్ని ఆ సంసార కారాగార బంధ విముక్తమయేటట్లు బోధచెయ్యగలను. ఆశ అనే సంకెళ్లతో బంధించబడిన ప్రాణులను ఆ సంకెళ్లనుంచి విడుదల చెయ్యగలను' అని. ఈ మొదటి ప్రణిధాన పదం ఆయనకు స్ఫురణకు వచ్చింది.

ఇక రెండవ పూర్వ ప్రణిధానపదం ఇది: 'అయ్యో! సంసారమనేదే పెద్ద అవిద్య. ఆ అవిద్యాంధకారంలో లోకం కొట్టుమిట్టాడుతూ ఉన్నది. లోకం కన్నులు అజ్ఞాన పటలం అనే తిమిరంతో ఆవరించబడి ఉన్నవి. అవిద్యామోహాంధకారంలో పడిన లోకానికి ప్రజ్ఞాచక్షుస్సు లేకుండా

పోయింది. ఇట్టి లోకానికి ధర్మలోకాన్ని కలిగిస్తాను. జ్ఞానప్రదీపాన్ని చూపుస్తాను. త్రివిధ మోక్షసుఖజ్ఞానం కలిగిన ఔషధ సంప్రయోగంవల్ల కల్గిన ఉపాయప్రజ్ఞాజ్ఞానంవల్ల సమస్తమైన అవిద్యాంధకార రూపమైన తిమిరపటల కాలుష్యాన్ని పోగొట్టి ప్రజ్ఞాచక్షువును విశోధించగలను' అని.

మూడవ ప్రణిధానపదం ఇది : 'అయ్యో! ఈ లోకం మితిమీరిన మానధ్వజంతో అహంకార మమకారాలతో కూడుకొని, జ్ఞాన చిత్త దృష్టికి విపర్యాసంతో పుణ్యసంగ్రహమనేది లేక ఉంటున్నది. ఆర్య మార్గాన్ని ఉపదేశించి దీని మానధ్వజాన్ని కూల్చివేస్తాను' అని.

నాల్గవ ప్రణిధానపదం ఇది: 'అయ్యో! ఈ జనం శాంతిరహితమై సోమరితనంతోనూ, కలతపాటుతోనూ కూడి గుణాలు మరుగైపోయి, ఆజనం జనసమాపన్నమై సంసారంలో కొట్టుమిట్టాడుతూ, అనేక బంధాలతో కట్టబడి ఒక లోకాన్నుంచి మరొక లోకానికి పరుగులిడుతూ, అలాత చక్రంపైని సమారూఢమై ఉన్నది. దీనికి ఉపశాంతిని కలిగించి ప్రజ్ఞాతృప్తిని కలిగించే ధర్మాన్ని వెల్లడించగలను' అని. ఈ విధంగా నాలుగు పూర్వప్రణిధాన పదాలు స్ఫురణకు వచ్చాయి.

ఇట్టి సమయంలోనే ధర్మచారి అనే దేవపుత్రుడూ, శుద్ధావాస కాయికులైన దేవపుత్రులూ మాహాత్మ్యం కలవారై అంతఃపురాన్నంతనూ చాలా వికృతంగానూ, పాడుగానూ ఉన్నట్లు ప్రదర్శించారు; బీభత్సంగానూ, శిథిలంగానూ చేశారు. ఇట్లు చేసి గగనతలంపైనే ఉండి బోధిసత్త్వునితో ఈ విధంగా అన్నారు:

"వికసిత పద్మాయత లోచనుడవైన ఓ రాజకుమారా! ఇది శ్మశాన ప్రాయంగా ఉన్నది. దీనిపైని నీకు ప్రీతి ఎలాగు కలుగుతున్నది?"

ఈ విధంగా దేవపుత్రులచేత సంచోదితుడైన బోధిసత్త్వుడు ఒక క్షణం అంతఃపురం అంతా చూచి, అది మహాబీభత్సంగా ఉన్నట్లు తెలుసుకొన్నాడు. తాను శ్మశాన మధ్యంలో వున్న ఒక భూతంవలె అతనికి తోచినది.



బోధిసత్త్వుడు సమస్తమైన నారీ సమూహాన్నీ చూచాడు. నిదానించి చూచాడు కూడాను. వారిలో కొందరు వస్త్రాలు కొంత తొలగిపోయి ఉన్నారు. కొందరు జుట్టుముడి వీడిపోయి ఉన్నారు. కొందరు ఆభరణాలు జారిపోయి ఉన్నారు. కొందరి కిరీటాలు తొలగిపోయి వున్నవి. కొందరి అవయవాలు వస్త్రవిహీనాలయి ఉన్నవి. కొందరు భుజాలపై ఒరిగిపడి వున్నారు. కొందరి ముఖాలు పక్కగా ఉన్నవి. కొందరు కన్నులు మూసుకుని ఉన్నారు. కొందరి నోళ్లనుండి చొంగలు కారుతూ ఉన్నవి. కొందరు ఎక్కువశ్వాస విడుస్తూ ఉన్నారు. కొందరు నవ్వుతూ ఉన్నారు. కొందరు దగ్గుతూ ఉన్నారు. కొందరు ప్రలపిస్తున్నారు. కొందరు పండ్లు పటపట కొరుకుతున్నారు. కొందరి ముఖాలు వెలవెలపోతూ ఉన్నవి. కొందరి శరీరాల వర్ణం మారిపోయింది. కొందరి చేతులు వ్రేలాడుతూ ఉన్నవి. కొందరి కాళ్లు ఇటునటూ పడవేసి ఉన్నవి. కొందరు తలలపై ముసుగు తొలగి ఉన్నారు. కొందరు ముసుగు వేసుకుని ఉన్నారు. కొందరు పెడమొగము పెట్టుకొని ఉన్నారు. కొందరి దేహాలు శిథిలాలయి ఉన్నవి. కొందరి అవయవాలు శిథిలాలయి ఉన్నవి. కొందరు బాగుగా వంగి ఖురఖురమని అంటూ వున్నారు. కొందరు మృదంగాన్ని పట్టుకొని, శిథిలమైన శరీరాన్ని వంచి వున్నారు. కొందరి చేతులనుంచి వీణ మొదలైన వాద్యాలు జారిపోతూ వున్నవి. కొందరు వేణువును పండ్లతో కటకట లాడిస్తున్నారు. కొందరికి వాద్య భాండాల మీద వుండే చేతులు జారిపోతూ వున్నవి. కొందరు కన్నులను మూస్తూ, తెరుస్తూ వున్నారు. కొందరు నోరు తెరుచుకొని వున్నారు. ఈ విధంగా అంతఃపురం అంతా బోధిసత్త్వునికి చాలా వికారంగా ఉన్నట్లు తోచినది. అతనికి అంతఃపురంపైని శ్మశానబుద్ధియే కలిగినది.

ఇక్కడ కొన్ని శ్లోకాలు చెప్పబడినవి. వాటి అభిప్రాయం యిది:

లోకానికి ప్రభువైన బోధిసత్త్వుడు ఈ పరిస్థితి నంతటినీ చూచి ఉద్విగ్నుడై దయతోకూడా నిట్టూర్పు విడిచి "అయ్యయ్యో! నేను చాలా చిక్కులలో తగుల్కొని ఉన్నాను. ఇక్కడినుంచి పోవలెను. రాక్షసీగణం నడుమ నాకు ఉండడానికి ఇష్టం ఎలా ఉంటుంది? మోహాంధ

కారంతో ఆవరించబడి వున్న దుర్మతులు కామాలనే త్రాళ్ళతో బంధించబడి గుణవంతులనే పేరు పొందుతూ ఉంటారు. పంజర మధ్యంలో బంధించబడి వున్న పక్షులకు వలెనే వీరికిన్నీ ఎప్పటికీ విడుదల లభించదు” అని అనుకున్నాడు.

తర్వాత బోధిసత్త్వుడు తిరిగి ధర్మాలోక ముఖంతో అంతఃపురాన్ని పరిశీలించి, అక్కడి ప్రాణులను కరుణాదృష్టితో చూస్తూ ఈ విధంగా విచారింపసాగినాడు: “వివేకంలేని వీరు వధ్యస్థానంలోని (అఘాతనంలోని) వధ్యులవలె చంపబడుతున్నారు. అమేధ్యాలతో నిండిన చిత్ర ఘటాల్లో అవిద్వాంసులవలె ఆనందపడుతున్నారు. నీటిమధ్యలో ఏనుగులవలె మునుగుతున్నారు. చెరసాలలో వున్న దొంగలవలె ఏడుస్తూ వున్నారు. వరాహములవలెనే అశుచి మధ్యంలో ఆసక్తి కలిగి వున్నారు. అస్థిపంజరాల మధ్య కుక్కలున్నట్లు ఈ మూర్ఖులు నివసిస్తున్నారు. దీపంమీద మిడుత పడినట్లు పడిపోతున్నారు. ఎరమూలంగా కోతులవలె బంధింపబడుతున్నారు. వలలను వేసి బయటికి తీసిన చేపలవలె తపించిపోతున్నారు. వధ్యప్రదేశంలోని గొర్రెలతీరున అరుస్తున్నారు. శూలాగ్రంపై వున్న పాపాత్ములవలెనే అణగిపోతున్నారు. బురదలో వృద్ధగజములవలెనే కూరుకొనిపోతున్నారు. మహాసముద్రంలో పగిలిపోయిన నావవలెనే ఆపద పొందుతున్నారు. పెద్దప్రవాహంలో పుట్టుగ్రుడ్డులవలెనే పడిపోతున్నారు. పాతాళసంధిలో పడిన నీటివలెనే పర్యాదానాన్ని (తిరుగుడును) పొందుతున్నారు. ప్రళయ సమయంలో భూమండలంవలెనే ధూమాక్రాంతు లవుతున్నారు. కుమ్మరిసారె కుండలను త్రిప్పినట్లు ఈ అవివేకులు త్రిప్పబడుతూ ఉన్నారు. కొండలమధ్యను జాత్యంధులవలెనే దారి తెలియక అంతటనూ తిరుగుతున్నారు. పెద్దపులులు అడ్డుకొన్న కుక్కలవలెనే వీరు వెనుకకు తిరుగుతూ ఉన్నారు. వేసవికాలంలోని తృణములవలెనూ, వృక్షాలవలెనూ వాడిపోతూ వున్నారు. కృష్ణపక్షంలోని చంద్రునివలె కళావిహీనులుగా వుంటున్నారు. గరుడుడు పాములను భక్షిస్తూ ఉన్నట్లు భక్షింపబడుతున్నారు. పెద్ద మొసలి మొసలిపిల్లను మింగివేసినట్లు మింగివేయబడుతున్నారు. దొంగల గుంపు



వర్తకుల బిడారును దోచుకొన్నట్లు దోచుకోబడుతున్నారు. ఝుంఝూమారుతంవల్ల పెద్ద వృక్షాలవలెనే విరవబడుతున్నారు. విషజంతువులు కాటువేసి చంపునట్లు చంపివేయబడుతున్నారు. తేనెపూసిన కత్తులతో వలెనే మంచిగానే నరకబడుతున్నారు. మొద్దులవలెనే ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు. పసిపిల్లలు తమ మలమూత్రాలతో ఆడుకున్నట్లు ఈ మూఢులూ ఆడుకుంటున్నారు. అంకుశం ఏనుగులను మళ్ళించినట్లు మళ్ళించబడుతున్నారు. ధూర్తులైన బాలురను కట్టివేసినట్లు వీరున్నూ బంధించబడుతున్నారు. జూదగాళ్ళు తమ ధనాన్ని కోలుపోయినట్లు వీరున్నూ తమ కుశలమూలాలను నశింపజేసుకొంటున్నారు. రాక్షసస్త్రీలు వణిజులను భక్షించినట్లు వీరున్నూ భక్షింపబడుతున్నారు.”

ఈ విధంగా బోధిసత్త్వుడు ముప్ఫయిరెండు విధాలుగా అంతఃపురాన్ని సరిపోల్చి, శరీరం అశుభమైనదని తలపోస్తూ ప్రతికూలమై వుండే వాతావరణాన్ని ఉపసంహరిస్తూ, జుగుప్సాభావాన్ని వ్యక్తం చేశాడు. తన దేహాన్నిగురించి పర్యాలోచన చేస్తూ, ఆ ఆదీపనము (దోషాన్ని) గమనిస్తూ, శరీరాన్నుంచి దేహాభిమానాన్ని తరిమివేశాడు. శుభాన్నే భావిస్తూ, అశుభాన్ని భావించుకుండా పాదాల క్రిందిభాగం నుంచి మస్తకం పైభాగంవరకూ పరిశీలన చేశాడు. సమస్తమూ, నిత్యమూ అశుచివల్ల ఉత్పన్నమై, అశుచినే పొందుతూ, అశుచినే స్రవిస్తూ వున్నదని గ్రహించాడు. ఆ సమయంలో అతడు రెండు గాథలను పలికాడు. వాటి అభిప్రాయం యిది:---

“ఈ శరీరం చాలా హేయమైనది. కర్మ అనే క్షేత్రంలో పుట్టి ఆశ అనే నీటితో వృద్ధిపొందినది. కన్నీరు, చెమట, కఫం మున్నగు వాటితో ఆర్ద్రంగా ఉండి, మూత్రంవల్ల వికారంగా తోస్తుంది. శోణిత బిందుసమాకులమై వుంటుంది. వస్తి, చీము, వసాదిమలము, కొవ్వు మొదలైన పదార్థాల రోగాలతో నిండి వుంటుంది. ఎల్లప్పుడూ అమేధ్యాలను స్రవిస్తూ వుంటుంది. దుర్గంధాలను వ్యాపింపజేస్తూ వుంటుంది.

“ఈ శరీరం ఎముకలూ, దంతాలూ, కేశములూ, రోమాలూ మొదలైన వాటితో వికృతంగా ఉండి చర్మంతో కప్పబడి ఉన్నది.

లోపల, దుర్బలాలైన యకృత్ ప్లీహాలతోనూ, బొడ్డు, నాలుకలతోనూ కూడినది, మెదడుతోనూ, కండరాలతోనూ కట్టబడివున్న యంత్రంతో సమానమై, మాంసంతో కూడి వుంటుంది. అనేకవిధాల రోగాలమూలాన దుఃఖభూయిష్ఠమై ఆకలిదప్పులతో బాధపడుతూ ఉంటుంది. అనేక రంధ్రాలతో కూడి ముసలితనానికీ, మరణానికీ గురి అయి వుంటుంది. ఇట్టి శరీరాన్ని చూచి విచక్షణుడు శత్రుసమానంగా ఎలా భావించడు?"

ఈ విధంగా తలచి బోధిసత్త్వుడు తన శరీరంలో శరీరగతమైన స్మృతితో విహరిస్తూ ఉండినాడు.

అప్పుడు గగనంలో తిరుగుతూ వున్న దేవపుత్రులు ధర్మచారి అనే దేవపుత్రునితో ఇలా అన్నారు:

"ఓ మార్షా! సిద్ధార్థుడు ఇంకా ఎందుకు ఆలస్యం చేస్తున్నాడు? ఆయన అంతఃపురాన్ని చూస్తూ మనస్సుకు చూపిస్తూ వున్నాడు. మనస్సు చాలా కలతపడుతున్నట్లు కానవస్తున్నది. మరల మరల అంతఃపురంవైపే దృష్టిని ప్రసరింపజేస్తున్నాడు. మహాసముద్రంవలె గంభీరంగా ఈయన ఉండడంవల్ల ఈయన మనోగతాన్ని తెలుసుకోవడం సాధ్యంకాకున్నది. సంగరహితునికి లౌకికవిషయాలలో మనస్సు పుట్టదుకదా! దేవతలు హెచ్చరించకపోయినా, ఈయన వెనుక తాను చేసిన ప్రతిజ్ఞను ఎంత మాత్రమూ మరచిపోదుకదా!"

అప్పుడు ధర్మచారి ఇలా అన్నాడు: "దేవపుత్రులారా! మీరు ఈ విధంగా ఎందుకు అంటున్నారో తెలియకున్నది. ఇదివరలో మీరే ప్రత్యక్షంగా ఇతనికి బోధచేసివున్నారు. అందువల్ల నిస్సంగత్వమున్నూ కలిగినది. చరమసంభవావస్థితుడూ, అభినిష్క్రమణానికి సంసిద్ధుడూ అయిన ఈయనకు అభినిష్క్రమణం చేయకూడదని ఎలా బుద్ధి కలుగుతుంది?"

భిక్షులారా, పిదప బోధిసత్త్వుడు మనస్సులో చర్చించుకొని స్థిరబుద్ధితో నిశ్చయానికి వచ్చాడు. సర్వార్థసిద్ధుడు వేగంగా, సవిలాసంగా పడకనుంచి దిగి సంగీతభవనంలో తూర్పుముఖంగా నిలిచి, కుడి



చేతితో రత్నాలగవాక్షాన్ని వంచి, మేడ చివరకు వచ్చి నిలిచాడు. పది గోళ్లూ చేరేటట్లు రెండు చేతులనూ జోడించి, సమస్త బుద్ధులనూ స్మరించి పూర్వబుద్ధులకు నమస్కారంచేసి ఆకాశంవైపు చూడసాగినాడు. అతడు గగనతలంపై వున్న అమరాధిపతి అయిన ఇంద్రుణ్ణి చూచాడు. ఆ యింద్రుడు వేయిముఖాలు కలిగి, లక్షలకొద్దీ దేవతలతో వున్నాడు. అతడు పుష్పాలనూ, ధూపాలనూ, గంధమాల్యాలనూ, విలేపన చూర్ణాన్నీ, వస్త్రాలనూ, ఛత్రాన్నీ, ధ్వజపతాకనూ వహించి వున్నాడు. అతడు వినమ్రుడయి బోధిసత్త్వునికి నమస్కారంచేస్తూ నిలిచి వున్నాడు. అంతేకాకుండా నలుగురు దిక్పతులనూ చూస్తూ ఉన్నాడు. వారు యక్ష, రాక్షస, గంధర్వ, నాగగణాలతో, దృఢమైన కవచాలను ధరించి, కత్తి, ధనుర్బాణాలు, శక్తి, తోమరం, త్రిశూలం మున్నగు ఆయుధాలను పట్టుకొని వున్నారు. సవిలాసంగా వారి మణిమకుటాలనుంచి జుట్టు వ్రేలాడుతూ వుంది. వారున్నూ బోధిసత్త్వునికి నమస్కారం చేస్తూ వున్నారు. దేవపుత్రులైన సూర్యుడూ, చంద్రుడున్నూ కుడిప్రక్కనూ, ఎడమప్రక్కనూ ఉన్నారు. నక్షత్రాధిపతి అయిన పుష్యుడు కూడా ఉన్నాడు. అర్ధరాత్రి సమయం కూడా వచ్చింది. అపుడు బోధిసత్త్వుడు ఛందకుడిని పిలిచి యిలా చెప్పాడు:

"ఛందకా! చాపల్యంతో ఆలస్యం చెయ్యక వెంటనే నాకు అలంకృతమైన అశ్వరాజాన్ని తీసుకొని రా. నాకు సర్వసిద్ధులూ మంగళప్రదాలుగా ఉన్నవి. ఇప్పుడు నిశ్చయంగా కార్యసిద్ధి జరుగుతుంది."

ఈ మాట విని ఛందకుడు కలతపడిన మనస్సుతో ఇలా అన్నాడు:

"వికసించిన కనుబొమలు, కమల దళాలవలె శుభ్రప్రదాలైన కన్నులు కల రాజకుమారా! ఎక్కడికి వెళ్ళుతావు? శరత్కాలమందలి నిండు చంద్రునివంటి ముఖము కలవాడా! చంద్రునివలె చల్లని తేజస్సు కలవాడా! రాజసింహా! ఎక్కడికి వెళ్ళుతావు? నవనలినంవలె కోమలమైన వాడా! విశుద్ధమైన పద్మంవంటి ముఖం కల రాజకుమారా! బంగారువలెనూ, సూర్యునివలెనూ తరుణమై నిర్మలమైన తేజస్సు కలవాడా! చంద్రునివలె చల్లని కాంతి కలవాడా! హోమజ్వాలలతో ప్రకాశిస్తున్న

అగ్నికాంతివలె, మణులమెరుపుల కాంతివలె ప్రకాశించే తేజస్సు కలవాడా! మత్తగజమువంటి నడక గలవాడా! వృషభంవలె, సింహమువలె, హంసవలె ఠీవిగా అడుగులు వేస్తున్న చక్కని పాదాలు కలవాడా! ఎక్కడికి వెళ్ళుతావు?"

అప్పుడు బోధిసత్త్వుడు ఇలా అన్నాడు: "ఓ ఛందకుడా! శీలాన్ని రక్షించుకొనుటకూ, శాంతికొరకూ నేను ఇదివరలో కర చరణ నయనాదులైన అవయవాలనూ, శిరస్సునూ కూడా త్యాగం చేశాను. తనయులనూ, భార్యనూ, ప్రియులనూ, ధనకనక నవరత్నాదులతో పరిపూర్ణమైన రాజ్యాన్నీ, గజాలనూ, వాయువేగంగల గుర్రాలనూ, విక్రమ బలలనూ త్యజించాను. బహుకల్పకోటి సంవత్సరాలుగా గొప్ప బలంతో ధ్యాన ప్రజ్ఞానిరతుడనై ఉన్నాను. ఇక సమ్యక్సంబోధిని స్మరించి, శుభాన్నీ, శాంతినీ నెలకొల్పాలి. జరామరణాలనే పంజరంలో చిక్కుకొని బాధపడుతూ ఉన్న ప్రాణులకు విడుదలను కలిగించడానికి నాకు ఇప్పుడు తగిన సమయం వచ్చింది."

అప్పుడు ఛందకుడు ఇలా అన్నాడు: "రాజకుమారా! నేను విన్నమాట యిది. నీవు పుట్టగానే దైవజ్ఞులైన బ్రాహ్మణులు వచ్చి చూచినారు. వారు శుదోదన మహారాజుతో 'దేవా! రాజకులానికి గొప్పవృద్ధి కలుగుతుంది' అని అన్నారు. 'అది ఎట్టిది?' అని మీ తండ్రి అడుగగా వారు ఈ విధంగా చెప్పారు:—

"అయం కుమారః శతపుణ్య లక్షణో
జాతస్తవా ఆత్మజ పుణ్యతేజితః,
స చక్రవర్తీ చతుర్ద్వీప ఈశ్వరో
భవిష్యతీ సప్తధనై రుపేతః.

నచే త్పునర్లోక మవేక్ష్య దుఃఖితం
విజహ్యమాన్తఃపురి నిష్క్రమిష్యతి,
అవాప్య బోధిం అజరామరం పదం
తర్పేష్యతే ధర్మజలై రిమాం ప్రజామ్."



ఈ కుమారుడు వందలకొద్దీ పుణ్యలక్షణాలు కలవాడు. పుణ్యంతో ప్రకాశిస్తూ ఉన్నాడు. ఇట్టివాడు నీకు కుమారుడుగా ఉద్భవించాడు. ఇతడు చక్రవర్తి అయితే సప్తవిధాలైన ధనాలతోనూ నాలుగు ద్వీపాలకున్నూ ప్రభువు కాగలడు. అలాగున కాకపోతే దుఃఖంలో మునిగివున్న లోకాన్ని చూచి, అంతఃపురంనుండి నిష్క్రమించి వెళ్లిపోతాడు. జరామరణాలు లేని ఉత్తమమార్గమైన బోధిని పొంది ప్రజలను అందరినీ ధర్మజలాలతో తర్పిస్తాడు. రాజకుమారా! వాళ్ళు చెప్పినసంగతి అలా వుండనీ. నీ శ్రేయస్సులు కోరిన నా మాట విను."

"ఆమాట ఏమిటో చెప్పు" అని రాజకుమారుడు అన్నాడు.

ఛందకుడు ఇలా చెప్పాడు: "రాజకుమారా! ఈ లోకంలో ఎంతో మంది 'మాకు దేవమనుష్యులసంపద అంతా లభించాలి' అని కోరుతూ వుంటారు. దానికోసమై వారు అనేకవిధాలయిన వ్రతాలు చేస్తారు. తపస్సులు చేస్తారు. కృష్ణాజినాలను ధరించి, జడలను కిరీటాలుగా ధరించినవారై, నారగుడ్డలు కట్టుకొని, జుట్టునూ, గడ్డాలనూ, మీసాలనూ, గోళ్ళనూ పెంచుకొని, శరీరానికి మిక్కిలి శ్రమ కలిగించే అనేక కఠిన పద్ధతులను స్వీకరిస్తారు. వ్రతాలనూ, తపస్సునూ చాలా తీవ్రంగా ఆచరిస్తారు. ఇదంతా సంపత్తికొరకే! అట్టి గొప్పసంపద నీకు ఉండనే ఉన్నది. ఈ రాజ్యమో? ఇది సమృద్ధమై, సుభిక్షమై, క్షేమంగలదై, విస్తారమై, రమణీయమై జనంతో కిటకిటలాడుతూ ఉన్నది. చాలా ఉత్తమాలైన ఉద్యానాలు ఉన్నవి. పెక్కువిధాల పుష్పాలతోనూ, ఫలాలతోనూ నిండిన చెట్లు ఆ ఉద్యానాలలో ఉన్నవి. ఆచెట్లమీద అనేకవిధాల పక్షులు కలకలారావాలు చేస్తూ వున్నవి. అక్కడ వున్న కొలకులు పద్మాలు, నల్లకలువలు, ఎర్రకలువలు, తెల్లతామరలు మొదలైనవాటితో శోభాయమానంగా ఉన్నవి. ఆ ఉద్యానాలలో హంసలూ, నెమిళ్ళూ, కోయిలలూ, చక్రవాకాలూ, క్రౌంచపక్షులూ, సారసాలూ మధురంగా ధ్వనిచేస్తూ వున్నవి. తీయమామిళ్ళూ, సంపెంగలూ, అశోకాలూ, గోరింటలూ, తిలకవృక్షాలూ, కేసరాలూ మొదలైన చెట్లు కొలకుల తీరంలో ఉంటున్నవి. రత్నవేదికలతో కూడి, అనేకవిధాల

రత్నవృక్షాలతో అలంకరించబడి, బంగారుకట్టు కలవీ, రత్న జాలాలతో సంఛన్నాలయినవీ అయిన భవనాలు ఉన్నవి. అవి ఆ యా ఋతువులకు – గ్రీష్మర్తువునకూ, వర్షర్తువునకూ, శరత్కాలానికీ, హేమంతర్తువునకూ తగిన సుఖనివాసాలై ఉన్నవి. శరత్కాలమేఘాల వలెనూ, కైలాసపర్వతమువలెనూ ఉన్న మహాభవనాలు వైజయంతంతోనూ, సుధర్మాసభాభవనంతోనూ సమానమైనవీ ఉన్నవి. అవి తిన్నెలతోనూ, ద్వారాలతోనూ, కూటాగారాలతోనూ, మిద్దెలతోనూ కూడి, రత్న కింకిణీ జాలాలతోనూ ఒప్పుతూ ఉన్నవి. రాజకుమారా! ఈ నీ అంతఃపురం తుణవం, పణవం, వీణ, వేణువు, సంప్రతాడం, నకులం, సుఘోషకం, మృదంగం, పటహం మొదలైన నృత్యగీతివాద్యాల సంగీతులతో వినోదంగా ఉన్నది. హాస్యలాస్యాలు, క్రీడిత రమితాలూ సుఖాన్ని కలిగిస్తూ ఉండగా మధురాలైన ఉపచారాలతో కూడి ఉన్నది. దేవా! నీవున్నూ యువకుడవు. తరుణుడవు. పరిపూర్ణ యౌవనం కలవాడవు. పిన్నవాడవు. కోమలశరీరం కలవాడవు. నల్లనిజుట్టు కలవాడవు. కామసుఖాలు బాగుగా అనుభవించనే లేదు. సహస్రనయనుడూ, అమరాధిపతీ అయిన దేవేంద్రునివలె సమస్త భోగాలనూ బాగుగా అనుభవించు. వృద్ధుడవైనమీదట అభినిష్క్రమణం చెయ్యవచ్చును. అప్పుడు నేనూ నీతో అభినిష్క్రమణం చేస్తాను.”

ఛందకుడు ఇలాగు అని యీ క్రింది గాధను పలికినాడు:

“రమతాం చ రతివిధిజ్ఞా అమరాధిపతి ర్యథా త్రిదశలోకే,
పశ్చాద్ వృద్ధో భూత్వా వ్రతతపసం అరభిష్యామః.”

స్వర్గలోకంలో దేవేంద్రునివలెనే రతిపద్ధతులను తెలుసుకుని బాగా భోగాలను అనుభవించు. పిదప వృద్ధుడవయినప్పుడు వ్రతాలనూ, తపస్సునూ ఆరంభించవచ్చును.

అప్పుడు బోధిసత్త్వుడు ఇలా అన్నాడు: “ఓ ఛందకా! ఇక చాలును, వూరుకో! ఈ కామాలన్నీ అనిత్యాలు. అధ్రువాలు. అశాశ్వతాలు. విపరీతమైన పద్ధతులు కలవి. మిక్కిలి చంచలాలు. మహావేగంతో



పరుగులెత్తేవి. సెలయేళ్ళవంటి వడి కలవి. స్థిరంగా ఉండక మంచు బిందువులవలెనే వుండేవి. దూషణాలతో నిండి ఉత్తపిడికిళ్ళవలెనే సారంలేనివి. అరటిబోదెలవలెనే దుర్బలమైనవి. ఉడకని వంటవలె కష్టం కలిగించేవి. పచ్చికుండలవలెనే భేదింప సులభమైనవి. శరత్కాల మేఘాలవలె క్షణం కనిపించి మరుక్షణంలో మాయమయేవి. ఒక్క క్షణం కూడా ఆకాశంలో నిలువని మెరుపులవలెనే ఉండేవి. విషభోజనంవలెనే చివరకు దుఃఖాన్ని కలిగించేవి. మాలుతాలతవలె అసుఖాన్ని కలిగించేవి. బాల బుద్ధుల వ్రాతలవంటివి. నీటిబుగ్గలతో సమానమైనవి. వేగంగా తారుమారయ్యే స్వభావం కలవి. మాయలతోనూ, ఎండమావులతోనూ సమానమైనవి. జ్ఞానవిపర్యాసంవల్ల కలిగేవి. చిత్త విపర్యాసంతో కూడినవి. స్వప్న సదృశాలు. దృష్టి విపర్యాసం పొందడంవల్ల అతృప్తినే కలిగించేవి. సముద్రంవలె పొంగేవి. ఉప్పునీటివలె దప్పిని కలిగించేవి. పాముశిరస్సువలెనే స్పృశించరానివి. పెద్ద పెద్ద కొండచరియలవలెనే పండితులు విడిచివేసినవి. ఇవి భయంతోనూ, యుద్ధంతోనూ, దోషాలతోనూ కూడివుండేవని గ్రహించి ప్రాజ్ఞులు వీటిని విడిచిపెట్టారు. విద్వాంసులు నిందించారు. ఆర్యులు ఏవగించారు. విద్వాంసులు విడిచిపెట్టినారు. అవిద్వాంసులు మాత్రం గ్రహించారు. బాలురు సేవించారు.

బోధిసత్త్వుడు ఈ విధంగా వివరించి యీ గాధను పలికాడు:

“వివర్జితా సర్పశిరోయథా బుధైః
విగర్హితా మీఢఘటో యథాశుచిః,
వినాశకా సర్వశుభస్య ఛందకా
జ్ఞాత్వా హి కామా న్నమి జాయతే రతిః”

‘ఓ ఛందకా! విద్వాంసులు ఈ కామాలను సర్పశిరస్సులవలెనే దూరంగా విడిచిపెట్టారు. అశుచియైన మూత్రఘటాన్నివలె నిందించారు. ఇవి సమస్త శుభాలనూ నశింపజేస్తాయి. కామాల యీ స్థితి తెలిసిన నాకు వీటిమీద కోరిక పుట్టలేదు.

అప్పుడు ఛందకుడు శల్యాహతునివలె మొర్రపెడుతూ, దుఃఖిస్తూ, కన్నీరు కారుస్తూ ఈ వాక్యాన్ని పలికాడు:

"దేవా! ఈ సుఖాలను పొందడానికే కొందరు ఘోరమైన వ్రతాలను ఆరంభిస్తారు. కృష్ణాజినాలను ధరించి పొడవైనజుట్టు జడలు కట్టగా, గోళ్లనూ, గడ్డాలనూ, మీసాలనూ పెంచుకొని, నారచీరలను ధరించి, శరీరం శుష్కింపజేసుకొని వ్రతాలను ఆచరిస్తారు. శాకాలూ, చామలూ, గర్దూలాలూ భక్షించి ఉంటారు. కొందరు గోవ్రతాన్ని ఆచరిస్తూ వుంటారు. ఇంక మనమో, ఉత్తములమై లోకంలో విశిష్టస్థితిలో ఉన్నాము. యోగ్యులమైన చక్రవర్తులం! వజ్రధరుడైన యింద్రుడూ, దేవతలకు అధిపతి అయిన యముడు మొదలైన లోకపాలకులూ, బ్రహ్మలోకంలో సుఖాన్ని కోరుతూనే ఉంటారు. నరోత్తముడవైన రాకుమారా! నీకు సమృద్ధమూ, విస్తారమూ, సుభిక్షమూ అయిన రాజ్యం ఉన్నది. ఆరామాలూ, ఉద్యానాలూ, వైజయంతంతో సమానమైన పెద్ద పెద్ద భవనాలూ ఉన్నవి. అంతఃపురంలో స్త్రీలు స్వయంగా వేణువులనూ, వీణలనూ, ఇతరవాద్యాలనూ ధ్వనింపజేస్తూ, నాట్యమాడుతూ, ఆనందాన్ని కలిగిస్తున్నారు. ఇట్టి సుఖాలను విడిచిపెట్టి వెళ్ళిపోవద్దు."

ఛందకుడు పలికిన యీ మాటలను విని బోధిసత్త్వుడు ఇలా అన్నాడు—"ఓ ఛందకా! విను. పూర్వపు జన్మాంతరాలలో వందలకొద్దీ ఉండిన దుఃఖాలూ, బంధనాలూ, తాడనాలూ, బెదరింపులూ కామకారణాలవల్లనే కలిగినవి. ఇప్పుడు నేను ఖిన్నుడనై ఉండలేదు. మనస్సు సంస్కరింపబడి ఉన్నది. పూర్వం స్త్రీవశాన్ని పొంది, మోహాకులమై, దృష్టి అనే వలచేత ఆవరించబడి బంధభూతమై ఉండినది. ఈ సుఖాలన్నీ ఆత్మకు వేదనను కలిగించేవి. అగ్నిసదృశాలు! అజ్ఞానరవివల్ల ఏర్పడిన చంచలమైన మేఘాలతో సమానాలు. అస్థిరమైన మెరుపుల వంటివి. శూన్యములూ, తుచ్ఛములూ, అసారములూ, అనాత్మలూ అయిన ఇవి ఎప్పుడూ శూన్యస్వభావాలే! ఇట్టి విషయ సుఖాల్లో నాకు బుద్ధి కలగడం లేదు. నేను వెళ్ళిపోవాలి. ఓ ఛందకా! బాగుగా అలంక



రించి, అశ్వరాజమైన కంటకాన్ని తీసుకుని రా. ఇదివరకే లోకశుభానికై ఆలోచించుకొని ఉన్నాను. అన్నింటినీ అతిక్రమించి, సమస్త ధర్మాలకూ ఈశ్వరుడనై ధర్మరాజు అనే మునిగా కాబోతున్నాను."

అప్పుడు ఛందకుడిలా అన్నాడు:

"వికసించిన తామరపూవురేకులవంటి కన్నులు కలదీ, విచిత్రహారాలు కలదీ, మణిరత్న భూషణాలు అలంకరించుకొన్నదీ, ప్రకాశిస్తున్నదీ, ఆకాశంపైని మేఘాలనుండి వెడలిన మెరుపుతీగవలె ఉన్నదీ, శయనించి వున్నదీ అయిన అర్ధాంగిని ఉపేక్షించకు. ఈ వేణువులనూ, పణనాన్నీ, సుఘోషకాన్నీ, మృదంగాన్నీ, వంశాన్నీ, తక్కిన సుగీత వాద్యాలనూ, చకోరస్వరము కలవీ, పిచ్చుకస్వరము కలవీ, లయకు అనుకూలంగా ఉన్నవీ అయిన వీణలనూ విడిచిపెట్టకు. నల్లకలువలూ, వర్షాకాలపు సంపెంగలూ మొదలైన సువాసన గల పూవుల మాలికలనూ, అగరు మొదలైన సువాసన ద్రవ్యాలనూ, యోగ్యాలైన మైపూతలనూ వుపేక్షించకు. పరిమళిస్తూవున్న లేపన ద్రవ్యాలనూ, మధురాలైన రసాలనూ, వ్యంజనాలతో కూడిన భోజనాలనూ, మేలైన చక్కెర పానకాలనూ విడిచిపెట్టి ఎక్కడికి వెళ్ళిపోతావు? శీతకాలంలో వెచ్చదనం యిచ్చే లేపనాంబరాలనూ, ఉష్ణసమయంలో చల్లదనాన్ని కలిగించే వురగసారచందనాదులనూ, శుభప్రదాలైన పట్టువస్త్రాలు మున్నగు వాటినీ విడిచిపెట్టి ఓ దేవా! ఎక్కడికి వెళ్ళుతావు? ఓ దేవా! ఈ అయిదూ కామగుణాలు! దేవతలలోని దేవతలకువలెనే యివి నీకు సమృద్ధిగా ఉన్నవి. రతిసౌఖ్యాలతో ఆనందాన్ని అనుభవించు. వీటిని తృప్తితీరా అనుభవించాక ఓ శాక్యపుంగవా! అరణ్యానికి వెళ్ళవచ్చు."

అంత బోధిసత్త్వుడు ఇలా అన్నాడు:—

"ఓ ఛందకా! నేను అపరిమితాలూ, అనంతాలూ అయిన కల్పాలలో అనేకవిధాల కామాలనూ, రూప రస గంధ స్పర్శ శబ్దాలనూ అనేక విధాలుగా వున్నవాటిని అనుభవించి ఉన్నాను. దివ్యాలూ, మానుషాలూ అయినవాటిని అన్నింటినీ అనుభవించాను. ఇలా అనుభవించినా తృప్తి లేదు. చతుర్ద్వీపాలకూ ప్రభువూ, చక్రవర్తీ అయిన వారి పుత్రు

డుగా జన్మించి, ఐశ్వర్యాన్ని పొందాను. సప్తరత్నాలనూ పొందాను. అంతఃపురంలో స్త్రీలమధ్య నివసించాను. ఇంద్రాధిపత్యం పొందాను. తుషిత లోకంనుంచి యీ లోకానికి వచ్చాను. గొప్ప గౌరవాన్నీ, సంపదనూ ఇదివరలో అనుభవించాను. తిరిగి నేను ఇప్పుడు హీనాలైన వాటిని సేవిస్తూ తృప్తిని పొందగలనా? ఇది యిక ఎంతమాత్రమూ సంభవించదు. ఓ ఛందకా! ఈ లోకం దుఃఖకాంతారమనే సంసార మధ్యంలో పడి వున్నదనీ, దుఃఖభూయిష్ఠమై వున్నదనీ, క్లేశవ్యాకులమైన దనీ భావిస్తున్నాను. ఇది దిక్కులేనిది. అపరాయణమైనది. మోహాంధకారంలో పడి వున్నది. ముసలితనం, వ్యాధి, మృత్యువు అనే వాటివల్ల పీడింపబడుతూ వున్నది. జన్మ దుఃఖాలతో కూడి కామాది శత్రువులచేత బాధింపబడుతూ వున్నది.

అనంతమైన యీ జగత్తు సంసారమనే మహాప్రవాహంలో కొట్టుకొనిపోతూ ఉన్నది. నేను మహాత్యాగమూ, శీలమూ, వ్రతమూ, క్షాంతీ మున్నగువాని బలం అనే దారువులతో తయారైనదీ వజ్రదృఢాలైన అధ్యాశయాల కట్లతో దృఢమైనదీ అయిన ధర్మమనే నావను ఎక్కి నడుపుతూ, అనంతమైన యీ జగత్తును తరింపజేస్తాను. శోకంతో కూడిన సంసారమనే కాంతారమూ, రోషమనే అలలూ, రాగమనే మొసళ్ళూ, సుడులూ మొదలైన విరోధులతో కూడి దుస్తరంగా వుండే దానియందే నా మనస్సు ఉన్నది. విరోధదృష్టి అనే మొసళ్ళూ, క్లేశాలనే రాక్షసులూ కల యీ సంసార సముద్రాన్ని నేను స్వయంగా దాటి, అనంతమైన యీ లోకాన్ని కూడా దాటించి, శుభప్రదమూ, జరామరణాలు లేనిదీ అయిన స్థలంలో స్థిరంగా నిలుపుతాను.''

బోధిసత్త్వుడు యిలా పలుకగా ఛందకుడు చాలా ఎక్కువగా ఏడుస్తూ ''దేవా! ఇదేనా నీ నిశ్చయం?'' అని ప్రశ్నించాడు.

అప్పుడు బోధిసత్త్వుడు ''ఓ ఛందకా! నా నిశ్చయాన్ని గురించి విను. అది ముక్తికోసమూ, సత్యంకోసమూ, హితంకోసమూ ఏర్పడినది. అది అవ్యయమైనది. చలనం లేనిది. దృఢమైనది. మేరుపర్వతంవలెనే చలనం లేనిది'' అని పలికినాడు.



''ఆ నిశ్చయ మేమిటో తెలుపవలె''నని ఛందకుడు అడిగాడు.

బోధిసత్త్వుడు ''వజ్రాయుధంవంటి పిడుగు తలపైని పడనీ, గండ గొడ్డలి గానీ, శక్తిగానీ, బాణాలు గానీ మీదపడితే పడనీ, వర్ష సమయంలోని మెరుపుల గుంపులవలె జ్వలిస్తూ వున్న -మరుగుతున్న ఇనుము పైని పడినా పడనీ, కొండశిఖరాలు విరిగి తలపైని పడనీ, నేను మాత్రం తిరిగి గృహంమీది వాంఛను పొందను'' అని గట్టిగా పలికాడు.

ఆ సమయంలో ఆకాశంపైని వున్న దేవతలు కిలకిల ధ్వనులు చేస్తూ అతనిపైని పుష్పవర్షాన్ని కురిపించారు. ''గొప్ప బుద్ధిమంతుడా! లోకానికి అభయం ఒసగిన నాయకుడా! విజయం పొందు. జయ హే'' అని నినాదం చేశారు.

చీకటితోను, ధూళితోను, ధూమకేతువుతోను ఆకాశం ప్రకాశించనట్లు ఆ పురుషశ్రేష్ఠుడైన బోధిసత్త్వుని మనస్సు విషయ సుఖాలవల్ల సంతోషం పొందదు. నిర్మలమైన జలంలో పుట్టిన తామరవలెనే అతని నిర్మలమైన మనస్సు విషయ సుఖాలను అంటుకోదు.

భిక్షులారా, బోధిసత్త్వుని ఈ దృఢనిశ్చయాన్ని తెలుసుకొని శాంతమతి, లలితవ్యూహుడు అనే దేవపుత్రులు కపిలవస్తు మహానగరంలో సమస్త స్త్రీ పురుషులూ, బాలబాలికలూ అందరూ గాఢనిద్రలో మునిగి వుండేటట్లు చేశారు. ఎట్టి శబ్దాలూ లేకుండా చేశారు.

భిక్షులారా, తర్వాత పట్టణంలోని జను లందరూ గాఢనిద్రలో మునిగి వున్న సంగతినీ, అర్ధరాత్రిసమయం అయిన సంగతినీ, నక్షత్రాధిపతి పుష్యుడై వున్న విషయాన్నీ తెలుసుకొని బోధిసత్త్వుడు నిష్క్రమణానికి ఇదే తగిన సమయమని గ్రహించి ఛందకుణ్ణి పిలిచి ''ఓ ఛందకా! ఇప్పుడు నీవు ఎంతమాత్రమూ విచారించవద్దు. ఇప్పుడే కంటకాన్ని అలంకరించి తీసుకుని రా. ఆలస్యం చెయ్యవద్దు'' అని చెప్పాడు.

బోధిసత్త్వుడు ఈ విధంగా పలికిన వెంటనే నలుగురు లోకపాలకులున్నూ ఆ మాటనే పలికారు. వారు వేగంగా తమ తమ భవనాలకు

వెళ్ళి బోధిసత్త్వుణ్ణి పూజించడానికి తమ తమ వ్యూహాలతో కూడా త్వర త్వరగా మళ్ళీ కపిలవస్తు మహానగరానికి వచ్చారు.

గంధర్వులకు ప్రభువైన ధృతరాష్ట్రుడనే మహారాజు తూర్పు దిక్కునుంచి వచ్చాడు. అతడు కోట్లకొలది వుండే గంధర్వులతోనూ, నానాతూర్య సంగీతధ్వనులతోనూ వచ్చాడు. వచ్చి, కపిలవస్తు మహా నగరానికి ప్రదక్షిణం చేసి, బోధిసత్త్వునికి నమస్కరిస్తూ తూర్పుదిక్కున ఉన్నాడు.

విరూఢకుడనే మహారాజు దక్షిణదిక్కునుంచి వచ్చాడు. అతనితో కూడా కోట్లకొద్దీ కుంభాండకులు వచ్చారు. వారు చేతులలో అనేకాలైన ముత్యాలహారాలను పట్టుకొని వున్నారు. అనేకరత్నాలనూ, మణులనూ తెచ్చారు. పరిమళోదకంతో నిండి వున్న అనేక ఘటాలను కూడా తీసుకొని వచ్చారు. వారితో కూడా వచ్చిన ఆ విరూఢక మహారాజు కపిల వస్తు మహానగరానికి ప్రదక్షిణంచేసి, తిరిగి దక్షిణంవైపు పోయి, బోధి సత్త్వునికి నమస్కరిస్తూనే నిలిచి వుండినాడు.

పడమటిదిక్కునుంచి విరూపాక్షుడనే మహారాజు వచ్చాడు. అతనితోకూడా కోట్లకొలది నాగులువచ్చారు. వారు చేతులలో ముత్యాల హారాలు పట్టుకొని వున్నారు. అనేకాలైన రత్నాలనూ, మణులనూ తెచ్చారు. గంధచూర్ణాన్నీ, పుష్ప వర్షాన్నీ మేఘాలు వర్షించినట్లు కురిపించి చల్లని వాయువులు కలిగేటట్లు వీవసాగినారు. వారు వచ్చి, కపిలవస్తు నగరానికి ప్రదక్షిణంచేసి, వచ్చినదారినే పడమటివైపుగా పోయి, బోధిసత్త్వునికి నమస్కారంచేస్తూ నిలిచి వున్నారు.

ఉత్తరదిక్కునుంచి కుబేరుడనే మహారాజు వచ్చాడు. అతడు కోట్లకొలదీ వున్న యక్షులతో కూడా వచ్చారు. ఆ యక్షులు జ్యోతులనూ, రసములనూ, మణులనూ, రత్నాలనూ తెచ్చారు. వారు చేతులతో దీపికలను పట్టుకొని వచ్చారు. మండుతూ వున్న దివ్వటీలను చేతులతో ధరించి వున్నారు. ఇంకా ధనుస్సు, బాణాలు, కత్తులు, శక్తులు, తోమరాలు, త్రిశూలాలు, చక్రాలు, భిందిపాలాలు మొదలైన ఆయుధాలను ధరించి వున్నారు. దృఢంగా కవచాలను ధరించి సర్వసన్నద్ధులై



వున్నారు. వారు వచ్చి కపిలవస్తు మహానగరానికి ప్రదక్షిణంచేసి, వచ్చిన దారినే వెనుకకువెళ్ళి ఉత్తరంగా నిలిచి బోధిసత్త్వునికి నమస్కారంచేస్తూ ఉన్నారు.

దేవతలకు ప్రభువైన ఇంద్రుడు ముప్పయి ముగ్గురు దేవతలతోకూడా వచ్చాడు. ఆ దేవతలు దివ్యపుష్పాలనూ, గంధ మాల్యాలనూ, విలేపన చూర్ణాలనూ, వస్త్రాలనూ, ఛత్రాలనూ, ధ్వజపతాకనూ, ఆభరణాలనూ ధరించి ఉన్నారు. ఇలా వచ్చి, కపిలవస్తు మహానగరానికి ప్రదక్షిణంచేసి, అతడు సపరివారంగా వచ్చిన దారినే వెనుకకు వెళ్ళి, మీదిభాగాన అంత రిక్షంలో బోధిసత్త్వునికి నమస్కరిస్తూ నిలిచి వున్నాడు.

భిక్షులారా, ఛందకుడు బోధిసత్త్వుని వచనాన్ని విని అశ్రువులతో నిండిన కన్నులతో "ఓ రాజకుమారా! నీవు కాలాన్నీ, వేళనూ బాగా ఎరిగినవాడవు. సమయాన్నీ తెలిసినవాడవు. ఆలోచించు. ఇది నీవు నిష్క్రమణం చెయ్యడానికి అకాలమూ, అసమయమున్నూ కూడా" అని పలికాడు.

బోధిసత్త్వుడు "ఇదే తగిన కాలం. నేను ఎట్టి సమయంకోసమై వెతుకుతూ, నిరీక్షిస్తూ ఉన్నానో ఆ దీర్ఘరాత్ర సమయం వచ్చింది. జరా మరణ రహితమైన బోధిని పొంది జగత్తును తరింపజేసే సమయం వచ్చినది. ఆ సమయం ఇదే. ఇదే ఇక్కడి ధర్మత" అని తెలియజేశాడు.

ఇక్కడ కొన్ని ప్రాచీనశ్లోకాలు వున్నాయి. వాటి తాత్పర్యమిది.

భిక్షులారా, భూమిమీదనూ, అంతరిక్షంమీదనూ ఉండే పాలకులూ, దేవతలకు ప్రభువూ, యక్షులతో కూడినవాడూ అయిన ఇంద్రుడూ, యామదేవతలూ, తుషితదేవతలూ, నిర్మిత దేవతలూ, వరనిర్మితోద్యుక్త దేవతలూ సంసిద్ధులై వున్నారు. మానవంతుడైన వరుణుడూ, నాగరాజూ, ఎప్పుడూ ఇంకని సముద్రులూ కూడా అభినిష్క్రమణ సమయంలో, పురుష పుంగవుడైన బోధిసత్త్వుని పూజించడంకోసం సిద్ధంగా ఉన్నారు. ప్రశాంతచారులూ, ధ్యానగోచరులూ అయిన రూపావచర దేవతలు

కూడా, నరోత్తముడూ, త్రైలోక్యపూజ్యుడూ అయిన బోధిసత్త్వుని పూజించడానికై సంసిద్ధులై వచ్చారు.

పూర్వచర్యను ఆచరిస్తూ సహాయకులుగా వున్న శుద్ధసత్త్వులు, బోధిసత్త్వుని నిష్క్రమణాన్ని చూచే కోరికతోనూ, అతన్ని పూజింపవలెననే సంకల్పంతోనూ పది దిక్కులనుంచీ వచ్చి కాచుకొని ఉన్నారు.

బలపరాక్రమ సంపన్నుడూ, మహాత్ముడూ అయిన గుహ్యకాధిపతి ప్రకాశిస్తూ వున్న వజ్రాన్ని చేతిలో ధరించి, ఆకాశంమీదనే బోధిసత్త్వుని రక్షణకోసం సన్నద్ధంగా ఉన్నాడు. దేవపుత్రులైన సూర్యచంద్రులు ప్రదక్షిణం చేస్తూ, పది వేళ్లూ దగ్గరగా చేరేటట్లు చేతులు జోడించి నైష్క్రమ్య శబ్దాన్ని ఉచ్చరిస్తూ ఉన్నారు.

పారిషదులతో కలిసి వచ్చిన నక్షత్రాధిపతి అయిన పుష్యుడు ఉదారమైన ఆత్మభావాన్ని వ్యక్తం చేస్తూ, నరోత్తముడైన బోధిసత్త్వుని యెదుట నిలిచి, మనోజ్ఞంగా ధ్వనిచేస్తూ ఇలా అన్నాడు—"ఓ మహాశయా! ఇప్పుడు నీకు సమస్త మంగళాలూ సిద్ధించినవి. అభినిష్క్రమణానికీ తగిన సమయం వచ్చినది. సంసార వ్యామోహాన్ని నశింపజేసే లోకోత్తరుడవైన మహాశయా! నీతో కూడా నేనూ వస్తున్నాము. ఓ దేవపుత్రా! శీఘ్రంగా లెమ్ము. బలమూ, పరాక్రమమూ కల నీవు లేచి, సంచోదకుడవై లోకాన్ని మంచి మార్గంలో పెట్టు. దుఃఖంలో మునిగి వున్న సమస్త ప్రాణులనూ ఉద్ధరించు. నీవు గృహపరిత్యాగం చెయ్యడానికి అనుకూలమైన సమయం ఇదే! ఓ దేవా! మనోజ్ఞాలైన పుష్పాలను నీపైని వర్షిస్తూ సహస్రకోటుల సంఖ్యలో దేవతలు వచ్చారు. ఆ దేవతలతో కూడా, దీప్తతేజుడనే దేవపుత్రుడు వచ్చి, నీ పర్యంకంపైని కూర్చుని వున్నాడు. గమనించు. పట్నంలో ఉండే స్త్రీ పురుషులూ, బాల బాలికలూ అందరూ శ్రమపడిన మనస్సులు కలవారై తపోభ్యాస మార్గంనుంచి చ్యుతులై నిద్రపోతూ ఉన్నారు. ఏనుగులూ, గుర్రాలూ, గోవులూ మొదలైన పశుగణాలూ, చిలుకలూ, గోరువంకలూ, క్రౌంచ పక్షులూ, నెమిళ్లూ మున్నగు పక్షులున్నూ మిక్కిలి అలసిపోయినవై నిద్రపోతూ ఉన్నవి. అందువల్ల నిన్ను ఎవ్వరూ చూడలేరు. ఓ



మహాత్మా! నీవు అభినిష్క్రమణం చెయ్యకుండా భద్రంగా కాపాడడానికి దృఢమైన వజ్రాయుధం, తోమరం మున్నగు ఆయుధాలు ధరించిన శాక్యకుమారులు నియమించబడివున్నారు గదా! తోరణ ద్వారాలలో ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ ఉంచబడ్డాయి కదా! మహారాజుగారూ, తక్కిన రాజులూ జాగ్రత్తగా ఉన్నారు కదా! అయినా వారందరూ ఇప్పుడు గాఢనిద్రలో మునిగి ఉన్నారు. స్త్రీలు కూడా, తమ వస్త్రాలు కొంచెం తొలగిపోయి మైమరచి నిద్రపోతున్నారు. నీవు ఇప్పుడు అభినిష్క్రమణం చేస్తే ఎవ్వరికీ తెలియదు."

బోధిసత్త్వుడు ఈ వాక్యాలను గ్రహించాడు. అర్ధరాత్రి సమయం అయిందని తెలుసుకున్నాడు. అతడు బ్రహ్మస్వరం కలవాడై కలవింకం వలెనే ఇంపైన కంఠంతో మధురములైన మాటలతో ఛందకునిగురించి ఇలా అన్నాడు—"మంచిది ఛందకా! శోభనకరంగా అలంకరించి కంటకాన్ని (ఆ పేరుగల గుర్రాన్ని) తీసికొని రా. నాకు ప్రియమైన కార్యాన్ని చేయదలచితే ఏమాత్రమూ ఆటంకం చెప్పక వెంటనే కంటకాన్ని తీసుకుని రా" అని.

ఛందకుడు ఈ మాటలను విని, గుడ్ల నీరు గుక్కుకుంటూ తన యజమాని అయిన రాజకుమారుడితో "ఓ సాత్త్వికాగ్రేసరుడవైన రాజకుమారా! నీవు ఎక్కడికి వెళ్లుతావు? గుర్రంవల్ల నీకు ఏమి పని ఉన్నది? నీవు కాలాన్నీ, ధర్మాన్నీ, సమయాన్నీ బాగా తెలుసుకున్నవాడివి. ఎక్కడికి పోవడానికీ ఇది నీకు తగిన సమయం కాదు. ద్వారాలను అన్నిటినీ మూసివేసి, అడ్డుగడియలను తలుపులకు గట్టిగా బంధించారు. నీవు కోరినా ఎవ్వరూ తలుపులు తియ్యరు" అని పలికాడు.

ఛందకుడు ఇలా అనగానే దేవతలకు ప్రభువైన ఇంద్రుడు మనస్సులో సంకల్పించుకొని ద్వారాలను అన్నింటినీ తెరచుకొనేటట్లు చేశాడు. దీన్ని చూడగానే ఛందకునికి ఆశ్చర్యమూ, సంతోషమూ, దుఃఖమూ కలిగాయి. అతని కన్నులలో నీళ్ళు గిర్రున తిరిగాయి. "అయ్యో! మాకు ఇప్పుడు దిక్కెవరు? ఏమి చెయ్యగలం? ఎక్కడికి పారిపోగలము? గొప్ప తేజస్సుతో వెలుగుతూ ఉన్న ఇతని మాటను

ఎదిరించడానికి ఎవ్వరికి సాధ్యమవుతుంది?'' అని అనుకున్నాడు. ''మిక్కిలి దృఢంగా ఉన్న చతురంగబలం ఉండి మాత్రం ఏమి ప్రయోజనం? ఎవ్వరు అడ్డగలరు? మహారాజుకూ, తక్కిన రాజబంధువులకూ ఇది ఏమిన్నీ తెలియనే తెలియదు. స్త్రీసంఘం అంతా కూడా నిద్రపోతూనే ఉన్నది. దేవతలు స్త్రీలను గాఢనిద్రలో మునిగేటట్లు చేశారు. ఇక బోధిసత్త్వుడు గృహం విడిచిపెట్టి వెళ్ళగలడు. మొదట నిశ్చయించుకున్న అతని సంకల్పం నెరవేరగలదు'' అని విచారపడినాడు.

అప్పుడు సహస్రకోటి సంఖ్యలో ఉన్న దేవతలు మిక్కిలి సంతోషంతో ఛందకుడిని చూచి ఇలా అన్నారు: ''మేలు! మేలు! ఛందకా! కంటకాన్ని తీసుకొని రా. నీ యజమానుడికి ఖేదాన్ని కల్గించకు. దేవాసురులందరూ అసంఖ్యాకంగా భేరీలనూ, శంఖాలనూ, మృదంగాలనూ, తూర్యాలనూ ధ్వనింపజేస్తున్నారు. అయినా పట్టణం యావత్తూ గాఢనిద్రావిముద్రితంగానే ఉన్నది. దేవతల ప్రభావం అట్టిది! ఎవ్వరికీ తెలివి రాలేదు కదా!' ఓ ఛందకా! నిర్మలమైన అంతరిక్షాన్ని చూడు. దివ్యమైన వెలుగు ప్రకాశిస్తూ ఉన్నది. బాగా చూడు. అసంఖ్యాకులైన బోధిసత్త్వులు రాజకుమారుని పూజించడానికి వచ్చి ఉన్నారు. శచీపతి అయిన ఇంద్రుడు తన బలగంతోకూడా ద్వారప్రదేశంలో నిలిచి ఉన్నాడు. దేవతలూ, అసురులూ, కిన్నరులూ కూడా రాజకుమారు పూజించడానికి వచ్చి వున్నారు. వారిని కూడా చూడు.''

ఛందకుడు దేవతలు పలికిన మాటలను విని, కంటకంతో ''ఓ అశ్వరాజమా! రాజకుమారుడు వస్తున్నాడు. నీవు సంతోషంతో సకిలించు'' అని బంగారుగిట్టల ఆ గుర్రాన్ని చక్కగా అలంకరించి, కలత పడిన మనస్సుతో ఏడుస్తూ రాజకుమారునివద్దకు తీసుకొని వచ్చాడు.

''శుభలక్షణాలు కల రాజకుమారా! లోకహితకరా! శుభలక్షణాలు గల నీ అశ్వం యిదిగో! వెళ్ళు. నీ కోరికే జరగనీ. పూర్వం నీవు నిశ్చయించుకున్న విధంగా లోకోద్ధరణకై బయలుదేరు. నీకు విఘ్నం



కలుగజేయదలచినవారు శాంతం పొందుదురు గాక! సమస్త జనులకూ శాంతినీ, స్వర్గసౌఖ్యాన్నీ కలుగజేయుదువు గాక!'' అని అన్నాడు.

తర్వాత రాజకుమారుడు పడకనుంచి లేచాడు. అప్పుడు షడ్వికారాలతో కూడిన భూమి యావత్తూ కంపించినది. అతడు పూర్ణచంద్రుని వలె తెల్లగా ప్రకాశిస్తూ ఉన్న ఆ అశ్వాన్ని అధిరోహించాడు. లోకపాలురు పద్మాలవలెనే వుండి, పరిశుద్ధములైన తమ చేతులతో ఆ అశ్వాన్ని స్పృశించారు. ఇంద్రుడూ, బ్రహ్మ దానికి దారిని చూపుతూ ముందు నడవసాగారు.

ఆ కంటకాశ్వంనుండి వెడలిన తేజస్సు భూమి అంతటా వ్యాపించి, ప్రకాశించినది. సమస్త ప్రాణులూ అపాయాలనుండి విడివడి, కష్టాలనుంచి తప్పకొని సుఖించారు; శాంతి పొందారు. దేవాసురులు పూలవాన కురిపించి, తూర్యధ్వనులు చేసి మిక్కిలి ఆనందించారు. వారందరూ సంతోషంతో కపిలవస్తు మహానగరానికి ప్రదక్షిణం చేసి వెళ్ళిపోయారు.

మహాపురుషుడైన బోధిసత్త్వుడు నగరం విడిచి వెళ్ళిపోతూ ఉండగా నగరాధిదేవత దీనమైన మనస్సుతో వచ్చి, అతని యెదుట నిలిచి, పద్మమును పోలి వున్న అతని ముఖంవైపు చూస్తూ కరుణ ఉట్టిపడేటట్లు ఇలా పలికింది:

''ఓ మహాశయా! నీవు లేకపోతే ఈ నగరం ప్రకాశించదు. పట్నం అంతటా చీకటి వ్యాపించినట్లే ఉన్నది. నీ వీ రాజభవనాన్ని విడిచిపెట్టిపోతే, నాకున్నూ ఈ నగరంపైని ప్రీతి లేకుండా పోతుంది. నీవు లేకుంటే పక్షుల మధురధ్వనులు వినబడవు. అంతఃపురంలో మధురములైన వేణువీణానాదాలూ వినరావు. నిన్ను ఉదయం మేల్కొల్పుతున్న మంగళధ్వనులూ, గీతధ్వనులూ కూడా వినబడవు. ఓ మహాశయా! నీవు ఇక్కడ వుంటే నిన్ను పూజించడానికి సురుల, సిద్ధుల గణాలు రాత్రిందినమూ వస్తూ వుండడం చూడవచ్చును. నీవు లేకుంటే వారిని చూడడం అసంభవమే గదా! క్లేశాలను నశింపజేసే నీవు లేకపోతే దివ్యమైన గంధాన్ని ఆఘ్రాణించడం కూడా అసంభవమే! నీవు విడిచిపెట్టిన యీ

భవనం నిర్ముక్తమాల్యంవలెను, పర్యుషితాన్నంవలెను, నటులు వీడిన రంగస్థలంవలెను నాకు కానబడుతుంది. తిరిగి దీనికి తేజస్సు గాని, శోభ గాని చేకూరదు. నీవు వెళ్ళిపోతూ నగరం ఓజస్సునూ, బలాన్ని తీసుకొని పోతున్నావు. అడవితో సమానంగానే ఈ పట్టణం వుంటుంది. అంతే కాని, ఎంతమాత్రమూ ప్రకాశించదు. నీవు భూమండలానికి చక్రవర్తిగా ఉంటావని చెప్పిన మహర్షుల వచనం వ్యర్థం అవుతున్నది. నీవు అభినిష్క్రమణం చేస్తే ఎంతో బలంగల శాక్యబలం దుర్బలమైపోతుంది. మీ రాజవంశం విచ్ఛేదం అవుతుంది. శాక్యగణం ఆశలన్నీ నిరాశ లవుతవి. పరిశుద్ధుడవూ, నిర్మలుడవూ అయిన నీవు గృహాన్ని విడిచి వెళ్ళితే నేనూ నీదారినే వెళ్ళిపోగలను. ఈ భవనాన్ని చూడు. ఎంతో దయనీయంగా కానవస్తున్నది.''

మహామతిమంతుడైన రాజకుమారుడు ఆ భవనాన్ని చూచి, మధుర స్వరంతో ''జనసమూహాన్ని జరామరణాల బాధనుండి తప్పించే మార్గం తెలుసుకోనేదాకా నేను కపిలవస్తునగరాన్ని ప్రవేశించను. హృద్యమైన అజరామరణపదాన్ని పొందకుండా కపిలవస్తు ముఖం చూడను. ఆసనాన్నీ, శయనాన్నీ స్వీకరించను'' అని నిశ్చయించుకున్నాడు.

లోకంలో ప్రధానుడైన బోధిసత్త్వుడు గృహంనుంచి నిష్క్రమిస్తున్న సమయంలో ఆకాశమార్గంగా అప్సరసలు అతన్ని వెంబడిస్తూ ఇలా స్తుతించారు:

''ఈయన గొప్ప కరుణాళువు, గొప్ప పుణ్యక్షేత్రంవంటివాడు. పుణ్యార్థాలకు సుక్షేత్రమైనవాడు. అమృత ఫలాలను ఇచ్చేవాడు. బహు కల్పకోటి సంవత్సరాలు దానదయాకరుణాదులు వ్యాప్తంచేస్తూ, ఉత్తమవ్రతం అనుసరించినవారూ, అఖండచర్య కలవారూ అయిన బోధిసత్త్వాలు తమ ఉత్తమశీలాన్ని రక్షించుకుంటున్నారు. ఇతనికి కామాలపైగాని, భోగాలపైగాని కోరిక లేదు. బోధిసత్త్వుడు ఎప్పుడూ క్షాంతివాది. ప్రతి అవయవాన్నీ ఛేదించినా శాంతం విడువడు. క్రోధం గాని, రోషం గాని లేదు. ప్రాణులను రక్షించుటకే పాటుపడతాడు. ఇతడు సదా వీర్యవంతుడై ఉంటాడు. ఖిన్నుడై ఉండడు. కోట్లకొద్దీ



యజ్ఞాలను చేసిన యాజకుడు! సమ్యక్సంబోధిని పొందినవాడు. ఇతడు ఎప్పుడూ ధ్యాననిమగ్నుడై ఉంటాడు. మిక్కిలి ప్రశాంతమైన మనస్సు కలవాడు. తన ధ్యానంవల్లనే కోట్లకొలదిగా ఉన్న ప్రాణులను సమస్త క్లేశాలనుండి తప్పిస్తాడు! నిస్సంగుడు. ప్రాజ్ఞుడు. ఎన్నో కల్పాలుగా ముక్తుడై జినుడై ఉన్నాడు. ముందు స్వయంభువుగా కాగలడు. ఈయన ఎప్పుడూ మైత్రితోనిండిన మనస్సు కలిగి, కరుణయొక్క పరమావధిని పొంది ఉన్నాడు. ముదితహృదయుడై, ఉపేక్షాధ్యాయి అయి, విధిజ్ఞుడై బ్రాహ్మ మార్గంలో ధ్యానంచేస్తూ ఉంటాడు. దేవతలను అతిక్రమించినవాడు. భయార్దితులకు శరణు. కళ్ళులేనివారికి కన్ను. ఉపద్రవాలకు లయం. చిర రోగులకు వైద్యుడు. సహస్రనేత్రుడైన ఇంద్రుడూ, స్వయంగా ఆవిర్భవించిన బ్రహ్మ యితడే! ఈ బోధిసత్త్వుడు ధీరుడు. గొప్ప ప్రజ్ఞ కలవాడు. వీరుడు. నిర్మలచిత్తుడు. శూరుడు. కష్టాలను పోగొట్టేవాడు. జయింపరానివారిని జయించేవాడు. శత్రువిజేత! భయంలేని మృగరాజు వంటివాడు! శాంతచిత్తంగల గజరాజువంటివాడు! గణానికి ప్రధానుడైనవాడు. కోపం లేనివాడు. శాంతస్వభావుడు! కాంతితో కూడిన చంద్రునివంటివాడు. తేజస్సుతో కూడిన సూర్యుని పోలినవాడు. సమస్తమైన చీకటిని పోగొట్టే ఉల్కవలెనే గొప్ప వెలుగుతో ప్రకాశించేవాడు. ఉత్తమస్వభావమనే రేకులతో కూడి అంటీఅంటని పద్మంవంటివాడు. మేరుపర్వతంవలె చలించనివాడు. భూమివలెనే సహనభావం కలవాడు. సకలోపజీవ్యుడు. క్షోభంలేని సముద్రంవంటివాడు. ఈతడు పాపాలనూ, స్కంధాలనూ నశింపజేసేవాడు. మృత్యువు లేకుండా చేసేవాడు. మహా సార్థవాహుడు. కుమార్గాలలో నెలకొని వున్నవారికి ఉత్తమమైన అష్టాంగమార్గాన్ని త్వరలో ఉపదేశించగలడు. జరామరణక్లేశాలను నశింపజేసి, గాఢమైన తిమిరాన్నుంచి విముక్తిని పొంది, ద్యావాపృథ్వులలో పేరుపడి స్వయంభువు అయినవాడు! అప్రమేయుడైన ఈయన లోకోపకారార్థమై మహాపురుషరూపంలో అవతరించి, స్తుతులను పొందుతున్నాడు. మీరూ స్తోత్రం చేయండి. మేమూ స్తోత్రం చేసి ఈ వాదిసింహునివలె అవుతాము.''

ఓ భిక్షులారా, ఇలా బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చేసి, శాక్యులను దాటుకొని, అంతర్గృహాలను అతిక్రమించి, మల్లులను తప్పుకొని పోతూ ఆరు యోజనాల దూరం వెళ్ళేసరికి తెల్లవారినది. అప్పుడు బోధిసత్త్వుడు కంటకాశ్వంనుంచి దిగి భూమిపైని అడుగు ఉంచాడు. ఇంత వరకూ తన్ను అనుసరించి గొప్పగా వస్తూ వున్న దేవ, నాగ, యక్ష, గంధర్వ, అసుర, గరుడ, కిన్నర, మహోరగ సంఘాన్ని వెనుకకు పంపివేశాడు. అలా పంపివేసినతర్వాత తన ఆభరణాలనూ, కంటకాశ్వాన్నీ ఛందకునికి ఇచ్చివేయాలనే సంకల్పం అతనికి కలిగింది.

అప్పుడు బోధిసత్త్వుడు ఛందకుడితో "ఓ ఛందకా! నీవు వెళ్ళిపో. ఈ ఆభరణాలనూ, కంటకాశ్వాన్నీ తీసుకుని వెనక్కు వెళ్లిపో" అని తన ఆభరణాలను తీసివేసి యిస్తూ, ఛందకుడికి కంటకాన్ని అప్ప గించాడు. ఛందకుడు మారుమాటాడక వాటిని తీసుకుని వెనుకకు వెళ్ళి పోయాడు. ఛందకుడు వెనుకకు మళ్లిపోయిన స్థలంలో ఒక చైత్యం నిర్మింపబడింది. అది యిప్పటికీ నిలిచి 'ఛందకుడు ప్రతినివృత్తుడైన స్థలమయినందున 'ఛందక నివర్తనం' అని పేరు పొందింది.

పిదప బోధిసత్త్వునికి మరొక ఆలోచన కలిగింది: "ఈ జుట్టు వుంచుకుని సన్యసించడం ఎలా కుదురుతుంది?" అని. ఇలా ఆలోచించి, అతడు కత్తితో తన కేశాలను ఖండించి అంతరిక్షంపైకి విసిరివేశాడు. వాటిని ముప్ఫయి ముగ్గురు దేవతలూ పట్టుకొని పూజించడంకోసం భద్ర పరిచారు. ఇప్పటికీకూడా దేవతలు ముప్ఫయి ముగ్గురూ చూడామహోత్స వాన్ని జరుపుకుంటున్నారు. ఆ స్థలంలో ఒక చైత్యం నిర్మించబడిఉన్నది. ఇప్పటికీ అది 'చూడాపరిగ్రహణస్థల'మని ప్రసిద్ధిపొంది వుంటున్నది.

తర్వాతకూడా బోధిసత్త్వుడికి మరొక ఆలోచన కలిగింది: "ఈ ధరించిన పట్టువస్త్రాలతో సన్యసించడం ఎలాగున కుదురుతుంది?" అని. "వనవాసానికి అనుకూలంగా కావిబట్టలు లభిస్తే బాగుంటును" అని అతడు అనుకొన్నాడు.

శుద్ధావాసకాయికులైన దేవపుత్రులు దీన్ని గ్రహించారు. బోధిసత్త్వునికి కాషాయవస్త్రాలను ఇయ్యవలెనని వారు సంకల్పించారు. వారిలో



ఒక దేవపుత్రుడు తన దివ్యరూపాన్ని విడిచిపెట్టి ఒక వేటకానిరూపం ధరించి కావిగుడ్డలను కప్పుకొని బోధిసత్త్వుని యెదుటికి వచ్చాడు.

అప్పుడు బోధిసత్త్వుడు వానిని చూచి "ఓయీ! నీవు ఆ కావి గుడ్డలను నాకు ఇచ్చివేసినయెడల, నీకీ పట్టువస్త్రాలను ఇస్తాను" అని అన్నాడు.

ఆ లుబ్ధకుడు "అయ్యా! నీకు పట్టువస్త్రాలే తగినవి. నాకో ఈ కావిగుడ్డలే అర్హమైనవి" అని అన్నాడు.

బోధిసత్త్వుడు "అది కాదు. నాకు కావిగుడ్డలు కావాలి. వాటిని ఇవ్వవలెనని నిన్ను ప్రార్థిస్తున్నాను" అని అన్నాడు.

అప్పుడు లుబ్ధక వేషంలో వున్న దేవపుత్రుడు బోధిసత్త్వునికి కాషాయ వస్త్రాలను ఇచ్చి, అతనివద్దనుంచి పట్టువస్త్రాలను తీసుకున్నాడు. తర్వాత ఆ దేవపుత్రుడు ఆ వస్త్రాలపైని ఉండే గౌరవంతో వాటిని రెండు చేతులతోనూ తలపైని ఉంచుకొని, పూజించడంకోసమై దేవ లోకానికి తీసుకువెళ్లడానికి నిశ్చయించాడు. దీనిని ఛందకుడు గమనిస్తూనే ఉన్నాడు. ఇది జరిగిన స్థలంలో ఒక చైత్యం నిర్మించబడింది. అది యిప్ప టికీ నిలిచి 'ఇది బోధిసత్త్వుడు కాషాయగ్రహణం చేసిన చోటు' అని వ్యక్తం చేస్తూ ఉన్నది.

ఈ విధంగా బోధిసత్త్వుడు శిఖను ఛేదించుకొని, కాషాయవస్త్రా లను ధరించిన సమయంలో వేలకొలదిగా ఉన్న దేవపుత్రు లందరూ మిక్కిలి సంతృప్తిచెంది, ఎంతో సంతోషించారు. ఉత్సాహంతో వారి మనస్సులు పొంగిపోయాయి. ప్రీతినీ, సౌమనస్యాన్నీ వహించి హీహీ ధ్వనులుచేస్తూ, కిలకిలలాడుతూ ముచ్చటలతో వారు ఎంతో సందడి చేశారు. "ఓ మార్షులారా! చూచారా? సిద్ధార్థుడు సన్యసించాడు. ఆయన లోకోత్తరమైన సమ్యక్సంబోధిని సంపాదించి సక్రమంగా ధర్మచక్రాన్ని నడుపగలడు. లెక్కలేని జాతి (జన్మ) ధర్మాలను అనుసరిస్తూవుండే జను లకు ఆ జన్మవిభ్రాంతిని లేకుండా చేస్తాడు. జరామరణాలవల్లనూ, వ్యాధి శోకాలవల్లనూ, పరిదేవనదుఃఖాలవల్లనూ, దౌర్మనస్యాపాయాలవల్లనూ

జనులకు విడుదలను కలిగించి, సంసారసముద్రం ఆవలిఒడుకు చేరుస్తాడు. ఇట్లు చేర్చి లోకోత్తరమూ, క్షేమాభయాలను ఇచ్చేదీ, ఉపద్రవాలు లేనిదీ, మంగళకరమైనదీ, రజోగుణరహితమై అమృతమయమైనదీ అయిన ధర్మధాతువులో నిలుపగలడు'' అని పరస్పరం హెచ్చరించుకున్నారు. వారు చేసిన శబ్దం అకనిష్ఠభవనంవరకూ వ్యాపించినది!

ఇది యిలాగున ఉండగా అంతఃపురాన్ని భద్రంగా కాపాడుతున్న స్త్రీలు రాజకుమారుడు కనబడకపోగా మిక్కిలి ఆందోళనచెంది, వేసవి భవనంలోనూ, వర్షాకాలభవనంలోనూ, శీతకాలపు భవనంలోనూ వెతికారు. అతని జాడ తెలియలేదు. నలుగురూ, నాలుగువైపులకూ పోయి, ఆసనాలనూ, గృహాలనూ గాలించారు. కాని లాభం లేకపోయింది. అందరూ ఒక్కచోట చేరి ఆడుగొర్రెలవలె అరుస్తూ విలపించారు. మహాశోకార్తలు కొందరు 'హా తండ్రీ!' అని, మరికొందరు 'అయ్యో! సోదరా!' అని, ఇంక కొందరు మిక్కిలి దుఃఖంతో 'హా! నాథా!' అని విలపించారు. కొందరు 'హా భర్తా!' అనీ, కొందరు 'హా స్వామీ!' అనీ, కొందరు నానావిధాలైన ప్రియవచనాలు పలుకుతూ ఏడ్వసాగారు. కొందరు ఒకరిపైని ఒకరు పడి, కొందరు తలను మొత్తుకుంటూ, కొందరు ఒకరిముఖాలు ఇంకొకరు చూచుకుంటూ ఏడ్వసాగారు. కొందరు కళ్ళు తుడుచుకుంటూ, కళ్ళు తిప్పుకుంటూ, కొందరు గుడ్డలతో ముఖాలు కప్పుకుంటూ ఏడ్వసాగారు. కొందరు చేతులతో గుండెలు కొట్టుకుంటూ, కొందరు చేతులతో తొడలను చరచుకొంటూ, కొందరు బుజాలను కొట్టుకొంటూ, కొందరు తలలు వంచుకొనీ, మరికొందరు తలమీద దుమ్ముపోసుకుంటూ విలపించారు. కొందరు జుట్టు విరియబోసుకుంటూ, మరికొందరు జుట్టు పీకుకొంటూ ఏడ్చారు. కొందరు చేతులు పైకి ఎత్తి విలపించారు. కొందరు బాణాలు తగిలిన జింకలవలె వేగంగా పరుగెత్తుతూ దుఃఖించారు. మరికొందరు గాలిచేత వూగులాడుతున్న అరటిచెట్లవలెనే కంపిస్తూ ఏడ్చారు. కొందరు నేలమీదపడి దొర్లుతూ ఏడ్వసాగారు. కొందరు వల నుంచి తీసి నేలమీద పడవేసిన మత్స్యాలవలెనే కొనవూపిరితో దుఃఖించారు. కొందరు మొదలు నరికిన చెట్లవలెనే నేలపైని కూలి ఏడ్వసాగారు.



ఆ సమయంలో మహారాజైన శుదోదనుడు నిద్రపోతూ ఉన్నాడు. ఈ శబ్దం వినబడగా అతనికి తెలివి వచ్చింది. ఆయన శాక్యుల నందరినీ పిలిచి "అంతఃపురంలో పెద్దగోల వినబడుతున్నది. కారణం ఏమిటి?" అని అడిగాడు. "మహాప్రభూ! రాజకుమారుడు అంతఃపురంలో కానరావడంలేదు. అందువల్ల గోలగా ఉంది" అని వారు చెప్పారు.

"అయితే, కుమారుడు బయటికి పోకుండా వేగంగా నగరద్వారానన్నింటినీ మూసివెయ్యండి. అలాచేస్తే కుమారుణ్ణి వెతకవచ్చును" అని మహారాజు అన్నాడు.

తర్వాత శాక్యులు రాజభవనాల బయటా, లోపలా కూడా జాగ్రత్తగా వెతికారు. ఎంత వెతికినా రాజకుమారుడు కానరావడం లేదు.

మహాప్రజాపతి గౌతమి దుఃఖాతిశయంవల్ల తెలివి తప్పి నేలమీద పడి మూర్ఛపోయింది. తెలివి వచ్చినపిదప మహారాజును చూచి "మహాప్రభూ! శీఘ్రంగా కుమారుడు నా వద్దకు వచ్చేట్టు చేయండి" అన్నది.

అప్పుడు రాజు రాజకుమారుణ్ణి వెదకడానికి నాలుగు దిక్కులకూ గుర్రపురౌతులను (అశ్వదూతలను) పంపించాడు. "మీరు వెతకండి. రాజకుమారుడు కనబడితేగాని, మీరు తిరిగి రావద్దు" అని ఆదేశించాడుకూడా.

జ్యోతిశ్శాస్త్రం తెలిసినవారు, శకునజ్ఞులు బాగా ఆలోచించి మంగళ ద్వారమూలంగా బోధిసత్త్వుడు వెళ్లగలడని నిశ్చయించి, ఆ ద్వారంవైపు వెళ్ళుతూ పరిశోధించి చూశారు. మార్గంలో వారికి పూల వాన పడినట్లు కనబడినది. దానినిబట్టి ఆ మార్గంగానే రాజకుమారుడు వెళ్ళినాడని వారు నిర్ణయించారు.

వారు ఇంకా కొంచెం దూరం వెళ్ళేసరికి లుబ్ధకవేషం ధరించిన దేవపుత్రుడు వారికి కనబడినాడు. అతడు తన తలపైని బోధిసత్త్వుని పట్టు వస్త్రాలను పెట్టుకొని ఉన్నాడు. ఆ వస్త్రాలు చూచేసరికి "ఇతడు ఈ విలువైన వస్త్రాలకోసం రాజకుమారుని తుదముట్టించి ఉండడుగదా!" అని అనుమానం కలిగింది. అందువల్ల "వీనిని పోనివ్వకుండా పట్టుకోండి! పట్టుకోండి!" అని వారు అరిచారు. మళ్ళీ చూడగా వానికి ఆ లుబ్ధకుని

వెనుక వస్తూవున్న ఛందకుడు కానవచ్చాడు. అతడు రాజకుమారుని ఆభరణాలనూ, కంటకాశ్వాన్నీ తీసుకొని వస్తూ ఉండినాడు. అందువల్ల వారు "తొందరపడకండి. లుబ్ధకుడి విషయంలో సాహసం వద్దు. కంటకాశ్వాన్ని తీసుకొని ఛందకుడు వస్తున్నాడుగదా! అతనిని అడిగి వివరాలు తెలుసుకొందాం" అని తమవారితో అన్నారు.

"ఓ ఛందకుడా! ఈ పురుషుడు ఈ పట్టువస్త్రాలకోసం రాజకుమారుని చంపి యుండలేదు కదా!" అని వారు అడిగారు.

ఛందకుడు "మీరు తలచినది సరికాదు. ఇతడు రాజకుమారునికి కాషాయవస్త్రాలు ఇచ్చాడు. రాజకుమారుడే తన వస్త్రాలను ఇతనికి యిచ్చాడు" అని అన్నాడు.

అంతట వారు చూస్తూ ఉండగానే ఆ దేవపుత్రుడు, ఆ వస్త్రాలను పూజించడంకోసం వాటిని తీసుకుని దేవలోకానికి వెళ్ళిపోయాడు.

తర్వాత వారు "ఓ ఛందకా! మేము వెళ్ళితే ప్రయోజనం ఉంటుందంటావా? రాజకుమారుడిని తీసుకుని రాగలమా?" అని అడిగారు.

ఛందకుడు ఇలాగున అన్నాడు — "రాజకుమారుడు దృఢవీర్య పరాక్రమాలు కలవాడు. అతనిని వెనుకకు తీసుకొనిరావడం సాధ్యం కాదు. 'లోకోత్తరమైన సమ్యక్సంబోధిని సంపాదించిన తర్వాతగాని, నేను కపిలవస్తునగరంలో అడుగుపెట్టేది లేదు' అంటూ ఆయన దృఢప్రతిజ్ఞ చేశాడు. కుమారుడు చెప్పినట్లుగానే జరుగుతుంది. ఏమంటే, దృఢవీర్య పరాక్రమాలు గల రాజకుమారుడిని వెనుకకు మళ్ళించడం సాధ్యం కాదు."

తర్వాత ఛందకుడు కంటకాశ్వాన్నీ, ఆభరణాలనూ తీసుకొని అంతఃపురంలో ప్రవేశించాడు. ఆభరణాలను ఎంతో కాలానికి భద్రికుడనే శాక్యకుమారునికీ, మహానాముడనే వానికీ, అనిరుద్ధుడనేవానికీ ధరించడానికి ఇచ్చారు. మహానారాయణ సింహాసములయినవారు ధరించదగినవాటిని ఇతరులు ధరించలేకపోయారు. అది చూచి మహాప్రజాపతి గౌతమి ఇలా



అనుకొన్నది: "ఈ ఆభరణాలను చూస్తూఉంటే నా హృదయంలో శోకం రగులుతుంది. కనుక వీటిని పుష్కరిణిలో పడవేయడం మేలు." ఈ విధంగా ఆలోచించి ఆమె వాటిని పుష్కరిణిలో పడవేసింది. ఆ పుష్కరిణి నేటికీ "ఆభరణ పుష్కరిణి" అనే పేరుతో ప్రసిద్ధి చెందినది.

ఇక్కడ కొన్ని శ్లోకాలు వున్నాయి. వాటి తాత్పర్య మిది:

భిక్షులారా! శూరుడైన బోధిసత్త్వుడు అభినిష్క్రమణం చేసిన సమయంలో కపిలవస్తుపురం పూర్తిగా విశుద్ధమై నిశ్శబ్దంగా ఉన్నది. రాజకుమారుడు పండుకొని నిద్రపోతున్నాడని ఒకరితో ఒకరు చెప్పుకుంటూ, అందరూ మిక్కిలి సంతోషిస్తూ ఉండినారు. విశుద్ధురాలైన గోపా, తక్కిన స్త్రీలున్నూ రాజకుమారుని పడక చూచి, అక్కడ ఆయన లేకపోవడం గమనించి "అయ్యో! అయ్యో! మోసపోయాము! రాజకుమారుడు కానరాలేదు. ఎక్కడికో వెళ్ళిపోయాడు" అని గోలచేశారు. మహారాజు ఈ సమాచారం విని నేలపైని పడిపోయాడు. "అయ్యో! నా ఏకైకపుత్రుడు వెళ్ళిపోయాడే!" అని అరుస్తూ మూర్ఛపోయాడు. ఘటాలతో నీళ్లు తెచ్చి, శాక్యులందరూ ఆయనముఖంపైని చల్లి తెలివి తెప్పించి వూరడించారు. రాజకుమారుని భార్య అయిన గోప పడకమీదనుంచి క్రిందికి పడిపోయినది. జుట్టు విరియ బోసుకుని, నగలనుతీసివేసి యిలా విలపించినది— "అయ్యో! నా ప్రభువు, ఈ పట్టణం నాయకుడు వెళ్ళిపోయాడే! ఆయన ఇష్టులందరూ ఈ వియోగాన్ని ఎలా భరించగలరు? విమలవిచిత్రశరీరం గలిగి, అందగాళ్లలో అందమైన రాజకుమారా! నీవు స్వచ్ఛమూ, విశుద్ధమూ అయిన శీలం కలవాడివి! లోకప్రియుల ప్రియుడివి! ధన్యుడివి! ప్రశస్తుడివి. స్వర్గంలోనూ, భూలోకంలోనూ కీర్తనీయుడివి! ఎక్కడికి వెళ్ళిపోయావు." ఇలా విలపిస్తూ ఆమె గుణధరుడైన బోధిసత్త్వుడు తిరిగి కనబడేవరకూ పొరపాటుననైనా మధురమైన పానీయాన్ని త్రాగననీ, తన కేశాలు జడలుకట్టేటట్లు మకుటంగా ధరించి, నేలపైనే పండుకొంటాననీ, స్నానం విడిచిపెట్టి వ్రతాలనూ, తపస్సునూ ఆచరిస్తాననీ ప్రతిజ్ఞపూనింది.

పురుషపుంగవుడైన బోధిసత్త్వుడు నగరాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోవడంవల్ల కపిలవస్తునగరం అడవివలె కానవచ్చినది. గృహాలు కళావిహీనా లయినవి. ఉద్యానవనాలు చిగిర్చడమూ, పుష్పించడమూ, ఫలించడమూ లేక శోభావిహీనాలైనవి. విశుద్ధాలైన ముక్తాహారాలు దుమ్ముతో కూడినట్లు వెలవెల పోయినవి. "మధురాలైన మంజుధ్వనులుగల గీతవాద్యాలు ఇక లేవుకదా! స్త్రీలు విగళిత భూషణాలు కలవారై ఉందురు కదా! హేమజాలాలతో అందంగాఉండే అంతరిక్షం ఇక కనబడదు కదా! గుణధరుడైన బోధిసత్త్వుడు లేకపోతే సర్వమూ శూన్యమేకదా!" అని గోప విలపించింది.

మనస్సులో ఎంతో కష్టపడుతూ ఉన్న సర్వార్థసిద్ధుని పినతల్లి అయిన గౌతమి కోడలైన గోపను వూరడిస్తూ "ఓ శాక్యకన్యా! ఏడ్వకు. లోకానికి జరామరణాలనుంచి విముక్తి కలిగించగలనని పురుషపుంగవుడైన రాజకుమారుడు ఇదివరలోనే చెప్పివున్నాడు కదా!" అని పలికింది.

మహర్షిగా మారిన బోధిసత్త్వుడు రాత్రి శేషంలో ఆరు యోజనాలు వెళ్ళాడు. ఛందకునికి తన ఆభరణాలనూ, కంటకాశ్వాన్నీ అప్పగిస్తూ "ఓ ఛందకుడా! వీటిని తీసుకుని కపిలవస్తు నగరానికి వెళ్ళిపో" అని అన్నాడు. ఆయన ఇంకా ఇలా అన్నాడు: "ఛందకా! నాయనగారితోనూ, అమ్మగారితోనూ నామాటగా ఇలా చెప్పు: 'కుమారుడు వెళ్లిపోయాడని మీరు ఎంతమాత్రమూ విచారించవద్దు. సమ్యక్సంబోధిని తెలుసుకుని మళ్ళీ రాగలడు. అప్పుడు అతనివల్ల ధర్మాన్ని తెలుసుకుని మీరు శాంత చిత్తులు కాగలరు' అని. ఛందకుడు ఏడుస్తూ "రాజకుమారా! నాకు నగరం వెళ్లడానికి శక్తిగాని, బలంగాని, పరాక్రమంగాని లేదు. నన్ను చూడగా రాజబంధువులు అందరూ 'ఓ ఛందకా! రాజకుమారుణ్ణి ఎక్కడికి తీసుకొనిపోయావు?' అని ప్రశ్నించి చంపివెయ్యగలరు" అని పలికినాడు. అప్పుడు బోధిసత్త్వుడు "ఛందకా! అలా జరగదు. నాసంగతి తెలుసుకుని మా బంధువు లందరూ చాలా సంతోషిసారు. నాయందు వున్న ప్రేమవల్ల నిన్ను గౌరవంగానే చూస్తారు" అని సమాధాన మిచ్చాడు.



ఛందకుడు కంటకాశ్వాన్నీ, నగలనూ తీసుకుని రాజుగారి ఉద్యానవనానికి వచ్చాడు. అతనిని ఉద్యానపాలకుడు చూచి సంతోషంతో వేగంగా శాక్యులవద్దకు పోయి ఇలా అన్నాడు: "ఇదిగో! రాజకుమారుడి గుర్రమూ, ఛందకుడున్నూ ఉద్యాన వనానికి వచ్చారు. మీరు విచారించవద్దు" అని. శాక్యుల మధ్యలోవున్న శుద్ధోదనమహారాజు ఈ మాటలను విని, వేగంగా ఉద్యానవనానికి సంతోషంతో వెళ్లాడు. దృఢమైన మనస్సు గల గోప అంతఃపురంలో రాజకుమారుని వృత్తాంతం విని సంతోషాన్ని పొందనూ లేదు. ఆ మాటలను శ్రద్ధగా విననూ లేదు. సమ్యక్సంబోధిని తెలుసుకోకుండా ఇక్కడికి తిరిగిరానని చెప్పడమూ, గృహాన్ని విడిచి వనానికి పోవడమున్నూ రాజకుమారునికి ఉచితంగా లేదని ఆమె పలికినది.

మహారాజైన శుద్ధోదనుడు కంటకాశ్వాన్నీ ఛందకుడినీ చూచి, గట్టిగా అరచి నేలపై పడిపోయాడు. తర్వాత తెలివితెచ్చుకుని "హా! గీతవాద్యాలతో వినోదిస్తూ కుశలంగావుండే కుమారా! ఈ సమస్త రాజ్యాన్నీ విడిచిపెట్టి ఎక్కడికి పోయావు?" అని పలికి ఛందకుడిని చూచి "ఓయీ! ఛందకా! నాకు వివరంగా చెప్పు. బోధిసత్త్వుడు ఎక్కడికి వెళ్లాడు? ఏ విధంగా వెళ్ళినాడు? అతడు వెళ్లడానికి నగరద్వారాన్ని ఎవ్వరు తెరచారు? దేవ సంఘాలు అతనిని ఎలా పూజించాయి?" అని అడిగాడు.

ఛందకుడు ఇలా సమాధాన మిచ్చాడు:—

"ఓ పార్థివేంద్రా! సావధానంగా వినండి. రాత్రి నగరం మాటుమణిగి, బాలులనుండి వృద్ధులవరకు అందరూ గాఢంగా నిద్రించినతర్వాత బోధిసత్త్వుడు నా వద్దకు వచ్చి మెల్లగానూ, మధురంగానూ 'ఓయీ! ఛందకా! నాకు శీఘ్రంగా అశ్వరాజాన్ని తీసుకుని వచ్చి ఇయ్యి. నర, నారీజనం అంతా గాఢంగా నిద్రపోతూ ఉన్నారు. మన మాటలు ఎవ్వ

రికీ వినబడవు.' అని అన్నాడు. అప్పుడు నేను ఏమి చెయ్యగలను? ఆయన కోరికను అనుసరించి, ఏడుస్తూనే అశ్వరాజమైన కంటకాన్ని తెచ్చి యిచ్చాను. యంత్రాలతో కూడి వున్న ద్వారాలను ఇంద్రుడే తెరిచాడు. నలుగురు లోకపాలకులు ఆ గుర్రం పాదాలను ఆశ్రయించారు. రాజకుమారుడు అశ్వాన్ని ఆరోహించగా త్రిసహస్రదేవతలూ అతనిని అనుసరించారు. ఆయన ఏ మార్గంగా వెళ్ళినదీ వివరంగా తెలియదు. గాఢాంధకారాన్ని చెదరగొడుతూ గొప్ప దివ్యతేజస్సు వ్యాపించినది. పూలవర్షం కురిసింది. వందలకొద్దీ తూర్యాలు ధ్వనించాయి. దేవతలు ఆయనను స్తుతించారు. అప్సరసలు గానంచేశారు. ఆయన, దేవసంఘాలతో కూడా గగనమార్గాన వెళ్లిపోయాడు''

ఛందకుడు రాజకుమారుని నగలనూ, అశ్వాన్నీ తీసుకుని అంతఃపురానికి వెళ్ళాడు. అతడు ఏడుస్తూనే అక్కడికి వెళ్లాడు. గోప ఆ గుర్రాన్నీ, ఛందకుడినీ చూచి మూర్ఛ వచ్చి నేలపైని పడిపోయింది. అప్పుడు అక్కడ ఉన్న స్త్రీలు అందరూ నీరు తెచ్చి ఆ శాక్యకన్య ముఖంపైని చల్లినారు. దుఃఖభారంవల్ల ఆమె కాలం చేస్తుందేమో, ఆ అనుకూల దంపతులూ, ప్రియులూ ఇద్దరూ లేకుండా పోతారేమో అని వారు భయపడ్డారు.

కొంత సేపటికి శాక్యకన్యక గోప తెలివి తెచ్చుకుని, లేచి ఎంతో దుఃఖిస్తూ అశ్వరాజమైన కంటకం కంఠాన్ని పట్టుకొని, వెనుకటి తన సుఖానుభవాలను తలచుకుంటూ ఈ విధంగా పెక్కురీతుల విలపించినది:

''హా మహ్య ప్రీతి జననా హా మమ నరపుంగవా విమలచంద్రముఖా,
హా మమ సురూపరూపా హా మమ వరలక్షణా విమల తేజధరా.
హా మమ అనిందితాంగా సుజాత అనుపూర్వ ఉద్గతా అసమా,
హా మమ గుణాగ్రధారీ నరమరుభిః పూజితా పరమకారుణికా.



హా మమ బలోనపేతా నారాయణ స్థామనన్నిహత శత్రుగణా,
హా మమ సుమంజుఘోషా కలవింకరుతస్వరా మధురబ్రహ్మరుతా.
హా మమ అనంతకీర్తే శతపుణ్యసముద్గతా విమల పుణ్యధరా,
హా మమ అనంతవర్ణా గుణగణ ప్రతిమండితా ఋషిగణప్రీతికరా.

''హా! నాకు ప్రీతిని కల్గించే దేవా! పురుషపుంగవా! మచ్చలేని చంద్రునివంటి ముఖం కలవాడా! చక్కనిరూపం కలవాడా! నిర్మల తేజస్సు కలవాడా! యోగ్యలక్షణాలు కలవాడా! అనింద్యములైన చిహ్నములు కలవాడా! సుజాతుడా! అమ్యో సాటిలేనివాడా! గుణోత్తరుడా! నరులచేతను, దేవతలచేతను పూజింపబడేవాడా! పరమకారుణికుడా! గొప్ప బలం కలవాడా! నారాయణుని పోలిన బలంతో శత్రువులను లోబరచుకొన్నవాడా! మధురస్వరం కలవాడా! బ్రహ్మస్వరం కలవాడా! అనంతమైన కీర్తి కలవాడా! వందలకొలదీ పుణ్యాలవల్ల జన్మించినవాడా! గొప్ప పుణ్యాత్ముడా! అంతంలేని శోభ కలవాడా! గుణగణాలతో అలంకరించబడినవాడా! ఋషులకు ప్రీతిని కలిగించేవాడా! భ్రమరగీత ధ్వనులతో నిండినదీ, ఉత్తమమైనదీ అయిన లుంబినీవనంలో ఉత్తమరీతిని జన్మించినవాడా! బాగుగా ఘోషించే శబ్దం కలవాడా! భూమ్యాకాశాలలో పూజలు గైకొనేవాడా! గొప్ప జ్ఞానివైనవాడా! ద్రాక్షవంటి రసనాగ్రం కలవాడా! దొండపండువంటి పెదవి కలవాడా! కమలాలవంటి కన్నులు కలవాడా! కనకంతో సమానమైనవాడా! పరిశుద్ధములైన దంతములు కలవాడా! ఆవుపాలవలెను, మంచువలెను తెల్లని దంతములు కలవాడా! చక్కని ముక్కు కలవాడా! చక్కని కనుబొమ్మలు కలవాడా! ఏనుగుతొండములవంటి తొడలు కలవాడా! శోభనములైన కరచరణములు కలవాడా! ఎర్రని నఖములు కలవాడా! సువృత్తములైన స్కంధములు కలవాడా! ధనుస్సును పోలిన ఉదరం కలవాడా! జింకను పోలిన పిక్కలు కలవాడా! గుండ్రని కటి ప్రదేశం కలవాడా! నీ భూషణాలు పుణ్యంవల్ల నిన్ను అలంకరించాయి. నీకు ఎంతో ప్రీతిని కలిగించేవి. గీతవాద్యాలు, పుష్పాలు, విలేపనాలు ఆ యా ఋతువులలో అనుకూలమైనవి. పుష్ప గంధాలతోనూ, గీత వాద్యాలతోనూ అంతఃపురంలో ఎంతో ఆనందాన్ని కలిగిస్తూ ఉండేవాడివి!

ఉత్తమజాతిలో పుట్టిన ఓ కంటకాశ్వమా! నీవు ఎల్లప్పుడూ నా భర్తకు సహచరమై ఉంటావు. ఆయనను ఎక్కడికి తీసికొనిపోయావు? ఓ ఛందకుడా! నీకు కరుణ అనేది లేదు. నరవరుడైన నా భర్త వెళ్ళిపోతూ ఉంటే వెళ్లకూడదని బోధించనైనా బోధించలేకపోయావు.

హితకరుడైన నా భర్త ఎందుకోసం ఆకాశమార్గంగా వెళ్లిపోయాడు? నరులకు శిక్షణ యిచ్చే సారథీ, దయామయుడూ అయిన ఆ మహనీయుడు — అందరి హితాన్నీ కోరేవాడు ఈ నగరంనుంచి ఎలాగున వెళ్లాడు? రాజభవనంనుంచి ఏ విధంగా బయలుదేరాడు? ఏ దిక్కున వెళ్ళాడు. అతడు చేరిన వనంలోని తరుగుల్మాదులు ధన్యాలు! వన దేవతలు ఆయనకు చెలికత్తెలయి ఉంటారు. ఓయీ ఛందకా! నాకు ఎంతో దుఃఖం కలుగుతూ ఉన్నది. ఆ నిధిని చూచే చక్షుస్సును నాకు అనుగ్రహించు. ఓ ఛందకుడా! సమస్తజనులూ ఆయనను ప్రశంసిస్తూ ఉంటారు. తల్లిదండ్రులను ఆయన పూజిస్తూ ఉంటాడు. అట్టివారినే విడిచిపెట్టి వెళ్లిపోయినప్పుడు — ఇక మావంటి స్త్రీల ప్రేమసంగతి లెక్కయేమిటి?

అయ్యో! ప్రియునితోడి వియోగము ఎంత దుర్భరమైనది? అంతా రంగంపై నటుని ప్రదర్శనంవలె అస్థిరంగా ఉన్నదే? జన్మ అనిత్యమైనదే!

లోకాన్ని జరామరణరహితంగా సంస్కరించే చెలికాడు లేడని ఆ మహామహుడు మొదటనే విచారించేవాడు, ఉత్తమమైన సమ్యక్సంబోధిని తెలుసుకోవాలనే అతని కోరిక ఇప్పుడు పరిపూర్తి కాగలదు. ఆ సంబోధిని తెలుసుకుని తిరిగి యిక్కడికి వస్తాడనే మాట విని కొంత సంతృప్తి కలుగుతున్నది.''

మిక్కిలి దీనమైన మనస్సుగల ఛందకుడు గోప పలికిన మాటలను విని కన్నీళ్ళు కార్చుతూ, కంఠంనుంచి మాట రాకపోగా, మెల్లగా ఇట్లు పలికాడు:

“రాజకుమారీ! గోపీదేవీ! నా మాటను శ్రద్ధతో వినాలని ప్రార్థన. రాత్రి సగం గడవగా, రాజకుమారుడు — పుణ్యాశతాలవల్ల జన్మించిన ఆ



మహామహుడు ఒక్కడూ వచ్చి, కంటకాశ్వాన్ని సిద్ధంచేసి తనకు ఇవ్వాలని కోరినాడు. ఆ సమయంలో అంతఃపురంలో ఉన్న స్త్రీలు అందరూ గాఢనిద్రలో ఉన్నారు. నేను ఆ మాటను విని నీకోసం చూడగా, నీవున్నూ నిద్రపోతూ ఉన్నావు. నేను నీనద్దకు వచ్చి గట్టిగా 'అమ్మా శీఘ్రంగా లేవవలెను. నీ ప్రియుడు ఇల్లు విడిచి వెళ్ళిపోతున్నాడు' అని అన్నాను. నా మాటలు నీకు వినబడకుండా దేవతలే ఏహో తంత్రం చేశారు. ఒక్క యువతి కూడా నామాట విని మేలుకోలేదు. నేను ఏడుస్తూనే, కంటకాన్ని అలంకరించి రాజకుమారునికి అప్పగించాను.

'ఉగ్రమైన తేజస్సు కల కంటకాశ్వం కూడా ఎంతో ధ్వనితో సకిలించినది. దానిధ్వని క్రోసుదూరం వినిపించింది. అయినా పూరిలోని ఒక్కరికీ అది వినబడలేదు. ఈ పట్టణంలోని అందరినీ దేవతలు బాగా నిద్రపుచ్చారు. బంగారంతోనూ, వెండితోనూ, రత్నాలతోనూ నిండిన నేలపై కంటకం గిట్టలతో నలిగి మార్గం ఏర్పడినది. అది భయంకరంగానూ, మనోహరంగానూ కూడా ఉన్నది. దాని గిట్టల ధ్వనిని మనుష్యులెవ్వరూ వినలేదు. పుణ్యాత్ముడైన రాజకుమారుని తేజస్సు చంద్రునితోనూ, నక్షత్రాలతోనూ నిండిన గగనంపైని వ్యాపించినది. గగనంపైని ఉన్న దేవగణాలు చేతులు జోడించుకొని, తలపైని మోడ్పు గేలుతో నమస్కరిస్తూ ఉండినారు. యక్షరాక్షసగణాలతో కూడా వచ్చిన నలుగురు లోకపాలకులూ, పద్మకేసరాలవలె పరిశుద్ధాలై నిర్మలాలైన కంటకాశ్వం పాదాలను చేతులలో ధరించారు. పుణ్య తేజస్సు గల ఆ మహనీయుడు దానిపైని అధిరోహించాడు. అప్పుడు షడ్వికారమైన భూమి చలించినది. దేవతల యజమానుడూ, శచీపతీ అయిన ఇంద్రుడు ద్వారాన్ని తెరిచాడు. వేలకొద్దీ దేవతలు అతన్ని గౌరవించారు. నాగులూ, దేవతలూ పూజించారు. కంటకాశ్వం ఆ లోకనాథుడిని వహిస్తూ ఆకాశమార్గంగా వెళ్ళసాగినది.

సుగతుడు వెళ్లుతూ ఉండగా ఇంద్రునితో కూడా దేవదానవులు అతన్ని అనుసరించారు. కుశల గీతవాద్రితాలతో అప్సరసలు అతని గుణగణాలను స్తుతించారు. వారు కంటకానికి బలం చేకూరాలని కోరారు. మధురంగానూ, మనోరమంగానూ ఆది ధ్వనిచేసింది. అప్పుడు దాన్ని

చూచి ఒక దేవత ఇట్లు పలికాడు : 'ఓ కంటకమా! విచారాన్ని విడువు. రాజకుమారుని వహించి త్వరగా నడువు. లోకనాథుడైన అతనిని వహిస్తూ ఉన్నందున నీకు భయంగాని, అపాయంగాని, దుర్గతిగాని ఉండవు. దేవతల పాదాలు త్రొక్కని ప్రదేశం కొంచెంకూడా ఉండదు. ఓ కంటకమా! విచిత్రంగానూ, శోభనంగానూ ఆకాశమధ్యంలో ఉన్న ఈ మార్గాన్ని చూడు. అది రత్నవేదికలతో అలంకరించబడి ఉన్నది. దివ్యమై, సారవంతమైన పరిమళధూపం వెయ్యబడి ఉన్నది.'

ఈ కంటకం త్రాయత్రింశుల భవనంలో పుట్టినది. శుభమైన క్రియతో కూడి ఉన్నది. కోరిన రీతిగా పోగలదు. అప్సరసలు దీని చుట్టును మూగి ప్రశంసిస్తూ ఉంటారు.

కనుక ఓ గోపిదేవీ! నీవు యింక విచారించవద్దు. ఏడువవద్దు. సంతృప్తితో, సంతోషముతో ఉండు. నీ భర్త బోధిని పొంది దేవతల వలన మన్ననపొంది శీఘ్రంగానే తిరిగి రాగలడు. అమ్మా! సుకృతకర్మలు చేసినవారు ఎంతమాత్రమూ దుఃఖించకూడదు. అట్టివారు పుణ్యమైన తేజస్సువల్ల పుట్టినవారు. ఏడ్వక, ఎప్పుడూ సంతోషిస్తూనే ఉండవలెను. ఓ గోపీ, నీకు అచింత్యమైన గొప్పలాభం వచ్చింది. నీ భర్త లోకహితార్థమై వెళ్లినాడు. ఆ హితం నీవు చేసినట్లుగానే భావించి, నిర్విచారంగా ఉండు.''

ఇది లలితవిస్తరంలో అభినిష్క్రమణ పరివర్తమనే
పదిహేనవ అధ్యాయం.

---

# 16. బింబిసారోపసంక్రమణ పరివర్తం

భిక్షులారా, ఛందకుడు బోధిసత్త్వునిగురించి విచారిస్తూ ఉన్న శుద్ధోదన మహారాజుకూ, శాక్యకన్య అయిన గోపాదేవికీ, సమస్త అంతఃపురవాసులకూ, శాక్యగణానికీ శోకాన్ని పోగొట్టేవిధంగా చెప్పి, అందరికీ నెమ్మదిని కలిగించాడు.

ఇక బోధిసత్త్వుడి సమాచారం వినండి. అతడు వేటకాని వేషం ధరించిన దేవపుత్రునికి తన పట్టు వస్త్రాలు ఇచ్చివేసి, అతనివల్ల కాషాయ వస్త్రాలను స్వీకరించి, లోకమర్యాదను అనుసరించి స్వయంగానే సన్న్యాసాన్ని స్వీకరించి, ఆ వస్త్రాలను ధరించాడు. అతడు ప్రాణులయెడ దయతో ప్రాణుల బాధలను తొలగించడంకోసమై సన్న్యాసం స్వీకరించాడు.

సన్న్యాసం స్వీకరించిన బోధిసత్త్వుడు ఆ తర్వాత శాక్యబ్రాహ్మణి తపస్సు చేస్తూ ఉన్న ఆశ్రమానికి వెళ్లాడు. ఆమె అతనికి నివాసం ఇచ్చి ఆతిథ్యంతో గౌరవించినది.

తర్వాత అతడు పద్మ అనే బ్రాహ్మణి తపస్సు చేస్తూ ఉన్న ఆశ్రమానికి వెళ్లాడు. ఆమెకూడా అతనికి నివాసం యిచ్చి ఆతిథ్యంతో గౌరవించినది.

పిదప బోధిసత్త్వుడు బ్రహ్మర్షియైన రైవతుని ఆశ్రమానికి వెళ్లాడు. అతడు కూడా బోధిసత్త్వుణ్ణి వెనుకటివారి మాదిరిగానే సత్కరించాడు. దత్రుమ దండికుని పుత్రుడైన రాజకుడు కూడా బోధిసత్త్వుణ్ణి పైవిధంగానే గౌరవించాడు.

బోధిసత్త్వుడు ఈ విధంగా సంచారం చేస్తూ క్రమంగా వైశాలీ మహానగరాన్ని సమీపించాడు.

ఆ సమయంలో కాలాపుడైన ఆరాడుడు వైశాలీ నగర సమీపంలో నివసిస్తూ ఉండేవాడు. గొప్ప శ్రావక సంఘమూ, మూడు వందలమంది శిష్యులూ అతనిని ఆశ్రయించి ఉండేవారు. అతడు ఆ శిష్యులకు ఆకించన్యాయతనసహవ్రతానికి ధర్మాన్ని ఉపదేశిస్తూ ఉండినాడు. బోధిసత్త్వుడు వస్తూ ఉండగా దూరాన్నుంచే చూచి, అతడు శిష్యులతో "చూడండి! చూడండి! ఆ వస్తూ ఉన్న వ్యక్తిరూపం ఎంత ప్రకాశమానంగా ఉన్నదో?" అని అన్నాడు. వారు "చూస్తున్నాము. అది మిక్కిలి ఆశ్చర్యకరంగా ఉన్నది" అని సమాధానం ఇచ్చారు.

అప్పటి తన అనుభవాన్ని బోధసత్త్వుడే ఒకప్పుడు ఇలా వివరించాడు.

"ఓ భిక్షులారా, నేను కాలాపుడైన(కలాపమనే వేదశాఖాభిజ్ఞుడైన) ఆరాడుడు ఉన్నచోటికి వెళ్ళాను. వెళ్లి 'అయ్యా! నేను బ్రహ్మచర్యాన్ని అనుసరిస్తాను' అన్నాను. అతడు "ఓ గౌతముడా! కులపుత్రుడైన శ్రాద్ధుడు ఆచరించే విధంగా అల్పకృచ్ఛ్రపద్ధతిలో ఆచరింతువుగాక!" అని అన్నాడు.

ఓ భిక్షులారా, అప్పుడు నాకు మనస్సులో ఈ విధంగా తోచినది. 'నాకు కోరిక వున్నది, బలం వున్నది, స్మృతి ఉన్నది, సమాధి ఉన్నది, ప్రజ్ఞ ఉన్నది, ఏకాకిని, అప్రమత్తుడను, ధర్మాన్ని సాక్షాత్కరించుకొనడానికీ, పొందడానికీ శ్రమపడి కృషిచేసి విహరించగలను' అని.

ఓ భిక్షులారా, తర్వాత నేను అప్రమత్తుడనై, శ్రమపడి ప్రయత్నశాలినై విహరించి అల్పకృచ్ఛ్రాన్ని అనుసరించి, ఆ ధర్మాన్ని తెలుసుకొని, ప్రత్యక్షం చేసుకొన్నాను.

తర్వాత నేను తిరిగి ఆరాడునివద్దకు పోయి 'ఆర్యా! ఆరాడా! నీవు ధర్మాన్ని సాక్షాత్కరించుకొని, దాన్ని పొంది ఉన్నావా?' అని ప్రశ్నించాను. అతడు "ఓ గౌతమా! అవును. పొందాను" అని చెప్పాడు. 'నేను కూడా యీ ధర్మాన్ని సాక్షాత్కరించుకొని పొందాను' అని నేను అన్నాను అయితే 'గౌతమా! నేనెట్టి ధర్మాన్ని తెలుసుకొన్నానో



నీవూ ఆ ధర్మాన్నే తెలుసుకొన్నావు. నీవు ఏ ధర్మాన్ని తెలుసుకొన్నావో, నేనూ దానినే తెలుసుకున్నాను. మనం యిద్దరమూ ఇక శిష్యగణాన్ని పరిహరించడం మేలు' అని అతడు అన్నాడు.

ఓ భిక్షులారా! తర్వాత కాలాపుడైన ఆరాడుడు ఎంతో గొప్పగా నన్ను పూజించాడు. తన శిష్యుల నడుమ నన్ను ఎంతో అభినందించాడు.

ఓ భిక్షులారా! ఈ ఆరాడుని ధర్మపద్ధతి దుఃఖక్షయానికి అనుకూలం అయినది కాదని నాకు తోచినది. దుఃఖక్షయానికి సాధనమైన సమ్యగ్ధర్మాన్ని ఇంకనూ వెతకవలసినదే అని చెప్పి అక్కడినుంచి బయలుదేరాను.

నేను వైశాలీ నగరాన్ని విడిచిపెట్టి మగధదేశానికి బయలుదేరి వెళ్లాను. ఆ దేశం ప్రవేశించి తిరుగుతూ, మాగధుల రాజధాని అయిన రాజగృహ నగరాన్ని సమీపించాను. అక్కడ పాండవుడైన పర్వతరాజును చూశాను. అతనితో సంభాషించాను. నేను ఏకాకిని, అద్వితీయుడను, అసహాయుడను అయినా కోట్లకొలదీ దేవతలు నన్ను రక్షిస్తూనే ఉండినారు.

నేను ప్రాతఃకాలానవే భిక్షాపాత్రనూ, వల్కలాన్నీ తీసుకుని తపోదద్వారంగుండా భిక్షకోసం రాజగృహ మహానగరం ప్రవేశించాను. ప్రసాదభావంతో నేను దృష్టిని ప్రసరింపజెయ్యడమూ, పాత్ర చీవరాలను ధరించి రావడమూ, విక్షిప్తాలుకాని ఇంద్రియాలతో లోతైన హృదయంతో నేను ఉండడమూ చూచి రాజగృహ నగరవాసులు మిక్కిలి ఆశ్చర్యపడ్డారు. ఇతడేమి బ్రహ్మదేవుడా, లేక దేవతలకు ప్రభువైన శక్రుడా, లేక కుబేరుడా? లేక గిరిదేవతగా అయినవాడా? అని వారు ఆశ్చర్యపడ్డారు."

ఈ సందర్భంలో ఉన్న శ్లోకాల అభిప్రాయం యిది:

"పరిశుద్ధుడూ, అనంతమైన తేజస్సు కలవాడూ, స్వయంగా సన్యాసాన్ని స్వీకరించినవాడూ అయిన బోధిసత్త్వుడు శాంతమైన మనస్సు కలవాడై, దాంతుడై పాండవుడైన పర్వతరాజు పార్శ్వంలో విహరిస్తు

న్నాడు. రాత్రి గడచిపోయిన సంగతి తెలుసుకొని బోధిసత్త్వుడు మిక్కిలి దర్శనీయుడై ఉండి, పాత్రను తీసికొని భిక్షార్థమై రాజగృహ నగరం ప్రవేశించాడు.

అతడు బంగారంవలెనే ప్రకాశిస్తూ ఉన్న చక్కని రూపం కలవాడు. ముప్ఫయి యిద్దరు దేవతలూ అతనిని కవచంవలె రక్షిస్తూ ఉన్నారు. నగరంలో పురుషులూ, స్త్రీలూ అతనిని ఎంతో ఆప్యాయంతో చూడసాగారు. ఎంత చూచినా వారికి తనివితీరడం లేదు. రత్నాలూ, విలువైన వస్త్రాలూ ధరింపదగిన బోధిసత్త్వుడు వీథిలో పోతూ వుండగా నగరంలో వుండే జనులు "కని, విని యెరుగని యీ మహానుభావుడెవ్వడో గదా! ఇతని తేజస్సుతో పటణం అంతా వెలిగిపోతూ ఉన్నది" అని అనుకొంటూ అతని వెంబడిని పోసాగినారు. నగరంలో స్త్రీలందరూ వేరే పనులు చేసుకోకుండా రాజశ్రేష్ఠుడైన బోధిసత్త్వుని చూడడానికి మేడలమీదా, ద్వారప్రదేశాలలోనూ, వాతాయనాలలోనూ వేలకొద్దీ నిలుచున్నారు. కొందరు గృహాలను విడిచిపెట్టి రథ్యపైకే వచ్చారు. బోధిసత్త్వుని మనోహర రూపాన్ని చూస్తూ జనులు క్రయవిక్రయాలు మానుకున్నారు. త్రాగేవారు పానశాలలో మద్యపానం చెయ్యడం మానివేశారు. గృహంలో ఉండడానికి ఇష్టపడకుండా వీథిలోనే ఉంటున్నారు.

కొందరు రాజపురుషులు సంతోషంతో వేగంగా రాజభవనానికి పోయి, రాజైన బింబిసార మహారాజుకు ఈ విషయం తెలియజేశారు. కొందరు 'ఓ రాజా! నీవెంతో అదృష్టవంతుడవు. నీకు గొప్పలాభం కలిగింది. బ్రహ్మదేవుడు స్వయంగా వచ్చి నీ నగరంలో భిక్షాటన చేస్తున్నాడు" అని.

ఆ వచ్చినవాడు దేవతలకు రాజైన శక్రుడని కొందరన్నారు. కొందరు దేవపుత్రుడైన యముడని అన్నారు. కొందరు తుషితలోకంనుంచి వచ్చిన సునిర్మితుడన్నారు. కొందరు సునిర్మితుల ప్రభువన్నారు. కొందరు సూర్యుడుగాని, చంద్రుడుగాని అయి వుంటాడని అన్నారు. కొందరు రాహువుగాని, బలిచక్రవర్తి గాని అయి వుంటాడన్నారు. కొందరు



'ఈ వచ్చినవాడు పాండవుడైన పర్వతరాజు పాలిస్తున్న దేశంలోని ఒక మహాత్ముడయి ఉంటాడు' అని అన్నారు.

ఈ మాటలను విని మిక్కిలి ఆతురతతో బింబిసార మహారాజు తన సౌధంలోని గవాక్షంపైని కూర్చుండి యోగ్యమైన సత్త్వగుణం గల బోధిసత్త్వుని చూచి, బంగారంవలె మెరిసిపోతూ ఉన్న అతని తేజస్సునకు మిక్కిలి ఆశ్చర్యపడ్డాడు. ఆ రాజు బోధిసత్త్వునికి భిక్ష ఇచ్చి ఆయన ఎక్కడికి వెళ్లుతాడో గమనించి చూచి తెలుపవలెనని ఒక రాజపురుషునికి ఆజ్ఞ యిచ్చాడు. ఆ పురుషుడు బోధిసత్త్వుని వెనుకనే పోయి, అతడు ఒక కొండకు పోవడం చూచి మహారాజుతో "దేవా! ఆయన కొండ పార్శ్వానికి వెళ్లి పోయినాడు" అని మనవి చేసినాడు.

రాత్రి గడచి, తెల్లవారిన తరువాత బింబిసారుడు పరివారంతోనూ, పెద్ద జన సమూహంతోనూ బయలుదేరి వెళ్లి పాండవ శైలమూలంలో తేజస్సుతో వెలుగుతూ, మేరుశైలంవలె స్థిరంగా ఉన్న బోధిసత్త్వుణ్ణి చూశాడు. బోధిసత్త్వుడు తృణాలను ఆసనంగా తీర్చి స్వస్తికాసనం వేసుకుని కూర్చుండి మేరు పర్వతంవలె చలింపక ఉండినాడు. బింబిసారుడు అతనిని చూచి గొప్ప గౌరవంతో, ఆతని పాదాల దగ్గర తన తలను ఉంచి నమస్కారం చేసి, అనేక విషయాలను గురించి సంభాషించి "ఓ మహాశయా! నా సమస్తరాజ్యాన్నీ నీకు ఇచ్చి వేస్తాను. సమస్త సుఖాలనూ అనుభవిస్తూ నీవు ఈ రాజ్యాన్ని పాలించు. ఓ బోధిసత్త్వా! నా మాటలకు ఈ పర్వతం ప్రతిధ్వనిస్తూ, నా అభిప్రాయాన్నే గట్టిగా చెప్పుతూ ఉన్నది. నీవు చాలాకాలం జీవించి యీ రాజ్యాన్ని పాలించు. నేను దేనిపైనీ ఆశ లేకుండా శాంతికోసమై రాజ్యాన్ని విడిచిపెట్టి సన్యాసాన్ని తీసుకోవాలని అనుకుంటున్నాను. నీవు చిన్నవాడవు. తరుణ యౌవనం కలవాడవు. శుభమైన తనుచ్ఛాయ కలవాడవు. అట్టి నీవు అనుకోకుండానే ఇక్కడికి వచ్చావు. విపులంగా ఉన్న నా ధనాన్ని తీసుకో. స్త్రీ సంఘాన్ని స్వీకరించు. కామ సుఖాలను అనుభవిస్తూ నా రాజ్యంలోనే ఉండు. తిరిగి నివసించడానికి అడవికి పోవద్దు. అది శూన్యమైన స్థలం. నేలపైనే ఉండి గడ్డినే ఆసనంగా స్వీకరించనక్కర లేదు" అని అన్నాడు.

అప్పుడు బోధిసత్త్వుడు నిష్కల్మషమైన ప్రేమనూ, హితమునూ, దయనూ వ్యక్తంచేస్తూ మిక్కిలి మృదువైన రీతిని అన్నాడు... ‘‘రాజా! నీకు నిత్యమూ జయము కలుగుగాక! నాకు కామసుఖాలపై ఎంతమాత్రమూ అభిలాష లేదు. కామాలు విషంతో సమానమైనవి. అంతంలేని దోషాలతో కూడినవి. నరకంలో పడడానికి హేతువు లవుతవి. వాటివల్ల, చచ్చిపోయిన తర్వాత తిర్యగ్జన్మ వస్తుంది గాని, నరజన్మ రాదు. వాటిని విద్వాంసులు నిందిస్తారు. కామాలు అనాద్యములు, పక్వమైన ఖేటపిండం (పులిసిన చలిది-పులిసిన అన్నం?) వలెనే వాటిని నేను విడిచిపెట్టాను. ఆకాశంమీద మేఘాలు స్థిరంగా నిలవక పోతూవుండేటట్లు కామమనే వృక్షం ఫలాలు చెదరి పడుతూ ఉంటవి. అవి స్థిరాలుకానివి. వాయువువలెనే మిక్కిలి చపలంగా పోతూ ఉండునవి. అవి సమస్త సుఖాలనూ నశింపజేస్తాయి. ఈ కామాలను పొందలేనివారు మిక్కిలి పరితపిస్తూ ఉంటారు. అవి లభించినవారు, వాటివిషయంలో తృప్తి అనేది లేకపోవడంవల్ల బాధపడతారు. ఘోరాలైన యీ కామాలు చివరకు గొప్ప దుఃఖాన్నే కలిగిస్తాయి. ఓ మహారాజా! దివ్యములైన కామాలూ, మనుష్య సంబంధాలైన కామాలూ ఎన్నివున్నవో వాటినన్నింటినీ ఒక్కనరుడే పొంది ఉన్నాకూడా తృప్తి అనేది ఉండదు. ఓ ధరణిపాలా! శాంతి దాంతములూ, ఆర్య అనాశ్రవ ధర్మములూ, ప్రజ్ఞా ఇవి విద్వాంసునికి తృప్తిని కలిగిస్తాయి. కాని కామగుణాల విషయంలో మాత్రం తృప్తి ఉండదు. ఓ రాజా! కామసుఖాలను అనుభవిస్తూ వున్నవారికి కోట్లలో ఒక్కరికైనా తృష్ణ తీరనే లేదు. తీరదు, దప్పిగొన్న మనుష్యులు ఉప్పునీటిని ఎంతత్రాగినా ఆ దప్పి తీరనే తీరదు. అంతే కాదు. ఆ కోరిక వృద్ధి అవుతూనే వుంటుంది.

ఓ రాజా! శరీరం అశాశ్వతమైనది. సారంలేనిది. దుఃఖభూయిష్ఠమైనది. వ్రణములవంటి నవరంధ్రాలనుండీ మలం స్రవిస్తూనే ఉంటుంది. అందువల్ల నాకు ఎంతమాత్రం కామములపై లభిలాష లేదు. ‘ఓ రాజా! నేను విపులంగా ఉన్న కామాలను విడిచి, అందమైన స్త్రీలను విడచిపెట్టి, సంసార సుఖాలపైని కోరికను విడిచి మిక్కిలి శుభకరమైన సమ్యక్సంబోధిని పొందదలచి గృహాన్ని విడిచి వచ్చాను.’’



అప్పుడు బింబిసారుడు ఇలా అన్నాడు.

‘‘కతమ దిశి కుతోఽగతోఽసి భిక్షో క్వచ తవ జన్మకృతే పితాక్వమాతా,
క్షత్రియ అథ బ్రాహ్మణోఽథరాజా పరికథ భిక్షు యదీన భారసంజ్ఞా.

‘‘ఓ భిక్షూ, నీవు ఏ దిక్కునుంచి (ప్రాంతం నుంచి) వచ్చావు? నీ జన్మస్థలం ఎక్కడ? తల్లి దండ్రులెవరు? నీవు క్షత్రియుడవా? లేక బ్రాహ్మణుడవా? లేక రాజువా? వీటిని చెప్పడానికి కష్టం లేకపోతే వివరంగా చెప్పు.’’

అప్పుడు బోధిసత్త్వుడు ఇలా అన్నాడు.

‘శ్రుణితి ధరణిపాల శాకియానాం కపిలపురం పరమం సుబుద్ధిస్ఫీతం,
పితు మమ శుద్ధోదనేతి నామ్నా తను అహు ప్రవ్రజితో గుణాభిలాషీ.

ఓ రాజా. శాక్యరాజుల పేరు విన్నావు కదా! సర్వసమృద్ధమైన కపిలవస్తువనే మహానగరం వారికి రాజధాని. దానిని పాలిస్తున్న శుద్ధోదనుడు నా తండ్రి. నేను అతని పుత్రుడను. గుణములయెడ అభిలాష కల్గుటచే నేను సన్యసించాను.’

అప్పుడు బింబిసారుడు ఇట్లు పల్కినాడు.

‘సాధు తవ సుదృష్ట దర్శనం తే యను తవ జన్మనయాపి తస్య శిష్యాః,
అపి చ మమ క్షమస్వ ఆశయేనా యమపి నిమన్త్రితు కామవీరరాగో.
యది త్వయ అనుప్రాప్త భోతి బోధిః తద మమసేతి భోతి ధర్మస్వామీ,
అపి చ మమపురా సులబ్ధలాభా మమ విజితే వనసీహ యత్ స్వయంభో.’

‘‘ఓ సాధూ. నీ దర్శనం లభించినది. నీ జన్మ వృత్తాంతం తెలిసినది. మేము నీకు శిష్యులమై వుంటాము. మా అభిప్రాయానికి క్షమించవలెను. కామాల విషయమై రాగం లేని సంగతిని నాకూ ఉపదేశించాలి. నీవు సమ్యక్సంబోధిని సంపాదించినట్లయితే, ఓ స్వామీ! ఆ ధర్మాన్ని నాకున్నూ తెలుపవలెను. దానివల్ల నాకు ఎంతో లాభం కలుగుతుంది.

నీవు యిక్కడ స్వయంగా ఉండడంవల్ల నేను జయమును పొందినట్లే భావిస్తాను."

తర్వాత బింబిసార మహారాజు తిరిగి బోధిసత్త్వుని పాదాలకు నమస్కారంచేసి, గౌరవంతో ప్రదక్షిణం తిరిగాడు. తర్వాత తన పరివారంతోపాటు తిరిగి రాజగృహ నగరానికి వెళ్లిపోయ్యాడు.

లోకనాథుడైన బోధిసత్త్వుడు మగధ రాజధానిని ప్రవేశించి, శాంత మనస్కుడై తాను కోరిన విధంగా విహరించాడు; తర్వాత దేవతల, మనుష్యుల ప్రయోజనాన్ని నెరవేర్చడానికి పూనుకొని, నిరంజనానదీతీర ప్రాంతానికి వచ్చాడు.

ఇది లలితవిస్తరంలో బింబిసారోపసంక్రమణం అనే పదహారవ అధ్యాయం.

# 17. దుష్కరచర్యా పరివర్తం

భిక్షులారా, ఆ కాలంలో రామపుత్రుడైన రుద్రకుడు రాజగృహమహానగరం ప్రక్కను ఉంటున్న గొప్పయోగి. ఏడువందలమంది శిష్యులు అతనిని ఆశ్రయించి వుండేవారు. వారందరికీ ఆతడు నైవసంజ్ఞానాసంజ్ఞాయతన వ్రతంకోసం ధర్మోపదేశం చేస్తూ ఉండేవాడు.

రామపుత్రుడైన రుద్రకుడు గణాచార్యుడు. సంఘంలో ఎన్నదగినవాడు. బహుజనపూజితుడు. సమస్తమూ తెలిసిన మహావిద్వాంసుడు. కోరదగినవాడు. పండితసమ్మతుడు! బోధిసత్త్వుడు అతడు ఉన్న స్థలానికి వెళ్ళి అతనిని దర్శించాడు. ఆతనిని చూడగా బోధిసత్త్వుని మనస్సుకు ఇలా తోచింది: "రామ పుత్రుడైన యీ రుద్రకుడు సంఘంలో పేరుపడినాడు. గణాచార్యుడు. కోరదగినవ్యక్తి. అన్నీ తెలిసినవాడు. బహుజనపూజితుడు. పండితసమ్మతుడు. నేను యితనిసమీపం చేరి వ్రత తపోనియమాలను ఆరంభించకూడదా? ఇతడు ప్రత్యక్ష జ్ఞానంచేత జ్ఞాతుడు కాడు. నావద్ద గొప్పలు చెప్పుకునే అవకాశం లేదు. ధ్యాన సమాధి సమాపత్తులకు ఇక్కడ ఎటువంటి ఆటంకమూ ఉండకపోవచ్చును. ధ్యాన సమాధి సమాపత్తులు ప్రత్యక్షమయే ఉపాయాలను ఆలోచించి, ఆ విధంగానే జరపవచ్చు. నేను రామపుత్రుడైన రుద్రకుని సమీపానికి వెళ్ళి స్వసమాధిగుణ విశేషాల ఉద్భావనకయి శిష్యత్వాన్ని పొంది సంస్కృతములైన సమాధులు అసారములని ప్రదర్శిస్తాను" అని.

బోధిసత్త్వుడు ఆతరువాత ఈ అభిప్రాయాన్నే మనస్సులో ఉంచుకొని రామపుత్రుడైన రుద్రకుడున్న స్థలానికి వెళ్ళాడు. వెళ్ళి అతన్ని చూచి "అయ్యా! మార్షా! నీకు గురువు ఎవ్వరు? ఏ ధర్మాన్ని ఉపదేశం పొందావు?" అని ప్రశ్నించాడు.

బోధిసత్త్వుడు యిలా ప్రశ్నించగా, రామపుత్రుడైన రుద్రకుడు అతనితో "ఓ మార్షా! నాకు గురువు లేడు! నేను స్వయంగానే ధర్మాన్ని సమ్యక్పద్ధతిలో పొందాను' అన్నాడు.

బోధిసత్త్వుడు—"నీవు పొందిన దేమిటి?" అని ప్రశ్నించాడు.

నైవ సంజ్ఞా నాసంజ్ఞాయతన సమాపత్తి మార్గమే (సంజ్ఞాసంజ్ఞలకు అతీతమైన ఆయతన సమాపత్తి మార్గమే) నేను అనుసరించేది" అని రామపుత్రుడైన రుద్రకుడు అన్నాడు.

"అయితే, నేను మీవల్లనుండి ఆపవాదలను అనుశాసించే సమాధి మార్గాన్ని పొందవచ్చునా?" అని బోధిసత్త్వుడు అడిగాడు.

"తప్పకుండా పొందవచ్చు"నని రుద్రకు డన్నాడు.

తర్వాత బోధిసత్త్వుడు ఏకాంతస్థలానికి పోయి, పర్యంకబంధం వేసుకుని కూర్చున్నాడు. బోధిసత్త్వుడు ఆ విధంగా కూర్చుండగానే, అతని పుణ్యవిశేషంవల్లనూ, జ్ఞానవిశేషంవల్లనూ పూర్వం చేసుకున్న పుణ్యకార్యాచరణల ఫలవిశేషంవల్లనూ, సమస్త సమాధుల పరిచయ విశేషంవల్లనూ ధ్యానప్రముఖాలూ, లోకోత్తమలూ అయిన లౌకిక సమాపత్తులు వందల సంఖ్యలో అనుకూలంగా లభించాయి. అవి సాకారంగా కాన వచ్చాయి. అతని మనస్సు అతని వశవర్తిగా ఉండడమే దీనికి కారణం.

తర్వాత బోధిసత్త్వుడు స్మృతి తెచ్చుకుని సమాధ్యవస్థనుంచి మేలుకొన్నవాడై, అసనబంధాన్ని సడలించి లేచి రామపుత్రుడైన రుద్రకుని వద్దకు వెళ్ళాడు. వెళ్ళి "మార్షా! సంజ్ఞాసంజ్ఞల కతీతమైన యీ ఆయతనసమాపత్తి మార్గంకంటె మేలైనది మరొకపద్ధతి ఏమైనా ఉన్నదా?" అని ప్రశ్నించాడు. "లేదు" అని అతడు సమాధాన మిచ్చాడు.

తనకు ఉన్నట్టు రామపుత్రుడైన రుద్రకునికి శ్రద్ధ, వీర్యం, స్మృతి, సమాధి, ప్రజ్ఞా లేవని బోధిసత్త్వునికి తోచింది. అతడు రుద్రకునితో "మార్షా! నీవు కృతార్థుడవైనట్లు భావించిన యీ ధర్మం నాకు అవగతమైనది" అని అన్నాడు. అప్పుడు రుద్రకుడు "అయితే, నీవూ నేనూ ఈ



శిష్యగణాన్ని విడిచిపెట్టి పోయి సాధనచేద్దాము" అంటూ బోధిసత్త్వుణ్ణి ఆచార్యస్థానంలో ఉంచి గౌరవించాడు.

బోధిసత్త్వునికి యీ మార్గం తృప్తికరంగా లేదు. అతడు రుద్రకుడిని చూచి "ఓ మార్షా! ఈ మార్గం నిర్వృతికి అనుకూలంగా లేదు. విరాగానికిగాని, నిరోధానికిగాని, ఉపశమానికిగాని, అభిజ్ఞకుగాని, సంబోధికిగాని, నిర్వాణానికిగాని ఉపయోగించదు. శ్రమణునికిగాని, బ్రాహ్మణునికిగాని అనుకూలించదు" అని తెలిపాడు.

భిక్షులారా, తర్వాత బోధిసత్త్వుడు శిష్యులతో వున్న రామపుత్రుడైన రుద్రకునివద్ద వుండడం చాలును అనుకొని, అతనిని విడిచిపెట్టి బయలుదేరి వెళ్ళిపోయాడు.

అ సమయంలో భద్రవర్గీయులైన అయిదుగురు రామపుత్రుడైన రుద్రకుని సన్నిధిలో బ్రహ్మచర్యాన్ని ఆచరిస్తూ ఉన్నారు. ఇదంతా గమనిస్తూవున్న వారి మనస్సులో ఇలా తోచింది..."ఏ విషయాన్ని పొందడానికి మనం ఎంతోకాలంనుంచి ఎక్కువగా ప్రయత్నించినా సాధ్యం కాలేదో, దాన్ని శ్రమణుడైన గౌతముడు అల్పకృచ్ఛ్రించేతనే సులభంగా పొంది, సాక్షాత్కరింపజేసుకున్నాడు. అయినా, దీనివల్ల తృప్తిని పొందలేదు. ఇంకా ఉత్తమమార్గంకోసం అన్వేషిస్తూ ఉన్నాడు. ఇతడు తప్పక లోకగురువు కాగలడు. ఇతనిని ఆశ్రయించి వుంటే ఇతడు ప్రత్యక్షం చేసుకున్న అపూర్వవిషయాన్ని మనకు కూడా బోధించగలడు; పంచిపెట్టగలడు" అని.

ఈ విధంగా ఆలోచించి, భద్రవర్గీయులైన ఆ అయిదుగురూ రామపుత్రుడైన రుద్రకుని సామీప్యాన్ని విడిచిపెట్టి బోధిసత్త్వునివెంట వెళ్ళినారు.

భిక్షులారా, తర్వాత బోధిసత్త్వుడు తాను కోరినట్లుగా రాజగృహంలో విహరించి, ఆ అయిదుగురు భద్రవర్గీయులతోకూడా మగధదేశంలో తిరుగసాగినాడు.

ఆ సమయంలో రాజగృహామహానగరానికీ, గయకూ మధ్య భాగంలో ఒక గణం జను లందరూ ఒక ఉత్సవాన్ని జరుపుకుంటున్నారు. వారు, అయిదుగురు భద్రవర్గీయులతో వస్తూ వున్న బోధిసత్త్వుణ్ణి గొప్పగా గౌరవించి, విశ్రాంతికి తగిన స్థలం యిచ్చి ఆహారం సమర్పించారు.

బోధిసత్త్వుడు మగధదేశంలో సంచారం చేస్తూ గయకు వచ్చాడు. వచ్చి ప్రహాణార్థి అయి గయా శీర్ష పర్వత ప్రాంతంలో విహరింపసాగాడు. ఆ రీతిగా విహరిస్తున్నప్పుడు అతనికి మూడు ఉపమలు తోచాయి. అవి అశ్రుతపూర్వాలూ, ఇంతవరకూ ఎవ్వరూ ఎరుగనివిన్నీ. వానిలో మొదటి ఉపమ యిది – ఇప్పుడు శ్రమణ బ్రాహ్మణులు కొందరు ఉన్నా, కామానవకృష్టకాయ చిత్తాలు గలవారుగా ఉన్నారు. వారి మనస్సులు కామాలనుండి తప్పుకొని ఉండలేదు. వారు తమ కోరికలను అనుసరించి స్వేచ్ఛగా తిరుగుతున్నారు. వారికి కామములందున్న సంతోషం, వాటిలోని ఇష్టం, వాటిలోని కోరిక, వాటిలోని ఆశ, వాటిలోని తీరని దాహం, వాటిలోని మూర్ఛ, వాటిలోని తాపం, వాటిలోని పరమావధి. అయినా వాటికి ఉపశాంతి లేదు. ఇంకా వీరు స్వయంగా ప్రారంభించీ, శరీరాన్ని బాధించే దుఃఖమయమైన తీవ్రవేదనను పొందుతున్నారు. వీరు అభవ్యులు! మనుష్యధర్మాన్నే తప్ప, అంతకంటె పై స్థితిలో ఉన్న ఆర్యజ్ఞాన దర్శనవిశేషాన్ని సాక్షాత్కరించుకొనుటకు సమర్థులు కారు. అగ్నిని సంపాదించడానికీ, తేజస్సును పొందడానికీ ప్రయత్నించిన పురుషుడు పచ్చికర్రను తీసుకుని, పచ్చి ఉత్తరారణిని, నీటిలో ఉంచి గ్రహించి మథించినప్పుడు, అభవ్యుడు అగ్నిని సంపాదించడమూ సాధ్యం కాదు, తేజస్సును పొందటం అంతకంటెనూ సాధ్యం కాదు. ఆ విధంగానే యీ శ్రమణ బ్రాహ్మణులు తమ శరీరాలను కామాలకు వశమయేటట్లు చేస్తూ, మనస్సులను కామముల నుండి తప్పించలేక స్వేచ్ఛగా విహరిస్తున్నారు. వారికి కామములందే సంతోషం, వాటితోనే యిష్టం, కామములందే కోరికా, ఆశా, తీరని దాహమున్నూ. వాటిలోనే మూర్ఛ, వాటిలోనే తాపం! కామములందే పరమావధి. అయినా, వాటికి ఉపశాంతి కానరాదు. ఇంకా వీరు స్వయంగా ప్రారంభించి, శరీరాన్ని బాధించే దుఃఖమయమైన తీవ్రవేద



నను పొందుతున్నారు. అభవ్యులైన వీరు మనుష్యధర్మాన్నే తప్ప, అంతకంటే పై స్థితిలో వున్న ఆర్యజ్ఞానదర్శనవిశేషాన్ని సాక్షాత్కరించుకొనుటకు సమర్థులు కాకున్నారు. ఇది బోధిసత్త్వునికి తెలిసిన మొదటి ఉపమ! తిరిగి అతని మనస్సులో ఇలా తోచించి – ఈ శ్రమణ బ్రాహ్మణులు కామాలకు వశం కాని కాయ, చిత్తాలు కలిగి విచారిస్తున్నారు. అయినా ముందువారికివలె వీరికీ కామాలు ఉపశమించలేదు. అగ్నికోసమూ, తేజస్సుకోసమూ ప్రాధేయపడుతున్న పురుషు డొకడు పచ్చి కర్రను తెచ్చి నేలమీద స్థాపించి, పచ్చి అరణితో మథిస్తే అగ్నిని సంపాదించలేడు. ఆ విధంగానే యీ శ్రమణ బ్రాహ్మణులున్నూ మనుష్య ధర్మాలనే అనుసరిస్తూ, వానికంటే పై స్థితిలో ఉన్న ఆర్యజ్ఞాన దర్శన విశేషాన్ని సాక్షాత్కరింపజేసుకొనుటకు అనర్హులవుతున్నారు. ఇది బోధిసత్త్వునికి తోచిన రెండవ ఉపమ! ఇది కని విని తెలిసికొని ఉండనిది!

అతనికి తిరిగి యిలా తోచింది – ఈ శ్రమణ బ్రాహ్మణులు కామాలకు వశముకాని కాయచిత్తాలతో విహరిస్తూ ఉన్నారు. కామాలలోనే ఆనందించడమనేది అంతా పేయాలం వరకు వున్నది. అదీ ఉపశాంతమయినది! ఇంకా వీరు స్వయంగా ఉపక్రమించి, శరీరానికి బాధ కలిగించే కటువూ, తీక్ష్ణమూ, తీవ్రమూ అయిన దుఃఖవేదనను పొందుతున్నారు. మనుష్యధర్మాలకంటె ఉన్నతస్థితిలో ఉన్న ఆర్యజ్ఞాన దర్శన విశేషాన్ని ప్రత్యక్షం చేసుకొనుటకు అర్హులు. అగ్నినీ, తేజస్సునూ సంపాదించగోరిన పురుషుడు ఎండు కట్టెను, ఎండిన అరణిని గ్రహించి, వాటిని మథించి అగ్నినీ, తేజస్సునూ పొందిన విధంగా, సమస్త వేదనలూ అనుభవించిన ఈ శ్రమణ బ్రాహ్మణులున్నూ, మనుష్యధర్మాలకంటె ఉన్నత స్థితిలో ఉన్న ఆర్యజ్ఞాన దర్శన విశేషాన్ని ప్రత్యక్షం చేసుకొనుటకు అర్హులై ఉన్నారు. ఈ రీతి మూడవ ఉపమ అతనికి తోచినది! ఇది అశ్రుత పూర్వమూ, అనభిజ్ఞానపూర్వమున్నూ.

భిక్షులారా, పిదప బోధిసత్త్వుడు ఇలా అనుకున్నాడు – "నేనిప్పుడు కామాలకు లొంగని దేహంతో విహరిస్తున్నాను. మనస్సుకూ,

వాటికీ లొంగలేదు. కామాలవిషయమైన సంతోషం, కోరిక, ఆశ, దాహం, మూర్ఛ, తాపం, పరమావధి సమస్తమూ ఉపశాంతి పొందినవి. ఇంకనూ నేను స్వయంగా ప్రారంభించి, శరీరాన్ని తపింపజేసే దుఃఖ వేదనను - పేయాలంవరకూ తెలుసుకున్నాను. మనుష్యధర్మాలకంటె ఉన్నత స్థితిలో ఉన్న ఆర్యజ్ఞాన దర్శన విశేషాన్ని ప్రత్యక్షం చేసుకొనుటకు సమర్థుడను” అని.

ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు స్వేచ్ఛగా గయలో విహరించి, గయా శీర్ష పర్వతప్రాంతం పిక్కలు నొప్పిపట్టేటట్టు ఎక్కి తిరుగుతూ దాని పరిసరాలలోని ఉరు బిల్వాసేనాపతిగ్రామానికి వచ్చాడు. అక్కడ అతనికి నైరంజనానది కానవచ్చినది! అవి స్వచ్ఛమైన తరుగుల్మాలతో అందంగా ఉన్నది. దాని చుట్టుప్రక్కల చాలా గ్రామాలు కానవచ్చాయి. అక్కడ బోధిసత్త్వుని మనస్సు మిక్కిలి ప్రసన్నంగా ఉండినది. “ఈ ప్రదేశం సమతలమై మిక్కిలి రమణీయంగా ఉన్నది. ప్రతిసంలయనానుకూలము. ప్రహాణార్థి అయిన (ధ్యాన నియమం కోరే) కులపుత్రునికి ఇది సరియైన స్థలం! నేనిక్కడే ఉండి నా నియమాన్ని సాగిస్తాను” అని అతడు సంకల్పించుకొన్నాడు.

ఓ భిక్షులారా, తర్వాత బోధిసత్త్వునికి ఈ విధంగా తోచినది— “నేను పంచకషాయకాలంలో ఈ జంబూద్వీపంలో అవతరించాను. ఇక్కడ ఉన్న ప్రాణులు హీనాధికముక్తులు కల్గి, నానావిధాలైన దృష్టులతో పిండగ్రహణంలో ఆసక్తి కలిగి ఉన్నారు. మూఢులైన కొందరు అనేక విధాలుగా శరీరాన్ని తపింపజేసుకుని తన్మూలంగా శరీరశుద్ధిని పొందాలని భావిస్తున్నారు. నమ్ముతున్నారు కూడా. ఎట్లనగా— మంత్రవిచారమూలంగానూ, హస్తప్రహేళికలమూలంగానూ, మూలికల ద్వారానూ, మత్స్యమాంసాలు విడిచిపెట్టడం మూలంగానూ, మద్య, తుషోదకాలను త్రాగకుండగనూ, ఒకటవ— మూడవ— ఐదవ— ఏడవ —యిండ్లలో మాత్రం భిక్షను గ్రహిస్తూనూ ఉన్నారు. కొందరు కందమూలములను, ఫలాలను, పాచి, దర్భలు, గోమూత్రం, గోమయం, పాయసం, పాలు, పెరుగు, నెయ్యి, చెరకురసం, పచ్చిపిండి మొదలయినవాటిని ఆహారపానీయాలుగా స్వీకరిస్తూ ఉన్నారు. కొందరు గ్రామ్యవృత్తులనూ, ఆరణ్య వృత్తులనూ ఆశ్రయించీ, గోవ్రతాన్నీ, మృగవ్రతాన్నీ, కుక్క, పంది, కోతి, ఏనుగు — మొదలైనవాటివ్రతాలనూ అనుసరించీ, ఉన్నచోటునుంచి కదలక మౌనవ్రతాన్ని అవలంబించీ, వీరాసనం వేసుకునీ, ఒక్కమాటనుండి ఏడు మాటలవరకూ మాత్రం మాటలాడుతూ, ఏకభుక్తం చేస్తూ, ఏకాహోరాత్రం, చాతుర్థ్యం, పంచ, షట్కాలాంతం, పక్షక్షపణం, మాసక్షపణం, చాంద్రాయణం మొదలైన వ్రతాలను ఆచరిస్తూ, గ్రద్ద, గుడ్లగూబ మున్నగువాటి పక్షాలను ధరించి, దర్భాసనం, నారచీరలు, ఉష్ట్రికంబళం, అజకంబళం, కేశకంబళం, చర్మములను ధరించి, తడిగుడ్డలు పరుచుకొని, అస్త్రోపలజాలంమీద, బూడిదమీద, గులకరాళ్లమీద, పాషాణఫలకంమీద, ముళ్లపైని, గడ్డిపైని, ఇనుపమేకులపైని పండుకుంటూ, తల ఎత్తుగాను, ముఖం ఎత్తుగాను నేలమీద పండుకొని, ఒకటి రెండు మూడు నాలుగు అయిదు ఆరు ఏడుగా వస్త్రాలను ధరిస్తూ, వస్త్రం ధరించక దిగంబరులుగా ఉంటూ, స్థానాస్థానాల విధిని పాటిస్తూ, తలవెంట్రుకలను, గోళ్లను, గడ్డాలను దీర్ఘంగా పెంచుకొని, జడలను కిరీటంలాగ ధరించి, ఒక కోల (రేగు) తిలలూ తండులాలూ ఆహారంగా గ్రహించి, భస్మము, మసి, నిర్మాల్యము, దుమ్ము, బురదలు పూసుకొని రోమములు, దర్భలు, కేశములు, నఖములు, గుడ్డలు, పంజరకరంకాలు ధరించి, వేడినీరు, కడుగునీరు, గంజి మున్నగు పానీయాలను తాగుతూ, నిప్పువలె ఎర్రని కాషాయవస్త్రమును, త్రిదండమును, కమండలువును, కపాలం, ఖట్వాంగం ధరించి ఆ మూఢులు పరిశుద్ధిని పొందవలెనని తలుస్తున్నారు. ధూమపానం, అగ్నిపానం, సూర్యనిరీక్షణం, పంచాగ్నిమధ్యలో ఉనికి, ఒక పాదంమీద నిలిచి ఉండడం, బాహువులను మీదికి ఎత్తి ఒంటికాలితో నిలువడం మున్నగు పద్ధతులలో తపస్సు చేస్తూ ఉంటారు. ఊక నిప్పులోను, నికుంభసాధనలోను, కాలుతున్న రాళ్ళనిప్పులోను ఉండి, జలప్రవేశనం చేసి, మరుదేశంలో వుండి తన్మూలంగా మరణించి తాము కోరిన గతిని పొందాలని యత్నిస్తున్నారు. ఓంకారము, వషట్కారము, స్వధాకారము, స్వాహాకారము, ఆశీర్వచనము, చయనము, స్తుతి, ఆవాహనము, జప్యమైన మంత్రాధ్యాయ

నము, ధారణ, కరణము అనే వీటివల్ల శుద్ధిని సంపాదింపగోరుతున్నారు. తాము పరిశుద్ధులమని భావిస్తూ వుండి—బ్రహ్మ, రుద్రుడు, విష్ణువు, దేవి, కుమారుడు, మాత, కాత్యాయని, సూర్యచంద్రులు, కుబేరుడు, వరుణుడు, ఇంద్రుడు అశ్వినీదేవతలు నాగ యక్ష గంధర్వ అసుర గరుడ కిన్నర మహోరగ రాక్షస ప్రేత భూత కుంభాండ పారిషద గణపతి, పిశాచములు మున్నగువారికిన్నీ, దేవర్షి, రాజర్షి, బ్రహ్మర్షులకున్నూ నమస్కరిస్తారు. వారియందు భక్తి చూపుతూ వుంటారు. పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అనే పంచభూతాలను ఆశ్రయిస్తారు. కొండలు, నదులు, ఊటలు, సరస్సులు, చెరువులు, తటాకములు, సాగరములు, బురద గుంటలు, పుష్కరిణులు, నూతులు, చెట్లు, పొదలు, తీగలు, గడ్డి, రాళ్లు, గోశాలలు, చతుష్పథములు, అంగడులు మున్నగువాటిని ఆశ్రయిస్తారు. గృహ స్తంభాలు, రాళ్లు, ముసలము, కత్తి, విల్లు, గండ్రగొడ్డలి, బాణము, శక్తి, త్రిశూలం మున్నగు ఆయుధాలు—అనే వీటికి నమస్కారం చేస్తారు. పెరుగు, నెయ్యి, ఆవాలు, యవలు, పూలదండలు, గడ్డిచిగుళ్లు, మణులు, వెండిబంగారములు మంగళప్రదములని భావిస్తున్నారు. తీర్థ్యులైన వీరు ఈ విధంగా జరుపుతూ సంసారంవల్ల భీతిచెందినవారై వాటి వాటిని ఆశ్రయిస్తున్నారు.

ఈ విధంగా జరుపడంవల్ల, దేహం చాలించిన తర్వాత స్వర్గాపవర్గములు కలుగుతాయని తలుస్తున్నారు. వీరు అసత్యమార్గంలో నడుస్తూ, దిక్కుకానిదానిని దిక్కుగానూ, అమంగళమైనదానిని మంగళకరమైన దానినిగానూ తలుస్తూ, అశుద్ధివలన శుద్ధి పొందవలెనని అనుకొంటున్నారు. నేనో, అట్టి వ్రతతపోవిశేషాన్ని అవలంబిస్తాను—పరప్రవాదులను అందరినీ నిగ్రహించగలదీ, కర్మక్రియలనుండి నష్టులయిన జీవులు కర్మక్రియలు అవలంబించేటట్లు చేయగలదీ ధ్యాన గోచరులైన రూపావచరులైన దేవపుత్రులకు ధ్యానవిశేషాన్ని ప్రదర్శించి, అనుసరించేటట్లు చేయగలదీ అయిన వ్రతవిశేషాన్ని అనుసరిస్తాను.''

ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు ఈ విధంగా ఆలోచించి ఆరు సంవత్సరాలు మిక్కిలి ఘోరంగా వ్రతతపస్సులలో సుదుష్కరాతిదుష్కరమైన చర్యను అవలంబించినాడు. అది దుష్కరచర్య అని ఏ కారణమును బట్టి చెప్పవచ్చుననగా—ఆ చర్య మిక్కిలి దుష్కరమై ఉండటంవల్లనే అట్లు చెప్పబడుతున్నది. చరమభవికుడైన బోధిసత్త్వుని విడిచి, సత్త్వ సమూహంలో మనుష్యుడుగాని, అమనుష్యుడుగాని ఇట్టి దుష్కరమైన చర్యను ఆచరించడానికి ఒక్కడూ సమర్థుడు కాడు. అప్పుడు బోధిసత్త్వుడు ఆస్ఫానకధ్యానాన్ని అవలంబించాడు. ఏ కారణంవల్ల దానికి ఆస్ఫానకమనే పేరు వచ్చింది? అని అడగవచ్చును. అతడు ఆ ధ్యానాన్ని ఆరంభించినప్పుడే ఆశ్వాసాన్నీ, ప్రశ్వాసాన్నీ నిరోధించాడు. బాగుగా అరికట్టాడు. ఆ ధ్యానం అవికల్పమైనది. అనిరంజనమైనది. స్పందనం లేనిది. అంతటను అనుగతమైనది. జారుపాటు లేనిది. ఇదివరలో ఒకప్పుడైననూ దాన్ని శైక్ష్యుడుగాని, అశైక్ష్యుడుగాని, ప్రత్యేకబుద్ధుడుగాని, చర్యను ఆచరించిన ఏ బోధిసత్త్వుడుగాని ఆచరించి వుండలేదు. అందువల్లనే దీనికి ఆస్ఫానక మనే పేరు వచ్చింది. ఆకాశం స్ఫురణం లేనిది. కరణ వికరణాలు లేనిది. ఆ సమస్తమూ ఇంతలో స్ఫురిస్తున్నందున ఈ ధ్యానం ఆకాశమయమైనది. అందువల్లనే బోధిసత్త్వుడు అవలంబించిన ధ్యానము ఆస్ఫానక మని చెప్పబడుతూ ఉన్నది.



ఓ భిక్షులారా, పిదప బోధిసత్త్వుడు లోకానికి ఒక ఆశ్చర్యాన్ని చూపుటకోసమున్నూ, తీర్థికుల గర్వాన్ని అణచివేయడంకోసమున్నూ, పరప్రవాదులను నిగ్రహించుటకున్నూ, దేవతలను ఆకర్షించుటకొరకున్నూ, శాశ్వతవాదులను ఉచ్ఛేదించుటకున్నూ, కర్మక్రియలనుంచి జారిపోయిన ప్రాణులకు కర్మక్రియలను కూర్చుటకున్నూ, పుణ్యఫలాన్ని పొందుట కున్నూ, జ్ఞానఫలాన్ని చూచుటకున్నూ, చిత్తస్థైర్యాన్ని కలిగించుటకున్నూ, ధ్యానాంగాన్ని విభజించుటకున్నూ, శరీరబలాధిక్యాన్ని చూచుటకున్నూ సరిగా లేని ఉత్తి నేలపైనే పర్యంకబంధాన్ని వేసుకుని కూర్చున్నాడు. అట్లు కూర్చుండి స్వశరీరాన్ని మనస్సుచేత నిగ్రహించి పీడింపసాగినాడు. అతడు తన అనుభవాన్ని ఇలా వివరించాడు:

''ఓ భిక్షులారా, హేమంత ఋతువులోని అష్టకరాత్రులలో ఆ విధంగా దేహాన్ని నిగ్రహించి పీడిస్తూ వుండిన నాకు రెండు కక్షభాగాల

నుండీ, లలాటంనుండీ చెమటలు కారి నేలపై పడసాగినవి. అవి మంచుగా మారి, ఆవిరి అయి, నీటిబిందువులుగా మారినవి. బలవంతుడైన పురుషుడు దుర్బలుడి మెడను పట్టుకొని బాధించినవిధంగా, నా మనస్సు, దేహాన్ని అంకించుకొని పీడిస్తూ వుండగా, చంకలనుండీ, లలాటంనుండీ చెమటలు కారి, మంచుగానూ ఆవిరిగానూ, బాష్పాలుగానూ మారినవి.

ఓ భిక్షులారా, నేను ఆస్ఫానక పద్ధతిలో ధ్యానంలో ఉన్నప్పుడు నా ముక్కునుంచిగాని, నోటినుండిగాని ఉచ్ఛ్వాసనిశ్వాసాలు రాకుండా స్తంభించిపోయాయి. కర్ణరంధ్రాలలో మాత్రం హోరుమని పెద్దధ్వనులు వినబడసాగినవి. వెదురుకర్వంతో పెరుగుకుండను చిలికినప్పుడు వచ్చే పెద్ద ధ్వనివలె కర్ణరంధ్రాలనుంచి పెద్ద శబ్దం బయలువెడలినది. ముక్కునుంచి గాని, నోటినుండిగాని శ్వాస రాలేదు.

ఓ భిక్షులారా, నేను తిరిగి ఆస్ఫానక పద్ధతిని ధ్యాన నిమగ్నుడనయ్యాను. అప్పుడు నా నోరూ, ముక్కూ, చెవులూ కూడా స్తంభించిపోయాయి. అవి స్తభించిపోగా, వాయువు మీదికి ప్రసరించి శిరఃకపాలాన్ని పీడించినది. పురుషుడు శక్తితో శిరఃకపాలాన్ని కొట్టుకుంటే ఎలా పీడ కలుగునో అట్లే నా ముఖ, నాసికా శ్రోత్రములు స్తంభించిపోగా, ఊర్ధ్వంగా వ్యాపించిన ఆశ్వాసప్రశ్వాసలు శిరః కపాలాన్ని పీడించినవి."

బోధిసత్త్వుడు ఇట్టి అవస్థలో వుండగా చూచి కొందరు దేవతలు, అతడు కాలగతిని పొందినట్లు తలచి విచారించారు. కొందరు మాత్రం బోధిసత్త్వుడు కాలం చెయ్యలేదని, ధ్యానంలో విహరిస్తున్నాడని, అర్హతులు ఇట్లే ఉంటారని నిశ్చయించారు.

ఆ సమయంలో ఈ గాథలు చెప్పారు :

"మా ఖల్వయం శాక్యనరేన్ద్రగర్భో హ్యపూర్ణసంకల్ప ఇహైవరణ్యే,
కృత్వాత్రిలోకం దుఃఖితం హ్యనాథంకాలం కరిష్యత్యకృతార్థ ఏవ.
హా సత్త్వసారా సదృఢ ప్రతిజ్ఞా సద్ధర్మ యజ్ఞేన నియన్త్రితాభా,
వయం పురా తే తుషితేషు నాథా క్వ సా ప్రతిజ్ఞా తవ శుద్ధసత్త్వ?"



'శాక్య నరేంద్ర పుత్రుడైన యీ బోధిసత్త్వుడు తన సంకల్పం నెరవేరకుండానే మూడు లోకాలనూ దుఃఖంలో ముంచివేసి అనాథలుగా చేసి, కృతార్థుడు కాకుండానే ఈ అరణ్యంలో కాలగతిని పొందలేదుకదా!

'అయ్యో! సత్త్వసారుడవూ, శుద్ధసత్త్వుడవూ అయిన బోధిసత్త్వా! దృఢ ప్రతిజ్ఞ కలవాడా! సద్ధర్మయజ్ఞంవల్ల గొప్ప తేజస్సు పొందినవాడా! తుషితలోకంలో వుండే మాకు ప్రభువైనవాడా! ఏదీ నీవు చేసిన ఆ ప్రతిజ్ఞ ఏమయినట్లు?"

తర్వాత ఆ దేవపుత్రులు త్రాయత్రింశ దేవతలదగ్గరకు వెళ్ళి అక్కడ వున్న మాయాదేవికి "అమ్మా! నీ కుమారుడు మరణించాడు" అని తెలియజేశారు.

ఈ వార్తను విన్న వెంటనే మాయాదేవి అప్సరసల గుంపుతో కూడా అర్ధరాత్రి సమయంలో నైరంజనా నదీతీరానికి వచ్చి శుష్క శరీరుడై ఉన్న బోధిసత్త్వుడు మరణించాడనే భావించి కన్నీళ్ళు కారుస్తూ గద్గద కంఠంతో ఏడుస్తూ ఇలా పలికినది :

"కుమారా! నీవు లుంబినీ వనంలో జన్మించినప్పుడు సింహంవలెనే వుండి, పుట్టినప్పుడే స్వయంగా ఏడు అడుగులు నడిచావు. నీవు అప్పుడు నాలుగు దిక్కులనూ చూచి 'ఇది నీకు చివరి జన్మ' అని చెప్పినావు. ఆ మాటను పూరించలేదు. నీవు పుట్టినతర్వాత అసిత మహర్షి వచ్చి 'ఈ బాలుడు లోకంలో బుద్ధుడు కాగలడు.' అని చెప్పాడు. అతడు సమగ్రంగా చెప్పిన వివరణ యదార్థం కాకపోయింది. నీవు చక్రవర్తి పుత్రుడవైనా ఇంపైన రాజ్యసంపదను అనుభవించలేదు. బోధినైనా పొందకుండా మరణించావు. అయ్యో! నాపుత్రునికై ఎవరిని ఆశ్రయించేది? దుఃఖితనైన నేను ఎవరి దగ్గర ఏడ్చి గోడుపెట్టుకోనేను? నా ఏకైకపుత్రునికి ప్రాణం పోసి, ఎవ్వరు బ్రతికించగలరు?"

అప్పుడు బోధిసత్త్వుడు ప్రశ్నించాడు:—"అమ్మా! జుత్తు విరియబోసుకుని, శోభ తక్కి భూమిపైని ఉండి కుమారుడికోసం మిక్కిలి పరితపిస్తూ ఉన్న నీవు ఎవ్వరవు?" అని.

అప్పుడు మాయాదేవి "కుమారా! నిన్ను నా గర్భంలో వజ్రం వలెనే పది మాసాలు మోసి ఉన్నాను. నీ కోసమే దుఃఖంతో ఇలా విలపిస్తూ వున్నాను" అని అన్నది.

అప్పుడు బోధిసత్త్వుడు ఆమెను వూరడిస్తూ ఈ విధంగా అన్నాడు: "కుమారునిపైని ఎంతో అభిమానం గల ఓ తల్లీ! నీవు భయపడవద్దు. నీ శ్రమను నేను వ్యర్థం చెయ్యను. సఫలం చేస్తాను. బుద్ధ పరిత్యాగం అమోఘమైనది! అసిత మహాముని చెప్పినదాన్ని జరిపిస్తాను. దీపంకరుని వ్యాఖ్యను వ్యక్తం చెయ్యగలను. భూమి నూరు వ్రయ్యలుగా బ్రద్దలయితే కానీ, రత్న శృంగాలు కల మేరు పర్వతం సముద్రంలో తేలిపోయినా తేలిపోనీ! సూర్యచంద్రులూ, నక్షత్రాలూ భూమిపైని పడిపోతే పడిపోనీ! నేను మాత్రం మరణించను. అందువల్ల నీవు ఇప్పుడు ఎంత మాత్రమూ విచారించ నక్కరలేదు. నేను బుద్ధుడనై సంబోధిని పొందడం శీఘ్రంగానే చూడగలవు."

ఈ మాటలను విన్న వెంటనే మాయాదేవికి ఆనందంవల్ల రోమాంచం కలిగింది. ఆమె బోధిసత్త్వునిమీద మందార పుష్పాలను చల్లి, మూడుసార్లు ప్రదక్షిణంచేసి, దివ్యాలైన తూర్యధ్వనులు చెలరేగగా తన భవనానికి వెళ్ళిపోయినది.

బోధిసత్త్వుడే తర్వాత తన అనుభవాలను గురించి యిలా చెప్పాడు:

"ఓ భిక్షులారా, తర్వాత నా మనస్సులో ఇట్లు తోచింది. కొందరు శ్రమణక బ్రాహ్మణులు అల్పమైన ఆహారంవల్ల శుద్ధి కలుగుతుందని భావిస్తున్నారు. నేను కూడా ఆ రీతినే అల్పమైన ఆహారం తీసుకుంటూ వ్రతచర్య చేస్తే మేలని తోచినది. రెండు రేగుపళ్ళ ప్రమాణమైనా కాక, ఒక్క రేగుపండు ప్రమాణం కల ఆహారాన్నే తీసుకోన



దలచాను. అప్పట్లో రేగుపళ్ళు చాలా పెద్ద పెద్దవిగా వుండేవని మీరు అనుకోవద్దు. ఇపుడు ఎంతలేసి రేగుపళ్ళు వున్నాయో, అప్పుడూ అంతలేసి పండ్లే ఉండేవి. నేను ఒకే ఒక్క రేగు పండంత ఆహారాన్నే స్వీకరించేవాడను. నా శరీరం మిక్కిలి కృశించిపోయి చాలా దుర్బలంగా అయినది. అసీతకికర్రల వలెనూ, నీలిచెట్టు కర్రలవలెనూ నా అంగప్రత్యంగాలన్నీ కానవచ్చినవి. ఎండ్రి ప్రక్క భాగాలవలెనే నా ప్రక్క ఎముకలు అయినవి! వాహనాలు తయారుచేసే శాలగాని, గజశాల గాని ప్రాతది అయిపోయి, మీది కప్పు ఎగిరిపోతే వాసాలు, దంతెలు (ముంజూరుపట్టెలూ) ఉన్నట్లే నా ప్రక్క ఎముకలు రెండు పార్శ్వాలలోను కానవచ్చినవి. బాట ఎత్తు పల్లములుగనూ, సమవిషమాలుగనూ వుండేటట్లు నా వెన్నెముక సమవిషమాలుగానూ, ఉన్నతావనతములుగనూ ఉండినది. ఎండిపోయిన లేత చేదుసొరకాయవలె నా తల నొక్కుకొనిపోయింది. వేసవికాలంలోని చివరి నెలలో నూతులలోని ఒరలు దూరదూరంగా పోతూ, కానబడడం కూడా కష్టంగా ఉంటుంది. ఆ విధంగానే నా కనుగ్రుడ్లు చాలా లోతునకు పోయినవి. అజపదం వలెను, ఉష్ట్రపదంవలెను నా కక్షలు, కుక్షి, వక్షస్సు కానవచ్చినవి. ఓ భిక్షులారా, అప్పుడు నేను నా కుక్షిని తాకితే, వెన్నును తాకినట్లే ఉండినది. లేవడానికి ప్రయత్నించి వంగి, అట్లే ఉండిపోయేవాడను. లేవలేక పడిపోయేవాడను! అతి కష్టంమీద లేచి శరీరంమీది దుమ్మును చేతితో దులుపుకొనగా, శరీరంమీది రోమములు రాలిపోయేవి. ఇదివరలో చక్కని ఛాయతో వుండిన నా శరీరం యిప్పుడు లేదు! నియమంలో వుండడంవల్ల శరీరం మొరటుబారి ఇట్లు అయినది! ఆ సమీపంలో వుండే గ్రామాల జనులు నన్ను చూచి 'అయ్యో! గౌతమ శ్రమణుడు ఎంత నల్లగా అయిపోయాడు! నీటికాకివలె ఉన్నాడు! వెనుక వుండిన చక్కని శరీరచ్ఛాయ ఎక్కడో మాయమయింది' అని అనుకునేవారు.

"ఓ భిక్షులారా, తర్వాత నా మనస్సులో ఇంకా కఠిన నియమంతో చర్యను అవలంబించవలెననే సంకల్పం కలిగింది. ఒకే ఒక్క బియ్యపు గింజంత ఆహారాన్నే స్వీకరించదలచాను. ఓ భిక్షులారా, అప్పటి బియ్యపుగింజ ఇప్పుడుండేదానికంటే చాలా పెద్దదని అనుకోవద్దు.

అది ఇప్పుడున్నట్లుగానే అప్పుడున్నూ వుండేది! ఒక్క బియ్యపుగింజంత ఆహారం తీసుకోనడంవల్ల నా శరీరం చాలా శుష్కించిపోయినది! శరీరచ్ఛాయ ఇంకా మారిపోయినది! అచ్చంగా నీటికాకిలాగే తయారయాను. వెనుకటి చక్కని చాయ గల దేహం ఏమయినదో!

ఓ భిక్షులారా, తరువాత నేను ఇంకను ఆహారం తగ్గించుకొని చర్యకు పూనుకొని నువ్వుగింజంత ప్రమాణం కల ఆహారాన్నే స్వీకరించాను. నా వెనుకటి శరీరచ్ఛాయ పూర్తిగా నశించింది.

ఓ భిక్షులారా, తర్వాత నాకొక ఆలోచన కలిగింది. కొందరు శ్రమణ బ్రాహ్మణులు ఆహారాన్ని అత్యల్పంగానైనా తీసుకోనకుండానే శుద్ధిని పొందాలని కోరుతూ ఉంటారు. నేను కూడా ఏ స్వల్పంగానూ ఆహారం తీసుకోకుండా వుండదలచుకుని, అట్లే చేయసాగినాను. ఆహారం తీసుకోనందువల్ల నా శరీరం చాలా శుష్కించిపోయినది. చాలా బలహీనమూ అయినది. నా శరీరంలోని అంగాలూ, ప్రత్యంగాలూ, రెండు, మూడు, నాలుగు, అయిదు రెట్లుగానూ, తుదకు పదింతలుగానూ బలహీనము లయినవి. ఎండ్రిడి ప్రక్క భాగాలవలెను, పైకప్పులేని వాహనశాల ముంజూరుపవలెను నా ప్రక్క ఎముక లుండినవి. తల ఎండిపోయిన చేదుసారకాయవలె వుండినది. వేసవికాల నూతిలోని ఒరలవలెనే కనుగ్రుడ్లు చాలాలోపలికి పోయినవి. నేను లేచుటకు ఎంతో ప్రయత్నించి వంగి, మరి లేవలేక క్రింద పడిపోయాను. అతి కష్టంమీద ఎలాగో తిరిగి లేచి శరీరంపై ఉండిన ధూళిని దులుపుకొనగా, శరీరంమీది రోమాలు వూడిపోయినవి. రమ్యమైన వర్ణం కలిగి వుండిన నా దేహం శోభావిహీనమైపోయింది. వెనుకటి మేనిచాయ నశించిపోయింది. ఆ దగ్గర పల్లెలలో వున్న జనులు నన్ను చూచి 'శ్రమణుడైన గౌతముడు చాలా నల్లగా అయిపోయినాడు, నీటికాకివలె అయినాడు. ఇతని వెనుకటి శరీరచ్ఛాయ అంతా నశించిపోయింది' అని అనుకునేవారు".

శుద్ధోదనమహారాజు, కుమారుడు దుష్కర చర్య చేస్తూ వున్న చోటికి ప్రతి దినము - ఇతని క్షేమం తెలుసుకొనుటకై దూతను పంపుతునే ఉండినాడు.



ఓ భిక్షులారా, లోకానికి ఒక అద్భుత క్రియను చూపుటకున్నూ, కర్మక్రియలనుండి ప్రణష్టులైన మానవులను తిరిగి కర్మక్రియలలో ప్రవేశపెట్టుటకున్నూ, పుణ్యసంచయాల ప్రోత్సాహమునకున్నూ, మహాజ్ఞానం ప్రదర్శించుటకున్నూ, ధ్యానాంగాలను విభజించుటకున్నూ బోధిసత్త్వుడు ఒక్కొక్క రేగుపండూ, బియ్యపుగింజా ప్రమాణంగా గల ఆహారాన్ని స్వీకరించి, తుదకు ఆహారాన్నే విడిచి ఆరేండ్లు దుష్కర చర్యను చేయసాగినాడు. అతని మనస్సు దీనంగా లేకుండెను. అతడు కూర్చుండే ఇంతకాలమూ ఉండినాడు. పర్యంక బంధంనుండీ తపోమార్గంనుండీ చలించలేదు. ఎండ వున్నప్పుడు నీడనుగాని, నీడ ఉన్నప్పుడు ఎండనుగాని చేరలేదు. గాలినుంచిగాని, ఎండనుంచిగాని, వర్షంనుండిగాని ఆత్మరక్షణకు యత్నించలేదు. ఈగలు, దోమలు తనపైని వ్రాలినా, పాములు ప్రాకినా, వాటిని త్రోలడంగాని, తీసివెయ్యడంగాని చెయ్యలేదు. ఉమ్ముట గాని, చీదుట గాని చేయలేదు. ఒడలు విరువలేదు. ప్రక్కకుగాని, వెనకకుగాని, ముందునకుగాని వంగలేదు. ఆకాశం మేఘావృతమై వానలు కురుస్తూ, పిడుగులు పడుతూ వున్నాసరే, చేతినైనా అడ్డు పెట్టుకోలేదు.

చలికాలంలో అయినా శరీరం ముడుచుకోలేదు. ఇంద్రియాలను కప్పుకోలేదు. ఇంద్రియార్థాలను గ్రహించలేదు. దగ్గరి గ్రామాలనుంచి వచ్చిన బాలబాలికలు, గొల్లపిల్లలు, పశుపాలకులు, గడ్డికోసుకొనుటకు వచ్చినవారు, కట్టెలు కొట్టుకునేవారు, పేడకు వచ్చినవారు బోధిసత్త్వుడు పాంశు (ధూళి) పిశాచమని భావించేవారు. అతన్ని ఆటవస్తువుగా చేసుకునేవారు. అతనిపైని ధూళిని ఎత్తి పోసేవారు.

బోధిసత్త్వుడు ఈ విధంగా ఆరేండ్లు దుష్కరచర్య అవలంబించి చాలా దుర్బలశరీరుడైనాడు! గడ్డి కుంచెను చెవులలో దూర్చి ముక్కులోంచి బయటికి తీసేవాడు. ముక్కులో ప్రవేశపెట్టి చెవులలోనుంచి తీసేవాడు. చెవులలో ప్రవేశపెట్టి నోటినుండి బయటికి తీసేవాడు. నోటిలో ప్రవేశపెట్టి చెవులనుండి, ముక్కునుండి బైటికి తీసేవాడు. ముక్కులో ప్రవేశపెట్టి చెవులనుండి, నోటినుండి బయటికి తెచ్చేవాడు.

దేవ నాగ యక్ష గంధర్వులూ, సుర గరుడ కిన్నర మహోరగులూ, మనుష్యులూ అమనుష్యులూ బోధిసత్త్వుని గుణాలను ప్రత్యక్షంగా చూస్తూ వుండి, రాత్రింబగళ్ళు సమాధినిష్ఠలో వున్న బోధిసత్త్వుని పూజిస్తూ ఉండినారు. పరిచర్య చేస్తూ వుండినారు.

బోధిసత్త్వుడు యీ విధంగా ఆరేండ్లు దుష్కరచర్యను ఆచరిస్తూ వుండడం వల్ల అనేక వేల సంఖ్యలో వున్న దేవమనుష్యులు మూడు యానములలోను పరిపాకం పొందారు.

ఇక్కడ కొన్ని శ్లోకా లున్నవి. వాని అభిప్రాయం ఇది:

ఉత్తమ గుణాలతో ఉన్న బోధిసత్త్వుడు నగరంనుండి బయలుదేరి రాగా, సత్త్వముల మేలుకొరకు ఉపాయం కనిపెట్టవలెననే ఆలోచన కలిగినది "అధర్మంతో కూడి హీనమైన లోకంలో - జంబూద్వీపంలో పంచవిధ కషాయ కాలంలో జన్మించాను. లోకంలో ధర్మాన్ని ఉద్ధరించగలను. కొందరు మూర్ఖులు యాగాలు చేసి, కౌతూహలులై కాయోపక్రమకరణములవల్ల శుద్ధి కలుగుతుందని భావిస్తున్నారు. కొందరు అగ్నిలో ప్రవేశించి, మరుభూమిలో నివసించి, ధూళిని భస్మాన్ని పూసుకొని, నగ్నులై ఉండి, శరీరాన్ని తపింపచేయుటకు పంచాగ్ని మధ్యంలో ఉండి యోగాన్ని అనుసరిస్తూ ఉన్నారు. అవిద్వాంసులైన కొందరు చేతులతో అభినయిస్తూ, మంత్రాలు చదువుతూ ఒక్క యింట్లో మాత్రం భిక్షను గ్రహించి, శుద్ధుల మనుకొని నూనె, చెరకు పానకం, పాలు, పెరుగు, మత్స్య మాంసాలను విడిచిపెట్టుతున్నారు. చామలనూ, తామరతూండ్లనూ భక్షిస్తూ, దుంపలనూ, పండ్లనూ ఆకులనూ తింటూ, దర్భలనూ, నారగుడ్డలనూ, చర్మాలనూ, కంబళాలనూ ధరిస్తూ తపస్సు సాగిస్తున్నారు. కొందరు దిగంబరులై "ఇదే సత్యం, తక్కినది అజ్ఞానం" అంటూ భావిస్తున్నారు. చేతులను పైకి ఎత్తుకొని జడలను ధరించి, కొందరు సుగతిని పొందాలనే కోరికతో తగిన మార్గాన్ని విడిచి, కుమార్గాన్ని అనుసరిస్తున్నారు. గడ్డిపైని, ధూళిపైని, ముండ్లపైని పండుకొంటూ కొందరు ధ్యానం చేస్తున్నారు. కొందరు ఒక్క కాలిమీద నిలిచి, కొందరు ముఖం మీదికి ఎత్తి సూర్యచంద్రులను చూస్తూ ధ్యాననిమగ్నులై



ఉన్నారు. కొందరు ప్రవాహాలకూ, సరస్సులకూ, తటాకాలకూ, సముద్రాలకూ నదులకూ, సూర్యచంద్రులకూ, చెట్లకూ, పర్వత శిఖరాలకూ, కుంభాలకూ, భూమికీ నమస్కారాలు చేస్తున్నారు. మూఢులైన వీరు అనేక విధాలుగా శరీరాన్ని శుష్కింపజేసుకొంటున్నారు. మిథ్యాదృష్టి కల వీరు వేగంగానే అపాయాలలో పడిపోతున్నారు. నేను ఘోరమైన దుష్కర చర్యను - ఇంతవరకూ దేవతలకు గాని, మనుష్యులకు గాని సాధ్యం కానిదానిని అనుసరించి తపస్సును చేస్తాను. వజ్రంతో సమానమైన దృఢబలంతో అస్ఫానక పద్ధతిలో ధ్యానం చేస్తాను. ప్రత్యేకజినులు కూడా చెయ్యలేని ధ్యానాన్ని అవలంబిస్తాను. దేవ, మనుష్యులందరూ దీన్ని చూచి హర్షించగలరు. వారందరికీ పరిపాకాన్ని కలిగించే యీ దుష్కరవ్రత తపస్సును - తీవ్రమైనదానిని ఆరంభిస్తాను" అని అతడు నిశ్చయించాడు.

బోధిసత్త్వుడు ఈ విధంగా నిశ్చయించుకొని, పర్యంక బంధాన్ని వేసుకుని అసంస్కృతమైన ఉత్త సేలపైనే కూర్చుండి ధ్యానం చేస్తూ వుండినాడు. రేగుపండు, బియ్యపుగింజ, నువ్వుగింజల ప్రమాణం కల ఆహారాన్నే క్రమంగా స్వీకరించసాగినాడు. ఆశ్వాస, ప్రశ్వాసాలను కట్టిపెట్టినాడు. ఆస్థానకధ్యానాన్ని ఆరు సంవత్సరాలు ఈ విధంగా సాగించినాడు. ఇందులో కల్ప, వికల్పాలు లేవు, ఎండలోనుంచి నీడకుగాని, నీడలోనుంచి ఎండకుగాని వెళ్ళి యెరుగడు. ఏమాత్రమూ చలించనివాడై మేరుపర్వతంవలె స్థిరంగా ఉండి ఆస్ఫానకధ్యానాన్ని ఆచరిస్తూ ఉండెను. అతడు తనకోసమయి యిట్టి ఘోరమైన ధ్యానపద్ధతిని పూనలేదు. లోకం విషయంలో కరుణతో కూడిన మనస్సు కలవాడై, దాన్ని ఉద్ధరించుటకొరకై ఈ స్థితిని అవలంబించాడు.

దగ్గరి గ్రామంలో ఉండే పిల్లలూ, గొల్లలూ, కట్టెలు కొట్టేవారూ, గడ్డి త్రవ్వుకునేవారూ బోధిసత్త్వుని చూచి, అతడు పాంశుపిశాచమని భావించి, అతనిపైని దుమ్ము ఎత్తి పోయసాగినారు. అశుచిగా ఉండే వస్తువులను అతనిపై పడవేయసాగినారు. అనేకమైన రీతుల విమర్శింప సాగినారు. అతడు ఆస్ఫానకధ్యానంనుంచి భ్రమించలేదు. చలించలేదు.

ముందుకుగాని, వెనుకకుగాని వంగలేదు. తన శరీరాన్ని కాపాడుకొనుటకు ఎట్టి ప్రయత్నమూ చెయ్యలేదు. ఇతరులను చూడలేదు. ఏ శబ్దం విన్నా బెదరలేదు. నోటినుంచి ఉచ్చారణ జారవిడవలేదు. అతని శరీరంలో రక్త మాంసాలు ఎండిపోయాయి. ఎముకలూ, చర్మం మాత్రం మిగిలి ఉన్నవి. పొట్ట చూస్తే, దానినుండి వెన్నెముక కానవస్తుంది. అది ప్రవాహంవలె వంకర టింకరగా కనబడుతుంది. దేవతలు, సుర, నాగ, యక్ష, గంధర్వులూ గుణగణనిధియైన ఆ బోధిసత్త్వునికి రాత్రిందినములు ప్రత్యక్షంగా పూజలు చేస్తూ ఉండేవారు. "మనం కూడా అతనివలెనే ఉండవలెను" అని సంకల్పించుకున్నారు కూడా. అతడు ఆస్ఫానక ధ్యానాన్ని తనకోసమూ, సుఖం కోసమూ చేయడం లేదు. విస్తారమైన లోకంయెడల ఉండే కరుణవల్లనే చేయసాగినాడు. దీనివల్ల మతి విహీనులూ, విరోధులూ అయిన తీర్థికులు నిహతులైనారు. వారి ప్రచారాలు పరాస్తములయినవి. కాశ్యపుడు వచించిన కర్మక్రియ ప్రదర్శితమైనది. సుదుర్లభమైన సంబోధి బహుకష్టతరమైనది. దానిని జనసమూహానికి అందించుటకే ఆస్ఫానక ధ్యానం! వినీతులై, లక్షకు పైగా ఉన్న దేవ, మనుష్యులు మూడు యానములలో దీనిని గమనిస్తూ ఉండినారు. లోకక్షేమాన్ని అభిలషించి సుమతియైన బోధిసత్త్వుడు ఆస్ఫానక ధ్యానాన్ని అవలంబించినట్లు తెలుసుకున్నారు.

ఇది లలిత విస్తరంలో దుష్కరచర్యా పరివర్తమనే
పదిహేడవ అధ్యాయం.

---

# 18. నైరంజనా పరివర్తం

ఈ విధంగా బోధిసత్త్వుడు ఆరు సంవత్సరాలపాటు దుష్కరచర్య జరిపాడు. ఈ ఆరు సంవత్సరాలూ పాపిష్ఠుడయిన మారుడు బోధిసత్త్వుని వెన్నంటే ఉన్నాడు. లోపాలు కనిపిస్తాయా అని ఎదురు చూస్తూ, అలాటి లోపాలను వెదుకుతూ, వెంటబడినాడు కాని ఒక్కమారైనా ఒక్క అవకాశాన్నయినా పొందలేకపోయాడు. బోధిసత్త్వుని లోబరుచుకొనడానికి అవతారం (లోపం) దొరకనందున నిర్విణ్ణుడై ఇక వెంటబడలేక కోపంతో వెళ్ళిపోయాడు.

ఇక్కడ కొన్ని ప్రాచీనశ్లోకా లున్నాయి. వాటి భావ మిది:

ఉరుబిల్వ ప్రాంతంలో రమణీయమైన అరణ్యాలు, లతానికుంజాలు ఉన్న నైరంజనానదీ తీరంలో గౌతముడు యోగక్షేమ ప్రాప్తికోసం పరాక్రమంతో, వీర్యంతో, దృఢవిక్రమంతో ధ్యానానికి ఉద్యమించినప్పుడు నముచి (మన్మథుడు) తియ్యని మాటలు చెబుతూ అతనివద్దకు వచ్చాడు. "ఓ శాక్యపుత్రా! లే, లే, కాయఖేదం మాను. జీవించినంత వరకే కదా జీవితం శ్రేయస్కరం! జీవించినప్పుడే ధర్మం ఆచరించగలుగుతావు. జీవంతో ఉన్నప్పుడే, ఎప్పుడూ విచారపడవలసిన అవసరంలేని సత్కార్యాలు చేయవచ్చు. నీవు కృశుడ వయ్యావు. దేహం రంగు మారి పాలిపోయింది. దైన్యం ఆవహించింది. మరణం సమీపించింది. వేయి పాళ్ళు మరణం, ఒకపాలు జీవితంలాగ ఉన్నది నీ పరిస్థితి. సతతం దానం చేయడంవల్ల, అగ్నిహోత్రుణ్ణి వేల్చడంవల్ల మహాపుణ్యం లభిస్తుంది. ప్రహాణంవల్ల (దేహపరిత్యాగంవల్ల) కలిగే దేమిటి? ఈ ప్రహాణ మార్గం (ధ్యాన దేహ పరిత్యాగ మార్గం) దుఃఖకరమయినది. చిత్తం నిగ్రహించడం దుష్కరం" అని మారుడు అతనితో అన్నాడు.

అ విధంగా పలుకుతున్న మారునితో బోధిసత్త్వుడు ఇలా అన్నాడు: "ఓ పాపీ, ప్రమత్తులకు బంధువయిన మారుడా, నీ స్వార్థం కోసం నా వద్దకు వచ్చావు. నా పుణ్యాలవల్ల నీకు కావలసిన స్వార్థం అణుమాత్రమయినా లేదు. ఎవరివద్దనయితే నీకు స్వార్థం సమకూరుతుందో వారికి నీ మాటలు చెప్పు. నాకు మరణమంటే లెక్కలేదు. జీవితమనేది మరణాంతమే కదా! కనుక బ్రహ్మచర్యపరాయణుణ్ణయి ప్రహాణం కొనసాగిస్తాను. తిరిగి వెళ్ళను. నదుల ప్రవాహాలను వాయువు ఎండించి వేస్తాడు—మరి, ప్రహితాత్ముల దేహాలను, దేహంలోని రక్తాన్ని ఎండించి వేయడా? రక్తం ఎండిపోతే, మాంసం ఎండిపోతుంది. మాంసం క్షీణించినకొద్దీ చిత్తం ప్రసన్నమవుతుంది. క్రమంగా ఇంద్రియవశమూ, వీర్యమూ, సమాధీ ఏర్పడుతాయి. వాటిలో విహరిస్తున్న నాకు ఉత్తమ చేతన సిద్ధించి మనస్సు దేహాన్ని చూడడమే లేదు. నా సత్త్వపారిశుద్ధ్యం పరికించు. ఇంద్రియ నిగ్రహం ఏర్పడింది. వీర్యం చేకూరింది. ప్రజ్ఞ ఉన్నది. ప్రపంచంలో నన్ను వీర్యంనుంచి కదలించేవాడు మరొకడు లేడు. ప్రాణాలు తీసే మృత్యువయినా మేలే కాని, గ్రామ్యమైన జీవితం వద్దు. పరాజితుడై జీవించడంకన్నా, యుద్ధంలో మరణమే శ్రేయస్కరం. సేనను జయించనిదే శూరుడు కాడు. సేనను జయించే శూరుడవుతున్నాడు. నీ సేననుకూడ మారుడా, త్వరలో జయిస్తాను.

కామాస్తే ప్రథమా సేనా ద్వితీయా అరతి స్తథా,
తృతీయా క్షుత్పిపాసా తే తృష్ణా సేనా చతుర్థికా.
పంచమీ స్త్యాన మిద్ధం తే భయం షష్ఠీ నిరుచ్యతే,
సప్తమీ విచికిత్సా తే క్రోధ మ్రక్షౌ తథాష్టమీ.
లోభశ్లోకా చ సంస్కారా మిథ్యాలబ్ధం చ యద్యశః,
ఆత్మానం యశ్చ ఉత్కర్షేత్ యశ్చపై ధ్వంసయే త్పరాం,
ఏషా హి నముచే స్సేనా కృష్ణబంధోః ప్రతాపినః.

"మారుడా, కామమనేది నీ మొదటి సేన. అరతి అనేది నీ రెండవ సేన. క్షుత్పిపాసలు మూడవ సేన. తృష్ణ నాల్గవ సేన. అలసత



ఐదవ సేన. భీతి ఆరవ సేన. విచికిత్స ఏడవ సేన. క్రోధమ్రక్షాలు ఎనిమిదవ సేన. లోభాభివృద్ధులు, వాసన, మిథ్యాయశస్సు, ఆత్మోత్కర్షం, ఆత్మనాశం కలిగించే ఈ సేనలు ఓ కృష్ణబంధో! నీవి. ఇదిగో కనిపించే ఈ శ్రమణ బ్రాహ్మణులందరూ, నీ సేనల మధ్యను కూరుకొనిపోయి వున్నారు. వీరినీ, దేవసహితమైన లోకాన్నీ భయపెట్టే నీ సేన నన్నేమి చేస్తుంది? నీరు పచ్చికుండను ముక్కలు చేసినట్టు నా ప్రజ్ఞతో నీ సేనను ఛిన్నాభిన్నం చేస్తాను. స్మృతిని చక్కబరచుకొని, ప్రజ్ఞను కూడగట్టుకొని, సంప్రజ్ఞానం ఆచరిస్తాను. ఓ దుర్మతీ! నీ సేనలు నన్నేమి చేస్తాయి?"

ఈ విధంగా బోధిసత్త్వుడు పలుకగా, పాపి అయిన మారుడు పరితాపపడి, మనస్సు చెదరి, కోపంతో అక్కడే అంతర్ధానం చెందాడు.

తర్వాత భిక్షువులారా, బోధిసత్త్వునికి మనసులో ఈ విధంగా ఆలోచన కలిగింది: "అతీతానాగత ప్రత్యుత్పన్న మార్గాలలో ఆత్మజ్ఞానంకోసం తీవ్రదుఃఖం, కటువేదన కలిగించే శరీరోపతాపం పొందుతున్న శ్రమణులుగాని, బ్రాహ్మణులుగాని ఆ వేదనను తెలుసుకొని, పరమదుఃఖం మాత్రమే అనుభవిస్తున్నారు. నేను కూడా ఈ దుష్కరచర్యతో గాని, ఈ మార్గంతో గాని మనుష్య ధర్మానికి అతీతమైన అనుత్తరమైన జ్ఞాన దర్శన విశేషాన్ని సాక్షాత్కరించుకోలేదు. ఇది బోధి మార్గం కాదు. ఇది ఆయతికి మార్గంకాదు. జన్మజరామరణ సంభవమైన దుఃఖాన్ని అస్తమింపజేసే మార్గమూ కాదు. బోధికి ముందు ముందు జన్మజరామరణ దుఃఖసముదాయాన్ని అస్తమింపజేయడానికి మరొక మార్గం ఉండవచ్చు. నేను నా తండ్రి ఉద్యానవనంలో జంబూ వృక్షచ్ఛాయలో ఏకాంతంగా కూచుని, కామనలు వదలి, పాపాలు, అకుశలధర్మాలు మాని, వితర్కంతో విచికిత్సతో వివేకంతో ప్రీతిని కలిగించే ప్రథమధ్యానం మొదలుకొని చతుర్ధ్యానంలో వరకూ విహరించానే. అదే జననమరణ దుఃఖ సముదాయాల అస్తమయానికీ, ఇక ఎన్నడూ పుట్టకపోవడానికీ మార్గం కాబోలు! తదనుగుణంగానే నాకు విజ్ఞానం ఏర్పడింది. అదే బోధికి మార్గం."

అప్పుడు తథాగతునికి ఇంకా ఇలాంటి ఆలోచన కలిగింది: "మార్గమేమో అదే. కాని, ఇంత దుర్బలుడైనవాడిని ఆ మార్గాన్ని అనుసరించలేను. దుర్బలకాయుణ్ణి అయినప్పటికీ అభిజ్ఞా జ్ఞానబలంతో లూహమైన (బలమైన?) బోధిమండం చేరుకుంటే, నా తర్వాత ప్రజ్ఞ జ్ఞానానుకంపిత కాజాలదు. కనుక ఇది బోధికి మార్గం కాదు. కనుక నేను కడుపు నిండే తిండి తిని దేహానికి బలస్థామాలు చేకూర్చుకొని, తర్వాత బోధి మండం ప్రవేశిస్తాను."

అప్పటి పరిస్థితిని తథాగతుడే ఇలా తెలిపాడు: "భిక్షువులారా, అప్పుడు లూహాధిముక్తులైన దేవపుత్రులు నా మనసులోని మాటను మనసులోనే గ్రహించి, నా వద్దకు వచ్చి, నాతో ఇలా అన్నారు: 'ఓ సత్పురుషుడా! ఔదారికమైన (కడుపు నింపుకొనే) ఆహారం గ్రహించవద్దు. మేము నీ రోమకూపాలలో ఓజస్సును పోస్తాము' అని.

అప్పుడు నేను ఏమనుకున్నానంటే – నేను అనశనవ్రతం చేస్తున్నట్టు నాకు తెలుసు. నా సామంతులూ, గోచరగ్రామవాసులూ నేను నిరాహారుణ్ణనే అనుకుంటున్నారు. ఈ గౌతమ శ్రమణుడు అనశనుడుగా ఉన్నాడని ఈ లూహాధిముక్తులైన దేవపుత్రులు నా రోమకూపాలలో ఓజస్సును నింపితే, అప్పుడు నాకు పెద్ద మృషావాదం (అసత్యం చెప్పాడనే ప్రచారం) కలుగుతుంది."

ఈ విధంగా గౌతముడు తలపోసి, ఆ దేవపుత్రులను కాదని, కడుపు నింపుకొనే ఆహారం స్వీకరించడానికే మనసు చేసుకొన్నాడు.

భిక్షువులారా, ఈ విధంగా బోధిసత్త్వుడు ఆరు సంవత్సరాల వ్రత తపస్సునుంచి ఉత్తీర్ణుడై ఆసనంనుంచి లేచి, ఔదారికమైన ఆహారం స్వీకరింపదలచానని ప్రకటించాడు. ఎలాంటి ఆహారమంటే – బెల్లంపాగు, పెసరకట్టు, బటాణి (హరేణు) కట్టు, మధ్వోదనం, గుగ్గిళ్ళూను.

గౌతముని అనుసరిస్తున్న ఐదుగురు భద్రవర్గీయులు గౌతముని చర్యను చూచి "అలాంటి దుష్కరచర్యతో, అలాంటి ప్రతిపత్తితో గౌతమ శ్రమణుడే మనుష్యధర్మానికి అతీతమైన, ఉత్తమమైన జ్ఞాన



దర్శనవిశేషం సాక్షాత్కరించుకోలేకపోయాడు. కడుపు నింపుకొనే ఆహారం ఆరగిస్తూ, సుఖాలు అనుభవిస్తూ విహరిస్తున్నాడు. ఇతడు కేవలం బాలుడులాగ ఉన్నాడు" అనుకుని బోధిసత్త్వుణ్ణి వదలి వెళ్ళిపోయి, వారణాసి వెళ్ళి ఋషిపతనంలోని మృగదావవనం చేరి విహరించసాగినారు.

బోధిసత్త్వుడు దుష్కరచర్య ఆరంభించినప్పటినుంచీ, పదిమంది గ్రామీణకన్యలు ఆయన సన్నిధికి వస్తూ, నమస్కరించి దర్శనం చేసుకుంటూ ఉండేవారు. ఐదుగురు భద్రవర్గీయులూ ఆయనను అనుసరించే ఉండేవారు. ఆ కన్యలు ఆయనకు ఒక్క రేగుపండు, ఒక బియ్యపుగింజ, ఒక నువ్వుగింజ సమర్పించేవారు. ఆ పదుగురు కన్యల పేర్లు – బల, బలగుప్త, సుప్రియ, విజయసేన, అతిముక్తకమల, సుందరి, కుంభకారి, ఉలువిల్లిక, జటిలిక, గ్రామాధ్యక్షుని కుమార్తె సుజాత. ఈ కుమారికలందరూ గౌతముడు కోరిన వ్యూషాలు (పప్పుకట్లు) తీసుకొని వచ్చి సమర్పించారు. గౌతముడు ఆ వ్యూషాలు తాగి, గుగ్గిళ్లు తిని, క్రమంగా తేరుకొని, గోచరగ్రామంలో భిక్షాటన చేస్తూ, నెమ్మది నెమ్మదిగా రంగూ, రూపమూ, బలమూ కలవాడయ్యాడు. అప్పటినుంచీ అతనికి సుందర శ్రమణుడు, మహాశ్రమణుడు అనే వ్యవహారం కలిగింది.

గ్రామిక కన్య అయిన సుజాత దుష్కరచర్య జరుపుతున్న బోధిసత్త్వుని వ్రతం పూర్తి కావడానికీ, అతని శరీరం ఆరోగ్యంగా ఉండడం కోసమూ మొదటినుంచే ప్రతిదినం ఎనిమిది వందలమంది బ్రాహ్మణులకు సంతర్పణ చేసేది. "నా చేతి భోజనం ఆరగించే బోధిసత్త్వుడు అనుత్తర సమ్యక్సంబోధిని పొందుగాక!" అని ప్రణిధానం కూడా చేసేది.

భగవానుడు అప్పటి విషయాలను స్వయంగానే ఇలా అన్నాడు: "భిక్షువులారా, ఆరు సంవత్సరాలు దుష్కరచర్యలో గడపడంవల్ల నా కాషాయవస్త్రాలు చినిగిపోయాయి. కాపీనమన్నా ఆచ్ఛాదనకు దొరికితే బాగుండునని తోచింది.

ఆ సమయంలో గ్రామిక కన్య సుజాత దాసి రాధ అనేది కాలధర్మం చెందింది. ఆ రాధ కళేబరాన్ని జనపనారగుడ్డలతో కప్పి శ్మశా

నంలో విడిచిపెట్టి వచ్చారు. ఆ పాంశుకూలాన్ని (మురికిపట్టను) నేను చూచాను. తర్వాత నేను ఆ పాంశుకూలాన్ని ఎడమకాలితో నొక్కిపట్టి, కుడిచేయి చాచి వంగి పట్టుకొని లాగి తీసుకున్నాను.”

అప్పుడు భూలోకంలోని దేవతలు అంతరిక్షంలోని దేవతలను పెద్దగా కేకలు వేసి పిలిచి “మార్షులారా, ఆశ్చర్యం! ఇదొక అద్భుతం. మహారాజవంశంలో పుట్టి, చక్రవర్తి రాజ్యం పరిత్యజించినవారికి మురికి గుడ్డపై మనసు పోయింది” అన్నారు. అంతరిక్షంలోని దేవతలు భూలోకంలోని దేవతల కేకలు విని, చతుర్మహారాజికులకు ఈ విషయం వినిపించారు. ఆ చతుర్మహారాజికులు త్రాయస్త్రింశదేవతలకు, త్రాయస్త్రింశ దేవతలు యాములనే దేవతలకు, యాములు తుషితలోక దేవతలకు, తుషితులు నిర్మాణ రతిదేవతలకు, నిర్మాణరతులు పరనిర్మిత వశవర్తులకు, పరనిర్మిత వశవర్తులు బ్రహ్మకాయికులకు ఈ విషయం తెలియజేశారు. అప్పుడు భిక్షులారా, ఆ క్షణంలో ఆ లవకాలంలో, ఆ ముహూర్త కాలంలో అకనిష్ఠ భువనంవరకు “మార్షులారా, ఆశ్చర్యం! అద్భుతం! మహారాజకులప్రసూతుడు, చక్రవర్తిరాజ్యపరిత్యాగి అయిన వానికి మురికి అయి దుమ్ము కొట్టిన గోనెపట్టపై మనసు పోయింది చూచారా” అనే ఒకే ఘోషం ఏకసన్నిర్నాదంతో వెలువడింది.

అప్పుడు బోధిసత్త్వానికి “పాంశుకూలం దొరికింది. నీరు దొరికితే బాగుండును” అనిపించింది. అప్పుడు అక్కడున్న దేవతలు చేతితో భూమిని కొట్టారు. అక్కడ పుష్కరిణి ఏర్పడింది. ఇప్పటికీ ఆ పుష్కరిణికి పాణిహతాపుష్కరిణి అనే పేరు.

తర్వాత గౌతమునికి మనసులో “నీరు దొరికింది. ఒక బండ దొరికితే ఈ మురికి గోనెపట్టను ఉతుక్కొనేవాడిని. ఎంత బాగుండును!” అని తోచింది. అప్పుడు ఇంద్రుడు వెంటనే ఒక బండను ఆయన ఎదుట ఉంచాడు. పిదప బోధిసత్త్వుడు ఆ మురికి గోనెను ఉతుక్కున్నాడు.

అప్పుడు దేవరాజయిన ఇంద్రుడు గౌతమునితో ఇలా అన్నాడు: “ఓ సత్పురుషుడా, ఆ గోనెపట్ట నాకు ఇవ్వవయ్యా. నేను ఉతుకుతాను” అని. గౌతముడు ఆ మాటలు విన్నప్పటికీ, ప్రవ్రజ్యలో అన్ని పనులూ స్వయం



గానే చేసుకొనడం మంచిదని తెలుపడంకోసం తన పాంశుకూలం ఇంద్రునికి ఇవ్వక తానే ఉతుక్కున్నాడు. గౌతముడు అలసిపోయినాడు. శరీరం బడలిపోయింది. పుష్కరిణిలో దిగి మెట్లెక్కబోయాడు. అప్పుడు మారుడు - పాపిష్ఠుడైన మారుడు అనూయతో పుష్కరిణి గట్లు ఎత్తుగా చేశాడు. ఆ పుష్కరిణి తీరంలో ఒక పెద్ద కకుభవృక్షం (మద్దిచెట్టు) ఉన్నది. బోధిసత్త్వుడు ఆ వృక్షదేవతను, లోకరీతిగా అనుగ్రహం చూపవలసిందిగా “ఓ దేవతా, ఆ మద్దిచెట్టుకొమ్మను నా దగ్గరికి వంచు” అని ప్రార్థించాడు. ఆ దేవత మద్దిచెట్టు కొమ్మను వంచింది. ఆ కొమ్మను పట్టుకొని బోధిసత్త్వుడు పుష్కరిణిగట్టెక్కి వచ్చాడు. తర్వాత ఆ చెట్టు మొదట్లో కూచుని, ఆ పాంశుకూలాన్ని బొంతగా కుట్టడం ప్రారంభించాడు. ఇప్పటివరకూ ఆ ప్రాంతాన్ని పాంశుకూలసీవన మనే అంటున్నారు.

అప్పుడు విమలప్రభు డనే శుద్ధావాసకాయికుడైన దేవపుత్రుడు తన మాహాత్మ్యంతో శ్రమణులకు అనుగుణమైన కాషాయచీవరాలు బోధిసత్త్వానికి అందజేశాడు. బోధిసత్త్వుడు వాటిని స్వీకరించి పూర్వాహ్ణంలో ధరించి బొంతను కప్పుకొని గోచరగ్రామంవైపు బయలుదేరాడు.

ఇది ఇలా ఉండగా ఉరుబిల్వా సేనాపతి గ్రామంలో గ్రామాధ్యక్షుడైన నందికుని కన్య సుజాతకు అర్ధరాత్రి సమయంలో దేవతలు కనిపించి “ఎవరికోసం నీవు మహాయజ్ఞం ఆచరిస్తున్నావో, ఆ సుగతుడు తాను చేసే వ్రతం పూర్తిచేసి, కడుపునకు కమ్మగా ఉండే ఆహారం తీసుకోబోతున్నాడు. నా చేతి భోజనం స్వీకరించే బోధిసత్త్వుడు అనుత్తర సమ్యక్సంబోధిని పొందాలని నీవు ఇంతకుముందు ప్రతిజ్ఞ చేశావు. ఇప్పుడు నీవు చేయవలసింది చేయి” అని ప్రబోధించాడు.

సుజాత ఆ దేవతల మాటలు విని, వేయి ఆవుల పాలు పితికి, కాచి ఏడుసార్లు మీగడ తీసి, ఆ మీగడలో కొత్తబియ్యం కొత్త పాత్రలో- కొత్త పొయ్యి అలికి, ముట్టించి, పాయసం వండసాగింది. ఆ పరమాన్నం వండుతున్నప్పుడు ఈ పూర్వనిమిత్తాలు కనిపించాయి! ఆ పాలలో శ్రీవత్స స్వస్తిక నంద్యావర్త పద్మ వర్ధమానాది మంగళ ద్రవ్యాలు కని

పించాయి. అప్పుడు సుజాత ఈ విధంగా అనుకొన్నది: "ఈలాటి పూర్వశుభనిమిత్తాలు కనిపిస్తున్నాయి గనుక ఈ పరమాన్నం భుజించి బోధిసత్త్వుడు అనుత్తర సమ్యక్సంబోధిని సంపాదించడం నిస్సంశయం." అప్పుడు అక్కడికి సాముద్రిక శాస్త్రజ్ఞుడు - నిమిత్తజ్ఞుడు వచ్చాడు. అతడు కూడా ఆ నిమిత్తాలకు బోధిసత్త్వుడు అమృతత్వం సాధిస్తాడనే వ్యాఖ్య చేశాడు.

తర్వాత సుజాత పరమాన్నం పక్వం కావడం చూచి, సండిలంపై పూవులు చల్లి, గంధోదకం చిలకరించి, ఆసనం ఏర్పాటుచేసి, ఉత్తర అనే చేటిని పిలిచి "ఉత్తరా! వెళ్ళు. బ్రాహ్మణుని పిలుచుకొని రా. నేను ఈ మధుపాయసం పరిరక్షిస్తూ ఉంటాను" అని ఆదేశించింది. ఆ చేటి "ఆర్యే! అలాగే" అని సమాధానం చెప్పి, పూర్వదిక్కుగా వెళ్ళింది. అక్కడ ఆమెకు బోధిసత్త్వుడు కనిపించాడు. ఆమె అతనిని వదలిపెట్టి దక్షిణంవైపు వెళ్ళింది. అక్కడ కూడా ఆమెకు బోధిసత్త్వుడే కనిపించాడు. ఆమె పడమటి దిక్కుకూ, ఉత్తరదిక్కుకూ వెళ్ళినా ఇలాగే జరిగింది. ఇలా ఎందుకు జరిగిందంటే - అప్పుడు శుద్ధావాసకాయకులైన దేవపుత్రులు ఇతర తీర్థికు లందరినీ కనిపించకుండా చేశారు. ఒక్క తీర్థికుడు కూడా కనిపించలేదు. అప్పుడు చేటి తన యజమానురాలి వద్దకు తిరిగి వచ్చి, "ఆర్యే, ఒక్క శ్రమణుడుగాని, బ్రాహ్మణుడుగాని కనిపించడంలేదు. మీదుమిక్కిలి ఎక్కడికి వెళ్ళినా సుందరుడైన శ్రమణుడే కనిపిస్తున్నాడు" అని విన్నవించింది. అప్పుడు సుజాత "ఉత్తరా! వెంటనే వెళ్ళు. అతడే బ్రాహ్మణుడు. అతడే శ్రమణుడు. అతనికోసమే కదా ఈ పనంతా. అతనినే పిలుచుకొనిరా" అని ఆజ్ఞాపించింది.

"చిత్తం, ఆర్యే!" అని ఉత్తరాచేటి వెళ్ళి, బోధిసత్త్వుని కాళ్ళపై పడి నమస్కరించి, సుజాత పేరున ఆయనను భోజనానికి ఆహ్వానించింది. తర్వాత భిక్షువులారా, బోధిసత్త్వుడు గ్రామాధ్యక్షుని కన్య అయిన సుజాత ఇంటికి వెళ్ళి కూచోమని చెప్పకముందే ఆసనంలో కూర్చున్నాడు.

అప్పుడు సుజాత సువర్ణమయపాత్రనిండా మధుపాయసం నింపి, బోధిసత్త్వునిముందు పెట్టింది.



అప్పుడు బోధిసత్త్వునికి ఇలాటి భావం కలిగింది. "సుజాత ఇలాటి భోజనం వడ్డించింది గనుక, దీనిని భుజించి సమ్యక్సంబోధిని అనుభవించడం నిస్సందేహం" అని.

తర్వాత బోధిసత్త్వుడు ఆ పాయసం స్వీకరించి గ్రామాధ్యక్షుని కుమార్తె సుజాతతో "ఓ చెల్లాయీ! ఈ బంగారుపాత్రను ఏమి చేయమన్నావు?" అని అడిగాడు. "మీరే తీసుకొని పొండి" అని ఆమె సమాధానం చెప్పింది. "నాకు ఇలాటి బంగారుపాత్రలతో ప్రయోజనం ఏముందమ్మా?" అని సుగతుడు ప్రశ్నించాడు. "మీ ఇష్టం వచ్చినట్టు చేయండి. నేను భోజనపాత్ర ఇవ్వక ఎవ్వరికీ భోజనం పెట్టను" అని ఆమె అన్నది.

అనంతరం బోధిసత్త్వుడు ఆ పిండపాత్రను పాయసంతోపాటు తీసుకొని, ఉరుబిల్వాగ్రామంనుంచి బయలుదేరి నాగనదిని దాటి, పూర్వాహ్ణ సమయానికి నైరంజనానది చేరి, పిండపాత్రను (భోజన పాత్రను), చీవరాలను ఏకాంతప్రదేశంలో భద్రపరచి, శరీరం చల్లబరచుకొనడానికి నైరంజనానదిలో దిగాడు.

బోధిసత్త్వుడు స్నానం చేస్తున్నప్పుడు, అనేక సహస్ర దేవపుత్రులు వచ్చి, దివ్యమైన అగరు చందనచూర్ణం నదీజలంలో కలిపారు. దివ్యమైన నానావర్ణ పుష్పాలు నదీజలంలో పడవేసినారు. అవన్నీ బోధిసత్త్వుని పూజాకర్మకోసం.

ఆ సమయంలో నైరంజనానది దివ్యగంధాలతోను, పుష్పాలతోను సమాకుల అయింది. ఆ గంధోదకంలో బోధిసత్త్వుడు స్నానం చేశాడు. ఆ గంధోదకాన్ని కోట్లమంది దేవపుత్రులు చైత్యంకోసం, పూజకోసం తమ తమ భవనాలకు తీసుకొని వెళ్ళారు.

బోధిసత్త్వుని కేశాలను, శ్మశ్రువులను గ్రామాధ్యక్షుని దుహిత అయిన సుజాత చైత్యం నిర్మించడంకోసం, పూజకోసం తీసుకొని భద్రపరచింది.

బోధిసత్త్వుడు స్నానంచేసి నదినుంచి గట్టెక్కి కూర్చోదలచి ఇసుకతిన్నె ఎక్కడన్నా ఉన్నదా అని చూచాడు. అప్పుడు నైరంజనా

నదిలో నివసించే ఒక నాగకన్యక నదీగర్భంలోనుంచి బయటికి వచ్చి, మణిమయమైన సుందరపీఠాన్ని అతడు కూర్చోడంకోసం వేసింది. బోధిసత్త్వుడు ఆ పీఠంపై కూర్చుని ఆ మధుపాయసం ఆరగించాడు. సుజాతను ఆ విధంగా అనుగ్రహించాడు. పాయసం భుజించిన తర్వాత ఆ బంగారు పాత్రను ఎంతమాత్రమూ ఆశపడకుండా నైరంజనానది నీటిలో పార వేశాడు. పాత్రను పడవేయగానే సముద్రంలో ఉండే సాగరుడనే నాగరాజు దానిని పూజార్హమని భావించి గౌరవంతో గ్రహించి స్వభవనాభిముఖుడై వెళ్ళిపోయాడు. తర్వాత దశశతనయనుడైన పురందరుడు వజ్రతుండుడనే గరుడుని రూపం ధరించి, ఆ సువర్ణపాత్రను ఆ నాగరాజువద్దనుంచి లాక్కుపోవడానికి ప్రయత్నించాడు. కాని, సాధ్యం కాలేదు. అప్పుడు స్వస్వరూపం ధరించి, యాచించి చైత్యంకోసమూ, పూజకోసమూ త్రాయస్త్రింశ దేవతల భవనానికి తీసుకొనివెళ్ళాడు. పిదప పాత్రీయాత్ర అనే పండగ ఏర్పాటుచేశాడు. ఇప్పటికీ త్రాయస్త్రింశ దేవతలలో పాత్రీమహము (పాత్రోత్సవం) జరుగుచున్నది. బుద్ధుడు కూర్చుని పాయసం ఆరగించిన భద్రాసనాన్ని ఆ నాగకన్యకే చైత్య నిర్మాణం కోసమూ, పూజకోసమూ తీసుకొని వెళ్ళింది.

భిక్షువులారా, ఆ ఔదారికమైన ఆహారాన్ని ఆరగించిన వెంటనే, బోధిసత్త్వుని పుణ్యబలంతోను, ప్రజ్ఞాబలంతోను ఆయన దేహంలో పూర్వపు మంచిరంగునకు మెరుగు ఏర్పడింది. ముప్ఫయిరెండు మహాపురుష లక్షణాలు, ఎనభై అనువ్యంజన లక్షణాలు, వ్యామప్రభత ఏర్పడ్డాయి. ఇక్కడ ఈ శ్లోకాలు చెబుతున్నారు.

షడ్వర్ష వ్రత ఉత్తరిత్వ భగవాన్ ఏవం మతిం చింతయన్
సోహంజ్ఞాన అభిజ్ఞ ధ్యాన బలవాన్ ఏవం కృశాంగోపి సన్,
గచ్ఛేయం ద్రుమరాజ మూలవిటపం సర్వజ్ఞతాం బుద్ధితుం
నో మేస్యా దనుకంపితాహి జనతా ఏవం భవే త్పశ్చిమా.

యత్త్వౌదారిక భుక్త్వ భోజనవరం కాయే బలం కృత్వనా
గచ్ఛేయం ద్రుమరాజ మూలవిటపం సర్వజ్ఞతాం బుద్ధితుం,



మాహైవేత్పరపుణ్య దేవమనుజా లూహేన జ్ఞానేక్షిణో
నో శక్తాసియ బుద్ధ్యనాయ అమృతం కాయేన తే దుర్బలాః.

సా చ గ్రామిక భీత పూర్వచరితా నామ్నా సుజాతా ఇతి
యజ్ఞా నిత్యు యజాతి ఏవమనసా పీద్యేవ్రతం నాయకే,
సా దేవాన నిశామ్య చోదన తదా గృహ్య మధూ పాయసం
ఉపగమ్యా నది తీరి హృష్టమనసా నైరంజనాయా స్థితా.

సోచాకల్ప సహస్ర చీర్ణ చరితో శాంతప్రశాంతేంద్రియో
దేవై ర్నాగగణైః ఋషీ పరివృతో ఆగత్య నైరంజనాం,
తీర్ణస్తారకు పారసత్త్వ మతిమాన్ స్నానే మతిం చింతయన్
ఓరుహ్య నదిస్నాపి శుద్ధ విమలో లోకానుకంపీ మునిః.

దేవాః కోటిసహస్ర హృష్టమనసా గంధాంబు చూర్ణాని చ
ఓరుహ్య నది లోఢయంతి సలిలం స్నానార్థ సత్త్వోత్తమే,
స్నానా స్నాత్వన బోధిసత్త్వ విమలః తీరే స్థితః సూరతః
హర్షుద్దేవ సహస్ర స్నానసలిలం పూజార్థ సత్త్వోత్తమే.

కాషాయాని చ వస్త్ర నిర్మల శుభా తా దేవపుత్రో దదే
కల్పీయాని చ సన్నినాస్య భగవాన్ తీరే హి నద్యాః స్థితః,
నాగాకన్య ఉదగ్ర హృష్టమనసా భద్రాసనం సా న్యషీత్
యత్రాసౌ నిషసాద శాంతమనసో లోకస్య చక్షుష్కరః.

దత్వా భోజను సా సుజాత మతిమాం స్వర్ణామయే భాజనే
వందిత్వా చరణాని సా ప్రముదితా పరిభుక్ష్వమే సారథే,
భుక్త్వా భోజను యావదర్థ మతిమాన్ పాత్రీం జలే ప్రాక్షిపత్
తాం జగ్రాహ పురందరః సురగురుః పూజాం కరిష్యామ్యహం.

యద్ భుక్తం చ జినేన భోజనవరం ఔదారికం తత్ క్షణే
యస్యా కాయబలం చ తేజ సిరియా పూర్వం యథా సంస్థితం,
ధర్మాకృత్వ కథా సుజాత మరుణాం కృత్వాచ అర్థం బహుం
సింహో హంసగతి ర్గజేంద్రగమనో బోధిద్రుమం సంస్థితః.

దీని తాత్పర్య మిది :

భగవానుడైన బుద్ధుడు ఆరు సంవత్సరాలపాటు వ్రతం ఆచరించిన తర్వాత ఈ విధంగా తలపోసినాడు – "నేను ధ్యానాభిజ్ఞ జ్ఞానం పొందిన వాణ్ణయినప్పటికీ దేహం కృశించిపోయింది. ఈ దేహంతోనే సర్వజ్ఞత్వం సంపాదించుకొనడానికి ద్రుమరాజమూలం ఆశ్రయించినట్టయితే, పశ్చిమ జ్ఞానం నన్ను అనుగ్రహించదు. ఔదారికమైన మంచి భోజనం భుజించి, దేహంలో బలం సంపాదించుకొని, సర్వజ్ఞత్వం సంపాదించడానికి ద్రుమ రాజమూలం ఆశ్రయిస్తాను. లూహాధిముక్తులైన దేవపుత్రుల పుణ్యంతో జ్ఞానం సంపాదించడం వద్దు. దుర్బలులైనవారు దుర్బలకాయంతో అమృతం తెలుసుకొనలేరు."

బుద్ధుని పూర్వవ్రతాచరణం తెలిసి, తమ నాయకుడుగా భావించిన బుద్ధుని వ్రతం సిద్ధించాలనే మనసుతో ప్రతినిత్యమూ పూజలు జరిపే గ్రామాధ్యక్షుని పుత్రి–సుజాత అనేపేరు గలది, దేవతలనుంచి ఆ సంగతి విని మధుపాయసం వండి తీసుకొనివచ్చి, నైరంజానదీ తీరానికి వచ్చింది.

కల్పసహస్రాలనుంచి చీర్ణ చరితుడు, శాంతప్రశాంతేంద్రియుడు అయిన గౌతముడు దేవనాగగణాలు వెంట రాగా నైరంజనా నదికి వచ్చాడు. ఇతరులను తరింపజేసేవాడు, సారసత్వ మతిమంతుడు అయిన అతనికి స్నానం చేయాలనే బుద్ధి కలిగింది. వెంటనే లోకానుకంపనార్థం నదిలో దిగి శుద్ధ విమలస్నానం చేశాడు.

అప్పుడు సహస్రకోటి దేవతలు సంతోషస్వాంతులై గంధ చూర్ణాలను ఆ సర్వోత్తముని స్నానంకోసం నదీజలాలలో కలిపారు. బోధిసత్త్వుడు స్నానంచేసి పరిశుభ్రుడై, అలసట తీరి నదీతీరానికి ఎక్కి రాగానే, దేవత లందరూ సంతోషంతో సర్వోత్తముడు స్నానంచేసిన సలిలం పూజార్థం తీసుకొని వెళ్ళారు.

నిర్మలాలు, శుభకరాలు అయిన కాషాయవస్త్రాలను దేవపుత్రులు గౌతమునికి యిచ్చారు. భగవానుడు వానిని ధరించి తీరంలో నిలబడ్డాడు.



మహాసంతుష్టురాలయిన ఒక నాగకన్యక భగవానునికి ఇసుకగట్టున భద్రాసనం అమర్చింది. లోకానికి నేత్రం వంటివాడు, శాంత మానసుడు అయిన సుగతుడు ఆ ఆసనంపై కూర్చున్నాడు.

అప్పుడు సుజాత ఆ మహామతికి స్వర్ణమయ భాజనంలో పాయసం అర్పించి "నా సారథీ, ఈ పాయసం ఆరగించు" అని ఆయన చరణాలకు నమస్కరించింది. అక్కరలేనిదానికంటె ఎక్కువ కోరని (యావదర్థుడైన) ఆ మతిమంతుడు పాయసం భుజించి, ఆ భోజనపాత్రను నీటిలో విసిరివేశాడు. దానిని పురందరుడు పూజ చేద్దామని తీసుకుని భద్రపరచుకొన్నాడు.

జినుడు ఔదారికమైన మంచి ఆహారం భుజించడంవల్ల అతనికి మునుపటిలాగే దేహబలం తేజశ్శ్రీతో చేకూరింది. సుజాతకు ధర్మోపదేశం చేసి, ఆమె ఋణాన్ని తీర్చుకుని, గజేంద్రగమనుడు, హంసగతి అయిన ఆ పురుష సింహుడు బోధిద్రుమం చేరాడు.

ఇది లలిత విస్తరంలో నైరంజనా పరివర్తమనే
పద్ధెనిమిదవ అధ్యాయం.

# 19. బోధిమండగమన పరివర్తం

భిక్షులారా, ఈ విధంగా బోధిసత్త్వుడు నైరంజనానదిలో స్నానంచేసి, భుజించి. శరీరానికి కొంత బలాన్ని చేకూర్చుకొని విజయవంతమైన గమనంతో షోడశాకార సంపన్నమైన పృథివీ ప్రదేశంలో ఉండే బోధిద్రుమ రాజమూలంవద్దకు బయలుదేరాడు. అతని గమనం సామాన్యమైనది కాదు! అది మహాపురుషుల గతి, అనుచ్చలితమైన గతి, ఇంద్రియేష్టిగతి, సుస్థిరమైన గతి, మేరురాజగతి, అజిహ్మమైన గతి, అకుటిలమైన గతి, అనుపద్రవమైన గతి, అవిలంబితమైన గతి, అలులితమైన గతి, అస్ఖలితమైన గతి, అసంఘటితమైన గతి, అలీనమైన గతి, అచపలమైన గతి, సలీలమైన గతి, విమలమైన గతి, శుభమైన గతి, అదోషమైన గతి, అమోహమైన గతి, అరక్తమైన గతి, సింహ గతి, హంసరాజ గతి, నాగరాజ గతి, నారాయణుని గతి, ధరణీతలాన్ని స్పృశించని గతి, సహస్రారచక్ర ధరణీతల చిత్రగతి, జాలాంగుళులూ ఎర్రని గోళ్ళూగల గతి, ధరణీతలంపైని శబ్దంలేని గతి, శైలరాజ సంఘటనగతి, ఉత్కూల నికూలాలను సమంచేసే చరణగతి, జాలాంతరాలనుండి వ్యాపించే కాంతికిరణాలను ఉత్సర్జించే సత్త్వసంస్పర్శనుగతి గమనగతి, విమలపద్మక్రమనిక్షేపణగతి, పూర్వశుభచరితగమన గతి, పూర్వబుద్ధసింహాభిగమనగతి, వజ్రదృఢాభేద్యాశయగతి, సర్వోపాయ గతి, సర్వాపాయదుర్గతులను పోగొట్టే గతి, సర్వసత్త్వసుఖాలను జనింపజేసే గతి, మోక్షపథసందర్శన గతి, మారుని బలాన్ని అబలంచేసే గతి, కుగణిగణ పరప్రసాద సహధర్మ నిగ్రహణ గతి, ఇంద్రుడు, బ్రహ్మ, మహేశ్వరుడు, లోకపాలురు అనేవారిని తిరస్కరించే గతి, తమఃపటల క్లేశాలను మర్దించే గతి, సంసారపక్షాన్ని అపక్షంగా చేసే గతి, త్రిసాహస్ర మహాసాహస్రైక శూరగతి, స్వయంభువునకు అనభిభూతమైన గతి, సర్వజ్ఞజ్ఞానాభిగమనగతి, స్మృతిమతిగల గతి, సుగతిగమనగతి, జరామరణాలను శమింపజేసే గతి, శుభమూ, అమలమూ, రజోరహితమూ, అభయమూ,



నిర్వాణపుర గమనమూ అయిన గతి. ఇటువంటి గతితో బోధిసత్త్వుడు బోధిమండంవైపు బయలుదేరాడు.

ఓ భిక్షులారా, అప్పుడు నైరంజనానది మొదలుకొని బోధిమండం వరకూ ఉన్న దారి నడుమను అంతా వాతబలాహకులనే దేవపుత్రులు శుభ్రంగా తుడిచారు. వర్ష బలాహకులనే దేవపుత్రులు చందనోదకంతో బాగుగా తడిపి పూవులు చల్లారు. త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులో ఉండే వృక్షాలన్నీ బోధిమండంవైపు తమ అగ్రభాగాన్ని వంచి ఉండినవి. ఆ దినం జన్మించిన బాల బాలికలు అందరూ బోధిమండంవైపే తలలు ఉంచి నిద్రపోయారు. త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులో ఉండే మేరువు మొదలైన పర్వతాలన్నీ కూడా బోధిమండంవైపు వంగి ఉండినవి. నైరంజనానది మొదలుకొని బోధిమండం వరకూ వున్న కోసు మేరలోనూ కామావచరులైన దేవపుత్రులు మార్గానికి రెండు ప్రక్కలా వరుసగా నిలిచి ఉండినారు. ఆ మార్గానికి కుడిప్రక్కనూ, ఎడమప్రక్కనూ రత్నమయాలైన ఏడు వేదికలు నిర్మించబడినవి. వాటికి మీదుగా ఏడు తాటిచెట్ల యెత్తున రత్నజాలాలలో (జాలరులలో) నింపబడిన ఛత్రద్వయమూ, పతాకలూ అలంకరించబడినవి. బాణం వేసేటంత దూరంలో రత్నమయాలైన ఏడు తాళవృక్షాలు నిర్మించబడినవి. ఆ వేదికలనుండి రత్నసూత్రాలు రెండువైపులనూ ఉండే రత్నమయ తాళవృక్షాలకు కట్టబడి ఉన్నవి. ఆ రెండు తాళ వృక్షాలకూ మధ్యను ఒక పుష్కరిణి నిర్మించబడింది. అది గంధోదకంతో నిండి ఉన్నది. దానిలో బంగారు వాసికలు కల్పించబడ్డాయి. ఆ పుష్కరిణిలో నల్లకలువలు, ఎర్రతామరలు, ఎర్రకలువలు, తెల్లతామరలు నిండి ఉండినవి. దాని చుట్టును రత్నవేదికలు నిర్మించబడ్డాయి. వైడూర్య మాణిక్యాలు పొదిగిన రత్నమయ సోపానాలు దానికి అమర్చబడినవి. కొంగలు, హంసలు, చక్రవాకాలు, నెమిళ్లు మొదలైన పక్షులు అక్కడ మనోహరంగా ధ్వనిచేస్తూ ఉన్నవి. ఎనభై వేలమంది అప్సరసలు ఆ మార్గాన్ని గంధోదకంతో తడుపుతూ ఉండినారు. ఎనభైవేలమంది అప్సరసలు ఆ మార్గంపైని దివ్యములైన ముత్యాలనూ, సుగంధ కుసుమాలనూ చల్లుతూ ఉండినారు. తాళవృక్షాలు అన్నింటి ఎదుటనూ రత్న వ్యోమ

కాలు (చాందినీలు) నిర్మించబడినవి. ఆ వ్యోమకాలలో ఎనభైవేలమంది అప్సరసలు చందనపుపొడి, అగురు నింపిన బరిణెలు పట్టుకొని ఆ యా సమయాలకు అనుకూలమైన ధూపపు గుటికలను గ్రహించి కాచుకొని ఉండినారు. రత్న వ్యోమకాలు అన్నిటిలోను ఐదేసి ఐదేసి వేల అప్సరసలు దివ్యమైన సంగీతగోష్ఠిని సలుపుతూ ఉండినారు.

ఓ భిక్షులారా, ఆ సమయంలో క్షేత్రాలన్నీ మిక్కిలి కంపిస్తూ వుండగా, లక్షలకొద్దీ తూర్యాలు మ్రోగుతుండగా, లక్షలకొద్దీ గగనచరులు ఆకాశంపైని తిరుగుతూ పుష్పవర్షం కురిపిస్తూ వుండగా, దుందుభులు మ్రోగించబడుతుండగా, ఏనుగులూ గుఱ్ఱములూ వృషభములూ ధ్వనులు చేస్తూ ప్రదక్షిణం చేయగా, చిలుకలూ, గోరువంకలూ, కోకిలలూ, పిచ్చుకలూ, వెన్నెలపిట్టలూ, హంసలూ, క్రౌంచపక్షులూ, నెమళ్ళూ, చక్రవాకములూ లక్షలకొద్దీ ధ్వనిచేస్తూ వుండగా ఈ విధంగా అసంఖ్యాకంగా వున్న మంగళసూచకములతో బోధిసత్త్వుడు శతసహస్ర కోటి కాంతిపుంజంతో బోధిమండంవైపు బయలుదేరాడు.

ఆ రాత్రే త్రిసాహస్ర మహాసాహస్రాధిపతి వశవర్తి అనే పేరుగల సహాపతి అయిన బ్రహ్మదేవుడు బ్రహ్మపరిషత్తును పిలిచి యిలా అన్నాడు: "ఓ మార్షులారా! మీకు ఈ సంగతి తెలుసునా? ఈ బోధిసత్త్వుడు మహాసన్నాహసన్నద్ధుడు, మహాప్రతిజ్ఞ కలవాడు, దృఢసన్నాహ సన్నద్ధుడు, పరిఖిన్నంకాని మనస్సు కలవాడు, సమస్త బోధిసత్త్వ చర్యలయందును సమర్థుడు, సర్వపారమితలయందును పారంగతుడు, సర్వబోధిసత్త్వప్రదేశములందును వశవర్తి, సమస్తబోధిసత్త్వాశయములందును విశుద్ధుడు, సర్వ సత్త్వేంద్రియములందును అనుగతుడు, సర్వతథాగత గుహ్యస్థానములందును సుప్రవిష్టుడు, సర్వమారకర్మమార్గాలను అతిక్రమించినవాడు, సర్వ కుశల మూలములందున్నూ గొప్ప ప్రత్యయం కలవాడు, సమస్త తథాగతులచేతను అధిష్ఠితుడు, సర్వసత్త్వములకూ మోక్షమార్గమును ఉపదేశించేవాడు, మహాసార్థవాహుడు, సర్వమారమండలమునూ విధ్వంసంచేసేవాడు, త్రిసాహస్ర మహాసాహస్రమైన లోకంలో ఏకైకశూరుడు, సర్వధర్మభైషజ్యసముదానీతుడు, మహా



వైద్యరాజు, విముక్తి పట్టమును కట్టుకొన్నవాడు, మహాధర్మరాజు, మహాప్రజ్ఞాప్రభను వ్యాపింపజేసేవాడు, మహాకేతురాజు, ఎనిమిది లోకధర్మాలు అంటనివాడు, మహాపద్మభూతుడు, సమస్త ధర్మ ధారణులలోను ఏమరనివాడు, మహాసాగరభూతుడు, అనునయ విఘ్నములు లేనివాడు, అచలుడు, కంపించనివాడు, మహాసుమేరువువంటివాడు, సునిర్మలుడు, సుపరిశుద్ధుడు, దర్పంలేని నిర్మలబు కలవాడు, మహామణిరత్నభూషితుడు, సర్వధర్మవశవర్తి, సర్వకర్మణ్యాచిత్తుడు, మహాబ్రహ్మభూతుడు. ఇట్టి బోధిసత్త్వుడు మారసైన్యాన్ని తరిమివేసి, అనుత్తరమైన సమ్యక్సంబోధిని గ్రహించడానికి బోధిమండవద్దకు వస్తున్నాడు. దశబలవైశారద్యం కలిగిన అష్టాదశవేణిక బుద్ధ ధర్మాలను పరిపూర్తి చేయడానికి, మహాధర్మచక్రాన్ని ప్రవర్తింపజేయడానికి, మహాసింహనాదం చేయడానికి, సర్వసత్త్వములనూ ధర్మదానంవల్ల సంతృప్తిపరచడానికి, సర్వసత్త్వాలకును ధర్మచక్షుస్సును ప్రసాదించడానికి, ధర్మంతో సర్వపరప్రవాదులను నిగ్రహించడానికి, పూర్వప్రతిజ్ఞను పరిపూర్తి చేయడానికి, సర్వధర్మైశ్వర్యాలను వశంచేసుకోవడానికిన్నీ వస్తున్నాడు. ఓ మార్షులారా! మీరందరునూ బోధిసత్త్వుని పూజోపస్థానకర్మలో ఉత్సాహవంతులై ఉండాలి."

మహాబ్రహ్మ అయిన వశవర్తి ఆ సమయంలో ఈ గాథలను పలికినాడు:

"యస్యా తేజసు పుణ్యతశ్చ శిరియే బ్రహ్మః పథో జ్ఞాయతే,
మైత్రీవా కరుణా ఉపేక్షముదితా ధ్యానాన్యభిజ్ఞా స్తథా,
సోయం కల్ప సహస్ర చీర్ణ చరితో బోధిద్రుమం ప్రస్థితః
పూజా సాధు కరోథ తస్య మునినో ఆశ్రవతే సాధనాం.

యం గత్వా శరణం న దురతిభయం ప్రాప్నోతి నైవాక్షణం
దేవేష్విష్టసుఖం చ ప్రాప్య విపులం బ్రహ్మాలయం గచ్ఛతి,
షడ్వర్షాణి చరిత్ర దుష్కరచరిం యా త్యేష బోధిద్రుమం
సాధూ సర్వి ఉదగ్రహృష్టమనసః పూజాస్య కుర్వామహే.

రాజాసౌ త్రిసహస్రి ఈశ్వరవరో ధర్మేశ్వరః పార్థివః
శక్రబ్రహ్మపురే చ చంద్రసురియే నాస్త్యస్య కశ్చిత్సమః,
యస్యాజాయత క్షేత్రకోటినయుతా సంకంపితా షడ్విధా
సైషోఽద్య వ్రజతే మహాద్రుమవరం మారస్య జేతుం చమూన్.

మూర్ధ్నం యస్య న శక్య మీక్షితు మిహ బ్రహ్మాలయేపి స్థితైః
కాయో యస్య వరాగ్రలక్షణధరో ద్వాత్రింశతాలంకృతః,
వాగ్యస్యేహ మనోజ్ఞవల్గు మధురా బ్రహ్మస్వరా సుస్వరా
చిత్తం యస్య ప్రశాంతదోషరహితం గచ్ఛామ తత్పూజనే.

యేషాం వా మతి బ్రహ్మశక్రభవనే నిత్యం సుఖం క్షేపితుం
అథవా సర్వ కిలేశబంధన లతాం ఛేత్తుం హితాం జాలినీం,
అశ్రుత్వా పరతః స్పృశేయ మమృతం ప్రత్యేకబోధిం శివాం
బుద్ధత్వం యది వేప్సితం త్రిభువనే పూజే త్వసౌ నాయకం.

త్యక్త్వా యేన ససాగరా వసుమతీ రత్నా న్యనంతాన్యథో
ప్రాసాదాశ్చ గవాక్ష హర్మ్య కలికా యుగ్యాని యానాని చ,
భూమ్యాలంకృత పుష్పదామ రుచిరా ఉద్యాన కూపాసరాః
హస్తాపాద శిరోత్తమాంగ నయనా సో బోధిమండోన్ముఖః.

ఈ గాథల తాత్పర్య మిది :

ఎవడు తేజస్సు, పుణ్యము, సిరులవలన బ్రాహ్మమార్గం, మైత్రీకరుణ ఉపేక్షాముదితలు ధ్యానాభిజ్ఞలు తెలుసుకొన్నాడో, కల్పసహస్రాలనుంచీ ప్రసిద్ధచరిత్రుడైన అలాటివాడు యిప్పుడు బోధిద్రుమందగ్గరకు బయలు దేరాడు. ఈ శాక్యముని ఆశీస్సు పొందడానికి మీ రితనిని పూజించండి.

“ఎవరిని శరణు పొందితే దుర్గతి, భయం ఒక క్షణం కూడా ఉండవో, ఇష్టాలైన సుఖాలను పొంది విపులమైన బ్రహ్మపదాన్ని పొంద వీలగునో ఆ బోధిసత్త్వుడు ఆరు సంవత్సరాలు దుష్కరచర్యను ఆచరించి యిప్పుడు బోధిద్రుమంవద్దకు వెళ్ళుతున్నాడు. మనం అందరమూ సంతోషంతో కూడిన మనస్సులతో ఇతనికి పూజలు చేద్దాము.



“ఇతడు రాజు, త్రిసాహస్రాధిపతి, ఈశ్వరవరుడు, ధర్మేశ్వరుడు. ఇంద్రుడు, బ్రహ్మ, సూర్యచంద్రులును ఇతనికి సమానులు కారు. ఇతడు పుట్టిన సమయంలో షడ్విధమైన భూమి కంపించినది. అట్టి బోధిసత్త్వుడు మారుని సేనను జయించడానికి యిప్పుడు బోధిద్రుమవరంవద్దకు వెళ్ళుతున్నాడు.

బ్రహ్మాలయంలో ఉన్నవారికి కూడా ఈ బోధిసత్త్వుని శిరస్సువైపు చూడడం సాధ్యం కాదు. ఇతని శరీరం ముప్ఫయిరెండు శుభలక్షణాలతో కూడి ఉన్నది. ఇతని వాక్కు మనోజ్ఞమై మధురమై బ్రహ్మస్వరంతో ఉంటుంది. ఇతని మనస్సు దోషరహితమై ప్రశాంతంగా ఉంటుంది. ఇతనిని పూజించడానికై అందరమూ వెళ్ళుదాము.

బ్రహ్మలోకంలోనూ, ఇంద్రలోకంలోనూ సుఖంగా కాలం గడిపే సంకల్పం ఉన్నవారున్నూ, లేక సమస్త క్లేశబంధనలతలనూ ఛేదించే కోరిక గలవారున్నూ, ఇతరులవల్ల తెలిసికొన సాధ్యం కాని అమృతమయమూ శుభకరమూ అయిన ప్రత్యేక బోధిని తెలిసికొనగోరే వారున్నూ, మూడు లోకాలలోనూ బుద్ధత్వాన్ని కోరేవారున్నూ ఈ నాయకుని తప్పక పూజించాలి.

ఈ బోధిసత్త్వుడు సాగరవలయితమైన భూమండలాన్నీ, అనంతాలైన రత్నాలనూ, గవాక్ష హర్మ్యలతో ఉన్న ప్రాసాదాలనూ, అశ్వాదులనూ, యానాలనూ, అనేక పుష్పాలతో మిక్కిలి అందంగా ఉండే ఉద్యాన వనాలనూ, కూపాలనూ, సరస్సులనూ విడిచిపెట్టినాడు. హస్తపాదాలు శిరస్సు నయనం మొదలయిన అంగాలను ఇచ్చినట్టివాడు. ఇతడు బోధిమండమునకు వస్తున్నాడు.”

ఓ భిక్షులారా, త్రిసాహస్ర మహాసాహస్రికుడైన మహాబ్రహ్మ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువునకు వచ్చినాడు. వచ్చి తన చేతులతో గులకరాళ్ళను, ముండ్లను తీసివేసి, దానిపైని అంతటనూ మాణిక్యాలు, ముత్యాలు, వైడూర్యాలు, శంఖశిలలు, పగడాలు, వెండి బంగారాలు నెలకొల్పాడు. నీలములై, మృదువుగా ఉండిన కుండలజాత ప్రదక్షిణ సంద్యావర్త కాచిలిందక సుఖసంస్పర్శలు గల తృణాలతో ఈ

త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువును కప్పివేశాడు. అప్పుడు భూమండలంపైని వుండే సముద్రాలన్నీ ప్రశాంతంగా ఉండినవి. జలచరాలకు ఎటువంటి బాధా కలుగలేదు. ఈ విధంగా లోకధాతువు బాగుగా అలంకరించబడి వుండుట చూచి ఇంద్రుడు, బ్రహ్మ, లోకపాలకులు బోధిసత్త్వుని పూజించడానికి పదిదిక్కులందున్నూ లక్షలకొలది వున్న బుద్ధక్షేత్రాలను బాగుగా అలంకరించారు. దివ్యజాతికీ, మానవజాతికీ చెందిన బోధిసత్త్వులు పది దిక్కులందున్నూ అప్రమేయములైన బుద్ధక్షేత్రములను పూజావ్యూహాలతో అలంకరించారు. బోధిసత్త్వుని పూజకోసమే ఇల అలంకరించారు. నానావ్యూహాలంకారాలతో అలంకరించబడిన ఈ బౌద్ధక్షేత్రాలన్నీ అనేకంగా ఉన్నా, ఒక్క క్షేత్రంగానే ఉన్నట్లు కనబడినవి కాని వేర్వేరుగా కానరాలేదు. లోకాంతరికాలుగాని, కులపర్వతాలుగాని, చక్రవాడ మహాచక్రవాడాలుగాని ఏమీ కానరాలేదు. అవన్నీ బోధిసత్త్వుని తేజస్సువల్ల బుద్ధక్షేత్రాలుగానే కానవచ్చినవి.

బోధిమండమునకు పరిపాలకులుగా పదహారుగురు దేవపుత్రులున్నారు. వారు: ఉత్ఖలి, సూత్ఖలి, ప్రజాపతి, శూరబలుడు, కేయూరబలుడు, సుప్రతిష్ఠితుడు, మహీంధరుడు, అవభాసకరుడు, విమలుడు, ధర్మేశ్వరుడు, ధర్మకేతువు, సిద్ధపాత్రుడు, అప్రతిహతనేత్రుడు, మహావ్యూహుడు, శీల విశుద్ధనేత్రుడు, పద్మప్రభుడు - అనేవారు. బోధిమండ ప్రతిపాలకులైన యీ పదహారుగురు దేవపుత్రులూ వైమత్యంలేక శాంతులై బోధిసత్త్వుని పూజించడానికి అక్కడ ఉన్నారు. ఆ బోధిమండానికి చుట్టుప్రక్కల ఎనభై యోజనాల మేర ఏడు రత్న వేదికలు ఉన్నవి. వాటి చుట్టూ ఏడు తాటిచెట్ల వరుసలు ఉన్నవి. రత్నకింకిణీ జాలాలతో ఛన్న ఏడు రత్నసూత్రాలు వాటికి కట్టబడినవి. రత్నాలు పొదిగిన ఏడు బంగారు వస్త్రాలు సువర్ణసూత్రాలతో కట్టబడి ఉన్నవి. ఆ ప్రదేశం అంతటా సువర్ణపద్మాలూ, రత్నజాలాలూ చల్లబడినవి. ఎంతో పరిమళిస్తున్న ధూపం వేయబడినది. పది దిక్కులందూ వివిధలోకధాతువులలో వుండే వృక్షాలన్నీ - అభిజాతాలూ అభిపూజితాలూ అయిన దివ్యవృక్షాలూ, మానుషవృక్షాలూ ఆ బోధిమండంలో కానవస్తూ ఉన్నవి. పది దిక్కులలోనూ వుండే నానావిధాలైన పుష్పజాతులు - నీటిలో ఉండేవీ,



నేలపైని మొలిచేవీ కూడా సమస్తమూ - ఆ బోధిమండంలో కానవస్తూ ఉన్నవి. పది దిక్కులలోనూ బోధిమండాన్ని అలంకరిస్తూ, హద్దులేని పుణ్యజ్ఞాన సంభార వ్యూహాలు కల బోధిసత్త్వులు నానా లోకధాతువులలోనూ ఉండేవారు అందరూ ఆ బోధిమండంలో కానవస్తూ ఉన్నారు.

ఓ భిక్షులారా, బోధిమండ పరిపాలకులైన దేవపుత్రులు గొప్ప వ్యూహాలను బోధిమండం చుట్టూ నిర్మించారు. వాటిని చూచి దేవ, నాగ, యక్ష, గంధర్వ, అసురులందరూ తమ తమ భవనాలు శ్మశానాలవంటివని అనుకున్నారు. ఆ వ్యూహాలను చూచి వారు అత్యాశ్చర్యంతో చిత్రప్రతిమలుగా అయినారు. వారు తమ మనస్సులలో "అహో! మన పుణ్యవిపాక నిష్యందం అచింత్యమైనది కదా!" అని అనుకున్నారు.

ఆ బోధివృక్షానికి నలుగురు దేవతలున్నారు - వారు వేణువు, వల్గువు, సుమనుడు, ఓజాపతి అనేవారు. ఈ నలుగురు బోధివృక్షదేవతలున్నూ బోధిసత్త్వుని పూజించడానికి ఆ బోధివృక్షాన్ని భద్రంగా చూస్తున్నారు. అది మూలసంపన్నంగానూ, స్కంధసంపన్నంగానూ, శాఖాపత్ర పుష్ప ఫల సంపన్నంగానూ, ఆరోహ పరిణాహ సంపన్నంగానూ, ప్రాసాదికంగానూ, దర్శనీయంగానూ వుండేటట్లు చేశారు. అది విస్తీర్ణంగానూ, ఎనభై తాటిచెట్ల ఎత్తు కలదిగానూ, దానికి తగిన సన్నాహంతో చిత్రంగానూ దర్శనీయంగానూ మనోరమంగానూ ఉండేటట్లున్నూ, ఏడు రత్న వేదికలతో పరివృతమై ఏడు రత్న తాళపంక్తులతో ఏడు రత్నకింకిణీ జాలాలతోనూ ఏడు రత్న సూత్రాలతోనూ అంతటనూ పరివృతమై వుండేటట్లున్నూ, పారిజాతక కోవిదార ప్రకాశం కలిగి ఉండేటట్లున్నూ, ఎంత చూచినా తనివితీరక ఉండేటట్లున్నూ చేశారు. అది వుండే భూప్రదేశం త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతు వజ్రంతో మిక్కిలి దృఢమైనదై, సారభూతమై, అభేద్య వజ్రమయమై ఉండినది. అక్కడనే, బోధిని తెలిసికొనే కోరికతో బోధిసత్త్వుడు కూర్చున్నాడు.

ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు బోధిమండం వద్దకు వచ్చేటప్పుడు, అతని శరీరంనుంచి ఒక దివ్యమైన కాంతి వెలువడినది. ఆ కాంతితో

సమస్తాలైన అపాయాలు శాంతించినవి. సమస్తాలైన అశుభాలు మాయమైనవి. సమస్త దుర్గతి వేదనలు కానరాకుండా పోయినవి. ఇంద్రియ లోపం గల సత్త్వాలన్నీ పరిపూర్ణేంద్రియాలు కలవిగా అయినవి. వ్యాధిగలవారి వ్యాధులు పోయినవి. భయంవల్ల బాధపడేవారికి భయం పోయి నెమ్మది కలిగినది. బంధనంలో వుండి బాధపడేవారు ఆ బంధనంనుండి విడుదల పొందారు. దరిద్రులు భోగాలను అనుభవించారు, క్లేశంవల్ల బాధపడేవారికి ఆ బాధలు తొలగిపోయాయి. ఆకలిగొన్న ప్రాణుల పొట్టలు బాగుగా నిండినవి. దప్పిగొన్నవారి దప్పి పూర్తిగా తీరినది. గర్భభారంతో అలసలైన వనితలు సుఖంగా ప్రసవించారు. జీర్ణులు, దుర్బలులు అయినవారు బలసంపన్నులైనారు. ఆ సమయంలో ఏ ప్రాణికిన్నీ రాగంగాని, ద్వేషంగాని, మోహంగాని, క్రోధంగాని, లోభంగాని, ఖిలంగాని, వ్యాపాదంగాని, ఈర్ష్యగాని, మాత్సర్యంగాని కలుగలేదు. ఆ సమయంలో ఏ ప్రాణీ మరణించలేదు. జారడంగాని, పడిపోవడంగాని లేదు. ఆ సమయంలో అన్ని ప్రాణులూ పరస్పరం మైత్రితోనూ, హితబుద్ధితోనూ ఉండి మాతాపితరులవలెనే ఉండినారు.

ఇక్కడ కొన్ని శ్లోకాలు యిలా ఉన్నాయి. వాటి భావమిది:

'అవీచి పర్యంతంగా ఉండే ఘోరములైన నరకలోకాలలో వుండే ప్రాణుల దుఃఖం అప్పుడు శాంతించి, వేదనలు పోయి సుఖం లభించినది. జంతు పక్షి కీటకాదులలో పరస్పర విరోధంగల ప్రాణుల పైని ఈ శాక్యమహాముని తేజస్సు వ్యాపించడంవల్ల అవి విరోధం మాని హితబుద్ధితో మైత్రీభావాన్ని పొందినవి. ప్రేతలోకంలో ఆకలి దప్పికలతో బాధపడుతూ ఉన్న ప్రేతాలన్నీ, బోధిసత్త్వుని తేజస్సు కారణంగా అన్నపానాలను పొందుతూ ఉండినవి. సమస్తములైన అశుభములూ నశించాయి. దుర్గతి ఇగిరిపోయింది. దివ్య సౌఖ్యాన్ని పొంది ప్రాణులన్నీ సుఖించాయి. కన్నులు లేనివారూ, చెవులు లేనివారూ- ఈ రీతిగా ఉన్న అంగవిహీనులందరికిన్నీ సమస్తములైన అంగములూ పూర్తిగా వచ్చినవి. వారు సర్వాంగశోభితు లయినారు. అంతవరకూ ఎల్లప్పుడూ రాగద్వేషాదులైన కేశాలలో శ్రమపడుతూ ఉండిన సత్త్వము



లన్నిటి క్లేశాలూ అప్పుడు నశించాయి. అన్ని ప్రాణులూ సుఖించాయి. ఉన్మత్తులు మామూలు స్మృతి స్థితికి వచ్చారు. దరిద్రులందరూ ధనికులైనారు. వ్యాధితులు రోగ నిర్ముక్తులైనారు. చెరలలో బంధంచబడిన వారికి విడుదల కలిగినది. ఖిలం కావడంగాని, మాత్సర్యంగాని, వ్యాపాదంగాని, విరోధంగాని ఎక్కడా లేదు. అందరూ అప్పుడు పరస్పరం మైత్రీభావంతోనే ఉండిరి. ఏకైక పుత్రుని యెడల తల్లితండ్రులకు ఎట్టి ప్రేమ ఉంటుందో, ఆ విధంగానే సత్త్వములన్నింటికిన్నీ పరస్పరం పుత్రప్రేమ ఏర్పడింది. బోధిసత్త్వుని కాంతిసమూహకారణంగా అచింత్యంగా క్షేత్రాలు గంగానదిలోని ఇసుక రేణువులవలె దశ దిక్కులందున్నూ అసంఖ్యాకంగా అంతటా వెలసినవి. చక్రవాడము మొదలైన కుల పర్వతా లేవీ కానరాలేదు. అవన్నీ ఒక గొప్ప క్షేత్రంగానే అప్పుడు కానవచ్చినవి. సమస్త రత్నములూ అరచేతిలో ఉన్నట్లుగానే మిక్కిలి ప్రకాశించినవి. బోధిసత్త్వుని పూజకొరకై వాటితో క్షేత్రాలన్నీ అలంకరించబడి ఉన్నవి.

బోధిమండాన్ని ఉపచరిస్తూ ఉన్న పదహారుగురు దేవతలు దాని చుట్టుప్రక్కల ఎవభై యోజనాల మేర బాగా అలంకరించారు. కోట్లకొలది ఉన్న క్షేత్రాలలో అనంతంగా ఉన్న వ్యూహాలన్నీ బోధిసత్త్వుని తేజఃప్రభావంవల్ల ఆ బోధిమండందగ్గరనే కానవస్తూ ఉన్నవి. దేవతలూ, నాగులూ, యక్షులూ, కిన్నరులూ, మహోరగులూ - అందరూ దీనిని చూచి తమ తమ విమానాలు శ్మశానప్రాయాలని భావించారు. ఆ వ్యూహాలను చూచి దేవతలూ, మనుష్యులూ చాలా ఆశ్చర్యపడినారు. "ఇట్టి మహా సంపద గొప్ప పుష్యనిష్యందం! దీనికోసమై మనోవాక్కాయాలతో కొంచెమైనా ప్రయత్నం జరగనేలేదు. అభిప్రేతములైన మనోరథాలూ, సమస్తములైన వస్తువులూ వానియంతట అవే సిద్ధిస్తూ ఉన్నవి" అని వారిలో కొందరు భావించారు. "ఈ సంపద అంతా పూర్వజన్మంలోని కర్మల విపాకం" అని కొందరు అనుకొన్నారు. నలుగురు బోధి దేవతలు బోధిమండాన్ని చక్కగా అలంకరించారు. స్వర్గలోకంలోని పారిజాత వృక్షంకంటే కూడా ఇది మిక్కిలి శోభిస్తూ ఉండినది. దేవతలు

చక్కగా సంస్కరించిన బోధిమండ వ్యూహాల గుణాలను సమగ్రంగా వర్ణించడం సాధ్యం కాదు.

ఓ భిక్షులారా, బోధిసత్త్వుని శరీరంనుంచి బయలు వెడలిన తేజస్సు విశుద్ధమై, విమలమై, శరీరానికీ, చిత్తానికీ ఎక్కువ సంతోషాన్నీ ఔజ్జ్వల్యాన్నీ కలిగిస్తూ, సమస్త ప్రాణుల క్లేశాలనూ పోగొట్టజాలినదై వాటికి సుఖాన్నీ, ప్రీతినీ, ప్రసాదాన్నీ, ప్రామోద్యాన్నీ కలిగిస్తూ ఉండినది. ఆ తేజస్సుతో కాలికుడనే నాగరాజుభవనం వెలిగిపోతూ ఉండినది. అప్పుడు ఆ నాగరాజు ఆ గొప్ప తేజస్సును చూచి తన పరివారం ఎదుట నిలబడి కొన్ని గాథలను పలికాడు. వాని భావ మిది:

“క్రకుచ్ఛంద బుద్ధదేవుని కాంతివంటి కాంతి, కనకుడనే బుద్ధదేవుని కాంతివంటి రుచిరకాంతి, కాశ్యపుని కాంతివంటి బంగారు కాంతి, అనఘుడయిన ధర్మరాజు కాంతివంటి నిర్మలకాంతి కానవస్తున్నది. సందేహం లేదు. యోగ్యలక్షణములు కలవాడూ, లోకానికి హితం కూర్చేవాడూ, జ్ఞానప్రభుడూ అయిన లోకోత్తర వ్యక్తి జన్మించాడు. అతని దివ్యతేజస్సే యిది! అతడు తన తేజస్సుతో స్వర్ణప్రభాలంకృతంగా నా భవనాన్ని ప్రకాశింపజేస్తూ ఉన్నాడు. ఈ నా భవనంలో చంద్రకాంతిగాని, సూర్యరశ్మిగాని ప్రసరించదు. అగ్ని తేజస్సుగాని, మణుల కాంతిగాని, మెరుపుల కాంతిగాని, నక్షత్రాల కాంతి గాని దీనిలో ప్రవేశింపలేదు. ఇంద్రుని తేజస్సు గాని, బ్రహ్మతేజస్సుగాని, ఆసురీప్రభగానీ చొరసాధ్యం కాదు. నా గృహం పూర్వకృతాలైన దుష్కృతకర్మలచేత ఏకాంతంగానూ, తమోవ్యాప్తంగానూ ఉన్నది. అట్టి నా భవనంమధ్య యిప్పుడు సూర్యుని వెలుగువంటి వెలుగు ప్రవేశించినది. నా మనస్సుకు ఎంతో ప్రీతి కలిగింది. శరీరానికి సుఖం ఏర్పడింది. అవయవాలకు ఆశ్చర్యకరంగా చల్లదనం కలిగినది. బాగుగా కాలిన యిసుకతిన్నెవలె ఉండిన దేహం బాగా చల్లబడినది. బహుకల్పకోటి సంవత్సరాలు సత్కర్మచర్య ఒనర్చిన బోధిసత్త్వుడు బోధిద్రుమానికి వెళ్ళుతూ ఉండవచ్చును. అందువల్లనే ఇట్టి అనుభవం కలిగి వుంటుంది.



“ఓ నాగులారా! మీరు శీఘ్రంగా పుష్పాలనూ, రుచిరములైన వస్త్రాలనూ, శుభములైన సుగంధ ద్రవ్యాలనూ, ముత్యాలహారాలనూ, వలయాభరణాలనూ, ధూపానికి ఉపయోగించే చూర్ణాలనూ తీసుకొని రండి. భేరీ మృదంగాదులను వాయిస్తూ సంగీతగోష్ఠిని జరపండి. సర్వజగత్తులోనూ పూజార్హుడూ, హితకరుడూ అయిన బోధిసత్త్వుని పూజించడానికి రండి!”

ఇట్లు పల్కి ఆ నాగరాజు నాగకన్యలతో పాటు లేచి నాల్గు దిక్కులవైపూ చూచాడు. అతనికి గొప్ప తేజస్సుతో అలంకరించబడి, మేరుపర్వతంవలెనే ఉన్న బోధిసత్త్వుడు కనిపించాడు. కోట్లకొలదీ దేవతలూ, దానవులూ అతని చుట్టును చేరి వున్నారు. బ్రహ్మేంద్రాదులూ, యక్షులూ అతనిని పూజిస్తూ ఉన్నారు. హర్షంతోడి మనస్సు గలవారందరూ అతనికి మార్గాన్ని చూపిస్తున్నారు. నాగరాజు చాలా సంతోషించి లోకోత్తముడైన బోధిసత్త్వునికి పూజచేసి, అతని పాదాలకు నమస్కరించి, మిక్కిలి గౌరవించి, అతని యెదుట నిలిచాడు. మిక్కిలి సంతోషించిన మనస్సులు కల నాగకన్యలున్నూ ఆ శాక్యమునిని పూజించి, పుష్పాలనూ, గంధవిలేపనాలనూ అతనిపై చల్లి, తూర్యధ్వనులు చేశారు.

సంతృప్తి చెందిన నాగరాజు అంజలి ఘటించి బోధిసత్త్వుని లోకోత్తర గుణాలను ఈ విధంగా పేర్కొని స్తుతించాడు: “లోకోత్తముడవగు నాయకుడా! పూర్ణచంద్రవదనుడవైన నీవు దర్శనమిచ్చావు. మునుపు మహామునులలో ఎట్టి లక్షణాలుండినవో, అవన్నీ నీయందు కానవస్తున్నవి. బలవంతుడవైన నీవు మారుణ్ణి జయించి ఇష్టమైన పదం పొందగలవు. ఏ సంకల్పంతో నీవు దమదాన సంయమాలతో త్యాగివైనావో, దేనికై దమశీలుడవై మైత్రీకరుణలనూ క్షాంతి బలాలనూ పొందినావో, దేనికోసమై దమ వీర్య ధ్యానములందు ఆసక్తుడవై ప్రజ్ఞాప్రదీపుడ వయితివో, ఆ నీ సంకల్పం సఫల మవుతుంది. నీ ప్రతిజ్ఞలన్నీ పూర్తయినాయి. ఇప్పుడు నీవు జినుడవు కాగలవు. పత్రాలతోనూ, పుష్పాలతోనూ, ఫలాలతోనూ కూడిన వృక్షాలన్నీ బోధివృక్షంవైపు వంగి ఉన్నవి. వేలకొద్దీ పూర్ణకుంభాలు ధరించి అప్సరసలు బోధివృక్షానికి

ప్రదక్షిణం చేస్తూ సంతోషంతో మనోహరంగా గానం చేస్తూ ఉన్నారు. ఆకాశంపైని హంసలూ, క్రౌంచపక్షులూ వలయాకారంగా తిరుగుతూ ఉన్నట్లే మునుముందు అర్హతుడు కాబోయే బోధిసత్త్వుడవైన నీకు ప్రదక్షిణం చేస్తూ ఉన్నారు.

బంగారు వర్ణం గల తేజస్సు నీనుంచి వ్యాపిస్తున్నది. సమస్తమైన అపాయములూ శాంతించినవి. ప్రజలందరూ దుఃఖాలు లేకుండా ఉన్నారు. మా భవనాలు సూర్య, చంద్రునివలె వెలుగుతున్నవి. వాయువు మృదువుగా వీచుతూ ఉన్నది. ఇప్పుడు నీవు సార్థవాహుడవు కాగలవు. మూడు లోకాలలోని జనులకు జన్మను, ముసలితనాన్నీ మరణాన్నీ పోగొట్టగలవు. దేవతలందరూ తమ కామరతులను విడిచిపెట్టి నీ పూజకొరకు వచ్చారు. బ్రహ్మ, బ్రహ్మపురోహితులు, అసురులు తమ తమ సుఖాలను, ధ్యానాలను విడిచిపెట్టి వచ్చారు. మూడు లోకాలలోనూ నగరాలలోనూ ఉండేవారంతా వచ్చారు. వైద్యరాజువైన నీవు మూడు లోకాలలోను ప్రాణులకు జన్మ జరలనుండి విముక్తి కలిగిస్తావు. ఏ మార్గంగా నీవు వెళ్ళతావో ఆ మార్గాన్ని దేవతలందరూ పరిశుభ్రం చేశారు. భగవానుడైన క్రకుఛందుడూ, కనకాహ్వాయుడూ, కాశ్యపుడూ ఈ మార్గంగానే వచ్చారు. విశుద్ధమూ, నిర్మలమూ అయిన పద్మం భూమిని బ్రద్దలు చేసుకొని వచ్చినది. దానిపైని అతి బలమైన పాదాన్ని నిక్షేపించి నీవు అర్హతుడవు కాగలవు.

నీవు బోధివృక్షం దగ్గర కూర్చున్నప్పుడు నిన్ను చలింపజేయుటకు గాని, కంపింపజేయడానికి గాని, కోట్లకొద్దీ గంగాప్రవాహాలుగాని, వాటి అలలుగాని సమర్థములు కావు. గంగాతరంగాలవలె సహస్ర సంఖ్యలో లోకహితంకొరకై యజ్ఞాలూ చేయబడినవి. వాని కారణంగా మహామహుడవైన నీవు ఇక్కడ ప్రకాశిస్తున్నావు. నక్షత్రాలు, చంద్రుడు, సూర్యుడు, చుక్కలు ఆకాశంనుండి భూమిపైని పడిపోయినా సరే, మహాపర్వతాలు స్వస్థానంనుంచి చలించిపోయినా సరే, సముద్రములు ఇంకిపోయినా సరే. ఒకానొక విజ్ఞుడైన మహాపురుషుడు నాలుగు ధాతువులను ఒక్కొక్కటిగా ప్రదర్శించినా సరే, బోధిద్రుమమూలాన్ని ఆశ్రయించిన



నీవు సమ్యక్ సంబోధిని తెలిసికొనేవరకు లేవనే లేవవు. ఓ సారథీ! నీవు నాకు కనబడినందున ఎంతో లాభం కలిగింది. విపులంగా వృద్ధి కలిగింది. మేము నీ పూజను ఆచరించాము. గుణాలు స్తుతించాము. సమ్యక్సంబోధి కోసమై ఉత్సాహం కలిగించబడినది. నాగకన్యకలందరూ, నేనూ పునర్జన్మనుంచి విడుదల పొందగలము. మత్తవారణ గమనంతో నీవు నడచిన విధంగా మేమున్నూ వెళ్ళుతాము.”

ఓ భిక్షులారా ఆ సమయంలో నాగరాజైన కాలికుని అగ్రమహిషి సువర్ణప్రభాస అనేకమంది నాగకన్యకలతో వచ్చినది. ఆ నాగకన్యకలు నానారత్న ఛత్రాలనూ, ముత్యాలహారాలనూ, మణిరత్నాలనూ, దివ్యాలూ మానుషాలూ అయిన మాల్య, విలేపనాలనూ, గంధపు గుటికలనూ పట్టుకొని నానాతూర్య సంగీతధ్వనులతో, బోధిమండానికి వస్తున్న బోధిసత్త్వునిపై పుష్పవర్షాలను కురిపించారు. ఈ గాథలతో అతనిని స్తుతించారు.

“అభ్రాంతా అత్రస్తా అభీరూ అచంభీ
అలీనా అదీనా ప్రహృష్టా దుధర్షా,
అరక్తా అదుష్టా అమూఢా అలుబ్ధా
విరక్తా విముక్తా నమస్తే మహర్షే.

భిషక్తా విశస్త్యా వినేయా విశేషీ
సువైద్యా జగస్యా దుఃఖేభ్యః ప్రమోచీ,
అలేనా అత్రాణా అహీనా విదిత్వా
భవాలేను త్రాణో త్రిలోకే స్మి జాతః.

ప్రసన్నా ప్రహృష్టా యథాదేవసంఘాః
ప్రవర్షి నభస్థా మహత్పుష్పవర్షం,
మహాచైల క్షేపం కరోంతీ యథేమే
జినో భేష్యసే ఽద్యా కురుష్వ ప్రహర్షం.

ఉపేహి ద్రుమేంద్రం నిషీదా అఛంభీ
జినా మారసేనాం ధున క్లేశజాలం,

విబుధ్య ప్రశాంతాం వరా మగ్ర బోధిం
యథాపూర్వకైస్తైర్విబుద్ధా జినేంద్రైః.
త్వయా యస్య అర్థే బహూః కల్పకోట్యః
కృతా దుష్కరాణీ జగన్మోచనార్ధం,
ప్రపూర్ణాతి ఆసా అయం ప్రాప్త కాలో
ఉపేహి ద్రుమేంద్రం స్పృశస్వాగ్రబోధిం.''

''ఓ మహర్షి! నీవు భ్రాంతిలేనివాడవు, భయంలేనివాడవు. అభీరువవు. దంభంలేనివాడవు. అలీనుడవు. అదీనుడవు. దుర్ధర్షుడవు. ప్రహృష్టుడవు. రక్తి, దౌష్ట్యమూ, మౌఢ్యమూ, లోభమూ లేనివాడవు. విరక్తుడవు. విముక్తుడవు. అట్టి నీకిదే నమస్కారం! ఓ వినేయుడా! సువైద్యుడా! విశల్యా! వినేషి! దుఃఖాలనుండి జగత్తునకు విడుదల కలిగించేవాడా! ఈ లోకం రక్షణ లేకుండా బాధపడడం తెలిసికొని, దాన్ని రక్షించడానికి అవతరించావు త్రిలోకాలకూ రక్షకుడవయావు. ప్రసన్నులూ, ప్రహృష్టులూ అయిన దేవసంఘాలు ఆకాశంపైని ఉన్నవారై పెద్ద పూలవానను కురిపిస్తూ, సంతోష సూచకంగా గుడ్డలను కదలిస్తున్నారు. ఇప్పుడు నీవు జినుడవు కాగలవు. మాకు సంతోషం కలిగించు.

నీవు ఈ వృక్షరాజంవద్దకు వచ్చి కూర్చో. మార సేనను జయించి, క్లేశ జాతాన్ని నశింపజేయి. ప్రశాంతమూ, లోకోత్తరమూ అయిన బోధిని, నీ పూర్వీకులైన జినేంద్రులవలెనే తెలుసుకో. జనుల దుఃఖాన్ని పోగొట్టడానికి నీవు బహుకల్పకోటి సంవత్సరాలు దుష్కర చర్యలు చేసి ఉన్నావు. నీ సంకల్పం పరిపూర్ణం అవుతున్నది. ఇదే తగిన సమయం. ఈ వృక్షరాజంవద్దకు దయచేయి. ఉత్తమమైన బోధిని పొందు.''

ఓ భిక్షులారా, ఆ తర్వాత బోధిసత్త్వునికి పూర్వీకులైన తథాగతులు ఎక్కడ కూర్చుండి అనుత్తరమైన సమ్యక్సంబోధిని తెలుసుకున్నారు అనే ఆలోచన కలిగింది. తృణసంస్తరంపైనే కూర్చుండి ఉంటారనే నిశ్చయమూ కలిగినది.

అప్పుడు అంతరిక్షంపైని లక్షల సంఖ్యలో ఉన్న శుద్ధావాసకాయికులైన దేవపుత్రులు బోధిసత్త్వుని మనస్సంకల్పం తెలుసుకుని, తమ



అభిప్రాయమున్నూ ఆ రీతిగానే ఉండడంవల్ల ఇట్లు పలికారు. ''ఓ సత్పురుషా! నీవు తలచినదే సరి. నీవు అనుకున్నదే సరియైనది. పూర్వీకులైన తథాగతులు తృణ సంస్తరంపైనే కూర్చుండి అనుత్తరమైన సమ్యక్సంబోధిని తెలుసుకున్నారు'' అని.

ఓ భిక్షులారా, తన మార్గానికి దక్షిణ పార్శ్వంలో యావసికుడైన (గడ్డికోసే) స్వస్తికుడు గడ్డిని కోస్తూ ఉండడం బోధిసత్త్వుడు చూచినాడు. అతడు కోస్తూ ఉన్న తృణములు నీలములై, మృదుకములై, సుకుమారములై, రమణీయములై, కుండలజాతములై, ప్రదక్షిణావర్తములై, నెమలి కంఠంతో సమాన వర్ణములై, కాచిలిందిక సుఖ సంస్పర్శ కలవై, మనోరమములై పరిమళిస్తూ ఉండినవి. వాటిని చూచి బోధిసత్త్వుడు మార్గంనుంచి ప్రక్కకు పోయి యావసికుడైన స్వస్తికుడు ఉన్న చోటికి వెళ్ళినాడు. వెళ్ళి యావసికుడైన స్వస్తికునితో మధురంగా సంభాషించినాడు. అతడు పలికిన మాట ఆజ్ఞాపనగానూ, విజ్ఞాపనగానూ, విస్పష్టమైనదిగానూ, అనేక లోకాలకూ ఒక్కమాదిరి సుఖకరంగానూ, బాగుగానూ, శ్రవణీయంగానూ, స్నిగ్ధంగానూ, స్మరణీయంగానూ, ప్రేరణీయమైనదిగానూ, తోషణీయంగానూ, ప్రేమణీయంగానూ, అకర్కశంగానూ, అగద్గదంగానూ, అపరుషంగానూ, అచపలంగానూ. ప్రియంగానూ, మధురంగానూ, కర్ణసుఖంగానూ, కాయచిత్తోల్బణకరంగానూ, రాగదోష మోహకలికలుషాలను పోగొట్టేదిగనూ, కలవింక పక్షిధ్వని కలదిగనూ, కుణాలపక్షిధ్వని, వెన్నెల పిట్ట ధ్వని కలదిగాను, దుందుభిని వాయిస్తే కలిగే ధ్వని కలదిగాను, సముద్రపు హోరు ధ్వనితో సమాన ధ్వని కలదిగాను, శైలసంఘట్టనవల్ల ఏర్పడిన ధ్వనివంటి ధ్వని కలదిగాను, అనపహతము సత్యము అచ్ఛమూ అయినదిగను; బ్రహ్మస్వరము వంటి ధ్వని కలదిగను, దేవేంద్రాసురేంద్రులచే స్తుతింపబడునదిగను, గంభీరముగను, దురవగాహముగను నముచి (మారుని) బలాన్ని అబలంగా చేసేదిగాను, పరప్రవాదమును మర్దించేదిగానూ, సింహగర్జనవలెను, హయఘోషవలెను, గజఘీంకారమువలెను, నాగస్వరము వలెను, ఉరుము ధ్వని వలెను ఉండినది.

అది పది దిక్కులలోను ఉండే సర్వ బుద్ధక్షేత్రసరణీ వినేయ సత్త్వసంచోదని యైనది. అద్భుతమూ, అనుపహతమూ, అవలంబితమూ, సహితమూ, యుక్తమూ అయినది. అది కాలవాదిని, సమయమును అతిక్రమించనది. ధర్మ శత సహస్రంతో బాగుగా గ్రథితమైనది. సౌమ్యమూ, అసక్తమూ, ప్రతిభావము పొందినదీ అయినది. ఒకే ధ్వని కలిగినా అన్ని ధ్వనులూ కలినది. సర్వాభిప్రాయాలనూ తెలియజేసేది. సమస్త సుఖాలనూ కలిగించేది. మోక్షమార్గమును చూపునది. మార్గ సంభార వాదిని యైనది_ సభ్యతను అతిక్రమించనది. సమస్త పరిషత్తులకూ సంతోషమును కలిగించునది. సర్వబుద్ధ భాషితములకును అనుకూలమయినది. ఇట్టి వాక్కును బోధిసత్త్వుడు యావసికుడైన స్వస్తికునితో పలికి, ఈ క్రింది గాథలను వచించాడు.

"తృణ దేహి మి స్వస్తిక శీఘ్రం అద్య మమార్థ తృణైః సుమహాంతః,
సబలం నముచిం నిహనిత్వా బోధి మనుత్తరశాంతి స్పృశిష్యే.

యస్యకృతే మయి కల్పసహస్రా దాను దమోపిచ సంయమత్యాగో,
శీలవ్రతం చ తపశ్చ సుచీర్ణా యస్యమి నిష్పది భేష్యతి అద్య.

క్షాంతిబలం తథ వీర్యబలం చ జ్ఞానబలం తథ జ్ఞానబలం చ,
పుణ్య అభిజ్ఞ విమోక్షబలం చ తస్యమి నిష్పది భేష్యతి అద్య.

ప్రజ్ఞబలం చ ఉపాయబలం చ బుద్ధిమ సంగత మైత్రిబలం చ,
ప్రతిసంవిద పరిసత్యబలం చ తేషమి నిష్పది భేష్యతి అద్య.

పుణ్యబలం చ తవాపి అనంతం యన్మమ దాస్యసి అద్య తృణాని,
నహ్యాపరం తవ ఏతు నిమిత్తం త్వంపి అనుత్తరు భేష్యసి శాస్తా."

"ఓ స్వస్తికుడా! శీఘ్రంగా నాకు తృణాలు ఇయ్యి. ఈ తృణాలవల్లనే నేను గొప్ప శక్తిని సంపాదించి సబలుడైన నముచిని సంహరించి లోకోత్తరమైన శాంతి నిచ్చే బోధిని పొందగలను. ఏ సంబోధి కోసమై నేను కల్పసహస్రాలు దాన దమ సంయమ త్యాగాలను, శీలవ్రతాన్ని, తపస్సును ఆచరిస్తున్నానో, అది యిప్పుడు నాకు లభించగలదు. క్షాంతి బల, వీర్యబలములను, ధ్యానబలమును, జ్ఞానబలమును, పుణ్యాభిజ్ఞ విమోక్ష బలమును, ప్రజ్ఞాబలమును, ఉపాయ బలమును, బుద్ధిసంగతమైన మైత్రీ



బలమును, ప్రతిసంవిద పరిసత్యబలమును ఇప్పుడు పొందగలను. 'నీ విప్పుడు నాకీ తృణములను ఇచ్చినట్లయితే అనంతమైన పుణ్యబలం నీకు చేకూరుతుంది. నీవున్నూ అనుత్తరుడైన శాస్తవు కాగలవు."

నాయకుడైన బోధిసత్త్వుడు పలికినదీ, సురుచిరమూ, మధురమూ అయిన యీ మాటను విని స్వస్తికుడు తుష్టుడూ, ఆత్తమనస్కుడూ, సంతుష్టుడూ, ప్రముదితమనస్కుడూ అయి, మృదువై లేతగా ఉండి శుభకరమై సుఖస్పర్శనమై వున్న తృణముష్టిని గ్రహించి, బోధిసత్త్వుని యెదుట నిలిచి "ఓ మహాగుణ సముద్రుడా! అపరిమిత యశస్సు కలవాడా! ఉత్తమమై, శాంతమై, చూడను అశక్యమై, జినపథమై, అమృతమై, పదవరమైన సమ్యక్సంబోధి తృణములచేత లభ్యమైనట్లయితే, దానిని నీ కేల ఈయవలెను? నేనే అమృతమయమైన ఆ పదవరమును మొదట తెలుసుకొంటాను' అని అన్నాడు.

అప్పుడు బోధిసత్త్వుడు ఇట్లన్నాడు—"ఓ స్వస్తికా! సమ్యక్సంబోధి తృణశయనంవల్ల మాత్రమే కలుగదు. దానికై బహుకల్ప కోటివత్సరాలు వివిధ దుష్కర వ్రతాలు, తపస్సు చేయవలెను. నీవు మతిమంతుడవై ప్రజ్ఞాపుణ్యోపాయాలు పొందినప్పుడు విరజుడవు కాగలవు. నిన్ను మునులందరూ జినుడవని అంగీకరిస్తారు. ఓ స్వస్తికుడా! ఈ సమ్యక్సంబోధిని ఇతరులకు ఇయ్యడమే సాధ్యమయినట్లతే, సారం తీసి ప్రజలందరికిని ఈయగలను. అప్పుడు ఎవ్వరికీ విపరీతమతి కలుగదు. ఈ బోధిని నీవు పొందినప్పుడు అమృతాన్ని పొందినట్లే తెలుసుకుంటావు. ధర్మయుక్తుడవై వచ్చి నీవు ఆ బోధిని విను. తప్పక రజోరహితుడవు అవుతావు."

బోధిసత్త్వుడు ఇట్లు చెప్పి స్వస్తికునివల్ల తృణముష్టిని - మిక్కిలి మృదువైన దానిని గ్రహించి, సింహగమనంతోనూ, హంసనడకతోనూ బయలుదేరగా భూమి కంపించినది. దేవనాగగరుడులు ప్రముదితమనస్కులై, చేతులు జోడించుకొని "ఇప్పుడు ఈ బోధిసత్త్వుడు మారబలాన్ని నశింపజేసి అమృతమైన సమ్యక్సంబోధిని గ్రహిస్తాడు" అని భావించారు.

ఓ భిక్షుకులారా, బోధిసత్త్వుడు బోధివృక్షం దగ్గరకు వస్తూవున్న సమయంలో ఎనభైవేల బోధివృక్షాలను దేవపుత్రులూ, బోధిసత్త్వులూ

నిర్మించి బాగా అలంకరించారు—"బోధిసత్త్వుడు ఇక్కడనే కూరుచుండి సంబోధిని పొంది, వ్యాపింపజేస్తాడు" అనే భావంతో వానిలో కొన్ని బోధివృక్షాలు పుష్పమయములై లక్ష యోజనముల ఎత్తుగలవి, కొన్ని బోధివృక్షాలు గంధమయములై రెండు లక్షల యోజనాల యెత్తుగలవి, కొన్ని చందనమయాలయి మూడు లక్షల యోజనాల యెత్తుగలిగి, కొన్ని వస్త్రమయములె ఐదు లక్షల యోజనాల యెత్తుగలిగి ఉన్నవి. కొన్ని రత్నమయములై పది లక్షల యోజనముల ఎత్తుకలిగి, కొన్ని సర్వరత్నమయములై అనేక కోట్ల యోజనాల ఎత్తు గలిగి ఉన్నవి. ఈ బోధివృక్షములన్నింటి మూలములందును వానివానికి అనురూపాలైన సింహాసనాలు ఉంచబడినవి. వివిధాలైన దివ్యవస్త్రాలు వానిపై పరచబడినవి. ఒకానొక బోధివృక్షందగ్గర పద్మాసనమూ, ఒకచోట గంధాసనమూ, ఒకచోట నానావిధరత్నాసనమూ నెలకొల్పబడినవి.

సింహాసనాలు ఇట్లు నెలకొల్పిన వెంటనే సమస్త బోధివృక్షముల మూలములందున్నూ ఉన్న సింహాసనాలపైని బోధిసత్త్వుడు కూర్చున్నట్లే కానవచ్చినాడు. అతడు సర్వశుభలక్షణాలు కలిగి బాగా అలంకరింపబడిన దేహంతోనే ఉండినాడు. దేవపుత్రులకు—ఎవరిమట్టుకు వారికి ఒక్క బోధిసత్త్వుడే కానవచ్చినాడు. అందువల్ల అందరున్నూ "నేను నెలకొల్పిన సింహాసనంపైనే బోధిసత్త్వుడు కూర్చున్నాడు. పైవారు ఉంచిన సింహాసనాలపైని కూర్చుండలేదు" అనే తోచింది. బోధిసత్త్వుడు లాడితవ్యూహమనే సమాధిని పొంది ఉన్నాడు. ఆ తర్వాత వచ్చిన బోధిసత్త్వుడు కూడా ఈ లాడితవ్యూహమనే సమాధినే అవలంబించాడు. బోధిసత్త్వుని లాడితవ్యూహ సమాధి అను భావంవలన నిరయంలోను, తిర్యగ్యోనులందు, యమలోకంలోను ఉండే సత్త్వాలూ, దేవ మనుష్యులూ అందరూ ఉత్తమగతిని పొందారు. సమస్త సత్త్వాలూ బోధివృషమూలంలో సింహాసనంపైని ఆసీనుడై ఉన్న బోధిసత్త్వుని చూస్తూనే ఉండినారు.

తర్వాత హీనాతిముక్తులైన సత్త్వముల మతి పరితోషణార్థమై బోధిసత్త్వుడు తృణముష్టిని తీసుకొని బోధివృక్షం దగ్గరకు వెళ్ళాడు. అక్కడికి వెళ్ళి ఏడుసార్లు ఆ బోధివృక్షంచుట్టూ ప్రదక్షిణంచేసి అగ్రభాగం



లోపలికి ఉండేటట్లూ, మూలభాగం బయటికి ఉండేటట్లూ సమంతభద్రమైన తృణసంస్తరాన్ని పరిచి, సింహంవలెను, శూరునివలెను, దృఢవీర్యం కలవానివలెను, స్థామంవలెను, నాగంవలెను, ఐశ్వర్యంవలెను, స్వయంభువువలెను, జ్ఞానివలెను, ఉత్తమునివలెను, విశేషాభ్యుదయాలవలెను, యశఃకీర్తి దానశీలక్షాంతి వీర్య ప్రజ్ఞాజ్ఞానములవలెను, పుణ్యంవలెను, ప్రత్యర్థి-అయిన మారుని సంహారించినవానివలెను, సంభారంవలెను, పర్యంకబంధం వేసుకుని ఆ తృణసంస్తరంపై కూర్చున్నాడు. అతడు తూర్పుముఖం కలిగి, శరీరం ఋజువుగా ఉండేటట్లు ప్రణిధావం పొంది, అభిముఖమైన స్మృతిని పొంది క్రింది విధంగా దృఢమైన ప్రతిజ్ఞను చేసినాడు:—

"ఇహాసనే శుష్యతు మే శరీరం
త్వగస్థిమాంసం ప్రలయం చ యాతు,
అప్రాప్య బోధిం బహుకల్పదుర్లభాం
నైవాసనాత్కాయ మత శ్చలిష్యతే."

"నా శరీరం ఈ ఆసనంలోనే ఎండిపోనీ. చర్మమూ, అస్థిమాంసములూ నశించినా నశించిపోనీ. బహుకల్పదుర్లభమైన సమ్యక్సంబోధిని పొందకుండా ఈ ఆసనంనుంచి నా శరీరాన్ని ఏమాత్రమూ చలింపనీయును" అని.

ఇది శ్రీ లలితవిస్తరంలో బోధిమండగమన పరివర్తమనే
పందొమ్మిదవ అధ్యాయం.

# 20. బోధిమండవ్యూహ పరివర్తం

భిక్షులారా, బోధిసత్త్వుడు బోధిమండందగ్గిర కూర్చుని ఉండగా, అతనికి ఎట్టి ఆటంకమూ కలుగకుండా వుండేటట్లు చూడడానికి— తూర్పు దిక్కున కామావచరులైన దేవపుత్రులు ఆరుగురు నిలబడి ఉన్నారు. ఆ విధంగానే దక్షిణదిక్కునా, పడమటా, ఉత్తర దిక్కునా కూడా దేవతలు నిలబడి ఉండినారు.

ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు బోధిమండంవద్ద కూర్చుండి బోధిసత్త్వ సంచోదని అనే తేజఃకిరణాన్ని విడిచిపెట్టినాడు. ఆ రశ్మివల్ల పది దిక్కులలోనూ అప్రమేయాలూ, అసంఖ్యేయాలూ ధర్మధాతు పరమాణ్వాకాశధాతు పర్యవసానాలైన సర్వబుద్ధ క్షేత్రాలూ బాగా ప్రకాశించినవి.

తూర్పు దిక్కులో విమలమనే లోకధాతువులోని విమల ప్రభాసుడనే తథాగతుని బుద్ధక్షేత్రంనుండి లలితవ్యూహుడనే మహాసత్త్వుడైన బోధిసత్త్వుడు, లెక్కలేనంతమంది బోధిసత్త్వులతో పరివృతుడై ఆ తేజస్సును అనుసరించి బోధిసత్త్వుడు ఉన్న చోటికి వచ్చాడు. వచ్చి ఆ సమయంలో బోధిసత్త్వుని పూజార్థమై సమృద్ధమైన అభిసంస్కారాన్ని ఆచరించాడు. దానివల్ల పది దిక్కులందున్నూ ఆకాశధాతు పర్యవసానాలయిన బుద్ధక్షేత్రాలన్నీ ఒక్క మండలంగా కానవచ్చినవి. ఆ మండలం శుద్ధమైన లోలవైడూర్యమయంగా ఉన్నది. ఆ ప్రభ పంచగతులనూ పొందిన సర్వసత్త్వులయెదుట బోధిమండంలో కూర్చున్న బోధిసత్త్వుని చూపిస్తూ ఉన్నది. ఆ సత్త్వులు ఒకరికొకరు వ్రేలితో బోధిసత్త్వుణ్ణి చూపుతూ ఉండినారు. "ఆహా! ఇతడు ఎట్టి లలితమైనవాడు! ఇట్టి మహామహుడు ఎవ్వడోగదా! ఈయన ఎట్లు ప్రకాశిస్తున్నాడో!" అని అనుకొనసాగినారు. ఆ సత్త్వులయెదుట బోధిసత్త్వుడు చాలామంది బోధిసత్త్వులను నిర్మింపసాగినాడు. ఆ బోధిసత్త్వ విగ్రహులు ఈ గాథను పలికారు.



"యస్యా కించన రాగ దోష కలుషా సా వాసనా ఉద్ధృతా
యస్యా కాయ ప్రభావతా దశదిశే సర్వే ప్రభా నిష్ప్రభాః,
యస్యా పుణ్య సమాధిజ్ఞానిచయః కల్పేషు సంవర్ధితః
సోఽయం శాక్యమునిర్మహామునివరః సర్వా దిశో భ్రాజతే."

(ఎవ్వనికి రాగదోష కలుషితమైన, ఉద్ధృతమైన వాసన కొంచెమైనను లేదో, ఎవని శరీరంనుండి వెలువడిన తేజస్సు దశదిక్కులనూ వ్యాపించి యితరములైన ప్రభలను కాంతిహీనాలుగా చేస్తున్నదో, ఎవని పుణ్య సమాధి జ్ఞాననిచయం బహుకల్పాలనుంచి వృద్ధి పొందుతూ వున్నదో, మహామునివరుడైన ఆ శాక్యముని సమస్త దిశలనూ వెలిగింపజేస్తున్నాడు.)

ఓ భిక్షులారా, తర్వాత దక్షిణ దిక్కులో రత్నవ్యూహమునే లోకధాతువువల్ల రత్నార్చి అనే తథాగతుని బుద్ధక్షేత్రంనుంచి రత్నఛత్రకూట సందర్శనుడనే బోధిసత్త్వుడు గొప్ప సత్త్వం కలవాడు సంబోధితుడై, లెక్కలేనంతమంది బోధిసత్త్వులతోసహా బోధిసత్త్వుడున్న బోధిమండంవద్దకు వచ్చినాడు. వచ్చి బోధిసత్త్వుని పూజాకర్మలో ఏకరత్నఛత్రంతో ఆ మండం అంతటికీ ఛాయ కలిగించినాడు. అక్కడకు వచ్చిన యింద్రుడు, బ్రహ్మ, లోకపాలకులు పరస్పరం "ఈయన ఎవరి తపస్సునకు ఫలమో? ఎందువల్ల యీ విధంగా రత్నఛత్ర వ్యూహం కానవస్తున్నదో" అని అనుకొనసాగినారు. తర్వాత ఆ రత్నఛత్రంనుండి యీ గాథ వెలువడినది—

"యేన ఛత్రసహస్రకోటి నయుతా గనాని రత్నాని చ
దత్తా అప్రతిమేషు మైత్రమనసా తిష్ఠన్తి కే నిర్వృతే,
సో ఏషో వరలక్షణో హితకరో నారాయణ స్థామవాన్
బోధేర్మూల ముపాగతో గుణధర స్తస్యైష పూజా కృతా."

(సహస్రకోట్ల సంఖ్యలో ఛత్రాలూ, గంధములూ, రత్నాలూ సాటిలేనివన్నీ ఎపనికి ఈయబడుతున్నవో, ఎవ్వని విషయమై నిర్వృతిని పొంది మైత్రిగల మనస్సుతో ఉంటున్నారో, యోగ్యలక్షణాలు కలవాడూ, లోకహితుడూ, నారాయణ స్థామవంతుడూ, గుణరతుడూ అయిన ఆ బోధిసత్త్వుడు బోధిమూలమునకు వచ్చినాడు. అతనికి పూజ కావించవలెను.)

తర్వాత పశ్చిమదిక్కున చంపకవర్ణమనే లోకధాతువునుండి పుష్పబలివనరాజికుసుమితాభిజ్ఞుడనే తథాగతుని బుద్ధక్షేత్రంనుండి మహాసత్త్వుడైన ఇంద్రజాతి అనే బోధిసత్త్వుడు ఆ కాంతిచేత సంచోదితుడై గణనాతీతులైన బోధిసత్త్వులతో సహా, బోధిమండందగ్గరవున్న బోధిసత్త్వుని వద్దకు వచ్చాడు. వచ్చి అతని పూజాకర్మలో ఆ మండలాన్ని రత్నాలతో కప్పివేశాడు. అక్కడ పది దిక్కులనుంచీ వచ్చివున్న దేవ నాగ యక్ష గంధర్వులు "ఈ గొప్ప ప్రభావ్యూహం ఎవ్వరిదో?" అని ఒకరిని ఒకరు ప్రశ్నించారు. అప్పుడు ఆ రత్నజాలంనుండి యీ గాథ బయలువెడలినది-

"రత్నాకరో రతనకేతురతి స్త్రిలోకే
రత్నోత్తమో రతనకీ రిరతః సుధర్మే,
రత్నాని త్రీణి స చ ఛేత్స్యతి వీర్యప్రాప్తః
సో బోధి ప్రాప్స్యతి వరామియ తస్య పూజా'.'

(ఈయన రత్నాకరుడు, రత్నకేతువునందు ఇష్టంకలవాడు. మూడు లోకాల్లోనూ రత్నోత్తముడు. ఉత్తమ ధర్మమునందును, ఉత్తమకీర్తి యందును ఆసక్తి కలవాడు. పరాక్రమవంతుడైన ఈయన మూడు రత్నాలనూ పొందగలడు. అట్టి యీ బోధిసత్త్వుడు బోధిదగ్గరికి వస్తున్నాడు. అయనపూజను చేయవలెను.)

తర్వాత ఉత్తరదిక్కునందు సూర్యావర్త లోకధాతువునుంచి సూర్యజిహ్మాకరప్రభుడనే తథాగతుని బుద్ధక్షేత్రమునుండి మహాసత్త్వుడైన వ్యూహరాజనే బోదిసత్త్వుడు ఈ ప్రభవలన సంచోదితుడై, లెక్కలేనంతమంది బోధిసత్త్వులతో పరివృతుడై బోధిమండం దగ్గర ఉన్న బోధిసత్త్వుని సమీపించాడు. సమీపించి, బోధిసత్త్వుని పూజకోసమై, పది దిక్కులందును సర్వలోకధాతువులతోనూ ఉన్న బుద్ధక్షేత్ర వ్యూహాలన్నింటినీ ఆ మండలంలోనే చూపుతూ ఉండినాడు. అక్కడ వున్న కొందరు బోధిసత్త్వులు "ఇటువంటి వ్యూహాలు ఎవ్వరినోకద!" అని అనుకున్నారు. అప్పుడు ఆ వ్యూహాలనుండి యీ గాథ వెలువడింది—

'కాయో యేన విశోధితః సుబహుళః పుణ్యేన జ్ఞానేన చ
యేనా వాచ విశోధితా వ్రతతపైః సత్యేన ధర్మేణ చ,



చిత్తం యేన విశోధితం హిరిధృతీ కారుణ్య మైత్ర్యా తథా
సో ఏషో ద్రుమరాజ మూలుపగతః శాక్యర్షభః పూజ్యతే".

(ఎవనియొక్క శరీరం పుణ్యం మూలంగానూ, జ్ఞానం మూలంగానూ బహుళంగా విశోధన చెయ్యబడినదో, సత్యధర్మాలతోనూ వ్రత తపస్సులతోనూ ఎవని వాక్కు బాగుగా శోధించబడినదో, లజ్జాధైర్యాలతోనూ కారుణ్య మైత్రులతోనూ ఎవనిమనస్సు బాగుగా శోధితమైనదో, శాక్యముఖ్యుడైన ఆ బోధిసత్త్వుడు బోధిద్రుమమూలాన్ని పొంది ఉన్నాడు. అతడు పూజింపబడును.)

తర్వాత పూర్వదక్షిణ(ఆగ్నేయ)దిక్కునుండి గుణాకారమనే లోకధాతువునుండి గుణరాజప్రభాసుడనే తథాగతుని బుద్ధక్షేత్రంనుండి గుణమతి అనే బోధిసత్త్వుడు-గొప్పసత్త్వం కలవాడు, ఆ కాంతివల్ల సంచోదితుడై లెక్కలేనంతమంది బోధిసత్త్వులతో పాటు బోధిమండం దగ్గరవున్న బోధిసత్త్వుని సమీపం చేరాడు. చేరి బోధిసత్త్వుణ్ణి పూజించడంకోసం సర్వగుణ వ్యూహాలుగల కూటాగారాన్ని ఆ మండలంలోనే నిర్మించాడు. అతని పరివారజనం "ఈ కూటాగారవ్యూహం ఎవ్వరిదో?" అని అనుకున్నారు. ఆ సమయంలో ఆ కూటాగారంనుండి యీ గాథ వెలువడింది___

'యస్య గుణైః సతతం గుణగన్ధా
భాన్తి సురాసుర యక్ష మహోరగాః,
సో గుణవాన్ గుణరాజ కులోదితో
బోధివిటపే ఉపవిష్టు గుణోదధిః'.

(సురాసురులు, యక్షులు, నాగులు ఎవని గుణములవల్లనే ఎప్పుడునూ గుణవంతులవుతున్నారో ఉత్తమ గుణాలుకల రాజవంశంలో పుట్టిన గుణవంతుడైన ఆ బోధిసత్త్వుడు___ గుణ సముద్రుడు___ ఇప్పుడు బోధివృక్షం దగ్గర ఉపవిష్టుడయి ఉన్నాడు.)

తర్వాత దక్షిణ పశ్చిమ(నైరృతి)దిక్కులో రత్నసంభవ లోకధాతువునుండి రత్నయష్టి అనే తథాగతుని బుద్ధక్షేత్రంనుండి మహాసత్త్వుడైన

రత్నసంభవుడనే బోధిసత్త్వుడు ఆ కాంతివల్ల సంచోదితుడయి అసంఖ్యాకులైన బోధిసత్త్వులతో పరివృతుడై బోధిమండందగ్గర వున్న బోధిసత్త్వుని వద్దకువచ్చాడు. వచ్చి అతనిని పూజించడానికి అప్రమేయములు, అసంఖ్యేయములు అయిన రత్నవ్యోమకాలను ఆ మండలంలో నిర్మించాడు. ఆ రత్నవ్యోమకములనుండి యీ గాథ వెలువడింది.

'త్యక్తా యేన ససాగరా వసుమతీ రత్నాన్యథో ఽనేకశః
ప్రాసాదాశ్చ గవాక్ష హర్మికవరా యుగ్యాని యానాని చ,
వ్యోమాలంకృత పుష్పదామరుచిరా ఉద్యాన॥ కూపా సభా
హస్తా పాద శిరో త్తమాంగనయనా సో బోధిమండే స్థితః.'

(సముద్రాలతో కూడిన భూమి, అనేకములైన రత్నాలు, ప్రాసాదములు, గవాక్షాలతో కూడిన భవనాలు, అశ్వములు, వాహనములు, ఆకాశాన్ని అలంకరించే పుష్పవృక్షా లున్న ఉద్యానాలు, కూపములు, సభలు, హస్తపాదో త్తమాంగాలూ ఎవ్వనిచే ఇవ్వబడినవో, ఆ బోధిసత్త్వుడు బోధిమండానికి వచ్చినాడు.)

తర్వాత పశ్చిమో త్తర(వాయవ్య)దిక్కులో మేఘవతీ లోకధాతువు నుండి మేఘరాజనే తథాగతుని బుద్ధక్షేత్రంవల్ల మేఘకూటాభిగర్జితస్వరుడనే పేరు గల మహాసత్త్వుడైన బోధిసత్త్వుడు ఆ ప్రభమూలంగా సంచోదితుడై గణనాతీతులైన బోధిసత్త్వులతో కూడా బోధిమండందగ్గరవున్న బోధిసత్త్వుని సమీపానికి వెళ్ళాడు. వెళ్ళి, అతని పూజకోసమై కాలానుసారియైన ఆగురుమేఘాన్ని నిర్మించి, ఆ మండలంలో ఉరగసార చందనచూర్ణ వర్షాన్ని కురిపించాడు. ఆ కాలానుసారి మేఘమండలంనుంచి యీ గాథ వెలువడినది.

"ధర్మమేఘ స్ఫురిత్వ సర్వవిభవే విద్యాధిము క్తి ప్రభః
సద్ధర్మం చ విరాగవర్ష అమృతం నిర్వాణ సంప్రాపకం,
సర్వారాగకిలేశబంధనలతా స్తో వాసనా ఛేత్స్యతి
ధ్యానర్ద్ధిబల ఇన్ద్రియైః కుసుమితః శ్రద్ధాకరం దాస్యతే."



(ధర్మమనే మేఘం స్ఫురించి సర్వసంపదలను, ముక్తిని ఇవ్వగలదు. ఆ సద్ధర్మమేఘం విరాగమనే అమృతాన్ని వర్షించి నిర్వాణాన్ని లభింపజేస్తుంది. సమస్తములైన రాగక్లేశాలను, బంధనలతలను, వాసనలను ఛేదిస్తుంది. ధ్యానం, వృద్ధి, బలం, ఇంద్రియవికాసం, శ్రద్ధలను ఇయ్యగలదు.)

తర్వాత ఉత్తర పూర్వ(ఈశాన్య)దిక్కులో హేమజాల ప్రతిచ్ఛన్నమనే లోకధాతువునుండి రత్నచ్ఛత్రాభ్యుద్గతావభాసుడనే తథాగతుని బుద్ధక్షేత్రంవల్ల హేమజాలాలంకృతుడనే మహాసత్త్వుడైన బోధిసత్త్వుడు ఆ ప్రభవల్ల సంచోదితుడై, గణనను అతిక్రమించిన బోధిసత్త్వులతో పరివృతుడై, బోధిమండం దగ్గరఉన్న బోధిసత్త్వుని సమీపానికి వచ్చాడు. వచ్చి బోధిసత్త్వుని పూజకోసమై సమస్తమైన రత్నవ్యోమక కూటాగారాలన్నింటిలోను ముప్ఫయిరెండు శుభలక్షణాలతో వున్న బోధిసత్త్వ విగ్రహాలను నిర్మించాడు. ఆ బోధిసత్త్వ విగ్రహరూపులు దివ్యములూ, మానుషములూ అయిన పుష్పమాలికలను పట్టుకొని బోధిసత్త్వుడున్నవైపు శరీరాలు వంచి, ఆ పుష్పమాలికలను ధరింపజేశారు. అప్పుడు వారు ఈ గాథను పలికినారు.

"యేన బుద్ధ నయుతా స్తవిత పూర్వ
గౌరవేణ మహతా జనియ శ్రద్ధాన్,
బ్రహ్మఘోష వచనం మధురవాణిం
బోధిమండోపగతం శిరసి వన్దే."

(గొప్ప పూర్వగౌరవంతో కొనియాడదగిన బుద్ధులు లక్షలకొద్దీ ఎవ్వనిచే సృజించబడినారో, బ్రహ్మఘోషవచనం గల్గి, మధురవాక్కుగల ఆ బోధిసత్త్వునికి, బోధిమండమును చేరినవానికి నమస్కరిస్తాను.)

తర్వాత క్రిందినుండి సమంత విలోకిత లోకధాతువునుండి సమంతదర్శి అనే తథాగతుని బుద్ధక్షేత్రంనుండి మహాసత్త్వుడైన రత్నగర్భుడనే బోధిసత్త్వుడు ఆ ప్రభచేత సంచోదితుడై లెక్కలేనంతమంది బోధిసత్త్వులతో కూడుకొన్నవాడై బోధిమండం సమీపంలో ఉన్న బోధిసత్త్వుని వద్దకు వచ్చినాడు. వచ్చి ఆ బోధిసత్త్వుణ్ణి పూజించడంకోసమై ఆ

వైడూర్యమయ మండలంలో బంగారు పద్మాలు వికసించేటట్లుగా ప్రదర్శించాడు. ఆ పద్మాల కర్ణికలలో చక్కని రూపం గల అర్ధకాయికలైన యువతులు సర్వాలంకార భూషితలు ప్రదర్శింపబడినారు. వారు కుడి, యెడమ చేతులతో హార కటక కేయూర సువర్ణసూత్ర ముక్తాహారాదులైన వివిధాభరణాలను గ్రహించి, పుష్పమాలలను, పట్టుమాలలను వ్రేలాడేటట్టు పట్టుకొని బోధిమండం దగ్గర ఉన్న బోధిసత్త్వునివైపు వంగిన దేహాలు కలవారై యీ గాథను పలికారు.

"యో ఓసమిష్ట సదా గురూణాం
బుద్ధశ్రావక ప్రత్యేక జినానాం,
నిర్మాణ సుశీల సదోజ్ఞ ప్రజ్ఞ
తస్యా ఓనమథా గుణధరస్య."

(ఎవడు గురువులైన బుద్ధశ్రావక ప్రత్యేక జనులకు ఎల్లప్పుడును నమస్కరిస్తూ ఉంటాడో, నిర్మాణ సుశీలుడూ, సదోద్యుక్తుడూ ఉత్తముడూ శ్రేష్ఠుడూ గుణధరుడూ అయిన బోధిసత్త్వునికి నమస్కారం చెయ్యండి.)

తర్వాత ఊర్ధ్వదిక్కునుంచి పరగణ అనే లోకధాతువువల్ల గణేంద్రుడనే తథాగతుని బుద్ధక్షేత్రం నుండి మహాసత్త్వుడైన గణగంజుడనే బోధిసత్త్వుడు ఆ ప్రభచేత సంచోదితుడై లెక్కలేనంతమంది బోధిసత్త్వులతో పరివృతుడై బోధిమండం దగ్గరున్న బోధిసత్త్వుని సమీపానికి వచ్చాడు. వచ్చి, అతని పూజకోసమై తాను ఆకాశంపైనుంచే సమస్త దిక్కులలోనూ ఉన్న సర్వబుద్ధ క్షేత్రాలలోనూ అదృష్టపూర్వాలు, అశ్రుతపూర్వాలు అయిన పుష్ప, భూష, గంధమాల్య, విలేపనచూర్ణ, చీవర వస్త్రాలంకార, ఛత్రధ్వజ పతాకా వైజయంతీ, రత్న మణి కనక రజత ముక్తాహారాలూ, హయ రథ గజపత్తి వాహన పుష్ప వృక్షపత్ర పుష్పఫలాలనూ, దారదారికలనూ సమర్పించాడు. దేవ నాగ యక్ష గంధర్వాసుర గరుడ కిన్నర మహోరగ శక్ర బ్రహ్మ లోకపాల మనుష్యామనుష్యులు అందరూ గగనతలంనుండి గొప్ప పుష్పవర్షం కురిపించారు. అప్పుడు సమస్త ప్రాణులకునూ ప్రీతి, సుఖం కలిగాయి. ఏ ప్రాణికిని భయంగాని, బాధగాని కలుగలేదు. ఇక్కడ కొన్ని గాథలున్నాయి. వాటిభావమిది:



పేయాలంవరకూ వుండే జినౌరసులందరూ, హితకరుడూ, సంబోధిని పొందినవాడూ అయిన ఈ బోధిసత్త్వుణి పూజించడానికి వ్యూహంగా వచ్చారు. ఆకాశంపైని మేఘంవలె గర్జిస్తూ కొందరు వచ్చారు. వేలకొద్దీ హారాలను వ్రేలాడేటట్లు పెట్టుకొని కొందరూ, రత్నమకుటాలను ధరించి కొందరూ వచ్చి, ఆకాశంపైని పుష్పవిమానాన్ని చూపుతూ ఉన్నారు. కొందరు సింహంవలె గర్జిస్తూ భూమిపైకి వచ్చారు. కొందరు "ప్రణిధి" అని ధ్వనిస్తూ, కొందరు అభినందిస్తూ వచ్చారు. అందరూ అదృష్టపూర్వములైన పుష్పాలను కురిపిస్తూనే వచ్చారు. కొందరు ఆకాశంమీదనుంచి పడే జలంవలె ధ్వనిస్తూ వేలకొద్దీ తమతమ వర్ణాలను ప్రదర్శిస్తూ వచ్చారు. ఆకాశంపైని పరిపూర్ణంగా ప్రకాశిస్తున్న చంద్రునిపోలిన కొందరు సౌగతుని గుణగణాలను ప్రశంసిస్తూ వచ్చారు. కొందరు సూర్యునివలె తమ తేజస్సును వ్యాపింపజేస్తూ, మారభవనా లన్నింటినీ మాత్రం వెలవెలపోతున్నట్లు చేస్తూ వచ్చారు. కొందరు ఇంద్రధ్వజంవంటి చక్కని కేతువులను పట్టుకొని, బోధిమండందగ్గర సమస్త సంభారాలూ కూరుస్తూ వచ్చారు. కొందరు ఆకాశంనుండి పూర్ణచంద్రునివలెను, బాలచంద్రునివలెను ప్రకాశిస్తూ మణిరత్నజాలాలను కురిపించారు. వారు, బోధిసత్త్వుడున్న బోధిమండంపైని మందారపుష్పాలను, చంపక పుష్పాలను కూడా కురిపించారు. కొందరు తమ పాదాలతో భూమిని దద్దరిల్లజేస్తూ వచ్చారు. వారివల్ల కంపితమైన భూమి జనులకు ఎంతో ప్రీతిని కలిగించినది. కొందరు మేరువును చేతులతో గ్రహించి, అంతరిక్షముపైనే ఉండి పుష్పవర్షాన్ని కురిపించారు. కొందరు నాల్గు సముద్రాలనూ తలపైని ధరించి భూమిని గంధోదకాలతో బాగా తడిపారు. కొందరు రత్నదండాలు చిత్రంగా చేతులతో పట్టుకొని, బోధిసత్త్వునికి కొంచెందూరంలో నిలిచారు. కొందరు బ్రహ్మభావాన్నిపొంది ప్రశాంతరూపులై, ప్రశాంత మనస్సు కలవారై ధ్యాన నిమగ్నులై, మైత్రీయుక్తులై, ముదితులై వచ్చారు. వారి రోమాలనుంచి మనోజ్ఞమైన స్వరం బయలువెడలినది. కొందరు మరుత్తులు ఇంద్రునివలె ఉన్నవారు కోట్లకొలదీ దేవతలతో కూడా వచ్చారు. వారు చేతులు జోడించుకొని బోధిమండాన్ని సమీపించి విచిత్రాలైన మాణిక్యాలనూ, రత్నా

లనూ కురిపించారు. నలుగురు దిక్పాలకులూ గంధర్వ రాక్షస కిన్నరులతో కూడి మెరుపువలె ప్రకాశిస్తున్న పుష్పాలను వర్షించారు. గంధర్వులూ, కిన్నరులూ మధురమైన స్వరంతో వీరాగ్రణి అయిన బోధిసత్త్వుణ్ణి స్తుతిస్తున్నారు. బుద్ధునియందే మనస్సు కల శుద్ధకాయులైన కొందరు పుష్పాలతోనూ, ఫలాలతోనూ పరిమళములను వెదజల్లుతున్న వృక్షాలను గ్రహించి వచ్చారు. వారు ఆ వృక్షాలను పట్టుకుని బోధిమండంపైని పుష్పాలను వేశారు. ముప్ఫయిరెండు లక్షణాలతోనూ పద్మగర్భంలో ఉద్భవించి, అలిప్తమయిన మనస్సు కలిగిన బోధిసత్త్వుడు బోధిమండందగ్గర ఉన్నట్లు తెలుసుకొని కొందరు పద్మాలు, ఉత్పలాలు, పుండరీకాలు మున్నగు పుష్పాలతో ఉన్న పూలసజ్జలను తీసుకుని వచ్చారు. మేరుపర్వతంవలెనే విపులమైన శరీరం గల కొందరు అంతరిక్షంపైనే ఉండి స్వశరీరాన్ని విడిచిపెట్టారు. విడిచిపెట్టినవెంటనే వారు పూలమాలలుగా మారి త్రిసాహస్రమైన బోధిసత్త్వుని క్షేత్రాన్ని కప్పివేశారు. కొందరు తమ రెండు చక్షుస్సులలోనూ కల్పదాహమును, విభవ సంభవాలను ప్రదర్శించారు. వారి శరీరాలలో అనేక ధర్మసుఖాలు ధ్వనిస్తున్నాయి. వాటిని విని కోట్లకొలదిగా ఉన్న సత్త్వాలు తృష్ణను విడిచిపెట్టాయి. కిన్నరులతో తుల్యమైన ధ్వని కలవారూ, దొండపండువంటి పెదవి, అందమై, పరిపూర్ణమైన ముఖం కలవారు, కన్యలవలెనే చిత్రములైన హారములను అలంకరించుకొన్నవారు కొందరు వచ్చారు. వారిని చూడగా దేవగణాలకు కూడా తనివి తీరడం లేదు. కొందరు వజ్రకాయులవలె అభేద్యులై దాడికి బయలుదేరినట్లు అడుగులు వేసుకొంటూ వచ్చారు. కొందరు సూర్యునివలెను, పూర్ణచంద్రునివలెను ఉన్న ముఖాలతో వెలుగునూ, తేజస్సునూ విరజిమ్ముతూ, క్లేశదోషాలను నశింపజేస్తూ వచ్చారు. కొందరు చేతులలో రత్నాలను పట్టుకొని కోట్లకొద్దీ వున్న క్షేత్రాలను కప్పివేస్తూ రత్నాలనూ, సుగంధపుష్పాలనూ, వర్షిస్తూ నచ్చారు. అనేక సత్త్వాల హితంకోసమూ, సుఖంకోసమునూ వాటికి సంతోషం కలుగజేయుటకున్నూ ఇలా చేశారు. కొందరు పెద్ద రత్నకోశాలను పట్టుకొని, రోమాలవల్ల ఎన్నో సూత్రాలను ప్రకా



శింపజేస్తూ వచ్చారు. వారు గొప్ప ప్రతిభావమూ, మతీ, సుబుద్ధీ కలిగి, మత్త ప్రమత్తులైన జనుల సమూహాన్ని ప్రబోధించడానికి వచ్చారు. కొందరు మేరువువలె పెద్దదిగా ఉన్న భేరిని పట్టుకొని గగనతలంలో సుమనోజ్ఞంగా ధ్వనింపజేస్తూ వచ్చారు. ఆ భేరీధ్వనిని విని, పదిదిక్కులలోనూ కోట్లకొలదిగా ఉన్న క్షేత్రాలు "ఇప్పుడు శాస్త అయిన బోధిసత్త్వుడు అమృతమయమైన బోధను వెల్లడిస్తాడు" అని తెలుసుకొన్నారు.

ఇది లలితవిస్తరంలో బోధిమండవ్యూహ పరిర్తమనే
ఇరవయ్యో అధ్యాయం.

# 21. మారధర్షణ పరివర్తం

భిక్షువులారా, ఈ విధంగా బోధిసత్త్వులు, గౌతముని పూజాకర్మకోసం బోధిమండంలో ఇలాటి వ్యూహాలు కల్పించారు. గౌతమ బోధిసత్త్వుడు కూడా పది దిక్కులలోనూ అతీతానాగత ప్రత్యుత్పన్న బుద్ధుల సర్వబుద్ధ క్షేత్రాల బోధిమండాలంకార వ్యూహాలను ఆ బోధిమండంలో చూడసాగినాడు.

ఆ బోధిమండంలో ఆసీనుడయిన బోధిసత్త్వునికి మనసులో ఇలాటి భావం కలిగింది. "కామధాతువులో మారుడు అధిపతి. వాడు పాపి. వశవర్తి. వానికి తెలియకుండా నేను సమ్యక్సంబోధిని తెలుసుకోనడం తగినది కాదు. కనుక ఆ పాపి అయిన మారునికి సంచోదనం కలిగిస్తాను. వానిని గనుక జయిస్తే కామావచరులయిన దేవతలందరూ పట్టుబడిపోతారు. అప్పుడు మారపరిషత్తులు మారకాయికులయిన దేవపుత్రులు పూర్వజన్మ కుశలమూలాలవలన నా సింహ విక్రీడితం చూచి, అనుత్తర సమ్యక్సంబోధిలో మనస్సు నిలుపుతారు".

బోధిసత్త్వుడు ఈ విధంగా ఆలోచించి, సర్వమార మండల విధ్వంసకరి అనే ఒక రశ్మిని తన కనుబొమల మధ్య గల ఊర్ణకోశం (సుడి) నుంచి సృష్టించాడు. ఆకాంతివల్ల ఈ త్రిసాహస్ర, మహాసాహస్రమైన లోకంలోని సమస్త మారభవనాలు వంగి, వణికిపోసాగినవి. ఈ సమస్తమయిన త్రిసాహస్ర మహాసాహస్ర లోకాలు మహాకాంతితో స్పష్టంగా కనిపించసాగాయి. ఆ రశ్మికాంతిలో మారుడు - పాపి అయిన మారుడు ఈ విధమయిన శబ్దం విన్నాడు.

"కల్పేషు చీర్ణ చరితో హ్యతిశుద్ధసత్త్వః
శుద్ధోదనస్య తనయః ప్రనిజహ్య రాజ్యం,



సో నిర్గతో హితకరో హ్యమృతాభిలాషీ
బోధిద్రుమం హ్యుపగతోఽద్య కురు ప్రయత్నం.

సో తీర్ణ ఆత్మన పరాంసపి తారయేయా
మోచేష్యతే స చ పరాం స్వయమేవ ముక్తః,
ఆశ్వాస ప్రాప్త స పరాంసపి చాశ్వసేయా
నిర్వాపయిష్యతి పరాం పరినిర్వృతశ్చ.

శూన్యాం కరిష్యతి అపాయత్రయోఽస్య శేషాం
పూర్ణాం కరిష్యతి పురాం సురమానుషాణాం,
ధ్యానానభిజ్ఞ పరమం అమృతం సుఖం చ
దాస్యత్యసౌ హితకరో అమృతం స్పృశిత్వా.

శూన్యం కరివ్యతి పురం తవ కృష్ణబంధో
అబలో బలో బలవిహీను అపక్ష్య పక్షో,
న జ్ఞాస్యసే క్వను వ్రజామి కరోమి కిం నా
యద ధర్మవర్ష మభివర్షి స్వయం స్వయంభూః."

(ఎన్నో కల్పాల ప్రాచీన చరిత కలిగి శుద్ధసత్త్వుడయిన శుద్ధోదన తనయుడు రాజ్యం వదలి, అమృతత్వం, జనహితం కోరుతూ బయలుదేరి బోధివృక్షం చేరాడు. ఇప్పుడే నీ తరణోపాయానికి ప్రయత్నం చేయి. అతడు తరించి, ఇతరులను తరింపజేస్తాడు. తాను ముక్తుడై ఇతరులను ముక్తులను చేస్తాడు. తాను ఆశ్వాసం పొంది, ఇతరులను సమాశ్వాసపరుస్తాడు. తాను పరినిర్వృతుడై ఇతరులను పరినిర్వృతులను చేస్తాడు. సర్వాపాయత్రయాన్ని శూన్యం చేస్తాడు. సురమనుష్యుల పట్టణాలను పూర్ణం చేస్తాడు. పరమామృతం తాకి, ఇతరులకు పరమామృతం, సుఖం అందజేస్తాడు. ఓ కృష్ణబంధో! నీ పట్టణాన్ని అతడు శూన్యం చేస్తాడు. నీ బలమంతా ఉడిగిపోతుంది. నీ పక్షమంతా పోయి బలవిహీనుడవవుతావు. ఆ స్వయంభువు ధర్మవర్షం వర్షించడం ఆరంభిస్తే ఎక్కడికి వెళ్ళాలో, ఏమి చేయాలో నీకు తెలియకపోతుంది.)

ఈ సంచోదన గాథలవల్ల పాపి అయిన మారునికి సంచోదనం కలిగి, ముప్పైరెండు విధాల స్వప్నం వచ్చింది. ఆ ముప్పైరెండు విధాల

స్వప్నం ఎలాటిదంటే - తన భవనం అంధకారావృతమయినట్టు, తన భవనం దుమ్ముకొట్టుకొని గులకరాళ్ళు పరచినట్టు, తాను భయపడి పదిదిక్కులకూ పరిగెత్తి పోతున్నట్టు, తన కిరీటం పడి నాశనమైపోయినట్టు, తన కుండలాలు జారిపోయినట్టు, తన పెదవులు. దవడలు, గొంతు ఎండిపోతున్నట్టు, తన హృదయం మండిపోతున్నట్టు, తన ఉద్యానాలు పత్రపుష్పవిహీనములయినట్టు, నీరు వట్టి ఎండిపోయిన పుష్కరిణులను చూచినట్లు, హంస క్రౌంచ మయూర కలవింక కుణాల జీవంజీవాది పక్షుల రెక్కలు పూడిపోయినట్టు, భేరీశంఖ మృదంగ పటహ తూణవ వీణా వల్లక్యాది వాద్యాలు, వాద్యభాండాలు పగిలి ఛిన్నాభిన్నమై భూమిపై పడినట్టు, తనను వదలి ప్రియజన పరివారాలు దీనంగా ఏకాంత ప్రదేశంలో కూర్చుని ఆలోచిస్తున్నట్లు, తన అగ్రమహిషి అయిన మారిణి శయనంనుంచి కింద పడి రెండు చేతులతో తల బాదుకుంటున్నట్లు, వీర్యవత్తములు, బలవత్తములు తేజోవత్తములు ప్రజ్ఞావత్తములు అయిన తన కుమారులు బోధిమండగతుడైన బోధిసత్త్వునికి నమస్కరిస్తున్నట్టు, తన కుమార్తెలు 'తండ్రీ, తండ్రీ' అని అరుస్తున్నట్టు, తాను మురికిగుడ్డ కట్టుకున్నట్టు, తలనిండా దుమ్ము పడి దేహమంతా పాండువర్ణమయిపోయి ఓజస్సు తొలగినట్టు, తన హర్మ్యకూటాగార గవాక్ష తోరణాలు దుమ్ముకొట్టుకొని పడిపోతున్నట్టు, తన సేనాపతులయిన యక్షరాక్షస కుంభాండ గంధర్వాధిపతులు నెత్తిమీద చేతులు పెట్టుకొని ఏడుస్తూ పరిగెత్తి పోతున్నట్టు, కామావచర దేవాధిపతులయిన ధృతరాష్ట్ర విరూఢక విరూపాక్ష వైశ్రవణ శక్ర సుయామ సంతుషిత సునిర్మిత వసవర్తి ప్రభృతులు బోధిసత్త్వాభిముఖులై అతనికి శుశ్రూష చేస్తున్నట్టు, రణమధ్యంలో తన కత్తి ఒరనుంచి రానట్టు, తాను అమంగళంగా అరుస్తున్నట్టు, తన పరివారమంతా తనను వదలిపోయినట్టు, ద్వారంలోని మంగళపూర్ణకుంభాలు పడిపోయినట్టు, బ్రాహ్మణుడైన నారదుడు అమంగళ శబ్దాలు పలుకుతున్నట్టు. దౌవారికుడైన ఆనందితుడు ఆనందకరాలు కాని మాటలు పలుకుతున్నట్టు, గగనతలమంతా అంధకారాకులమయినట్టు, కామభవన నివాసిని అయిన లక్ష్మి ఏడుస్తున్నట్టు, తన ఐశ్వర్యమంతా లుప్తమైనట్టు, తన పక్షమంతా తనకు ఎదురు తిరిగినట్టు, మణి ముక్తాహారాలన్నీ తెగి చిందరవందరగా పడి



ఉన్నట్టు, తన భవనమంతా చలించి పోయినట్టు, చెట్లు నరికివేయగా కూలిపోతున్నట్టు, తన సేన అంతా తనముందే కూలిపోతున్నట్టు కలగన్నాడు.

మారుడు ఈ విధంగా ముప్పై రెండు విధాల కలగనీ, వెంటనే మేల్కొని, భయపడి, ఆవేదనపడి, ఉద్విగ్నపడి, తన భవనంలోని పార్షద, సేనాపతి, దౌవారికులను, తక్కిన వారిని వెంటనే సమావేశపరచి, కొన్ని గాథలు అన్నాడు. వాటి భావమిది :

"నాకు అంతరిక్షంనుంచి కొన్ని గాథలు వినిపించాయి. శాక్యులలో వరలక్షణ చిత్రితాంగుడుగా పుట్టినవాడొకడు ఆరుసంవత్సరాలపాటు ఘోరమైన వ్రతాలు చేసి, బోధిద్రుమం ఆశ్రయించాడు. కనుక సన్మార్గానికి యత్నం చేయి. ఆ బోధిసత్త్వుడు విబుద్ధుడయితే, కోటానకోటి ప్రాణులకు బోధను కలిగిస్తాడు— అని ఆ గాథలు తెలిపాయి. ఆయన ప్రపంచానికంతా శాంతి చేకూర్చే అమృతత్వం పొందాడా, నా భవనమంతా శూన్యమైపోతుంది. కనుక మనమంతా గొప్ప బలంతో అతనివద్దకు వెళ్ళి, ద్రుమరాజంకింద కూర్చున్న ఆ శ్రమణునిపై దెబ్బతీద్దాము. నాకు మీరు ప్రియం చేయదలిస్తే, త్వరగా చతురంగ సైన్యం సిద్ధపరచండి. ఇదివరకే ప్రత్యేకబుద్ధులు, అర్హతులు లోకంలో నిండి ఉన్నారు. అతడు ధర్మరాజయితే జినవంశం లెక్కకు మీరి వృద్ధి పొందుతుంది. ఇక ఎప్పటికీ నశించదు. నా బలం నీరసమయిపోతుంది."

పాపి అయిన మారుని మాటలు విని సార్థవాహుడనే మారపుత్రుడు ఇలా కొన్ని గాథలు అన్నాడు. ఆ గాథల తాత్పర్యమిది :

"తండ్రీ, ఎందుకు ముఖం విన్నబోయింది? వివర్ణమయింది? ఎందుకు అంతగా గుండె కొట్టుకుంటున్నది? ప్రతి అంగమూ ఎందుకు అంతగా బాధపడుతున్నది? వినరానిది ఏమి విన్నావు? చూడరానిది ఏమి చూచావు? విన్నదీ, కన్నదీ చెప్పు, తత్వం తెలుసుకుని, దానికి తగిన ప్రయోగం చేద్దాము."

మారుడు దానిని విని "వత్సా, పాపిష్ఠమైన, ఘోరమైన, పరమ భయంకరమయిన స్వప్నం చూచాను. ఆ విషయాలన్నీ నేను పరిషత్తులో తెలిపితే, మీరంతా భూమిపై పడి మూర్ఛపోతారు" అన్నాడు.

సార్థవాహుడు “రణకాలం సంప్రాప్తమయినప్పుడు జయం కలిగితే సరే, దోషం లేదు. రణంలో మరణం సంభవిస్తే దోషమే. స్వప్నంలో నీకు ఇలాటి అపశకునాలు కనిపించి ఉన్నట్టయితే రణాన్ని ఉపేక్షించడం మంచిది. రణంలో పరాజయం పొందడం ఎందుకు?”

మారుడు: “వ్యవసాయ బుద్ధి గల పురుషుడు యుద్ధంలో ప్రయత్నించడం అవసరం. అప్పుడు ప్రసిద్ధి వస్తుంది. ధైర్యంతో ప్రయత్నించడం అవసరం. జయం లేకపోయినా సుకృతమే. పరివార సహితుడనైన నా దృష్టిపడినవానికి లేచే శక్తి కూడా ఉంటుందా? వాడు నా పాదాలపై పడవలసిందే కదా!”

సార్థవాహుడు: “మనబలం చాల విస్తారమయినదే. కాని, చాల దుర్బలమయినది. వాడేమో రణంజయుడైన ఏకైక శూరుడు. మిణుగురు పురుగులు మూడువేలున్నా, ఒక్క సూర్యుని ముందు వెలవెలపోతాయి. అంతేకాక, ఎవనికైతే మానం, మోహం, మీమాంస లేవో, అట్టివాడు విలోముడయితే (పెడదారిపడితే) విద్వాంసులు కూడా వానిని చక్కజేయలేరు.”

భిక్షువులారా, సార్థవాహుడు ఇలా చెప్పినా, పాపి అయిన మారుడు వినక, గొప్ప చతురంగబలం సమకూర్చాడు. ఆ సేన మహా బలవంతులు, రణనిపుణులు అయిన మహాశూరులతో నిండిపోయింది. ఆ సేన విషయం తలచుకొంటేనే దేహం గగుర్పాటు చెందుతుంది; దేవతల రూపంలోను, మనుష్యులరూపంలోను, వివిధ వికారముఖాల వారితోను భయానకంగా ఉంది. ఆ సేన అనే రాక్షసి కాళ్ళు చేతులు సహస్రానేక భుజంగాలు చుట్టుకున్నట్లు, ఖడ్గం, ధనుస్సు, బాణాలు, శక్త్యాయుధాలు, తోమరాలు, కుఠారాలు, పట్టిసాలు, భుసుండ్యాయుధాలు, ముసల దండ ప్రాశ గదా చక్ర వజ్ర కణయాది ఆయుధాలు ధరించినట్టు, అభేద్యమైన కవచాలు ధరించినట్టు, పెద్దతల, చేతులు, కండు కలదైనట్టు, మండుతున్న శిరస్సు, నయనాలు, వదనం కలదయినటు, కడుపు కాళ్లు చేతులు విపరీతంగా పెద్దవై వికారంగా ఉన్నట్టు, ముఖం మండిపోతున్నట్టు, పరమ వికారమైన ముఖము కలదయినట్టు, కరాళ వికృతదంష్ట్రిలు కల్గివున్నట్టు,



వేలాడుతున్న పెద్ద పొడుగాటి నాలుక ఉన్నట్లు, తొండంలాంటి నాలుక కలిగినట్టు, నిప్పుతో, నల్లత్రాచు విషంతో మండుతున్న కండ్లు కలదయినట్టు కనిపించింది. సేనలోని కొందరు సైనికులు పాములను కక్కేవారు, కొందరు చేత్తో పాములు పట్టుకొని తినేవారు. కొందరు సముద్రంనుండి గరుడి ఎగిరినట్టు, ఎగిరి మానవుల మాంసాన్ని, రక్తాన్ని, కరచరణాలను, శిరస్సును, కాలేయాన్ని, పేగులను, పురీషాన్ని తినేవారు. కొందరు మండిపోతున్న పచ్చ రంగులోను, నల్లగానూ, నీలంగానూ, ఎర్రగాను, కద్రుకరాళ రూపాలతోను ఉండేవారు. కొందరికడతలు వికారంగా ఉండేవి. కొందరి కనుబొమలు మండుతూ, పెకలించుకొని వస్తున్నట్లు ఉండేది. కొందరికండ్లు మండుతూ, గిరగిర తిరుగుతూ పరమ వికారంగా ఉండేది. కొందరు మండుతున్న కొండలను చేత్తో పట్టుకొని వేరే పర్వతాలపై విసురుతూ వచ్చేవారు. కొందరు వేళ్ళతో కూడా చెట్లను పెకలించి, బోధిసత్త్వునికి అభిముఖంగా పరుగెత్తేవారు. కొందరు మేకచెవులవారు, చేటచెవులవారు, ఏనుగుచెవులవారు, పందిచెవులవారు, వేలాడుతున్న చెవులవారు. కొందరికి చెవులు లేవు. కొందరికడుపు పెద్దది. దేహం దుర్బలం. కొందరు ఎముకలగూడువంటివారు. కొందరు చప్పిముక్కువారు. కుంభోదరులు, కరోటపాదులు, చర్మమాంసాలూ, రక్తం ఎండిపోయినవారు, చెవులు తెగినవారు, ముక్కు తెగినవారు, పగిలిన చేతులు, కాళ్ళు, కండ్లు, తల గలవారు. కొందరేమో రక్తపిపాసతో ఒకరి తలలు ఒకరు నరుక్కునేవారు. బొంగురు గొంతువారు, వికారధ్వనివారు, భయంకరధ్వనివారు, రూక్షస్వరులు. వీరంతా ‘ఫూ! ఫూ!’, ‘పిచ్! పిచ్!’ ఫులు! ఫులు! అని మరికొన్ని విధాలుగానూ కేకలు వేయసాగినారు. కొందరేమో “తీసుకొని రండి! చంపండి! కొట్టండి! లాక్కొని రండి! పట్టుకొండి! కట్టివేయండి! చీల్చండి! పగులగొట్టండి! తొక్కండి! విసిరివేయండి! నలిపివేయండి, అబోధివృక్షంతోపాటు గౌతమశ్రమణుని” అంటూ కేకలు వేశారు. కొందరు భేరుండకం, నక్క, పంది, గాడిద, ఎద్దు, ఏనుగు, గుర్రం, ఒంటె, ఖరం, ఎనుము, కుందేలు, చమరమృగం, ఖడ్గమృగం, శరభం మొదలయినవాటి ముఖాలతో వికారంగానూ, భయంకరంగానూ కనుపించేవారు. సింహం, వ్యాఘ్రం, ఎలుగుబంటి, పంది,

కోతి, ద్వీపి, పిల్లి, మేక, గొర్రె, పాము, ముంగిస, చేప, మొసలి, శింశుమారం, తాబేలు, కాకి, గద్ద, గుడ్లగూబ, గరుడి మొదలయిన వాటి స్వభావం గలవారు, వికృతరూపులు, ఒంటితలలవారు, రెండుతలలవారు, ఇలాగే వేయివరకు తలలు గలవారు, తలలు లేనివారు, ఒకభుజం గలవారు, వేయివరకు భుజాలు గలవారు, భుజాలు లేనివారు, ఒంటిపాదంవారు, వేయివరకు పాదాలు గలవారు, పాదాలు లేనివారు, చెవి, ముఖం, ముక్కు, కన్ను, బొడ్డు, రోమకూపాలునుంచి పాములు కక్కేవారు, వివిధాయుధాలను తిప్పుతూ నృత్యం చేస్తూ బోధిసత్త్వుని దగ్గరకు వచ్చి భయపెట్టసాగారు. కొందరు మానవుల వేళ్ళు నరికి దండగా గుచ్చి మెడలో వేసుకున్నారు. కొందరు తలలు, ఎముకలు, పుర్రెలు, దండలు గుచ్చి వేసుకున్నారు. ఒళ్ళంతా పాములు చుట్టుకున్నవారు, కపాలం చేతితో పట్టుకొని ఏనుగు, ఒంటె, వృషభం, గాడిద, మహిషం ఎక్కినవారు, తలకింద కాళ్ళుపైన ఉన్నవారు, సూదులవంటి రోమాలుగలవారు, ఆవు, గాడిద, పంది, ముంగిస, మేక. గొర్రె, కుక్క, కోతి, నక్క, తోడేలు రోమాలు గలవారు, పాములను కక్కుతున్నవారు, ఇనుపముద్దలను కక్కుతున్నవారు, ధూమకేతువులను సృష్టించేవారు, మండుతూన్న రాగి, ఇనుము వర్షం కురిపిస్తున్నవారు, మెరుపులవర్షం కురిపిస్తున్నవారు, పిడుగులు కురిపిస్తూ, మండే ఇనుప ఇసుకను కురిపిస్తూ, కాలమేఘాలు సృష్టిస్తూ, గాలివానలు సృష్టిస్తూ, బాణవర్షం కురిపిస్తూ, కాళరాత్రి కలుగజేస్తూ, పెద్ద ధ్వనిచేస్తూ బోధిసత్త్వునివైపు పరుగులు తీశారు. కొందరు పాశాలు తిప్పుతూ, పెద్ద పర్వతాలు విసిరివేస్తూ, మహాసాగరాలను కలవరపరుస్తూ, మహాపర్వతాలు దాటుతూ, పర్వతరాజమయిన మేరువును కంపింపజేస్తూ, పరుగెత్తుతూ అంగాలు ఎగురవేస్తూ, ఒళ్లు తిప్పుతూ, పెద్దగా నవ్వుతూ, రొమ్ము కొట్టుకుంటూ, రొమ్ములు పగులకొట్టుకుంటూ, సిగలు విదిలించుకుంటూ, పచ్చని ముఖాలు నల్లని శరీరాలతో. మండుతున్న తలలు, ఊర్ధ్వకేశాలతో, ఇటూ అటూ పరుగెత్తుతూ బోధిసత్త్వుని బెదరగొట్టడానికి ప్రయత్నించారు. ముసలి స్త్రీలు ఏడుస్తూ బోధిసత్త్వునివద్దకు వచ్చి ‘‘అయ్యో నాయనా! హా! నా కుమారా! లే! లే! త్వరగా పరుగెత్తి పో’’ అని అనసాగినారు. రాక్షస రూపులు, పిశాచ రూపులు, గుడ్డివారు, కుంటి



వారు, దుర్బలాంగులు అయిన ప్రేతలు ఆకలితో కన్నులు గుంటలుపడగా, చేతులెత్తుకొని వికార ముఖాలతో ఏడుస్తూ, భయం కలిగిస్తూ, బోధిసత్త్వుని ఎదుట పరుగెత్తసాగినారు. ఈ విధమైన మారసేన ఎనభై యోజనాల వెడల్పు వ్యాపించింది. పైని, కింద కూడా ఈ పాపి అయిన మారుని సేన వ్యాపించింది.

భిక్షువులారా, మారుని వేయిమంది పుత్రులలోను సార్థవాహుడు మున్నగా గలవారు మారునికి కుడిభాగంలోను, తక్కినవారు ఎడమ పక్కను చేరారు. అప్పుడు పాపి అయిన మారుడు ‘‘ఎలాటి బలంతో మనం బోధిసత్త్వుని భయపెడుదాము?’’ అని కుమారులతో ఆలోచించాడు. కుడిపక్కను ఉన్న సార్థవాహుడనే కుమారుడు తండ్రికి ఒక గాథతో సమాధానం చెప్పాడు. దాని తాత్పర్యమిది:

‘‘తండ్రీ! నీవు, పడుకున్న పన్నగేంద్రుని మేల్కొలుపజూస్తున్నావు. పడుకున్న గజేంద్రుని మేల్కొలుప జూస్తున్నావు. పడుకున్న మృంగేంద్రుని మేల్కొలుప జూస్తున్నావు. అలాగే పడుకున్న ఈ నరేంద్రుని మేల్కొలుపజూస్తున్నావు’’ అని.

ఎడమపక్క ఉన్న దుర్మతి అనే కుమారుడు ‘‘నా దృష్టి పడగానే, మహావృక్షాలలో శ్రేష్ఠమయినవికూడా కూలిపోతాయి. అలాటి నా దృష్టి పడినవానిని మృత్యుహతుని బతికించడానికి ఎవరికి శక్తి ఉన్నది?’’ అన్నాడు.

కుడిపక్క ఉన్న మధురనిర్ఘోషుడనేవాడు ‘‘పెద్ద పెద్ద మానులనే కూల్చివేయగలను. ఇక మనుష్యుల సంగతి చెప్పాలా? నా చూపులతో మేరుగిరిని కూడా భేదించగలను. కాని, సముద్రాన్ని భుజాలతో ఈదడం, సముద్రజలాన్ని తాగడం పాధ్యం గాగలవు కాని, ఈ శాక్యమునిని చూడడానికే సాధ్యం కావడంలేదు’’ అన్నాడు.

ఎడమవైపున ఉన్న శతబాహువనేవాడు ఇలా అన్నాడు: ‘‘నాకు నూరుచేతులున్నాయి. ఒక్కొక్కచేత్తో వందబాణాలు ప్రయోగించగలను. ఈ శ్రమణుని దేహాన్ని కూల్చివేస్తాను. నీవు సుఖంగా వెళ్ళిపో. అలసించవద్దు.’’

కుడిపక్కలోని సుబుద్ధి ఇలా అన్నాడు: "నూరు భుజా లెందుకు? ఉండి ఏమి ప్రయోజనం? అని రోమాలవంటివి. ఒక్కొక్క భుజం ఒక్కొక్క శూలంవలె ఉన్నా అతనిని ఏమీ చేయలేవు. ఎందుకంటే- ఆ ముని దేహానికి విషంకాని, శస్త్రంకాని, నిప్పుకాని అంటదు. ఎందుకంటే-అతడు మైత్రీపూర్ణుడయిన ముని. అతని శరీరంపై వేసిన బాణాలు పూవు లవుతాయి. అతని మైత్రీగుణం లోకోత్తర స్వభావం గలది. అంతేకాక, దేవలోకంలోను, మనుష్యలోకంలోను బలాఢ్యులయినవారు, ఖడ్గం, పరశువు మొదలయిన ఆయుధాలు ధరించినవారు, మహాబలవంతులు, గుహ్యకులయినా సరే, మానవులయినా సరే, క్షమాబలుడయిన ఈ నరేంద్రునివద్దకు రాగానే, అల్పబలు లవుతారు."

ఎడమవైపున ఉన్న ఉగ్రతేజుడనేవాడు "దావాగ్ని వృక్షంలో దూరి కాల్చివేసేటట్టు నేను ఈతని శుభశరీరంలో ప్రవేశించి ధ్వంసం చేస్తాను" అన్నాడు.

కుడిపక్క ఉన్న సునేత్రుడు ఇలా అన్నాడు: "నీవు మేరుపర్వతాన్ని పూర్తిగా కాల్చివేయగలవు. భూమిలో ప్రవేశించి, దానినన్నా కాల్చివేయగలవు. అయితే నీబోటి వాలికగంగాసదృశులు (గంగానది ఇసుకరేణువువంటివారు) ఆ వజ్రబుద్ధిని ఏమీ చేయలేరు. ఈ పర్వతాలన్నీ చలించిపోవచ్చు. మహాసముద్రం ఇంకిపోవచ్చు. చంద్రసూర్యులు భూమిపై పడవచ్చు. భూమి నశించిపోవచ్చు. అయినా లోకహితంకోసం కృతప్రతిజ్ఞుడైన ఈ ముని శ్రేష్ఠమయిన బోధిని సంపాదించి గాని ఈ వృక్షరాజమూలంనుంచి లేవడు."

ఎడమవైపు ఉన్న మహాగర్వి దీర్ఘబాహుడు "నేను నా ఇంట్లో కూర్చునే, చంద్రసూర్యులను, నక్షత్రాలను లోకాలను చేత్తో నలిపివేస్తాను. నాలుగు సముద్రాల నీటిని అతిసులభంగా ఏకం చేసివేయగలను. తండ్రీ! ఆ శ్రమణుని పట్టుకుని సముద్రాలకు అవతల పారవేస్తాను. ఈ సేన అలా ఉండనీ. నీవు దుఃఖపడవద్దు. ఈ బోధివృక్షాన్ని వేళ్ళతోకూడా పెకలించి పది దిక్కులకు విసిరివేస్తాను" అన్నాడు.



కుడివైపున ఉన్న ప్రసాదప్రతిలబ్ధుడనేవాడు ఇలా అన్నాడు: "నీవు దేవాసుర గంధర్వ సాగర నగసహితమైన ఈ భూమిని మదగర్వంతో ముద్ద చేయవచ్చు. అలా చేయగలవారు వేయిమందైనా ఆ మహామతి అయిన బోధిసత్త్వుని రోమంకూడా కదిలించలేరు. వారు అతనివద్ద గంగఇసుకరేణువువంటివారు."

ఎడమవైపున ఉన్న భయంకరుడనేవాడు ఇలా అన్నాడు: "తండ్రీ! నీవెందుకు అలా భయపడుతావు? సేన మధ్యను ఉన్నావు. అతనికి సేన లేదు. ఇక సహాయపడేవా రెవరు? నీకు మరి భయ మెందుకు?"

ఆ మాటలు విని కుడివైపున ఉన్న ఏకాగ్రమతి "చంద్రసూర్యులకు సేన లున్నాయా? సింహానికి సైన్య ముందా? బోధిసత్త్వులకూ సైన్యమనేది ఉండదు. అతడు ఒక్కడే నముచిని నాశంచేయగలడు" అన్నాడు.

ఎడమవైపునఉన్న అవతారప్రేక్ష్యుడనేవాడు ఇలా అన్నాడు: "శూలం లేదు. శక్తి లేదు. ఖడ్గం లేదు. ఏనుగులు లేవు. గుర్రాలు లేవు. రథాలు లేవు. పదాతి లేదు. ఆ చెట్టుకింద కూర్చున్న పిప్పలి అంత-కాసంత శ్రమణుని ఇట్టే చంపేస్తాను. తండ్రీ కొంచెం కూడా భయపడకు."

కుడిప్రక్క వున్న పుణ్యాలంకారుడనేవాడు ఇలా అన్నాడు: "తండ్రీ! అతని శరీరం నారాయణుని శరీరంలాగ అభేద్యమైంది. అతనికి క్షాంతి అనేది కవచం. వీర్యమనేది ఖడ్గం. త్రివిమోక్షమనేది వాహనం. ప్రజ్ఞ అనేది ధనుస్సు. అతడు పుణ్యబలంతో మారుని సేనను జయిస్తాడు."

ఎడమవైపున ఉన్న అనివర్తి అనేవాడు ఇలా అన్నాడు: "గడ్డిని అంటుకున్న నిప్పు ఇక మరలిపోనట్లు నా బాణం కూడా ఒక్కమారు పడితే వెనుతిరగదు. ఆకాశంనుంచి పడిన పిడుగు మళ్ళిపోతుందా? శాక్యకుమారుని జయించలేకపోతే ఇక నాకు చోటేది?"

కుడివైపున ఉన్న ధర్మకాముడనేవాడు ఇలా అన్నాడు: "పచ్చిగడ్డి అయితే నిప్పు మండదు. కొండ అడ్డమయితే బాణం వంగి తిరిగిపోతుంది. పిడుగు భూమిని తాకి ఆగిపోతుంది. ఇతడు మృతత్వ శాంతిని పొందేవరకూ మరలి పోడు. తండ్రీ! అంతరిక్షంలో చిత్రాలు గీచడం

సాధ్యమా? అన్నిప్రాణుల మనస్సును ఒకే విధంగా ఉంచడం సాధ్యమా? చంద్రసూర్యులను, వాయువును పగ్గాలతో కట్టివేయడం సాధ్యమా? బోధిసత్త్వుని బోధిమండంనుంచి కదలించడమూ సాధ్యం కాదు.''

ఎడమవైపున ఉన్న అనుపశాంతుడనేవాడు ఇలా అన్నాడు: ''నా దృష్టివిషంతో నేను మేరుపర్వతాన్నికూడా కాల్చి కరగించివేస్తాను. సముద్రాల నీటిని కూడా ఇంకేట్టు చేస్తాను. తండ్రీ! ఈ బోధివృక్షాన్ని, శ్రమణుని భస్మంచేస్తాను.''

కుడివైపున ఉన్న సిద్ధార్థుడు అన్నదేమిటంటే_''వీని విషంతో ఈ త్రిసాహస్రమైన లోకాలు మండిపోయేటట్టయితే, ఆ గుణాకరుని చూపుతో వెంటనే విషం విరిగిపోతుంది. విషాలతో ఉగ్రమైన రాగ దోష మోహాలు అతని మనస్సుకూ, దేహానికీ అంటవు__ఆకాశానికి బురద అంటనట్టు. కనుక తండ్రీ! మరలిపోదాము'' అని.

ఎడమవైపున ఉన్న రతిలోలుడనేవాడు ఇలా అన్నాడు: ''నేను తూర్యసహస్రనాదాలతోను, అలంకరించుకొన్న అప్సరసలతోను, ఇతనిని ప్రలోభింపజేస్తాను. నీ అధీనంలో అతనికి కామరతిని కలిగిస్తాను.''

కుడివైపున ఉన్న ధర్మరతి ఇలా అన్నాడు: ''బోధిసత్త్వుని మనస్సు సదా ధర్మరతమైనది. ఆయనఇష్టమంతా ధ్యానంలోను, అమృతత్వ సంపాదనలోను, ప్రాణులను తరింపజేయాలనే మైత్రిలోను లగ్నమై ఉంది. కనుక అతడు రాగరతుడు కాడు.''

ఎడమవైపున ఉన్న వాతజవుడనేవాడు ఇలా అన్నాడు: ''నేను నా వేగంతో, బలంతో చంద్రసూర్యులను, ఆకాశంలో వీచే వాయువును మీరిపోగలను. తండ్రీ! నేను ఈ శ్రమణుని బల్లెపు పిడిని పట్టుకున్నట్టు పట్టుకొని గాలిలోకి విసిరివేస్తాను.''

కుడివైపున అచలమతి అనేవాడు ఇలా అన్నాడు: ''నీ ఉగ్రమైన జవసత్త్వాలు, సురమానవుల జనవేగాలు మొత్తమై కూడా ఆ పుంగలునికి బాధ కలిగించలేవు.''



ఎడమవైపున ఉన్న బ్రహ్మమతి ఇలా అన్నాడు: ''ఇలాటి శ్రమణుల గుంపులుకూడా నిన్ను ఏమీ చేయలేవు. వీడు ఒక్కడూ ఏమి చేస్తాడు? సమూహమైతే సర్వకార్యాలూ సాధించగలదు.''

కుడివైపున ఉన్న సింహమతి ఇలా అన్నాడు: ''లోకంలో సింహాలు గుంపులుగుంపులుగా ఉండవు. పాములు గుంపులు గుంపులుగా ఉండవు. తేజస్వులు, సత్యపరాక్రములు అయిన పురుషోత్తములు కూడా గుంపులు గుంపులుగా కనిపించరు.''

ఎడమవైపున సర్వచండాలుడనేవాడు ఇలా అన్నాడు: ''తండ్రీ! నీ కుమారుల మాటలలాగా నీ మాటలు గర్జనలు వారు వినలేదు. వీర్యవేగ బలాలతో ఆ శ్రమణుని చంపడానికి బయలుదేరుదాము.''

కుడివైపున సింహనాదుడనేవాడు ఇలా అన్నాడు: ''అరణ్యంలో నక్కలు ఎన్నో ఊళపెడతాయి. అని సింహంచెవిలో పడవు. సింహం భయంకరంగా ఒక్కమారు గర్జించేవేళకు నక్కలు పది దిక్కులకూ పరుగెత్తుతాయి. ఈ మారపుత్రులుకూడా ఆ నక్కలలాగ అవివేకులు. ఆ పురుషోత్తముని నాదం విననంతవరకూ గంతులు వేస్తున్నారు, గర్వంగా అల్లరిచేస్తున్నారు. ఆ మనుష్యసింహుని గొంతు విన్నారా, ఇక కనిపించరు.''

ఎడమవైపున ఉన్న దుశ్చింతితచింతి అనేవాడు ఇలా అన్నాడు: ''నేను అనుకున్నది త్వరగా జరిగిపోతున్నది. మరి వీడు నా చూపులకు ఆగుతాడా? వీడు మూఢుడు. అవివేకి. లేచి త్వరగా ఎందుకు పరుగెత్తడు?''

కుడివైపునుంచి సుచింతితార్థుడనేవాడు ఇలా అన్నాడు: ''ఇతడు మూఢుడుగాని, పరాక్రమం లేనివాడుగాని కాడు. మీరే మూఢులు, సంయమం లేని వారూను. మీకు ఇతని వీర్యంసంగతి తెలియదు. ఇతని ప్రజ్ఞాబలంతో అందరూ జయింపబడినారు. గంగ ఇసుకరేణువులు ఎలాటివో మారాత్మజులమైన మనమూ అలాటివారమే, ఇతని పరాక్రమం ముందు. ఇతని రోమం కూడా కదలించలేమన్నప్పుడు కొట్టడమనే విష

యమే లేదు. కనుక మీరు మనస్సును పాడుచేసుకోవద్దు. ప్రసన్నచిత్తులై గౌరవంతో తిరిగి వెళ్ళిపోండి. యుద్ధం చేయకండి. ఇతడు త్రిభువనాలకూ రాజు.''

ఈ విధంగా వేయిమంది మారపుత్రులు శుక్లపక్షీయులు, కృష్ణపక్షీయులు విడివిడిగా పాపిష్ఠుడైన మారునితో పేయాలం వరకు అన్నారు.

పాపిష్ఠుడైన మారుని సేనాని భద్రసేనుడనేవాడు మారునితో కొన్ని గాథలన్నాడు. ఆ గాథల భావమిది: ''నిన్ను అనుసరించివచ్చే ఇంద్రుడు, లోకపాలకులు, కిన్నరులు, అసురేంద్రులు, గరుడేంద్రులు అంజలి ఘటించి అతనికి నమస్కరిస్తున్నారు. నీ వెంట రాని బ్రహ్మ, భాస్వరులైన సురపుత్రులు, శుద్ధావాసకాయికులైన దేవతలు అందరూ అతనికి నమస్కరిస్తున్నారు. మేధావులు, బలవంతులు అయిన నీ కుమారులు బోధిసత్త్వుని మనసారా నమస్కరిస్తున్నారు. ఈ మారసేన ఎనభై యోజనాలవరకూ వ్యాపించింది. యక్షాదులంతా ఎంతో ఉత్కంఠతో చూస్తున్నారు. ఇంతటి భయంకరము, వికృతము అయిన సేనను చూచినప్పటికీ, ఇతడు ఆశ్చర్యపడలేదు. కదలలేదు. మెదలలేదు. కనుక ఇతనికే జయం కలగడం నిశ్చయం. మన ఈ సేన ఉన్న ప్రాంతంలో గుడ్లగూబలు, నక్కలు అరుస్తున్నాయి. కాకుల, గాడిదల ఏడుపులు వినబడుతున్నాయి.కనుక మనం త్వరగా తిరిగి వెళ్ళిపోవడం మేలు. బోధిమండం పై క్రౌంచ హంస కోకిల మయూరాలు దక్షిణాభిముఖంగా తిరుగుతూ శబ్దంచేస్తున్నాయి. కనుక ఇతనికి జయం తప్పదు. మనసేన ఉన్నప్రాంతంలో మసి, దుమ్ము కురుస్తున్నాయి. బోధిమండం ఉన్నచోట పుష్పవర్షం కురుస్తున్నది. కనుక నామాట విను. వెనుకకు మళ్ళిపో. మన సైన్యం ఉన్నచోట ముండ్లు, ఎముకలు చిందరవందరగా పడి ఉన్నాయి. బోధిమండం ఉన్న ప్రాంతం స్వర్ణమయం. కనుక బుద్ధిమంతులయిన వారు తిరిగిపోవడం మంచిది. మనం తిరిగి వెళ్ళకపోతే ఋషులు దేశాలను కోపంతో నాశం చేసినట్టు; ఇతడు మన సైన్యాన్నికూడా ధ్వంసం చేస్తాడని కలగూడా కన్నాము.ఋషి అయిన బ్రహ్మదత్త మహారాజు కోపించుకొనేసరికి దండకాటవి కాలిపోయి,కొన్ని సంవత్సరాలవరకూ గడ్డికూడా



మొలవలేదు. ఇతడు తపోయుక్తులు, వ్రతచారులు అయిన ఋషులందరికీ నాయకుడు. ఏ ప్రాణినీ హింసించేవాడు కాడు. ఇతడు సర్వలక్షణ యుక్తుడనడం నీకు తెలియదా? ఇతడు ఇంటినుంచి బయలువెడలి కష్టాలు జయించి, బుద్ధుడవుతాడు. జినసుతులు పూజకోసం నిర్మించిన ఇలాటి విభవాన్ని ఇతడు తప్పక పొందుతాడు. ఇతని భ్రూమధ్యంలోని ఊర్ణ (సుడి) కొంచెం వంకరయింది. కనుక ఇతడు తప్పక మన బలం ధ్వంసం చేస్తాడు. ఇతని శిరస్సును దేవతలుగాని, భవసాగరంలో కొట్టుకొనేవారుగాని చూడలేరు. కనుక ఇతడు ఇతరుల ఉపదేశం లేకనే, సర్వజ్ఞత్వం పొందుతాడు. మహీమండలాన్ని చంద్రసూర్యులు, ఇంద్రుడు, బ్రహ్మ, నమస్కరిస్తున్నారు. వృక్షాలు, పర్వతాలు, మేరువు, చక్రవాళం, అవీ నమస్కరిస్తున్నాయి; గనుక ఇతడు పుణ్యబలం, ప్రజ్ఞాబలం, జ్ఞానబలం, క్షాంతిబలం, వీర్యబలం కలవాడు. తప్పక సముచిబలాన్ని బలహీనం చేస్తాడు. ఏనుగు పచ్చికుండలను ఏ విధంగా తొక్కివేస్తుందో, నక్కలను సింహం ఏ విధంగా ధ్వంసంచేస్తుందో, మిణుగురు పురుగులను సూర్యుడు ఏవిధంగా కాంతిహీనం చేస్తాడో ఆ విధంగానే, సుగతుడు మన సైన్యం గెలుస్తాడు.''

సేనాపతి మాటలు విని మరొక మారపుత్రుడు కోపంతో కండ్లు ఎఱ్ఱబారగా, ''నీవు ఈ ఒక్కనిని మహా అతిగా వర్ణిస్తున్నావు. ఒక్కడు ఏమి చేస్తాడయ్యా? మనం మహా బలవంతులము, భయంకరులము అన్న సంగతి తెలియదా?'' అని కసురుకున్నాడు.

దక్షిణదిక్కునుంచి మారప్రమర్ధకుడనే మారపుత్రుడు ఇలా అన్నాడు: ''సూర్యునికి లోకంలో ఎవరైనా సహాయకులు ఉన్నారా? చంద్రునికి, ఆరణ్యాచక్రవర్తి అయిన సింహానికి ఎవరైనా సహాయకులున్నారా? అలాగే బోధినిషణ్ణుడై కృతనిశ్చయుడైన బోధిసత్త్వునికి సహాయం ఏమీ అవసరం లేదు.''

అప్పుడు బోధిసత్త్వుడు మారుని దుర్బలుని చేయడానికి వికసిత కమలసదృశమైన తనముఖాన్ని అటూ ఇటూ తిప్పి చూచాడు. దానిని చూచి మారుడు పరుగెత్తసాగాడు. 'నా సేన బోధిసత్త్వుని ముఖంలో

అణగిపోయింది'అనుకుంటూ పరుగెత్తుతూ, మరల తిరిగి పరివారంతోపాటు వివిధాయుధాలు బోధిసత్త్వునిపై వదిలాడు. సుమేరువంతటి పర్వతాలు బోధిసత్త్వునిపైపడి పూవులు వర్షించే విమానాలయాయి. కంటిలో విషం, శ్వాసంలో విషం ఉన్న సర్పాలు వదిలే విషాగ్ని బోధిసత్త్వునికి ప్రభా మండలంవలె పరిణమించింది.

తర్వాత బోధిసత్త్వుడు కుడిచేయి ఎత్తి కరతలంతో తల నిమురు కున్నాడు. మారుడు దానిని చూచి, బోధిసత్త్వుని చేతిలో ఖడ్గముందేమో నని మళ్ళీ పరిగెత్తాడు. తిరిగి తేరిపార జూచి ఏమీ లేదనుకుని తిరిగి వచ్చాడు. వచ్చి బోధిసత్త్వునిపై నానావిధాయుధాలు విసిరాడు. ఆయ నపై విసిరిన అపి ధనుః శర శక్తి తోమర పరశ్వధ భుశుండి ముసలకణయ గదా చక్ర వజ్ర ముద్గర పాదప శిలా పాశ_అయోగుడాది భయంకరాయు ధాలు విరిసిన వెంటనే నానావిధ పుష్పమాలికలుగాను, పుష్పగుచ్ఛాలు గాను మారిపోయాయి. విడివిడి పూవులన్నీ భూమిపైన చిందరవందరగా పడి అలంకరించాయి. పూలమాలలయి బోధివృక్షంపై వ్రేలాడుతూ అంద మిచ్చాయి. బోధిసత్త్వుని ఆ వ్యూహాలను, విభూతిని తిలకించి పాపి అయిన మారుడు ఈర్ష్యామాత్సర్యాలు మనస్సులో ముప్పిరిగొనగా, బోధిసత్త్వునితో "ఓ రాజకుమారా, లే, లే, రాజ్యం అనుభవించు. అంత వరకే నీ పుణ్యం. నీకు మోక్షప్రాప్తి ఎక్కడిది?" అని బెదరించాడు.

ఆ మాటలు విని బోధిసత్త్వుడు ధీరగంభీరోదార శ్లక్ష్ణ మధుర వాక్కులతో పాపి అయిన మారుని ఇలా పలుకరించాడు : "ఓపాపిష్ఠుడా, నీవు ఒక్క నిరర్గడ యజ్ఞంచేసి కామేశ్వరత్వం సంపాదించావు. నేను పెక్కు కోటి నయుత శతసహస్ర యాగాలు చేశాను. చేతులు, కాళ్ళు, తల నరికి నరికి యాచకులకు ఇచ్చాను.ప్రాణుల మోక్షం కోరి గృహ ధన ధాన్య శయన వసన చంక్రమోద్యానాలు పెక్కుసార్లు యాచకులకు దానంచేశాను." మారుడు అప్పుడు బోధిసత్త్వునితో ఇలా అన్నాడు: "నేనుపూర్వజన్మలో నిష్కలంకమైన నిరర్గడయజ్ఞం ఆచరించాను. దానికి



నీవే సాక్షి. నీవు చేసిన యజ్ఞాలకు ఎవ్వడూ సాక్షిలేడు. ఇలాటి ప్రలాపం తోనే నీవు పరాజితుడవయావు." అని. "ఓ పాపిష్ఠుడా, నాకు ఈ భూతధాత్రి ప్రమాణం" అని బోధిసత్త్వుడన్నాడు.

తర్వాత బోధిసత్త్వుడు మారుని, మారసేనను మైత్రీకరుణాపూరిత చిత్తంతో చూచి,సింహంవలె ఉండి భయపడక, క్షోభపడక, చలించక, దీనుడు, లీనుడు కాక, సంక్షోభంలేక, ఆందోళనలేక, భయం, గగుర్పాటు లేక, శంఖధ్వజ మీన కలశ స్వస్తిక అంకుశ చక్రాది చిహ్నాలతోను, అందమైన ఎర్రటి గోళ్ళతోను ఒప్పారి, మృదువుగాను, తరుణ సుకు మారంగాను ఉంటూ, అనంతమూ, అపరిమితమూఅయిన కుశలసంభరితమై, గుత్తమూ, సందులులేనిదీ అయిన దక్షిణహస్తంతో ఒళ్ళంతా తడుము కొని, భూమిపై బలంగా కొట్టి

"ఇయం మహీ సర్వజగత్ప్రతిష్ఠా
అపక్షపాతా సచరాచరే సమా,
ఇయం ప్రమాణా మమ నాస్తిమే మృషా
సాక్షిత్వ మస్మిన్ మమ సంప్రయచ్ఛతు."

అని గాథ పలికాడు. దీనిభావ మిది: "సర్వ జగత్ప్రతిష్ఠితమై నది, పక్షపాతం లేనిది, చరాచరాలయెడ సమానమయినది అయిన ఈ భూమే నాకు సాక్షి. ఈ విషయంలో అబద్ధం లేదు. ఆ భూమి నాకిప్పుడు సాక్షిభూత కానీ."

బోధిసత్త్వుడు భూమిని స్పృశించి ఇలాఅనగానే, మహాపృథివి ఆరు వికారాలతో వణికిపోయింది. మొదట చిన్న రణగుణధ్వని, తర్వాత అంత కన్నా పెద్దది, పిదప మరింత పెద్దది అయిన ధ్వని రణించింది. బోధిసత్త్వుడు భూమిని తాకగానే ఎలా ధ్వనించిందంటే మాగధికుల కంచు పాత్రను కర్రతో కొడితే ఎలా రణిస్తుందో అలా.

అప్పుడు ఆ త్రిసాహస్ర మహాసాహస్ర లోకాలలో స్థావర అనే మహాపృథ్వీదేవత కోటీశత పృథివీదేవతా పరివారంతో, సర్వాభరణాలతో

మహా పృథివి నంతా దాటి వచ్చి, బోధిసత్త్వునికి సమీపంలో భూమిని భేదించుకొని సగం దేహంమాత్రం పైకి కనబడేటట్టు లేచి, చేతులు జోడించి, వినమ్రయై ఇలా విన్నవించింది: "ఓ మహాపురుషుడా! నీవు చెప్పినది నిజం. నీవు చెప్పిన దానికి మేము ప్రత్యక్ష సాక్షులము. అంతే కాదు. దేవ సహితమైన ఈ లోకానికి పరమసాక్షీభూతుడివి, ప్రమాణభూతుడివి నీవే!" మహా పృథివీదేవత అయిన స్థావర ఈ విధంగా సాక్ష్యం పలికి పాపియైన మారుణ్ణి పెక్కు విధాల నిందించి, బోధిసత్త్వుని స్తుతించి, తన బహు విధ ప్రభావం చూపి, పరివారంతోపాటు అక్కడే అంతర్థానం చెందింది.

శఠుడైన మారుడు భూదేవత మాటలను విని, గుండె పగిలి సైన్యంతోపాటు అరణ్యంలో సింహనాదం విని నక్కలు పారిపోయినట్టు, మట్టిబెడ్డ విసరగానే కాకులు ఎగిరిపోయినట్లు వెంటనే పరుగుతీశాడు. తర్వాత మారుడు చాల దుఃఖపడినాడు. తన మానం అభిభూతమయిందని సిగ్గుపడుతూ ముందుకు రాలేకపోయాడు; వెనుకకు మళ్ళలేకపోయాడు. ముఖం వెనుకకు తిప్పుకుని, తర్వాత సైన్యాన్ని దగ్గరకి పిలిచి "మీరంతా కలిసికట్టుగా ఒక్కచోట ఉండండి. ఇతడు అనునయంతో మెత్తబడతాడేమో కనుక్కుంటాను. ముహూర్తకాలం వేచి ఉండండి. ఇలాంటి సత్వశాలి నాశంకారాదని సాంత్వనవచనాలతో చెప్పిచూస్తాను" అని అన్నాడు.

పిదప మారుడు తన కుమార్తెలను పిలిపించి "మీరు వెళ్ళండి. బోధి మండానికి వెళ్ళండి. బోధిసత్త్వుడు సరాగుడా, వీతరాగుడా, మూఢుడా, ప్రాజ్ఞుడా, గుడ్డివాడా, దేశజ్ఞుడా, అర్థ పరాయణుడా, దీనుడా, ధీరుడా, కనుక్కోండి" అని ఆదేశించాడు. తండ్రి ఆదేశంపై మారపుత్రికలయిన అప్సరసలు బోధిమండంచేరి, బోధిసత్త్వుని సమీపించి, ఆతనియెదుట నిలబడి, ముప్ఫయి రెండు విధాలయిన స్త్రీమాయను ప్రదర్శించారు. ఆ ముప్ఫయి రెండువికారాలయిన స్త్రీ మాయ ఎలాంటిదంటే-కొందరు ముఖం సగం కనిపించేటట్టు చేలాంచలం కప్పుకున్నారు. కొందరు తమ కఠినోన్నతపయోధరాలను చూపసాగారు. కొందరు చిరునవ్వుతో దంత పంక్తిని సగం కనిపించీ కనిపించనట్టు చూపారు. కొందరు చేతులు పైకెత్తి ఆవులిస్తూ బాహుమూలాలు చూపారు. కొందరు దొండపండువంటి పెదవులు కనుపింపజేశారు. కొందరు అర్థనిమీలిత నేత్రాలతో చూడసాగారు. కొందరు కట్టుకున్న గుడ్డలు జారవిడచి, వడ్డాణంతోపాటు అందంగా ఉండే పిరుదలు చూపారు. కొందరు పలుచని దుకూలంలోని పిరుదలు కనబడేటట్టు నిలుచున్నారు. కొందరు కాలి అందెలను ఝుణఝుణ మ్రోగించారు. కొందరు పాలిండ్లమీది ముత్యాలహారం పట్టుకుని చూపారు. కొందరు సగం తొడలను చూపారు, కొందరు తలలమీద భుజాలమీద పత్రగుప్త లతికలను, శుకశారికలను పెట్టుకొని నిలబడ్డారు. కొందరు అర్ధ కటాక్షాలతో చూడసాగారు. కొందరు తమ జఘనాలపైని మొలనూళులను కదిలిస్తూ నిలబడ్డారు. కొందరు సునివస్త్రలయినా దుర్నివస్త్రలుగా కనిపించారు. కొందరు భయపడినవారివలె సవిలాసంగా ఇటూ అటూ తిరగసాగారు. కొందరు నృత్యం చేయసాగారు. కొందరు గానం చేయసాగారు. కొందరు వగలు చూపసాగారు. కొందరు సిగ్గుపడసాగారు. కొందరు గాలికి ఆడే అరటిచెట్లలాగ తొడలు కదలింపసాగారు. కొందరు గంభీరంగా శబ్దం చేయసాగినారు. కొందరు చేలాంచలం కప్పుకొని గంటల మొలనూలు శబ్దిస్తుండగా, నవ్వుతూ అటూ ఇటూ పారాడసాగారు. కొందరు గుడ్డలు, నగలు, భూమిపైని వదలిపెట్టసాగారు. కొందరు గుహ్యప్రాంతాలు తెలిపేట్టు అన్ని నగలూ చూపసాగారు. కొందరు గంధం రాసుకున్న చేతులు చూపసాగారు. కొందరు గంధం పూసుకుంటూ కుండలాలు చూపసాగినారు. కొందరు ముసుగువేసుకున్నారు. కొందరు చూపుల వగలు చూపసాగినారు. కొందరు పూర్వపు నవ్వులను, రతులను క్రీడలను పరస్పరం చెప్పుకుంటున్నారు, మరల సిగ్గుపడినట్టు నటించసాగారు. కొందరు కుమారికలవలె, పిల్లలు కనని వయసువారివలె, ప్రౌఢలవలె కనుపించసాగారు. కొందరు బోధిసత్త్వుని జాడలతో పిలువసాగారు. కొందరు బోధిసత్త్వునిపై విడిపూలు చల్లసాగినారు. ఎదుట నిలబడి బోధిసత్త్వుని ఆశయం చర్చించ సాగినారు. ముఖం చూడసాగినారు. ఇతడు అనురక్తములైన ఇంద్రియాలతో చూస్తాడా, చూపులు విసురుతాడా, లేదా అని వారు రాహువినిర్ముక్తచంద్రమండలంవలెను,

ఉదయిస్తున్న సూర్యునివలెను, కనక యూపస్తంభంవలెను, వికసించిన సహస్రపత్రం వలెను, హవ్యంతో జ్వలించే అగ్నివలెను ఉన్న అతని ముఖాన్ని, మేరువువలె అచలుడుగాను, ముందుకు వచ్చిన చక్రవాడంగాను, అవయవాలు ముడుచుకొని దాంతంగా కనిపించే నాగరాజుగాను ఉన్న బోధిసత్త్వుని పరికించసాగారు.

అప్పుడు మారుని దుహితలు బోధిసత్త్వుని పెద్ద పెట్టున ప్రలోభింపజేయడంకోసం కొన్ని గాథలను పలికారు.

“సువసంతకే ఋతువర ఆగతకే రమిమో ప్రియ ఫుల్లిత పాదపకే,
తవ రూపసురూప సుశోభనకే వసవర్తిసు లక్షణ చిత్రితకే.”

దీని, మరికొన్నింటి తాత్పర్య మిది : “ప్రియుడా! ఋతుశ్రేష్ఠమైన వసంతఋతువు వచ్చింది. చెట్లన్నీ పుష్పించాయి. నీ రూపం శ్రేష్ఠమయింది. శోభన మయింది. సులక్షణ శోభితమైంది. రమిద్దాము. రా. మేము మంచి వంశంలో పుట్టి మంచి అందచందాలు కలవారం. దేవమానవులకు, వారి సంతతికి సుఖకారణమైనవారం. లే. త్వరగా మా యౌవనం అనుభవించు. బోధి దుర్లభం. మనస్సును మళ్ళించు. ఈ దేవకన్యలందరూ నీ కోసం ఎంతో అలంకరించుకొని వచ్చారు. ఈ రూపాన్ని చూచి రాగరతుడై ఎవడు ఆనందించడు? దేహం జర్జరమయి జీవితం శుష్కించినవాడు కూడా ఆనందిస్తాడు. మా వైపు చూడు. మా కేశరాశి మృదువైనది. సురభిగంధాలు విరజిమ్ముతూన్నది. కిరీటాలు కుండలాలు ధరించాము. ముఖాలపై మకరికాపత్రాలు తీర్చుకున్నాము. లలాటాలపై సుగంధలేపాలు పూసుకున్నాము. మా కళ్ళు పద్మపత్రాలలాగా శుద్ధంగానూ, విశాలంగానూ వున్నాయి. మా ముఖాలు పరిపూర్ణచంద్రసదృశాలు. మా పెదవులు పండిన దొండపండ్లలాంటివి. మా పళ్ళేమో శంఖ కుంద హిమాలలాగ తెల్లనివి. రతిలాలసలమైన మమ్ముల్ని ఓ కాంతుడా, చూడు. పొడుచుకువచ్చిన కఠిన పీనపయోధరాలతో, మూడు ముడుతల నడుముతో విశాల జఘనాంగణాలతో ఎంతో అందంగా ఉన్న ఈ కామినులను నాథా,



చూడు. తొడలు చూచావా! ఏనుగుతొండాలలాగ ఉన్నాయి. చేతులలో వలయాలు గలగల లాడుతున్నాయి. పిరుదులపై మొలనూలు కదలాడుతున్నది. నాథా, నీ ఈ దాసినికలను (దాసీలను) కన్నెత్తి చూడు. హంసలలాగ నెమ్మదిగా ఉండే ఆ నడక, మంజుల మనోజ్ఞంగా మన్మథ భాషణంవలె వినిపించే ఆ పలుకులూ, ఈలాటి రూపభూషణాలు, ఈలాటి దివ్యరతి పాండిత్యం, గీతవాద్య నృత్యాలలో సంపూర్ణశిక్షణ, రతికోసమే ఏర్పడినరూపం, ఇలాటి కామలాలసలను ఇష్టపడక పోయావా, ఇక లోకంలో నీకు ఎలాటి సౌఖ్యాలు దక్కుతాయి? నిధిని చూచి పరిగెత్తే వానిలాగ, ధనసౌఖ్యం ఎరుగని మూఢునిలాగ నీవుకూడా రాగమంటే ఏమిటో తెలియక తనంతట వచ్చిన కామినులను అనుభవించలేకపోతున్నావు.”

అప్పుడు, బోధిసత్త్వుడు రెప్పపాటు లేని చూపుతో, మందహాసముఖంతో, కోపంగాని, ఉద్రేకంగాని లేని అంగాలతో, వంకరబుద్ధి, రాగం, దుష్టబుద్ధి లేక వివేకంతో, పర్వతరాజువలె నిశ్చలుడై, మారదుహితల విలాసాలకు అవలీనుడు, అవదీర్ణుడు, సంపీడితుడు కాక స్థిరమైన బుద్ధితో, క్లేశాలన్నీ పూర్తిగా పోవడంవల్ల స్వాధీనమైన జ్ఞానంతో, శ్లక్ష్ణ, మధుర వాక్కుతో బ్రహ్మఘోషను మించిన ఘోషంతో, మనోజ్ఞ కలవింకస్వరంతో మారదుహితలతో ఇలా అన్నాడు :

“ఓ కామినులారా, కామాలు దుఃఖానికి మూలమయినవి. బహుదుఃఖభరితమైనవి. మూఢుల ధ్యాన తపస్సులను పాడుచేసేవి. స్త్రీ కామగుణాలవల్ల తృప్తి ఎన్నటికీ కలుగదు. ప్రజ్ఞే తృప్తిని కలిగిస్తుంది. ఉప్పునీరు తాగినవానికి దప్పి ఆరనట్టు కామం ఎంత అనుభవించినా దప్పి తీరదు; హెచ్చుతుంది. కామాలు ఆత్మార్థమూ కావు; పరార్థమూ కావు. కనుక నేను ఆత్మార్థమూ; పరార్థమూ ఉత్సుకుడుగా ఉన్నాను. మీ రూపం నురుగు బుడగలవంటిది. మాయారంగంవలె మీ ఇష్టంతో విస్తరించినది. మీతో క్రీడ స్వప్నంవలె స్థిరమూ నిత్యము కానిది. మూఢులైన బాలకులకు మాత్రమే మనస్సు రంజింపజేసేది. మీ కళ్ళు కేవలం చర్మమయమయినవి. బుడగలవంటివి. పాలిండ్లేమో రక్తం గడ్డకట్టిన గండమాలవంటివి.

ఉదరం మూత్రపురీషాల పాత్ర, అశుభ్రమైనది. మీరంతా కర్మక్లేశ సంభవమైన దుఃఖ యంత్రాలు. వీటిని చూచి బాలిశులు మోహపడతారు గాని, విజ్ఞులు మోహపడరు. బాలిశులు వ్యర్థంగా అదే శుభమైన ఆశ్రయమని భావిస్తారు. బహుకాలంనుంచి వ్యాపిస్తూ దుఃఖమూలమైన ఈ సంసారంలోని అనుభవం నరకంలో బహుదుఃఖకరమైన వేదన అనుభవించడానికే. దుర్గంధం స్రవిస్తూ వెగటు పుట్టించే శ్రోణి, ఊరువులు, పిక్కలు మొదలయిన అంగాలుగల ఈ యంత్రం అంతా నాకు మాయగా కనిపిస్తున్నది. కనుక ఈ వ్యర్థమైన ప్రయత్నాలు మాని హేతుప్రత్యయ బుద్ధితో ప్రవర్తించండి. గుణహీనమైన కామగుణాలు ఆర్యజ్ఞాన పథానికి విరుద్ధమైనవి. విపరీతమార్గం పొందించేవి. విషబాణం వలెను, అగ్నిశిఖవలెను, కోపించిన మహోరగాలవలెను ఉండేవి. వాటిని పొంది మూర్ఛపోయిన బుద్ధిహీనులు సుఖంతో మూర్ఛపోయా మనుకుంటారు. కామదాసుడై ప్రమదాలోలుడైన నరుడు శీలం కోల్పోయి, మతిహీనుడై పెడదారి పడతాడు. రతిలోలుడు జ్ఞానానికి దూరమైపోతాడు. ధర్మ రతిని వదులుతాడు. నాకు రాగ, దోషాలు అంటవు. నైర్నిత్య అశుభ అనాత్మవాదాలు నాకు అంటవు. రత్యరతులు నా మనస్సును అంటవు. ఆకాశంలోని వాయువులాగ నేను ఏదీ అంటనివాడిని. ఈలాటి వారితో ఈ జగత్తు నిండి వుంటే, కల్పాలు కల్పాలు విహరిస్తాను. లేకపోతే నాకు అంతా ఖిలమయినదే. రాగం లేదు. మోహం లేదు. జినులు ఆకాశతుల్య మనస్కులు. దేవాప్సరసలు రుధిరాస్థి వర్జితులై నిర్మలులు శుభులు అయినప్పటికీ, వారందరూ మహాభయంతో ఉన్నారు. నిత్యభావ రహితులై అశాశ్వతంగా ఉన్నారు.''

గౌతముడు ఇంత చెప్పినా, స్త్రీ మాయలలో చాల శిక్షణ పొందిన ఆ మారదుహితలు పెద్ద పెట్టున రాగమదదర్పాలు కలిగించేటట్టుగా అంగాలను అలంకరించుకొని స్త్రీ మాయలతో బోధిసత్త్వుని లోబరుచుకోవాలని ప్రయత్నించారు. మరల అతనితో ఇలా అన్నారు:— నీవు బలవంతుడవైన క్షితీశ్వరవరుడవు. తూర్యసహస్రనాదితమైన భవనంలో ప్రమదాగణం మధ్యను ఉండక మునివేషం ఎందుకు? ఈ పని మానివేయి. రతి అనుభవించు.



బోధిసత్త్వుడు : ''నేను త్రిభవనాలలో భూలోకంలో దేవలోకంలో ధర్మచక్రం ప్రవర్తింపజేసే దశబలుడైన రాజుగా కానున్నాను. శిష్యసంఘాలనే అనేకానేక సహస్ర పుత్రులలో సత్య సమ్మిత వినయ మార్గంలో ధర్మ రతితో రమిస్తాను; విషయాలతో కాదు. నా మనస్సు విషయాపకం కాదు'' అన్నాడు. మారదుహితలు ''ప్రథమ వయస్సు ఉన్నప్పుడే, యౌవనం గడచిపోకముందే, వ్యాధులు రాకముందే, ముదిమి పైనిపడకముందే నవ్వుతూ కామరతులు అనుభవించు. మేమూ రూపయౌవనవంతులమే., సుఖపడుదాము'' అన్నారు. బోధిసత్త్వుడు :—''అమృత కాలం దుర్లభంగా ఉంది. అది లభించేవరకు, సురాసురభవనాలు క్షణం కూడా దుఃఖంలేనివి అయ్యేవరకు, జర వ్యాధి మరణం నాశనమయ్యేవరకు నేను అభయపురం చేరే సుపథాన్నే అనుసరిస్తాను'' అన్నాడు.

వారన్నారు : ''దేవభవనంలో అమరవర స్తుతుడయి. అప్సర స్త్రీ పరివృతుడైన ఇంద్రునివలె, మారపురంలో నీవు నీకు యిష్టమైన కామరతులను ప్రమదావశుడవై విపులంగా యామ సుయామ దేవతల సంతోషంతో అనుభవించు'' అని. బోధిసత్త్వుడు ''కామం గడ్డిపోచలపై నీటిబిందువు వంటిది. శరత్కాలంలోని మేఘంవంటిది. పన్నగకన్యారోషసదృశమైంది. చాల భయంకరమయింది. శక్ర సుయామ దేవతలు తుషిత దేవతలు, నముచి (మార) వశగతులయారు. వ్యసన పరీతమయిన నారీగణాన్ని ఎవరు కోరుతారు?'' అని అన్నాడు.

మారదుహితులు ''చూడు. ఆ చెట్టు ఎర్రటి చిగుళ్లతో పుష్పించింది. కోకిలాలు, చకోరాలు, భృంగాలు, మధురంగా నినదిస్తున్నాయి. మృదువుగా చిక్కగా పెరిగిన నీలాల మొలకలవంటి గడ్డిపై చెట్టుక్రింద యువతులతో ఓ నరసింహా, రమించు'' అని అన్నారు. బోధిసత్త్వుడు ''ఈ చెట్లు కాలవశంతో చిగిర్చాయి. పూచాయి. ఆకలి దప్పికలవల్ల మధుకరాలు పూలవెంట తిరుగుతున్నాయి. భాస్కరుడు గడ్డీ గాదం

ఎండింపజేస్తాడు. నేను పూర్వజినులు అనుభవించిన అమృతంకోసం ప్రయత్నిస్తున్నాను” అన్నాడు.

మారదుహితలు “ఇదిగో చూడు! చంద్రవదనలు నవనలినీసన్నిభలు, మనోజ్ఞ వచనలు, శ్లక్ష్ణదశనలు, మంచుఘూళి వంటివారు ఈ యువతులు! ఇటువంటివారు సురలోకంలోనూ దొరకరు. మనుజపురంలో ఎక్కడ? సురలు సర్వకాలం కోరేవారు నీకు ఆయాచితంగా లభించారు” అన్నారు. బోధిసత్త్వుడు “ఈ శరీరం అసహ్యమయినది. అశుచి అయినది. కృమికుల భరితమైనది. జర్జరమయినది. నశించేది. భిన్నమయ్యేది. సుఖాలు లేనివి. ఏది సచరాచరమయిన జగత్తుకు పరమ సుఖకరమో, బుధజనులు మెచ్చేదో అలాటి అచ్యుతమయిన పదాన్ని పొందుతాను” అన్నాడు.

చతుఃషష్టి కామకళా లలితలయిన ఆ మారదుహితలు వస్త్రాలు జారగా, నూపురమేఖలలు ధ్వనిస్తుండగా, కామశరాహతలై, మదనావేగంతో నవ్వుతూ “ఇంత చేసినా నీవు వికారం పొందవే? ఏమిటి ఆర్యపుత్రా?” అన్నారు. “సర్వజన్మల దోషమూ నాకు తెలుసు. కనుకనే రజోగుణం పోగొట్టుకుని మాట్లాడాను. కామాలు అసి శక్తి శూలాయుధ సమానమైనవి. తేనెపూసిన కత్తులవంటివి. సర్పశిరస్సువంటివి. కర్షాగ్నివంటివి. ఈ సంగతి నాకు బాగా తెలుసు. కనుకనే, గుణాలను హరించే ప్రమదలను త్యజిస్తాను” అని ఆయన సమాధాన మిచ్చాడు.

ఈ విధంగా ఆ కామదుహితలు సహస్రానేక ప్రమదామాయలతోనూ గజకరభగతి అయిన ఆ సుగతుని మభ్యపెట్టలేకపోయారు. సిగ్గుపడి ఆముని చరణాలపై పడి, సంతుష్టితో, గౌరవ ప్రేములతో ఆ హితకరుని స్తుతించారు. “నిర్మల పద్మగర్భసదృశుడా! శరత్కాల చంద్రవదనుడా! వేయి ఆహుతిగొన్న అగ్నిశిఖా సముడా! కనకగిరి సమానుడా! నీవు మారు జన్మలనుంచి చేస్తున్న తపస్సు సిద్ధించనీ! చింతితార్థం ఫలించనీ! నీవు తరించి, వ్యసనాకులమయిన జగత్తును తరింపచేయి.”

వారు ఈ విధంగా కొండగోగు, చంపకపుష్పం – వీటివంటి గాత్ర ముని బహుప్రకారంగా స్తోత్రంచేసి పర్వతంవలె అచలుడైన అతనికి నమ



స్కరించి తండ్రి దగ్గరకు వెళ్ళి అతని కాళ్లపై తలమోపి “తండ్రీ! ఆ సురవరగురు వయిన సుగతుడు మానుంచి భయపడలేదు. ఆ పద్మపత్ర నయనుడు చూస్తాడు. నవ్వుతాడు. కాని రాగంతో చూడడు. ఎవరినీ కోపంతో చూడడు. బొమముడిపాటు ఎప్పుడూ కలుగదు. ముఖం చిట్లించడు. మేరువు చలించవచ్చు. సముద్రం యింకిపోవచ్చు. చంద్రసూర్యులు పడిపోవచ్చు. ఆదోషదర్శి అయిన ఆ విద్వాంసుడు ప్రమదావశుడు కాడు” అని విన్నవించారు.

ఆ మాటలు పాపి అయిన మారుడు విని చాలా దుఃఖపడి, మనస్సు చెడి, తన కుమార్తెలతో అన్నాడు “బోధిమండంనుంచి అతనిని లేపడానికి కాలేదా? మీ రూపాకృతిని చూడనంతటి మూఢుడా వాడు?” అని.

అప్పుడు మారదుహితలు తండ్రితో ఈ గాథ లన్నారు: వాటి భావమిది: “తండ్రీ! అతడు తియ్యగా మెల్లగా మాట్లాడుతాడు. కాని అనురక్తుడు కాలేదు. గుహ్యప్రదేశాలను చూస్తాడు. కాని మనస్సు కలుషితం కాలేదు. మా విలాసాలను, గతిని చూస్తాడు. కాని, వివేకం కోల్పోలేదు. దేహమంతా చూచినా, మనసు గంభీరం. అతనికి స్త్రీదోషాలన్నీ లెస్సగా తెలుసు. అతని మనస్సు కామవిరక్తం; రాగరక్తం కాదు. అతని మనస్సు తెలుసుకునేవాడు భువిలోను, దివిలోను లేడు. మేము చూపిన స్త్రీమాయలకు అతని మనస్సు సరాగమై మాలో లీనం కావలసిందే. కాని, అతని మనస్సు ఒక్కసారి కూడా కంపించలేదు. శైలేంద్రునివలె అతడు చలించక వున్నాడు. అతడు శతపుణ్య తేజోభరితుడు. గుణ తేజఃపూర్ణుడు. పెక్కు కల్పకోటులనుంచి తపస్సు చేస్తూ శీలసంపద గడించుకొన్నవాడు. బ్రహ్మ, శుభ తేజస్కులు విశుద్ధసత్త్వులు అయిన దేవతలు అతని పాదాలకు తలలొగ్గి నమస్కరిస్తున్నారు. అతడు మారసేనను అణచివేసి, పూర్వజినానుమతుడై, శ్రేష్ఠమైన బోధిని పొందడం నిస్సందేహం. తండ్రీ! మనకు బలవంతులతో వివాదం, యుద్ధం ఎందుకు? ఈ ప్రయత్నం అసాధ్యమయింది. తండ్రీ! చూడు. ఆకాశంలో మణిరత్న కిరీటాలు ధరించి సహస్రానేకసంఖ్యలో బోధిసత్త్వులు రత్నాలతో, కుసుమమాలలతో, దశబలాలతో అతనిని పూజించడంకోసం ఎదురు చూస్తున్నారు. చేతనాచేత

నాలు, వృక్షాలు, కొండలు, పక్షులు, ఇంద్ర సురేంద్ర యక్షులు, ఆగుణ పర్వతుని యెదుట వినతులై ఉన్నారు. ఇక మనం మరలిపోవడం ఉచితం. శ్రేయస్సు. అంతేకాక, అతడు గట్టుదాటనిదానిని దాటడు. మూలం పెకలించలేనిదానిని తవ్వడు. ఎవరినీ కోపించడు. కోపించినవానిని క్షమిస్తాడు. ఇతరుల మనస్సును కలుషితం చేయడు.''

భిక్షువులారా, అప్పుడు ఎనిమిది మంది బోధివృక్ష దేవతలు శ్రీ, వృద్ధి, తప. శ్రేయసి, విదు, ఓజోబల, సత్యవాదిని, సమంగిని ప్రత్యక్షమై, బోధిసత్త్వుని పూజించి, షోడశాకారలక్ష్మితో అతని శరీరాన్ని కాంతిమంతం చేశారు. ఈ విధంగా స్తోత్రం చేశారు :

''ఓ విశుద్ధసత్త్వుడా, నీవు శుక్లపక్షంలో చంద్రునివలె ప్రకాశిస్తున్నావు. నీవు ఉదయిస్తున్న సూర్యునివలె విరాజిల్లుతున్నావు. నీవు జలమధ్యంలోని తామరపూవువలె వికసిస్తున్నావు. నీవు వనమధ్యంలో పరివారసహితమైన కేసరివలె గర్జిస్తున్నావు. అగ్రసత్త్వా, నీవు సాగరమధ్యంలో పర్వతరాజంవలె విభ్రాజమానుడవు అవుతున్నావు. నీవు చక్రవాళపర్వతంవలె అవతరించావు. రత్న సంపూర్ణమైన సాగరంవలె నీవు దురవగాహమైనవాడివి. అంచులు లేని గగనం లాగ నీ బుద్ధి విస్తీర్ణం. సుస్థితబుద్ధి వయిన నీవు ధరణివలె సర్వప్రాణులకూ ప్రాణమయినవాడివి. ఓ అగ్రసత్త్వా, సరస్సు వలె నీవు ఎప్పుడూ ప్రసన్నుడివి. తప్తంకాని వాడివి. కలుషం కానివాడివి. ఓ అనికేతబుద్ధీ! నీవు వాయువువలె సర్వలోకాలలోను ఎల్లప్పుడూ ప్రసరించి ఉంటావు. నీవు సర్వమనుష్యరహితుడైన తేజోరాజువలె పొంద శక్యంకానివాడివి. నారాయణునివలె బలవంతుడివి. దుర్ధర్షుడివి. నీవు బోధిమండంనుంచి లేవలేనంతగా ఆసనపరిగ్రహం చేశావు. నీవు ఇంద్రుని చేతినుంచి విసరబడిన వజ్రంలాగా తిరుగులేనివాడివి. నీవు సులభంగా కోరినవాటిని పొందగలిగావు. త్వరలో దశబల సామగ్రిని పొందుతావు.''

ఈ విధంగా బోధివృక్ష దేవతలు షోడశాకారుడైన బోధిసత్త్వునికి కాంతిని వృద్ధిపరిచారు.



ఇది ఇలా వుండగా, శుద్ధావాస కాయికులైన దేవతలు మారుణ్ణి పదహారు విధాలుగా దుర్బలపరచసాగినారు. ఆ పదహారు విధాలు ఏవంటే :— ''ఓ పాపిష్ఠుడా! నీవు ముసలి క్రౌంచపక్షివలె పాడయిపోయినావు. బురదలో చిక్కుకున్న ముసలి ఏనుగువలె దుర్బలుడవైపోయావు. బీరాలు పలికి ఓడిపోయినవానివలె ఒంటరివాడి వయ్యావు. అడవిలో వదలిపెట్టబడిన ఒంటరిగాడివలె తోడులేకుండా పోయావు. బరువు మోయలేని ఎద్దువలె సత్తువ కోలుపోయావు. గాలికి కూలిపోయిన మానువలె కూలిపోయావు. దారి తప్పిన సార్థవాహునిలాగ పెడదారి పట్టావు. మత్సరి అయిన దరిద్రునివలె దీనుడవు హీనుడవు అయావు. కాకిలాగ కేవలం కారుకూతలకు దిగావు. కృతజ్ఞతలేని దుర్వినీతునివలె తిరస్కృతుడ వయావు. సింహగర్జన విన్న నక్కలాగ పరుగెత్తుతున్నావు. వైరంభ వాయువేగానికి పక్షివలె తూలిపడిపోతావు, పుణ్యం నశించిన భిక్షుకునివలె పొద్దు, కాలం ఎరుగలేకున్నావు. దుమ్ము కొట్టుకున్న ఓటికుండవలె వదలిపెట్టబడతావు. పాములను మంత్రాలతో కట్టివేసినట్లు బోధిసత్త్వుడు నిన్నిప్పుడు కట్టివేస్తాడు. కాళ్ళు; చేతులు తెగిన మొండెం వలె నీ బలాలన్నీ పోయి ఏకాకి వయావు.'' ఈ విధంగా శుద్ధావాస కాయిక దేవపుత్రులు పదహారు విధాలుగా పాపి అయిన మారుణ్ణి దుర్బలపరిచారు.

పిదప బోధిపరిచారకులైన దేవపుత్రులు పదహారు విధాలుగా పాపి అయిన మారుని మనసు పాడుచేయసాగినారు. ఆ పదహారు విధాలు ఏవంటే– ''ఓ పాపీ, శూరుడు శత్రుసైన్యం జయించినట్లు నిన్ను బోధిసత్త్వుడు జయిస్తాడు. మహామల్లుడు దుర్బలుడైన ప్రత్యర్థిమల్లుణ్ణి పట్టుకున్నట్టు బోధిసత్త్వుడు నిన్ను పట్టుకుంటాడు. మిణుగురుపురుగు సూర్యుని ముందు వెలవెలపోయినట్లు నీవు అతనిముందు వెలవెలపోతావు. మహామారుతం పిడికెడు ముంజగడ్డిని ఎగురగొట్టేటట్టు నిన్ను అతడు ఎగురగొడతాడు, సింహం నక్కలను పరుగెత్తించినట్టు నిన్ను యిప్పుడే అతడు పరుగెత్తిస్తాడు. మొదలు నరికిన చెట్టులాగ నీవు త్వరలో కూలిపోతావు. మహారాజు శత్రునగరాన్ని ధ్వంసంచేసినట్లు అతడు నిన్ను ఇప్పుడే ధ్వంసం చేస్తాడు. సూర్యుడు చిన్నమడుగు నీటిని ఇంకింపజేసి

నట్లు నిన్నిప్పుడే అతడు ఎండింపజేస్తాడు. మరణశిక్ష తప్పి వధ్యస్థానం నుంచి పరుగుతీసే ధూర్తుడిలాగ నీ విప్పుడే పరుగు తీస్తావు. నిప్పు మంటలకు తేనెటీగలు గుంపులు గుంపులుగా చుట్టిచుట్టి తిరిగినట్లు నీ విప్పుడు అతని ప్రతాపానికి తిరుగుతావు. రాష్ట్రభ్రష్టుడయిన ధర్మరాజువలె నీవు ఇప్పుడు అటమటిస్తావు. రెక్కలు తెగిన ముసలి క్రౌంచపక్షిలాగ త్వరలో నీ రెక్కలు తెగిపోతాయి. తెచ్చుకున్న పాథేయం అడవిలో అయిపోయినవాడు తిట్టుకుంటున్నట్టు త్వరలో తిట్టుకుంటావు. ఓడ పగిలి సముద్ర మధ్యంలో ఏడిచేవాడిలాగ త్వరలో ఏడుస్తావు. కల్పాంత మహాగ్నిలో గడ్డి, చెట్లు కాలిపోయేటట్లు అతని తేజస్సుకు త్వరలో కాలిపోతావు, మహా వజ్రం పర్వత సమూహాన్ని నరికివేసేటట్లు బోధిసత్త్వుడు నిన్ను నరికివేస్తాడు.’’

బోధిపరిచారకులు అయిన దేవపుత్రులు ఈ విధంగా పదహారు విధాలుగా మారుని మనస్సు విరవడానికి ప్రయత్నించాడు. అయినా, పాపి అయిన మారుడు వెనుకకు వెళ్లలేదు. ఇక్కడ కొన్ని ప్రాచీనులు చెప్పిన గాథలు ఉన్నాయి. వాటి తాత్పర్యమిది:

దేవగణాలు ఈ విధంగా ఉద్బోధించినప్పటికీ అంతకుడైన మారుడు వెనుదిరిగి పోలేదు. ‘‘ఇతనిని నరకండి. చంపండి. రూపుమాపివేయండి. బతకనివ్వకండి. ఇతడు ఉత్తీర్ణుడయ్యాడా, నన్ను, ఇతరులనుకూడా తరింపజేస్తాడు. ఎవరినీ వదలడు. కనుక ఈ శ్రమణుడు లేచి కదలిపోకుండా చంపుతాను’’ అని మారుడు అన్నాడు.

బోధిసత్త్వుడు ఇలా సమాధానమిచ్చాడు :—‘‘మేరుపర్వతరాజం తన స్థానంనుంచి చలించనీ, ఈ జగమంతా నాశనమయిపోనీ. సకల నక్షత్ర మండలమూ సూర్యచంద్రులతోపాటు ఆకాశంనుండి భూమి మీదికి రాలి పడనీ. సకల జీవరాసులూ ఒక్కటిగా నామీద దండయాత్ర చేయనీ. సముద్రాలు ఇంకిపోనీ. నాబోటివాడు ద్రుమరాజమూలంనుంచి కదలడు సుమా!’’

మారుడు :— నేను కామేశ్వరుణ్ణి. సకలలోకాలలోను ఉన్న దేవ దానవులు, మనుష్యులు, తిర్యక్కులు నా వశంలో ఉన్నారు. నాచెప్పుచేతలలో పనిచేస్తున్నారు. గౌతమా, లే. నామాటప్రకారం చేయి.



బోధిసత్త్వుడు :—నీవు కామేశ్వరుడివయినా, ఏమీ చేయలేవనడం స్పష్టమయింది. నేను ధర్మేశ్వరుణ్ణి. నాబలం నిజంగా ఏమిటో చూస్తావు. నీవు నిజంగా కామేశ్వరుడివి అయితే ఇలాటి దుర్గతి పొందవు. నేను నీకు వశుణ్ణి కాక, నీవు చూస్తూ ఉండగానే బోధిని పొందుతాను.

మారుడు :—ఓ శ్రమణుడా, నీవు ఒంటరివి. ఈ అరణ్యంలో ఏమిటి చేస్తావు? నీవు కోరే బోధి సులభమయిన ప్రయోగం కాదు. భృగువు, అంగిరుడు మొదలయివారు ఎంతగనో తపస్సుచేసి బోధి అనే పరమమైన పదాన్ని పొందలేకపోయారు. మనుజమాత్రుడివి నీవు ఒక లెక్కా?

బోధిసత్త్వుడు :—మారుడా, ఎంత పొరపడినావు! పూర్వం ఋషులు అజ్ఞానంతో దేవలోక కామనతో, క్రోధాభిభూతమతులై తపస్సుచేశారు. ఏది నిత్యమో, ఏది అనిత్యమో వారికి నిశ్చయం కలుగలేదు. సంశయాత్ములై ఉండేవారు. మోక్షమనేది ఎక్కడో ఉందని, అక్కడికి వెళ్ళాలని అనుకొనేవారు! తత్త్వదృష్టితో చూడగా, వారి మాటలు అర్థరహితమైనవి. వారిలో కొందరు పురుషుడు సర్వవ్యాపి అని, సకల ప్రదేశగతుడని, శాశ్వతుడని చెబుతున్నారు. మూర్తుడని. అమూర్తుడని, గుణి అని, నిర్గుణుడని, కర్త అని, అకర్త అని మరికొందరు అంటున్నారు. నేను ఈ ఆసనంలో కూర్చుని, నిర్దోషమయిన బోధిని పొంది, సైన్యసమేతుడవైన నిన్ను జయించి అణచివేస్తాను, ఇతర జగత్తులకు కూడా నిర్వాణం, దుఃఖశమనమైన సత్త్వభావం సాధిస్తాను.

మారుడు మండిపోయాడు. పరుషవాక్కులతో తన బలగంతో ఇలా అన్నాడు: ‘ఈ గౌతముణ్ణి పట్టుకోండి. ఒంటరిగాడు. అడవిలో బిక్కు బిక్కుమంటూ ఉన్నాడు. ఎవరి సహాయమూ లేనివాడు. పట్టుకోండి. నా యెదుటినుంచి లాక్కొని పోండి. ఈ భూమికి భారం తగ్గించండి. వీడిని కట్టి నా ఇంట్లో నిగడలతో బంధించి, తలుపులు మూయండి. వీడు దుఃఖంతో బాధపడుతూ, మరణించడం నేను చూడాలి.’

ఆ మాటలకు బోధిసత్త్వుడు అన్నాడు :—ఆకాశంలో వివిధ వికృత చిత్రాలు గీయడం, వాటిని తుడిచి వేయడం, మళ్ళీ విడివిడిగా వ్రాయడం సాధ్యం కావచ్చు. మానవులు ఎంతో ప్రయత్నంమీద, దిక్కులలోను,

విదిక్కులలోను నిరాఘాటంగా ప్రసరించే వాయువును పగ్గాలతో కట్టివేయడం సాధ్యం కావచ్చు. చీకటి వెలుగులను కల్పించే చంద్రాదిత్యులను ఆకాశంనుంచి మహీతలానికి దించనూ వచ్చు, కాని, నీబోటివాళ్ళు ఎంత కేకలు పెట్టినా, నన్ను ఈ ద్రుమరాజంనుంచి కదలించలేరు.''

ఆ మాటలకు మారుడు ఊరకే ఉండలేకపోయాడు. తన సైన్యాన్ని ఆదేశించాడు. ఆ మహాశక్తిగల నముచిసేన శంఖాలూ, భేరీ మృదంగాలూ వాయిస్తూ, హాహాకారాలు చేస్తూ, భయంకరంగా ముందుకు వచ్చింది. "హా పుత్ర! హా వత్స! హా ప్రియుడ! ఈ భయంకరమైన నముచిసేనను చూచి భయపడి మరణిస్తావు! బంగారులాగ, సంపెంగపూవు రేకుల మధ్యవున్న రంగులాగ మెరిసిపోతున్న ఓ అందగాడా! ఓ సుకుమారుడా! దేవతలకు, నరులకు పూజనీయుడా! ఈ మహాయుద్ధంలో నాశమయిపోతావు. అసురునికి చంద్రుడు వశమయిపోయినట్టు నీవు మారుడికి వశుడవై పోతావు'' అని యక్షరాక్షసుల హాహాకారాలు వినిపించాయి.

బోధిసత్త్వుడు ఆ మాటలకు బ్రహ్మస్వరంతో, కలవింకరుతంవంటి స్వరంతో ఆ హాహాకారాలకు ఇలా సమాధాన మిచ్చాడు:—"ఆకాశాన్ని పొడవడానికి పాటుపడే మూఢుడే నావంటివాడిని ద్రుమరాజం కిందినుంచి తొలగించి పట్టుకొనడానికి ప్రయత్నిస్తాడు. ఈ మహాసాహస్రలోకాన్ని పిండి పిండిగా చేసి, ఆ ధూళికణాలను లెక్కపెట్టగలిగినవాడు, రోమంతో సాగరజలాన్ని సముదరించగలవాడు, మేరుపర్వతాన్ని క్షణంలో ఊది పారవేయగలవాడు కూడా ఈ బోధివృక్షంనుంచి నన్ను కరలించలేడు.'' మారుడు గౌతమునికి కాడిమాను దూరంలో నిలబడి దుష్టచిత్తంతో, ఒరనుండి వాడి కత్తి దూసి, ఇలా అన్నాడు: "ఓ శ్రమణుడా! లే. త్వరగా నా ఇష్టప్రకారం నడు, పచ్చివెదురులాగ నవనవలాడే నీ శరీరాన్ని తెగనరకనివ్వక.''

బోధిసత్త్వుడు "ఈ త్రిసాహస్ర ప్రపంచం మారులతో నిండిపోయినా, మేరుపర్వతమనే ఖడ్గాన్ని సర్వప్రాణులూ ఏకమై నా మీద ప్రయోగించినా, నా రోమాన్ని కూడా కదిలించలేరన్నప్పుడు, నన్ను కొట్టలేరనడం వేరుగా చెప్పాలా? నా మనస్సును నీవు కలుషపరచలేవు'' అన్నాడు.



మారుడు తన పట్టుదల వదలలేదు. మారుని సైన్యంలోనివారు వివిధ మాయలతో బోధిసత్త్వుని భయపెట్టడానికి ప్రయత్నించారు. నిప్పులాగ ఎర్రగా మండిపోతున్న కొండల శిఖరాలను ఒకదానిపై ఒకటిని కొందరు విసిరివేస్తున్నారు. కొందరు చెట్లను వేళ్ళతోపాటు పెరికి విసరివేస్తున్నారు. కొందరు రాగిని, లోహాలను వర్షిస్తున్నారు. ఉష్ట్రముఖులు, గోముఖులు, గజముఖులు, భైరవాక్షులు, దృష్టిలోనే విషముండే సర్పముఖులు, నానా వికృతముఖులు గర్జిస్తూ, మేఘాలవలె నాలుగు దిక్కులూ క్రమ్ముకున్నారు. అతనిపై పిడుగులు, ఇనుపగుండ్లు, ఖడ్గాలు, శక్త్యాండఖాలు. వాడి గండ్రగొడ్డళ్ళు, విషం పూసిన బాణాలు వర్షించారు. భూమి పగిలిపోయేట్లు త్రొక్కసలాడారు. చెట్లను నుగ్గునుగ్గు చేశారు. కొందరు నూరు చేతులతో నూరు బాణాలు ప్రయోగించారు. కొందరు నోటినుంచి పాములను, నిప్పును కక్కారు. కొందరు మకరాలు మొదలయిన జలజంతువులను సముద్రంనుంచి తెచ్చి విసురుతున్నారు. కొందరు పాములను, మరికొందరు గరుడపక్షులను విసిరారు. కొందరు పాములు, గరుడులు అయి దాడి చేశారు. కొందరు కోపంతో మండిపోతున్న నిప్పుముద్దలవంటి-మేరుపర్వతంవంటి ఇనుపముద్దలను విసురుతున్నారు. భూమిని సంక్షోభపరుస్తున్నారు. కొందరు జలాశయాలలో ప్రవేశించి, జలాలను మాడబెడుతున్నారు. కొందరు 'అహో వత్స' అని కేకలు వేస్తూ చేతులు, కాళ్ళు వికారంగా తిప్పుతూ, తలనుంచి కళ్ళనుంచి మంటలు కక్కుతూ, మెరుపులవలె వెలిగిపోతూ, అతని ముందు, అతని వెనుక, అతని ఎడమపక్కను, అతని కుడిపక్కను పడుతున్నారు:

నముచిసేనయొక్క వికారచేష్టలను, దాని మాయలను శుద్ధసత్త్వుడైన బోధిసత్త్వుడు ఒక మారు కన్నెత్తి చూచాడు. మారుడూ లేడు; అతని సైన్యమూ లేదు. ఈ జగత్తూ లేదు. ఆత్మ లేదు. ఈ మూడు లోకాలూ నీటిలోని చంద్ర ప్రతిబింబాలవలె ఊగిసలాడిపోయాయి. స్త్రీ లేదు. పురుషుడు లేడు. చక్షుశ్శ్రోత్రఘ్రాణ జిహ్వాది అంగాలూ లేవు. ఈ దేహమూ లేదు. ఆత్మ లేదు. అధ్యాత్మశూన్య బహిశ్శూన్య ప్రతీత్యజాతాలయిన ధర్మాలు అన్నీ వడగళ్ళలాగ కరిగిపోయాయి. ఆ సత్యవాది నిరంతరం సత్యమే పలికాడు. అతని సత్యవాక్కువల్లనే ధర్మాలు శూన్యమయాయి.

అతడు తన కుడిచేతితో తలను, పాదాలను తాకాడు. ఆ కుడిచేయి సందులులేని చక్కని వేళ్ళతో, ఎర్రని గోళ్ళతో, సహస్రార చక్రంతో శుభ పుణ్యసహితమై బంగారుకాంతితో వెలిగిపోతున్నది. అతడు చేయిని ముందుకు చాపాడు. అది వర్షాకాలంలో మెరుపు ముందుకు సాగినట్టు ఉంది. చేయి చాచి అతడు ఇలా అన్నాడు:—

"నేను పూర్వం ఆచరించిన నయుతసంఖ్య యజ్ఞాలకు ఈ చిత్ర విచిత్రమయిన వసుమతి సాక్షి. నేను కోరికలు తీర్చక యాచకులను పంపలేదు. అన్నీ దానమిచ్చాను. దానికి జటిల, తేజస్సు, వాయువు, ప్రజాపతి అయిన బ్రహ్మ, జ్యోతిర్యుతులైన చంద్రసూర్యులు సాక్షి. పది దిక్కులలోను ఉన్న బుద్ధులు సాక్షి. నా శీలవ్రతాలకు, నా బోధ్యంగాలకు వీరంతా సాక్షి. నా దానం సాక్షి. నా శీలం సాక్షి. నా క్షాంతి సాక్షి. నా వీర్యం, నా ధ్యానం, నా ప్రజ్ఞ, నా చతుఃప్రమాణాలు, అభిజ్ఞ సాక్షి. ఇంతవరకు ఆచరించిన పూర్వ బోధి – ఇవి అన్నీ సాక్షి. ఈ దశ దిక్కులందూ ఉన్న నిఖిలప్రాణులు, వాటి పుణ్యబలశీల జ్ఞానాలు, అవి ఆచరించిన నిరర్గడయజ్ఞాలు–ఇవన్నీ నా రోమశతాంశానికి కూడా పోలవు."

అప్పుడు బోధిసత్త్వుడు భూమిని ఆస్ఫాలించాడు. అప్పుడు కంచుపాత్రను కొట్టినట్లు ఖంగున కలిగిన శబ్దం మారుడు విన్నాడు. "చంపండి! పట్టుకోండి కృష్ణబంధువును" అన్నట్లుగా వినిపించింది. మారుడు ఆ మాటలకు చెమట పట్టి, తేజస్సు కోల్పోయి, ముఖం వెలవెలపోయి, ముసలితనం వచ్చినట్లు రూపు చెడిపోయాడు. తనను తాను చూసుకుని భయపడి, రొమ్ము కొట్టుకొని, "అయ్యో! అనాథుడనయ్యాను" అని ఏడ్చాడు. అతని మనస్సు భ్రమించింది. వెర్రెత్తినట్లయింది.

అతని సేనలోని గుర్రాలు, ఏనుగులు, యానాలు, రథాలు, భూమి మీద చిందర వందరగా పడిపోయాయి. రాక్షసులు, కుంభాండులు, పిశాచులు భయపడి పారిపోయారు. దారి తెలియలేదు, దిక్కు తెలియలేదు. బలమంతా ఉడిగిపోయింది. దావాగ్నిలో పడిన పక్షులలాగ దాటుకున్నారు. తల్లి, తండ్రి, సోదరులు, అక్కచెల్లెండ్రు, పుత్రులు, తమ తమవారు ఎక్కడికి పోయారో పరస్పరం అడుగుతున్నారు. అలాగే మొండితనంగా పరస్పరం కలహిస్తున్నారు. "అయ్యో! మనం అనవస



రంగా ఈ వ్యసనం పొందాము. ఇది దాటే అవకాశ మేది?" అని ఆందోళన చెందసాగారు. ఈ విధంగా అక్షోభ్య, విపుల, మహాబలశాలిని అయిన ఆ మారసేన చెల్లాచెదరై పారిపోయి, ఏడు రోజుల తరువాత పరస్పరం కలుసుకుని 'బతికాము; ఇంతే చాలు' అని సంతోషపడింది.

బోధిమండ వృక్షదేవత దయ తలచి మూర్ఛపడిన కృష్ణబంధువును (మారుని) చల్లని నీరు చల్లి మూర్ఛ పోగొట్టి "లే, త్వరగా వెళ్ళు. ఇక ఆలస్యం వద్దు. గురువులను ఎదిరించినవారికి ఇలాగే అవుతుంది" అని సమాధానపరిచింది. "నేను నా కుమారుల మంచిమాట వినక శుద్ధసత్త్వుని యెడ అపరాధంచేసి, దుఃఖం, భయం, వ్యసనం, శోకం, వినాశం, అవమానం, ధిక్కారం, దైన్యం పొందాను" అని మారుడు విచారంతో అన్నాడు.

దేవత అన్నది: "నిరపరాధులు అయినవారియెడ అపరాధం చేసే మూఢుడు భయం, దుఃఖం, వ్యసనం, దైన్యం, ధిక్కార వాక్యాలు, వధం, బంధనం, ఇతరానేక దోషాలు పొందుతాడు" అని. దేవాసురులు, గరుడ రాక్షస కిన్నరులు, బ్రహ్మ, శక్రుడు, శ్రేష్ఠులయినవారు "ఓ లోకవీర జయ!" అని "నముచిసేనను నీవు ధ్వంసం చేశావు" అని జయజయ నినాదాలు చేస్తున్నారు. హారాలు, అర్ధచంద్రధ్వజాలు, పతాకాలు, ఛత్రాలు ఎగురవేస్తున్నారు. పూవులు, అగురు, తగరు, చందనంపొడి కురిపిస్తున్నారు. 'ఓ వీరుడా! జయించిన శత్రుసింహాలు గలవాడా, ద్రుమం కింద ఆసనశ్రేష్ఠంపై కూర్చొని బోధిని, ఆవేణిక, దశబలయుత అయిన ప్రతిసంవిద్ జ్ఞానం పొందుతావు. ఓ శూరుడా! శత్రుడైన మారుని విపులసేనను మైత్రితో జయించి, సకల బుద్ధవిషయం సంపాదిస్తావు' అని తూర్యరవాలు ధ్వనింపజేస్తున్నాయి.

ఈ విధంగా మారధర్షణంకోసం జరిగిన యుద్ధంలో బోధిసత్త్వుని బలపరాక్రమాలు చూచిన ముప్ఫయ్యారుకోట్ల ఇరవైనాలుగు నయుత ప్రాణుల మనస్సు శ్రేష్ఠమయిన బుద్ధబోధిలో లగ్నమయింది.

ఇది లలితవిస్తరంలో మారధర్షణ పరివర్తమనే
ఇరవైఒకటవ అధ్యాయం.

---

# 22. అభిసంబోధన పరివర్తం

భిక్షులారా, బోధిసత్త్వుడు విరోధి అయిన మారుణ్ణి హతంచేసి, మిగిలిన శత్రువులను మర్దించి, యుద్ధంలో విజయాన్ని పొంది, ఛత్రధ్వజ పతాకలను ఉన్నతంగా ఎత్తి, కామములు లేనిది, పాపాలు, అకుశల ధర్మాలు లేనిది, వితర్కము, విచారము గల వివేకజమనే ప్రీతి సుఖమయిన మొదటి ధ్యానం పొంది విహరించాడు. తర్వాత, అతనికి వితర్కాలు, విచారాలు ఉపశమించాయి. మనస్సు ప్రసన్నమయింది. అప్పుడు, ఏకోభావంవల్ల వితర్కాలు, విచారాలు లేని సమాధిజం అనే ప్రీతి సుఖమయిన రెండవ ధ్యానం పొంది విహరించాడు. పిదప అతడు విరాగంవల్ల ప్రీతిని ఉపేక్షించి విహరించాడు. స్మృతి కలిగి, సుఖం తెలుసుకొంటూ, దేహంతో ప్రతిసంవేదన పొందుతూ పెద్దలు అన్నట్టు ఉపేక్షకుడు, స్మృతిమంతుడు, సుఖవిహారి అయి నిష్ప్రీతికం అనే మూడవ ధ్యానం పొంది విహరించాడు. అనంతరం అతడు సుఖాన్ని, దుఃఖాన్ని వదలి, అంతకుముందే సౌమనస్య దౌర్మనస్యాలు అణగిపోవడం వల్ల ఆదుఃఖమూ, ఆసుఖమూ, ఉపేక్షాస్మృతి పరిశుద్ధమూ అయిన నాల్గవ ధ్యానం పొంది విహరించాడు.

తర్వాత బోధిసత్త్వుడు, చిత్తం పరిశుద్ధమూ, పర్యవదాతమూ, ప్రభాస్వరమూ, కామరహితమూ, క్లేశాలు నశించినదీ కాగా, మృదువైన కర్మ అనింద్యమైనది ప్రాప్తించగా, రాత్రి మొదటి జాములో దివ్యమైన చక్షుస్సువలన జ్ఞానదర్శన విద్యను ప్రత్యక్షం చేసుకొనడానికి మనస్సును నిశ్చయపరచుకున్నాడు; సిద్ధపరచుకున్నాడు.

బోధిసత్త్వుడు పరిశుద్ధమూ, మనుష్యులకు అతీతమూ అయిన దివ్య చక్షుస్సుతో ప్రాణులను చూస్తూ ఉండినాడు. జారిపోతున్నవారూ, జారనివారూ, సువర్ణులూ, దుర్వర్ణులూ, సుగతులూ, దుర్గతులూ, హీనులూ, ప్రణీతులూ, యథాకర్మోపగులూ అయిన ప్రాణులను తెలుసుకుంటూ



ఉండినాడు. అతని మనస్సులో ఇట్లు తోచినది. ‘‘అయ్యో! ఈ సత్త్వాలు దేహంవల్ల పాపులై వుంటూ, వాక్కుచేతను, మనస్సుచేతను, పాపాలను చేస్తూ వుంటే, ఆర్యులకు అపవాదకులయి, మిథ్యాదృష్టి కల్గి మిథ్యాదృష్టి వల్లనూ, మిథ్యాకర్మలవల్లనూ, మిథ్యాధర్మాలవల్లనూ, తమ శరీరం పతనమైనపిమ్మట నరకంలో పడి అపాయాన్నీ, దుర్గతినీ, వినిపాతాన్నీ పొందుతున్నారు. వీరే మళ్ళీ జన్మిస్తూ కాయంవల్ల సుచరితం పొంది, వాఙ్మనస్సులవల్ల సుచరిత్రులయి, ఆర్యులకు అనపవాదకులయి, సమ్యక్ దృష్టి కలిగి వున్నట్లయితే, ఆ సమ్యక్‌దృష్టి సమ్యక్కర్మ, సమ్యగ్ధర్మాలూ, పొందిన హేతువువల్ల శరీరం పడిపోయిన పిదప స్వర్గలోకంలో సుగతిని పొందగల్గుతారు.’’

ఈ విధంగా బోధిసత్త్వుడు పరిశుద్ధమూ, మనుష్యులకు అతీతమూ అయిన దివ్యచక్షుస్సుతో ప్రాణులను చూస్తూ వుండినాడు. జారిపోతున్న వారూ, జారనివారూ, సువర్ణులూ, దుర్వర్ణులూ, సుగతులూ, దుర్గతులూ, హీనులూ, ప్రణీతులూ, యథాకర్మోపగులూ అయిన ప్రాణులను చూస్తూ వుండినాడు. ఓ భిక్షులారా, బోధిసత్త్వుడు ఈ విధంగా రాత్రి మొదటి జాములో విద్యను సాక్షాత్కరింపజేసుకొని, తమస్సును పోగొట్టి, వెలుగును వ్యాపింపజేస్తూ వుండినాడు.

తర్వాత బోధిసత్త్వుడు చిత్తము పరిశుద్ధమూ, పర్యవదాతమూ, ప్రభాస్వరమూ, అనంగనమూ, క్లేశాలు నశించినదీ కాగా, మృదువైన కర్మ అనింద్యమైనది ప్రాప్తించగా, రాత్రి మధ్యమయామంలో పూర్వనివాసానుస్మృతి జ్ఞానదర్శన విద్యను సాక్షాత్కరింపజేసుకొనడానికి మనస్సును నిశ్చయపరచుకున్నాడు; సిద్ధపరచుకొన్నాడు. ఆయన తన యితర సత్త్వముల పూర్వ నివాసాలను స్మరణకు తెచ్చుకుంటూ వుండినాడు. ఎట్లనగా — ఒక జాతినీ, రెండు, మూడు, నాలుగు, ఐదు, పది, ఇరవై, ముప్ఫయి, నలభై, ఏభై జన్మలనూ, నూరు, వెయ్యి, లక్ష జన్మలనూ అనేక లక్షల జన్మలనూ; కోట్లు, నూరుకోట్లు, వేలకొద్దీ కోట్ల జన్మలనూ, నయుతకోట్ల జాతులనూ, సహస్రకోట్ల జన్మలనూ, అనేక లక్షల కోట్లూ, నయుత లక్షలకోట్లూ, సంవర్తకల్పమూ, వివర్తకల్పమూ,

సంవర్తవివర్తకల్పమూ, అనేక సంవర్తవివర్తకల్పములు అయిన జన్మలను స్మరిస్తూ ఉండినాడు. "నేను యిక్కడ పుట్టినాను. ఈ గోత్రంలో, ఈ జాతిలో పుట్టినాను. ఈ వర్ణము గలవాడను. నా ఆహారం యిటువంటిది. ఇంత ఆయుస్సు ఉండినది. ఇట్టి సిరసితి కలవాడను. ఇలాంటి సుఖాలూ; దుఃఖాలూ కలిగేవి. నేను అక్కడనుంచి చ్యుతుడనయి ఇక్కడికి వచ్చాను" అని ఈ విధంగా తన జన్మల ఉద్దేశమునూ, స్వరూపాదులనూ స్మరిస్తూ, బోధిసత్త్వుడు ఇతర సత్త్వాల పూర్వ నివాసాలను కూడా అను స్మరిస్తూ వుండినాడు.

తర్వాత బోధిసత్త్వుడు చిత్తము పరిశుద్ధమూ, పర్యవదాతమూ, ప్రభాస్వరమూ, అనంగమూ, క్లేశాలు నశించినదీ కాగా, మృదువై అనింద్యమైన కర్మ ప్రాప్తించగా, రాత్రి చివరి జాములో అరుణోదయ మయ్యే సమయములో నందీముఖిరాత్రిలో, దుఃఖసముదయం నశించగా ఆశ్రయక్షయ జ్ఞానవిద్యను సాక్షాత్కరింపజేసుకొనడానికి మనస్సును నిశ్చయపరచుకున్నాడు; సిద్ధంగా ఉంచుకున్నాడు.

అప్పుడు అతని మనస్సులో ఇలా తోచినది. "అయ్యో! ఎంత కష్టం! ఈ లోకం ఆపదలకు లొంగి ఉన్నది! ఇది పుట్టి శిథిలమయి నశించి, చ్యుతమవుతూ ఉన్నది. అంతేకాని; కేవలమై, గొప్పదైన యీ దుఃఖస్కంధమునుంచి తప్పించుకొనడం తెలుసుకోలేకున్నది. జరా వ్యాధి మరణాలతో కూడిన యీ మహాదుఃఖస్కంధాన్ని పోగొట్టే క్రియను తెలుసుకోలేకున్నది."

ఇలా ఆలోచించగా, బోధిసత్త్వుని మనస్సులో ఇలా తోచినది. "ఏది ఉన్నప్పుడు జరామరణాలు కలుగుతున్నవి? ఈ జరామరణాలు కలగడానికి కారణం యేమిటి?" అని. ఆలోచించగా, అతనికే సమాధానం తోచినది "జాతి (జన్మ) ఉన్నప్పుడు జరామరణాలు కలుగుతూ వున్నవి. జరామరణాలకు అదే కారణం" అని. ఆ తర్వాత బోధిసత్త్వునికి మళ్ళీ యిలా ప్రశ్న కలిగింది. "ఏది ఉన్నప్పుడు జాతి కలుగుతున్నది? ఆ జాతికి కారణం ఏమిటి?" అని. 'భవం ఉన్నప్పుడు జాతి వుంటుంది. జాతికి భవమే కారణం' అని అతనికే సమాధానం తోచింది. "దేనినిబట్టి భవం కలుగుతుంది? భవానికి కారణం యేమిటి?"



అని అతనికి ప్రశ్న కలిగి ఉపాదానంవల్ల భవం కలుగుతున్నదనీ, భవమునకు ఉపాదానమే కారణ మనీ తోచినది.

తర్వాత బోధిసత్త్వుడికి "ఏది వుంటే ఉపాదానం కలుగుతుంది? ఈ ఉపాదానానికి కారణం ఏమిటి?" అనే ప్రశ్న కలిగింది. తృష్ణ ఉంటేనే ఉపాదానం కలుగుతుందనీ, తృష్ణయే ఉపాదానానికి కారణ మనీ సమాధానం తోచింది. ఆ తర్వాత 'ఏది వున్నప్పుడు తృష్ణ కలుగుతుం దనీ, తృష్ణకు కారణం ఏమిటనీ ప్రశ్న కలుగగా, వేదన ఉన్నప్పుడు తృష్ణ కలుగుతుందనీ, వేదనయే తృష్ణకు కారణమనీ, అతనికే సమాధానం తోచింది.

తర్వాత అతనికి "ఏది వున్నప్పుడు వేదన కలుగుతుంది? వేదనకు కారణం ఏది?" అని ప్రశ్న కలుగగా, "స్పర్శం ఉండగా వేదన కలుగు తుంది. వేదన కలగడానికి స్పర్శయే కారణం" అని సమాధానం తోచింది. తర్వాత బోధిసత్త్వుడికి "ఏది వున్నప్పుడు స్పర్శ కలుగుతుంది? స్పర్శ కలగడానికి కారణం ఏమిటి?" అనే ప్రశ్న కలిగి, "షడాయ తనం ఉన్నప్పుడు స్పర్శ కలుగుతుంది. షడాయతనమే స్పర్శకు కారణం" అని తోచింది.

తర్వాత "షడాయతనం ఏది వున్నప్పుడు కలుగుతుంది? షడాయ తనానికి కారణం యేమిటి?" అనే ప్రశ్న కలిగి, వెంటనే, నామరూపా లుంటే షడాయతనం కలుగుతుందనీ, నామరూపాలే షడాయతనానికి కారణమనీ తోచినది. "ఏది వున్నప్పుడు నామరూపాలు కలుగుతాయి? నామరూపాలు కలగడానికి కారణం ఏది?" అని బోధిసత్త్వునికి తర్వాత ఆలోచన కలిగింది. ఆలోచింపగా—విజ్ఞానం ఉన్నప్పుడే నామరూపాలు కలుగుతాయనీ, విజ్ఞానమే నామరూపాలకు కారణమనీ తెలిసింది.

తర్వాత "ఏది వున్నప్పుడు విజ్ఞానం కలుగుతుంది? విజ్ఞానానికి కారణం ఏమిటి?" అనే ఆలోచన కలిగి "సంస్కారాలు ఉండగా విజ్ఞానం కలుగుతుంది. సంస్కారాలే విజ్ఞానానికి కారణం" అనీ తెలిసింది. తర్వాత అతనికి "ఏది వున్నప్పుడు సంస్కారాలు కలుగుతాయి? సంస్కారాలు కలగడానికి ఏది కారణం?" అనే ప్రశ్న కలిగింది.

దానికి "అవిద్య ఉన్నప్పుడే సంస్కారాలు కలుగుతాయి. అవిద్యయే సంస్కారాలకు కారణం" అని సమాధానం తోచింది.

ఓ భిక్షులారా, తర్వాత బోధిసత్త్వుడు ఇట్లు నిర్ణయించుకున్నాడు. 'అవిద్యవలన సంస్కారాలు కలుగుతాయి. సంస్కారాల వలన విజ్ఞానమూ, విజ్ఞానంవల్ల నామరూపాలూ, నామరూపాలవల్ల షడాయతనమూ, షడాయతనంవల్ల స్పర్శమూ, స్పర్శంవల్ల వేదన, వేదనవల్ల తృష్ణ, తృష్ణవల్ల ఉపాదానమూ, ఉపాదానంవల్ల భవమూ, భవంవల్ల జాతి, జాతివల్ల జరామరణ శోకపరిదేవదుఃఖ దౌర్మనస్యోపాయాసములు సంభవిస్తున్నవి. ఈ విధంగా కేవలమూ గొప్పది అయిన దుఃఖస్కంధసముదయం ముచ్చి ముమ్మాటికి కలుగుతున్నది" అని.

ఈ విధంగా బోధిసత్త్వునికి పూర్వం అశ్రుతాలైన ధర్మాలలో మనస్సులో కారణగవేషణవల్ల, బహులీకారమువల్ల జ్ఞానం కలిగినది. చక్షుస్సు, విద్య, భూతి కలిగినవి. మేధ కలిగింది. ప్రజ్ఞ కలిగింది. తేజస్సు ప్రాదుర్భవించినది. ఏది ఉన్నప్పుడు జరామరణములు కలుగవో, దేని నిరోధంవలన జరామరణముల నిరోధం కలుగునో, అది తెలిసినది. జాతి లేక ఉన్నప్పుడే జరామరణాలు ఉండవనీ, జాతి నిరోధంవల్లనే జరామరణాలను నిరోధించవచ్చుననీ తెలిసింది.

తర్వాత బోధిసత్త్వునికి ఇలా తోచినది. "ఏది లేనప్పుడు జాతి ఉండదు? దేని నిరోధంవల్ల జాతి నిరోధం కలుగుతుంది?" అని. భవం ఉంటే జాతి కలుగుతుందనీ, భవ నిరోధంవల్లనే జాతి నిరోధం కలుగుతుందనీ సమాధానం తోచింది కూడా.

తర్వాత బోధిసత్త్వుని మనస్సులో తిరిగి "ఏది విస్తారంగా లేకపోతే సంస్కారాలు లేకుండా ఉంటాయో, దేని నిరోధంవల్ల సంస్కార నిరోధం కలుగుతుందో" అనే ప్రశ్న కలిగి, అవిద్య లేకపోతే సంస్కారాలు సంభవించవనీ, అవిద్యానిరోధంవల్ల సంస్కార నిరోధం కలుగుతుందనీ తోచింది. సంస్కార నిరోధంవల్ల విజ్ఞాన నిరోధమున్నూ, జాతి నిరోధంవల్ల జరామరణ శోక పరిదేవదుఃఖ దౌర్మనస్యోపాయాసములు



నిరోధింపబడతాయనిన్నీ సమాధానం తోచింది. గొప్పదైన యీ దుఃఖస్కంధాన్ని యీవిధంగా నిరోధించవచ్చునని ఆయన నిశ్చయించాడు.

ఓ భిక్షులారా, ఈ విధంగా బోధిసత్త్వునికి పూర్వం అశ్రుతాలైన ధర్మాలలో మనస్సులో కారణగవేషణవల్ల బహులీకారంవల్ల జ్ఞానం కలిగింది. చక్షుస్సు, విద్య, భూతి, కలిగినవి. మేధ, ప్రజ్ఞ, తేజస్సు కలిగినవి. ఓ భిక్షులారా, ఆ సమయంలో నేనే యిదంతా దుఃఖమని యథాభూతంగా (ప్రతి భూతానుసారంగా) తెలుసుకొన్నాను. అది ఆశ్రవ (దోష) సముదాయమనీ, ఇది ఆశ్రవ నిరోధమనీ, ఇది ఆశ్రవ నిరోధగామిని ప్రతిపత్ (జ్ఞానం) అనీ, యథాభూతమైనదానిని తెలుసుకొన్నాను. ఇది కామాశ్రవము, ఇది భవాశ్రవము, ఇది అవిద్యాశ్రవము, ఇది దృష్ట్యాశ్రవము—ఈ ఆశ్రవాలన్నీ నిరవశేషంగా అరికట్టబడగలవు. ఇక్కడ ఆశ్రవం నిరవశేషంగా అనాభాసమై అస్తమించగలదు. అది అవిద్య, అది అవిద్యా సముదాయం, అది అవిద్యా నిరోధం, అది అవిద్యా నిరోధగామిని ప్రతిపత్ అని యథాభూతంగా తెలుసుకున్నాను. ఇక్కడ అవిద్య అపరిశేషమై అనాభాసమై అస్తమించగలదని తెలుసుకున్నాను. ఇది సంస్కారాలు, ఇది సంస్కార సముదయం, ఇది సంస్కార నిరోధము, ఇది సంస్కార నిరోధగామిని ప్రతిపత్ అని యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది విజ్ఞానమనీ, ఇది విజ్ఞాన సముదయమనీ, ఇది విజ్ఞాన నిరోధమనీ, ఇది విజ్ఞాన నిరోధగామిని ప్రతిపత్ అనీ తెలుసుకున్నాను. ఇది నామరూపమనీ, ఇది నామరూపనిరోధమనీ, ఇది నామరూప నరోధగామిని ప్రతిపత్ అనీ తెలుసుకున్నాను. ఇది షడాయతనమనీ, ఇది షడాయతన నిరోధమనీ, ఇది షడాయతన నిరోధగామిని ప్రతిపత్ అనీ యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది స్పర్శమని, ఇది స్పర్శసముదాయమని, ఇది స్పర్శ నిరోధమనీ, ఇది స్పర్శ నిరోధగామిని ప్రతిపత్ అనీ, తెలుసుకున్నాను. ఇది వేదన అనీ, ఇది వేదనా సముదాయమనీ, ఇది వేదనా నిరోధమనీ, ఇది వేదనా నిరోధగామిని ప్రతిపత్ అనీ యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది తృష్ణఅని, ఇది తృష్ణా సముదయమనీ, ఇది తృష్ణా నిరోధమనీ, ఇది తృష్ణానిరోధగామిని ప్రతిపత్ అనీ యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది ఉపాదానము, ఇది ఉపాదాన సముదయము, ఇది ఉపాదాన నిరో

ధము, ఇది ఉపాదాన నిరోధగామిని ప్రతిపత్ అని యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది భవమూ, ఇది భవసముదయము, ఇది భవనిరోధము, ఇది భవనిరోధగామిని ప్రతిపత్ అని యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది జాతి, ఇది జాతి సముదయం, ఇది జాతి నిరోధం, ఇది జాతి నిరోధ గామిని ప్రతిపత్ అని యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది జర, ఇది జరాసముదాయం, ఇది జరానిరోధం, ఇది జరానిరోధగామిని ప్రతిపత్ అని యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది మరణం. ఇది మరణ సముదయం, ఇది మరణ నిరోధం, మరణ నిరోధగామిని ప్రతిపత్ అని యథాభూతంగా తెలుసుకున్నాను. ఇవి శోక పరిదేవదుఃఖదౌర్మనస్యోపాయాసాలనీ, ఈ విధంగా ఎక్కువైన యీ దుఃఖస్కంధం సంభవిస్తుందనీ, యీ విధంగా నిరోధం కలుగుతుందనీ యథాభూతంగా తెలుసుకున్నాను. ఇది దుఃఖమనీ, ఇది దుఃఖ సముదయమనీ, ఇది దుఃఖ నిరోధమనీ, ఇది దుఃఖ నిరోధగామిని అనీ యథాభూతంగా తెలుసుకున్నాను.''

ఓ భిక్షులారా, ఈ విధంగా బోధిసత్త్వుడు నందీముఖి రాత్రియందు, రాత్రి చివరిజాములో అరుణోదయ సమయంలో — ఒకానొక సత్పురుషుడూ, అతిపురుషుడూ, మహాపురుషుడూ, పురుషర్షభుడూ, పురుషనాగుడూ, పురుషసింహుడూ, పురుషపుంగవుడూ, పురుష శూరుడూ, పురుషధీరుడూ, పురుషపద్ముడూ, పురుషపుండరీకుడూ, పురుషధౌరేయుడూ, అనుత్తరుడూ, పురుషదమ్యసారథీ అయిన ఆర్యుని చేత జ్ఞానమూలంగా జ్ఞాతవ్యమూ, బోద్ధవ్యమూ, ప్రాప్తవ్యమూ, ద్రష్టవ్యమూ, సాక్షాత్కారం పొందదగినదీ అయిన సమస్తమునూ ఏక చిత్తక్షణసమాయుక్తితో — ప్రజ్ఞతో — అనుత్తరమైన సమ్యక్సంబోధిని తెలుసుకొని త్రైవిద్యను పొందినాడు.

ఓ భిక్షులారా, అప్పుడు దేవతలు ఇలా అన్నారు — ''ఓ మార్షులారా! భగవానుడైన బోధిసత్త్వుడు సంబుద్ధిని పొందినాడు. పూలవర్షం కురిపించండి'' అని. పూర్వబుద్ధులను చూచిన దేవపుత్రులు కొందరు — అక్కడికి వచ్చినవారు ''ఓ మార్షులారా! మీరు తొందరపడవద్దు. భగవానుడు నిమిత్తాన్ని ప్రాదుర్భవింపజేసినప్పుడే పుష్పాలను చల్లవలెను.



ప్రాచీనులైన — సమ్యక్సంబుద్ధులు కూడా నిమిత్తాన్ని వెల్లడింపజేసి ఉన్నారు'' అని అన్నారు.

ఓ భిక్షులారా, ఆ సమయంలో తథాగతుడు దేవపుత్రులు విమతిని పొంది ఉన్నారని తెలుసుకొని, సప్త తాళముల ప్రమాణం ఆకాశం పైకి లేచి, అక్కడనుంచే ఈ ఉదానమును వెల్లడించినాడు : —

''భిన్న వర్త్మోపసాన్త రజాః శుష్కా ఆశ్రవా నపున శ్రవన్తి,
భిన్నే వర్త్మని వర్తత దుఃఖస్యైవోఽన్త ఉచ్యతే.''

సంసారమార్గం భిన్నమైనది. రజస్సు శాంతించినది. ఆశ్రవాలు (దుఃఖాలు) శుష్కించినవి. భిన్నమైన మార్గంలో నడవండి. ఇది దుఃఖానికి అంతము.

తర్వాత ఆ దేవపుత్రులు దివ్యములైన పుష్పాలను తథాగతుని పైని వర్షించారు. అవి ఎంత కురిసినా అతని మోకాళ్ళవరకు మాత్రమే కప్పగలిగాయి.

ఓ భిక్షులారా, తథాగతుడు సమ్యక్సంబుద్ధిని పొందగా, తమోఽంధకారం చెదరిపోయింది. తృష్ణ శోధించబడినది. దృష్టి త్రిప్పబడినది. క్లేశాలు క్షోభపడ్డాయి. శల్యాలు తీసివెయ్యబడినవి. గ్రంథి విప్పబడినది. మానధ్వజం పడగొట్టబడినది. ధర్మధ్వజం ఎత్తబడినది. అనుశయాలు (ద్వేషాలు) సమసిపోయాయి. ధర్మం యథార్థత అవగతమైనది. ప్రాణికోటి మేల్కొల్పబడింది. ధర్మధాతువు పరిజ్ఞాతమైనది. సత్త్వధాతువు స్థాపించబడినది. సమ్యజ్నియతమైన రాశి ప్రకాశించింది. మిథ్యాత్వనియతమైన రాశి రంగుచెడింది. అనియతరాశి పరిగ్రహించబడినది. సత్త్వేంద్రియాలు వ్యవస్థాపించబడినవి. సత్త్వచరిత్ర పరిజ్ఞాతమైనది. సత్త్వవ్యాధి తెలుసుకొనబడినది. సత్త్వ సముత్థాన సిద్ధమైన ఔషధ ప్రయోగం తెలుసుకోబడినది. వైద్యరాజు జన్మించాడు. అతడు సర్వదుఃఖములనుండియు విడుదలను కలిగించేవాడు. నిర్వాఖసుఖాన్ని కలిగిస్తాడు. తథాగత మహాధర్మరాజాసనంపై ఆయన కూర్చున్నాడు. సమస్తబుద్ధులచేతను అసంభిన్నమైన ధర్మధాతువు వ్యాప్తి చేయించబడినది.

ఓ భిక్షులారా, తథాగతుడు మొదటి వారం దినములు బోధి మండంలోనే కూర్చుండి ఉన్నాడు. "ఇక్కడనే నేను అనుత్తరమైన సమ్యక్సంబోధిని తెలుసుకున్నాను. జాతి, జరామరణదుఃఖాలు అంతమొందగలవు" అని ఆయన మనస్సులో అనుకొనినాడు.

ఓ భిక్షులారా, బోధిసత్త్వునికి ఆ వెంటనే సర్వజ్ఞత్వం ప్రాప్తించగా, పది దిక్కులందును, సమస్త లోక ధాతువులందును, సమస్త ప్రాణులకూ తత్ క్షణమే పరమ సుఖం లభించినది. సర్వలోక ధాతువులున్నూ గొప్ప అవభాసంతో అవభాసించినవి. లోకాంతరికా లయిన అఘమఃలూ, అఘస్ఫుటాలూ, అంధకారాలూ అవభాసించాయి. షడ్వికారమైన ప్రదేశం; దశ దిక్కులలోనూ ఉన్న సర్వలోక ధాతువులూ మిక్కిలి చలించాయి. ఎంతో క్షోభించాయి. ఎంతో ధ్వనించాయి. మిక్కిలి గర్జించాయి. సర్వబుద్ధులున్నూ అభిసంబుద్ధుడైన తథాగతుని గురించి సాధువాదాలు పలికారు. ధర్మాచ్ఛాదములను పంపారు. అవి త్రిసాహస్ర మహాసాహస్రమైన లోకధాతువును అనేక రత్నాలతో కూడిన ఛత్రాలతో కప్పినవి. ఆ రత్నఛత్రాలనుంచి కాంతి జాలాలు వ్యాపించి, ఆ కాంతి జాలాలవల్ల దశ దిక్కులలోనూ అప్రమేయంగానూ, అసంఖ్యేయంగానూ ఉన్న లోకధాతువులు అవభాసింపసాగినవి. పది దిక్కులలోనూ ఉన్న బోధిసత్త్వులూ, దేవపుత్రులున్నూ ఆనంద శబ్దాన్ని ఉచ్చరింపసాగారు:- "సత్త్వపండితుడైన బోధిసత్త్వుడు ఉద్భవించాడు. అతడు జ్ఞాన సరస్సులోని పద్మం. లోక ధర్మాలతో అనుపలిప్తుడై ఆయన అవతరించాడు. అంతటనూ మహాకరుణా మేఘాలను కల్పించి, ధర్మధాతు భవనంపైని వర్షం కురిపిస్తాడు. ఆ ధర్మ వర్షంవల్ల జనులకు కావలసిన ఔషధాంకురాలు మొలకలెత్తి సర్వ కుశల మూల బీజాలు వృద్ధి పొందుతాయి. ముక్తి ఫలాలను ఆయన ప్రసాదించగలడు."

ఇక్కడ కొన్ని ప్రాచీన శ్లోకాలున్నాయి. వాటి భావ మిది:

పురుషసింహుడైన బోధిసత్త్వుడు సైన్యసహితుడైన మారుని జయించి, అభిముఖమైన ధ్యానాముఖాన్ని శాసించాడు. దశబలుడైన ఆయన త్రైవిద్యను పొందగా, పది దిక్కులూ, క్షేత్రకోటులూ కంపిం-



చాయి. ధర్మకాములు బోధిసత్త్వుని యెదుటికి వచ్చి కాళ్ళపైని బడి, "మిక్కిలి భయంకరమైన మారుని సైన్యాన్ని నీ ప్రజ్ఞాపుణ్యబలంతోనూ, వీర్యబలంతోనూ జయించినావు. ఎక్కడా అలసిపోలేదు కదా!" అని పలికారు. ఆయుత సంఖ్యలలో ఉన్న క్షేత్రాలలోని బుద్ధులు ఛత్రాలను పంపి "ఓ సాధూ! మహాపురుషుడా! నీవు మారసైన్యాన్ని బెదరగొట్టి ఉత్తమమూ, శోకరహితమూ, అమృతమూ అయిన స్థానాన్ని పొందావు. శీఘ్రంగా మూడు లోకాల్లోనూ ఉత్తమధర్మ వర్షాన్ని కురిసించు" అని అన్నారు. పది దిక్కులయందును ఉన్న సత్త్వసారులు బాహువులు చాచి, కలవింకస్వరం గల మాటలతో "ఓ మహాపురుషుడా! పరిశుద్ధమైన బోధిని నీవు పొందావు. నీవు నేయిలోని నేయితేటవంటివాడివి" అని ప్రశంసించారు.

ఓ భిక్షులారా, తర్వాత కామావచరులైన దేవపుత్రులు అక్కడికి వచ్చారు. బోధిమండంలో ఆసీనుడైన తథాగతుని దర్శించారు, అతడు ఎలాటివాడంటే, అభిజ్ఞను పొందిన పరిపూర్ణ సంకల్పుడు. సంగ్రామంలో విరోధి అయిన మారుణ్ణి జయించి, ఛత్రధ్వజ పతాకాలను పైకెత్తిన జయశీలుడైన శూరుడు. మహాపురుషుడైన పురుషుడు. మహా శల్యాలు హరించే వైద్యోత్తముడు. భయం, ఆశ్చర్యం, రోమాంచం లేని సింహంవంటివాడు. దాంతచిత్తుడైన గజరాజువంటివాడు. త్రిమలాలు తొలగి నిర్మలుడైనవాడు. త్రైవిద్యలు పొందిన వైద్యుడు. నాలుగు ప్రవాహాలూ దాటిన పారగుడు. ఏకరత్న ఛత్రాధిపతి అయిన క్షత్రియుడు. పాపకర్మలు లేని త్రైలోక్య బ్రాహ్మణుడు. అవిద్యాండకోశం భేదించిన భిక్షువు. సర్వసంగాలు తొలగిన శ్రమణుడు. క్లేశాలు తొలగిన శ్రోత్రియుడు. ఎన్నడూ తన పతాకం దించని మహా శూరుడు. దశబలాలు గల బలవంతుడు. రత్నాకరంవలెనే సర్వధర్మ రత్న సంపూర్ణుడు. తథాగతుడు ఇలాటివాడని వారు తెలుసుకుని, బోధిమండానికి అభిముఖులై నిలబడి, కొన్ని గాథలతో స్తుతించారు: వాటి భావమిది:

ఈ బోధిసత్త్వుడు మార సైన్యాన్ని జయించి ద్రుమరాజమూలంలో ఉన్నాడు. భయం లేకుండా మాటలాడుతున్నాడు. మేరు పర్వతంవలెనే

చలనం లేనివాడు. । అనేక కల్పకోట్ల సంవత్సరాలు దానదమసంయమంతో ప్రబోధిని పొందాడు. అందువల్ల మిక్కిలి శోభిస్తున్నాడు. బహు కల్పకోటి సంవత్సరాలు శీలవ్రత తపస్సుచేత ఈయన ఇంద్రుడు, బ్రహ్మ మొదలైనవారిని అతిశయించాడు. ఉత్తమబోధిని పొందాడు. బహుకల్ప కోటి సంవత్సరాలు క్షాంతిబలం కవచంగా దుఃఖాలను జయించాడు. అందువల్లనే బంగారువర్ణం గల తేజస్సు ఈయనకు కలిగినది. బహుకల్ప కోటి సంవత్సరాల వీర్య బల విక్రమంతో ఈయన మారుని సేనను జయించి, తరిమివేశాడు. అనేక కల్పకోటి వత్సరాలు ధ్యానంతోనూ, అభిజ్ఞా జ్ఞానాలతోనూ ఈయన మునీంద్రులను పూజించి, యిప్పుడు ఆ మునీంద్రులవల్లనే పూజలను పొందుతున్నాడు. ఈయన బహుకల్పకోటి సంవత్సరాలు ప్రజ్ఞాశ్రుతాలతో సత్త్వకోటులను స్వాధీనం చేసుకొని; సులభంగా బోధిని పొందాడు. స్కంధమారుణ్ణీ మృత్యు కేశమారుణ్ణీ, దేవపుత్రమారుణ్ణీ ఈయన జయించాడు. అందువల్ల ఈతనికి శోకం లేదు. ఈయన దేవదేవుడు. దేవతలకున్నూ పూజనీయుడు. మూడు లోకాలకూ పూజార్హుడు. అమృత ఫలాన్ని యిచ్చేవాడు. ఇతడు వరదక్షిణీయుడు. ఈయన అనుత్తరమైన బోధిని పొందాడు. బహుక్షేత్ర కోటులలో ఈతని తేజస్సు మిక్కిలి విరాజిల్లుతూ ఉన్నది. అది సూర్యచంద్రుల తేజస్సును అధఃకరిస్తూ, అంధకారము నంతటినీ పోగొట్టి వెలుగును కలిగిస్తూ ఉన్నది. చక్కని రూపం కలవాడూ, వరలక్షణుడూ, హితైషీ అయిన ఇతడు త్రైలోక్యపూజ్యుడు. విశుద్ధనేత్రుడైన యితడు అనేక విషయాలను, అనేక చిత్తములను, చేతనలను చూడగలడు. విశుద్ధ గోత్రుడైన ఇతడు అనంతాలైన శబ్దాలను దివ్యాలనూ, మానుషాలనూ, జినశబ్దాలను వింటాడు. పెద్ద నాలుక, కలవింకస్వరమూ ఇతనికి ఉన్నాయి. అమృతమయమై, ప్రశాంతమైన యితని ధర్మాన్ని వింటాము. మార సైన్యాన్ని చూచినా ఇతని మనస్సు కలతపడదు. మేధావి యైన ఇతడు దేవసంఘాలను చూచినా, హర్షించడు. ఇతడు శస్త్రములచేతను, బాణములచేతను మార సైన్యాన్ని జయించలేదు. దుష్టమల్లుడైన మారుడు ఇతని సత్యవ్రత తపస్సుల చేతనే జయింపబడినాడు. ఇతడు ఆసనంనుంచి చలించకుండా, దేహాన్ని కదపకుండా అతన్ని జయించాడు. స్నేహంగాని,ద్వేషంగాని యితనికిలేవు.



ఓ మహామునీ. నరులకూ దేవతలకూ నీవల్ల గొప్ప లాభాలు కలిగాయి. నీవు బోధించిన ధర్మాన్ని వినగా, వారికి ప్రతిపత్తి కలిగినది. పుణ్య, తేజోరాశివైన ఓ జినుడా, అందరూ నిన్ను స్తుతించి మనుష్య చంద్రుడవైన నీతో సమానులుగా-శీఘ్రంగానే కానున్నారు.

పురుషర్షభ నాయకుడు బోధిని తెలుసుకొని మారుణ్ణి జయించి, కలవింకరుతంతో సమానమైన బ్రహ్మస్వరంతో మొదటిసారి గాథలను భాషించాడు. అతడు మారుణ్ణి జయించి బోధిని పొందుతాడు. శాంత మార్గంలో నడిచి నిర్వృతిని శీతిభావాన్ని పొందుతాడు.

"సమస్త దుఃఖాలనూ పోగొట్టేది పుణ్యవిపాకం. పుణ్యాత్ముడైన నరునికి పుణ్యాలు చేయడంవల్ల తృప్తి కలుగుతుంది. అమృతప్రాయమైన ధర్మాన్ని వింటే విశేషంగా తృప్తి లభిస్తుంది. విజనమైన వనంలో విహరిస్తే తృప్తి కలుగుతుంది. సత్యార్థసముపార్జనంలో ఆసక్తి కలవానికి తృప్తి ఎందుకు కలుగదు?"

బోధిసత్త్వుడు తన్ను పూజించుటకు వచ్చిన బోధిసత్త్వుల పూజలను గ్రహించి, తన హస్తాన్ని చాచుతూ "మీ మీ క్షేత్రాలకు వెళ్ళవచ్చును" అని చెప్పగా, వారందరూ తథాగతుని పాదాలకు ప్రణతులను సమర్పించి, నానావ్యూహాలతో తమ తమ క్షేత్రాలకు వెళ్ళిపోయారు.

నముచుల ఆ పెద్ద అవస్థనూ, సుగతుని సలీలమైన ఆ విక్రీడితమునూ చూచి, ప్రాణులన్నీ మనస్సున బోధాన్ని గురించి ప్రణిధానం పొంది సైన్య సహితుడైన మారుణ్ణి జయించి అమృతాన్ని పొందగలమని భావించాయి.

ఓ భిక్షులారా, ఆ సమయంలో బోధి వృక్షమూలంలో సింహాసనం పైని కూర్చున్న ।బోధిసత్త్వునికి అనేక విక్రీడితాలు అప్రమేయాలు సంభవించినవి. వానిని సుకరంగా వర్ణించడం కల్పాలకొద్దీ సంవత్సరాలయినా చాలవు. ఇక్కడ కొన్ని శ్లోకాలున్నాయి. వాటి అభిప్రాయం యిది.

"భూ ప్రదేశం అంతా కరతలంతో సమానమై, చక్కగా అయింది. పద్మాలు వికసించి, రశ్మి జాలాలతో ఒప్పి వుండినవి. వేలకొద్దీ దేవతలు బోధిమండం చుట్టునూ చేరి నమస్కరిస్తూ ఉన్నారు. ఇది సింహనాదుడైన అతడు చూచిన మొదటి నిమిత్తము! మూడు లక్షల వృక్షములు బోధిమండంవైపు ఒంగి ఉండినవి. శైలరాజమైన మేరుపర్వతం మొదలైన పర్వతములు చాలా వంగి ఉండినవి. బ్రహ్మ, ఇంద్రుడు మొదలైనవారు దశబలుడైన బోధిసత్త్వునికి నమస్కరిస్తూ ఉండిరి. బోధిమండంలో ఇది మనుష్యసింహుడైన బోధిసత్త్వుని రెండవ విక్రీడితం! అతని శరీరం నుండి లక్షలకొద్దీ కాంతి కిరణాలు వెలువడ్డాయి. మూడు అపాయాలు శాంతించాయి. ఆ శుభసమయంలోనే అమంగళాలు శోధించబడ్డవి. ఏ సత్త్వమున్నూ ఖిల, మద, దోషాలవల్ల బాధపడలేదు. ఇది కూడా పురుషసింహుడైన బోధిసత్త్వుని మరియొక విక్రీడితం! సూర్యచంద్రులు, మణులు, అగ్ని, మెరుపులు మున్నగువాని తేజమువంటి దివ్యమైన తేజస్సు ఇతనినుండి వెలువడింది. అది యెవ్వరినీ తపింపజేయలేదు. ఎవ్వరునూ శాస్త అయిన బోధిసత్త్వుని శిరస్సును చూడలేరు. ఇది మరియొక విక్రీడితము! బోధిసత్త్వుని కరతల సంస్పర్శవల్లనే సమస్త భూమండలమూ కంపిస్తూ ఉన్నది. ఆ స్పర్శవల్ల నముచిసేన దూదివలె తేలికయై క్షోభించినది. నముచి, తన బాణాన్ని తీసుకొని విచారంతో నేలపై రాస్తూ ఉండినాడు. ఇది కూడా పురుషసింహుడైన బోధిసత్త్వుని విక్రీడితము!

ఇది లలితవిస్తరంలో అభిసంబోధన పరివర్తమనే
ఇరవై రెండవ అధ్యాయం.

---

# 23. సంస్తవ పరివర్తం

తర్వాత శుద్ధావాసకాయికులనే దేవపుత్రులు బోధిమండాసీనుడైన తథాగతునికి ప్రదక్షిణంచేసి, దివ్యచందన చూర్ణం అతనిపై చల్లి, కొన్ని గాథలతో స్తోత్రం చేశారు. ఆ గాథల భావమిది:

"ఓ లోకనాథుడవైన దేవా, నీవు లోకప్రకాశంగా అవతరించి లోకాన్ని ప్రభామయం చేశావు. యుద్ధంలో జయించి అంధీభూతమైన లోకానికి చూపును ఇచ్చావు. నీవు సంగ్రామంలో జయించి, పూర్వపుణ్యాలవల్ల పూర్ణమనోరథుడవయావు. నీవు పరిశుద్ధ ధర్మాలతో పరిపూర్ణుడవయావు. జగత్తును సంతోషపరుస్తావు. ఈ గౌతముడు పాపపు బురదనుండి వెలికి వచ్చి, నిర్దోషుడై గట్టెక్కి నిలబడ్డాడు. మహాప్రవాహం నుంచి బయటకు వచ్చిన ఇతడు ఇతర ప్రాణులను తరింపజేస్తాడు. నీవు మహాప్రాజ్ఞుడుగాను, సాటిలేని పుద్గలభావపూర్ణుడుగాను రూపొందినావు. నీటిలోని కమలంలాగే లోకధర్మాలు అంటనివాడివి. అంధకారం కప్పుకొని బహుకాలంగా నిద్రపోతున్న లోకాన్ని ప్రజ్ఞాదీపంతో మేల్కొల్పగల సమర్థుడివి నీవే. క్లేశ వ్యాధులతో చిరకాలంగా గ్రస్తమయిన ఈ లోకపు సర్వ వ్యాధులనూ పోగొట్టడానికి అవతరించిన వైద్యరాజువు నీవు — లోకనాథుడవైన నీవు అవతరించగానే, అంతా శూన్యమూ, అక్షణమూ అయింది. మనుష్యులు, దేవతలు సుఖసమన్వితులవుతారు. ఓ సౌమ్యుడా, పురుషర్షభా, నీవు ఒక్కసారి ఎవరికైనా దర్శనమిచ్చావా, వారు కల్ప సహస్రమైనా దుర్గతి పొందరు.

నీ ధర్మం విన్నవారు పండితులు, రోగరహితులు, గంభీరులు, ఉపధిరహితులు, విశారదులు అవుతారు. వారందరూ క్లేశబంధనాలనుంచి విడివడి, ఉపాదానరహితులై శ్రేష్ఠమూ, శుభమూ అయిన ఫలప్రాప్తిని అనుభవిస్తారు. వారు ఆహుతులను పరిగ్రహించేవారై, లోకంలో పూజ్యు

లవుతారు. ప్రాణికోటికి నిర్వాణకారణం కాని తక్కువ దక్షిణ ఏదీ వారికి ఉండదు.”

శుద్ధావాసకాయికులైన దేవపుత్రులు ఈ విధంగా స్తోత్రంచేసి అంజలి ఘటించి ఏకాంతంగా ఒక చోట నిలబడ్డారు.

తర్వాత ఆభాస్వరులనే దేవపుత్రులు బోధిమండాసీనుడైన తథాగతుని నానాప్రకారరాలైన దివ్య పుష్పాలతోను, ధూపంతోను, గంధంతోను, పూలదండలతోను, విలేపనంతోను, ఛత్రధ్వజపతాకలతోను పూజించి ప్రదక్షిణంచేసి, గాథలతో స్తోత్రం చేశారు. వాటి భావమిది:

“ఓ గంభీరబుద్ధి అయిన మునీశ్వరుడా, నీవు మధురస్వరుడివి. బ్రహ్మస్వరుడివి. నీవు మునివరులచే నుతింపబడినవాడివి. నీవు శ్రేష్ఠమైన బోధి అనే పరమార్థం పొందావు. నీ స్వరంలో సర్వస్వరాలూ కలిశాయి. నీవు పారంగతుడివి. నీకు నమస్కారం. నీవు లోకరక్షకుడివి. లోకానికి దీపంవంటివాడివి. పరాయణుడివి. లోకనాథుడివి. లోకంపై కృపా, మైత్రీ, బుద్ధీ గలవాడివి. నీవు శల్యాలు తొలగించే ఉత్తమ వైద్యుడివి. నీవు పరమ హితంకరుడైన చికిత్సకుడివి. నీవు దీపంకరబుద్ధుణ్ణి కూడా దర్శింపజేస్తున్నావు.—నిన్ను దర్శిస్తే దీపంకరబుద్ధుని దర్శనం చేసుకున్నట్లే. నీవు మైత్రీ అనే, కృప అనే ఆకాశగంగను భువికి తెచ్చావు. ఓ నాథా, అమృతధారను వదలి, సురనరులతాపం పోగొట్టు. నీవు మూడు జన్మల దోషమూ అంటని పద్మంవంటివాడివి. నీవు మేరువులాగ చలనం లేనివాడివి. నీవు అచలప్రతిజ్ఞ గల వజ్రసమానుడివి. సకల గుణాలను పొందిన చంద్రుడివి.”

ఈ విధంగా ఆభాస్వరదేవతలు తథాగతుని స్తుతించి అంజలి చేస్తూ ఒకవైపు నిలబడ్డారు.

తర్వాత సుబ్రహ్మ దేవపుత్రుడు మొదలయిన బ్రహ్మకాయికులైన దేవతలు బోధిమండాసీనుడైన తథాగతుని అనేక కోటి మణి రత్నాలు



చెక్కిన రత్నజాలంతో కప్పి, ముమ్మారు ప్రదక్షిణం చేసి, సారూప్య గాథలతో స్తుతించారు. వాటి భావమిది:

“ఓ శుభ విమలప్రజ్ఞ గలవాడా, ప్రభాపూరితుడా, ముప్పయి రెండు లక్షణాలు గలవాడా, స్మృతిమంతుడా, మతిమంతుడా, గుణజ్ఞానం కలవాడా, అకిలాంతకుడా, నీకు శిరస్సుతో నమస్కరిస్తున్నాము. అమలుడా, మూడు మలాలు లేనివాడా, త్రిలోకవిఖ్యాతుడా, త్రివిద్యాగతుడా, మూడు విధాలయిన మోక్షమార్గాలను తెలిపే చూపును ఇచ్చేవాడా, త్రినేత్రుడవైన నిన్ను నమస్కరిస్తున్నాము. కలికలుషంనుంచి ఉద్ధరించేవాడా, దాంతచిత్తుడా, కృపాళో, కరుణామూర్తీ, జగత్ప్రయోజనం కోసం అవతరించినవాడా, మునీ, ముదితాగుణం కలవాడా, ప్రశాంత మనస్సు కలవాడా, ద్వయమనే బుద్ధిని పోగొట్టేవాడా, ఉపేక్షాగుణరతుడా, వ్రతతపస్సంపన్నుడా, ఖచరి, విశుద్ధచరి మొదలయిన విద్యలలో పారంగతుడా, చతురార్యసత్యాలను తెలుసుకొన్నవాడా, విమోక్షరతుడా, నీవు ముక్తుడవయ్యావు. ఇతరులను ముక్తులను చేస్తావు. సముచి ఎంతో బల వీర్యాలతో ఇక్కడికి వచ్చాడు. నీ పరాక్రమం తెలుసుకొని, నీ మైత్రీగుణంతో పరాజితుడయ్యాడు. నీవు శ్రేష్ఠమైన అమృత పదం పొందావు. ఓ శతచమూమథనా, నీకు నమస్కారం.”

సుబ్రహ్మదేవపుత్రుడు మొదలయిన బ్రహ్మకాయిక దేవతలు ఈ విధంగా తథాగతుని స్తుతించి నమస్కరిస్తూ, ఏకాంతంలో నిలబడ్డారు.

తర్వాత శుక్లపాక్షికులనే మారపుత్రులు తథాగతుని వద్దకు వచ్చి, మహారత్నచ్ఛత్రాలతోను, చాందనీలతోను, అతనిని కప్పి, అంజలిఘటించి గాథలతో స్తుతించారు. వాటి భావ మిది:

“నీ విపులబలంతో మహాభయంకరమైన మారుని సైన్యం ఒక్క క్షణంలో పరాజితమైంది. నీవు లేవలేదు. నీ శరీరం అలసిపోలేదు. నీవు ఒక్క పలుకు పలుకలేదు. సర్వార్థసిద్ధుడవై సర్వలోకపూజ్యుడవైన నిన్ను నమస్కరిస్తున్నాము. అనేక కోటి నయుత సంఖ్య గల గంగానికతాణువుల లాగ అసంఖ్యాకంగా ఉన్న మారులు నిన్ను బోధిమండంనుంచి

కదలించలేకపోయారు. అనేక కోటి నయుత గంగాసైకత రేణువుల సంఖ్యలో నీవు యజ్ఞాలు చేశావు. ఆ పుణ్యంతోనే నీవు ప్రకాశిస్తున్నావు. శ్రేష్ఠమైన బోధిచర్య సలుపుతున్న నీవు ప్రియతమురాలైన భార్యను, ప్రీతికలిగిన దాసీలను, దాసులను, ఉద్యానాలను, నగరాలను, రాష్ట్రాన్ని, నిగమ సంఘాలను, అంతఃపురసహితమైన రాజ్యాలను, చేతులను, కాళ్ళను, శిరస్సును, కళ్లను, నాలుకను దానంచేశావు. ఆ దానపుణ్యముతో ఇప్పుడు ప్రకాశిస్తున్నావు. 'నేను బుద్ధుడనవుతాను. అనేక కోటి నయుత ప్రాణులను ధ్యానబుద్ధికవచంతో, సద్ధర్మనావలో దుఃఖసముద్రంనుంచి ఉద్ధరిస్తాను'—అని పలుమార్లు అన్నావు. ఇప్పుడా మాట పరిపూర్ణమయింది. కనుక నీవు ప్రాణులను తరింపజేసి నీ ప్రతిజ్ఞను నిలుపుకుంటావు. లోకానికి జ్ఞాననేత్రం ప్రసాదించిన వాదివృషభుని స్తోత్రం చేయడంవల్ల కలిగిన పుణ్యముతో సంతోషచిత్తులమై సర్వజ్ఞత్వంకోసం ప్రార్థిస్తాము. పూర్వ బుద్ధులు వర్ణించిన శ్రేష్ఠమైన-సాటిలేవి బోధిని తీసుకుని వచ్చి, మారసైన్యం మథించి సర్వజ్ఞత్వం తెలుసుకుందాము.''

ఈ విధంగా మారపుత్రులు తథాగతుని స్తోత్రంచేసి, అంజలి ఘటించి ఏకాంతంలో ఒకవైపు నిలబడ్డారు.

తర్వాత పరనిర్మితవశవర్తి అనే దేవపుత్రుడు అనేక దేవపుత్ర శతసహస్రాలతోపాటు వచ్చి బంగారు రంగు పద్మాలతో తథాగతుని పూజించి, సముఖాన నిలబడి ఈ గాథతో స్తుతించాడు.

'అపిడిత అలుడిత అవితథవచనా
అపగత తమరజ అమృతగతిగతా,
అరహాసి దివి భువి శ్రియ క్రియ మతులా
అతిద్యుతి స్మృతిమతి ప్రణిపతి శిరసా.'

దీని, ఇలాటి మరికొన్ని గాథల భావ మిది:

''ఇతరులను పీడించనివాడా, చాంచల్యం లేనివాడా, వ్యర్థమైన మాట లేనివాడా, తమోరజోగుణాలు తొలగినవాడా, అమృతగతిని పొందిన వాడా, నీవు భూలోకంలోను, దేవలోకంలోను అతులమైన సిరికి



క్రియలకు అర్హుడివి. నీవు లోకోత్తర తేజస్సు, స్మృతి, మతి కలవాడివి. శిరసా ప్రణమిస్తున్నాను. ఓ ప్రీతికరుడా, రణతేజా, రజోమలాన్ని తొలగించేవాడా, సురనరవాక్కులతో సంతోషిస్తున్నావు. వికసించి విస్తరించిన నీవు కాయకాంతితో సురనరపతివలె ఈ లోకాన్ని జయిస్తున్నావు. నీవు శత్రుసేనలను మథించినవాడివి. పరులకు కుశలం కలిగించేవాడివి. శ్రేష్ఠమయిన బుద్ధి గలవాడివి. నరులకు, దేవతలకు ప్రియంకరుడివి. దశబలోపేతమైన మార్గంలో చరించు. ఎడతెగని భవబంధాన్ని వదలుకొని, వ్యర్థమైన దుఃఖాలను పోగొట్టుకొని, దేవ మనుష్యులను వినయ సత్యమార్గంలో ప్రవర్తింపజేశావు, చంద్రుడు ఆకాశంలో లాగ నాలుగు దిక్కులలోను సంచరిస్తున్నావు. ఈ త్రిభువనానికి శ్రేష్ఠమైన నేత్రంవంటివాడివి అగుము. నీవు నరులకు, దేవతలకు ప్రియం చేసేవాడివి. విషయ సుఖదూరుడివి. కామరతి విరతుడవై విహరిస్తున్నావు. నీతో సమానుడు త్రిభువనాలలోనే లేడు. నీవు జగద్ధితికోసం మనస్సు చేసేవాడివి నాథా!''

ఈ విధంగా వశవర్తి దేవపుత్రుడు మొదలయిన పరనిర్మిత వశవర్తి దేవపుత్రులు తథాగతుని స్తోత్రంచేసి, అంజలిఘటించి ఏకాంతంలో నిలబడ్డారు.

తర్వాత సునిర్మితుడనే దేవ పుత్రుడు దేవ సంఘాలతో సహా నానా రత్న పట్ట వస్త్ర కుసుమమాల్యాలతో తథాగతుని సత్కరించి అతని సన్నిధిలో గాథలతో స్తోత్రం చేశారు. వాటిభావ మిది:

''ధర్మలోకంనుంచి ఉద్భవించి, త్రివిధమలాలను పోగొట్టుతూ, మోహాన్ని అంధకారాన్ని అవిద్యను నాశనంచేస్తూ, హ్రీశ్రీసంపూర్ణుడై మిథ్యామార్గ రహితులైన మానవులను అమృతమార్గంలో స్థాపించడానికి, లోకాన్ని మేల్కొల్పడానికి దేవలోకంలోను, భూలోకంలోను శ్రేష్ఠుడయిన వాడు అవతరించాడు. ఓ నాయకుడా, నీవు దేహధారుల సకల వ్యాధులు పోగొట్టి, అమృతసుఖమిచ్చే కుశల చికిత్సలు చేసే వైద్యుడివి. వారిని శ్రేష్ఠమైన జనమార్గంలో పెట్టేవాడివి. గనుక వైద్యతముడివిగా భూలోకంలో విహరిస్తున్నావు. సిరి నిండి ఘనుడవైన నీముందు చంద్ర,

సూర్య కాంతి, నక్షత్రాల కాంతి, మణుల ప్రకాశం, అగ్ని వెలుగు, ఇంద్ర బ్రహ్మల తేజస్సు వెలవెలపోతాయి. ప్రజ్ఞాలోక కరుడు, ప్రభాకరుడు, ప్రభాశ్రీ భరితుడు అయిన నిన్ను ప్రత్యక్షంగా చూచి తెలుసుకొని, అందరూ శిరస్సుతో నమస్కరిస్తారు. నీవు సత్యాసత్య కథలు గలవాడివి. వినాయకుడివి. మధుర వాక్కులు గలవాడివి. దాంతుడివి. శాంతుడివి. జితేంద్రియుడివి. ప్రశాంతమైన మనస్సు గలవాడివి. శాస్తవు. శాసింపదగిన నర సుర పరిషత్తులవారిని శాసిస్తావు. సుర వర పూజితా, నరర్షభా, శాక్యమునీ, నీకు నమస్కారం. నీవు జ్ఞానివి. జ్ఞాన కథలను గొప్పవాటిని జ్ఞాపకం పెట్టుకున్న వాడివి. త్రిభువనాలలోను ఉన్న వారికి జ్ఞానం కలిగిస్తావు. మూడు విద్యలను, మూడు మోక్ష మార్గాలను ఉపదేశించేవాడివి. త్రిమలాలను పోగొట్టేవాడివి. భవ్యాభవ్యుడివి. మునివి. వినయమార్గం పూర్తిగా ఎరిగిన వాడివి. ఈ త్రిసహస్రలోకంలో అద్భుత మహిమాన్వితుడవయిన నీకు నమస్కారం.

సునిర్మిత ప్రముఖులైన దేవపుత్రులు తథాగతుని ఈ విధంగా స్తుతించి చేతులు జోడించి నమస్కరిస్తూ ఒక ఏకాంత ప్రదేశంలో నిలబడ్డారు.

అనంతరం సంతుషితుడనే దేవపుత్రుడు తుషితకాయిక దేవపుత్రులతోపాటు వచ్చి, బోధిమండాసీనుడైన తథాగతుణ్ణి దివ్య వస్త్రాలతో కప్పి ఈ గాథలతో స్తోత్రం చేశారు.

“ఓ దేవా, నీవు తుషితాలయంలో వసించినప్పుడు ఏ ఉదార ధర్మం ఉపదేశించావో, ఆ ధర్మం విచ్ఛిన్నం కావడం లేదు. ఇప్పటికీ సురపుత్రులు ఆచరిస్తూనే ఉన్నారు. ఓ గుణసాగరా, లోకానికి దీపం వంటివాడా, నిన్ను దర్శించకపోవడంవల్ల నీనుంచి ధర్మం విననందువల్ల మాకు తృప్తి కలుగడంలేదు. నిన్ను మనసా, శిరసా నమస్కరిస్తున్నాము. నీవు తుషితాలయంనుంచి కదిలావో లేదో అందరి కష్టాలూ అడుగంటిపోయాయి. నీవు బోధిద్రుమం కింద కూర్చోగానే అందరి క్లేశాలు అణగారి పోయాయి. నీవు మారుణ్ణి జయించగానే, ఉదారమైన బోధి స్వయంగానే సంప్రాప్తించింది. ఇక నీవు చేసిన ప్రతిజ్ఞ తపస్సుతో పరిపూర్ణమయింది. త్వరగా ధర్మచక్రం ప్రవర్తింపజేయి. దిక్కు దిక్కులా వేలాది ప్రాణులు ధర్మాసక్తితో ధర్మం వినడంకోసం కాచుకొని ఉన్నాయి. త్వరగా ధర్మచక్రం ప్రవర్తింపజేయి. ప్రాణులను సంసార బంధనంనుంచి విడిపించు.”

ఈ విధంగా సంతుషితుడనే దేవపుత్రుడు సపరివారంగా బోధిగతుడైన తథాగతుణ్ణి స్తోత్రంచేసి, అంజలి ఘటించి నమస్కరిస్తూ ఒక చోట నిలబడ్డాడు.

తర్వాత సుయామ దేవపుత్రుడు మొదలుగా సుయామ దేవతలు తథాగతుని వద్దకు వచ్చి నానా పుష్ప, ధూప, గంధ, మాల్య, విలేపనాలతో తథాగతుని పూజించి, గాథలతో స్తోత్రం చేశారు. వాటి భావమిది :

“ఓ తథాగతుడా, నీకు సమానుడైనవాడు మరొకడు లేడు. శీల సమాధితోను, ప్రజ్ఞతోను, అధిముక్తిని, విముక్తినీ తెలుసుకున్నవాడివి. నీకు తలవంచి నమస్కరిస్తున్నాము. బోధిమండంలో దేవతలు రచించిన వ్యూహాలు చూచాను. చాల అందంగా ఉన్నాయి. దేవ మనుష్య పూజితుడవైన నీకు ఆ వ్యూహాలు తగినవి కాని, ఇతరులకు అవి తగవు. నీవు వ్యర్థంగా అవతరించలేదు. నీవు ఎంతో దుష్కరతపస్సు చేసి, శఠుడైన మారుణ్ణి సైన్యంతో సహా జయించి, అనుత్తరబోధిని సాధించావు. నీవు దశదిక్కులకూ వెలుగులు చిమ్మావు. ప్రజ్ఞా దీపంతో త్రిలోకాలకు వెలుతురు కలిగించావు. నీవు లోకపు అజ్ఞానాంధకారం పోగొట్టి అనుత్తర జ్ఞాన చక్షువును ప్రసాదించావు. నిన్ను బహు కల్పాలవరకు స్తోత్రం చేస్తారు. రోగ రూపుడవయిన నీకు అంతమనేది లేదు. ఓ గుణ సముద్రుడా, లోక విఖ్యాతకీర్తీ, తథాగతుడయిన నీకు నమస్కారం.”

ఈ విధంగా సుయామదేవపుత్రుడు ఆదిగా గల సుయామదేవతలు తథాగతుణ్ణి స్తోత్రంచేసి అంజలి ఘటించి నమస్కరిస్తూ నిలబడ్డారు.

తర్వాత దేవేంద్రుడయిన శక్రుడు, త్రాయస్త్రింశకాయిక దేవతలతోపాటు వచ్చి నానావిధ పుష్ప ధూప దీప గంధ మాల్య విలేపన

చూర్ణ చీవర చత్రధ్వజ పతాకాదులతో తథాగతుని పూజించి, ఈ గాథలతో స్తుతించాడు. వాటి తాత్పర్య మిది:

"ఓ మునీ, నీవు దోషాలు, తొట్రుపాటు లేక మేరువులాగ స్థిరంగా ఉండి, దశదిక్కులకూ జ్ఞానప్రభను విరజిమ్మావు. ఓ పుణ్య తేజోన్వితుడా, సహస్రానేకపూర్వ బుద్ధులచేత పూజింపబడినవాడా, నీకు నమస్కారం. నీలోని విశేష మేమిటంటే - బోధిద్రుమం కింద మారసేనను జయించావు. నీవు శీలశ్రుత సమాధి ప్రజ్ఞలకు ఆకరమైనవాడివి. జ్ఞానమనేదే నీ పతాకం. నీవు జరామరణాలను పోగొట్టే వైద్యరాజువు. లోకానికి జ్ఞాననేత్రం ప్రసాదించేవాడివి. నీవు మూడు మలాలు పోగొట్టుకొని, జ్ఞానేంద్రియం వికసించి, చిత్తం శాంతించి, లోకానికి కళ్యాణం కలిగించేవాడివి. ఓ శాకర్షభా, ధర్మరాజా, నిన్ను శరణు వేడుతున్నాము. నీవు బోధిలో చరించేవాడివి. అనంతసదృశుడివి. అపూర్వ వీర్య బలోపేతుడివి. నీకు ప్రజ్ఞాబలం, ఉపాయ మైత్రీగుణాల బలం, బ్రాహ్మపుణ్యాం బలం వున్నవి. నీవు అనంతతుల్యమైన బలం కలవాడివి. నీవు బోధికోసం బయలుదేరగానే ఇలాటి బలాలు సమకూరినవి. ఇప్పుడు బోధిమండంలో దశబలోపేతుడ వయావు. మారుని అనంతసత్వం గల సేనను చూచి, దేవతలు కూడా భయపడి పరుగెత్తిపోయారు. అలాటి మారసేన బోధిమండ గతుడైన శ్రమణ రాజును బాధించలేదు. నీవు సంకల్పంతోనే మారసేనను జయించావు. నీవు బోధి సింహాసనం అధిష్ఠించి, శ్రేష్ఠమైన బోధిని పొందావు. నీతో సమానులైన బుద్ధులు ఇతరులు లేరు. నీవు సమమనస్సుతో, సర్వసమ చిత్తంతో సర్వజ్ఞత్వం, బలం పొందావు. దానితో లోకోత్తముడవు, స్వయంభువవు అయినావు."

ఈ విధంగా దేవేంద్రుడయిన శక్రుడు త్రాయస్త్రింశ దేవతలతో పాటు తథాగతుణ్ణి స్తోత్రం చేసి, చేతులు జోడించి ఒకవైపు నిలబడ్డాడు.

తర్వాత నలుగురు మహారాజ దేవతలు చతుర్మహారాజ కాయిక దేవతలతో పాటు, అభిముక్తక చంపకాది కుసుమ మాలలు తీసుకొని, అనేక సహస్ర అప్సరోగణాలు దివ్య సంగీతం పాడుతూవుండగా వచ్చి, తథాగతుని గాథలతో స్తుతించారు:- ఆ గాథల తాత్పర్య మిది:



"ఓ మునీ, నీవు మధురవచనుడివి. నీ ధ్వని మనోజ్ఞం. నీవు ప్రసన్నచిత్తంతో చంద్రునివలె అందరికీ ప్రశాంతి కలిగించేవాడివి. నీవు ఎప్పుడూ నవ్వుతూ వున్న ముఖం కలవాడివి. నీ నాలుక గొప్పది. నీవు పరమ ప్రీతి కలిగించేవాడివి. నీకు నమస్కారం. నీ మధుర రవం సర్వలోకాల నరులకు, దేవతలకు ప్రేమ కురిపిస్తుంది. నీ మంజుఘోషంముందు అందరి స్వరమూ తీసికట్టు. నీవు ఇతరులలోని రాగ దోష మోహ క్లేశాలను పోగొట్టి అతిలోకమైన విశుద్ధప్రీతిని కలిగిస్తావు. అకలుష హృదయంతో ధర్మం ఉపదేశించి, నారందరకూ పూజ్యమైన ముక్తిని కలిగిస్తావు. నీవు అవిద్వాంసులను అవమానించవు. నీకు విద్వాంసుడననే మదమేమీ లేదు. నీవు సాగరమధ్యంలోని పర్వతంలాగ ఎప్పుడూ ఉన్నతుడివే కాని, అవనతుడివి కావు. నీబోటి సత్త్వగుణసంపన్నులు భూలోకంలో అవతరించడంవలన మనుష్యులకు మహాలాభం కలిగింది. పద్మావతి అయిన శ్రీ ధనమిస్తున్నట్టుగా, నీకు ధర్మం సర్వలోకాలలోను సిరిని కలుగజేస్తుంది."

ఈ విధంగా చతుర్మహారాజ ప్రముఖులైన మహారాజ కాయిక దేవతలు బోధిమండనిషణ్ణుడైన తథాగతుని స్తోత్రంచేసి, అంజలి ఘటించి ఒకచోట నిలబడ్డారు.

అనంతరం అంతరిక్ష దేవతలు తథాగతుని సన్నిధికి వచ్చి, అభిసంబోధి పూజకోసం అంతరిక్షమంతా రత్నాల జాలరులను, మువ్వల సరాలను, రత్నచ్ఛత్రాలను, రత్నపతాకాలను, రత్నాలు కుట్టిన పట్టు గుడ్డలను, రత్నావతంసాలను, వివిధ ముక్తాహారాలు, పుష్పమాలికలు మొదలయినవి అర్ధకాయిక దేవతలు తీసుకొనిరాగా అలంకరించి, అర్ధచంద్రులతో అలంకరించి, పుష్పాలు వెదజల్లారు. వెదజల్లి, గాథలతో స్తోత్రం చేశారు. వాటి భావ మిది:

"ఓ మునీ, మేము ఉండేది గగనంలో అయినా లోకంలోని వారివలెనే నీ సత్త్వచర్యను చూస్తున్నాము. ఓ శుద్ధసత్త్వుడా, నీ దుష్కరచర్య చూచాము. దానిలోను, నీ చిత్రంలోను ఒక్క పొరపాటునుగూడా చూడలేకపోయాము. ఓ బోధిసత్త్వుడా, నిన్ను పూజించడానికి వచ్చిన

నరనాయకులతో ఆకాశం నిండి నిబిడీకృతమైంది. అయితే; విమానాలకు హాని కలుగలేదు. ఎందుకంటే అవి గగనాత్మభావమైనవి. ఆకాశంనుంచి అనేక సహస్ర సంఖ్యలో నీ శిరస్సుపై వర్షించే పూవులు నీ శిరస్సుకు చూడాబంధంవంటి శోభనిస్తూ, నదులు సముద్రంలో పడినట్లు నీ దేహంపై పడుతున్నవి. దేవతలు ఆకాశంనుంచి విడుస్తున్న ఛత్రాలు, అవతంసకాలు, చంపక పుష్పమాలలు, హారాలు, చంద్రులు, అర్ధచంద్రులు నీకు అలంకారం కాకపోగా. తమకు తాము అలంకారమవుతున్నాయి. దేవతలంతా అంతరిక్షంలో క్రిక్కిరిసిపోవడంవల్ల పిల్లవానికి కూడా దూరే అవకాశం లేదు. ద్విపదోత్తముడవైన నీకు వారంతా పూజలు చేస్తున్నారు. నీకు దానివల్ల గర్వం కాని ఆశ్చర్యంకాని కలగడంలేదు."

ఈ విధంగా అంతరిక్ష దేవతలు బోధిమండగతుడైన తథాగతుణ్ణి స్తోత్రంచేసి, అంజలి ఘటించి, ఒకవైపు నిలబడ్డారు.

పిదప భౌమదేవతలు తథాగతుని పూజకోసం సమస్త ధరణీతలాన్ని ఊడ్చి, అలికి, గంధోదకంతో తడిపి, పూవులు చల్లి, చిత్రవిచిత్రమైన వితానాలు (చాందినీలు) తీసుకొని వచ్చారు. ఈ గాథలతో స్తోత్రంచేశారు.

"వజ్ర మివ అభేద్యా సంస్థితా త్రిఃసహస్రా
వజ్రమయ పదేనాయం స్థితో బోధిమండే,
ఇహ మమ త్వచమాంసం శుష్యతా మస్థి మజ్జా
నచ అహు అస్పృశిత్వా బోధి ఉత్థేయ అస్మాత్.

స విభవ నరసింహ సర్వియం త్రిసహస్రా
న్యకరిషు అధిష్ఠానం స్యాద్విదీర్ణ శేషా,
తాదృశ మహావేగా ఆగతా బోధిసత్వా
యేష క్రమతలేభిః కంపితా క్షేత్రకోట్యః.

లాభ ఇహ సులబ్ధా భూమిదేవైరుదారా
యత్ర పరమసత్వ శ్చంక్రమీ మేదినీ యే,
యత్రకు రజులోకే సర్వం ఓభాసితా స్తే
చేతిభు త్రిసహస్రః కింపున స్తుభ్య కాయం.



హేస్తి శతసహస్రం యావత శ్చాపస్కంధో
ధరణితలు జగస్యా యావత శ్చోపజీవ్యః,
సర్వ వయు ధరేమో మేదినీ త్రిస్సహస్రాం
సర్వ తన దదామో భుంక్ష్వేమాం త్వం యథేష్టం.

యత్ర భవ స్థిహేద్వా చంక్రమేద్వా శ్రయేద్వా
యేపి సుగతపుత్రాః శ్రావకా గౌతమస్య,
ధర్మకథ కథేంతీ యేపి వా తాం శృణోంతి
సర్వకుశలమూలం బోధయే నామయామః."

"ఈ త్రిసాహస్ర లోకధాతువు వజ్రంవలె అభేద్యంగా ఉండిపోయింది. ఈ బోధిసత్త్వుడు బోధిమండంలో వజ్రంవలె స్థిరంగా ఆసీనుడయాడు. 'నా చర్మం, మాంసం, అస్థి, మజ్జ — ఏవైనా శుష్కించిపోనీ. నేను మాత్రం బోధిని స్పృశించక ఈ బోధిమండంనుంచి లేవను —' అని ఈ బోధిసత్త్వుడు వజ్ర సంకల్పంతో ఆసీనుడయాడు. ఓ విభవపూర్ణుడా, నరసింహుడా, పూర్వబోధిసత్త్వ లందరూ మహావేగంతో నీ వద్దకు వచ్చారు. ఆ మహావేగానికి ఈ సకల త్రిసాహస్ర లోకాలు కూలిపోతున్నట్టయి, నిలవదొక్కుకోలేక పోతున్నవి. కోటానుకోటి క్షేత్రాలు కంపించిపోతున్నాయి. పరమ సత్త్వుడవైన నీవు ఈ భూమిపై నడయాడడంవల్ల భూదేవులకు గొప్ప లాభం కలిగింది. లోకంలో రజోగుణ మనేదే లేకపోయింది. సకల రజస్సు నీ మహిమవల్ల ప్రకాశమాన మయింది. త్రిసాహస్రలోకాలూ మేల్కొన్నాయి. "ఈ శత సహస్ర పరిమితమైన భూమిని, ఆపస్కంధాలను, ధరణితలంలోని సకల జీవులను మేము ధరిస్తున్నాము. యథేష్టంగా అనుభవించు. నీవు నిలిచే చోటు, నీవు నడిచే చోటు, పడుకొనే చోటు, గౌతముని శ్రావకులైన సుగతపుత్రులు, ధర్మకథలు చెప్పేవారు, వినేవారు, ఇదంతా, వీరంతా బోధికి కుశలమూలం. వీటికంతా తల ఒగ్గుతున్నాము."

ఈ విధంగా భౌమదేవతలు బోధిమండాసీనుడైన తథాగతుణ్ణి స్తోత్రం చేసి, అంజలి ఘటించి, నమస్కరిస్తూ ఒకవైపు నిలబడ్డారు.

ఇది లలిత విస్తరంలో సంస్తవ పరివర్త మనే ఇరవైమూడవ అధ్యాయం.

# 24. త్రపుషభల్లిక పరివర్తం

ఓ భిక్షులారా, అభిసంబుద్ధుడైన తథాగతుడు పర్యంకబంధాన్ని విడవకనే రెప్పపాటు లేని చూపుతో ఆ వృక్షరాజాన్ని చూస్తూ ఉండినాడు. దేవతలు అతన్ని స్తుతిస్తూ ఉండినారు. తథాగతుడు ధ్యానప్రీత్యాహారుడై, సుఖప్రతిసంవేదియై బోధివృక్షమూలంలో వారం దినాలు అల్లే ఉండినాడు.

వారం గడచిన తర్వాత కామావచరులైన దేవపుత్రులూ, రూపావచరులైన దేవపుత్రులూ గంధోదకంతో నిండిన పదివేల కుంభాలను వేర్వేరుగా తీసుకుని తథాగతునివద్దకు వచ్చి అతనినీ, బోధివృక్షాన్నీ ఆ గంధోదకంతో స్నానం చేయించారు. దేవ, నాగ, యక్ష, గంధర్వ, అసుర, గరుడ, కిన్నర, మహోరగులు అసంఖ్యాకులు వచ్చి, తథాగతుని శరీరం నుండి జారిపడిన ఆ గంధోదకాన్ని తమ తమ దేహాలపై చల్లుకొన్నారు. లోకోత్తరమైన సమ్యక్సంబోధియందే వారికి మనస్సు పుట్టినది. వారందరూ తమ తమ భవనాలకు వెళ్ళినా, గంధోదకంవల్ల కలిగిన పరిమళం వారి శరీరాలను విడవలేదు. మరొక సువాసనపైని బుద్ధి పుట్టనేలేదు. వారికి తథాగతునిపైని అధిక గౌరవమూ, ప్రీతిప్రామోద్యమూ కల్గి, లోకోత్తరమైన అనుత్తర సమ్యక్సంబోధిపై ఎక్కువ ఆసక్తి ఏర్పడింది.

ఓ భిక్షులారా, అప్పుడు సమంతకుసుముడనే దేవపుత్రుడు తథాగతుని చరణములపై బడి, చేతులు జోడించుకొని "ఓ భగవానుడా, ఏడు రాత్రులు పర్యంకబంధం విడవకుండా తథాగతులవారు అనుసరించిన సమాధి పేరు ఏమి?" అని అడుగగా "ప్రీత్యాహారవ్యూహం" అని ఆయన తెలియజేశాడు.

ఓ భిక్షులారా, పిదప సమంతకుసుముడు తథాగతుని గాథలతో స్తుతించాడు. వాని భావమిది:



"సహస్రదళపద్మపత్రాలతో సమానమై, దేవతల కిరీటాలతో ఒరస్తూ ఉన్న నీ చరణాలకు నమస్కరిస్తూ ఉన్నాను."

ఆ దేవపుత్రుడు యీ విధంగా సుగతుని చరణాలకు నమస్కరించి, సంతోషించిన చిత్తం కలవాడై విమతిహరణుడూ, నర, దేవతలకు శాంతిని ఇచ్చేవాడూ అయిన సుగతునితో ఇలా అన్నాడు:

"శాక్యకులానికి ఆనందం కలిగించేవాడా! రాగదోష మోహాలను నశింపజేసేవాడా! గ్లానిని నశింపజేసేవాడా! నర, దేవతల కాంక్షను సఫలం చెయ్యి. ఓ దశబలుడా! అపరిమాణమైన సర్వజ్ఞత్వాన్ని తెలుసుకొనినవాడా! సప్తదినాలు నేలమీద పర్యంకబంధంలో ఉండడానికీ, అనిమేషనయనాలతో చూస్తూ ఉండడానికీ, కారణమేమిటి? వికసించిన శతపత్రాలవంటివీ, విశుద్ధములూ అయిన కన్నులతో చూస్తూ ఉన్నావు. ఈ సంసారానికి ప్రణిధివిగా ఉండడానికా, లేక సింహాలవంటి వాదులకు ఉత్సాహం కలిగించడానికా ఇట్లు పర్యంకబంధంతో ఉండడం? శుద్ధదంతుడవూ, పరిమళితముఖుడవూ అయిన దశబలుడా! అవితథంగా ప్రసంగించి, నర దేవతలకు ప్రీతిని కలిగించు" అని.

అప్పుడు చంద్రవదనుడైన సుగతుడు ఇలా అన్నాడు—"ఓ దేవపుత్రా! నేను చెప్పేది విను. ఈ ప్రశ్నకు నేను సంగ్రహంగా సమాధానమిస్తాను. జ్ఞాలిసంఘం రాజును రాజ్యంలో అభిషిక్తుని చేసినప్పుడు, అతడు ఆ ప్రదేశాన్ని సప్తాహాలు విడవకుండా ఉంటాడు. ఇది రాజధర్మం! అల్లే ప్రబోధిపూర్ణులైన దశబలులు జినులై అభిషిక్తులైనప్పుడు సప్తాహాలు ధరణిమండలంలో పర్యంకబంధాన్ని భేదించకుండా వుంటారు. శూరుడు శత్రుసంఘాన్ని నిరవశేషంగా నిర్జించినట్లు బోధిమండంలో బుద్ధులు కూడా క్లేశాలను నశింపజేస్తారు. జగత్తుకు హానికరాలైన కామక్రోధమోహాదులను నిరవశేషంగా దొంగలనువలెనే నశింపజేస్తారు. ఇక్కడ నేను మానవిధాల నన్నింటినీ నశింపజేశాను. పునరికేతాదులైన సర్వాస్రవాలూ వదలిపోయాయి. జ్ఞానం ఉత్పన్నమయింది. ఆ కార్యాలు చేసేదీ, సంసార తృష్ణను కలిగించేదీ అయిన అవిద్యా పటిష్ఠమైన జ్ఞానాగ్ని వల్ల దగ్ధం చెయ్యబడింది. అహంకార మమకారాలకూ, కలి పాశాలకూ

మూలమైన కఠిన గ్రంథి నా జ్ఞానశస్త్రంచేత ఛేదించబడినది. చలికాలం నుంచి వస్తూ ఉన్నవీ, వినాశపర్యంతంగా ఉన్నవీ, ఉపాదాన సహితాలూ అయిన స్కంధాలు నా జ్ఞానంవల్ల గ్రహింపబడ్డాయి. మహానరకానికి కారణాలయిన ద్వయ సమ్మోహాలు, మిథ్య, ఆగ్రహమూ పూర్తిగా పెల్లగించబడినవి. అవి తిరిగీ ఎప్పుడూ తోచవు. కుశలమూలమైన నా తేజస్సు చేత శత్రువనం దగ్ధం చెయ్యబడింది. నాల్గు విపర్యాసాలూ నిశ్శేషంగా దహించబడినవి. సంజ్ఞాసూత్రాల్లోని పథంలో కూర్చబడిన వితర్క మాలను తీసివేసి, అశేషములైన బోధ్యంగవిచిత్రమాలలు ఉంచబడినవి. సుగ్గములైన ఆరవైఅయిదు మోహాలూ, ఇరవై మలినాలూ, నలభై అఘములూ నాచేత భిన్నాలు అయినవి. పదహారు అసంవృతాలూ, అష్టాదశ ధాతువులూ, ఇరవైఅయిదు కృచ్ఛ్రాలూ, ఆరవై రజస్తరాలూ, ఇరవై ఎనిమిది లోకవిత్రాసాలూ, నా వీర్యబల పరాక్రమాలవలన సమతిక్రాంతాలయినాయి. ఇక్కడనుండే అయిదువందల బుద్ధనర్ద్ధిశాలూ, శతసహస్ర ధర్మాలూ పూర్ణంగా గ్రహించబడ్డాయి. తొంభైఎనిమిది అనుశయాలు ఇక్కడనే నా జ్ఞానతేజస్సుచేత సమూలంగా దహించబడినవి. విమతి సముదయమైన కాంక్ష, అశుభమూలం, జాడ్యదృష్టి అనే మూడు వేగాలతో కూడిన తృష్ణ అనే నది నా జ్ఞానసూర్యునివల్ల ఇంకింపజేయబడినది. కపటవాక్యాలూ. మాయ, మాత్సర్యం, దోషం, ఈర్ష్య మున్నగునవి ఉన్న క్లేశారణ్యం ఛేదించబడి, వినయాగ్నిచేత దహింపబడినది.

“విషమాలైన దుర్గతులలో ఆకర్షిస్తూ, వివాదాలకు మూలమైన ఆర్యాపవాదవచనాలు జ్ఞాన కిరణాలవల్ల తొలగించబడినవి. ఈ లోకంలో రుదిత, ఆక్రంద, శోచిత, పరిదేవనాలన్నింటినీ నివారించే మార్గం జ్ఞానగుణసమాధిమూలంగా కనుగొనబడినది. సత్యసమయసమాధిని పొంది, నేను అయోగగ్రంథులనూ, శోకశల్యాలనూ, మదప్రమాదాలనూ — సమస్తమునూ జయించాను. క్లేశాలనే అడవులు సంకల్పాలనే వేళ్ళతో బాగుగా నాటుకొన్న సంసారవృక్షాలతో నిండి వున్నవి. వాటిని నేను స్మృతి అనే గండ్రగొడ్డలితో నరికివేసి, జ్ఞానాగ్నిచేత దహించాను. ఇంద్రుడు దైత్యేంద్రుణ్ణి చంపినట్లుగా నేను-శఠుడూ, మహాబలవంతుడూ,



మూడు లోకాలనూ వశంచేసుకొన్నవాడూ అయిన మారుణ్ణి జ్ఞానఖడ్గం చేత సంహరించాను. భూమండలంలో ఉంటున్న ముప్ఫయిఆరు విధాల మాయాలతలూ ప్రజ్ఞాఖడ్గంచేత ఛేదించి జ్ఞానాగ్నిచేత దగ్ధంచేయబడినవి. దుఃఖ శోకాలవల్ల కలిగినవీ, సానుశయాలూ అయిన సమస్త క్లేశమూలాలనూ ప్రజ్ఞాబలమనే నాగలికర్రతో పెల్లగించివేశాను.”

“విస్తారమైన మోహపటలంచేత భిన్నమైయున్న సత్త్వాల జ్ఞానచక్షుస్సును నేను గొప్పదైన ప్రజ్ఞాంజనం మూలాన విశోధించాను. విపులమైన తృష్ణాజలంతో కూడి, మదమనే మకరాలవల్ల కలతపెట్టబడుతూ ఉన్నవీ, ధాతుభూతములూ అయిన నాల్గు సంసారసముద్రాలనూ స్మృతి అనే సూర్యకిరణాలమూలంగా శుష్కింపజేశాను. విషయాలనే కట్టెలతో జ్వలిస్తూన్న పెద్ద మదనాగ్నిని నేను విమోక్షరస మనే చల్లని నీటితో ఆర్పివేసినాను. ఆస్వాదమనే మెరుపులతోను, వితర్కం అనే ఉరుములతోనూ కూడిన అనుబంధ మేఘపటలాలను నేను వీర్య బల వాయువుచేత చెదరగొట్టి నశింపజేశాను. భవాన్ని అనుసరించినవారూ, చిత్తంలో చరిస్తూ ఉన్నవారూ అయిన శత్రువులందరూ కూడా స్మృతి విమలసమాధి నాశ్రయించిన నావల్ల బలిష్ఠమై వున్న ప్రజ్ఞా ఖడ్గసాధనంతో సంహరింపబడినారు.

“వికారరూపం కలిగి, ధ్వజాలతో కూడిన నముచి చతురంగబలం మైత్రివల్లనే విధ్వస్తం చేయబడినది. మదోన్మత్తములూ, పంచగుణ విశిష్టములూ అయిన షడింద్రియము లనే హయాలు శుభసమాధిని పొంది బంధించబడినవి. నేను అప్రతిహతసమాధిని పొంది కలహ, వివాదాలను నశింపజేసి అనునయాన్ని పొందాను. ఆధ్యాత్మికాలూ, బాహిరాలూ అయిన పరిక్షయా లన్నింటినీ, కల్పిత, వికల్పితాలనూ, శూన్యమనే సమాధిని పొంది నశింపజేశాను. భవాగ్రపర్యంతం ఉన్న మనుష్యులనూ, దివ్యులనూ — అందరినీ అనివర్తసమాధిని పొంది త్యజించాను. త్రివిధమైన విమోక్షసమాధిని పొంది, ప్రజ్ఞాబలంతో సమస్తమైన భవబంధములనూ విప్పివేశాను. నిత్యానిత్యాలు. ఆత్మయందలి సుఖదుఃఖాలు అనే మూడు హేతుకములూ హేతుదర్శనంవల్ల జయించపడినవి.”

"షడాయతనాలకు మూలమూ, సముదయముదితమూ అయిన కర్మ విధానాన్ని నే నీవృక్షమూలమునందే నిత్యప్రహారంతో ఛేదించాను. మోహాతమస్సుచేత కలుషితమూ, దుష్టమూ, దర్పదోషాలతో సంకీర్ణమూ, చిరకాలంనుంచి ఉన్నదీ అయిన అంధకారాన్ని ఛేదించి, జ్ఞాన సూర్యుని వల్ల వెలుగు వచ్చేటట్లు చేశాను. వీర్యబలం అనే నానిమూలంగా నేను మదనరాగమనే మకరములూ తృష్ణ అనే తరంగాలూ, చెడ్డదృష్టి అనే తిమింగలాలూ కల సంసారసాగరమును తరించాను. రాగద్వేష మోహాలనూ, చిత్తవితర్కాన్నీ బుద్ధుడినై దావాగ్నిపై పడిన మిడతలనువలెనే దహించాను. లెక్కలేనన్ని కోట్ల సంవత్సరాలు ఎంతో ప్రయాణంచేసి, సంసారమార్గ శ్రమలు తప్పించుకుని ఎట్టి సంతాపమూ లేకుండా ఇక్కడ విశ్రాంతిని పొందినాను. ప్రతివాదులు తెలుసుకోననిదీ, జరామరణ శోక దుఃఖాలను అంతంచేసేదీ అయిన అమృతాన్ని లోకహితార్థమై ఇక్కడ నేను కనిపెట్టాను. స్కంధాలవల్లనూ, ఆయతనాలవల్లనూ కలిగే దుఃఖమూ, తృష్ణవల్ల కలిగే దుఃఖమూ తిరిగి కలగవు. ఇక్కడ నేను అభయపురాన్ని చేరుకున్నాను. ఆధ్యాత్మికులైన శత్రువులను పూర్తిగా నేనిక్కడ తెలుసుకొన్నాను. తెలుసుకుని దహించివేశాను. భవంలో పడ ద్రోసినాను. అసంఖ్యాకంగా కోట్లకొద్దీ. నయుతాంకొద్దీ వున్న రత్నాలను అమృతసిద్ధికోసం విడిచిన సంగతిని బాగుగా తెలుసుకున్నాను."

"అపరిమాణంగా ఉన్న ప్రాచీనులైన జినులు తెలుసుకున్నదాన్ని బాగుగా తెలుసుకున్నాను. రమ్యమూ, మధురమూ అయినదాని శబ్దమే లోకాలలో విఖ్యాతమై ఉన్నది. జగత్తు శూన్యమనీ, చిత్రపటంవంటిదనీ, క్షణికమనీ, ఎండమావులవంటిదనీ, గంధర్వనగరంవంటిదనీ గ్రహించాను. నేను ఇక్కడ పరిశుద్ధమైన నయనంతో సమస్త ధాతువులనూ అరచేతిలో ఉంచబడిన ఫలాలవలె స్పష్టంగా చూస్తున్నాను. విశుద్ధుడనైన నేను కలలో చూచినట్లుగా—అపరిమితాలయిన కల్పాలలోని సంఘటనలను స్మరిస్తున్నాను. విద్యలు మూడింటినీ పొందాను. పూర్వ నివాసమునూ స్మరిస్తున్నాను."



"విపరీతవిసంజ్ఞులైన దేవతలూ, నరులూ దేనివల్ల ప్రకాశం పొంది మారిపోయారో అవితథమైన ఆ అమృతమండాన్ని నేను పానంచేశాను. దశబలులు దేనికోసం సర్వసత్త్వములందును మైత్రీభావాన్ని పొందినారో, ఆ అమృతమండాన్ని నేను మైత్రీబలంవల్ల జయించి పానంచేశాను. దేనికోసం దశబలులు సర్వ సత్త్వాలయందును ముదితులైనారో, ఆ అమృతమండాన్ని నేను ముదితబలంవల్ల జయించి పానం చేశాను. దేనికోసం దశబలులు కోట్లకొలదీ సంవత్సరాలు ఉపేక్షాభావాన్ని పొందారో, ఆ అమృతమండాన్ని నేను ఉపేక్షాబలంవల్ల జయించి పానంచేశాను. గంగానదిలోని ఇసుకరేణువులవలె సంఖ్యలేని దశబలులూ, జినసింహులూ పూర్వం పానంచేసిన అమృతమండాన్ని ఇప్పుడు నేను పానంచేశాను.

"ససైన్యంగా ఇక్కడికి—నావద్దకు వచ్చిన మారుడితో జరామరణాలనే వేమిటో తెలుసుకుంటేనే గాని, పర్యంకబంధాన్ని శిథిలం చెయ్యను" అని చెప్పి ఉన్నాను. ఇప్పుడు ప్రకాశమానమూ, కఠినమూ అయిన జ్ఞానవజ్రంతో అవిద్య ఛేదించబడినది. దశబలత్వం లభించినది. అందువల్ల పర్యంకం భేదిస్తున్నాను. నేను అర్హత్త్వం పొందాను. నా ఆశ్రవం నిరవశేషంగా సమసిపోయింది. నముచిసేన విజితమైనది. కనుక పర్యంకబంధాన్ని భేదిస్తున్నాను. అడ్డుగా వుండే అయిదు కవాటములూ బ్రద్దలు కొట్టబడినవి. కావున పర్యంకబంధాన్ని విడతీస్తున్నాను."

తర్వాత మనుష్యచంద్రుడైన తథాగతుడు నెమ్మదిగా ఆసనంనుంచి లేచి, మహాభిషేకాన్ని ఎదురుచూస్తూ భద్రాసనంపైని కూర్చుని ఉండినాడు. దేవ సంఘాలు వేలకొలది రత్నఘటాలతో నానావిధాలయిన గంధోదకాలను తెచ్చి, దశబలగుణపారాన్ని పొందిన ఆ లోకబంధువును అప్స్నానంచేయించారు. కోట్లకొలదిగా వచ్చిన దేవతలు లెక్కలేని అప్సరసలతోకూడా వేలకొద్దీ వాద్యాలను మ్రోగిస్తూ సాటిలేని రీతిగా అతనిని పూజించారు. ఈ విధంగా దేవపుత్రులు సహేతుకంగానూ, సప్రవ్యయంగానూ, ధ్వనియుక్తంగానూ పూజించారు. ధరణిమండంలో జినులు వారం దినములు పర్యంకబంధాన్ని విడదీయకుండా ఉన్నారు.

ఓ భిక్షులారా, ఇట్లు సమ్యక్సంబోధిని తెలుసుకున్న తథాగతుడు మొదటి సప్తాహంలో అక్కడే ఆసనస్థుడై ఉండినాడు. "ఇక్కడనే నాచేత లోకోత్తరమైన సమ్యక్సంబోధి గ్రహింపబడినది. ఇక్కడనే నేను జాతిజరామరణాల అంతాన్ని సాధించాను" అని ఆయన అనుకొన్నారు. రెండవ సప్తాహంలో తథాగతుడు త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులలో దీర్ఘచంక్రమము చేసినాడు. మూడవ సప్తాహంలో తథాగతుడు అనిమేషదృష్టితో బోధిమండాన్ని చూస్తూ ఉండినాడు. "ఇక్కడనే నేను లోకోత్తరమైన సమ్యక్సంబోధిని గ్రహించి జాతిజరామరణ దుఃఖముల అంతాన్ని సాధించాను" అని అనుకొంటూ ఉండినాడు. నాల్గవ సప్తాహంలో తథాగతుడు తూర్పు సముద్రంనుంచి పడమటి సముద్రానికి అభిచంక్రమం చేశాడు.

తర్వాత పాపాత్ముడైన మారుడు తథాగతుడు ఉన్న స్థలానికి వచ్చి అతనితో "ఓ భగవానుడా! నిష్ఠను నిలిపివేయి" అని అన్నాడు.

అప్పుడు తథాగతుడు "ఓ పాపీ! నేను నియమాన్ని విడువను. నా కన్న స్థవిరులయిన భిక్షువులు, దాంతులు, వ్యక్తులు, వినీతులు, విశారదులు, బహుశ్రుతులు, ధర్మానుధర్మప్రతిపన్నులు, ప్రతిబలులు, స్వయంగా ఆచార్య స్థానాన్ని ఆక్రమించి జ్ఞానాన్ని వెలిగింపజేసి, ఉత్పన్నోత్పన్నులయిన వరప్రసాదులను ధర్మంవల్ల నిగ్రహించి, అప్రతిహార్యమయిన ధర్మాన్ని ప్రసాదించేవరకూ నేను విడువను. నేను బుద్ధ, ధర్మ, సంఘ వంశాన్ని లోకంలో ప్రతిష్ఠాపనం చేసేవరకూ అది జరగదు. అపరిమితులైన బోధిసత్త్వాలు అనుత్తరమైన సమ్యక్సంబోధిలో నవ్యులుగా కాగలరు. నా నల్గురు పారిషదులూ దాంతులూ, వినీతలూ, వ్యక్తులూ, విశారదులుగా అయ్యేవరకూ నేను దీనిని విడవను. వారు సప్రాతిహార్యమైన ధర్మాన్ని లోకానికి ఉపదేశింపవలసి వున్నది."

తర్వాత, పాపీయుడైన మారుడు ఈ మాటలను విని, తథాగతునికి కానరాకుండా చాటుకు పోయాడు. వాడు దుఃఖిస్తూ దుర్మనుడూ, విప్రతి



సారీ అయి ముఖం వంచుకుని "ఇది నా సీమను దాటిపోయింది" అని అనుకుంటూ కర్రతో నేలపై రాస్తూ ఉండినాడు. మారుడి కుమార్తెలైన రతి, అరతి, తృష్ణ అనేవారు ముగ్గురూ విచారంతో ఉన్న తండ్రిని చూచి ఇలా అన్నారు. "తండ్రీ! నీ విచారానికి కారణం ఏమిటి? దీనికి కారణమైన నరుడు ఏనుగువంటివాడైనా సరే, అతనిని రాగపాశంతో బంధించి తెచ్చి, నీకు వశవర్తిని చెయ్యగలం." అప్పుడుమారుడు — "భూలోకంలో సుగతుడనే అర్హతుడున్నాడు. అతడు రాగానికి వశం కాడు. అతని స్థితి నా విషయానికి అతీతమైపోయింది. అందువల్లనే నాకు ఎక్కువ విచారం కలుగుతున్నది" అని అన్నాడు.

మారపుత్రికలకు బోధిసత్త్వుని మహాప్రభావం తెలియదు. అందువల్ల స్త్రీచాపల్యం కారణంగా వారు తండ్రిమాటనైనా వినకుండా ప్రభూత యౌవనమునూ, మధ్యయౌవనమునూ పొంది, స్త్రీ మాయలను అన్నిటినీ సంగ్రహించుకొని, తథాగతుని వశం చేసుకొనడానికి వచ్చారు. అతడు వీరిని లెక్కచెయ్యలేదు. మీదుమిక్కిలి ఆయన వీరిని జరాజర్జితలనుగా చేసివేసినాడు. అప్పుడు వారు తండ్రి దగ్గరకు పోయి "ఓ తండ్రీ! నీవు పలికిన మాట సత్యమైనది. అతడు రాగానికి ఎంత మాత్రమూ లొంగడు. ఈ విషయం మా ఎల్ల దాటిపోయింది. మాకూ ఎక్కువ విచారం కలుగుతున్నది. మాకు చక్కని రూపం ఉన్నట్లయితే, దాన్ని చూచి గౌతముని హృదయం పగిలిపోతుంది. కనుక అతని వినాశంకొరకు, నీవు మా యీ ముసలిరూపం పోయి చక్కనిరూపం కలిగేటట్లు చెయ్యి" అని అన్నారు.

అప్పుడు మారుడు "ఓ పుత్రికలారా! ఈ చరాచర ప్రపంచంలో బుద్ధుడు చేసినదానిని మార్చడానికి ఎవ్వరికినీ శక్యం కాదు. మీరు ఆయన దగ్గరికే పోయి, ఆయన చేసిన యీ అత్యాయాన్ని విన్నవించండి. ఆయనే మీరు కోరినట్లు మీ దేహాన్ని వెనుకటిలా మార్చగలడు" అని చెప్పాడు.

మారపుత్రికలు భగవానుడైన తథాగతునివద్దకు పోయి క్షమాపణ వేడుకొంటూ "ఓ భగవానుడా! ఈ అత్యయాన్ని మార్చివెయ్యండి, మేము చేసినపని పిల్లలు చేసినట్లు, మూఢులు చేసినట్లు, అవ్యక్తులు అకుశలులు అయినవారు చేసినట్లు, అక్షేత్రజ్ఞులు చేసినట్లు భావించి, మన్నించవలెను. మా యీ వార్ధకరూపాన్ని పోగొట్టవలెను" అని ప్రార్థించారు.

అప్పుడు తథాగతుడు ఒక గాథ చెప్పినాడు. దాని అభిప్రాయం ఇది: "ఓ బాలికలారా! కొండలను గోళ్ళతో త్రవ్వగలను. లోహాన్ని దంతాలతో కొరికివేయగలను. కొండలను శిరస్సుతో భేదించగలను. అగాధాన్ని గాధంగా చేస్తాను" ఇలా పలుకుతూ అతడు వారి అత్యయాన్ని పోగొట్టినాడు. ఆర్యమైన ధర్మవినయంతో ఉన్న బుద్ధి అత్యయాన్ని అత్యయదృష్టితో చూచి, దాన్ని నివర్తిస్తుంది. శ్రేష్ఠమయిన ఆయతిని పొందుతుంది.

ఓ భిక్షులారా, ఐదవ వారంలో తథాగతుడు ముచిలింద నాగరాజు భవనంలో విహరిస్తూ ఉండినాడు. ఆ సప్తాహం పెద్ద దుర్దినంగా ఉండినది. ముచలింద నాగరాజు తన భవనంనుండి బయలుదేరి తథాగతుని వద్దకు వచ్చి, అతని శరీరాన్ని తన దేహంతో ఏడుసారులు చుట్టి పైని పడగలను విప్పి ఉంచాడు. భగవానుని శరీరానికి శీతవాతాదులవల్ల బాధ కలుగకూడదని ఆ నాగరాజు అభిప్రాయం. ముచిలిందునివలెనే చాల మంది నాగరాజులు తూర్పుదిక్కునుండి వచ్చి శీతవాతాలు తగలకుండా తథాగతుని శరీరాన్ని తమ దేహాలతో చుట్టి, పైని పడగలను విప్పి ఉంచారు. తూర్పు దిక్కునుంచి వచ్చినట్లుగానే దక్షిణంనుంచీ, పడమటినుంచీ, ఉత్తర దిక్కునుంచీ కూడా నాగరాజులు వచ్చి, తథాగతుని శరీరాన్ని శీతవాతాలు సోకకుండా ఏడు పర్యాయాలు తమ దేహాలతో చుట్టి పైని పడగలు విప్పి వుంచారు. తథాగతుని శరీరసన్నికర్షలవల్ల ఆ నాగరాజులందరికీ—ఆ సప్తదినాలూ రాత్రింబవళ్ళు అపూర్వమైన సుఖం కలిగినది. అట్టి సుఖం వారికి అదివరకెన్నడూ కలగలేదు.



ఆ వారము దినములూ వర్షంగా ఉండినది. పిదప వర్షాలు నిలిచిపోయాయి. వెంటనే నాగరాజులందరూ తథాగతుని శరీరాన్నుండి తమ దేహాలను విడదీసి, అతని పాదాలకు శిరస్సులతో నమస్కరించి, మూడుసార్లు ప్రదక్షిణంచేసి, తమ తమ గృహాలకు వెళ్ళిపోయారు. ముచిలింద నాగరాజు కూడా తథాగతుని పాదాలకు తన శిరస్సుతో నమస్కరించి, మూడుసార్లు ప్రదక్షిణం చేసి తన భవనంలో ప్రవేశించాడు.

ఆరవ సప్తాహంలో తథాగతుడు ముచిలింద భవనాన్నుంచి, అజపాల మనే పేరుగల మర్రిచెట్టువద్దకు వెళ్ళాడు. ఆ ముచిలిందభవనానికీ, అజపాలానికీ నడుమనే నైరంజనానది, ఆ నదీతీరంలో చరక, పరివ్రాజక, వృద్ధశ్రావక, గౌతమ, నిర్గ్రంథ్య, ఆజీవకాదులు తథాగతుని చూచి, "అకాల దుర్దినమైన యీ వారం దినములూ గౌతమ భగవానునికి శ్రమ లేకుండా సుఖంగానే గడచినవా?" అని కుశలప్రశ్న చేశారు.

ఓ భిక్షులారా, అప్పుడు తథాగతుడు ఈ ఉదానమును (వచనమును) వచించినాడు. "తుష్టునికీ, శ్రుతధర్మునికీ, చూస్తున్నవానికీ వివేకమే సుఖము. ప్రాణిసంఘంలో చిక్కుకొనివానికి ఆ బంధమోక్షమే సుఖము. పాపాలను అతిక్రమించి ఉండడం, వైరాగ్యమున్నూ లోకంలో సుఖాలు. ఈ మనుష్యలోకంలో ఇదే పరమ సుఖమైనది.

ఓ భిక్షులారా, అప్పుడు తథాగతుడు లోకం ప్రదీప్తంగా ఉండి, జాతి, జరామరణ వ్యాధులూ, శోకపరిదేవదుఃఖదౌర్మనస్యాసాయాలూ లేకుండా ఉన్నట్లు చూచాడు. అప్పుడు ఈ ఉదానం చెప్పాడు—"ఈ లోకం శబ్ద స్పర్శ రూప రస గంధాలతో సంతాపం పొందుతూ, భయంవల్ల బెదురుతూ ఉండిన్నీ, సంసారమందలి ఆశవల్ల తిరిగీ భయాన్నే అన్వేషిస్తూ ఉన్నది."

ఏడవ సప్తాహంలో తథాగతుడు తారాయణ పర్వత మూలములో విహరిస్తూ ఉండినాడు. ఆ సమయంలో ఉత్తరాపథంలో త్రపుషుడు, భల్లికుడు అనే యిద్దరు సోదరులు వర్తకులుండేవారు. వారు పండితులు. నిపుణులు. వారు అనేక విధ వస్తువుల వ్యాపారంవల్ల ధనవంతులైనారు. వారప్పుడు వ్యాపారనిమిత్తం దక్షిణాపథానికి వెళ్ళి అధిక లాభాలు

పొంది, తిరిగి ఉత్తరాపథానికి వస్తూ ఉన్నారు. వారివెంట పూర్తిగా వస్తువులతో నిండిన అయిదువందల శకటాలు ఉన్నవి. వారు కూర్చుండే బండికి రెండు మేలిరకపు ఎడ్లు సుజాతం, కీర్తి అనే పేరు గలవి కట్టి ఉన్నవి. ఇతర వృషభాలవలె అవి బండిని లాగడానికి భయపడవు. ఏ యెడ్లూ లాగలేని శకటాలను ఇవి లాగగలవు. వాటిని తోలడానికి కొరడా అక్కరలేదు. ఉత్పలహస్తకమైనా (కలువపూవయినా), పుష్పదామమైనా చాలును. ముందు ఏదైనా భయకారణం వున్నప్పుడు అవి ఒక్క అడుగైనా ముందుకు పెట్టవు. మేకులు కొట్టినట్లు నిలిచిపోతాయి.

వీరు తారాయణం సమీపంలోని క్షీరికావనంలో ఉండే దేవత గుడి సమీపానికి వచ్చేసరికి బండ్లన్నీ నిలిచిపోయాయి. బండిచక్రాలు కుంచంవరకూ నేలలో దిగబడిపోయినాయి. ఎంత ప్రయత్నించినా, వానిని కదపడానికి కూడా సాధ్యం కాలేదు. అందరికీ ఎంతో ఆశ్చర్యమూ, భయమూ కలిగాయి. “మామూలు స్థలంలో బండ్లు ఎందుకు కూరుకుపోయినవి? ఈ సంఘటన ఎందువల్ల జరిగింది?” అని వాళ్లు అనుకున్నారు. సుజాతకీర్తులు లాగుతూ ఉన్న బండి కూడా నిలిచిపోయింది. ఆ యెడ్లుకూడా నిలచిపోవడంవల్ల ముందు తప్పకుండా ఏదైనా భయంకరకారణం ఉండి తీరుతుందని వారు నిశ్చయించి, ముందుకు పోయి చూడడానికి గుర్రపురౌతులను పంపారు. వారు తిరిగి వచ్చి, తమకు భయకారణం ఏమీ కానరాలేదని చెప్పారు. క్షీరికావనవాసిని అయిన దేవతకూడా ప్రత్యక్షమై ‘భయపడవ’ద్దని ధైర్యం చెప్పింది.

తర్వాత సుజాతకీర్తులనే బలీవర్దములు తథాగతుడు ఉన్నచోటికి బండిని లాగుకొని పోయాయి. వారికి తథాగతుడు కనిపించాడు. అతడు అగ్నివలెనే ప్రదీప్తుడై, ముప్ఫయిరెండు మహాపురుషుల లక్షణాలతోనూ విరాజమానుడై ఉన్నాడు. అప్పుడే ఉదయించిన సూర్యుని శోభతో దేదీప్యమానంగా వెలుగుతూ ఉండినాడు. అతనిని చూచి వర్తకులు విస్మితులయినారు. “ఏమి, ఇతడు భూలోకానికి అవతరించిన బ్రహ్మదేవుడా? లేక దేవతల ప్రభువైన శక్రుడా? లేక వైశ్రవణుడా? సూర్యుడా? చంద్రుడా? లేకపోతే పర్వతదేవతయా? లేక నదీదేవతయా?” అని వారికి



సందేహం కలిగింది. అప్పుడు తథాగతుడు కాషాయవస్త్రాలను చూపించాడు. “కాషాయాలు ధరించినందున ఇతడు సన్యాసి అని తెలుస్తున్నది. ఇతనివల్ల మనకు భయంలేదు” అని వారు అనుకున్నారు. దానితో కలత తీరి, వారు ఈ ప్రవ్రజితుడు కాలభోజి అయి ఉంటాడు. ఇతనికి తినడానికి ఏమైనా ఉన్నదా?” అని పరస్పరం ప్రశ్నించుకుని మధుతర్పణం, (తేనె) చెరకుముక్కలు ఉన్నట్లు తెలుసుకున్నారు. వారు వాటిని తీసుకుని తథాగతుని సమీపించి, అతని పాదాలదగ్గర తమ శిరస్సులను ఉంచి వందనం చేసి, ముమ్మారు ప్రదక్షిణం తిరిగి ఒకవారగా ఉండి “ఓ భగవానుడా! మమ్ముల్ని అనుగ్రహించి యీ పిండపాత్రం (ఆహారవస్తువు) స్వీకరించవలెను” అని ప్రార్థించారు.

ఓ భిక్షులారా, అప్పుడు తథాగతునికి ఇట్లు తోచింది.—“నేను నా చేతులతోనే యీ వస్తువులను తీసుకోవడం మేలు కాదు. ప్రాచీనులైన తథాగతులు ఎట్లు తీసుకున్నారో ఆలోచిస్తాను” అని ఇట్లు ఆలోచించి, పాత్రలతో తీసుకొన్నట్లు తెలుసుకొన్నాడు.

ఓ భిక్షులారా, ఇది తథాగతుని భోజన సమయమని తెలుసుకుని వెంటనే నాలుగు దిక్కులనుంచీ నలుగురు మహారాజులూ బంగారు పాత్రలు నాలుగు తీసుకుని తథాగతునివద్దకు వచ్చి “ఓ భగవానుడా! మాయందు అనుగ్రహం ఉంచి యీ నాలుగు బంగారు పాత్రలనూ తీసికొనవలెనని ప్రార్థిస్తున్నాము” అన్నారు. ఆ పాత్రలు శ్రమణ ప్రతిరూపాలని నిశ్చయించి తథాగతుడు వాటిని స్వీకరించలేదు. తర్వాత వారు నాలుగు వెండి పాత్రలనూ, నాల్గు వైడూర్యపాత్రలనూ, నాల్గు స్ఫటిక పాత్రలనూ, అశ్మగర్భపాత్రలనూ, సర్వరత్నాలతో తయారైన పాత్రలనూ తెచ్చారు. కాని, అవన్నీ శ్రమణప్రతిరూపాలని నిశ్చయించి తథాగతుడు వాటిని స్వీకరించలేదు.

ఓ భిక్షులారా, తర్వాత బోధిసత్త్వునికి ఇలా తోచింది—“పూర్వీకులైన తథాగతులు సమ్యక్సంబుద్ధిని పొందిన అర్హత్తులు ఏ పాత్రలు స్వీకరించారా?” అని. శిలాపాత్రలని అతనికి నిశ్చయం కలిగింది.

అప్పుడు వైశ్రవణ మహారాజు తక్కిన ముగ్గురు మహారాజులతోను ఇట్లు చెప్పినాడు—"మార్షులారా! ఇదివరలో మనకు నీలకాయికులైన దేవపుత్రులు నాలుగు శిలాపాత్రలను ఇచ్చారు. వాటిని మనం భోజనానికి ఉపయోగించదలచాము. అప్పుడు వైరోచనుడనే నీలకాయిక దేవపుత్రుడు "ఈ పాత్రలలో మీరు భుజించకూడదని నా మనస్సుకు తోస్తున్నది. మునుముందు శాక్యముని అనే మహాపురుషుడు అవతరించబోతాడు. ఆయనకు ఈ పాత్రలను సమర్పించండి" అని మనతో అన్నాడు. అందువల్ల, ఓ మహర్షులారా, శాక్యమునికి ఆ పాత్రలను సమర్పించే సమయం వచ్చింది. సంగీతతూర్యధ్వనులతో కూడా వీటికి పూజచేసి, ఆయనకు సమర్పిద్దాము. ధర్మమయములూ, అభేద్యములూ అయిన ఈ పాత్రలను స్వీకరించడానికి ఆయన తప్ప మరియొకడు అర్హుడు కాడు."

తర్వాత నలుగురు మహారాజులూ స్వజనులతోనూ, పారిషదులతోనూ కూడా పుష్పధూప గంధమాల్యవిలేపనతూర్యధ్వని సంగీతాలతో పూజించి తమ తమ చేతులతోనే ఆ పాత్రలు పట్టుకొని వాటిని, పూవులతో నింపి, తథాగతుని వద్దకు పోయి ఆయనకు సమర్పించడానికి సిద్ధంగా ఉండినారు.

అప్పుడు తథాగతునికి ఇట్లు ఆలోచన తోచినది—"ప్రసన్నులూ, శ్రద్ధాళులూ అయిన ఈ నలుగురు మహారాజులూ నాకోసం శిలాపాత్రలను నాల్గింటిని సమర్పిస్తున్నారు. నాకు నాలుగు పాత్రలు అక్కరలేదు. ఒక్కటే చాలును. ఏదైనా ఒక్క పాత్రనే తీసుకుంటే తక్కిన ముగ్గురికీ వైమనస్యం కలుగుతుంది. అందువల్ల ఈ నాలుగు పాత్రలనూ గ్రహించి, ఒక్కదాన్నిమాత్రం ఉపయోగించుకుంటాను."

ఓ భిక్షులారా, తర్వాత తథాగతుడు తన కుడిచేతిని చాచి, వైశ్రవణుడనే మహారాజుతో ఇట్లు పల్కినాడు—"భోజనసంగ్రహంకోసం నీవు తెచ్చిన పాత్రను నాకు ఇమ్ము. నా వంటివారికి పాత్ర యిస్తే స్మృతి, మతి క్షీణించకుండా వృద్ధిపొందుతాయి. నీకు అగ్రయానానికి అర్హత కలుగుతుంది" అని. ఇలా చెప్పి తథాగతుడు వైశ్రవణ మహారాజుదగ్గరనుండి పాత్రను — అతనిని అనుగ్రహించడంకోసం స్వీకరించి, ధృతరాష్ట్ర మహారాజుతో ఇట్లన్నాడు :



"తథాగతునికి భోజనపాత్రం ఇచ్చినవారికి స్మృతి, ప్రజ్ఞ ఎప్పటికీ నశింపక ఉంటాయి. అతి శామ్యకాలంలో సుఖమూ, సుఖంవల్ల శీతిభావమూ కలుగుతాయి." ఇట్లు పలికి, తథాగతుడు ధృతరాష్ట్రమహారాజును అనుగ్రహించడానికి అతని దగ్గరనుంచి పాత్ర తీసుకొన్నాడు.

తర్వాత విరూఢక మహారాజును చూచి "నీవు విశుద్ధసత్త్వుడైన తథాగతునికి పరిశుద్ధమైన భోజనపాత్ర యిస్తున్నావు. నీవు శీఘ్రంగా శుద్ధచిత్తుడవై దేవలోకంలోనూ, మనుష్యలోకంలోనూ ప్రశంసలను పొందగలవు" అని పలుకుతూ, విరూఢమహారాజు సమీపంనుంచి ఆ శిలాపాత్రను స్వీకరించినాడు.

ఆ తర్వాత విరూపాక్షమహారాజును చూచి "అచ్ఛిద్రశీలుడూ, అచ్ఛిద్రవృత్తికలవాడూ అయిన తథాగతునికి నీవు అచ్ఛిద్రమైన భోజనపాత్రను శ్రద్ధతో ఇస్తున్నావు. నీ పుణ్యదక్షిణ అచ్ఛిద్రం అవుతుంది" అని అంటూ, తథాగతుడు విరూపాక్షమహారాజువల్ల అతనిని అనుగ్రహించడానికి ఆ పాత్రను తీసుకొని ఒక్క పాత్రను మాత్రం తనకు ఉంచుకున్నాడు. ఆ సమయంలో ఈ ఉదానం వెల్లడి అయినది—"పూర్వజన్మలో నేను నాలుగు పాత్రలను పండ్లతోనింపి ప్రేమతో ఇచ్చాను. కనుక నలుగురు దేవతలూ ఈ పాత్రలను ఇచ్చారు" అని.

ఇక్కడ కొన్ని శ్లోకా లున్నాయి. వాటి భావ మిది :

"నరులలో సింహంవంటివాడూ, ధీరుడూ, పరమార్థాన్ని దర్శించినవాడూ అయిన బోధిసత్త్వుడు ఏడు రాత్రులు బోధివృక్షాన్నీ, షడ్వికారమైన భూమినీ చూస్తూ లేచినాడు. గజేంద్రుని గమనంతో ఆయన తారాయణ మూలానికి వచ్చి, మేరుపర్వతంవలె అచంచలుడై ధ్యానసమాధిని ముగించి కూర్చున్నాడు.

ఆ కాలంలో త్రపుషుడూ, భల్లికుడూ అనే యిద్దరు సోదరులు, వర్తకులు వణిజగణంతోనూ, వస్తువులతోనూ నిండి ధనపూర్ణాలయిన ఐదు శకటాలతో బాగుగా పుష్పించిన సాలవనంలో ప్రవేశించారు. మహర్షియైన తథాగతుని తేజోవిశేషంవలన వెంటనే ఇరుసువరకూ ఆ బండ్లు

నేలలో కూరుకుపోయాయి. ఆరీతి పరిస్థితిని చూచి వర్తకులందరూ మిక్కిలి భయపడ్డారు. ఇలా జరగడానికి క్రూరమృగాలు కారణమని తలచి, వారు కత్తులూ, విల్లమ్ములూ, శక్తీ మున్నగు ఆయుధాలు ధరించి మృగాలను వెతుకుతూ అడవిలో చూడగా వారికి జినుడు కన్పించాడు. ఆయన శరత్కాల పూర్ణచంద్రునివంటి ముఖంతో, మేఘమండలంనుండి బయలుపడిన సూర్యునివలె ప్రకాశిస్తూ వుండినాడు. అతనిని చూడగానే వారి కోపం అంతా ఉపశమించినది. గర్వం అణగిపోయింది. వారాతనికి శిరస్సుతో నమస్కారం చేసి "ఈయన ఎవరో?" అని ఆలోచిస్తూ ఉండగా, ఆకాశం నుండి ఒక దేవవాణి "ఇతడు లోకానికి హితాన్ని కలుగజేసే బుద్ధుడు. వారంరోజులు రాత్రింబవళ్లు అన్నపానాలు మానివేసినాడు, ఈ కరుణాత్ముడు. ఆత్మక్లేశాలకు మీరు శాంతిని కోరినట్లయితే, మనశ్శరీరాలతో ఇతనిని సేవించండి" అని వినబడినది. ఆ మధురమైన ఆ వాక్యం విని, వారు జినునికి నమస్కరించి, ప్రదక్షిణం చేసి, సంతుష్టులై, తమ హితులతో కూడా అతనికి భోజనం సమర్పించడానికి నిశ్చయించారు.

ఓ భిక్షులారా, త్రపుషభల్లిక లనే వర్తకుల సమీపగ్రామంలో ఒక ఆవులమంద ఉన్నది. ఆ సమయంలో ఆ ఆవులు పాలకు బదులు నేతిని పితికినవి. ఈ విషయాన్ని గోపాలకులు వెంటనే త్రపుషభల్లికులకు తెలుపుతూ ఆ నేతిని చూపినారు. ఆవులు నేతిని యివ్వడం మంచిదో కాదో నిర్ణయించాలని వారు తమ యజమానులకు తెలిపారు.

అక్కడ ఉన్న బ్రాహ్మణులలో ఆశాపరులు కొందరు "ఇలా జరగడం చాలా అశుభమైనది. ఈ దోషపరిహారార్థం బ్రాహ్మణులచేత యాగం చేయించాలి" అని అన్నారు.

ఓ భిక్షులారా, త్రపుషభల్లికులవద్ద శిఖండి అనే బ్రాహ్మణుడు ఉండి, యిప్పుడు బ్రహ్మలోకం చేరి పోయాడు. అతడు ఈ సమయంలో తిరిగి, బ్రాహ్మణరూపంతో వచ్చి ఇలా గాథలను చెప్పాడు.

"పూర్వం మీకు ప్రణిధియైన తథాగతుడు బోధిని తెలుసుకున్నాడు. ఇప్పుడు మనం సమర్పించే భోజనం స్వీకరించి ధర్మచక్రాన్ని నడపగలడు. బోధిని పొందిన తథాగతుడు పరిపూర్ణుడైన ప్రణిధి. మీరు



ఆయనకు ఆహారం తీసుకు రండి. దాన్ని భుజించి ధర్మచక్రాన్ని త్రిప్పగలడు. ఆవులు నేతిని పితుకడం మంగళప్రదం! మంచి నక్షత్రంలో ఇది జరిగినది. పుణ్యకర్ముడూ, మహర్షి అయిన ఆ మహామునిమహత్తే యిది!"

శిఖండి యీ విధంగా పలికి వెంటనే తన భవనానికి వెళ్ళిపోయాడు. అక్కడ త్రపుషుడు మొదలయినవారు అందరి ఉదగ్రమనస్సు కలవారు అయినారు. అప్పుడు సహస్రగోవులు క్షీరాన్నిచ్చాయి. వేలకొద్దీ పణాల విలువగల రత్నమయమైన చంద్రమనే పాత్రను శుభ్రంగా కడిగి, దానిలో క్షీరం పోసి భోజనం సిద్ధపరచారు. తేనెనూ, ఆ రత్నమయ పాత్రనూ తీసుకొని తారాయణమూలంలో ఉన్న తథాగతుని వద్దకు వచ్చారు. వచ్చి "ఓ భన్తే! ఈ ఆహారాన్ని తీసుకొని మమ్ములను అనుగ్రహించు ఈ భోజ్యవస్తువును భుజించి అనుగ్రహించు" అని ప్రార్థించారు.

ఆ సోదరులిద్దరియందూ గల కరుణవల్లనూ, పూర్వాశయాన్ని తెలిసికొన్నందుననూ, శాస్త అయిన తథాగతుడు వారిచ్చిన పాత్రను గ్రహించి, అందులోని పదార్థాన్ని భుజించి పాత్రను ఆకాశంవైపు విసిరివేసినాడు. వెంటనే సుబ్రహ్మ అనే దేవరాజు ఆ రత్నపాత్రను పట్టుకొనినాడు. అతడు దాన్ని బ్రహ్మలోకానికి తీసుకొనిపోయి, మిగిలిన దేవతలతోకూడా ఇప్పటికిన్నీ పూజిస్తూ ఉన్నాడు.

తర్వాత, ఆ సమయంలో తథాగతుడు ఆ త్రపుషభల్లికులను ఈ రీతిగా దీవించాడు—

"దిక్కులకు మేలు కలిగించి; దివ్యమై మంగళప్రదమై, అర్థసాధకమైన అర్థం కలుగుతుంది. సమస్తములైన దక్షిణలూ శీఘ్రంగా కలుగగలవు. మీకు వామ, దక్షిణ హస్తాలు రెండింటిలోను సంపద కలుగును గాక! తలపై ధరించిన మాలికవలె మీకు సర్వాంగములలోనూ శిరస్సు మీదను సంపద వెలయుగాక! ధనం సంపాదించవలెననే కోరికతో దశదిశలకూ బయలుదేరిన యీ వర్తకులకు పెద్ద లాభాలు కలిగి, వారు సుఖాన్ని పొందుదురుగాక! ఏదైనా కార్యంగురించి తూర్పు దిక్కువైపు

వెళ్ళితే వీరిని ఆ దిక్కున ఉన్న కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష అనే నక్షత్రాలు కాపాడునుగాక! ఈ యేడు నక్షత్రాలూ యశస్వంతులగు లోకపాలకులూ, తూర్పుదిక్కులోవున్న వారు అన్నిచోట్లా రక్షింతురుగాక! వారికి ధృతరాష్ట్రుడనే రాజు అధిపతి. అతడు సమస్త గంధర్వులకును ప్రభువైన సూర్యునితో కూడా కాపాడునుగాక! అతనికి విచక్షణులైన కుమారులు ఒక్క పేరే కలవారు తొంభైఒక్కమంది మహాబలులు ఇంద్రనామం కలవారున్నారు. వారు కూడా ఆరోగ్యాన్ని, భద్రాన్ని ఇచ్చి పాలింతురుగాక! ఆ పూర్వదిగ్భాగంలో జయంతి, విజయంతి, సిద్ధార్థ, అపరాజిత, నందోత్తర, నందిసేన, నందిని, నందవర్ధిని అనే పేర్లు గల ఎనమండ్రు దేవపుత్రికలు ఉన్నారు. వారున్నూ ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ ఇచ్చి కాపాడుదురుగాక! పూర్వదిగ్భాగంలో చాపాలం అనే చైత్యం ఉంది. అక్కడ అర్హతులయిన జినులున్నారు. వారున్నూ మీకు ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ ఇత్తురుగాక! మీకు దిక్కులు క్షేమకరాలై వుండి, ఎట్టి పాపమూ కల్గకుండునుగాక! సర్వదేవతలచేతనూ రక్షించబడి మీరు లబ్ధలాభులై తిరిగి వత్తురుగాక!

ఏ పనికోసమైనా దక్షిణదిక్కునకు మీరు వెళ్ళినట్లయితే, ఆ దిక్కున అధిష్ఠించివున్న నక్షత్రాలు మిమ్ము పాలించునుగాక! ఆ దిక్కులో మఘ, పూర్వఫల్గుణి, ఉత్తరఫల్గుణి, హస్త, చిత్ర, స్వాతి, విశాఖ అనే నక్షత్రాలు ఏడు ఉన్నవి. అక్కడ ఉన్న తేజస్వంతులైన లోకపాలురు కూడా మిమ్ము రక్షింతురుగాక! వారికి అధిపతి విరూఢకుడు అనే మహారాజు. అతడు సర్వకుంభాండులకున్నూ అధిపతి అయిన యమునితోకూడా మిమ్ము రక్షించునుగాక! అతనికి విచక్షణులైన పుత్రులు ఒక్క పేరే కల వారు తొంభై ఒక్కమంది, మహాబలులు ఇంద్రనాములు ఉన్నారు. ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ ఇచ్చి వారుకూడా మిమ్ము రక్షింతురుగాక! ఆ దక్షిణదిగ్భాగంలో శ్రియామతి, యశమతి, యశఃప్రాప్త, యశోధర, సుఉత్థిత, సుప్రథమ, సుప్రబుద్ధ, సుఖావహ — అనే పేర్లుగల ఎనమండుగురు దేవకన్యలు ఉన్నారు. వారున్నూ మీకు ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ ఇచ్చి కాపాడుదురుగాక! ఆ దక్షిణదిగ్భాగంలో పద్మమనే



పేరుగల చైత్యం ఉన్నది. అది దివ్యమై నిత్యమూ గొప్ప తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటుంది. అది కూడా ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ ఇచ్చి మిమ్ము కాపాడునుగాక! మీకు దిక్కులన్నీ క్షేమంకరాలై, ఎట్టి పాపమూ మీకు లేకుండునుగాక! సర్వదేవతలూ రక్షించగా మీరు లాభాలుపొంది తిరిగి వత్తురుగాక!

ఏదైనా కార్యం నిమిత్తం పడమటి దిక్కునకు వెళ్ళినట్లయితే ఆ దిక్కున వుండే నక్షత్రాలన్నీ — మిమ్ము రక్షించునుగాక! ఆ దిక్కులో అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, అభిజిత్తు, శ్రవణం అనే ఏడు నక్షత్రా లున్నవి. యశస్వులైన లోకపాలకులున్నారు. వారు మిమ్ము కాపాడుదురుగాక! వారి రాజు విరూపాక్షుడు. అతడు సర్వనాగాధిపతి అయిన వరుణునితో కూడా మిమ్ము కాపాడునుగాక! అతనికి విచక్షణులైన కుమారులు ఒక్క పేరే కలవారు, తొంభై ఒక్కమంది మహాబలులు — ఇంద్రనామధారులు ఉన్నారు. వారు కూడా ఆరోగ్యాన్ని, శ్రేయస్సును ఇచ్చి మిమ్ము కాపాడుదురుగాక! ఆ పశ్చిమదిగ్భాగంలో అలంబుశ, మిత్రకేశి, పుండరీక. ఏకాదశి, నవమిక, శీత, కృష్ణ, ద్రౌపది అనే పేర్లు గల ఎనమండుగురు దేవకన్యలు ఉన్నారు. వారున్నూ మీకు ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ ఇచ్చి పాలింతురుగాక! పశ్చిమదిగ్భాగంలో అష్టంగమనే పర్వతం ఉన్నది. అది మీకు చంద్రసూర్యుల ప్రతిష్ఠనూ, అష్టైశ్వర్యాలనూ ఇచ్చునుగాక! ఆ పర్వతం కూడా మీకు ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ ఇచ్చి రక్షించునుగాక! మీకు దిక్కులన్నీ క్షేమంకరాలై ఎట్టి పాపమూ కలగకుండా చేయునుగాక! సర్వదేవతలవల్లనూ రక్షణను పొంది మీరు లాభాలు పొంది తిరిగి వత్తురుగాక!

ఏదైనా కార్యం నిమిత్తం మీరు ఉత్తర దిక్కునకు వెళ్ళినట్లయితే ఆ దిక్కును అధిష్ఠించి వున్న నక్షత్రాలు మీకు ఆరోగ్యాన్ని, శ్రేయస్సునూ చేకూర్చునుగాక! ఆ దిక్కులో ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, భరణి అనే ఏడు నక్షత్రాలు ఉన్నవి, యశస్వులైన లోకపాలకు లున్నారు. వారు సర్వదా మిమ్ము కాపాడుదురుగాక! వారికి రాజు నరవాహనుడైన కుబేరుడు. అతడు

సర్వ యక్షులకున్నూ అధిపతి అయిన మణిభద్రునితో కూడా రక్షించును గాక! అతనికి ఒకే పేరు గలవారు విచక్షణులైన కుమారులు మహా బలవంతులు, తొంభైఒక్కరు ఇంద్రనామధేయులు ఉన్నారు. వారు కూడా మీకు ఆరోగ్యాన్నీ, శ్రేయస్సునూ ప్రసాదించి రక్షింతురుగాక! ఆ ఉత్తర దిగ్భాగంలో ఇలాదేవి, సురాదేవి, పృథ్వి, పద్మావతి, ఆశ, శ్రద్ధ, హ్రీ, శ్రీ అనే ఎనమండుగురు దేవపుత్రికలు ఆ రాజును ఆశ్రయించి ఉన్నారు. వారు కూడా మీకు ఆరోగ్యాన్నీ శుభాన్నీ యిచ్చి కాపాడుదురుగాక! ఆ ఉత్తర దిగ్భాగంలో గంధమాదన పర్వతం ఉన్నది. అది చిత్రములైన కూటములు కల్గి, చూడడానికి అందంగా ఉండి, యక్ష, భూతాలకు నివాసంగా ఉంటున్నది. అదిన్నీ మీకు ఆరోగ్యాన్నీ, శ్రేయస్సునూ ఇచ్చి కాపాడునుగాక! మీకు దిక్కులన్నీ క్షేమంకరాలై, ఎట్టి పాపమూ కలగకుండా చూస్తూ వుండునుగాక! సమస్త దేవతలవల్లనూ మీరు రక్షణ పొంది లాభాలతో తిరిగి వత్తురుగాక!

"ఏడూ, ఏడూ, ఏడూ, ఏడూగా నాలుగు దిక్కులలోను ఉన్న ఇరవై ఎనిమిది నక్షత్రాలూ, ఎనిమిదీ ఎనిమిదీ ఎనిమిదీ-ఎనిమిదీ ముప్ఫయి యిద్దరు దేవకన్యలూ, ఎనమండుగురు శ్రమణులూ, ఎనమండుగురు దేశంలోని నిగమవేత్తలయిన బ్రాహ్మణులూ, ఇంద్రునితో సహా ఎనమండుగురు దేవతలూ అన్నియెడల మిమ్ము రక్షింతురుగాక! మీకు, వెళ్తూ ఉన్నప్పుడు స్వస్తి కలుగనీ. తిరిగి వచ్చేటప్పుడు స్వస్తి కలుగును గాక! మీ జ్ఞాతులను స్వస్తిచూచుగాక! జ్ఞాతులు స్వస్తిని చూతురుగాక! ఇంద్రసహితులైన మహారాజులూ, యక్షులూ అర్హతునిదయను పొంది స్వస్తిని కల్గింతురుగాక! సర్వత్రా మీకు స్వస్తి. మీరు వెళ్ళండి. శుభమైన అమృతాన్ని పొందండి.

"బ్రాహ్మణ వాసవునిచేత సంరక్షించబడి, అనాశ్రవులూ, విముక్తచిత్తులూ అయిన నాగులూ, యక్షులూ ఎల్లప్పుడూ దయాపరులై పాలించగా నూరు సంవత్సరాలు జీవించండి. దక్షిణలోక నాయకుడూ, సాటిలేనివాడూ అయిన ఈ వినాయకుడు ప్రదక్షిణను (అపార ధనం) ఇచ్చునుగాక! ఈ కుశలకర్మవలన మీరు మధు సంభవులు అనే జినులు



అగుదురుగాక! ఇది లోకవినాయకుడైన - అసంగతుడనే జినునియొక్క మొదటి వివరణం! తర్వాత అనంతంగా చాలామంది బోధిసత్త్వాలు అవతరించి బోధిని వివరించగలరు."

జినుడు చెప్పిన యీ వివరణము నంతనూ ఏకాగ్రచిత్తంతో అధికమైన ప్రీతితో సోదరులు యిరువురున్నూ విన్నారు; సహాయకులతో కూడా బుద్ధునీ, ధర్మాన్నీ శరణు పొందినారు.

ఇది లలితవిస్తరంలో త్రపుషభల్లిక పరివర్తమనే
ఇరవైనాల్గవ అధ్యాయం.

# 25. అధ్యేషణా పరివర్తం

ఓ భిక్షులారా, తారాయణ సమీపంలో విహరిస్తూ ఉన్నవాడూ,
ప్రథమాభిసంబుద్ధుడూ రహస్యంగా ప్రతి సంవిలీనుడూ అయిన తథా
గతునికి లోకంలోనివారిని గురించి యీ ఆలోచన కలిగింది :—గంభీర
మైన యీ ధర్మాన్ని కనుగొన్నాను. ఇది శాంతమూ, ప్రశాంతమూ, ఉప
శాంతమూ అయినది. చూడ శక్యమూ, గ్రహింప శక్యమూ, తర్కింప
శక్యమూ కానిది. వితర్కావచరం కానిది. ఆర్యులూ, పండితులూ,
విజ్ఞులూ తెలుసుకోదగినది. సర్వోపాధినిసర్గమూ, అవేదితమూ, అనివేది
తమూ, సర్వవేదితనిరోధమూ, పరమార్థమూ, అనాలయమూ అయినది.
శీతీభావమూ, అనాదానమూ, అనుపాదానమూ, అవిజ్ఞప్తమూ, అవిజ్ఞాప
నీయమూ, అసంస్కృతమూ, షడ్విషయసమతిక్రాంతమూ, అకల్పమూ,
అవికల్పమూ, అనభిలాస్యమూ అయినది. ఇది అరుతమూ, అఘోషి,
అనుదాహారమూ, అనిదర్శనమూ, అప్రతిఘమూ, సర్వాలంబనసమతి
క్రాంతమూ, సమథధర్మోపచ్ఛేదమూ, శూన్యతానుపలంభమూ, తృష్ణా
క్షయమూ, విరాగమూ, నిరోధమూ, నిర్వాణమున్నూ. నే నీ ధర్మాన్ని
ఇతరులకు ఉపదేశించేటట్టయితే, వారు దీనిని గ్రహించలేకపోతే, నాకు
శ్రమ, ప్రయత్నం వ్యర్థం కావడం, అక్షణ ధర్మోపదేశమూ అవుతుంది.
కనుక నేను అల్పోత్సాహినై, తూష్ణీంభావంతో విహరిస్తాను—అని.

ఆ సమయంలో అతడు కొన్ని గాథలను పలికినాడు. వాటి తాత్పర్య
మిది: "గంభీరమూ, శాంతమూ, రజోరహితమూ, ప్రభాస్వరమూ, అమృ
తమూ, అసంస్కృతమూ అయిన ధర్మాన్ని నేను గ్రహించాను. ఇతరులకు
దీనిని ఉపదేశించకూడదనీ, తూష్ణీంభావంతో ఉండవలెననీ తోస్తున్నది.
ఇది అవగతనాకృథము, అలిప్తము అయినది. గగనంవలె స్వభావధర్మ



మైనది. చిత్తమనోవిచారం లేనిది. ఇది మిక్కిలి ఆశ్చర్యం కలిగించేదీ,
ఉత్కృష్టమైనదీ అని గ్రహించాను. ఇది అక్షరాలతో ఉపదేశించడానికి
శక్యం కానిది. అధికారసత్త్వం కలవారూ, పూర్వకాలపు జినులూ దీనిని
విని, ధర్మంలో ఎక్కువ శ్రద్ధను చూపిస్తూ వుండినారు. భావాలు లేని
ధర్మం లేదు. అది వుండడానికి కూడా సాధ్యం కాదు. అస్తినాస్తి
భావాలు దానికి లేవని హేతుక్రియాపరంపరవల్ల తెలుసుకొన్నాను.
నేను పూర్వికులైన జినుల సన్నిధిలో అప్రమేయంగా కల్పశత సహ
స్రాలు ఉండినా, ఈ క్షాంతి నాకు లభించలేదు. ఇందులో ఆత్మగాని,
సత్త్వంగాని, జీవంగాని కానరాదు. ఎవ్వరికిన్నీ జననమరణాలు కలుగ
కుండా చేసే క్షాంతిని నేను సంపాదించాను. సర్వ ధర్మాలూ నిరాత్మ
అయిన ప్రకృతి అని దీపంకర బుద్ధుడు లోగడ వ్యాఖ్యానించాడు.
సమస్తలోకం విషయంలో నాకు అనంతమైన కరుణ! ఇతరులవల్ల ఏ
అర్థనను (ప్రయోజనాన్ని) అపేక్షించలేదు. జగత్తు విషయంలో
బ్రహ్మకు ప్రసన్నభావం కలిగినపుడు అతని అభీష్టమైన ధర్మచక్రాన్ని
ప్రవర్తింపజేస్తాను. నేను గ్రహించిన యీ ధర్మాన్ని, బ్రహ్మ యాచించి
నట్లయితే విరజమైన ధర్మాన్ని తెలియజేస్తాను."

ఓ భిక్షులారా! ఆ సమయంలో తథాగతుడు ఊర్ణాకోశం (భ్రుకుటి
మధ్య) నుంచి గొప్ప తేజస్సును వెలువరింపజేసినాడు. ఆ కాంతివల్ల
త్రిసాహస్రమహాసాహస్రమైన లోకధాతువు గొప్పదైన సువర్ణ తేజస్సుతో
వెలిగినది.

అప్పుడు, దశత్రిసాహస్రమహాసాహస్రాలకు, అధిపతియైన మహా
బ్రహ్మ శిఖి అనేవాడు బుద్ధానుభావంతో మనస్సుచేతనే తథాగతుని
మనస్సును తెలుసుకున్నాడు. భగవానుని మనస్సు చేతనే తథాతుని
మనస్సును తెలుసుకున్నాడు. భగవానుని మనస్సు ధర్మోపదేశంకోసం
మొగ్గి ఉండలేదనీ, అతనికి ఆ విషయంలో ఉత్సాహం స్వల్పమైనదనీ
తెలుసుకున్నాడు. తానే స్వయంగా తథాగతుని వద్దకు పోయి ధర్మ
చక్రం ప్రవర్తింపజేయడానికి అనుకూల్యం కల్పించాలని సంకల్పించాడు.

ఓ భిక్షులారా, ఇట్లు సంకల్పించి మహాబ్రహ్మ అయిన శిఖి అరవై లక్షలమంది బ్రాహ్మణులతో పరివృతుడై తథాగతుని సన్నిధికి వెళ్ళాడు. వెళ్ళి తలను వంచి తథాగతుని పాదద్వయానికి నమస్కరించి, చేతులు జోడించి ఇట్లు పలికినాడు: "ఓ భగవానుడా! ఈ లోకం నశించి పోతున్నది. అయ్యో! పూర్తిగా నశించిపోతున్నది. తథాగతులు అనుత్తరమైన సమ్యక్సంబోధిని తెలిసికొని కూడా లోకానికి ధర్మోపదేశం చెయ్యడానికి మనస్కరించక; అల్పోత్సాహంతో ఉండడంవల్లనే యిలా జరుగుతున్నది. అందువల్ల భగవానులు ధర్మాన్ని ఉపదేశింతురుగాక! సుగతుడు ధర్మాన్ని ఉపదేశించునుగాక! భగవానులు చెప్పిన విషయాన్ని అర్థంచేసుకునే సత్త్వాలు, సాకారులూ, సువిజ్ఞాపకులూ, శక్తులూ, భవ్యులూ, ప్రవిమలులూ ఉన్నారు."

ఇలా అంటూ అతడు కొన్ని గాథలను కూడా చెప్పాడు. వాటి భావ మిది: "ఓ వాది భాస్కరుడా! జ్ఞానమహాగమండలాన్ని విస్తరింపజేసి, పది దిక్కులందును రశ్ములను ప్రసరింపజేసి, జ్ఞాన కిరణాలచేత నరులనే పద్మాలను మేల్కొల్పేవాడవు. నీవు ఉపేక్షకుడవుగా ఉన్నావు. ఓ లోకబంధూ! ఆర్యధనంతో సత్త్వాలను నిమంత్రణంచేసి, అనేక కోట్ల ప్రాణులకు ఊరట కలిగించి, ఇప్పుడు తూష్ణీంభావం వహించి జగత్తును ఉపేక్ష చేయడం నీకు తగినది కాదు. నీవు ఉత్తమ ధర్మమనే దుందుభిని మ్రోగించు. సద్ధర్మశంఖాన్ని వేగంగా పూరించు. మహాధర్మయూపాన్ని మీదికి ఎత్తు. మహాధర్మమనే దీపాన్ని వెలిగించు. ముఖ్యమైన ధర్మవర్షాన్ని కురిపించు. భవసాగరంలో ఉన్నవారిని తరింపజేయి. మహావ్యాధులచే క్లిష్టులైనవారికి వాటివల్ల విడుదల కలిగించు. క్లేశాగ్నివల్ల కలిగే తాపాన్ని శాంతింపజేయి. క్షేమాన్నీ, శుభాన్నీ, నిర్జరత్వాన్నీ, శోకాభావాన్నీ రల్గించే శాంతిమార్గాన్ని చూపు. అనాథమైన తప్పుదారిలో ఉన్నవారిని నిర్వాణ మార్గంలోనికి తెచ్చి, కృప చూపు. ఓ ప్రభూ! మోక్షద్వారాన్ని తెరువు. అమూల్యమైన ధర్మనయాన్ని తెలుపు. జాత్యంధంగా ఉన్న జనానికి ఉత్తమమైన ధర్మచక్షుస్సును అనుగ్రహించు. ఓ మనుష్యచంద్రా! లోక జాతి జరాదులను నశింపజేసే



వాడు, బ్రహ్మలోకంలోగాని, దేవలోకంలోగాని, యక్ష గంధర్వ మనుష్యలోకాల్లోగాని నీకంటె యితరుడు మరొకడు లేడు. ఓ ధర్మరాజా! నిన్ను నేను యాచిస్తున్నాను. సర్వ దేవతలనూ అనుగ్రహించు. ఈ పుణ్యంవల్ల నేనున్నూ, శీఘ్రంగానే శ్రేష్ఠమైన ధర్మచక్రాన్ని త్రిప్పగలుగుతాను."

ఓ భిక్షులారా, మహాబ్రహ్మ అయిన శిఖి యీ విధంగా ప్రార్థింపగా, దేవమనుష్యాసుర లోకాలను అనుగ్రహించుటకై వానియందు అనుకంప వహించి, తథాగతుడు తూష్ణీంభావాన్ని వహించి, అనుకూల్యాన్ని సూచించినాడు. మహాబ్రహ్మ అయిన శిఖి ఈ అనుకూల్యాన్ని గ్రహించి, దివ్యాలయిన చందన చూర్ణాలనూ, అగురుచూర్ణాలనూ తథాగతునిపై చల్లి, ప్రీతిప్రామోద్యాలను పొంది అక్కడనే అంతర్ధానం పొందినాడు.

ఓ భిక్షులారా, ధర్మోపదేశంలో తనకు ఆదరాన్ని కలిగించడం కోసం మహాబ్రహ్మ అయిన శిఖి మరల మరల ప్రార్థించగా, కుశలమూల వివృద్ధికోసం ధర్మోపదేశానికి అభిముఖ్యం చూపుతూ, ఆ ధర్మం అతి గంభీరమూ, ఉదారము కావడంవల్ల, మరల ఏకాంతంగా దాగుకొనిన తథాగతునికి మనస్సులో ఇట్టి వితర్కం కలిగినది—"నాచేత అభిసంబుద్ధమైన ధర్మం మిక్కిలి గంభీరమూ, సూక్ష్మమూ, నిపుణమూ, దురనుబోధమూ, అతర్క్యమూ, అతర్కావచరమూ, పండితవిజ్ఞవేదనీయమూ, సర్వలోకవిప్రత్యనీకమూ, దుర్దృశమూ, సర్వోపధినిఃసర్గమూ, సర్వసంస్కారోపశమమూ, సర్వతమోపచ్ఛేదమూ, శూన్యతానుపలంభమూ, తృష్ణాక్షయమూ, విరాగమూ, నిరోధమూ, నిర్వాణమూ అయినది. నేనీ ధర్మాన్ని యితరులకు ఉపదేశిస్తే, వారు గ్రహించలేరు. అది నాకు చాల బాధాకరం. అందువల్ల అల్పోత్సుకత కలిగే ఉంటుంది" అని.

ఓ భిక్షులారా, అప్పుడు మహాబ్రహ్మ అయిన శిఖి బుద్ధానుభావంవల్ల తిరిగీ, తథాగతుని యీ మనోవితర్కాన్ని గ్రహించి దేవతలకు ఇంద్రుడైన శక్రుని వద్దకు వెళ్ళి, అతనితో ఇలా అన్నాడు - "ఓ కౌశికుడా! ఇది తెలుసునా? సమ్యక్సంబుద్ధి పొంది, అర్హతుడైన తథా

గతుడు, స్వల్పోత్సాహంతో ఉండడంవల్ల లోకానికి ధర్మాన్ని ఉపదేశించడంకోసం మనస్సులో ఇష్టపడలేదు. అందువల్ల ఈ లోకం నశించగలదు. పూర్తిగా నశించిపోగలదు. అందువల్ల మనం సమ్యక్సంబుద్ధి పొంది, అర్హతుడైన తథాగతుని వద్దకు పోయి ధర్మచక్రప్రవర్తనకోసం ఎందుకు యాచింపకూడదు? మనం కోరనిదే తథాగతులు ధర్మచక్రాన్ని ప్రవర్తింపజెయ్యరు!''

''ఇది బాగా ఉన్నది మార్షా, ఇది బాగున్నది'' అని శక్రుడు పలికాడు. తర్వాత శక్రుడు, బ్రహ్మ, భౌమదేవతలు, అంతరిక్ష దేవతలు, నలుగురు మహారాజులు, కాయికులు, త్రాయత్రింశులు, యాములు, తుషితులు, నిర్వాణరతులు, పరనిర్మితవశవర్తులు, బ్రహ్మకాయికులు, ఆభాస్వరులు, బృహత్ఫలులు, శుభకృత్స్నులు, బహుళంగా శతసహస్ర సంఖ్యలలో ఉన్న శుద్ధావాస కాయిక దేవపుత్రులు, రాత్రి రంగు వెలసి, అతి క్రాంతంకాగా, తారాయణమూలమును దివ్యవర్ణంతో, దివ్యమైన అవభాసంతో ప్రకాశింపజేస్తూ తథాగతుని సన్నిధికి వచ్చారు. వచ్చి తథాగతుని పాదాలకు శిరస్సుతో అభివందనం చేసి, ప్రదక్షిణం చేసి, ఏకాంతంలో ఉండినారు.

ఆ సమయంలో దేవతలకు ఇంద్రుడైన శక్రుడు చేతులు జోడించి తథాగతునికి నమస్కరించి ఒక గాథతో ఇట్లు స్తుతించినాడు. దాని భావమిది: ''ఓ విజిత సంగ్రాముడా! చీకటిలో ఉండే లోకానికి ప్రజ్ఞను కలిగించేవాడా! లెమ్ము. గ్రహ విముక్తమైన పరిపూర్ణచంద్రబింబంవలె నీ చిత్తము విముక్తిని పొందినది'' అని.

అయినా, తథాగతుడు తూష్ణీంభావంతోనే ఉండినాడు. అప్పుడు మహాబ్రహ్మ అయిన శిఖి దేవతల ఇంద్రుడైన శక్రునితో ''ఓ కౌశికుడా! సమ్యక్సంబుద్ధులూ, అర్హతులూ అయిన తథాగతులను ధర్మచక్రం ప్రవర్తింపజేయడానికి నీవు ప్రార్థించిన విధంగా ప్రార్థించడం పద్ధతి కాదు'' అని అంటూ ఉత్తరీయాన్ని ఒక భుజంపైని వేసుకొని, కుడి మోకాలిని నేలపైని ఆనించి, తథాగతునికి అంజలిచేసి నమస్కరించి ఒక గాథను పలికినాడు. దాని భావ మిది: ''ఓ విజిత సంగ్రాముడా!



చీకటిలో ఉండే లోకానికి ప్రజ్ఞ కలిగించేవాడా! లెమ్ము. హే మునీ! ధర్మాన్ని ఉపదేశించు. దాన్ని అందరూ బాగుగా తెలుసుకుని జ్ఞాతలు అవుతారు'' అని.

ఓ భిక్షులారా, ఇలా ప్రార్థించగా, తథాగతుడు మహా బ్రహ్మ అయిన శిఖితో ఇట్లు అనినాడు—''ఓ మహాబ్రహ్మ! అభిసంబుద్ధమైన యీ ధర్మం గంభీరమైనది, సూక్ష్మమైనది, నిపుణమైనది. పేయాలం వరకూ నాకు విహేఠ (దుఃఖం) ఏర్పడుతుంది. ఓ బ్రహ్మ! ఈ విషయంలో నాకు ఈ గాథలు ప్రతిభాసిస్తున్నది. నా మార్గం గంభీరం, చూడశక్యంకానిది, ప్రవాహానికి ఎదురుగా పోయేది. రాగాంధులు దానిని చూడలేరు. అందువల్ల వెల్లడింపకున్నాను. కామాలలో పడుతూవున్న ప్రజలు ప్రవాహంలో పడి కొట్టుకుపోతూ ఉంటారు. నా మార్గం ఎంతో శ్రమచేత లభించినది. కనుక వెల్లడింపకున్నాను. అని వివరించాడు.

ఓ భిక్షులారా! తర్వాత మహాబ్రహ్మ అయిన శిఖి, దేవతలకు ఇంద్రుడైన శక్రుడు, తథాగతుని తూష్ణీంభావం తెలుసుకుని దుఃఖిస్తూ, ఆ దేవపుత్రులతో కూడా కలతపాటుతో, అక్కడే అంతర్ధానం పొందారు.

ఇలా మూడుసార్లు తథాగతుని మనస్సు అల్పోత్సాహంతోనే ఉండినది.

ఆ సమయంలో మగధదేశంలోని మనుష్యులకు అనేక విధాల పాపకార్యాలూ, ఆకుశలాలూ, దృష్టి గోచరమయినాయి. వాటివల్ల గాలులు వీవవని కొందరు, అగ్ని మండదని కొందరు, వర్ష దేవత వర్షాలు కురిపించదని కొందరు, నదులు ప్రవహించవని కొందరు, సస్యాలు వృద్ధి పొందవని కొందరు, ఆకాశంపైని పక్షులు ఎగురవని కొందరు, గర్భవతులు సుఖంగా ప్రసవించరని కొందరూ తలకొక రీతిగా పలుకసాగినారు.

ఓ భిక్షులారా, అప్పుడు మహాబ్రహ్మ అయిన శిఖి తథాగతుని యీ విధమైన చిత్తవితర్కాన్ని గ్రహించి, మగధ దేశ ప్రజలకు అశుభ

గతుడు, స్వల్పోత్సాహంతో ఉండడంవల్ల లోకానికి ధర్మాన్ని ఉపదేశించడంకోసం మనస్సులో ఇష్టపడలేదు. అందువల్ల ఈ లోకం నశించగలదు. పూర్తిగా నశించిపోగలదు. అందువల్ల మనం సమ్యక్సంబుద్ధి పొంది, అర్హతుడైన తథాగతుని వద్దకు పోయి ధర్మచక్రప్రవర్తనకోసం ఎందుకు యాచింపకూడదు? మనం కోరనిదే తథాగతులు ధర్మచక్రాన్ని ప్రవర్తింపజెయ్యరు!''

"ఇది బాగా ఉన్నది మార్షా, ఇది బాగున్నది'' అని శక్రుడు పలికాడు. తర్వాత శక్రుడు, బ్రహ్మ, భౌమదేవతలు, అంతరిక్ష దేవతలు, నలుగురు మహారాజులు, కాయికులు, త్రాయత్రింశులు, యాములు, తుషితులు, నిర్మాణరతులు, పరనిర్మితవశవర్తులు, బ్రహ్మకాయికులు, ఆభాస్వరులు, బృహత్ఫలులు, శుభకృత్స్నలు, బహుళంగా శతసహస్ర సంఖ్యలలో ఉన్న శుద్ధావాస కాయిక దేవపుత్రులు, రాత్రి రంగు వెలసి, అతిక్రాంతంకాగా, తారాయణమూలమును దివ్యవర్ణంతో, దివ్యమైన అవభాసంతో ప్రకాశింపజేస్తూ తథాగతుని సన్నిధికి వచ్చారు. వచ్చి తథాగతుని పాదాలకు శిరస్సుతో అభివందనం చేసి, ప్రదక్షిణం చేసి, ఏకాంతంలో ఉండినారు.

ఆ సమయంలో దేవతలకు ఇంద్రుడైన శక్రుడు చేతులు జోడించి తథాగతునికి నమస్కరించి ఒక గాథతో ఇట్లు స్తుతించినాడు. దాని భావమిది: "ఓ విజిత సంగ్రాముడా! చీకటిలో ఉండే లోకానికి ప్రజ్ఞను కలిగించేవాడా! లెమ్ము. గ్రహ విముక్తమైన పరిపూర్ణచంద్రబింబంవలె నీ చిత్తము విముక్తిని పొందినది'' అని.

అయినా, తథాగతుడు తూష్ణీంభావంతోనే ఉండినాడు. అప్పుడు మహాబ్రహ్మ అయిన శిఖి దేవతల ఇంద్రుడైన శక్రునితో "ఓ కౌశికుడా! సమ్యక్సంబుద్ధులూ, అర్హతులూ అయిన తథాగతులను ధర్మచక్రం ప్రవర్తింపజేయడానికి నీవు ప్రార్థించిన విధంగా ప్రార్థించడం పద్ధతి కాదు'' అని అంటూ ఉత్తరీయాన్ని ఒక భుజంపైని వేసుకొని, కుడి మోకాలిని నేలపైని ఆనించి, తథాగతునికి అంజలిచేసి నమస్కరించి ఒక గాథను పలికినాడు. దాని భావ మిది: "ఓ విజిత సంగ్రాముడా!



చీకటిలో ఉండే లోకానికి ప్రజ్ఞ కలిగించేవాడా! లెమ్ము. హే మునీ! ధర్మాన్ని ఉపదేశించు. దాన్ని అందరూ బాగుగా తెలుసుకుని జ్ఞాతలు అవుతారు'' అని.

ఓ భిక్షులారా, ఇలా ప్రార్థించగా, తథాగతుడు మహాబ్రహ్మ అయిన శిఖితో ఇట్లు అనినాడు—"ఓ మహాబ్రహ్మా! అభిసంబుద్ధమైన యీ ధర్మం గంభీరమైనది, సూక్ష్మమైనది, నిపుణమైనది. పేయాలం వరకూ నాకు విహేఠ (దుఃఖం) ఏర్పడుతుంది. ఓ బ్రహ్మా! ఈ విషయంలో నాకు ఈ గాథలు ప్రతిభాసిస్తున్నది. నా మార్గం గంభీరం, చూడ శక్యంకానిది, ప్రవాహానికి ఎదురుగా పోయేది. రాగాంధులు దానిని చూడలేరు. అందువల్ల వెల్లడింపకున్నాను. కామాలలో పడుతూవున్న ప్రజలు ప్రవాహంలో పడి కొట్టుకపోతూ ఉంటారు. నా మార్గం ఎంతో శ్రమచేత లభించినది. కనుక వెల్లడింపకున్నాను. అని వివరించాడు.

ఓ భిక్షులారా! తర్వాత మహాబ్రహ్మ అయిన శిఖి, దేవతలకు ఇంద్రుడైన శక్రుడు, తథాగతుని తూష్ణీంభావం తెలుసుకుని దుఃఖిస్తూ, ఆ దేవపుత్రులతో కూడా కలతపాటుతో, అక్కడే అంతర్ధానం పొందారు.

ఇలా మూడుసార్లు తథాగతుని మనస్సు అల్పోత్సాహంతోనే ఉండినది.

ఆ సమయంలో మగధదేశంలోని మనుష్యులకు అనేక విధాల పాప కార్యాలూ, ఆకుశలాలూ, దృష్టి గోచరమయినాయి. వాటివల్ల గాలులు వీవవని కొందరు, అగ్ని మండదని కొందరు, వర్ష దేవత వర్షాలు కురిపించదని కొందరు, నదులు ప్రవహించవని కొందరు, సస్యాలు వృద్ధి పొందవని కొందరు, ఆకాశంపైని పక్షులు ఎగురవని కొందరు, గర్భవతులు సుఖంగా ప్రసవించరని కొందరూ తలకొక రీతిగా పలుకసాగినారు.

ఓ భిక్షులారా, అప్పుడు మహాబ్రహ్మ అయిన శిఖి తథాగతుని యీ విధమైన చిత్తవితర్కాన్ని గ్రహించి, మగధ దేశ ప్రజలకు అశుభ

సూచకములు దృష్టిగోచరం కావడం తెలుసుకొని, రాత్రి గడచిన పిదప, సకల తారాయణ మూలమునూ దివ్య వర్ణంగల కాంతితో ప్రకాశింపజేస్తూ తథాగతుని సమీపానికి వచ్చి, అతని పాదాలకు శిరస్సుతో అభివందనం చేసి, కుడిమోకాలిని నేలపైని ఉంచి, ముకుళిత హస్తంతో తథాగతునికి యీ గాథలు విన్నవించినాడు. వాటి భావ మిది :

"మగధ దేశంలో అవిశుద్ధమూ, మలినమూ అయిన ధర్మం వినబడుతూ ఉన్నది. ఓ మహామునీ! అమృతద్వారాన్ని తెరువు. పరిశుద్ధంగా గ్రహింపబడిన నీ ధర్మాన్ని అందరూ వినగలరు. ఓ మునీ! నీవు దుఃఖాభిసంస్కారమలాదులకు లొంగవు. కృతార్థుడవు. నీ కుశలానికి హానివృద్ధులు లేవు. ఉత్తమ ధర్మపారమును పొందినావు. ఈ లోకంలో నీకు సమానుడు లేడు. నీకంటె అధికుడు లేడని చెప్పనక్కరనే లేదు. మూడు లోకాలలోను, పర్వతములలో మేరువువలె నీవే ముఖ్యుడవు. దుఃఖిస్తూ వున్న జనులయెడ ఎక్కువ దయను చూపు. నీవంటివారు ఎప్పుడూ ఉపేక్షను వహించరు. నీవు గొప్ప బలవంతుడవు. జన సముదాయాన్ని తరింపజేయడానికి నీవే సమర్థుడవు. చాలకాలంనుండి దేవ, శ్రమణక, ద్విజులు మొదలయిన ప్రజలు రోగాలతో, దుఃఖంతో ఉన్నారు. ఆ బాధిత ప్రజలు ఆతురత, జ్వరము లేక ఆరోగ్యం కలిగి ఉంగురుగాక! వారికి నీకంటె వేరే దిక్కు లేదు. కల్యాణచిత్తులూ, అమృతాభిలాషులూ అయిన దేవమనుష్యులు చాలాకాలంనుంచి నీతో అనుబంధం కల్గి వున్నారు. 'జినుడు ధర్మాన్ని అధిగమించినటయితే, తప్పకుండా పూర్తిగా మనకు ఉపదేశించగలడు' అని ఆశతో ఉన్నాడు. ఓ మహావిక్రముడా! అందువల్లనే నిన్ను యాచిస్తున్నాము. చాలకాలంనుంచి తప్పుదారిలో నడుస్తూ ఉన్న సత్త్వాలను మంచి మార్గంలో పెట్టు. మిక్కిలి దుర్బలులూ, అభివృద్ధిని కోరినవారూ అయిన జనులు అవిశ్రుతార్థాన్ని వినగోరుతూ వున్నారు. ఓ మహామునీ! ఈ జగత్తు దప్పిచేత బాధపడుతున్నది. నీవద్ద ఉన్న ధర్మజలం కోసం ఎదురుచూస్తూ ఉన్నది. సంతృషితమైన భూమిని మేఘం తృప్తి పొందించినట్లుగా, ధర్మవర్షాన్ని కురిపించి జనులను తృప్తి పొందించు. సంసారవిషయక దృష్టి కలిగి, ముండ్లతో కూడిన అడవిలో ఎంతో కాలంగా దారి తెలియక మానవులు సంచరిస్తూ వున్నారు. ఏ విధంగా



అమృతం లభిస్తుందో, అకంటకమైన ఆ ఋజుమార్గాన్ని తెలియజేయి. దారి చూపే నాయకుడు లేక గోతిలో పడిన అంధులను లేవనెత్తడం ఇతరులకు సాధ్యం కాదు. బుద్ధిమంతుడవైన నీవు మహాప్రపాతంలో పడిన జనులకు విశ్వాసం కలిగించి వారిని ఉద్ధరించు! ఓ మునీ! నీకు ఒకప్పుడున్నూ; దేనితోనూ సంబంధం లేదు. అత్తిపువ్వులలాగ కదాచిత్తుగా నాయకులయిన జినులు ప్రభవిస్తారు. ఇదే సమయం. ఈ సత్త్వాలకు నీవు విడుదల కలిగించు. 'నేను సంసారంనుండి తీర్ణుడనై యితరులను తరింపజేస్తాను' – అనే సంకల్పం నీకు పూర్వ జన్మలలో కూడా ఉండినది. సందేహం లేదు. ఇప్పుడు నీవు తరించావు. సత్యవిక్రముడవైన నీవు నీ ప్రతిజ్ఞను నెరవేర్చుకో. ధర్మం విషయంలో ఎక్కువ ఆసక్తి గల ఓ మహామునీ! నీవు తథాగత ధ్వజాన్ని పైకి ఎత్తు. ధర్మ ప్రబోధానికి ఇదే తగిన సమయం. మృగాధపునివలె దుందుభిస్వరంతో గర్జించు."

ఓ భిక్షులారా, పిదప తథాగతుడు సమస్తలోకాన్నీ బుద్ధచక్షుస్సుతో చూస్తూ, సత్త్వాల నన్నింటినీ పరిశీలించినాడు. వానిలో హీనులూ, మధ్యములూ, ప్రణీతులూ ఉన్నారు. ఉచ్చ నీచ మధ్యములున్నారు. స్వాకారులు, సువిశోధకులు, దురాకారులు, దుర్విశోధకులు, ఉద్ఘాటితజ్ఞులు, విపశ్చితజ్ఞులు ఉన్నారు. అతడు మూడు సత్త్వరాసులను; ఒక మిథ్యాత్వనియతుని, ఒక సమ్యక్త్వనియతుని, ఒక అనియతుని గమనించినాడు. ఎట్లనగా— తామర కొలను ఒడ్డున ఉన్న పురుషుడు చూస్తూ వున్న పుష్పాలలో కొన్ని నీటిలోపలనే మునిగి ఉంటాయి. కొన్ని నీటితో సమానంగా ఉంటాయి. కొన్ని నీటికిపైగా ఉంటాయి కదా! ఈ విధంగానే తథాగతుడు సర్వానంతమైన లోకాన్ని బుద్ధచక్షుస్సుతో చూస్తూ మూడు రాసులలో ఉన్న సత్త్వాలను అవలోకించాడు.

అప్పుడు తథాగతునికి ఇలా తోచినది:— "నేను ఇప్పుడు ధర్మాన్ని ఉపదేశించడమా? మానివేయడమా? మిథ్యాత్వనియతమైన రాశి నేను ధర్మాన్ని ఉపదేశించినా గ్రహింపజాలదు. సమ్యక్త్వనియత రాశి నేను ధర్మోపదేశం చేసినా చేయకపోయినా యీ ధర్మాన్ని

తెలుసుకోవచ్చును. అనియతమైన రాశి ఉపదేశిస్తే తెలుసుకోవచ్చును. ఉపదేశించకపోతే తెలుసుకోకపోవచ్చును.''

ఓ భిక్షులారా! తర్వాత తథాగతుడు అనియతరాశిలో ఉంటున్న సత్త్వముల విషయంలో ఎంతో కరుణను వెల్లడించినాడు.

తథాగతుడు తన సమ్యగ్జ్ఞానాన్ని గురించి మహాబ్రహ్మ అయిన శిఖి ప్రార్థనను గ్రహించి, అతనితో ఒక గాథను పలికినాడు. దాని భావ మిది: ''చెవులున్న వారికోసమై అమృతద్వారాలు తెరవబడ్డవి. శ్రద్ధ గలిగి ద్వేషం లేని మగధదేశంలోని సత్త్వాలు ఈ అమృతద్వారంలో ప్రవేశించి ధర్మాన్ని వినవచ్చు'' అని.

తర్వాత మహాబ్రహ్మ అయిన శిఖి తథాగతుని సంకల్పం గ్రహించి సంతుష్టుడై, ఉదగ్రమనస్కుడై, ప్రముదితుడై, ప్రీతిసౌమనస్యాన్ని పొంది, తథాగతుని పాదాలకు శిరస్సుతో అభివందనం చేసి, అక్కడనే అంతర్ధానం చెందినాడు.

ఓ భిక్షులారా, అప్పుడు అంతరిక్షంపైని వున్న దేవతలను భూమిపైనున్న దేవతలు ధ్వనులు చేస్తూ హెచ్చరించారు: ''ఓ మార్షలారా! సమ్యక్సంబుద్ధిని పొంది, అర్హతుడైన తథాగతుడు ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేయడానికి వాగ్దాన మిచ్చాడు. అందువల్ల బహుజనులకు హితం, సుఖం, లోకానికి దయ, గొప్ప ప్రయోజనం, దేవతలకూ, మనుష్యులకూ హిత సుఖాలూ కలుగగలవు. మార్షలారా! అసుర శరీరాలు పోతాయి. దివ్యములైన శరీరాలు లభిస్తాయి. చాలామంది ప్రాణులు తరిస్తారు.'' ఈ విధంగా అంతరిక్ష దేవతలు భూమిపై వుండే దేవతలనుంచి విని, నలుగురు మహారాజులకు కూడా యీ విధంగా చాటిచెప్పారు. ఆ నలుగురు మహారాజులూ త్రాయత్రింశులకు తెలియజేశారు. ఆ త్రాయత్రింశులు యాములకు చెప్పారు. యాములు తుషితులకూ, నిర్మాణరతులకూ తెలిపారు. నిర్మాణరతులు పరినిర్మితవశవర్తులకూ, వారు బ్రహ్మకాయిక దేవతలకూ ఈ విషయాన్ని చాటి చెప్పారు. అందరూ కూడా ''ఓ మార్షలారా! సమ్యక్సంబుద్ధిని పొంది అర్హతుడైన తథాగతుడు ధర్మచక్రాన్ని ప్రవర్తింప



జెయ్యడానికి వాగ్దాన మిచ్చాడు. అందువల్ల బహుజనులకు హితమూ, సుఖమూ, లోకంలో దయ, గొప్ప ప్రయోజనము, దేవ మనుష్యులకు హిత సుఖాలూ కలుగగలవు. ఓ మార్షలారా! అసుర శరీరాలు నశిస్తాయి. దివ్య శరీరాలు లభిస్తాయి. చాలా సత్త్వాలు తరిస్తాయి'' అని వెల్లడించారు.

ఓ భిక్షులారా, ఆ క్షణంలోనే, ఆ ముహూర్తంలోనే ఘోషం ప్రారంభించి బ్రహ్మకాయికులైన దేవతలున్న స్థలంవరకూ ఒక్క వాక్కుగా, ఒక్క నినాదంగా, ఒక్క నిర్ఘోషం వ్యాపించినది—''ఓ మార్షలారా! సమ్యక్సంబుద్ధిని పొంది, అర్హతుడైన తథాగతుడు ధర్మచక్రం ప్రవర్తింపజెయ్యడానికి వాగ్దానం చేశాడు'' అని.

ఓ భిక్షులారా, ఆ తర్వాత ధర్మరుచి, ధర్మకాముడు, ధర్మమతి, ధర్మచారి అనే పేర్లు గల నలుగురు బోధివృక్షదేవతలు తథాగతుని పాదాలపై పడి ఇలాగున అడిగారు - ''భగవానులు ఎక్కడ ధర్మచక్రమును ప్రవర్తింపజేస్తారు?'' అని. ఇలాగున అడుగగా తథాగతుడు ఆ దేవతలతో ఇలా పలికాడు :- ''వారణాసిలోని ఋషిపతన మృగదావంలో'' అని. అప్పుడు వారు ''ఓ భగవానుడా! వారణాసి మహానగరం పరిమితజనకాయం గలది. మృగవానం పరిమిత వృక్షచ్ఛాయ గలది. ఇది కాక ఇంకా యింకా పెద్ద పెద్ద నగరాలు సమృద్ధి, క్షేమం కలవీ, రమణీయాలూ, సుభిక్షాలూ ఎక్కువ జనసమూహంతో వ్యాపించి ఉన్నవీ ఉద్యానవన పర్వతాలతో అలంకరింపబడి వున్నవీ ఎన్నో ఉన్నవి. భగవానులు అట్టి పట్టణాల్లో ఒకదానిలో ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేయవలెనని ప్రార్థన'' అని అన్నారు.

తథాగతుడు ఇలా అన్నాడు: ''ఓ భద్రముఖులారా! అట్లు కాదు. ఏమంటే - అరవై సహస్రకోటి నయుతాల యజ్ఞాలను నేను అక్కడ చేసి వున్నాను. అరవై సహస్రకోటినయుతాల బుద్ధులను అక్కడే పూజించాను. వారణాసి పౌరులకును, ఋషులకును నివాసం. భూమిపైకి వచ్చే దేవతలు అక్కడికి రావడానికే ఇష్టపడతారు. అక్కడే ధర్మం సదా వ్యాపిస్తుంది. తొంభైయొక్క సహస్రకోటి సంఖ్య

బుదులు అక్కడ వుండినట్లు స్మరిస్తున్నాను. వారు ఈ ఋషిపతనంలో ధర్మచక్రాన్ని పరివర్తింపజేశారు. ఋషిపతనవనం శాంతము. ఉపశాంతము. ధ్యానమునకు అభిముఖము. నిత్యమూ మృగములచే సేవింపబడుతూ ఉంటుంది. అందువల్లనే ఋషినివాసమైన ఆ ఉత్తమవనంలోనే ధర్మచక్రాన్ని వర్తింపజేస్తాను."

ఇది లలితవిస్తరంలో అధ్యేషణా పరివర్తం అనే
ఇరవై అయిదవ అధ్యాయం.

# 26. ధర్మచక్ర ప్రవర్తన పరివర్తం

భిక్షువులారా, ఈ విధంగా తథాగతుడు కృతకృత్యుడై, విధ్యుక్త ధర్మాలన్నీ నిర్వర్తించి సర్వబంధనాలనూ తెంచుకొని, సర్వక్లేశాలూ అధిగమించి, సకల దోషాలూ, క్లేశాలూ తొలగిపోగా, మారుడనే శత్రువును జయించి, సకల బుద్ధ ధర్మనయనాలనూ ఆకళించుకొని, సర్వజ్ఞుడు, సర్వదర్శి, దశబలోపేతుడు అయి చతుర్విధ విశారదత్వం సంపాదించి; పద్ధెనిమిది అవేణిక బుద్ధధర్మాలతో పరిపూర్ణుడై, పంచచక్షువులు పొంది ఆవరణరహితమైన బుద్ధ చక్షువుతో సకల లోకాలను చూచి ఈ విధంగా తలపోసినాడు: "నేను ఎవరికి ఈ ధర్మాన్ని తొట్టతొలిసారిగా ఉపదేశించాలి? ఎవడైతే పరిశుద్ధుడు, సముచితాకారం గలవాడు, సన్మార్గంలో ప్రవర్తింపజేయదగినవాడు, చక్కగా బోధింపదగినవాడు, చక్కగా శోధింపదగినవాడు, రాగదోష మోహాలు తగ్గినవాడు, అపరోక్ష విజ్ఞానం గలవాడు, ధర్మం వినక చింతించేవాడు అయి ఉంటాడో, వానికి నేను మొట్టమొదటిసారిగా ఈ ధర్మం ఉపదేశిస్తాను. ఎవడైతే నేను ఉపదేశించిన ధర్మాన్ని తెలుసుకుంటాడో, తెలుసుకొన్న తర్వాత నన్ను ద్వేషించి హింసించడో అలాటివానికి సర్వప్రథమమైన ధర్మం ఉపదేశిస్తాను."

తర్వాత మరల అతనికి ఈ విధంగా తోచింది: "రాముని పుత్రుడైన రుద్రకుడు పరిశుద్ధుడు. సముచితాకారం కలవాడు, బాగా బోధింపదగినవాడు, పరిశుద్ధుడు కాగలవాడు, రాగ మోహాలు తగ్గినవాడు, అపరోక్ష విజ్ఞానం కలవాడు, ధర్మం వినక చింతించేవాడు, శ్రావకులకు సంజ్ఞానా సంజ్ఞాయతన సహవ్రతంకోసం ధర్మం ఉపదేశించడం లేదు. అతడు ఇప్పుడు ఎక్కడున్నాడు?"

వారం కిందటనే అతడు కాలధర్మం చెందినట్టు తథాగతునికి స్ఫురించింది. అప్పుడు దేవతలు తథాగతుని చరణాలపై పడి నమస్కరించి

“అవు అలాగే భగవన్! అది అలాగే. అది అలాగే సుగత! అది అలాగే. రామపుత్రుడైన రుద్రకుడు వారంకిందటనే కాలగతుడయాడు” అని విన్నవించారు. అప్పుడు తథాగతుడు “రామపుత్రుడైన రుద్రకుడు ఈ విధమైన, సుప్రణీతమైన (చక్కగా అమరిన) ధర్మం వినకుండానే కాలగతుడయాడు. అతనికి పాపం; మహా హాని ఏర్పడింది. తెలుసుకోదగిన ఈ ధర్మాన్ని అతడు విని వుంటే, నేను నా ప్రథమమైన ధర్మాన్ని అతనికి ఉపదేశించి వుంటే, అతడు నన్ను హింసించి ఉండడు. దుఃఖించి ఉండడు” అని అనుకున్నాడు.

తర్వాత మరల తథాగతునికి ఇలా తోచింది: “మరి ఇక ఎవడు శుద్ధమైనవాడు, శ్రద్ధగా సన్మార్గంలో నడువదగినవాడు, ముందు చెప్పినట్టు ధర్మోపదేశాన్ని ద్వేషించనివాడు ఉన్నాడు? ఓహో! అరాడుడనే కాలాపుడు (కలాపవ్యాకరణజ్ఞుడు) పరిశుద్ధుడు. నా ధర్మోపదేశాన్ని ద్వేషించడు. అతడు ఇప్పుడెక్కడ ఉన్నాడు?” అరాడుడు మరణించి మూడునాళ్ళయిందని అతనికి భాసించింది. శుద్ధావాసకాయిక దేవతలు కూడా ఈ విషయాన్ని తథాగతునికి తెలియజేశారు. “ఇది నిజమే భగవన్, ఇది నిజమే. అరాడుడనే కాలాపుడు కాలధర్మం చెంది మూడునాళ్ళయింది భగవన్” అని. అప్పుడు: “అయ్యో! అరాడ కాలాపునికి పెద్ద హాని ఏర్పడింది. ఈ సుప్రణీతమైన ధర్మం వినకనే కాలధర్మం చెందాడుగదా!” అని తథాగతుడు విచారించాడు.

మరల తథాగతుడు “అయితే, శుద్ధుడు, సమీచీనాకారుడు అయినవాడు ఎవడు నా ధర్మోపదేశానికి చింతించినవాడున్నాడు?” అని అనుకున్నాడు. అప్పుడు తథాగతునికి ఈ విధంగా తోచింది: “అవునవును. శుద్ధమైనవారు; మంచి ఆకారం గలవారు, సువిజ్ఞాపకులు, సుపరిశోధకులు, రాగద్వేష మోహాలు తగ్గినవారు, అపరోక్ష విజ్ఞానం గలవారు, ఈ ధర్మం విననందున హీనులయేవారు అయిన ఐదుగురు భద్రవర్గీయులున్నారు. నేను దుష్కరచర్య చేస్తున్నప్పుడు వారు నా వద్దకు వచ్చారు. నేను చేసే ధర్మోపదేశం వారు వింటారు. వారు నన్ను హింసించరు, ద్వేషించరు. అయితే, నేను ఆ ఐదుగురు భద్రవర్గీయులకే ధర్మం ఉపదేశిస్తాను.



“అయితే ఆ ఐదుగురు భద్రవర్గీయులు ఎక్కడ ఉన్నారు?” అని తథాగతుడు సమస్త లోకాలను బుద్ధచక్షుస్సుతో చూడసాగాడు. ఆ భద్రవర్గీయులు వారణాసిలో ఋషిపతనంలోని మృగదావనంలో విహరిస్తూ వుండడం చూచాడు. చూచినమీదట అతనికి ఈ అభిప్రాయం కలిగింది: “ఈ భద్రవర్గీయులకు మొట్టమొదటిసారిగా, తొట్టతొలి ధర్మాన్ని ఉపదేశం చేసే పక్షంలో, వారు పరిశుద్ధచరితం జ్ఞానపూరితమైన ధర్మం గలిగి, మోక్షమార్గాభిముఖులు, నిబంధాపనీతులు అయిన భిక్షువులు గనుక వారు సర్వప్రథమమైన ధర్మోపదేశం తెలుసుకుంటారు.”

భిక్షువులారా, తథాగతుడు ఈ విధంగా ఆలోచించి, బోధిమండం నుంచి లేచి మగధదేశం తిరిగి కాశీదేశ జనపదాలలో తిరుగసాగినాడు. ఆయన నడుస్తూంటే త్రిసాహస్ర మహాసాహస్రలోక ధాతువులు కంపించాయి. గయకు బోధిమండానికి మధ్యన తథాగతుడు వస్తూవుండడం దూరంనుంచే ఆజీవకు డొకడు చూచి; దగ్గరికి వచ్చి, ఆయన సన్నిధానంలో ఉండి, సంతోషపెట్టే వివిధ విషయాలు ముచ్చటించి, ఈ విధంగా విన్నవించాడు: “ఆయుష్మన్! గౌతమ! నీ ఇంద్రియాలన్నీ ఇప్పుడు ప్రసన్నమయాయి. నీవు పరిశుద్ధుడవైనావు. నీ దేహకాంతి పచ్చగా వెలిగిపోతున్నది. ఎలాగంటే, శరత్కాలం పాండురవర్ణంగాను, పీతవర్ణ విరాజమానంగాను ఉంటుందే, అలాగ నీ ముఖమండలం పర్యవదాతంగాను; నీ ఇంద్రియాలు పరిశుద్ధంగాను ఉన్నాయి. అప్పుడే పైనుంచి తొడిమనుంచి జారిపడిన తాటిపండు తొడిమ చుట్టుపట్ల ముచ్చికవద్ద పచ్చగా ఉన్నట్లు నీ ముఖంకూడా పచ్చగాను, పర్యవదాతంగాను ఉన్నది. సమర్థుడైన కర్మారపుత్రుడు (స్వర్ణకారుడు) మంటలనుంచి అప్పుడే పైకి తీసి పాండు కంబళంపై పెట్టిన బంగారు నిష్కం (నాణెం) ఎలాంటి రంగుతో మెరిసి మెరిసిపోతుందో, గౌతమా, నీ ముఖం కూడా అలాటి రంగుతో మెరిసిపోతున్నది. నీ ఇంద్రియాలన్నీ ప్రసన్నమయాయి. చర్మం పరిశుద్ధ వర్ణంతో ప్రకాశిస్తున్నది. ఆయుష్మన్! బ్రహ్మచర్యమనేది ఏ విషయంలో చెబుతారు? ఏ ఆచార్యునివద్ద నీవు బ్రహ్మచర్యం అనుష్ఠించావు?”

తథాగతుడు ఆజీవకుణ్ణి చూచి ఈ గాథ పలికాడు :

"ఆచార్యో నహి మే కశ్చిత్ సదృశో మే న విద్యతే,
ఏకోఽహ మస్మి సంబుద్ధః శీతీభూతో నిరాశ్రవః."

"నాకు ఆచార్యుడెవడూ లేడు. నాతో సాటివాడూ లేడు. నేనొక్కణ్ణే ప్రశాంతేంద్రియుణ్ణి, దుఃఖాలు లేనివాణ్ణి, సంబుద్ధుణ్ణి."

ఆజీవకు డన్నాడు : "అయితే గౌతముడా, నీవు అర్హంతుడవయినట్టుగా గ్రహించావా?" అని. తథాగతుడు ఇలా అన్నాడు :

"అహ మేవార్హం లోకే శాస్తా హ్యహ మనుత్తరః,
సదేవాసుర గంధర్వే నాస్తి మే ప్రతిపుంగలః."

"నేనే అర్హంతుణ్ణి, లోకంలో నేనే శాస్తను. నాకు మించి మరొకరు లేరు. ఈ దేవాసుర గంధర్వ లోకాలలో నాతో సమానుడైన పుంగలుడు మరొకడు లేడు." ఆజీవకుడు : "అయితే, గౌతమా నిన్ను నీవు జినుడివని గ్రహించావా?" అని అన్నాడు.

తథాగతుడు :

"జినార్హా మాదృశా జ్ఞేయాః యే ప్రాప్తా ఆశ్రవక్షయం,
జితా మే పాపకా ధర్మాః తేనోపగ జినోఽహ్యహం."

"దుఃఖక్షయమైన నాబోటివారే జినులు. నేను పాపధర్మాలను జయించాను. కనుక నేను జినుణ్ణి అయాను."

ఆజీవకుడు : "అయితే ఆయుష్మన్, ఇప్పుడు ఎక్కడికి వెళ్లుతావు?"

తథాగతు డన్నాడు :

"వారాణసీం గమిష్యామి గత్వా వై కాశీనాం పురీం,
అంధభూతస్య లోకస్య కర్తా స్మ్యసదృశాం ప్రభాం,



వారాణసీం గమిష్యామి గత్వా వై కాశినాం పురీం,
శబ్దహీనస్య లోకస్య తాడయిష్యేఽమృతదుందుభిం,
వారాణసీం గమిష్యామి గత్వానై కాశీనాం పురీం,
ధర్మచక్రం ప్రవర్తిష్యే లోకే ష్వప్రతివర్తితం."

"వారాణసీ విషయానికి వెళ్లి, కాశీపురి చేరి చీకటైపోయిన లోకానికి సాటిలేని వెలుగు కలిగిస్తాను. వారణాసికి వెళ్లుతాను. అక్కడ చేరి శబ్దహీనమైన లోకాన్ని అమృతదుందుభి మ్రోగించి మేల్కొల్పుతాను. వారణాసికి వెళ్లుతాను. వెళ్లి ఇదివరకు లోకాలలో ఎవరూ ప్రవర్తింపచేయని ధర్మచక్రం ప్రవర్తింపజేస్తాను."

"నీవు అలాగే చేస్తావు, గౌతమా!" అంటూ ఆజీవకుడు దక్షిణదిక్కుగా వెళ్ళాడు. తథాగతుడు ఉత్తరదిక్కుగా వెళ్లాడు :

గయలో నాగరాజయిన సుదర్శనుడు తథాగతుని భిక్షుతోను, వస్త్రాలతోను గౌరవించాడు. తథాగతుడు అక్కడినుంచి రోహితవస్తు అనే పట్టణానికి, అక్కడినుంచి ఉరుబిల్వాకల్పమనే పురానికి, అక్కడినుంచి అణాల నగరానికి, అక్కడినుంచి సారథిపురానికి వెళ్ళాడు. ఈ పట్టణాలలో గృహపతులు తథాగతునికి అన్నవస్త్రాలు కల్పించారు. తర్వాత అతడు గంగాతీరం చేరాడు.

అప్పుడు గంగానది నిండుగా ప్రవహిస్తున్నది. తథాగతుడు ఈ గట్టు దాటి ఆ గట్టుకు పోవడానికి ఒక నావికునివద్దకు వెళ్ళాడు. ఆ నావికుడు "గౌతముడా! పడవ పణ్యం ఇయ్యి" అని అడిగాడు. 'మార్ష! నావద్ద నది దాటే కేవు లేదు" అని అంటూ, గౌతముడు గగన మార్గంలో ఆ గట్టునుంచి ఈ గట్టు చేరాడు. అది నావికుడు చూచి, "ఇలాటివాడిని నేనెప్పుడూ నది దాటించలేదే" అనుకొని పశ్చాత్తప్తుడై, మూర్ఛపోయి, భూమిమీద పడి తర్వాత తేరుకొని, ఈ విషయాన్ని "శ్రమణస్వామి అయిన గౌతముడు తరపణ్యం ఇమ్మని అడిగితే, లేదంటూ ఆకాశమార్గాన ఈ గట్టునుంచి ఎదుటిగట్టు చేరాడు" అని

బింబిసార మహారాజుకు విన్నవించాడు. ఆ మాట విని రాజు అప్పటినుంచి సన్యాసు లందరికీ తరపణ్యం తీసివేయవలసిందిగా ఉత్తరువు చేశాడు.

తథాగతుడు ఈ విధంగా జనపదాలలో సంచరిస్తూ వారాణసీ మహానగరం చేరి, కాల్పం కప్పుకొని, పాత్రచీవరాలతో భిక్షకోసం నగరంలో ప్రవేశించాడు. భిక్ష ఎత్తి భోజనం ముగించుకొని ఆ భిక్షా పాత్రతోపాటు తిరిగి వచ్చి, భద్రవర్గీయులున్న ఋషిపతనమృగదావం వైపు బయలుదేరాడు. ఆ అయిదుగురు భద్రవర్గీయులు తథాగతుణ్ణి దూరంనుంచే చూచి, క్రియాబంధం చేశారు. (అతనికోసం ఏమీ చేయ గూడదని చేతులు ముడుచుకుని, అన్ని పనులూ మానుకున్నారు). "ఇదిగో ఆయుష్మంతుడైన గౌతమ శ్రమణుడు వస్తున్నాడు. శైథిలకుడు (వ్రత శిథిలుడు), బాహులికుడు, ప్రహాణవిభ్రష్టుడు అయి వస్తున్నాడు. ఇతడు దుష్కరచర్య జరిపి కూడా మనుష్య ధర్మాలకు మించిన ఆర్యజ్ఞాన దర్శన విశేషాన్ని సాక్షాత్కరించుకోలేకపోయాడు. ఇప్పుడేమో ఉదరానికి హాయి అయిన ఆహారం తీసుకుంటూ, సుఖల్లికాయోగం అనుసరించి విహరిస్తున్నాడు; భవ్యుడు కాడు. కనుక వ్రతభ్రష్టుడై శైథిలికుడు, బాహులికుడూ అయాడు. ఇతనికి ఎవరూ ఎదురువెళ్ళి స్వాగతం చెప్పవద్దు. పాత్రచీవరాలు గ్రహించకూడదు. ఆశనంగాని, పానీయంగాని ఇవ్వరాదు. పాదప్రతిష్ఠానం తగదు. వట్టి ఆసనాలు ఉంచి 'ఆయుష్మన్, గౌతమ, ఈ ఆసనాలు రిక్తంగా ఉన్నాయి. ఇష్టం ఉంటే కూర్చో అని మాత్రం అనాలి'' అని వారు నిశ్చయించుకొన్నారు. జ్ఞానకౌండిన్యుడైన బుద్ధుడు ఈ విషయాన్ని తన మనస్సులోకే రానివ్వలేదు. ఒక్క మాటా అనలేదు. భిక్షువులారా, తథాగతుడు భద్రవర్గీయులవద్దకు వచ్చినకొద్దీ వారు తమ ఆసనాలలో ఉండలేకపోయారు. లేవాలని బుద్ధిపుట్టింది. పంజరంలో ఉన్న పక్షి, పంజరంకింద నిప్పు పెడితే ఎలా తొందరగా ఎగిరిపోవడానికి తపనపడుతుందో, తథాగతుడు సమీపించినకొద్దీ భద్రవర్గీయుల స్థితీ అలాగే అయింది. ఎందుకంటే, సృష్టిలోని ప్రాణులలో తథాగతుని చూచి, ఆసనంనుంచి లేవనివారు ఎవరుంటారు? తథాగతుడు



తమ సమీపానికి వచ్చినకొద్దీ భద్రవర్గీయులు తథాగతుని సిరిని, తేజస్సును చూచి ఉండలేకపోయారు. వణుకుతూ ఆసనాలనుంచి లేచి, తమ నిశ్చయాన్ని మరచిపోయి, ఒకడు ఎదురువెళ్ళాడు. మరొకడు పాత్రచీవరాలు అందుకున్నాడు. మరొకడు ఆసనాన్ని వంచాడు. మరొకడు పాదపీఠం వేశాడు. ఇంకొకడు పాదప్రక్షాళనానికి జలం తీసుకువచ్చాడు. "ఆయుష్మన్, గౌతమ, నీకు స్వాగతం. ఇదిగో ఈ ఆసనం! కూర్చో'' అని ఒకడు అన్నాడు. అతడు వంచిన ఆసనంపై తథాగతుడు కూర్చున్నాడు. ఒకవైపు భద్రవర్గీయులు తథాగతునితో వినోదకథలు చెబుతూ, కూర్చున్నారు.

తర్వాత అతనిని "ఆయుష్మన్, గౌతమ, నీ ఇంద్రియాలన్నీ ప్రసన్నాలయాయి. నీ దేహకాంతి పరిశుద్ధమై పచ్చని కాంతిని విరజిమ్ముతున్నది. మనుష్య ధర్మంకంటే గొప్పదైన ఆర్యజ్ఞాన దర్శనవిశేషాన్ని సాక్షాత్కరించుకున్నావా?'' అని ప్రశ్నించారు.

వారు ఈ విధంగా ప్రశ్నించగా గౌతముడు ఇలా అన్నాడు: "భిక్షువులారా, ఇకమీద మీరు నన్ను ఆయుష్మంతుడనే మాటతో వ్యవహరించకండి. ఇకమీద మీరు ధనంకోసం, హితంకోసం, సుఖంకోసం, దీర్ఘ రాత్రులు శ్రమపడనక్కరలేదు. నేను అమృతాన్ని సాక్షాత్కరించుకున్నాను. నా మార్గం అమృతగామి. నేను బుద్ధుణ్ణి. సర్వజ్ఞుణ్ణి, సర్వదర్శిని, శీతభూతుణ్ణి, దుంఖరహితుణ్ణి అయ్యాను. అన్ని ధర్మాలు నా వశమయ్యాయి. నేను ధర్మం ఉపదేశిస్తాను. మీరు త్వరగా రండి, వినండి, పొందండి, చెవి ఒగ్గండి. నేను ధర్మం చెబుతున్నాను. అనుశాసిస్తున్నాను. నేను బాగా తర్కించి, అనుసరించి తెలుసుకున్నాను. మీరు కూడా దుఃఖాలకు చేతో విముక్తిని, ప్రజ్ఞావిముక్తిని చూచి, ధర్మాన్ని సాక్షాత్కరించుకొని, తెలుసుకోండి. మన జన్మ క్షీణించిందని, బ్రహ్మచర్యం ఆచరించామని, చేయవలసింది చేశామని, ఈ జన్మకంటే మరొక జన్మ ఎరుగమని తెలుసుకోండి. ఇప్పుడు మీ మనస్సుల్లో - 'ఈ ఆయుష్మంతుడయిన గౌతమశ్రమణుడు, వ్రతశిథిలుడు, బాహులికుడు, త్యాగమార్గ విభ్రష్టుడు అయి వస్తున్నాడు. ఇతడు దుష్కరచర్య జరిపి కూడా మనుష్యధర్మాలకు

మించిన ఆర్య జ్ఞానదర్శన విశేషాన్ని సాక్షాత్కరించుకోలేకపోయాడు. ఇప్పుడేమో ఉదరానికి హాయి కలిగించే ఆహారం తీసుకుంటూ, సుఖల్లికా యోగం అనుసరించి విహరిస్తున్నాడు. కనుక భవ్యుడు కాడు. ఇతనికి ఎవరూ ఎదురువెళ్ళి స్వాగతం చెప్పవద్దు. పాత్రచీవరాలు అందుకోవద్దు. పాదప్రతిష్ఠానం వద్దు. ఒట్టి ఆసనాలు ఉంచి, ‘ఆయుష్మన్, గౌతము, ఈ ఆసనాలు ఖాళీగా ఉన్నాయి. ఇష్టం ఉంటే కూర్చో అని మాత్రం అందాము’ అని తలంపు కలిగిందిగదా’’ అంటూ ‘‘రండి భిక్షువులూ!’’ అన్నాడు.

తథాగతుడు ఈ విధంగా అనగానే, పంచ భద్రవర్గీయులలో ఉన్న తీర్థకుల చిహ్నాలు, లక్షణాలు మటుమాయమయాయి. చీవరాలు భిక్షాపాత్రం దేహం అలంకరించాయి. క్లేశాలు వాటంతట అవే తెగి పడిపోయాయి. శతవృద్ధు అయిన భిక్షువు ఈర్ష్యాపథం మానధ్యానానుష్ఠానం, ఎలాంటిదో, వారికి అలాటి ప్రవ్రజ్య, భిక్షుభావం ఏర్పడ్డాయి.

తర్వాత ఆ భిక్షువులయిన భద్రవర్గీయులు తథాగతున పాదాలపై పడి, తమ దోషం విన్నవించుకున్నారు. తథాగతునికి తమపై శాస్తృ సంజ్ఞను, ప్రేమను, అనుగ్రహాన్ని, గౌరవాన్ని కలిగించుకొనసాగినారు. గౌరవంతో తథాగతునికి చిత్రవిచిత్రమైన పుష్కరిణిలో స్నానానికి ఏర్పాట్లు చేశారు. స్నానంచేసి గట్టెక్కిన తథాగతునికి ఈ విధంగా ఆలోచన కలిగింది: ‘‘అర్హంతులు సమ్యక్సంబుద్ధులు అయిన పూర్వ తథాగతులు ఎక్కడ కూర్చుని ధర్మచక్రం ప్రవర్తింపజేశారు?’’ అని. భిక్షువులారా, ఏ ప్రాంతంలోనయితే పూర్వ తథాగతులు ధర్మచక్రం ప్రవర్తింపచేశారో. ఆ ప్రదేశంలో సప్తరత్నఖచితాలైన వేయి ఆసనాలు పుట్టుకుని వచ్చాయి.

అప్పుడు తథాగతుడు పూర్వ తథాగతులపై గౌరవంతో మూడు ఆసనాలకు ప్రదక్షిణ నమస్కారాలు చేసి, సింహంలాగ నిర్భయంగా నాల్గవ ఆసనంలో పర్యంకబంధంతో ఆసీనుడయ్యాడు. అయిదుగురు భద్రవర్గీయులూ తథాగతుని పాదాలను శిరస్సుతో నమస్కరించి, అతని ఎదుట కూర్చున్నారు.



ఆ సమయంలో తథాగతుని దేహంనుంచి దివ్యప్రభ బయలువెడలి త్రిసాహస్ర మహాసాహస్ర లోకాలను అవభాసింపజేసింది. ఆ అవభాసంతో (కాంతితో) లోకాంతరికాలైన పాపాలు, సూక్ష్మపాపాలు, అంధకారాలూ పటాపంచలైపోయాయి. అలాంటి గొప్ప మాహాత్మ్యం కలవారు, మహానుభావులు, మహేశులు అయిన చంద్రసూర్యులు ఆ కాంతి నిండి, రంగు మారి ప్రకాశించడం, వెలుగుచూపడం మానివేశారు. ఎక్కడ ఉన్న ప్రాణులు అక్కడ తమ తమ అంగాలు తమకు కనిపించగా ఆశ్చర్యపడ్డారు. ఆ సమయంలో లోకంలో గొప్ప కాంతి బయలుదేరింది. ఆ కాంతితో ప్రాణులన్నీ స్పష్టంగా పరస్పరం తెలుసుకొని ‘‘అరెరే! ఇక్కడ మరికొన్ని ఇతర ప్రాణులూ ఉన్నాయే! ఇతర ప్రాణులు ఉన్నాయే!’’ అని ఆశ్చర్యంతో అనుకోసాగాయి. ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులలో ఆరు వికారాలు, పదెనిమిది నిమిత్తాలు పుట్టాయి. ఈ త్రిసాహస్ర లోకధాతువు కంపించింది, ప్రకంపించింది, సంప్రకంపించింది, వేధపొందింది, (ఎగిరిపడింది) ప్రవేధపొందింది, సంప్రవేధ పొందింది. చలించింది, ప్రచలించింది, సంప్రచలించింది. క్షోభించింది, ప్రక్షోభించింది, సంప్రక్షోభించింది. రణించింది, ప్రరణించింది, సంప్రరణించింది. గర్జించింది, ప్రగర్జించింది, సంప్రగర్జించింది. చివర వంగిపోయింది. మధ్యలో పైకి లేచింది. మధ్యను వంగి చివరలో పైకి లేచింది. పూర్వదిక్కున వంగి పశ్చిమదిక్కున పైకి లేచింది. పశ్చిమదిక్కున వంగి పూర్వదిక్కున పైకి లేచింది. దక్షిణదిక్కున వంగి ఉత్తరదిక్కున పైకి లేచింది. ఉత్తరదిక్కున వంగి, దక్షిణదిక్కున పైకి లేచింది. అప్పుడు హర్షణీయాలు, తోషణీయాలు, ప్రేమించదగినవి, ఉల్లాసం కలిగించేవి, చూడదగినవి, ఆహ్లాదం కలిగించేవి, దర్శించదగినవి, అప్రతివర్ణనీయాలు, అసేచనీయాలు, ప్రతికూలాలు, త్రాసకరాలు కానివి అయిన శబ్దాలు వినబడ్డాయి. ఆ సమయంలో ఏ ప్రాణికిగాని ద్వేషంగాని, భయంకాని, త్రాసంకాని, స్తంభితత్వంగాని కలుగలేదు. ఆ సమయంలో సూర్యచంద్రుల కాంతి గాని, శక్రబ్రహ్మలోకపాలుల కాంతి కాని తెలియలేదు. నరకలోకంలోను, యమలోకంలోను ఉన్న ప్రాణులకు తిర్యగ్యోనిగత ప్రాణులకు దుఃఖం పోయింది. అన్ని ప్రాణులకు సుఖం కలిగింది. ఏ

ప్రాణినీ రాగం బాధించలేదు. ద్వేషంకాని, మోహంకాని, ఈర్ష్యకాని, మాత్సర్యంకాని, మానంకాని, మ్రక్షంకాని, మదంకాని, క్రోధంకాని, ద్రోహచింతనంకాని, పరిదాహంకాని కలుగలేదు. సకల ప్రాణులు మైత్రీచిత్తం కలవి, హితచిత్తం కలవి, పరస్పరం మాతాపితృసంజ్ఞ కలవి అయ్యాయి. అప్పుడు, ఆ ప్రభావ్యూహంనుంచి కొన్ని గాథలు బయలువెడలాయి. వాటి భావమిది:

"ఎవడైతే తుషితాలయంనుంచి జారి తల్లి గర్భంలో వసించి లుంబినీవనంలో జన్మించాడో, ఇంద్రునిచేత గ్రహించబడ్డాడో, ఎవడైతే జన్మించగానే సింహంవలె ఏడు అడుగులు వేశాడో, ఏ శ్రేష్ఠుడైతే ఈ జగత్తులో బ్రహ్మస్వరంలో వాక్కును ప్రసారింపజేశాడో, ఎవడైతే నాలుగు ద్వీపాలు వదలి సర్వప్రాణిహితంకోసం సన్యాసం స్వీకరించాడో, దుష్కరచర్య చేసి, బోధిమండం చేరాడో, మారుణ్ణి సైన్యసహితంగా హతమార్చి, లోకహితంకోసం బోధిని పొందాడో, అలాంటివాడు వారాణసిని చేరి ధర్మచక్రం ప్రవర్తింపజేస్తాడు. బ్రహ్మాది సురులచే స్తుతించబడినవాడై సాటిలేని చక్రం ప్రవర్తింపజేస్తాడు. ఈ ముని, లోకంలో కారుణ్యాం ప్రవర్తింపజేస్తాడు. ఇతడు దృఢప్రతిజ్ఞతో వారాణసిలో మృగదావం చేరి అనుత్తరమైన, అద్భుతమైన ధర్మచక్రం ప్రవర్తింపజేస్తాడు. కల్పకోటి శతాలతో జినుడు సంపాదించిన ధర్మం వినదలచినవాగు త్వరగా రండి. బుద్ధుడు స్వోపజ్ఞంగా ఆర్జించిన ఈ శ్రద్ధ (ధర్మం) మానవులవ దుర్లభమూ, దురాపమూ అయినది. అష్టదుఃఖ వివర్జితమైనది. శ్రేష్ఠమయినది. ఇప్పుడు బుద్ధుడు అనుగ్రహించడంవల్ల ఈ క్షణము (సుఖం) కలిగింది. ఈ శ్రేష్ఠమైన ధర్మం వినే అవకాశం కలిగింది. మీ దోషాలన్నిటిని వదలుకోండి. బుద్ధుని ఈ కాంతి భౌమదేవగణాలు మొదలు బ్రహ్మ పర్యంతము అందరూ ప్రోత్సహిస్తున్నది. ఈ నాయకుడు అమృతచక్రం ప్రవర్తింప జేయనున్నాడు గనుక త్వరగా అందరూ రండి."

ఈ దేవఘోషతో ప్రబోధితులై దేవతలందరూ తమ తమ వైభవాడంబరాలు మానివచ్చి, బుద్ధుని పక్కను నిలబడ్డారు.



ఈ విధంగా భౌమదేవతలు ఋషిపతనంలో మృగదావనంలో తథాగతుని ధర్మచక్ర ప్రవర్తనార్థం మహామండలంగా ఏర్పడ్డారు. ఈ మండలం చిత్రవిచిత్రంగానూ, దర్శనీయంగానూ, విపులమూ, విస్తీర్ణమూ, సప్తయోజన శత వ్యాయామముగాను అయింది. ఆకాశవీథిలో దేవతలు ఛత్రధ్వజ పతాకలు, చాందినీలు పట్టుకుని నిలబడ్డారు. కామావచరులు, రూపావచరులు అయిన దేవపుత్రులు తథాగతునికోసం ఎనభైనాలుగు శత సహస్ర సింహాసనాలు వంచి "ఇక్కడ కూర్చుని, ధర్మచక్రప్రవర్తనం మాకు అనుగ్రహించండి, భగవన్" అని విన్నవించుకున్నారు.

అప్పుడు దశదిక్కులనుంచి పెక్కుకోట్ల బోధిసత్త్వులు పూర్వప్రతిజ్ఞప్రకారం వచ్చి తథాగతుని పాదాలపై పడి, ధర్మచక్ర ప్రవర్తనంకోసం ప్రార్థించారు. ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులో ఉన్న శక్రుడు, బ్రహ్మ, లోకపాలురు, తక్కిన మహేశాఖ్య దేవపుత్రులు, తథాగతుని పాదాలపై శిరస్సు మోపి నమస్కరించి ధర్మచక్రం ప్రవర్తింపజేయండని ప్రార్థించారు. "భగవానుడు బహుజన సుఖంకోసం, లోకానుకంపకోసం, మహాప్రజా సమూహానికి ప్రయోజనంకోసం, వారి హితంకోసం, దేవతల, మానవుల సుఖంకోసం, ధర్మచక్రం ప్రవర్తింపజేయునీ! సుగతుడు ధర్మచక్రం ప్రవర్తింపచేయునీ!" అని కోరారు. "భగవన్! ధర్మయజ్ఞం ఆచరించు. మహా ధర్మవర్షం ప్రవర్తింపజేయి. మహా మహా ధర్మధ్వజాన్ని పైకి ఎత్తు. మహా ధర్మశంఖాన్ని పూరించు. మహా ధర్మ దుందుభిని మోగించు" అని కోరారు. ఇక్కడ కొన్ని ప్రాచీన శ్లోకాలున్నాయి. వాటి తాత్పర్యమిది:

త్రిసాహస్రలోకాల బ్రహ్మ, సురేశ్వరుడు లోకపాలకులు క్రమంగా, ఒకర తర్వాత ఒకరు వచ్చి, జినుని సన్నిధిలో నమస్కరించి, "ఓ మహామునీ, నీవు పూర్వం వాఙ్మాత్రంగా చేసిన ప్రతిజ్ఞను స్మరించు. "నేను జ్యేష్ఠుణ్ణి, విశిష్ఠుణి. ప్రజల దుఃఖాలను పోగొడుతాను", అని నీవు ముందు ప్రతిజ్ఞ చేశావు. ఓ మునీ, నీవు ద్రుమరాజం కింద ఆసీనుడవై ససైన్యుడైన మారుణ్ణి జయించావు! శ్రేష్ఠమైన బోధిని, కల్పశతాల సుశాంతిని సంపాదించావు. క్లేశవృక్షాలను కూల్చివేశావు

నుంచి నీవు తలచినది నేడు పూర్తయినది. నాయకరహితమైన జనాన్ని చూచి, నాయకరహితుడా, ధర్మచక్రం ప్రవర్తింపజేయి.''

దేవతలు ఈ విధంగా స్తోత్రంచేసి కోరినతర్వాత సుగతుని దేహ ప్రభలతో శతసహస్ర భూములు వెలిగిపోయాయి. శతసహస్ర బుద్ధులు తమ మాహాత్మ్యబలంతో సుగతుని సమీపించి, పెక్కు పూజలు చేసి, ఆతనిని స్తోత్రంచేశారు. ఈ విధంగా ఆ కారుణికుణ్ణి ప్రార్థించారు.

''కరుణాఘన, విద్యుత్ప్రజ్ఞ, విపశ్వీ, వాయుసమానుడా, సర్వ జగత్తూ నిన్ను ఆహ్వానిస్తున్నది. ఈ ఆహ్వానం సహస్రానేక కల్పాలనుంచి సాగుతున్నది. నరసింహా, ధర్మగర్జన చేయి. అష్టాంగమార్గమనే జలంగల జలధరుడా, ధర్మం వర్షించి జగత్తు దప్పిని పోగొట్టు. ఇంద్రియ బలధ్యాన విమోక్షాలనే సస్య ధనం వర్ధిల్లజేయి. పెక్కు కల్పసహస్రాలు నీవు శూన్యతత్త్వస్థితుడవై శిక్షణ పొంది, ప్రజల బలసత్త్వాలు గుర్తించి ధర్మమనే ఔషధం తీసుకువచ్చావు. ఈ జనత పెక్కు వ్యాధులతో, క్లేశ గణాలతో ఉపద్రవం పొందుతున్నది. ఓ, జనవైద్యుడా, వారిని ఆ క్లేశాలనుంచి విడిపించు. ధర్మచక్రం ప్రవర్తింపజేయి. నీవు షట్ పారమితమైన ధనకోశాన్ని పెక్కు రాత్రులు కష్టపడి పెంపొందింపజేసుకున్నావు. ఆ సుసంచితమైన ధనం సాటిలేనిది; తరగనిది ఈ ప్రజలేమో అనాథులు, దరిద్రులు, దుష్టులు సత్పథనాలతో సంచరించే ఓ వినాయకుడా, ధర్మచక్రం ప్రవర్తింపజేయి. ''నీవు ధనధాన్యాలు, హిరణ్యసువర్ణాలు, వస్త్రభూషణాలు, వరపుష్పవిలేపన ధూపగంధ చూర్ణాలు, గొప్ప భవనాలు, అంతఃపురం, రాజ్యం, ప్రియురాలిని, ఆత్మజుణ్ణి- బోధిని పొందడంకోసం సంతోషంతో పరిత్యజించావు. బుద్ధుడవయావు. ధర్మచక్రం ప్రవర్తింపజేయి. నీవు నీ శీలాన్ని అఖండంగాను, అకల్మషంగాను కల్పకోటాలనుంచి రక్షించుకుంటున్నావు. నీ కాంతిగుణం ప్రశంసనీయంగాను, అలీనంగాను ఉండినది. శ్రేష్ఠమైన ధ్యానం తెలుసుకున్నవాడా! విపశ్వీ, ప్రజ్ఞ, ఉపేక్షగల మునే, పరిపూర్ణమైన మనోరథం గలవాడా, జ్వరరహితుడా, చక్రశ్రేష్ఠాన్ని - ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేయి.''



అప్పుడు సహచిత్తోత్పాద ధర్మచక్ర ప్రవర్తి అనే బోధిసత్త్వుడు, మహాసత్త్వం కలవాడు, సర్వరత్నాలు చెక్కినది, సర్వ రత్నాలతో శోభితమైనది, నానారత్నాలంకార వ్యూహ విభూషితమైనది, వేయి ఆకులు గలది, సహస్రరశ్మి గలది, మహానాభి (మధ్యకన్ను), మహానేమి (అంచు) గలది, పుష్పమాలాలంకృతమైనది, బంగారు జాలరులు వ్రేలాడుతున్నది, చిరుగంటలు కట్టినదీ, గంధంతో చేతులు ముంచి చేతి గుర్తులు పడేట్టు అందినది (సుగంధహస్త), పూర్ణకుంభయుతమయినది, నందికావర్తంతోను, స్వస్తికంతోను అలంకృతమైనది, నానావర్ణాలు గల వస్త్రాలతో శోభితమైనది, దివ్యపుష్పాలతోను గంధాలతోను గమగమలాడేది, సుందరమైనది, తథాగతుడు ధర్మచక్ర ప్రవర్తనం కోసం పూర్వం ప్రతిజ్ఞ చేసిన ప్రకారం రూపొందినది, సర్వబుద్ధాధిష్ఠానావిలోపితము, అర్హంతులయిన పూర్వబుద్ధులు ప్రవర్తింపజేసినది అయిన ధర్మచక్రాన్ని తథాగతుని ముందు వంచినాడు. వంచి, అంజలి ఘటించి, తథాగతుని కొన్ని గాథలతో ఈ విధంగా స్తోత్రం చేశాడు. ఆ గాథల భావమిది :

''ఓ నరసింహసింహుడా, నీవు శుద్ధసత్త్వుడైన బుద్ధుడవవుతావని దీపంకర బుద్ధుడు చెప్పినది నేటికి నిజమయినది. నీవు అతని భవిష్యవాణికి అనుగుణంగానే, సంబోధిని పొంది, ధర్మం ప్రవర్తింపజేస్తావని ఇదివరకే ప్రతిజ్ఞ చేశావు. ఇక్కడికి వచ్చి చేరిన మహానుభావులను లెక్కపెట్టడం సాధ్యం కాదు. ఓ శాక్యకులనందన, వారందరూ నీ చరణాలవద్ద అంజలి ఘటించి వంగి నిలబడ్డారు. ధర్మచక్రం ప్రవర్తింపజేయి. బోధిమండంలో దేవతలు కల్పించిన వ్యూహాలు, జినాత్మజులు కల్పించిన వ్యూహాలు, ధర్మచక్రానికి అలంకార ప్రాయంగా ఉన్నాయి. వాటిని మేము వర్ణించి చెప్పలేము. త్రిసాహస్రదేవలోకం, గగనం దేవసంఘాలతో కిటకిటలాడుతున్నది. వారినుంచి శ్రమ అనే మాటే వినబడడం లేదు. అందరూ ప్రసన్నచిత్తులై జినుడవైన నిన్ను చూస్తున్నారు.''

తర్వాత తథాగతుడు రాత్రి ప్రథమ యామంలో మౌనంగా ఉన్నాడు. రాత్రి మధ్యమయామంలో మనస్సుకు ఉల్లాసకరమైన సంభా

షణాలు చేశాడు. రాత్రి చివరి యామంలో ఆ భద్రవర్గీయులను సిలిచి ఈ విధంగా అన్నాడు:

“భిక్షువులారా, ప్రవ్రజితుడు అంతంలో అనుసరించదగనివి రెండు మార్గాలున్నాయి: ఒకటేమో కోరికల విషయంలో కామసుఖల్లికాయోగం. అది హీనమైనది, నిందితమైనది, పార్థగ్జనికము, ఆర్యమైనది కాదు, అనర్థాలు కలిగించేది. ఉత్తరకాలంలోనూ బ్రహ్మచర్యానికిగాని, నిర్వేదానికిగాని, విరాగానికిగాని, నిరోధానికిగాని, అభిజ్ఞకుగాని, సంబోధికిగాని, నిర్వాణానికిగాని ఉపయోగపడదు. మధ్యమం కాని రెండవ మార్గం స్వదేహక్లేశానుయోగం. ఇది దుఃఖకరమైనది, అనర్థాలు కలిగించేది. ఉత్తరకాలంలో దుఃఖం కలిగించేది. ఈ అంతమార్గాలు రెండూ వదిలి, మధ్యమ మార్గంలో తథాగతుడు ధర్మం ఉపదేశిస్తాడు. సమ్యక్ దృష్టి, సమ్యక్సంకల్పం, సమ్యగ్వాక్యం, సమ్యక్కర్మ, సమ్యగాజీవం, సమ్యగ్వ్యాయామం, సమ్యక్ స్మృతి, సమ్యక్సమాధి అనేది అష్టాంగమార్గం. ఆర్యసత్యాలు నాల్గు, అవి యేవంటే – దుఃఖం, దుఃఖసముదయం, దుఃఖనిరోధం, దుఃఖనిరోధగామిని అయిన ప్రతిపత్ (జ్ఞానం). మరి దుఃఖమనేది ఎలాటిది? జాతి (జన్మ) అనేది దుఃఖం, జర దుఃఖం, వ్యాధి దుఃఖం, మరణం దుఃఖం, అప్రియసంప్రయోగం దుఃఖం, ప్రియవిప్రయోగం దుఃఖం; దేనినైనా కోరితే వెదుకుతూ, పొందకపోతే అదీ దుఃఖమే. సంగ్రహంగా, పంచ ఉపాదానస్కంధాలు దుఃఖం. దుఃఖసముదయం ఎలాంటిది? పునర్జన్మకు కారణమైనది, సుఖరాగ సహితమైనది. అక్కడక్కడ సంతోషం కలిగించేది అయిన ఈ తృష్ణే దుఃఖసముదయం. దుఃఖనిరోధం ఏలాటిది? ఈ తృష్ణను నిరోధించి విరాగం పొందడమే దుఃఖనిరోధం. దుఃఖనిరోధగామిని అయిన ప్రతిపత్ అనేది ఏలాటిది? ఇదే ఆర్యాష్టాంగమార్గం. అది ఏదంటే? సమ్యగ్దృష్టి మొదలు సమ్యక్సమాధివరకు లోగడ చెప్పినది. దుఃఖనిరోధగామిని అయిన ప్రతిపత్తును ఆర్యసత్యమంటారు. ఇవి నాలుగు ఆర్యసత్యాలు: ఇది దుఃఖమని, పూర్వం వినని ధర్మాలనుంచి, ప్రకృతి సహజంగా; మనసికారంవల్ల, బహులీకారంవల్ల, నాకు జ్ఞానం కలిగింది. దృష్టి కలిగింది, విద్య ఏర్పడింది; భూరి కలిగింది, మేధ



ఏర్పడింది, ప్రజ్ఞ ఏర్పడింది, వెలుగు కలిగింది. ఇది దుఃఖసముదయమని పూర్వం వినని ధర్మాలనుంచి, ప్రకృతిసహజంగా, మనసికారంవల్ల, బహులీకారంవల్ల నాకు జ్ఞానం కలిగింది. దృష్టి కలిగింది. విద్య ఏర్పడింది. భూరి కలిగింది. మేధ ఏర్పడింది. ప్రజ్ఞ ఏర్పడింది. వెలుగు కలిగింది. ఇది దుఃఖనిరోధమని పూర్వం వినని ధర్మాలనుంచి ప్రకృతి సహజంగా, మనసికారంవల్ల; బహులీకారంవల్ల నాకు జ్ఞానం కలిగింది. దృష్టి కలిగింది. విద్య ఏర్పడింది. భూరి కలిగింది. మేధ ఏర్పడింది. ప్రజ్ఞ ఏర్పడింది. వెలుగు కలిగింది. పూర్వం వినని ధర్మాలనుంచి, ప్రకృతిసహజంగా, మనసికారంవల్ల, బహులీకారంవల్ల నాకు జ్ఞానం కలిగింది. దృష్టి కలిగింది. విద్య ఏర్పడింది. భూరి కలిగింది. మేధ ఏర్పడింది. ప్రజ్ఞ ఏర్పడింది. పేయాలం వరకు ఈ దుఃఖాన్ని తెలుసుకుందామని దుఃఖసముదయాన్ని వదలిపెట్టాలని, దుఃఖనిరోధాన్ని సాక్షాత్కరించుకోవాలని, దుఃఖనిరోధగామిని అయిన ప్రతిపత్తును భావన చేయాలని నాకు పూర్వం వినని ధర్మాలనుంచి ప్రకృతి సహజంగా, మనసికారంవల్ల, బహులీకారంవల్ల జ్ఞానం కలిగింది. దృష్టి కలిగింది. విద్య ఏర్పడింది. భూరి ఏర్పడింది. మేధ ఏర్పడింది. ప్రజ్ఞ ఏర్పడింది. పేయాలంవరకు ఆలోకం కలిగింది. ఈ దుఃఖం తెలుసుకున్నానని, ఈ దుఃఖసముదయాన్ని వదలుకున్నానని, ఈ దుఃఖనిరోధాన్ని సాక్షాత్కరించుకున్నానని, దుఃఖనిరోధగామిని అయిన జ్ఞానాన్ని భావించానని నాకు పూర్వం వినని ధర్మాలనుంచి ప్రకృతిసహజంగా, మానసికరంవల్ల, బహులీకారంవల్ల, జ్ఞానం కలిగింది. దృష్టి కలిగింది. విద్య ఏర్పడింది. భూరి ఏర్పడింది. మేధ కలిగింది. ప్రజ్ఞ కలిగింది. పేయాలంవరకు వెలుగు కలిగింది.

“భిక్షువులారా! నేను ఈ చతురార్యసత్యాలలో మనస్సు పూర్తిగా లగ్నంచేసి, త్రిపరివర్తమూ, ద్వాదశాకారమూ అయిన జ్ఞానాన్ని దర్శించుకొన్నప్పటికి అనుత్తర సమ్యక్సంబోధిని తెలుసుకోలేదని గ్రహించాను. నాకు జ్ఞానదర్శనం కలుగలేదు. చతురార్యసత్యాలలో అగ్నిసమానుడనైన నాకు త్రిపరివర్తమూ, ద్వాదశాకారమూ అయిన జ్ఞానదర్శనం కలిగిన తర్వాత, అక్షోభ్యమైన చేతోవిముక్తిని, ప్రజ్ఞావిముక్తిని

సాక్షాత్కరింపజేసుకున్నాను. అప్పుడు నేను అనుత్తర సమ్యక్సంబోధిని సాక్షాత్కరింపజేసుకొన్నానని గ్రహించాను. నాకు జ్ఞానదర్శనమైంది. నా జాతి (జన్మ) క్షయించింది. బ్రహ్మచర్యం ఆచరించాను. చేయదగిన కర్మ అంతా చేశాను. ఇతర కారణాలవల్ల జన్మ కలుగదని తెలుసుకొన్నాను.''

ఇక్కడ కొన్ని ప్రాచీన శ్లోకాలున్నాయి. వాటి తాత్పర్యమిది:- వాక్కులో బ్రహ్మరుతమూ, కిన్నరగర్జితమూ ఉన్నవాడు, సహస్రనయుత పుణ్యాంశాలతో ఉద్భవించినవాడూ, బహుకల్పకోటులకాలం సదా సత్యప్రవర్తన కలవాడూ, స్వయంభువు అయిన శాక్యముని కౌండిన్యునికి ఈ విధంగా ఆలపించాడు: (ఉపదేశించాడు) :-

''చక్షువు అనిత్యమైనది; అధ్రువమయినది. అలాగే శ్రోత్రం, ఘ్రాణం, జిహ్వ, కాయం, మనసు, అనిత్యాలు. ఇవన్నీ దుఃఖం కలిగించేవి. అనాత్మలు, శూన్యములు, జడస్వభావం గలవి, తృణకుడ్యాలవలె నిరీహాలు. వీటిలో ఆత్మ అనేది లేదు, నరుడు లేడు, జీవం లేదు. ఈ సర్వధర్మాలూ హేతుప్రతీతితో సంభవించినవి. ఇవి అత్యంత దృష్టి లేనివి, గగనప్రకాశమైనవి. వీటికి కారకుడు లేడు, వేదకుడు లేడు. శుభాశుభ కర్మలను చూడడు. స్కంధాలవల్ల దుఃఖాలు ఈ విధంగా కలుగుతూ వుంటాయి. నీరు త్రాగినకొద్దీ దప్పి హెచ్చినట్లు ఇవి పెరుగుతూనే ఉంటాయి. సమధర్మ మార్గానికి వశమై అత్యంత తీక్ష్ణధర్మతతో నిరోధించబడుతాయి. ''అయోనిసమైన సంకల్పకల్పంతో అవిద్య ఏర్పడుతుంది. ఇది సంస్కారహేతువవుతుంది. దానివల్ల సంక్రమణము! సంక్రమణ ప్రతీతితో విజ్ఞానం కలుగుతుంది. విజ్ఞానంనుంచి నామరూపాలు పుడతాయి. నామరూపాలనుంచి షడింద్రియాలు పుడతాయి. షడింద్రియాలనుంచి స్పర్శ కలుగుతుంది. ఈ స్పర్శనుంచి మూడు వేదనలు కలుగుతాయి. అన్నివిధాల వేదనా తృష్ణాసహితమే. తృష్ణనుంచి సకలదుఃఖ స్కంధమూ కలుగుతుంది. ఉపాదానంవల్ల భవప్రవృత్తి, దానివల్ల జాతి (జన్మ) కలుగుతాయి. జన్మవల్ల జరావ్యాధి దుఃఖాలు కలుగుతున్నాయి. ఈ భవపంజరానికి ఇదే ఉపపత్తి. జగత్తుగతి ఇది ఇలాగని తెలుసుకున్న ఆత్మపుంగలునికి ఇవేవీ



అంటవు. సంకల్పవికల్పాలేవీ లేక, అయోనిసుడు, అవిద్యారహితుడు, అవిద్యానిరోధం కలవాడు, సకలభవాంగాలు క్షయించిపోయి, నిరోధం పొందేవాడు ప్రతీతితో బుద్ధుడవుతాడని తథాగతుడు స్వయంభు వయిన తనను వివరించుకున్నాడు. స్కంధం, ఆయతనం, ధాతువు బుద్ధుడు కాడు. అన్యత్ర హేతువులు తెలుసుకోడంవల్ల బుద్ధుడు కాడు. ఇలాటి శూన్య ధర్మయోగాన్ని పరతీర్థికు లెవరూ గ్రహించలేరు. పూర్వం బుద్ధ చరితను అనుసరించినవారు, విశుద్ధసత్త్వాలు ఈ ధర్మాన్ని తెలుసుకోగలరు.''

ఈ విధంగా ద్వాదశాకారంగా ప్రవర్తించబడిన ధర్మచక్రాన్ని కౌండిన్యుడు తెలుసుకొన్నాడు. రతనత్రయం (రత్నత్రయం) బయలు దేరింది. బుద్ధుడు, ధర్మము, సంఘము—అనేది రత్నత్రయం. ఈ రత్న త్రయశబ్దం బ్రహ్మలోకంవరకు వెళ్ళినది. ''రజోరహితమైన ధర్మ చక్రాన్ని లోకనాథుడు, రక్షకుడు అయిన తథాగతుడు ప్రవర్తింప జేశాడు. లోకంలో పరమదుర్లభమైన మూడు రత్నాలు పుట్టాయి. ఐదుగురు భద్రవర్గీయులు కౌండిన్యుణ్ణి ముందుపెట్టుకుని అరవైకోట్ల దేవతలకు ధర్మచక్షువును పరిశుద్ధం చేశారు. తక్కిన ఎనభైకోట్ల రూపధాతుక దేవతల చూపు కూడా ధర్మచక్రప్రవర్తనవల్ల పరిశుద్ధమయింది. ఎనభై నాలుగుకోట్ల మానవుల నేత్రం కూడా పరిశుద్ధమైంది. వారు దుర్గతినుంచి విముక్తి చెందారు.''

ఆ క్షణంలో అంతరిక్షంనుంచి ''ఈ దశబలుడైన శాక్యర్షి ఉత్తమమైన ధర్మచక్రాన్ని వారాణసిలో ఋషిపతనంలో ప్రవర్తింప జేశాడు'' అని మధుర మనోజ్ఞమైన-అనంతమైన బుద్ధస్వరం బయలువెడలి వ్యాపించింది. శాక్యముని ఈ విధంగా ధర్మవినయం ఉపదేశించగా, దశ దిక్కులను ఉన్న వందలకొలది బుద్ధులు మౌనంగా ఉండిపోయారు. అప్పుడు శాక్యమునికి ఉపస్థాపకు లయినవారు వారిని ''మీరు దశబలుని వల్ల ఋతమైన ధర్మకథను విన్నారు గదా, ఎందుకు మిన్నకుండి పోయారు?'' అని ప్రశ్నించారు.

వందలకొలది పూర్వ జన్మలలోను వీర్యబలాలు గలవారు బోధిని ప్రపంచానికి తీసుకొని వచ్చారు. శతసహస్ర సంఖ్యాకులయిన బోధిసత్త్వాలు పశ్చాన్ముఖులుగాను అయారు. కాని, ఈ హితకరుడైన తథాగతుడు తప మాచరించి శివంకరమైన బోధిని పొందాడు. ధర్మచక్రాన్ని ప్రవర్తింపజేశాడు. అందువల్ల మేము మిన్నకున్నాము."

ఆ మునికోట్లు ఈ మాటలు వినిపించి మైత్రగుణం కలిగి శివకరమైన-శ్రేష్ఠమయిన బోధిని పొంది "ఈ మునివీర్యస్థామ జనితమైన ఈ బోధిని మేముకూడా ఉపదేశం పొందాము. త్వరలో లోకంలో లోకోత్తరమైన ధర్మచక్షువును ఇచ్చేవారం అవుతాము" అంటూ బయలుదేరాయి.

అనంతరం మైత్రేయుడనే బోధిసత్త్వుడు భగవంతుడైన తథాగతునితో ఈ విధంగా విన్నవించాడు: "భగవన్, ఈ దశదిగ్లోకధాతువులనుంచి వచ్చిన మహాసత్త్వులయిన బోధిసత్త్వులు మీనుంచి ధర్మచక్రప్రవర్తన ప్రవేశం విన్న కుతూహలులుగా ఉన్నారు. కనుక అర్హంతుడు, సమ్యక్సంబుద్ధుడు అయిన తథాగతుడు ఎలాటి ధర్మచక్రం ప్రవర్తింపజేసినాడో ఉపదేశించడం ఉచితం" అని.

భగవానుడు ఇలా అన్నాడు "మైత్రేయా, ధర్మచక్రం గ్రహింప శక్యం కానందువల్ల గంభీరమైంది. ద్వయవిగతం కావడంవల్ల చూడ శక్యం కానిది. మనసికారత్వ-అమనసికారత్వ కారణంవల్ల అనుబోధించడానికి సాధ్యంకానిది. జ్ఞాన విజ్ఞాన సమతానుబద్ధత్వంవల్ల దుర్విజ్ఞానమైనది. అనావరణ విమోక్ష ప్రతిలాభంవల్ల అనావిలమైంది. అనుపమమూ, వివరించరానిదీ కావడంవల్ల సూక్ష్మమైనది. వజ్రోపమనే జ్ఞానంవల్ల అది సారవంతమయినది. పూర్వాంత సంభవం కావడంవల్ల అభేద్యమయినది. సర్వప్రపంచోపారంభ విగతం కావడంవల్ల అప్రపంచ మయినది. అత్యంతనిష్ఠం కావడంవల్ల అక్షోప్యమయినది. ఆకాశసదృశం కావడంవల్ల సర్వత్రానుగతమైనది. అంతేకాక అది సర్వధర్మ ప్రకృతి స్వభావ సందర్శన విభవచక్రం, అనుత్పాద నిరోధసంభవచక్రం, అనాలయ అనిమిత్త చక్రం, అప్రనిహిత చక్రం, అనభిసంస్కారచక్రం, వివేక



చక్రం, విరాగచక్రం, విరోధచక్రం, తథాగతానుబోధచక్రం, ధర్మధాత్వసంభేదచక్రం. భూతకోటికి అవికోపమయినది. అసంగానావరణమైనది. ప్రతీత్యావతారోభయాంతదృష్టి సమతిక్రమణ చక్రం, అనంతమధ్య ధర్మధాత్వవికోపనచక్రం, అనాభోగ బుద్ధకార్య ప్రతి ప్రశ్రద్ధ చక్రం, అప్రవృత్త్యభినిర్వృత్తిచక్రం, అత్యంతానుపలబ్ధి చక్రం, అనాయూహ నిర్వ్యూహచక్రం, అనభిలాప్య చక్రం, ప్రకృతియథావచ్ఛక్రం, ఏకవిషయ సర్వధర్మ సమతావతారచక్రం, అక్షణసత్త్వ వినయాధిష్ఠాన ప్రత్యుదావర్త్యచక్రం, అద్వయసమారోప పరమార్థనయప్రవేశ చక్రం, ధర్మధాతు సమవసరణ చక్రం. ఆ చక్రం అప్రమేయమైనది. సర్వప్రమాణాతిక్రాంతమైనది. అసంఖ్యేయమయినది. సర్వసంఖ్యాపగతమయినది. అచింత్యమైనది. చిత్తపథసమతిక్రాంతమైనది. అత్యల్పమైనది, తూచరానిది, అనభిలాప్యమైనది. సర్వరుతఘోష వాక్పథాతీత మైనది. అప్రమాణమైనది. అనుపమమూ, ఉపమాపగతమూ, ఆకాశసమమూ, అనుచ్ఛేదమూ, అశాశ్వతమూ, ప్రతీత్యావతారావిరుద్ధ శాంతము, అత్యంతోపసమమూ, తత్త్వమూ, తథాఅవిధితథా అనన్యధా అనన్యధీభావమూ, సర్వసత్త్వతారణచరణమున్నూ, మారులకు నిగ్రహాకారణమైనది, తీర్థికులకు పరాజయమూ, సంసార విషయాలనుంచి దాటించేది, బుద్ధవిషయంలో ప్రవేశం కలిగించేది, ఆర్యపుంగవులు తెలుసుకున్నది, ప్రత్యేకబుద్ధులతో సంబంధం కలది, బోధిసత్త్వాలు గ్రహించినది, సకలబుద్ధులు స్తోత్రంచేసినది, సకలతథాగతులూ ఆశ్రయించినది.

"ఇలాటి ధర్మచక్రాన్ని మైత్రేయా, తథాగతుడు ప్రవర్తింపజేశాడు. దానిని ప్రవర్తింపజేయడంవల్ల తథాగతుడని, సమ్యక్సంబుద్ధుడని, స్వయంభువని, ధర్మస్వామి అని, నాయకు డని, వినాయకుడని, పరినాయకుడని, సార్థవాహుడని, సర్వధర్మ వశవర్తి అని, ధర్మేశ్వరుడని, ధర్మచక్రప్రవర్తి అని, ధర్మదానపతి అని, యజ్ఞస్వామి అని, సంయష్టయజ్ఞు డని, సిద్ధవ్రతుడని, పూర్ణాభిప్రాయుడని, దేశికుడని, ఆశ్వాసకుడని, క్షేమంకరుడని, శూరుడని, రణంజయుడని, విజితసంగ్రాముడని, పైకెత్తిన ఛత్రధ్వజ పటాకాలు గలవాడని, ఆలోకకరుడని. ప్రభంకరు

డని, తమోనుదుడని, ఉల్కాధారి అని, మహా వైద్యరాజని, భూత చికిత్సుడని, మహాశల్యహర్త అని, వితిమిరజ్ఞాన దర్శనుడని, సమంతదర్శి అని, సమంత విలోకితుడని, సమంత-చక్షువని, సమంతప్రభుడని, సమంతాలోకుడని, సమంత ముఖుడని, సమంత ప్రభాకరుడని, సమంత చంద్రుడని, సమంత ప్రాసాదికుడని, అప్రతిష్ఠాన అయూహ నిర్వ్యూహుడని, అనున్నతుడు అవనతుడు కావడంవల్ల ధరణిసముడని, అప్రకంప్యుడు కావడంవల్ల శైలేంద్రసముడని, సర్వలోకగుణ సమన్వాగతుడు కావడం వల్ల సర్వలోకశ్రీ అని, సర్వలోకాభ్యుద్గతుడు కావడంవల్ల ఎవరూ చూడని శిరస్సు కలవాడని. గంభీరుడు దురవగాహుడు కావడంవల్ల సముద్రసమానుడని, సర్వ బోధిపాక్షికా ధర్మరత్నపూర్ణుడు కావడంవల్ల ధర్మరత్నాకరుడని, అనికేతనుడు కావడంవల్ల వాయుసముడని, అసంగ అముక్త అబద్ధచిత్తం కలవాడు కావడంవల్ల అసంగబుద్ధి అని, సర్వ ధర్మ నిర్వేధిక జ్ఞానంవల్ల అనైవర్తిక ధర్ముడని, దురాసద సర్వమనన అప్రహీణ సర్వక్లేశ దాహ ప్రత్యుపస్థానంవల్ల తేజస్సముడని, అనావిలసంకల్ప నిర్మలకాయ చిత్తవాహిత పాపంవల్ల ఉదక సమానుడని, అసంగజ్ఞాన విషయానంత మధ్యధర్మ ధాతుగోచర జ్ఞానాభిజ్ఞ ప్రాప్తివల్ల ఆకాశ సమానుడని, నానా సరణీయ ధర్మను ప్రహీణత్వంవల్ల అనావరణ జ్ఞానవిమోక్ష విహారి అని, గగనసమచక్షుఃపథసమతిక్రాంతత్వంవల్ల సర్వ ధర్మ ధాతు ప్రసృత కాయుడని, సర్వలోక విషయాసంక్లిష్టత్వంవల్ల ఉత్తమ సత్త్వుడని; అసంగసత్త్వుడని అప్రమాణ బుద్ధి అని. లోకోత్తర ధర్మదేశికుడని, లోకాచార్యుడని, లోక వైద్యుడని, లోకాభ్యుద్గతుడని, లోకధర్మానుపలిప్తుడని, లోక నాథుడని, లోక జ్యేష్ఠుడని, లోక శ్రేష్ఠుడని, లోకేశ్వరుడని, లోకసమహితుడని, లోకపరాయణుడని, లోక పారంగతుడని, లోక ప్రదీపుడని, లోకోత్తరుడని, లోకగురువని, లోకార్థకరుడని, లోకానువర్తకుడని, లోకవిత్తని, లోకాధిపతేయ ప్రాప్తుడని, మహా దక్షిణీయుడని, పూజార్హుడని, మహా పుణ్యక్షేత్రుడని. మహాసత్త్వుడని, అగ్రసత్త్వుడని, వరసత్త్వుడని, ప్రవరసత్త్వుడని, ఉత్తమసత్త్వుడని, అనుత్తరసత్త్వుడని, అసమసత్త్వుడని; అసదృశసత్త్వుడని, స్తుతించబడుతున్నాడు. సతత సమాహితుడని, సర్వధర్మ సమతా విహారి



అని, మార్గప్రాప్తుడని, మార్గదర్శకుడని, మార్గదేశికుడని, సుప్రతిష్ఠిత మార్గుడని స్తుతింపబడుతున్నాడు. మారవిషయసమతిక్రాంతుడని, మార మండల విధ్వంసకరుడని, అజరామరశీతీభావుడని, విగతతమోంధకారుడని, విగతకంటకుడని, విగతకాంక్షుడని, విగత క్లేశుడని, వినీతసంశయుడని, విమతి సముద్ఘటితుడని, విరక్తుడని; విముక్తుడని, విశుద్ధుడని, విగతరాగుడని, విగతదోషుడని, విగత మోహుడని; క్షీణాస్రవుడని, నిఃక్లేశుడని, వశీభూతుడని, స్తుత్యుడయినాడు. ఆతడు సువిముక్త చిత్తుడు. సువిముక్తప్రజ్ఞుడు. ఆజానేయుడు. మహానాగుడు. కృతకృత్యుడు. కృతకరణీయుడు. అపహృతభారుడు. అనుప్రాప్తస్వకార్థుడు. పరిక్షీణభవ సంయోజనుడు. సమతాజ్ఞాన విముక్తుడు. సర్వచేతో వశి పరమపారమితా ప్రాప్తుడు. దానపారగుడు. శీలాభ్యుద్గతుడు. క్షాంతిపారగుడు. వీర్యాభ్యుద్గతుడు. ధ్యానాభిజ్ఞప్రాప్తుడు. ప్రజ్ఞాపారంగతుడు. సిద్ధప్రణిధానుడు, మహామైత్రవిహారి. మహా కరుణావిహారి. మహాముదితావిహారి, మహోపేక్షావిహారి. సత్త్వసంగ్రహప్రయుక్తుడు. అనావరణ ప్రతిసంవిత్ప్రాప్తుడు. ప్రతిశరణభూతుడు. మహాపుణ్యుడు. మహా జ్ఞాని, స్మృతిమతిగతి బుద్ధిసంపన్నుడు. స్మృత్యుపస్థాన సమ్యక్ప్రహాణ బుద్ధి పాదేంద్రియ బలబోధ్యంగ సమర్థ విదర్శనలోక ప్రాప్తుడు. ఉత్తీర్ణ సంసారార్ణవుడు. పారగుడు, స్థలగతుడు. క్షేమప్రాప్తుడు. అభయప్రాప్తుడు, మర్దిత క్లేశ కంటకుడు. పురుషుడు, మహాపురుషుడు. పురుషసింహుడు, విగతభయలోమహర్షణుడు. నాగుడు. నిర్మలుడు. త్రిమలమలప్రహీణుడు. వేదకుడు. త్రైవిద్యనుప్రాప్తుడు. చతురోఘోత్తీర్ణుడు, పారగుడు. క్షత్రియుడు, బ్రాహ్మణుడు, ఏక రత్నచ్ఛత్రధారి; వాహితపార ధర్ముడు, భిక్షువు, భిన్నావిద్యాండకోశుడు. శ్రమణుడు, ఆర్ద సంగ పథ సమతిక్రాంతుడు, శ్రోత్రియుడు, నిఃసృతక్లేశుడు, బలవంతుడు, దశబలధారి, భగవానుడు, భావితకాయుడు, రాజాతిరాజు, ధర్మరాజు, [illegible] ప్రవర ధర్మచక్ర ప్రవర్త్యనుశాసకుడు, అకోప్యధర్మదేశకుడు, సర్వజ్ఞ జ్ఞానాభిషిక్తుడు, అసంగ మహాజ్ఞాన విముక్త పట్టాబద్ధుడు, సప్త బోధ్యంగరత్న సమన్వాగతుడు, సర్వ ధర్మవిశేష ప్రాప్తుడు, సర్వార్య శ్రావకామాత్యావలోకితముఖమణ్డలుడు, బోధిసత్త్వ మహాసత్త్వ పుత్ర

పరివారుడు, సువినీత వినయుడు, సువ్యాకృతి బోధిసత్త్వుడు, వైశ్రవణ
సదృశుడు, సప్తార్య ధన విశ్రాణితకోశుడు, త్యక్తత్యాగుడు, సర్వ సుఖ
సంపత్తి సమన్వాగతుడు, సర్వాభిప్రాయదాత్త, సర్వలోకహిత సుఖాను
పాలకుడు, ఇంద్రసముడు, జ్ఞానబల వజ్రధారి, సమన్తనేత్రుడు, సర్వధర్మా
నావరణ జ్ఞానదర్శి, సమన్త జ్ఞానవిశుర్వణుడు, విపుల ధర్మనాటక దర్శన
ప్రవిష్టుడు, చంద్రసముడు, సర్వజగదతృప్త దర్శనుడు, సమన్త విపుల
విశుద్ధ ప్రభుడు, ప్రీతిప్రామోద్యకర ప్రభుడు, సర్వ సత్త్వాభిముఖ దర్శనా
భాసుడు, సర్వ జగచ్చిత్తాశయభాజన ప్రతిభాస ప్రాప్తుడు, మహా
వ్యూహుడు, శైక్షాశైక్ష జ్యోతిర్గణ పరివారుడు, ఆదిత్యమండలసముడు,
విధూత మోహాంధకారుడు, మహాకేతురాజు, అప్రమాణానంతరశ్మి, మహా
వభాస సందర్శకుడు, సర్వ ప్రశ్న వ్యాకరణ నిర్దేశాసంమూఢుడు, మహా
విద్యాంధకార విధ్వంసనకరుడు, మహాజ్ఞానాలోక విలోకిత బుద్ధి నిర్వి
కల్పుడు, మహామైత్రీ కృపా కరుణా సర్వజగత్సమరశ్మి ప్రముక్త ప్రమాణ
విషయుడు, ప్రజ్ఞాపారమితాగంభీర దురాసద దుర్నిరీక్ష మండలుడు,
బ్రహ్మసముడు, ప్రశాంతేర్యాపథుడు, సర్వేర్యాపథచర్యా విశేషసమన్వా
గతుడు, పరమరూపధారి, అసేచనక దర్శనుడు, శాంతేంద్రియుడు, శాంత
మానసుడు, సమథసంభార పరిపూర్ణుడు, ఉత్తమ సమథప్రాప్తుడు,
పరమదసమథప్రాప్తుడు, సమథవిదర్శనా పరిపూర్ణ సంబారుడు, గుప్తుడు,
జితేంద్రియుడు, నాగంవలె సుదాసుడు, హ్రదంవలె పరిశుద్ధుడు, అనా
విలుడు, ప్రసన్నుడు, సర్వక్లేశవాసనాపసరణ సుప్రహీణుడు, ద్వాత్రింశ
న్మహాపురుషలక్షణ సమన్వాగతుడు, పరమపురుషుడు, అశీత్యనువ్యంజన పరి
వార విచిత్ర రచిత గాత్రుడు, పురుషర్షభుడు, దశబలసమన్వాగతుడు, చతు
ర్వైశారద్య ప్రాప్తానుత్తరపురుష దమ్యసారథి, శాస్త, అష్టాదశ వేణిక
బుద్ధ ధర్మ పరిపూర్ణుడు, అనిందితకాయ వాఙ్మనస్కర్మాంతుడు, సర్వా
కార వరోపేత సుపరిశోధిత జ్ఞానదర్శమండలత్వంవల్ల శూన్యతావిహారి,
ప్రతీత్య సముత్పాదన మతాభి సంబోధంవల్ల అనిమిత్తవిహారి, పరమార్థ
సత్య నయ ప్రతివేధంవలన ప్రణిహితవిహారి, సర్వ ప్రస్థానాలి ప్తత్వం
వలన అభిసంస్కార గోచరుడు, సర్వసంస్కార ప్రతిప్రశ్రబ్ధత్వంవలన



భూతవాది, భూతకోట్యవికోపితజ్ఞాన విషయత్వంవలన అవితథానన్యథా
వాది, తథాగత ధర్మధాత్వాకాశ లక్షణాలక్షణ విషయత్వంవలన
అరణ్యా ధర్మ సుప్రతిలబ్ధుడు, మాయామరీచి స్వప్నోదక చంద్ర ప్రతి
శ్రుత్క ప్రతిభాస సమతా సర్వధర్మ విహారిత్వంవలన అమోఘ దర్శన
శ్రవణుడు, పరినిర్వాణ హేతు జనకత్వంవలన అమోఘ పదవిక్రముడు,
సత్త్వ వినయపరాక్రమ విక్రాంతత్వంవలన ఉత్క్షిప్త పరిఖేదుడు,
అవిద్యా భవతృష్ణాసముచ్ఛిన్నత వలన స్థాపిత సంక్రముడు, నైర్వాణిక
ప్రతిపత్సుదేశకత్వంవలన నిర్జిత మారక్లేశ ప్రత్యర్థికుడు, సర్వమార
విషయచర్యాననులిప్తవలన ఉత్తీర్ణ కామపంకుడు, కామధాతు
సమతిక్రాంతుడు కావడంవల్ల పతితమానధ్వజుడు, రూపధాతు సమతి
క్రాంతతవలన ఉచ్ఛ్రిత ప్రజ్ఞాధ్వజుడు, అరూప్యధాతు సమతిక్రాంతత
వలన సర్వలోకవిషయ సమతిక్రాంతుడు, ధర్మకాయ జ్ఞానశరీరతవలన
మహాద్రుమరూపుడు, అనంతగుణ రత్నజ్ఞాన సంకుసుమిత విముక్తి ఫల సుసం
పన్నతవలన ఉదుంబరపుష్ప సదృశుడు, దుర్లభప్రాదుర్భావ దర్శనుడు
కావడంవల్ల చింతామణి రత్నమణిరాజసముడు, యథానయ నిర్వాణాభి
ప్రాయ సుప్రతిపూరణత్వంవలన సుప్రతిష్ఠితపాదుడు, దీర్ఘరాత్రులు త్యాగ
శీల తపోవ్రత బ్రహ్మచర్య దృఢసమాదానాచలాప్రకమ్ప్యతవలన విచిత్ర
స్వస్తిక నంద్యావర్త సహస్రార చక్రాంకిత పాదతలుడు, దీర్ఘరాత్రులు
మాతాపితృ శ్రమణ బ్రాహ్మణ గురుదక్షిణీయ ధార్మిక రక్షాపరిపాలనత
వలననూ, శరణాగతులను పరిత్యజించ ననడంవల్లనూ ఆయతపార్ష్ణి, దీర్ఘ
రాత్రులు ప్రాణాతిపాతోపరతుడు కావడంవల్ల దీర్ఘాంగులి, దీర్ఘరాత్రులు
ప్రాణాతిపాత వైరమణ్య పరసత్త్వ సమాదాయనతవలన బహుజనత్రాతి
దీర్ఘరాత్రులు ప్రాణాతిపాత వైరమణ్య గుణవర్ణ సంప్రకాశనత్వంవలన
మృదు తరుణ హస్తపాదుడు, దీర్ఘరాత్రులు మాతాపితృ శ్రమణ
బ్రాహ్మణ గురుదక్షిణీయోపస్థాన పరిచర్యా స్నానానులేపన సర్పిస్తైలా
భ్యంగ స్వహస్త శరీరపరికర్మ పరిఖేదంవలన జలాంగులి హస్తపాదుడు,
దీర్ఘరాత్రులు దానప్రియవద్యతార్థ క్రియా సమానార్థతా సంగ్రహ వస్తు
జాలంతో సత్త్వ సంగ్రహ కౌశల్య సుశిక్షితత్వంవలన ఉచ్ఛంగ

పాదుడు, దీర్ఘరాత్రులు ఉత్తరోత్తర విశిష్టతరకుశల మూలాధ్యాలంబనత్వంవలన ఊర్ధ్వాంగ దక్షిణావర్త రోమకూపుడు, దీర్ఘరాత్రులు మాతా పితృ శ్రమణబ్రాహ్మణ గురు దక్షిణీయ తథాగతచైత్య ప్రదక్షిణీకరణ ధర్మశ్రవణ చిత్రీకార రోమహర్షణ పరసత్త్వ సంహర్షణ ధర్మదేశనా ప్రయోగత్వంవల్ల ఐణేయజంఘుడు, దీర్ఘరాత్రులు సత్కృత్య ధర్మ శ్రవణగ్రహణ ధారణవాచన విజ్ఞాపనార్థ పదనిశ్చయ నిస్తీరణ కౌశల్యం వలన జరావ్యాధిమరణాభిముఖు లయిన ప్రాణులకు శరణ గమనానుప్రదాన సత్కృత్య ధర్మదేశనా పరిభవబుద్ధి కావడంవలన ఉత్కోశోపగతవస్తిగుహ్యుడు, దీర్ఘరాత్రులు శ్రమణ బ్రాహ్మణులకు ఇతరులకు బ్రహ్మచారులకు బ్రహ్మచర్యానుగ్రహ సర్వ పరిష్కారానుప్రదాన నగ్న బలానుప్రదాన పరదారాగమన బ్రహ్మచర్య గుణవర్ణ సంప్రకాశన వ్యపత్రాప్యానుపాలన దృఢసమాదానత్వంవలన ప్రలంబ బాహువు, దీర్ఘరాత్రులు హస్తసంయత పాదసంయత సత్త్వవిహేఠన ప్రయోగ మైత్ర కాయకర్మ వాక్కర్మ మనస్కర్మ సమన్వాగతుడు కావడంవల్ల గ్రోధపరిమండలుడు, దీర్ఘరాత్రులు అల్పాహారతోదారసంయమజ్ఞాన భైషజ్యానుప్రదాన హీనజనాపరిభవానాథానవమర్దన తథాగత చైత్య విశీర్ణ ప్రతిసంస్కారణస్తూపప్రతిష్ఠాపనవలనను భయార్దితులయిన ప్రాణులకు అభయప్రదానంవలనను మృదుతరుణ సూక్ష్మచలి, దీర్ఘరాత్రులు మాతా పితృ శ్రమణ బ్రాహ్మణ గురు దక్షిణీయులకు స్నానానులేపన సర్పిస్తైలాభ్యంగ శీతోష్ణోదక, ఉష్ణశీతోదకచ్ఛాయాతపబుతు సుఖపరిభోగానుప్రదాన మృదుతరుణ తూల సంస్పర్శ సుకుమార వస్త్రాస్తీర్ణ శయనాసనానుప్రదాన తథాగతచైత్య గంధతైలసేక సూక్ష్మ పట్టధ్వజ పటాకాగుణప్రదానాలవలన సువర్ణచ్ఛవి, దీర్ఘరాత్రులు సర్వసత్త్వప్రతిఘాత మైత్రీభావనా యోగక్షాంతి సౌరత్యంలో పరసత్త్వ సమాదాపరవైర వ్యాపాద గుణ వర్ణసంప్రకాశనతవలన తథాగత చైత్యతథాగత ప్రతిమలకు సువర్ణఖచన సువర్ణపుష్ప సువర్ణచూర్ణాభికిరణ సువర్ణవర్ణ పట్ట పటాకాధ్వజాలంకార సువర్ణభాజన సువర్ణ వస్త్రానుప్రదానంవలన ఏకైక నిచిత రోమకూపుడు, దీర్ఘరాత్రులు పండితోపసంక్రమణ కిం



కుశలాకుశల పరిపృచ్ఛన సావద్యానవద్య సేవ్యాసేవ్య హీనమధ్య ప్రణీత ధర్మ పరిపృచ్ఛనార్థ మీమాంసన పరితులనా సంమోహ తథాగతచైత్య కీట తులాలయాంజలితోనిర్మాల్య నానాత్మణ సర్కారా సముద్ధరణ సంప్రయోగతవలన సప్తోత్సదుడు, దీర్ఘరాత్రులు ఇంటికి వచ్చిన మాతా పితృ జ్యేష్ఠ శ్రేష్ఠ పూజ్యశ్రమణ బ్రాహ్మణ కృపణ వనీపకాదులను సత్వరంగా సత్కరించి యథాభిప్రాయంగా అన్నపానాసన వస్త్రాపశ్రయ ప్రదీప కల్పిత జీవిక పరిష్కార సంప్రదానరూప పుష్కరిణీ శీతజల పరిపూర్ణ మహా జనోపభోగాల ఆప్రదానంవలన సింహపూర్వార్ధకాయుడు; దీర్ఘరాత్రులు మాతాపితృ శ్రమణ బ్రాహ్మణ గురు దక్షిణీయావన మనప్రణమనాభివాదనాభయ పదాన దుర్బలాపరిభవ శరణాగతాపరిత్యాగ దృఢసమాదానానుత్సర్గం వలన చితాంతరాంసుడు, దీర్ఘరాత్రులు సదోషపరితులన ప్రస్ఖలిత పరచ్ఛిద్రాదోష దర్శన వివాద మూల పరభేద వరమంత్ర పరివర్జన సుప్రతి నిస్సర్గ మంత్రస్వారక్షిత వాక్కర్మాంతత్వంవలన సుసంవృత్తస్కంధుడు, దీర్ఘరాత్రులు మాతాపితృ శ్రమణ బ్రాహ్మణ గురు దక్షిణీయులకు ప్రత్యుత్థాన ప్రత్యుద్గమనాభివాదనాలు చేయడంవలనను, సర్వశాస్త్ర వైశారద్యంవలనను, వివాదకామ సత్త్వనిగ్రహ స్వధర్మ వినయానులోమన సమ్యక్ప్రవృత్త రాజామాత్య సమ్యక్ప్రవృత్త కుశల ధర్మపథ ప్రతిష్ఠాపన ప్రభావన తథాగత శాసన పరిగ్రహ సంధారణ సర్వకుశలచర్యా సమాదాపన పూర్వంగమత్వంవలనను సింహహనుడు, దీర్ఘరాత్రులు సర్వవస్తు పరిత్యాగ యథాభిప్రాయ యాచనక ప్రియాభిధానంవలన సమీపించినవారికి అవిమాననా జిహ్మీకరణావిక్షేపాలు చేయక అందరికీ యథాభిప్రాయ పరిపూరణ దాన పరిత్యాగ దృఢ సమాదానానుత్సర్గత్వంవలన చత్వారింశత్సమదంతుడు. దీర్ఘరాత్రులు పిశున వచన పరివర్జన భేద మంత్రాగ్రహణ సంధి సామగ్రీరోచన సమగ్రత వల్లను పిశున వచన విగర్హణ సంధి సామగ్రీ గుణవర్ణ ప్రకాశన ప్రయోగత్వంవలనను శుక్లదంతుడు, దీర్ఘరాత్రులు కృష్ణపక్ష పరివర్జన శుక్లపక్ష కుశలోపచయ కృష్ణకర్మ కృష్ణవిపాక పరివర్జన శుక్లకర్మ శుక్ల విపాక సంవర్ణన క్షీరభోజన శుక్లవస్త్ర ప్రదానంవలన తథాగత చైత్యాలలో సుధా

కృతకక్షీర మిశ్ర సంప్రదాన సుమనావార్షికీ ధానుస్కారి మాలాగుణ పుష్పదామ శుక్లవర్ణ కుసుమానుప్రదానంవలన అవిరలదంతుడు, దీ రాత్రులు హాస్యోచ్ఛ్వ్యనవివర్జనానందకరణ వాగనురక్షణానందకరణ వాగుదీరణ పరస్ఖలితాపరఛిద్రా పరిమార్గణ సర్వసత్త్వ సమచిత్త సమాదాపన సమప్రయోగ సమధర్మదేశన దృఢసమాదానా పరిత్యాగాలవల్ల రసరసాగ్రవంతుడు, దీర్ఘరాత్రులు సర్వ సత్త్వావిహేఠనావిహింసన వివిధవ్యాధి స్పృష్టోపస్థాన గ్లాన భైషజ్యానుప్రదానంవలనను సర్వ రసార్థులకు సర్వరసప్రదానాపరిఖేదత్వంవల్లను బ్రహ్మస్వరుడు, దీర్ఘ రాత్రులు అనృత పరుష కర్కశ శాఠ్య పరకటుక పరాభిషంగిన్యప్రియ పరమర్మఘట్టన వాక్య పరివర్జన మైత్రీకరణాప్రయోగ ముదితా ప్రామోద్యకరణీ స్నిగ్ధ మధుర శ్లక్ష్ణ హృదయంగమ సర్వేంద్రియ ప్రహ్లాద కరణీ సమ్యగ్వాక్య సమ్యక్ప్రయోగత్వంవలన అభినీల నేత్రుడు, దీర్ఘ రాత్రులు మాతాపిరులవలె సర్వసత్త్వప్రతిహతచక్షుః ప్రయోగైక పుత్రునివలె యాచనక మైత్రీకారుణ్య పూర్వంగమ సంప్రేక్షణాజిహ్మకరణ ప్రసన్నేంద్రియ తథాగత చైత్యానిమిషనయన సంప్రేక్షణ పరసత్త్వ తథాగత దర్శన సమాదాన దృఢసమాదానతవలన గోపేక్షు నేత్రుడు, దీర్ఘరాత్రులు హీనచేతో విపర్జనోదార విపులాధిముక్తి పరిపూరణానుత్తర ధర్మఛంద సత్త్వ సమాదాపన భ్రుకుటీముఖవివర్జన స్మితముఖ సర్వకల్యాణ మిత్రోపసంక్రమణాభిముఖపూర్వంగమ సర్వ కుశలోపచయాపైవర్తికతవలన ప్రభూతజిహ్వుడు, దీర్ఘరాత్రులు సర్వవాగ్దోష వివర్జన సర్వశ్రావక ప్రత్యేక బుద్ధ ధర్మభానకాప్రమాణ గుణవర్ణ సంప్రకాశన తథాగత సూత్రాంతఖిలన వాచన పఠన విజ్ఞాపనంవలనను ఆ ధర్మాల అర్థపద ప్రభేద పరసత్త్వ సంప్రాపణ కౌశల్యంవలనను ఉష్ణీషశీర్షానవలోకిత మూర్ధుడు; దీర్ఘ రాత్రులు మాతాపితృ శ్రమణ బ్రాహ్మణ గురు దక్షిణీయాదులను శిరస్సుతో చరణతల ప్రణిపతనంవల్ల ప్రవ్రజిత వందనాభివాదన కేశావరోపణ సుగంధతైలం తలపై పరిషించడంవల్లను



సర్వయాచనకులకు చూర్ణ మాల్య మాలాగుణ మూర్ధాభరణానుప్రదానంవలనను భ్రూమధ్యంలో సుజాత ప్రదక్షిణావర్తోత్తప్త విశుద్ధవర్ణాభాసోర్ణుడు, దీర్ఘ రాత్రులు నిరర్గళ సర్వయజ్ఞ యజన సమాదాపన సర్వకల్యాణ మిత్రానుశాసన్యనుద్ధరధర్మ భానకముల దౌత్యప్రేక్షణములవలన దిగ్గమనాగమనాపరిఖేదన సర్వబుద్ధ బోధిసత్త్వ ప్రత్యేక బుద్ధార్యశ్రావక ధర్మభానక మాతాపితృ గురుదక్షిణీయ తమోఽంధకార విధమన తైలఘృత తృణోల్కా ప్రదీప నానాగంధతైలప్రదీప సర్వాకారవరోపేత ప్రాసాదిక తథాగత ప్రతిమాకారణ క్షీర ప్రతిభాస రత్నోత్తీర్ణకోశ ప్రతిమండన పరసత్త్వబోధి చిత్తాముఖీకరణ కుశలసంభారవిశేషత్వంవలన మహాస్థామ ప్రాప్తుడు, మహా నారాయణ బలోపేతుడు కావడంవలన మహా నారాయణుడు, కోటీశత మారధర్షణ బలోపేతత్వంవల్ల సర్వపర ప్రమర్దకుడు, దశతథాగత బలోపేతుడు కావడంవల్ల దశతథాగత బలోపేతుడు. స్థానాస్థాన జ్ఞానకుశల హీన ప్రాదేశికయాన వివర్జన మహాయాన గుణసముదానయన బలోపేతాత్పత్త బలప్రయోగత్వంవల్ల స్థానాస్థాన జ్ఞానబలోపేతుడు, అతీతానాగత ప్రత్యుత్పన్న కర్మసమాదాన హేతు సోవిపాక సోజ్ఞాన బలోపేతుడు కావడంవల్ల అతీతానాగత ప్రత్యుత్పన్న సర్వకర్మ సమాదాన హేతువిపాకజ్ఞాన బలోపేతుడు, సర్వ సత్త్వేంద్రియ వీర్యవిమాత్రతా జ్ఞాన బలోపేతత్వంవలన సర్వసత్త్వేంద్రియ వీర్య విమాత్రతాజ్ఞాన బలోపేతుడు, అనేకధాతు నానాధాతు లోకప్రవేశజ్ఞాన బలోపేతుడు కావడంవల్ల అనేక ధాతు నానాధాతు లోకప్రవేశ జ్ఞాన బలోపేతుడు, అనేకాధిముక్తి నానాధిముక్తి నిరవశేషాధిముక్తి విముక్తి జ్ఞాన బలోపేతత్వంవల్ల అనేకాధిముక్తి నానాధిముక్తి నిరవశేషాధిముక్తి విముక్తి జ్ఞాన బలోపేతుడు, సర్వత్రగామినియైన ప్రతిపజ్జ్ఞాన బలోపేతుడు కావడంవల్ల సర్వత్రగామినీ ప్రతిపజ్జ్ఞాన బలోపేతుడు, సర్వధ్యానవిమోక్ష సమాధి సమాపత్తి సంక్లేశ వ్యవదాన వ్యవస్థాపన జ్ఞాన బలోపేతత్వంవల్ల సర్వధ్యాన విమోక్ష సమాధి సమాపత్తి సంక్లేశ వ్యవదాన వ్యవస్థాపన జ్ఞానబలోపేతుడు, అనేకవిధ పూర్వ నివాసానుస్మృత్యాసంగ

జ్ఞాన బలోపేతత్వంవలన అనేకవిధ పూర్వ నివాసానుస్మృత్యాసంగ జ్ఞాన బలోపేతుడు, నిరవశేష సర్వరూపానావరణ దర్శన దివ్యచక్షుర్జ్ఞాన బలోపేతత్వంవల్ల నిరవశేష సర్వరూపానావరణ దర్శనదివ్య చక్షుర్జ్ఞాన బలోపేతుడు, సర్వవాసనానుసంధిగత నిరవశేష సర్వాశ్రవక్షయ జ్ఞాన బలోపేతత్వంవలన సర్వవాసనానుసంధి గత నిరవశేష సర్వాశ్రవ క్షయ జ్ఞాన బలోపేతుడు, నిరవశేష సర్వధర్మాభిసంబుద్ధ ప్రతిజ్ఞారోహణ సదేవలోకానభిభూత ప్రతిజ్ఞా వైశారద్య ప్రాప్తుడు కావడంవల్ల నిరవశేష సర్వధర్మాభిసంబుద్ధ ప్రతిజ్ఞారోహణ సదేవ లోకానభిభూత ప్రతిజ్ఞా వైశారద్య ప్రాప్తుడు, సర్వసంక్లేశికాంతరాయిక ధర్మాంతరాయ కరణానిర్వాణమునకని ప్రతిజ్ఞ చేయడంవల్లను అనాచ్ఛేద్య ప్రతిజ్ఞా వైశారద్యం పొందడంవల్లను సర్వసంక్లేశికాంతరాయిక ధర్మాంతరాయకరణా నిర్వాణమునకని తత్ప్రతిజ్ఞారోహణ దేవతలతోకూడిన లోకంలో అనాచ్ఛేద్య ప్రతిజ్ఞా వైశారద్య ప్రాప్తుడు, అప్రతిచోద్య ప్రతిజ్ఞా వైశారద్య ప్రాప్తుడు కావడంవల్ల అప్రతిచోద్య ప్రతిజ్ఞా వైశారద్యప్రాపుడు, అవివర్త్య ప్రతిజ్ఞా వైశారద్య ప్రాప్తుడు, అస్ఖలిత పద ధర్మదేశికత్వం వల్ల అస్ఖలితపద ధర్మదేశికుడు, అరుతానభిలాప్య ధర్మస్వభావానుబుద్ధత్వం వల్ల అరుతానభిలాప్య ధర్మస్వభావానుబుద్ధుడు, అవిరతత్వంవల్ల అవిరతుడు, సర్వసత్త్వరుతాప్రమాణ బుద్ధ ధర్మరుత నిర్ఘోషాధిష్ఠాన సమర్థతవల్ల సర్వసత్త్వ రుతాప్రమాణ బుద్ధ ధర్మరుత నిర్ఘోషాధిష్ఠాన సమర్థుడు, అముషిత స్మృతివలన అముషితస్మృతి, నానాత్వసంజ్ఞా విగతత్వంవల్ల నానాత్వ సంజ్ఞావిగతుడు, సర్వచిత్త సమాహిత సుసమాహితత్వంవల్ల సర్వచిత్త సమాహిత సుసమాహితుడు, అప్రతిసంఖ్యా సముపేక్షవల్ల అప్రతి సంఖ్యా సముపేక్షకుడు, ఛందఃసంస్కార సమాధ్యపరిహీనత్వంవల్ల ఛందః సంస్కార సమాధ్యపరిహీనుడు, వీర్యసంస్కార సమాధ్యనాచ్ఛేద్యా పరిహీన వీర్యత్వంవల్ల వీర్యసంస్కార సమాధ్యనాచ్ఛేద్యాపరిహీనవీర్యుడు, స్మృత్యపరిహీనతవల్ల అపరిహీనస్మృతి, అపరిహీన ప్రజ్ఞవలన అపరిహీన



ప్రజ్ఞుడు, విముక్త్యపరిహీనతవలన అపరిహీన విముక్తి, విముక్తి జ్ఞాన దర్శనాప్రహీనత్వంవల్ల అపరిహీన విముక్తి జ్ఞాన దర్శనుడు, సర్వకాయ కర్మ వాక్కర్మ మనస్కర్మ జ్ఞాన పూర్వంగమజ్ఞానానుపరివర్తి సమన్వాగతుడు కావడంవల్ల సర్వకాయ కర్మవాక్కర్మ మనస్కర్మ జ్ఞాన పూర్వంగమ జ్ఞానానుపరివర్తి సమన్వాగతుడు, అతీతానాగత ప్రత్యుత్పన్న మార్గాలలో అసంగాప్రతిహతజ్ఞాన దర్శనంవల్ల త్ర్యధ్వాసంగా ప్రతిహతజ్ఞాన దర్శన సమన్వాగతుడు, అనావరణ విమోక్ష ప్రతిలబ్ధత్వం వలన అనావరణ విమోక్ష ప్రతిలబ్ధుడు, అధిష్ఠితసర్వసత్త్వ చరిత్ర ప్రవేశ కౌశల్యావస్థితతుడు కావడంవల్ల అధిష్ఠిత సర్వసత్త్వ చరిత్ర ప్రవేశ కౌశల్యావస్థితుడు, యథాప్రత్యర్హ ధర్మదేశనా కుశలతవలన యథా ప్రత్యర్హ ధర్మదేశనా కుశలుడు, సర్వస్వరాంగమండల పరమపారమితాప్రాప్త వలన సర్వస్వరాంగమండల పరమపారమితా ప్రాప్తుడు, సర్వరుత ప్రతిరుత నిశ్చారణ కౌశల్య ప్రాప్తుడు కావడంవల్ల దేవనాగ యక్ష గంధర్వాసుర గరుడ కిన్నర మహోరగరుతుడు. బ్రహ్మస్వర రుత రవిత నిర్ఘోషుడు, కలవింకరుత స్వరుడు, దుందుభి సంగీతిరుత స్వరుడు, ధరణీతల నిర్నాద నిర్ఘోష స్వరుడు, సాగర నాగేంద్ర మేఘ స్తనిత గర్జిత ఘోషస్వరుడు. సింహవృషభితాభిగర్జిత నిర్ఘోషస్వరుడు, సర్వసత్త్వరుత రవితానుచరణ సంతోషణస్వరుడు, అసంగానావరణ సర్వపర్షన్మండలాభిరాధన స్వరుడు, ఏకరుతుడుకావడంవల్ల సర్వరుతసంప్రాపనస్వరుడనిన్నీ, బ్రహ్మేంద్ర పూజితుడని, దేవేంద్ర సత్కృతుడని, నాగేంద్ర నమస్కృతుడని; యక్షేంద్రావలోకిత ముఖమండలుడని, గంధర్వేంద్రోపగతుడని, రాక్షసేంద్ర ప్రసన్నేంద్రియానిమిషనయన సంప్రేక్షితుడని. అసురేంద్రాభి ప్రణతుడని, గరుడేంద్రావిహింసా ప్రేక్షితుడని, కిన్నరేంద్రాభిష్టుతుడని, మహోరగేంద్రాభిలషిత దర్శనుడని, మనుజేంద్రాభిసంపూజితుడని, అర్హగణసేవితుడని, సర్వబోధిసత్త్వ సమాదాయక సముత్తేజక సంప్రహర్షకుడని, నిరామిష ధర్మోపదేశకుడని, అక్షీణమయిన పదాలు. వ్యంజనాలు గల, వ్యర్థంకాని ధర్మం ఉపదేశించినాడని, కాలానతిక్రమణ

ధర్మదేశికుడని స్తుతించబడుతాడు. మైత్రేయుడా! ఇదే ధర్మచక్ర ప్రవర్తనం. తథాగతుడని గుణవర్ణనంలో ఇది నిక్షేపంగా యత్క్రించి దవతారమాత్రం, విస్తరించి చెప్పడం ప్రారంభిస్తే, కల్పంగాని, కల్పావశేషం గాని చెప్పవలసి ఉంటుంది. ఈ వర్ణనకు అంతంకూడా ఉండదు."

తథాగతుడు ఈ విధంగా చెప్పిన తరువాత, తథాగతుని గుణగణాలు వర్ణించిన తర్వాత ఈ భావం గల గాథలుకూడా పలికాడు.

ఇది లలితవిస్తరంలో ధర్మచక్ర ప్రవర్తన మనే ఇరవై ఆరవ అధ్యాయం.

---

# 27. నిగమ పరివర్తం

ఈ ధర్మ పర్యాయాన్ని ప్రకాశింపజేయడానికి తథాగతుని ప్రార్థించిన మహేశ్వర, నందన, సునంద, చందన, మహితశాంత, నినీతేశ్వర ప్రముఖులైన అష్టాదశ దేవపుత్రులు, వేలకొద్దీవున్న శుద్ధావాసకాయిక దేవపుత్రులు, తథాగతుని ధర్మచక్రప్రవర్తన సమయంలోను సన్నిధిలో ఉన్నారు. అక్కడ భగవానుడు ఆ మహేశ్వర దేవపుత్ర ప్రముఖులతోను, శుద్ధావాసకాయిక దేవపుత్రులతోను ఇలా అన్నాడు :—"ఓ మార్షులారా! లలిత విస్తరమనే యీ ధర్మపర్యాయ సూత్రాంతం మహా వైపుల్యం గల బోధిసత్త్వ విక్రీడితం! బుద్ధవిషయంలో లలిత ప్రవేశమైనది; అత్మోపనాయికము; తథాగతునిచే భాషింపబడినది. దీనిని మీరు గ్రహించి, ధారణలో ఉంచుకొని పఠించండి! ధర్మదృష్టి విస్తరిస్తుంది.' బోధిసత్త్వయానికులైన పురుష పుంగవులు ఈ ధర్మపర్యాయాన్ని విని దృఢతరమైన వీర్యాన్ని పొందగలరు. లోకోత్తరమైన సమ్యక్సంబోధియందు ఉదారులై, అధిముక్తికులైన సత్త్వాలు మహాధర్మవర్షాన్ని తెలుసుకోగలరు. మారపక్షం నిగృహీతం కాగలదు. పరప్రవాదులందరూ అణగిపోతారు. మీకందరికీ ధర్మోపదేశాభిలాష, కుశలమూలమయిన మహార్షికం, మహాఫలం, మహానుశంసం లభిస్తాయి.

ఓ మార్షులారా! ధర్మ పర్యాయమైన యీ లలిత విస్తరానికి అంజలి ఘటించినవారు ఉత్కృష్టాలైన ఎనిమిది ధర్మాలనూ పొందగలరు. అవి యేవంటే—ఉత్కృష్టరూపము, ఉత్కృష్ట బలము, ఉత్కృష్ట పరివారము, ఉత్కృష్ట ప్రతిభావము, ఉత్కృష్ట నైష్క్రమ్యము, ఉత్కృష్ట చిత్తపరిశుద్ధి. ఉత్కృష్ట సమాధిపదము. ఉత్కృష్ట ప్రజ్ఞావభావము.

"ఓ మార్షులారా! ధర్మపర్యాయమైన యీ లలిత విస్తరమును చెప్పే కోరిక కలవారికీ, ధర్మాసనాన్ని కల్పించినవానికీ ఎనిమిది ఆసన

ప్రతిలంభములు ప్రతికాంక్షితము లవుతాయి. ఆ ఎనిమిది ఏవనగా— శ్రేష్ఠ్యాసన ప్రతిలంభము, గృహపత్యాసన ప్రతిలంభము, చక్రవర్త్యాసన ప్రతిలంభము, లోకపాలాసన ప్రతిలంభము, శక్రాసన ప్రతిలంభము, వశవర్త్యాసన ప్రతిలంభము, బ్రహ్మాసన ప్రతిలంభము. బోధిమండ వరాన్ని పొందినవాడూ, విరోధియైన మారుణ్ణి నిహతుణ్ణి చేసినవాడూ అయిన బోధిసత్త్వుని సింహాసన ప్రతిలంభము, లోకోత్తరమైన సమ్యక్సంబుద్ధిని తెలుసుకున్నందున అనుత్తర ధర్మచక్ర ప్రవర్తనాసన ప్రతిలంభము అనేవి.

"ఓ మార్షులారా! ధర్మ పర్యాయమైన యీ లలిత విస్తరమును చెప్పేవారికి సాధుకారాన్ని చెప్పేవాడు (ప్రశంసించేవాడు) ఎనిమిది వాక్య పరిశుద్ధులు పొందుతాడు. అవి ఏవంటే— సత్త్వానువర్తి అయిన వాక్కర్మ పరిశుద్ధివల్ల చెప్పిన విధంగా చెయ్యడము, పరిషత్తుయొక్క అభిభవనంవల్ల ఆదేయ వచనత్వము, విధేయతవల్ల గ్రాహ్యవచనత్వము, పారుష్యం లేకుండా సత్త్వసంగ్రహణం వల్ల మధురంగా మాటలాడడం, కాయచిత్తాలను అవికలంగా ఉంచడంవల్ల కలవింక ధ్వనితో సమానమైన స్వరమూ, సర్వసత్త్వములచేతను అనభిభవనంవల్ల తదుక్తవచనత్వము, సర్వస్వరాభిభవనత్వంవల్ల బ్రహ్మస్వరము, సర్వపరప్రవాదుల అభిభవనత్వంవల్ల సింహగర్జనవంటి స్వరము, సర్వసత్త్వేంద్రియ పరితోషణత్వం వల్ల బుద్ధ స్వరమూ కలిగి వుండడం. ఈ యెనిమిది వాక్య పద్ధతులు వారికి అలవడుతున్నవి.

"ఓ మార్షులారా! ధర్మపర్యాయమైన యీ లలిత విస్తరాన్ని వ్రాసి, ధరించి, సత్కరించి, గురువుగా భావించి, పూజించి, మాత్సర్యం లేని చిత్తంతో దీన్ని నాల్గు దిక్కులూ వ్యాపించేటట్లు 'రండి! ఈ ధర్మ పర్యాయ లిఖిత గ్రంథాన్ని పట్టుకొండి. చదవండి. చింతన చెయ్యండి. స్వాధ్యాయం చెయ్యండి' అని పలికేవారు అష్ట నిధానాలనూ పొంద గలరు. ఆ ఎనిమిది మహా విధానాలూ ఏవంటే— అసంమోషణత్వంవల్ల స్మృతివిధానము, బుద్ధి ప్రభేధనత్వంవల్ల మతినిధానము, సర్వ సూత్రాంతార్థగత్యనురాగతవల్ల గతినిధానము, సర్వ శ్రుతముల ధారణవల్ల ధారణీ



నిధానము, సర్వసత్య సుభాషిత సంభాషణలను పొందడంవల్ల ప్రతిభాన నిధానము, సద్ధర్మ ప్రతిలక్షణత్వావల్ల ధర్మనిధానము, త్రిరత్నవంశాను పచ్ఛేదనత్వంవల్ల బోధిచిత్త విధానము, అనుత్పత్తిక ధర్మక్షాంతి ప్రతి లంభత్వంవల్ల ప్రతిపత్తి నిధానము పొందగలరు.

"ఓ మార్షులారా! ధర్మపర్యాయమైన యీ లలితవిస్తరాన్ని బాగా వ్యాప్తిచేసి, ధారణలో ఉంచుకున్నవారు ఎనిమిది సంభారాలను పరిపూర్తి చెయ్యగలరు. ఆ ఎనిమిది ఏవి? అమాత్సర్యచిత్తం కలిగినందు వలన దానసంభారమును, సర్వకల్యాణాభిప్రాయ పరిపూరణంవల్ల శీల సంభారమును, అసంగప్రజ్ఞా సముదానయనత్వంవల్ల శ్రుత సంభారమును, సర్వ సమాధిసమాపత్తి యొక్క ఆముఖీకరణత్వం వల్ల సమద సంభార మును, త్రైవిద్య విద్యాపరిపూర్తి వలన నిదర్శనా సంభారమును, లక్ష ణానువ్యంజన బుద్ధ క్షేత్రాలంకార విశుద్ధివలన పుణ్య సంభారమును, సర్వ సర్వ సత్త్వ యథాభిముక్తి సంతోషణత్వంవలన జ్ఞానసంభారమును, సర్వ సత్త్వపరిపాచనా పరిఖేదత్వంవల్ల మహా కరుణా సంభారమును పొంద గలరు.

"ఓ మార్షులారా! ధర్మపర్యాయమైన యీ లలిత విస్తరాన్ని ఇతరులకోసం సవిస్తరంగా వెల్లడిచేస్తూ, "ఈ సత్త్వములు ఇటువంటి ధర్మాల లాభాలను ఎలా పొందగలరో?" అనే ఆలోచన కలవారు ఆ కుశల మూలంతో ఎనిమిది మహాపుణ్యతలను పొందగలరు. అవి యేవనగా- రాజుగా గాని, చక్రవర్తిగా కాని కావడం మొదటి మహాపుణ్యత. నలుగురు మహారాజ కాయిక దేవపుత్రులకు ఆధిపత్యం పొందడం రెండవ మహాపుణ్యత. దేవతలకు ప్రభువైన ఇంద్రుడుగా కావడం మూడవ మహా పుణ్యత. సుయాముడనే దేవపుత్రుడు కావడం నాల్గవ మహాపుణ్యత. సంతుషితుడు కాగల్గడం అయిదవ మహాపుణ్యత. సునిర్మితుడు కావడం ఆరవ మహాపుణ్యత. వశవర్తి అయిన దేవరాజు కావడం ఏడవ మహాపుణ్యత. బ్రహ్మగా గాని, మహా బ్రహ్మగా గాని కావడం ఎనిమిదవ మహాపుణ్యత. చివరకు సర్వాకుశల ధర్మప్రహీనుడు, సర్వకుశల ధర్మాలను పొందిన వాడు అర్హతుడు, సమ్యక్సంబుద్ధుడు అయిన తథాగతుడుగా కాగలడు.

"ఓ మార్షులారా! ధర్మపర్యాయమైన యీ లలితవిస్తరాన్ని ఎవరైనా చెప్తూ వుండగా శ్రద్ధగా విన్నవారు ఎనిమిది చిత్త నిర్మలతలను పొందగలరు. అవి ఏవనగా—సమస్త దోషాలను పోగొట్టే మైత్రి, సమస్త హింసలను విడిచిపెట్టే కరుణ; సమస్తములైన అనిష్టములను అపకర్షణచేసే, చేసుకొనే ముదిత, అనునయ, కోపాలను విడిచే-విడజేసుకొనే ఉపేక్ష, సర్వరూప ధాతువులను వశం చేసుకొనే నాలుగు ధ్యానములు, చిత్తం వశంగా చేసుకొనే నాలుగు ఆరూప్య సమాపత్తులు, ఇతరములైన బుద్ధ క్షేత్ర గమనత్వంకొరకైన, ఐదభిజ్ఞలు, శూరంగమ సమాధి ప్రతిలంభం కోసం సర్వవాసనానుసంధి సముద్ఘాటమున్నూ. ఈ యెనిమిది చిత్త నిర్మలతలను పొందగలరు.

"ఓ మార్షులారా! ధర్మపర్యాయమైన యీ లలితవిస్తరం ప్రచారాన్ని పొందే గ్రామంలోనూ, నగరంలోనూ, పల్లెలోనూ, పట్టణంలోనూ, దేశంలోనూ, నలుగురూ తిరిగే చోటనూ, విహారంలోనూ, పూర్వకర్మ విపాకం స్థాపించి, ఎనిమిది భయాలు ఉండవు. అవి యేవనగా—రాజ సంక్షోభ భయం, చోర సంక్షోభ భయం, క్రూరమృగ సంక్షోభ భయం, దుర్భిక్ష కాంతార అన్యోన్య కలహ వివాద విగ్రహ సంక్షోభ భయం, దేవసంక్షోభ భయం, నాగసంక్షోభ భయం, యక్ష సంక్షోభ భయం, సర్వోపద్రవ సంక్షోభ భయం అనేవి. ఈ యెనిమిది భయాలూ ఆ స్థలాల్లో ఉండవు.

"ఓ మార్షులారా! తథాగతుడు కల్పంవరకూ ఉండే ఆయుష్ప్రమాణంతో ఉండి, రాత్రిందివమూ ధర్మపర్యాయమైన యీ లలిత విస్తరాన్ని అక్షరశః భాషించినా అతని ప్రతిభావానికి క్షయం కలుగదు. తథాగతుని శీలసమాధి ప్రజ్ఞయు, విముక్తి జ్ఞాన దర్శనము అప్రమాణంగాను, అవధి లేనివిగాను ఉన్నట్లే, ఈ ధర్మపర్యాయాన్ని గ్రహించి ధరించినవారూ, చదివినవారూ, వ్రాసినవారూ, వ్రాయించినవారూ, ప్రవర్తింపజేసినవారూ, సభామధ్యంలో విస్తరంగా వెల్లడించినవారూ "ఇట్టి ఉదారమైన ధర్మలాభాన్ని ప్రజలు ఎలా పొందుదురా?" అనే ఆలోచన కలవారూ అంతంలేని పుణ్యాన్ని పొందగలరు."



ఆ పిదప భగవానుడైన తథాగతుడు ఆయుష్మంతులైన మహాకాశ్యపుని, ఆనందుని. మహాసత్త్వుడైన మైత్రేయ బోధిసత్త్వుని పిలిచి ఇలా అన్నాడు :— "ఓ మార్షులారా! అసంఖ్యేయ కల్పకోటి నయుత శత సహస్ర సంవత్సరాలు యత్నించి అనుత్తరమైన యీ సమ్యక్సంబోధిని సంపాదించి మీకు పరనుపరిందనతో అప్పగిస్తున్నాను. మీ రీ ధర్మపర్యాయాన్ని స్వయంగా గ్రహించి, ఇతరులకు కూడా వెల్లడించండి."

భగవానుడు ఈ విధంగా చెప్పి ఆ ధర్మపర్యాయాన్ని ప్రశంసిస్తూ, ఆ సమయంలో కొన్ని గాథలను పలికాడు. వాని భావ మిది:

"నేను బుద్ధ దృష్టితో చూచిన సత్త్వాలందరూ శారిపుత్రునితో సమానులై అర్హతులు కాగలరు. వారు గంగావాలుకలతో సమానమైన అసంఖ్యాక కోట్ల కల్పముల సంవత్సరాలు పూజింపబడుతూ ఉంటారు. సంతోషంతో కూడిన మనస్సుతో ప్రత్యేక బుధునికి (అహోరాత్రాలు) మాల్యాలు మున్నగువాటిని సమర్పించి పూజించేవారు గొప్ప పుణ్యాం సంపాదించి విశిష్టు లవుతారు. అప్రమత్తులై ప్రత్యవాయం లేకుండా ప్రత్యేక బుధులను పవిత్రములైన గంధలేపాలతో ఎల్లప్పుడూ పూజించి అనేక కల్పాలవరకు పుణ్యాం సంపాదిస్తారు. ప్రసన్న చిత్తంతో ఒక్క బుధునికి ఒక్కసారి నమస్కారం చేసినా, "నమో అర్హతే" అని పలికినా గొప్ప పుణ్యాం లభిస్తుంది. సర్వసత్త్వాలూ, పూర్వపు రీతిగానే దివ్యములూ మానుషములూ అయిన పుష్పాలతో అనేకవిధాలుగా వారిని పూజిస్తే తాము కూడా అనేక కల్పాలు బుధులు అవుతారు. ధర్మం లోపించిన సమయంలో అహోరాత్రాలు ఈ లగితవిస్తర సూత్రం పఠించినవారు, శరీరాన్ని విడిచిన తర్వాత గొప్ప పుణ్యమును పొందగలరు. వినాయకులను (తథాగతులను) ప్రత్యేకబుధులను, శ్రావకులను పూజించే కోరికలు కలవారు బోధియందు చిత్తాన్ని దృఢంగా ఉంచుకొని, గొప్ప సూత్రమైన ఈ లలిత విస్తరాన్ని గ్రహించవలసి ఉంటుంది. సర్వతథాగతువల్లనూ వచ్చిన ఈ సూత్రం సర్వ సుభాషితాలకూ రాజువంటిది. ఇది యింట్లో వున్న వా[illegible] ఎల్లప్పుడును తథాగతుడు ఉంటాడు, ఇందులోని ఒక్క పదాన్ని కోట్ల [illegible]ముల పర్యాయములు

పఠించినవారు గొప్ప ప్రతిభను, అనంతమైన శుభాన్ని పొందగలరు. ఈ సూత్రాన్ని యితరులకు తెల్పినవారికి ఏవీ నశించవు. అన్ని ప్రయోజనాలూ కలుగుతవి. దీనిని విని ధర్మాన్ని పొందిన సత్త్వుడు నరనాయకులలో అనుత్తరుడవుతాడు. అతనికి సమానుడు మరియొకడు ఉండడు. అతడు అక్షయుడై, సముద్రంతో సమానుడై ఉంటాడు.''

అత్తమనస్కుడైన భగవానుడు ఇలా పలుకగా మహేశ్వర దేవపుత్రుడు మొదలైన శుద్ధావాసకాయికులైన దేవపుత్రులు, మైత్రేయుడు ఆదిగా గల మహాసత్త్వులైన సమస్త బోధిసత్త్వులు, మహా కాశ్యపుడు మొదలైన సర్వ మహాశ్రావకులు, దేవ మానుషాసుర గంధర్వసహితులైన సమస్త లోకులు భగవానుని యీ భాషితాన్ని విని మిక్కిలి అభినందించారు.

ఇది లలిత విస్తరంలో నిగమ పరివర్తనమనే ఇరవై యేడవ
అధ్యాయం.

ఈ సర్వ బోధిసత్త్వచర్యాప్రస్థానం కూడా సమాప్తమైనది.

రత్నరాజమైన శ్రీ లలిత విస్తరమనే మహాయాన సూత్రం
పరిసమాప్తమైనది.

యే ధర్మ హేతుప్రభవా
హేతుం తేషాం తథాగతో హ్యావదత్,
తేషాం చ యో నిరోధః
ఏవం వాదీ మహాశ్రమణః.

